# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## ఇరువదవ సంపుటము

### బ్రహ్మవిద్య, నిర్విఘ్నయోగసిద్ధి, శ్రీభగవద్గీతాగమనము, శ్రీమలయాళయతీన్ద్రగీతా

ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ
సంఘ ప్రచురణ - 2001 సం ॥
ప్రతులు 1000

**ప్రతులకు** -
మేనేజరు - శ్రీవ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమం పోస్టు, (వయా) ఏర్పేడు,
చిత్తూరు జిల్లా, (ఆం ప్ర), 517 621
ఫోన్ నెం 08578- 68528

**ముద్రణ** -
**శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీ వ్యాసాశ్రమము**
**డి టి పి - శ్రీ అసంగానంద గ్రాఫిక్స్, శ్రీ వ్యాసాశ్రమము**

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ **సముద్రాల లక్ష్మణయ్య** గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు



# విషయ సూచిక



---

## 1. బ్రహ్మవిద్య (1-64)



## ౨ నిర్విఘ్నయోగసిద్ధి (65-౨౧౨)



## 3. శ్రీభగవద్గీతాగమనము (౨13- ౨ 54)

# 4. శ్రీమలయాళయతీన్ద్రగీత

## (౨౫౫-౫౩౩)





ఓమ్

**ఈ గ్రంథాన్ని ముద్రించడానికి భూరివిరాళం సమర్పించి శ్రీ మలయాళ సద్గురు దేవుల అనుగ్రహానికి పాత్రులైన భక్తులు**

స్వర్గీయ మాతృశ్రీ లింగంనేని సత్యవతిగారి
జ్ఞాపకార్థం వారి కుటుంబం అమెరికా వాస్తవ్యులు
శ్రీ లింగంనేని జగన్మోహనరావుగారు
వారి ధర్మపత్ని శ్రీమతి ఉమ
శాంతిశ్రీ
కర్క్
ప్రగతిశ్రీ
శ్రీనిధి
ఎల్లోరా రేవతి

# సంపాదకీయం

ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతి లాగానే కేరళరాష్ట్రంలో గురువాయూరు అతిప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం ఆక్షేత్రానికి సమీపంలో ఎన్‌గండ్యూర్ అనే గ్రామంలో 1885 మార్చి 27 వ తేదీన నొట్టియమ్మ, కరియప్ప అనే పుణ్యదంపతులకు ఒక పుత్రరత్నం జన్మించాడు అతనికి వేలప్ప అని నామకరణం చేశారు గుమ్మడితీగ పాదు విడిచి సుదూరంగా సాగి ఫలించునట్లే ఆ బిడ్డ పెరిగి పెద్దవాడై జన్మస్థలం వదలి దూరప్రాంతానికి పోయి అక్కడ లోకోద్ధారక కార్యక్రమాలు ఆచరిస్తాడని ఆ శిశువు జాతకం పరిశీలించిన దైవజ్ఞులు ఆనాడే వక్కాణించారు

వారి మాటలు అక్షరాలా నిజమయ్యాయి వేలప్ప సహజంగానే జపతపోధ్యానాదులైన అనుష్ఠానాలను బాల్యంనుండీ శీలించాడు ఆ కాలంలో కేరళలో సుప్రసిద్ధ యతీంద్రుడుగా, ఆధ్యాత్మిక విజ్ఞానఖనిగా, సమాజ సంస్కర్తగా పేరొందిన శ్రీనారాయణగురువు అనే ఒక మహనీయు డుండేవాడు ఆయన శిష్యుడు శ్రీ సిద్ధశివలింగ గురువు స్థాపించిన గురుకులంలో వేలప్ప విద్యాభ్యాసం చేశాడు బాల్యదశలోనే అతడు దైవగుణసంపన్నుడుగా, భక్తాగ్రేసరుడుగా, అనుష్ఠాననిష్ఠాగరిష్ఠుడుగా పేరు పొందాడు పరమ విరక్తుడై రెండు పదులు నిండక ముందే పాదచారిగా బయలుదేరి అతడు ఆసేతుహిమాచలం తీర్థయాత్ర చేశాడు అనేక పుణ్యక్షేత్రాలనూ, ఉత్తరభారతంలో మహనీయులు స్థాపించిన ఆధ్యాత్మిక సంస్థలనూ సందర్శించాడు

తీర్థయాత్రానంతరం మళ్లీ జన్మస్థలానికి వెళ్ళాడు కొంత కాలం అక్కడ ఉండి తరువాత నేరుగా తిరుమల క్షేత్రానికి వచ్చాడు అక్కడి గోగర్భతీర్థస్థలంలో పండ్రెండు సంవత్సరాలకు పైగా తీవ్రమైన తపోనిష్ఠ కొనసాగించాడు కాలక్రమంలో తిరుమల యాత్రికులకు శ్రీ వేంకటేశ్వర స్వామి లాగానే ఒక సందర్శనీయమూర్తిగా రూపొందాడు ఆయన ఊరూ పేరు తెలియనివారు మలయాళదేశీయుడు కాబట్టి ఆయనను

'మలయాళస్వామి' అన్నపేరుతో వ్యవహరించారు తరువాత ఆ పేరే వారికి స్థిరపడిపోయింది

గోగర్భంలో ఉన్నకాలంలో ఆయన రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం అన్న గ్రంథం ఆయన కీర్తిని దశదిశలా చాటింది ఆధ్యాత్మిక విప్లవాన్ని రగుల్కొలిపే ఆ గ్రంథరాజం పలువురు సాధకులకు నిత్య పఠనీయ మయింది శ్రీ మలయాళ స్వామీజీ వేలకొలది శిష్య భక్తజనానీకానికి ఆరాధ్యదైవంగా విలసిల్లారు తిరుమల గోగర్భతీర్థంలో వారు పండ్రెండు సంవత్సరాలకు పైగా తీవ్ర తపస్సు చేసి భగవదనుగ్రహానికి పాత్రులై ఆత్యంతిక దుఃఖ నివృత్తినీ, పరమానంద ప్రాప్తినీ పొందారు

తరువాత కొన్ని కారణాలవల్ల శ్రీ సద్గురు స్వాములవారు తిరుమల కొండ దిగి తిరుపతి, శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రాలమధ్య కాశీబుగ్గ తీర్థస్థలంలో ఏర్పేడు వద్ద ఉండే నంది పర్వతమూలంలో శ్రీవ్యాసభగవానుని పేర 1926లో ఆశ్రమం స్థాపించారు అక్కడ లోకోద్ధారకమైన అనేక కార్యక్రమా లను చేపట్టారు ఆర్షధర్మప్రచారానికి అనుగుణంగా ఒక సంస్కృత పాఠశాలను స్థాపించారు జాత్యాది భేదాలను పాటించకుండా అన్ని తెగలవారికీ అందులో విద్యాభ్యాసానికి అవకాశం కలిగించారు సనాతన ధర్మపరిపాలన సేవాసమాజం (సనాతన వేదాంత జ్ఞానసభ) అన్న పేరుతో ఆధ్యాత్మిక ధర్మప్రచారానికై ఒక సంస్థను స్థాపించారు కర్మ భక్తి ధ్యాన జ్ఞాన యోగాల ప్రచారానికై 'యధార్థభారతి' అనే ఒక మాసపత్రికను ప్రారంభించారు వేదసారసంగ్రహమైన భగవద్గీతకు అనన్య సామాన్యమైన ప్రచారం కలిగించారు భక్తుల ఆహ్వానం మేరకు ఊరూరా పర్యటించి ఆధ్యాత్మిక విజ్ఞానబీజాలను వెదజల్లారు కాలక్రమంలో వ్యాసాశ్రమానికి అనుబంధంగా అనేకసంస్థలను ఆంధ్రదేశ మంతటా నెలకొల్పారు సాంఘిక- ఆధ్యాత్మిక సంస్కరణలను ప్రబోధిస్తూ, వేదాంత సందేశాన్ని వెలయిస్తూ, జిజ్ఞాసువులకు తగిన సాధనలను ఉపదేశిస్తూ స్వయంగా అనేక గ్రంథాలను రచించి ప్రచురించారు యోగవాసిష్ఠం, పాతంజల యోగదర్శనం,

అనుభూతిప్రకాశం, శంకరవిజయం, వివేకచూడామణి మొదలైన పెక్కు ఉద్గ్రంథాలను అనువదింపజేసి ప్రచురించారు భగవద్గీత, కఠోపనిషత్తు మొదలైన కొన్ని గ్రంథాలకు స్వయంగా వ్యాఖ్యలు రచించారు మహిళాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని కన్యాగురుకులం స్థాపించారు

ఈ విధంగా ఆంధ్రదేశంలో సమాజసంస్కరణలతో కూడిన ఆధ్యాత్మిక క్రాంతిని కలిగించి అపూర్వమైన చైతన్యాన్ని ప్రజానీకంలో ఉద్దీపింపజేశారు కేరళలో నారాయణగురువు ఏలక్ష్యం సాధించడానికి ఉద్యమించారో, ఆలక్ష్యాన్ని ఆంధ్రదేశంలో సాధించడానికే శ్రీసద్గురు మలయాళ స్వాములవారు కృషిచేశారు తమ అవతార కార్యక్రమం సమాప్తం చేసుకొని 12-7-1962 వ తేదీన శయనైకాదశీ పర్వదినమందు తనువు చాలించారు ఆంధ్రదేశచరిత్రలో శ్రీవారి కృషి స్వర్ణాక్షరాలతో లిఖింపదగి వున్నది శ్రీ స్వాములవారి జీవితాన్ని సమగ్రంగా తెలుసుకొనగోరేవారు నా రచన 'శ్రీమలయాళస్వామి జీవితచరిత్ర' ను పఠించండి!

అనన్య సామాన్యమైన శ్రీవారి కృషివల్ల అంతకు ముందు ఆధ్యాత్మిక విద్యకు అనర్హులు అని భావించబడిన స్త్రీలు, ద్విజేతరులు ఆ విద్యలో పురోగమించారు బ్రహ్మజ్ఞానం ఒక వర్ణానికో, కులానికో, లింగానికో పరిమితమయినది కాదు అది జిజ్ఞాసువులైన సాధన సంపన్నులందరి సొత్తు అన్న సత్యాన్ని వారు గ్రహింపగలిగారు

శ్రీ వారి కృషిని అవగతం చేసుకొన్న ప్రముఖులనేకులు వారి నెన్నో విధాల ప్రశంసించి వున్నారు దివ్యజీవన సంఘ స్థాపకులు శ్రీ స్వామి శివానంద సరస్వతీ మహరాజ్ వారు "His personal life was a Bhashyam for Bhagavadgita"- ''ఆయన వ్యక్తిగత జీవితం భగవద్గీత కొక భాష్యం'' అని కీర్తించారు

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ''స్వామి అనేకరీతుల మానవుల కండయై దండయై ఆనందము నందించెను ఆయన నిస్స్వార్థ సేవానిరంతర నిర్మల ప్రబోధములు ఆస్తిక లోకమున ఆచంద్రార్కము అమరమై

విలసిల్లగలవు'' అని పేర్కొన్నారు

చిన్మయమిషన్ వ్యవస్థాపకులు శ్రీ స్వామి చిన్మయానందులవారు గురుదేవులను గూర్చి అన్న మాటలివి--

"Such a colossus in spiritual world comes and serves the community but rarely Malayalswami was one such stupendous Saint of infinite blessings He brought living Vedanta into the hearts of Telugu People through camps and lectures, books and journals, Asrams and Temples, Schools and Satsangs

May this Maha- Tapaswins's blessings be upon us all"

''ఆధ్యాత్మిక ప్రపంచంలో అలాంటి మహోన్నత మహనీయమూర్తులు అరుదుగా అవతరించి మానవసేవ చేస్తారు మలయాళస్వామి అటువంటి అనంతాశీర్వాద సంపన్నులైన మహామునీంద్రులు ధార్మిక శిబిరాలు, ప్రబోధాలు , పుస్తకాలు, పత్రికలు, ఆశ్రమాలు, ఆలయాలు, పాఠశాలలు, సత్సంగాల ద్వారా వారు అనుష్ఠాన వేదాంతాన్ని తెలుగు ప్రజల హృదయాలలోకి తెచ్చారు ఈ మహాతపస్వి ఆశీర్వాదాలు మనకు సిద్ధించుగాక! ''

మాజీ రాష్ట్రపతి శ్రీనీలంసంజీవరెడ్డిగారు సంక్షిప్తమూ సారవంతమూ అయిన మాటలతో శ్రీస్వాములవారిని గురించి యిలా అన్నారు

"Swamiji was a revolutionary, fighting against narrow Casteism He was imparting Vedic education to all He was great saint and spiritual leader"--

''సంకుచితమైన కులతత్త్వంపై పోరాటం సల్పిన విప్లవయోధులు శ్రీ స్వామీజీ ఆయన వేదవిద్యను అందరికీ అందుబాటులోకి తెచ్చారు ఆయన మహర్షి, ఆధ్యాత్మిక సద్గురువు ''

శ్రీ సద్గురు దేవులు గోగర్భంలో తపోనిష్ఠులై ఉన్నకాలంలోనే తమ అవతార చర్యలలో ముఖ్యాతి ముఖ్యమైన గ్రంధారచనా కార్యక్రమం చేపట్టారు

1919లో "శుష్కవేదాంత తమోభాస్కరం" అన్న వారి లోకోన్నతగ్రంథం వెలువడింది అది అత్యధిక వ్యాప్తి పొంది సమాజంలోని మూఢ విశ్వాసాలను నిర్మూలించి కల్తీ లేని సనాతన ధర్మాన్ని వ్యాపింప జేయడంలో విజయం సాధించింది

ఈ గ్రంధాన్ని గురించి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా పని చేసిన అభిజ్ఞులు ఆచార్య శ్రీ కె సచ్చిదానందమూర్తి గారు వ్రాసిన మాటలు ఇక్కడ స్మరింపదగి వున్నాయి

"When I was in my Koumara, I read his Sushka Vedanta tamo Bhaskara more than once It impressed me a great deal because of its direct and forcible way of presenting Vedanta in a rational manner suited to the modern times I consider it to be a pioneering as well as a great Telugu Prose Work on Vedanta "

(శ్రీ మలయాళస్వామి జీవిత చరిత్ర - మున్నుడి)

"నా కౌమారంలో వారి శుష్కవేదాంత తమోభాస్కరం నేను పలుసార్లు పఠించాను ఆధునిక కాలానికి అనుగుణంగా సయుక్తికంగా, శక్తిమంతంగా వేదాంతాన్ని ప్రతిపాదించిన ఆ గ్రంధం నన్నెంతో ప్రభావితుణ్ణి చేసింది వేదాంతంలో తెలుగులో వెలువడిన మార్గదర్శకమైన ఒక గొప్ప గద్య రచనగా నేను దాన్ని భావిస్తున్నాను"

వ్యాసాశ్రమ స్థాపనానంతరం శ్రీవారు "యధార్థభారతి" మాస పత్రికలో శరపరంపరగా కర్మ- భక్తి - ధ్యాన - జ్ఞాన యోగాలను బోధిస్తూ ఎన్నో ఆత్మోద్బోధకమైన వ్యాసాలను ప్రకటించారు ఆ వ్యాసాలన్నీ తరువాత భక్తుల కోరికపై నానా గ్రంధాలుగా రూపొందాయి 'ఉపదేశామృతం', 'స్వబోధ సుధాకరం', 'ధర్మసేతువు', 'ఈశ్వరకృప', ధర్మోపన్యాసాలు - ఇత్యాదిగా గల గ్రంధాలన్నీ ఈ విధంగా వచ్చినవే

భగవద్గీతకూ, 'కఠ'- 'ముండక' - 'మాండూక్యోపనిషత్తు'లకూ, 'నారద భక్తి సూత్రా'లకూ శ్రీవారు స్వయంగా విపులవ్యాఖ్యలు వ్రాసి ప్రకటించారు 'బాలయోగిని' అన్న గ్రంధంలో ఒక నారీమణి యొక్క ఆధ్యాత్మిక జీవితగాధను

(కల్పితం) చిత్రీకరించారు "లోకోద్ధారకము" అన్న పుస్తకంలో హిందూ సమాజంలోని వర్ణవ్యవస్థ, జాతిభేదాల రహస్యాన్ని బట్టబయలు చేశారు 'బ్రహ్మచర్యం', 'గృహస్థాశ్రమ ధర్మం', 'సన్న్యాసయోగం'-అన్న గ్రంధాలలో ఆయా ఆశ్రమాల స్వరూప స్వభావాలను, వివరించి ఆయా ఆశ్రమస్థులు ఆచరించదగిన ధర్మాలను విశదీకరించారు

దివ్యమైన తమ ఆశయాలనంతా క్రోడీకరింపజేసి ముఖ్యశిష్యుల ద్వారా సంస్కృతంలో " శ్రీ మలయాళ యతీంద్రగీత" - ( 18 అధ్యాయాలు, 1120 శ్లోకాలతో) అన్న ఉద్గ్రంధాన్ని రచింపజేసి ప్రకటించారు

ఈ విధంగా శ్రీమలయాళస్వాములవారు ఆధ్యాత్మిక గ్రంధ ప్రచురణకు ఎంతో ప్రాముఖ్యమిచ్చి ఎన్నో విలువైన గ్రంధాలను ఆంధ్రలోకానికి ప్రసాదించారు

శ్రీ పి వి నరసింహారావుగారు (తరువాతి భారత ప్రధానమంత్రి) 1984లో ఒక సందేశం పంపుతూ శ్రీవ్యాసాశ్రమ గ్రంధముద్రణకృషిని ఇలా ప్రశంసించారు -

"I have visited Yerpedu Asram several times and was greatly inspired and impressed by the large number of extremely useful publications in Telugu covering a wide range of spiritual topics, including holy scriptures I am not aware of any other institution having done so much service for the spiritual elevation of the Telugu speaking people"

(శ్రీ మలయాళస్వామి శతజయంతి సంచిక)

"నేను ఏర్పేడు ఆశ్రమాన్ని పలుసార్లు సందర్శించాను పవిత్ర గ్రంధాలతో సహా వివిధాధ్యాత్మిక విషయాలపై ఆశ్రమం వారు తెలుగులో ప్రచురించిన గ్రంధాలు నన్నెంతో ప్రభావితుణ్ణి చేశాయి తెలుగు వారి ఆత్మోన్నతికి ఇంత గొప్ప సేవ చేసిన మరొక సంస్థ నా దృష్టికి రాలేదు"

శ్రీ స్వాములవారు స్వయంగా వ్రాసినవి చిన్నవీ, పెద్దవీ అయిన

గ్రంధాలు ఏబది (50) కి పైగా ఉన్నాయి భక్తులు మిక్కిలి భక్తిశ్రద్ధలతో ఆ గ్రంధాలు పఠిస్తున్నారు అని పలుసార్లు పునర్ముద్రణ లందుకొన్నాయి

శ్రీవారి గ్రంధాలు ప్రస్తుతం వివిధ పరిమాణాలతో, నానా సంపుటాలుగా లభిస్తున్నాయి వీటి నన్నింటినీ క్రోడీకరించి ఒకే పరిమాణం కల గ్రంధరాశిగా చక్కగా ముద్రించి భక్తుల కందించడం సముచితమన్న సంకల్పం నాకు చిరకాలంగా ఉన్నది శ్రీవివేకానంద స్వాములవారివంటి మహాత్ముల గ్రంధాలు అలా ప్రచురింపబడి వున్నాయి 1976లో వెలువడిన శ్రీ మలయాళస్వాముల వారి జీవిత చరిత్రలో ఈ అభిప్రాయాన్ని నేను (4 వ ముద్రణ - 279వ పుట) సూచించియున్నాను శ్రీవ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద గిరిస్వాములవారు ఈ సూచనకు తమ సమ్మతి తెలిపారు 2001 మార్చిలో జరుగనున్న వ్యాసాశ్రమ వజ్రోత్సవ శుభసందర్భంలో పై గ్రంధాలన్నింటినీ "శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి" అన్న పేరుతో ప్రచురించి భక్తజనుల కందజేయాలన్న నిర్ణయం జరిగింది

ఒక్కొక్క సంపుటం సుమారు 400 నుండి 500 పుటలు గలదిగా క్రోడీకరించి మొత్తం ఇరువది సంపుటాలుగా ప్రకటించాలనుకొన్నాము ప్రచురణకు చెందిన సంపాదకత్వ బాధ్యతను శ్రీస్వాములవారు నాకు అప్పగించారు ఇది అత్యంత కష్టసాధ్యమైన పని అయినా శ్రీసద్గురు కరుణచే విజయవంతంగా పూర్తిచేయగలనన్న విశ్వాసంతో అంగీకరించాను 1999 డిశంబరులోనే ఈ కార్యక్రమం ప్రారంభమయింది ఇందుకుగాను ఆశ్రమంలో కంప్యూటర్లు ఏర్పాటు చేయబడ్డాయి అంతకు ముందే అక్కడ ఏర్పాటైన ఆఫ్‌సెట్ ముద్రణాలయం ఇందుకెంతో సహకరించింది అందలి సిబ్బంది హృదయపూర్వకంగా కృషి చేశారు పుస్తకాల వర్గీకరణ, ప్రూఫ్ రీడింగ్ వగైరా పనులలో శ్రీ యస్ పాండురంగయ్య (రిటైర్డ్ ప్రిన్సిపాల్, శ్రీ మలయాళ స్వామి ప్రాచ్యకళాశాల, ప్రొద్దుటూరు) గారు నాకు తోడ్పడ్డారు

ఒక సంవత్సర కాలం నిర్విరామంగా కృషి చేసి 2001 జనవరి చివరికి ఈ కార్యక్రమంలో సద్గురు కరుణ వల్ల విజయం సాధించగలిగాము

శ్రీ సద్గురు స్వాములువారి గ్రంధాలు మొత్తం 56 లెక్కకు వచ్చాయి కేవలం సంకలన గ్రంధమయిన 'స్తోత్రమంజరి'ని ఇక్కడ పరిగణించలేదు ఇందులో గోగర్భతపఃకాలములో రచించిన 'శుష్కవేదాంతతమోభాస్కరాన్ని' మొదటి సంపుటంగా రూపొందించడమయింది తక్కిన గ్రంధాలలో స్వతః తగినంత పరిమాణములో ఉన్న 'స్వబోధసుధాకరం', 'ధర్మసేతువు', 'బాలయోగిని' మొదలైన గ్రంధాలను తక్కిన గ్రంధాలతో చేర్చకుండా యధాతధంగానే ఒక్కొక్క సంపుటంగా ప్రచురించడమైనది

చిన్న చిన్న గ్రంధాలను క్రోడీకరించడంలో విషయసామ్యము, కాలక్రమము, రచనాస్వరూపము మొ॥ అంశాలను దృష్టిలో పెట్టుకోవడ మయింది కొన్ని సంపుటాలు 500 పుటలకు మించి కూడా తయారయ్యాయి. మొత్తం 20 సంపుటాలు పదివేల పుటలకు విస్తరించాయి శ్రీ ఆనంద మోహన్ గారు, శ్రీ పరబ్రహ్మానందస్వాములవారు, శ్రీ పిన్నమనేని ఆంజనేయుడుగారు మొదలైనవారు వ్రాసిన శ్రీవారి ఉపన్యాసాలు 'ఓంకారసత్రయాగము', 'ధర్మోపన్యాసల'లో కొన్ని భాగాలు పూర్వం నుండి శ్రీవారి గ్రంధాలలో చేరియుండినాయి అవి ఈ సంపుటాలలో కూడా అలాగే ఉన్నాయి

ఇంకను శ్రీవారి ఉపన్యాసాలను స్వయంగా వ్రాసుకొన్న భక్తులు ప్రచురించిన పుస్తకాలు కూడా ఉన్నాయి అందులో మాతృశ్రీ చోడే వేంకటరమణమ్మగారు ప్రచురించినవి ప్రసిద్ధమైనవి ఈ సంపుటాలలో అవి చేరలేదు అవిగూడా చేర్చి ప్రకటిస్తే ఈ సంపుటాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది

పూర్వముద్రిత గ్రంధాలను ప్రస్తుతం తయారైన సంపుటాలలో ఈ క్రింది రీతిగా సమకూర్చడమైనది

1 మొదటి సంపుటము - శుష్కవేదాంత తమో భాస్కరము
2 రెండవ సంపుటము - స్వబోధ సుధాకరము
3 మూడవ సంపుటము - ఓంకారము
4 నాల్గవ సంపుటము - ధర్మసేతువు

| | | | |
|---|---|---|---|
| 5 | ఐదవ సంపుటము | - | ప్రశ్నోత్తర మాణిక్యమాల & భావశుద్ధియే జ్ఞానసిద్ధి |
| 6 | ఆరవ సంపుటము | - | శ్రీమద్భగవద్గీత - శ్రీవారి వ్యాఖ్యతో |
| 7 | ఏడవ సంపుటము | - | బాలయోగిని |
| 8 | ఎనిమిదవ సంపుటము | - | లోకోద్ధారకము |
| 9 | తొమ్మిదవ సంపుటము | - | ఈశ్వరకృప |
| 10 | పదవ సంపుటము | - | కఠ, ముండక, మాండూక్య ఉపనిషత్తులు & నారద భక్తిసూత్రములు |
| 11 | పదునొకండవ సంపుటము | - | ఉపదేశామృతము నాల్గుభాగాలు |
| 12 | పండ్రెండవ సంపుటము | - | ధర్మోపన్యాసములు - మొదటి సంపుటము & రెండవ సంపుటములోనితొలి 138 పుటలు |
| 13 | పదుమూడవ సంపుటము | - | రెండవసంపుటములోని తక్కినభాగము & మూడవ సంపుటములోని తొలి 244 పుటలు |
| 14 | పదునాల్గవ సంపుటము | - | మూడవ సంపుటములోని తక్కిన భాగము & నాల్గవ సంపుటము పూర్తి |
| 15 | పదునైదవ సంపుటము | - | ఐదవసంపుటము మరియు రజతోత్సవ సంచికలోని శ్రీవారి వ్యాసావళి |
| 16 | పదునారవ సంపుటము | - | పూజా పంచరత్నమాల, ధ్యానామృతము, యజ్ఞము, కర్మసిద్ధాంతము, ప్రారబ్ధకర్మ, సాధుదర్శనము, వైరాగ్య బోధోపరతులు, జీవన్ముక్తి, గాయత్రీమన్త్రము |
| 17 | పదునేడవ సంపుటము | - | బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమధర్మము, సన్న్యాసయోగము, నిర్వాణనిలయము |
| 18 | పదునెనిమిదవ సంపుటము | - | గురుభక్తిప్రభావము, మహామంత్రాతీత ప్రభావము, మాయను మాయము |

చేయుట, సుప్రబోధము,
శ్రీభగవద్గీతా ప్రభావము, లేఖావళి,
చాతుర్మాస్యమాహాత్మ్యము

19 పందొమ్మిదవ సంపుటము - ఓంకారసత్రయాగము, సాంఖ్యయోగము,
గీతాశయము, ప్రచారప్రాశస్త్యము,
యధార్ధభారతి చిన్నపాత్రము,
ప్రమాదము నొందకుడు,
ముక్తిసోపానము,
సమాధిచేయు విధానము

20 ఇరువదవ సంపుటము - బ్రహ్మవిద్య, నిర్విఘ్నయోగసిద్ధి,
గీతాగమనము,
శ్రీమలయాళ యతీంద్రగీత,

ఆధ్యాత్మిక వాఙ్మయంలో అపూర్వ సృష్టిగా రూపొందిన ఈగ్రంధాలు కర్మ-భక్తి-ధ్యాన-జ్ఞాన-యోగాలకు చెందిన ఎన్నో రహస్యాలను వివరిస్తున్నాయి పునర్వివాహము, వర్ణవ్యవస్థ, అస్పృశ్యతా దురాచారం వంటి సాంఘిక సమస్యలను సమగ్రంగా చర్చించి పరిష్కార మార్గం చూపుతున్నాయి మానవుని ఆత్మోన్నతికి అవసరమైన విషయాలన్నింటినీ ప్రబోధిస్తున్నాయి

మూఢవిశ్వాసాలను నిర్మూలించడంలోనూ, ఆధ్యాత్మిక జాగృతిని కలిగించడంలోనూ, జడత్వాన్ని తొలగించి చైతన్యాన్ని సమకూర్చడంలోనూ అపూర్వ విజయం సాధించిన ఈ గ్రంధావళి ఆంధ్ర సారస్వతానికే అలంకారమనడంలో సందేహం లేదు

అపూర్వమైన శ్రీవారి ఆధ్యాత్మిక వాఙ్మయం సువిస్తృతమై బహుళ వ్యాప్తిలో నున్నది ఈ సంపుటాల ముద్రణ ఈ గ్రంధాలపై పరిశోధన కొనసాగించేవారికి ఎంతగానో సహకరించగలదు ఇంతకు ముందే శ్రీ పి ముని క్రిష్ణయ్య, శ్రీ యస్ దశరధ అనే పరిశోధన విద్యార్థులు దీనిపై పరిశోధన గావించి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమునుండి పిహెచ్ డి డిగ్రీ

పొందివున్నారు ఇరకా ఎందరో వారి మార్గములో పయనించి పరిశోధన చేయడానికి అవకాశమున్నది

వేదసారమైన సమత్వదృష్టిని సహస్రవిధాలుగా ప్రబోధించి, అనుష్ఠానావశ్యకతను నిరూపించి, సమాజాన్ని చైతన్యవంతం చేయడానికి ఉపకరించే ఈ గ్రంధావళి 20 సంపుటాలను అందరూ భక్తి శ్రద్ధలతో పఠించి శ్రీమలయాళ సద్గురు స్వాములవారి అనుగ్రహానికి పాత్రులగుదురు గాక!

శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి ప్రచురణ కార్యక్రమం సకాలంలో ఇలా విజయవంతం కావడానికి ముఖ్యకారణం శ్రీమలయాళ సద్గురు స్వాముల వారి దివ్యానుగ్రహమే ఈ కార్యక్రమాన్ని చేపట్టడానికి అనుమతించిన శ్రీవ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు పూజ్యశ్రీవిద్యానందగిరిస్వాములవారికి నా ప్రణామములు. త్వరలో ఈ కార్యక్రమాన్ని పూర్తి చేయమని ప్రోత్సహించిన ఉత్తరాధికారి పూజ్యశ్రీ పరిపూర్ణానందగిరిస్వాములవారికి వందనములు

ఈ కార్యక్రమములో సహకరించిన శ్రీయస్ పాండురంగయ్యగారికి, శ్రీశివరామానంద బ్రహ్మచారిగారికి, శ్రీ కె వెంకటరెడ్డిగారికి, శ్రీఅసంగానంద గ్రాఫిక్స్ సిబ్బందికి, శ్రీపారాశర్య ముద్రణాలయ సిబ్బందికి, ఇతర విధాల తోడ్పడిన వారికందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు

శ్రీవ్యాసాశ్రమము
27-1-2001

- సముద్రాల లక్ష్మణయ్య

# తొలి పలుకు

శ్రీమలయాళ సద్గురు గ్రంథావళిలో ఇది చివరి సంపుటం ఇందులో ఈ క్రింద పేర్కొన్న గ్రంథాలు క్రోడీకరించడం జరిగింది

1) బ్రహ్మవిద్య, 2) నిర్విఘ్నయోగసిద్ధి, 3) శ్రీభగవద్గీతాగమనము, మరియు 4) శ్రీమలయాళయతీన్ద్రగీతా

మొదటిసారిగా 1946లో ముద్రించబడి తరువాత పలు ముద్రణలు అందుకొన్న 'బ్రహ్మవిద్య'లో అధ్యాత్మవిద్యయొక్క ప్రాశస్త్యం ఉగ్గడించబడింది జీవిత సాఫల్యానికి పరాపర విద్యలు రెండూ అవసరమంటూనే పరావిద్య యొక్క విశిష్టతను ఇందులో శ్రీవారు చక్కగా వివరించారు

'శ్రేయాంసి బహువిఘ్నాని' అన్నట్లు యోగానుష్ఠాన పరులకు యోగసిద్ధి కలగడానికి ముందు పలు విఘ్నాలు రావడం సహజం ఆ విఘ్నాలు ఎలా ఉంటాయి? వాటిని ఎలా నివారించుకోవాలి? అనే విషయాన్ని పలు ప్రమాణాలతో శ్రీ సద్గురు స్వాములవారు 'నిర్విఘ్నయోగసిద్ధి'లో వివరించారు మొదటిసారిగా 1954 లో వెలువడిన ఈ పుస్తకం పిమ్మట పలుసార్లు ప్రచురించబడింది

'శ్రీ భగవద్గీతా గమనము' 1960 లో తొలిసారిగా వెలువడింది గీతాశయము, గీతాప్రభావము ఇత్యాది గ్రంథాలను రచించిన తరువాత గీతపై వ్రాసిన గ్రంథమిది గీతలోని కర్మ-ఉపాసనా-జ్ఞానకాండలను వివరిస్తూ శ్రీవారు వాటికి చక్కని సమన్వయాన్ని ఇందులో ప్రతిపాదించారు

'శ్రీమలయాళయతీన్ద్రగీత' చాలా విశిష్టమైన రచన భక్తుల కోరిక మేరకు శ్రీ సద్గురు స్వాములవారు తమ ఉత్తమాశయాలన్నిటినీ 18 అధ్యాయాలు గల ఈ గ్రంథంలో క్రోడీకరింపజేశారు శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారిగారు, శ్రీ కృష్ణచరణంగారు, శ్రీ శివచరణంగారు- ఈ ముగ్గురు సంస్కృత పండితులు శ్రీ వారి భావాలను ఈ గ్రంథంలో సంస్కృతంలో ఛందోబద్ధం చేశారు శ్రీవారి శిష్యులలో ముఖ్యులైనవారే ఇందలి పృచ్ఛకులు వారిలో అన్నపూర్ణాంబ అనే మహిళామణి కూడా ఉండడం విశేషం

కర్మ భక్తి జ్ఞాన యోగాది విషయాలలో భగవద్గీతా పాఠకులకు గలిగే సంశయాలను ఈ గ్రంథం నివారిస్తుంది అంతే కాక ఇందలి స్త్రీ విద్యాధికార యోగము, జాతినిర్ణయయోగము, యుగనిర్ణయయోగము అన్న యోగాలలో శ్రీసద్గురుస్వాములవారి సాంఘిక – ఆధ్యాత్మిక సంస్కరణాత్మకాలైన భావాలు వ్యక్తమయ్యాయి

మొదటిసారిగా 1954 లో ప్రకటించబడిన ఈ గ్రంథం రెండవసారిగా ఈ సంపుటంలోనే ప్రచురణ పొందింది తొలి ముద్రణలోని కొన్ని శ్లోకాలలో శ్రీవారి భావాలు యథాతథంగా వ్యక్తం కాలేదు అన్వయ క్లేశాలు కూడా ఎడనెడా కనిపించాయి వాటిని పరిశీలించి ఈ ముద్రణలో సాధ్యమైనంత వరకు సవరించడమైనది ఛందస్సును మార్చి శ్లోకాలను సమకూర్చవలసిన పరిస్థితి కూడా కొన్ని చోట్ల సంభవించింది గురుకృపవల్ల వీలైనంత వరకు సవరణలు చేసి శ్రీమలయాళయతీంద్రగీతను ఇందులో క్రోడీకరించడమైంది

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవాల సందర్భంలో శ్రీమలయాళ సద్గురు స్వాములవారి రచనల నన్నింటినీ క్రోడీకరించి ''శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి '' అన్న పేరుతో ఇరువది సంపుటాలుగా ప్రచురించే సదవకాశం లభించడం శుభావహం శ్రీసద్గురుకృపతోనే ఈ ప్రణాళిక విజయివంత మయినది ఆత్మోన్నతిని ప్రసాదించే ఈ గ్రంథావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీసద్గురు దేవుని అనుగ్రహానికి పాత్రు లగుదురుగాక!

శరణము సద్గురు దేవుడు
శరణము సర్వాత్మ భావ సంపన్నుడిలన్
శరణ మసంగమునీంద్రుడు
చరాచరసుఖాభిలాషి శరణము మనకున్

**శ్రీ వ్యాసాశ్రమము**

**27-01-2001** - సముద్రాల లక్ష్మణయ్య

ఓమ్

# బ్రహ్మావిద్య

## ఆముఖము

బ్రహ్మవిద్య అనగా బ్రహ్మమును గుఱించిన విద్య యని యర్థము విద్య యనగా జ్ఞానము అపుడు బ్రాహ్మమును గుఱించిన జ్ఞానమని అర్థమగును, అనగా బ్రహ్మజ్ఞానము అట్టి బ్రహ్మజ్ఞానము కలుగుటకు మానవజన్మ మొకటిమాత్రమే ఉపయోగపడును పితృజన్మము, దేవతా జన్మము కలిగినను కట్టకడకు సత్యలోకమున జన్మించినను మోక్షము కలుగ దనియే కఠవల్లి శ్రుతి ఉపదేశించియున్నది దానికి సరియైన కారణము తెలిపెడు ఈ మంత్రమును జూడుడు మానవుని హృదయనిర్మాణము అటు వంటిది మఱియు బ్రహ్మలోకమువఱకు గల సర్వలోకములవారు మానవ జన్మములో జేసిన పుణ్యవిశేషముచేతనే ఆయా లోకములను బొంది యున్నారు కావుననే మానవజన్మము అన్ని లోకములలోను శ్రేష్ఠమని చెప్పుదురు

మూ॥ **యథాఽఽదర్శే తథాఽఽత్మని**
**యథా స్వప్నే తథా పితృలోకే ।**
**యథాఽప్సు పరీవ దదృశే తథా గన్ధర్వలోకే**
**ఛాయాతపయోరివ బ్రహ్మలోకే ॥**

ఈ మంత్రము యమధర్మరాజుచే నచికేతసుడను ఋషిపుత్రున కుపదేశింపబడినది ఓ నచికేతుడా! మనుష్యుడు తన దేహప్రతిబింబమును అద్దమునందెట్లు స్పష్టముగా చూచునో, ఆ ప్రకారము ఆత్మస్వరూపమును ఈ లోకమందే (మనుష్యజన్మయందే) బుద్ధియందు జూచుచున్నాడు స్వప్నాదికములయందు దేహము ఎట్లు అస్పష్టముగ (వికారముగా) చూడబడుచున్నదో, ఆప్రకారమే పిత్రాది సర్వలోకములయందును జూడబడుచున్నది ఛాయాతపములు ఎట్లు అస్పష్టముగా జూడబడుచున్నవో ఆప్రకారము బ్రహ్మలోకమందాత్మ స్వరూపము అస్పష్టముగా చూడబడు చున్నదని యము డుపదేశించెను

విశేషార్థము - అద్దమందు తనరూపము ఉన్నదున్నట్లు ఎట్లు చూడబడుచున్నదో, ఆలాగున మనుష్యజన్మలో బుద్ధియందుబ్రహ్మము స్పష్టముగ గోచరమగును పితృదేవతల జన్మమెత్తినను, స్వప్నమునం దేలాగున తన రూపము వికారముగ కనుపించునో, అచ్చోటను ఆలాగుననే బ్రహ్మము స్పష్టముగి గోచరము కాక అస్పష్టముగా నుండును గంధర్వలోకమందు నీటిలో గనిపించెడు నీడ యేలాగున అస్పష్టముగానే యుండునో, అట్లే బ్రహ్మము అస్పష్టముగ నుండును బ్రహ్మ లోకమందుండినను ఎండలో తన నీడ యెట్లు అస్పష్టముగా తెలియనగునో, అట్లే బోధపడును అక్కడ శుద్ధమగు బ్రహ్మముగా అవగాహనము జేసికొనుటకు దగిన బుద్ధినిర్మాణము లేదు అనగా మానవుడు బ్రహ్మలోక వాసులకన్న అధికుడని భావము వివేకచూడామణి ఉపదేశించునదియు చూడుడు

**దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకమ్ ॥**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥**

మనుష్యత్వము, మోక్షేచ్ఛ, పరమార్థజ్ఞానులగు మహాపురుషుల సేవ అను నీమూడును బహుకష్టసాధ్యములు దైవానుగ్రహములేక లభించ నేరవు ఈ లాగుననే శ్రీ మద్భాగవతము తెలిపియున్నది

**నృదేహమాద్యం సులభం సుదుర్లభం**
**ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్ ।**
**మయాఽనుకూలేన నభస్వతేరితం**
**పుమాన్ భవాబ్ధిం న తరేత్ స ఆత్మహా ॥**

బహుపుణ్యలభ్యంబును, సర్వోత్తమము నగు నరదేహమనే మంచి కూర్పుగల నావను, సర్వజనసాధారణముగా గాక సద్గురువు అనే నావికుడు నడుపగా, భగవత్ప్రసాదమనెడి యనుకూల మారుతముచే నడుపబడగా, సంసార సాగరమును దాటలేనివాడు ఆత్మఘాతకు డనబడునని భావము

శ్రీశంకరాచార్యులవారు వివేకచూడామణియందు నుపదేశించినది చూడుడు

**లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్ ।**
**యః స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః స హ్యాత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్ ॥**

దుఃఖసాధ్యమైన నరజన్మమును, అందులో పుంస్త్వమును దానిలో శాస్త్రపారంగతత్వమును బొంది, యెవడు తన మోక్షముకొఱకు యత్నించడో అతడు మూఢబుద్ధిగల ఆత్మఘాతకుడు, తుచ్ఛమును పరిగ్రహించి తన్ను తానే చంపుకొనుచున్నాడు గీతయందు శ్రీకృష్ణ భగవానుడును ఈ లాగుననే తెలిపియున్నాడు

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

సకలప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా దెలిసికొని తనచేత తన్ను చంపుకొననివాడగుచున్నాడు అట్లు పరమాత్మను సర్వజీవమయునిగా తెలిసికొననివాడు, తన ఆత్మను తాను చంపుకొనినవారితో సమానుడు అట్టి దైవమును సాక్షాత్కరించిన వాడు మోక్షమును బొందుచున్నాడు

మానవునికి కావలసినది అన్నవస్త్రములు వీటికన్న అధికము అవసరము లేదు తక్కినవన్నియు భ్రాంతిమాత్రములగు భోగపరత్వము లగును మనుజు డనుభవించునది లేదు కూడా పట్టుకొని వెళ్ళునదియు లేదు కావుననే శాస్త్రము పై విధమున జెప్పినది

విద్య లేని జాతి తప్పక అడుగంటిపోవును వీరు పశువులవలె ఎల్లప్పుడును పరాధీనులై, బానిసలై యుండవలసినవారలే విద్యలేని యాదిమ నివాసుల స్థితియే దీనికి తార్కాణము సాధువులలో ఎప్పుడు విద్యయు, తపము లోపించినవో అప్పటినుండి వారును, తక్కిన జనులకు ధర్మోపదేశము చేయుశక్తి లేని వారైరి రాజులకు, రాజాధిరాజులకు, సార్వభౌము

లకు, పండితులకు సహా ఋషులు ధర్మోపదేష్టలై యుండిరి కావుననే యరణ్యమున కందపక్వఫల మూలాదులను భుజించి పర్ణశాలలందుండి, వల్కలాజినములను ధరించియుండిన పరమఋషుల యొక్క పాదధూళి మిక్కిలి పావనమనియు, పాపరహిత మొనర్చుననియు తలంచి సువర్ణరత్న నిర్మిత సౌధాంతగాళములలో నివసించుచుండిన రాజులు, రాణులు మొదలగు వారందఱును అట్టి పావనులగు మునిపుంగవుల చరణములను మిక్కిలి భక్తిశ్రద్ధావినయములు గలవారలై సేవించు చుండిరి ఈ విషయమై ఇప్పుడు మహనీయులై యుండువారిని గుఱించి ఊహించిన మీకే తెలియుగలదు ఇదంతయు విద్యాతపస్సులచే గలిగిన ప్రభావమని గ్రహించుకొనవలెను

ఋషులయం దొక్కరైనను విద్యాహీనులై యుండలేదు ఇప్పుడు గల సాధువులు, భక్తులు, సన్న్యాసులు, యోగులు మొదలగు సకల స్త్రీ పురుషులును పై జెప్పిన ఋషులయొక్క వంశములో, సంఘములో చేరినవారమని తలంచిన అట్టి శక్తియు, పవిత్రతయు, పరిశ్రమయు వీరికిని తప్పక గలుగును ఇప్పుడుండు వారలు పరిశ్రమలో చాల వెనుకబడి యున్నారు విద్యాతపస్సులచే గలిగెడు దివ్యపరిణామ మంతయు నీ గ్రంథమందు గల పరిణామ మార్గమున గనదగును ఈ పుస్తకములో నుండు విద్యామార్గమును కొంత నొక్కి చెప్పవలసివచ్చిన కారణ మేమన, సాధువులు విద్యయందు చాల అనాదరణ గలిగి యున్నారు కావుననే అట్లు చెప్పవలసివచ్చినది

ఈ ఉపాధికి కూడ అనుష్ఠానములోను, తపములోను ఎక్కువ మక్కువ గలదు వీనికే ప్రాధాన్య మిచ్చుచుండిన సాధకులు, తాపసులు చాల అరుదుగా నుండియుండిరి పై చెప్పిన వారిని జూచి వారివలె ఆత్మయందు ప్రయత్నము చేయక అనేకులు నడవసాగిరి దీనిని అరికట్టుట ప్రతి భారతీయునియొక్క కర్తవ్యమై యున్నది ప్రతిదేశములోను ప్రతిమతము లోను అట్టి నివృత్తిమార్గములో నుండు వారికి తగిన విద్యాలయములును,

అనుష్ఠానమునకు తగిన యేర్పాటులును గలవు భారతీయరాజులు బ్రహ్మచారులకు, సన్న్యాసులకు అచటచట నామమాత్రములగు స్వల్ప వసతులు కల్పించి యుండినను వానికి సరియైన పాలనము లేనందున వాని వలన గలుగదగిన ఫలము కలుగుట లేదు

రాజులకు సంస్కృతమువలన ఎక్కువ ఉపయోగము లేకపోవుటచేత ఈ సంస్కృతమందు అంత ఆసక్తి లేకపోయెను ఏలనన వారి రాచకార్యము లన్నియు ఇంగ్లీషువారితో సంబంధపడియుండుట చేతను, రాజపాలన యంతయు ఇంగ్లీషువిద్యలోనే జరుగుచుండుటచేతను, హూణవిద్యకే ఆధిక్యము గలిగియుండి వ్యవహరించుచుండుటచేతను సంస్కృతము మాతృభాషయని గూడ మఱచిపోవుచున్నారు కొందరు మాత్రము సంస్కృతము కష్టపడి చదివినను వారికి సరియైన ఆదరణ లేకపోవుటచేతను ఈ దేవభాషకు పతనము కలిగినది మఱియొక పతన హేతువుగూడ గలదు అదేమన సంకుచిత హృదయము చేతను, సర్వజన సోదరభావము లేకపోవుటచేతను ఈ విద్య సర్వజనులకు విరివిగ బోధింపక కొన్ని సంఘముల వారికి మాత్రము చెప్పుచు వచ్చుటచేతను దీని కింత దీనావస్థ సంభవించెను జన్మించిన కులమును మాత్రము చూచుటచేతను, మానవుని యొక్క గుణమును పరిశీలించెడు విచక్షణబుద్ధి లేనందుచేతను ఇంత అనర్థము గలిగెను దైవకృపవలన నిపుడిపుడు మానవుల మనస్సు కొంచెము వికాసము నొంది వచ్చినందుచేత అందఱికిని సంస్కృతవిద్యయందు ప్రవేశము గలుగుచు వచ్చుచున్నది ఇది సంతసించదగిన విషయము ఇందు వలన నీవిద్య త్వరలో అభివృద్ధిచెంద నున్నదని భావించవచ్చును భారతీయు లకు మాతృదేశమందును, మాతృభాషయందును అభిమానము అంకురించు టయు శుభసూచకము విద్య లేనివారిని గురించి మనుమహర్షి చెప్పినది చూడుడు

**యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః ।**
**యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥**

కొయ్యతో జేయబడిన యేనుగున్ను, తోలుతో కుట్టబడిన

మృగమును, అధ్యయనము లేని విప్రుడును (సన్న్యాసియును) ఈ ముగ్గురు కేవలము నామమాత్రులే ఈవాక్యము ప్రతిజిజ్ఞాసువున్ను తెలుసుకొనదగి నది గరుడపురాణమందు శ్రీమహావిష్ణువు ఉపదేశించినది చూడుడు

**ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి ॥**

ఎవడీ మనుష్యలోకమందున్నప్పుడే నరకమనెడు వ్యాధికి చికిత్స చేసుకొనడో, వాడు వ్యర్థజీవుడగును వ్యాధిగలవాడు వైద్యుడును, ఔషధమును లేని స్థలమునకు వెళ్ళి యేమి చేయగల్గును? అనగా ఈలోక మందే కర్మాధికారము కలదు తక్కిన లోకము లన్నియు ఈ మానవ లోక ములో జేసెడు సుకృత దుష్కృత ఫలముల ననుభవించుటకొఱకు ఏర్పడిన లోకములని మఱువకుడు అట్టి సుకృతకర్మము చేయుటకు వెంటనే ప్రయత్నించక కాలమును నిరీక్షించుచు వ్యర్థజీవనుడు కాకూడదని శాస్త్రము తెలుపునది చూడుడు

**యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతో**
**యావచ్చేన్ద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।**
**ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్**
**సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥**

ఎంతవరకు శరీరమందు శక్తి కలిగియుండి రోగపీడితుడు గాక యుండునో, యెంతవరకు జర (ముసలితనము) దగ్గర చేరక యుండునో, యెంతవరకు ఇంద్రియముల శక్తి నశించదో, యెంతవరకు ఆయుష్యమునకు క్షయము గలుగుదో, అంతకు ముందుగానే బుద్ధిమంతుడైన వాడు ఆత్మ శ్రేయస్సుకొఱకు మంచి ప్రయత్నము చేయవలెను లేనిచో వాడు మోసపడి పోవును ఒకవేళ వార్ధక్య బాధచే పీడింపబడునప్పుడు సత్కర్మలు చేసి తరింపజూచినను ప్రయోజనముండదు అట్టి ప్రయత్న మెట్టిదనగ కొంపము (ఇల్లు) కాలుచున్నప్పుడు కూపము త్రవ్వుటకు గడ్డపార, పాఱలు వెదకువాని

వలెనే ఉండునని తాత్పర్యము ముందుగా జలము సిద్ధముగ నుండినచో వెంటనే నీళ్ళుతీసి కొట్టమును చల్లార్చవచ్చును గదా! మహర్షులు ఎంతో కరుణ గలిగి మానవులకు ఈ ధర్మము నుపదేశించిరి

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే ।।** **(మనుస్మృతి)**

మానవునకు తపము, వేదవిద్యయును మిక్కిలి శ్రేయస్సు నొసంగును తపస్సుచే పాపకర్మములన్నియు నశించు బ్రహ్మవిద్యచే మోక్షము సిద్ధించును

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు
ఓమ్ తత్సత్

చరాచర సుఖాభిలాషి
మలయాళస్వామి

ॐ

# బ్రహ్మవిద్య

## మొదటి భాగము

**ఓమ్ నమో బ్రహ్మదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో**
**వంశఋషిభ్యో మహాద్భ్యో నమో గురుభ్యః॥**

## ఋషిమార్గము

ఋషులమార్గమును పరిశోధించినచో అందు విద్యావిహీను లొక్కరైనను గనిపించరు ఋషిత్వము నొందిన నారీమణులలోను ఆలాగున విద్య లేని వారెవరును లేరు మైత్రేయి, గార్గి మొదలగువారే దీనికి దృష్టాంతము పురుషులలో నిక చెప్ప నక్కఱయే లేదు బ్రాహ్మణ జాతిలో చేరిన వసిష్ఠాదులును, క్షత్రియజాతిలో చేరిన విశ్వామిత్రాదులును, వైశ్యవంశమునకు జెందిన తులాధారాదులును, బ్రహ్మణేతరులలో నుండిన సూతాదులును దీనికి ప్రమాణములు ఋషుల కాలములో అనగా వేదకాలములో గురుకుల వాస మొనర్చి వేదవేదాంగములను జదువు చుండునట్టి కాలమంతయు బ్రహ్మచర్యవ్రతము సలుపుచు, అచటనే ఆత్మశుద్ధి గలిగి వైరాగ్యోదయ మైనచో అచ్చోట నుండియే యత్యాశ్రమమును గ్రహించి పరివ్రాజకుడు గావచ్చుననియు, అట్లు ఆత్మశుద్ధియు, విరక్తియు గలుగనిచో పవిత్రమగు గృహస్థాశ్రమమును బొందవచ్చుననియు, అచట కొంతకాలముండి ఈశ్వరోపాసనాదులును, నిత్యనైమిత్తిక కర్మలును చేయుచు వచ్చిన ఆత్మశుద్ధి గలుగునపుడు వానప్రస్థాశ్రమమున గొంతకాలముండి, తరువాత సన్న్యసింపవచ్చుననియు నియమ ముండెను ఇది క్రమపద్ధతి యగును.

అట్లుగాక భీష్మాదులవలె యావత్కాలము బ్రహ్మచర్యాశ్రమముననైనను నుండుటగూడ కలదు లేక గృహస్థాశ్రమియై జనకాదులవలె నుండ

వచ్చును ఆలాగున వనవాసిగూడ నాయాశ్రమమునందు విశ్వామిత్రా దులవలె నుండదగును కాని యే ఆశ్రమమునందుండినవారైనను శాస్త్ర ముల నభ్యసించుట ఋషుల ధర్మమై యున్నది అట్లు కానిచో వేదార్థమును ఎట్లు మననము చేయగలరు? ఉపనిషదర్థము నేలాగున చింతన చేయ నగును? ఒకవేళ శాస్త్రములు కడవఱకు చదువుటకు కాలము చాలకపోయి నను, లేక సాధ్యపడక పోయినను, సామాన్యముగా శ్రీభగవద్గీత, ఉపనిషత్తులు పఠించుటకైనను తగినంత విద్య యత్యవసరముగ నుండ వలెను లేనిచో స్ఫుటముగా నుచ్చరించుటకును, మహావాక్యముల విచారణ చేయుటకును బుద్ధికి శక్తిగలుగదు అంతేగాక స్వయముగ గ్రంథములను పరిశోధించుటకును యోగ్యత యుండదు అట్లు కానివారు ఎల్లపుడును పరాధీనులై యుండవలసియుందురు ఒక వేళ పూర్వజన్మ సుకృత విశేషమువలన జ్ఞానము కలిగినను, దానికి పూర్వజన్మములోగల శాస్త్ర పఠనము, యోగసాధన, ఆత్మధ్యానము, ఈశ్వరభక్తి, వేదాంత శ్రవణము, కారణములై యుండుననియే శాస్త్ర ముద్ఘోషించుచున్నది ఋషుల మార్గమును గుఱించి ఒక ఇతిహాసము ముండకోపనిషత్తు నందుగలదు

**శౌనకో హ వై మహాశాలో౽ఙ్గిరసం విధివదుపసన్నః ప్రప్రచ్ఛ**
**కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥**

మహాశాలుడును, శునకుని పుత్రుడును నగు శౌనకుండను మహర్షి భరద్వాజుని శిష్యుడగు అంగిరసుండను ఆచార్యునికడకు, శిష్యుడు ఆచార్యుని సమీపించునపు డెట్టి విధి ననుసరించి రావలయునో, ఆవిధముగ వచ్చినవాడై, 'ఓ మహాత్మా! యే యొక్క వస్తువును తెలిసికొనినయెడల తెలిసికొనదగినది అంతయు చక్కగా తెలిసికొనబడినదగునో, అట్టి వస్తువు నుపదేశింపు' డని యడిగెను

దీనియందు ''విధివ దుపసన్నః'' అని యుండుటచే ఆచార్యుని వద్దకు శిష్యుడెట్లు వెళ్ళవలయునో అది నిరూపించడమైనది సమిత్పాణియై గురు సమీపమునకు వెళ్ళవలయునని అనాదినుండి పద్ధతి యేర్పడియున్నది

సమిత్పాణియన పాణియందు సమిధలు గలవాడై యుండవలయునని భావము సమిత్తనగా ఫలపుష్ప, హోమద్రవ్యాదులు వానిని స్వయముగా తానే కరమున నిడుకొని వినయముతో భక్తిగలవాడై ఆచార్యుని సమీపించ వలయునని నిరూపించడమైనది శౌనకుండడిగిన ప్రశ్న సామాన్య మైనది గాదు దేనిని దెలిసికొనిన సమస్తము తెలియబడిన దగుచున్నదో, అట్టి దానిని ఉపదేశింపుడని అడిగెను దీనివలన బ్రహ్మవిద్య గురుముఖమున దెలిసికొన వలసినదిగా నుండునని గోచరించుచున్నది

**తస్మై స హోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ**
**యద్బ్రహ్మవిదో వద న్తి పరా చైవాపరా చ॥**

ఈ విధముగా శాస్త్రవిధి ననుసరించి తన సమీపమునకు వచ్చిజిజ్ఞా సువై ప్రశ్నించిన శౌనకునితో అంగిరసుం డిట్లని చెప్పుచున్నాడు వేదార్థము నెఱింగి పరమార్థజ్ఞులైన బ్రహ్మవేత్తలు 'పరా' యనియు 'అపరా' యనియు పేర్లు గల రెండు విద్యలు గలవనియు, వానిని తెలిసికొనవలయుననియు పలుకుచున్నారు

పరవిద్య యనగ పరమాత్మనుగుఱించి బోధించునట్టి బ్రహ్మవిద్య అపరవిద్య యనగ ధర్మాధర్మసాధనములను, తత్ఫలములను బోధించునట్టి వేదశాస్త్రములు ఇచట శౌనకుం డడిగిన దేమి? దేనిని తెలిసికొనిన సర్వము తెలిసినదగుచున్నదో యని అట్టి దానికి అంగిరసుడు తగిన సమాధానము చెప్పక, బ్రహ్మవేత్తలగు మహనీయులు పరమని అపరమని రెండు విద్యలు గలవనియు, నా రెండు విద్యలును తెలిసికొనవలసినవని చెప్పుచున్నా రని నుడివెను ఇట్లు తెలుపుటలోనే ఆర్షధర్మమంతయు నిమిడి యున్నది

వర్తమానకాలములో ముముక్షువైనవాడు గురువును సమీపించి నాకు బ్రహ్మవిద్య నుపదేశింపుడని వచించును ధర్మశాస్త్రము తెలిపెడు అపరవిద్య తెలియకపోయినచో బ్రహ్మనిష్ఠ డెట్లాచరించవలయునో యీ ధర్మము తెలి యకపోవును ఇప్పుడు ప్రపంచస్థితి యీలాగున పరిణమించినది ఇదెటు

వంటిదన, దయగల ఒక వైద్యుడు రోగియైన వానికి ఔషధ మిచ్చినను, పథ్యము అపథ్యము దెలియక పోయినచో, లేక తెలుపకపోయినచో, అనుపాన పథ్యములు తెలియనిచో అట్టి యౌషధ మేలాగున వ్యర్థమైపోవునో, ఆలాగున ఆచార్యులు బ్రహ్మవిద్యను మాత్ర ముపదేశించిన చాలదు బ్రహ్మ నిష్ఠని ఆచారవ్యవహారములను గూడ తెలుపవలసియుందురు అట్లయిన మాత్రమే ఆయౌషధము ఫలవంతమగును ఆబ్రహ్మవిద్య ఫలించును అట్టి బ్రహ్మ నిష్ఠనియొక్క ఆచారానుష్ఠానము లన్నియు ధర్మశాస్త్రములో విధింప బడియున్నవి అట్టి శాస్త్రము సంస్కృత భాషయందుండుటచే అట్టినిధిని తెలిసికొనుటకు దగినంత సంస్కృతవిద్య యైనను ముముక్షువుల కుండవలయును

పూర్వకాలములో నుండెడు ఋషులు, యోగులు, యతులును రారాజులకు, సార్వభౌములకు, పండితవర్యులకు సహా ధర్మోపదేశము, జ్ఞానోపదేశము చేయుటకు శక్తిమంతులై యుండిరి అట్టి కాలమున నట్టి మహాత్ముల ధర్మబోధనలను వినుటకు జనులందఱు వినమ్రులై కనిపెట్టుకొని యుండిరి ఆ ధర్మోపదేష్టలు విరక్తులై, త్యాగశీలురై, సర్వులందు సమత్వ బుద్ధి గలవారై యుండుటచేతనే ఆకాలమున వారంత పూజ్యులైరి, అట్టివారి పరంపరలో జేరిన ఇప్పుడుండు సన్న్యాసులు, బ్రహ్మనిష్ఠలు పైజెప్పిన వారివలె నుండకపోవుటచే లోకులు వీరిని గౌరవించుట లేదని గ్రహించవలెను

పరవిద్య యనగా ఉపనిషత్ప్రతిపాదితమగు బ్రహ్మవిద్య యని తెలుపడమైనది ఇప్పుడు అపరవిద్య యనగా నేమి? దానిని తెలుపుచున్నారు

**తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేదశ్శిక్షా, కల్పో, వ్యాకరణం, నిరుక్తం, ఛందో, జ్యోతిష మితి, అథ పరా యయా తదక్షర మధిగమ్యతే ॥**

వెనుక చెప్పబడిన పరాపరవిద్యలయొక్క వివరము చెప్పబడుచున్నది అపరవిద్య యనగా ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేదములు,

శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛందో, జ్యోతిషములను షడంగము లగును పరవిద్య యనగ అవినాశియగు బ్రహ్మము ఏ యుపనిషద్విద్యచేత బొందబడునో అది దీనికి వేదాన్తమనియు, ఉపనిషత్తనియు, బ్రహ్మవిద్య యనియు పేర్లు వేదముయొక్క శిరస్సగుటచే శ్రుతిశిరస్సనియు, వేదముయొక్క అంతమగుటచే వేదాన్తమనియు పేర్లు వచ్చినవి

అయితే ఇవి యన్నియు ఒకరి జన్మములో చదువుటకు సాధ్య మగునా? అట్లు చదువనివారికి నిక మోక్షము కలుగదా? అని ప్రశ్న కలుగవచ్చును దానికి సమాధానము అంతయు చదువ నక్కరలేదు గాని యుపనిషదర్థమును దెలిసికొన దగినంతయైన నుండవలయును

ఈ ప్రశ్న ఇట్లుండు గాక! చదువు ప్రారంభించుటకు ముందుగానే చదువగలనా? లేదా? యని ఏల సందేహపడవలెను? చదువులో ప్రవేశించి సాధ్యము కానిచో అప్పు డావిషయమై యాలోచించుకొనవచ్చును ప్రపంచ ములో ఒక కన్యకను మంచి వరునకిచ్చి వివాహము చేయునపుడు ఇతడు పూర్ణాయుస్సు గలిగి జీవించగలుగునా? లేదా? యని తెలిసికొని వివాహము చేయువారెవరును లేరు వర్తమాన పరిస్థితుల ననుసరించి యెంతవఱకు పరిశీలించగలరో, అంతమాత్రము పరిశీలన చేసియే అందరును వివాహాదులు సలుపుచుందురు తరువాత విధియేలాగున నుండునో ఆలాగుననే జరుగును

అయితే యీ విద్యాభ్యాసము అటువంటిది కాదు ఈ జన్మములో ఎంతవఱకు బ్రహ్మవిద్య అభ్యసింపబడునో అది ఆత్మతో గూడియుండి జన్మాంతరమునకు సహాయకారి యగును మఱియు జీవితమును సుఖముగా గడుపుటకు తాను చక్రవర్తి గాని, మహారాజుగాని, జమీందారు గాని కావలసిన యవసరము లేదు తన జీవిత సౌఖ్యమునకు దగినంత ధనము కలిగి యుండిన జాలును ఆలాగున తాను తరించుటకు నెంతమాత్రము విద్య యుండవలయునో అంతమాత్ర ముండిన జాలును కడు దరిద్రుడు ఏలాగున సుఖజీవితము గడుపజాలడో, ఆలాగున కేవల విద్యావిహీనుడు

ఆత్మోన్నతిని బొంది బ్రహ్మసుఖము ననుభవింపజాలడు అయితే కొందఱు సంస్కృతాది విద్యలను జదువకనే గొప్ప మహాత్ములై యుండిరి గదా! అని తలంచవలదు వారు పూర్వజన్మము నందభ్యస్త విద్యావంతులై, బ్రహ్మనిష్ఠాపరులై పూర్ణబ్రహ్మత్వముం బొందుటకు ముందుగా దేహమును జాలించిన వారైయుందురు అందువలననే వారు ఈ జన్మలో జదువక పోయినను బ్రహ్మవిషయక జ్ఞానమున్ను, బ్రహ్మనిష్ఠుల అనుష్ఠానమున్ను కలిగియుందరు అంతియగాక పుస్తకమును జూడకనే వారెన్నియో వేద ప్రమాణ వాక్యములు చెప్పుచుందురు అమోఘములగు భక్తిరసకీర్తనలు పాడుచుందురు ధర్మబోధల నొనర్చుచుందురు ఇవి యన్నియు నెట్లు దెలియును? కారణము లేక కార్యము ఏ కాలమందైన నుండునా? విత్తనములు లేక చెట్లు పుట్టునా? వారి హృదయములో పూర్వజన్మముల సంస్కారము లన్నియు బీజరూపములై ఉండి వర్తమాన జన్మములో అభివ్యక్తము లైనవి కావుననే వారు విద్యను చదువక పోయినను విద్యావంతులగు బ్రహ్మనిష్ఠులయొక్క ఆచరణ గలిగి యుందురు ఈ విషయమై భర్తృహరి చెప్పినది చూడుడు

**ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః**
**ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః ।**
**విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః**
**ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి ॥**

అల్పబుద్ధి గలవారలు విఘ్నములవలన భయముచే నే పవిత్ర కార్యమును ఆరంభింపరు మధ్యమగుణములు గల జనులు కార్యముల నారంభించి విఘ్నములు గలుగుటచే మానుదురు ఉత్తమగుణములు గలవారు ఆటంకములచే మాటి మాటికిని మిక్కిలి కొట్టబడుచున్న వారైనను, ఆరంభించిన దైవకార్యమును వదలరు ఈ విలువగల యుపదేశమును మరువకుండిన మనుజుడు తప్పక తరించగలడు

ఇక వార్ధక్యముచేతగాని, మరేవిధమైన అనివార్య ఆటంకములు

గలిగిగాని సంస్కృతమును చదువుట క్షతత లేనివారై మోక్షాపేక్ష మాత్రము గలిగి యుండువారెట్లు తరింపగలుగుదురో ఆ విషయమై శ్రీ కృష్ణభగవానులు మిక్కిలి కరుణతో నుపదేశించినది చూడుడు

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

కొందఱు శుద్ధమనస్సుతో గూడిన ధ్యానయోగముచేతను, మఱి కొందఱు సాంఖ్యయోగముచేతను, వేఱొక కొందఱు నిష్కామకర్మయోగము చేతను పరమాత్మను తన యందున్న వానినిగా జూచుచున్నారు

**అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥**

మరికొందఱు పైనజెప్పబడిన ధ్యానయోగము, సాంఖ్యయోగము నిష్కామకర్మయోగము అనువానిలో నొక్కదానినిగూడ ఆచరించి పరమాత్మను నెఱుంగలేని వారైనచో, పరమదయాళురగు గురువులవలన పరమాత్మ నెట్లు ఉపాసన చేయువలయునో ఆతత్త్వమును దెలిసికొని యనుష్ఠించిన వారుగూడ జననమరణ రహితమగు మోక్షమును బొందగలరు అయితే పైజెప్పిన ప్రకారము అనుష్ఠించుట కశక్తులైన వారిని గురించి మాత్రమే పరమకారుణికుడగు శ్రీకృష్ణభగవాను డట్లుపదేశించినదని మరువకూడదు రోగియైనవాడు ఆయుర్వేదము తెలిసికొనజాలక పోయినను, మంచి వైద్యు డిచ్చు ఔషధమును సేవించి, సరియగు పథ్యము కలిగియుండిన రోగము ఎట్లు కుదురునో, యీ ధర్మమున్ను అటువంటిదే అయితే గొప్ప వైద్యుడైనను తనకు వ్యాధి వచ్చినపుడు ఔషధ, పథ్యములు సరిగా నాచరించనిచో వ్యాధి యెట్లు నయము కాదో, ఆలాగున వేదశాస్త్రములను చక్కగా చదివినను బ్రహ్మవిచారము, శమదమములు లేనిచో అతని భవరోగము నశింపజాలదని విజ్ఞులు గ్రహించుకొనవలయును

**పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన**

**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥**

బ్రాహ్మణుడు లోకములను, కర్మచేత నిర్వర్తింపబడినవిగ పరీక్షించి మోక్షము చేయబడిన కర్మములచేత లేదని వైరాగ్యమును బొందవలయును అట్టి వైరాగ్యమును బొందిన బ్రాహ్మణుడు ఆ యమృత స్వరూ పమును తెలిసికొనుటకు సమిధలు హస్తమునందు గలవాడై శ్రుతిసార మెఱింగి నట్టియు, బ్రహ్మమునందే నిష్ఠగలవాడు నగు గురువును గూర్చియే పోవల యును

విశేషార్థము సకామకర్మలచే పొందుటకు యోగ్యములైన స్వర్గా దిలోకములు నశ్వరములని తెలిసికొనినవాడై అమృతత్వమగు శాశ్వత బ్రహ్మమును బొందుటకొఱకు వేదసారము నెఱింగిన వాడును, బ్రహ్మ నిష్ఠుడునగు గురుని సమీపించవలయును ఇచట ''శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్'' అని చెప్పుటచే శ్రుతియొక్క సారము నెఱింగినవాడును, బ్రహ్మనిష్ఠుడు నగు గురువే సరియైనవాడని నిరూపించడమైనది ఇందువలన కేవలము వేదశాస్త్రములను మాత్రము చదువుకొనిన జాలదనియు, శాస్త్రము జదువనివాడై బ్రహ్మనిష్ఠమాత్రము కలిగినవాడును జాలడనియు నిరూపించడమైనది ఏలనన, తత్త్వము తెలియక శాస్త్రము మాత్రము చదివినను నుపయోగపడదు ఏదో విధముగ పూర్వజన్మ పుణ్యసంస్కార ముచే జ్ఞానము గలిగినను చాలదనియు తెలుపడమైనది ఏలనన శాస్త్ర పరిచయము లేనిచో, ముముక్షువులను చక్కనిమార్గములో నడుపుటకు అతనికి శక్తియుండదు, ఋషిమార్గ మీలాగున నుండును

**తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ ।**
**యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥**

బ్రహ్మవేత్తయగు ఆ గురువు తన సమీపమునకు బ్రహ్మవిద్యకై విద్యార్థియై వచ్చినట్టియు, లెస్సగ శమించిన దోషములు గల చిత్తము గలవాడును, శమించిన బాహ్యేంద్రియ దోషములు గలవాడునగు ఆ శిష్యునికి

ఏ జ్ఞానముచేత సత్యమే స్వరూపముగా గలవాడును, నాశరహితుడును, పూర్ణుడునగు పరమాత్మను తెలిసికొనుచున్నాడో అట్టి బ్రహ్మవిద్యను చక్కగా నుపదేశించవలయును

విశేషార్థము శమదమములు గలవాడై తీవ్రముముక్షుత్వము గలిగిన ముముక్షువునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుటకు తగిన బ్రహ్మవిద్య నుప దేశించవలసినదేగాని, యితరములగు కర్మకాండమును బోధింపగూడదు శమదమాది గుణములు గలుగని మందప్రజ్ఞానికొఱకు నుపాసనలు విధించడమైనది

**సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా**
**సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।**
**అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో**
**యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥**

నశించిన పాపములు గలవారును, పరమాత్మ స్వరూపానుసంధానము నకు ప్రయత్నించుచున్న వారలు నగు సన్న్యాసులు ఏయాత్మస్వరూపమును జూచుచున్నారో ఆతేజోరూపము, పరిశుద్ధము నగు ఆత్మస్వరూపము ఎల్లప్పుడును సత్యముచేతను, తపస్సుచేతను, బ్రహ్మస్వరూప సాక్షాత్కార రూప జ్ఞానముచేతను, బ్రహ్మచర్య నియమపరిపాలనముచేతను హృదయ పుండరీ కమునందు పొందదగినది

**సత్యమేవ జయతే నానృతం సత్యేన పంథా వితతో దేవయానః ।**
**యేనాఽఽక్రమంత్యృషయో హ్యాప్త కామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥**

సత్యమే జయించుచున్నది అసత్యము జయమునొందదు సత్యముచేతనే దేవయానమను పేరుగల మార్గము విస్తారమై యున్నది ఏ సత్యమార్గముచేత బొందబడిన సకలమైన కోరికలు గల ఋషులు ఏ పర బ్రహ్మమును లేక యాత్మతత్త్వమును బొందుచున్నారో, అదియే సత్యమునకు శ్రేష్ఠమైన స్థానమగుచున్నది

**బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి ।**
**దూరాత్సుదూరే తదిహాంతికే చ పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ ॥**

ఆ పరబ్రహ్మము మిక్కిలి విస్తారమయినది (అన్నిటికన్న గొప్పదైనది) స్వయంప్రకాశమైనది చింతింప శక్యముగాని స్వరూపము గలిగినది ఆ పరబ్రహ్మము సూక్ష్మమైనదానికంటె మిక్కిలి సూక్ష్మమైనదిగ ప్రకాశించు చున్నది ఆ పరబ్రహ్మము దూరదేశముకంటె మిక్కిలి దూర దేశము నందును, శరీరమునందే సమీపమునందును, నీ దేహమునందే చూచుచున్న యోగుల విషయమై బుద్ధిగుహయం దున్నదియు నగుచున్నది

విశేషార్థము ఆ బ్రహ్మము, బహిర్దృష్టి గలవారికి బహుదూరముగాను, అంతర్దృష్టి గలవారికి మిక్కిలి సమీపమున తన యాత్మయం దున్నదిగాను గోచరించును

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో**
**న మేధయా న బహునా శ్రుతేన ।**
**యమేవైష వృణుతే తేన లభ్య**
**స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥**

ఈ ఆత్మస్వరూపము, వేదశాస్త్రాధ్యయనాధ్యాపనములచేత పొంద శక్య మైనది గాదు గ్రంథార్థ ధారణాశక్తి రూపమగు మేధచేత పొంద శక్య మైనదిగాదు ఈ విద్వాంసుడు ఏ పరమాత్మను బొందుటకు వాంఛించు చున్నాడో అట్టి తీవ్రమగు చింతనచేతనే బొందదగినవాడు ఈ ఆత్మ స్వకీయమైన తన స్వరూపమును వానికి ప్రకాశింపజేయుచున్నది

**సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః**
**కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః।**
**తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా**
**యుక్తాత్మానస్సర్వమేవావిశన్తి ॥**

మహర్షులు ఈ యాత్మస్వరూపమును బొంది ఆత్మజ్ఞానముచేత

ఏ జ్ఞానముచేత సత్యమే స్వరూపముగా గలవాడును, నాశరహితుడును, పూర్ణుడునగు పరమాత్మను తెలిసికొనుచున్నాడో అట్టి బ్రహ్మవిద్యను చక్కగా నుపదేశించవలయును

విశేషార్థము శమదమములు గలవాడై తీవ్రముముక్షుత్వము గలిగిన ముముక్షువునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుటకు తగిన బ్రహ్మవిద్య నుప దేశించవలసినదేగాని, యితరములగు కర్మకాండమును బోధింపగూడదు శమదమాది గుణములు గలుగని మందప్రజ్ఞానికొఱకు నుపాసనలు విధించడమైనది

**సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా**
**సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।**
**అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో**
**యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥**

నశించిన పాపములు గలవారును, పరమాత్మ స్వరూపానుసంధానము నకు ప్రయత్నించుచున్న వారలు నగు సన్న్యాసులు ఏయాత్మస్వరూపమును జూచుచున్నారో ఆతేజోరూపము, పరిశుద్ధము నగు ఆత్మస్వరూపము ఎల్లప్పుడును సత్యముచేతను, తపస్సుచేతను, బ్రహ్మస్వరూప సాక్షాత్కార రూప జ్ఞానముచేతను, బ్రహ్మచర్య నియమపరిపాలనముచేతను హృదయ పుండరీ కమునందు పొందదగినది

**సత్యమేవ జయతే నానృతం సత్యేన పంథా వితతో దేవయానః ।**
**యేనాఽఽక్రమంత్యృషయో హ్యాప్త కామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥**

సత్యమే జయించుచున్నది అసత్యము జయమునొందదు సత్యముచేతనే దేవయానమను పేరుగల మార్గము విస్తారమై యున్నది ఏ సత్యమార్గముచేత బొందబడిన సకలమైన కోరికలు గల ఋషులు ఏ పర బ్రహ్మమును లేక యాత్మతత్త్వమును బొందుచున్నారో, అదియే సత్యమునకు శ్రేష్ఠమైన స్థానమగుచున్నది

వంశమునందు బ్రహ్మజ్ఞాని కానివాడు పుట్టడు బ్రహ్మవేత్త దుఃఖమును దాటుచున్నాడు పాపము నతిక్రమించుచున్నాడు అజ్ఞానముచేత హృదయమునందు గలిగిన దృఢములైన గ్రంధులనుండి (కట్లులనుండి) విముక్తి నొందినవాడై యమృత స్వరూపు డగుచున్నాడు

**తదేత త్సత్య మృషి రఙ్గిరాః పురోవాచ నైత దచీర్ణవ్రతోఽధీతే ।**
**నమః పరమఋషిభ్యః నమః పరమఋషిభ్యః ॥**

అంగిరసమహర్షి పూర్వకాలమందు సత్యమైనట్టి, ప్రసిద్ధమైన ఈ బ్రహ్మవిద్యను శౌనకునికొఱకు నుపదేశించెను ఈ బ్రహ్మవిద్యా ప్రతిపాదకమగు నుపనిషద్గ్రంధము నాచరింపబడని వ్రతము గలవాడు అధ్యయనము చేయుదగడు శ్రేష్ఠులును, బ్రహ్మవిద్యాప్రవర్తకులు నగు మహర్షులకు నమస్కారము

విశేషార్థము దీనియందు వ్రతము సలుపనివారు ఈ యుపనిషత్తును పఠించగూడదని తెలుపడమైనది కావున, వ్రతదీక్ష వహించి, గురుసదనమందుండి యుపనిషత్తులను పఠించి బ్రహ్మచింతనము చేయవలయును ఇట్లే ఆర్షకాలమున నుండెను

ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవాను డుపదేశించినది చూడుడు

**నావార్థీ హి భవేత్తావద్యావత్పారం న గచ్ఛతి ।**
**ఉత్తీర్ణే తు సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్॥**

ఎంతవఱకు నది ఆవలితీరమును చేరడో, అంతవరకు నదిని దాటుటకై యోడను కోరువాడగుచున్నాడు ఏరు దాటినమీదట నావ అవసరము లేదు

ఓహో, ఎంత సుందరమైన యుపదేశమును భగవానుడు చేసెను? ఓడ లేనిచో నదిని దాటజాలడు అలాగున బ్రహ్మవిద్యాభ్యాస మనెడునావ నవలంబించియే సంసారసాగరమును తరించవలసియుండును లేనిచో మొదటనే నదిని దాటుటకు నోడ దొరకనివాని గతియే గలుగును ఈత

నేర్చు కొనువానికి సొరకాయ బుఱ్ఱ లెంత యవసరమో, నేర్చుకొనిన తరువాత ఎట్లు అవసరము లేదో, ఆలాగున అజ్ఞానమును దాటువఱకు శాస్త్రజ్ఞాన ముండవలయును, ఏదైన నొకవిగ్రహమును పోతపోయ దలంచువానికి మొట్టమొదట కరువు (అచ్చు) ఎట్లవసరమో, పోతపోసిన తరువాత దానిని ఎట్లు తీసివేయుదురో, ఆలాగున ఆత్మనిష్ఠయందు నిరూఢత్వము గలుగు వఱకు శాస్త్రశ్రవణ, మనన, నిదిధ్యాసము లుండవలయును

అయితే నావ దృష్టాంతము సామాన్యమనియు, విశేషమనియు గలదు నదిని దాటి వెళ్ళువానికి మఱల నావతో పనిలేదు కాని, నదిని దాటించు నావికుడు నావను శిథిల మొనర్చడు ఏలనన, ఇతడు అనేకులను ఆనావతో దాటించ వలసినవాడై యుండును ఆలాగున తానుమాత్రము తరించిన చాలునని తలంచెడు సామాన్య బుద్ధిగలవాని కీయుపదేశము సరిపోవును లోకో ద్ధారకులగు మహాశయులు శాస్త్రములను, అనుష్ఠానములను దేహపతన పర్యంతము విడనాడరు

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః॥**

బుద్ధిమంతుడైనవాడు వేదాంతాది శాస్త్రముల నభ్యసించి గురు ముఖంబుగ విశేషజ్ఞానానుభవము నొందినమీదట, ధాన్యమును గ్రహింప దలంచినవాడు ధాన్యమును గ్రహించిన పిమ్మట, గడ్డిని వదలునట్లు శాస్త్రము లను వదలవచ్చును

విశేషార్థము అరటిచెట్లు మొదలగువాని కాయలు ముదురువఱకు చెట్లనే పోషించవలయును కాయలు పండిన తరువాత చెట్లను త్యజింతురు మొదటనే చెట్టు తినుట కుపయోగపడదని తలంచి యుపేక్షించిన ఫలమెట్లు గలుగును? ఆలాగున బ్రహ్మవిద్య నభ్యసించి బ్రహ్మప్రాప్తి గలిగిన తరువాత శాస్త్రమక్కర లేదు గాని మొదటనే త్యజించినచో జ్ఞానఫలమును

బొందజాలరు

**ఉల్కాహస్తో యథా కశ్చిద్ద్రవ్యమాలోక్య తాం త్యజేత్।**
**జ్ఞానేన జ్ఞేయమాలోక్య జ్ఞానం పశ్చాత్పరిత్యజేత్॥**

కొఱవికట్టె చేతగలవాడు చీకటిలోనుండు ద్రవ్యమును కనుగొని పిదప నెటుల దానిని వదలునో, యావిధంబున శాస్త్రజ్ఞాన సాధనముచే జ్ఞేయమైన బ్రహ్మసాక్షాత్కారము గల్గిన పిదప సాధనమైన శాస్త్రమును వదలవచ్చును

విశేషార్థము చీకటిగదిలోనుండు వస్తువును దీపముచే గ్రహించిన తరువాత దీపము అక్కఱలేదు గాని, మొదటనే దీపము అక్కఱలేదన్నచో కారు చీకటిగల గదిలో నున్న వస్తువునెట్లు గ్రహించగలుగును? ఆలాగున అవిద్యాంధకార నిబిడహృదయ గుహయందు గల ఆత్మను బ్రహ్మవిద్యా ప్రకాశముచే తెలిసికొనిన తరువాత శాస్త్రవిచారము అవసరము లేదు లేనిచో గదిలో కారుచీకటి గల వస్తువును తెలిసికొనలేనివాని గతియే సంభవించును

**తిలమధ్యే యథా తైలం క్షీరమధ్యే యథా ఘృతమ్ ।**
**పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః ।**
**కాష్ఠాగ్ని వత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్॥**

నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పుష్పము నందు సుగంధమువలెను, ఫలమునందు రసమువలెను, కట్టెయందు నిప్పువలెను, ఆకాశమునందు గాలివలెను అన్నమయాది పంచకోశవిశిష్టమైన దేహమునందు ఆత్మ వ్యాపకమై యున్నది

విశేషార్థము నువ్వులు లేనిచో నూనెయు, పాలు లేనిచో నేయియు, పుష్పములు లేనిచో అత్తరులు మొదలగు సుగంధములును, ఫలము లేనిచో మధుర రసమును,కట్టె లేనిచో అరణినుండి నిప్పును ఎట్లు సంపాదింప జాలమో ఆలాగున శాస్త్రవిచారణ లేనిచో ఆత్మజ్ఞానమును బొందజాలము కాలిలో గ్రుచ్చుకొనిన ముల్లును ఎట్లు మరియొక ముల్లుతోనే తీసివేయవలసి యుండునో, ఆలాగున అవిద్యాశూలము గ్రుచ్చుకొని తపించెడు జీవుడు

శాస్త్రమను శస్త్రముచేతనే దానిని తీసివేయవలసి యుండును ఈవిషయమై మఱియొక దృష్టాంతము తెలుపబడుచున్నది

**ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥**

మనకు పండ్లే కావలసి యున్నప్పటికిని పుష్పమునుండియే ఫలము ఉద్భవించును పుష్పమునకు వృక్ష మాధారము ఆలాగున ఆత్మజ్ఞానమే కావలసి యున్నప్పటికిని అది వేదాధ్యయనము, తపము మొదలగు ఆత్మ సాధనల వలననే గలుగును అట్లు అధ్యయనాది కార్యము లొనర్పక జ్ఞానముకొఱకు నిరీక్షించువాడు చెట్లను పెట్టి పోషింపక, ఫలమును గోరి కాలమును గడుపువానివహాడ్కె వ్యర్థజీవు డగును చెట్లను పెట్టి పోషించుచు వచ్చిన పుష్పవిషయమై, ఫలవిషయమై యే ప్రయత్నమును చేయకనే కాలమాసన్నమగు నపుడు స్వయముగానే ఫలించును బుద్ధిమంతులకు దీనికన్న మించిన యుపదేశ మక్కర లేదు

**జ్ఞానేన దీపితే దేహే బుద్ధిః బ్రహ్మసమన్వితా।**
**బ్రహ్మజ్ఞానాగ్నినా విద్వాన్నిర్దహేత్కర్మబంధనమ్॥**

విద్యావంతుడు ఆత్మజ్ఞానముచేత దేహము ప్రకాశింపబడుచుండ, నిశ్చయాత్మకమైన బుద్ధి బ్రహ్మముతో కూడిన దగుచుండగను, బ్రహ్మజ్ఞానమనెడి నిప్పుచేత కర్మమనెడి బంధమును దహించును

**ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్॥**

నాసికయొక్క అగ్రభాగమునందు మనస్సుతోగూడ క్షణముసేపైనను తత్త్వజ్ఞానార్థము నిశ్చలదృష్టిని నెవడుపొందునో, (నిలుపునో) అట్టివాడు నూర్లకొలది జన్మములనుండి యార్జింపబడిన పాపమును సమస్తమును దాటుచున్నాడు

**ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥**

శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము అను రెండుబ్రహ్మములను నెఱుంగ వలయును శబ్దబ్రహ్మమునందు సమర్థుడైనవాడు పరబ్రహ్మమును బొందుచున్నాడు

ఈ అర్థమునే అమృతబిందూపనిషత్తున్ను ఉపదేశించుచున్నది

**ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరం చ యత్।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥**

దీనియొక్క అర్థమున్ను పైజెప్పిన విధముగానే యుండును వివేక చూడామణియు నీ ధర్మమునే తెలుపుచున్నది

**మేధావీ పురుషో విద్వానూహాపోహవిచక్షణః।**
**అధికార్యాత్మవిద్యాయాముక్తలక్షణలక్షితః॥**

ఈ బ్రహ్మవిద్య విషయమై మేధాసంపన్నుడును, విద్యావంతుడును, యుక్తాయుక్తవిచక్షణ గలవాడును,సాధనచతుష్టయ సంపత్తి మొదలగు సుగుణములతో గూడినవాడు నగు పురుషుడే అధికారి యగును

**వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః।**
**ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా॥**

వివేకము, వైరాగ్యము, అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహము గలిగి మోక్షేచ్ఛగలవానికి మాత్రమే బ్రహ్మతత్త్వమును దెలిసికొను యోగ్యత అంగీకరింపబడినది శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతయందు 17–వ అధ్యాయమున త్రివిధ తపములను చెప్పినది చూడుడు

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే**

శాస్త్రమను శస్త్రముచేతనే దానిని తీసివేయవలసి యుండును ఈవిషయమై మఱియొక దృష్టాంతము తెలుపబడుచున్నది

**ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥**

మనకు పండ్లే కావలసి యున్నప్పటికిని పుష్పమునుండియే ఫలము ఉద్భవించును పుష్పమునకు వృక్ష మాధారము అలాగున ఆత్మజ్ఞానమే కావలసి యున్నప్పటికిని అది వేదాధ్యయనము, తపము మొదలగు ఆత్మ సాధనల వలననే గలుగును అట్లు అధ్యయనాది కార్యము లొనర్పక జ్ఞానముకొఱకు నిరీక్షించువాడు చెట్లను పెట్టి పోషింపక, ఫలమును గోరి కాలమును గడుపు వానివాడ్కి వ్యర్థజీవు డగును చెట్లను పెట్టి పోషించుచు వచ్చిన పుష్పవిషయమై, ఫలవిషయమై యే ప్రయత్నమును చేయకనే కాలమాసన్న మగు నపుడు స్వయముగానే ఫలించును బుద్ధిమంతులకు దీనికన్న మించిన యుపదేశ మక్కర లేదు

**జ్ఞానేన దీపితే దేహే బుద్ధిః బ్రహ్మసమన్వితా।**
**బ్రహ్మజ్ఞానాగ్నినా విద్వాన్నిర్దహేత్కర్మబంధనమ్॥**

విద్యావంతుడు ఆత్మజ్ఞానముచేత దేహము ప్రకాశింపబడుచుండ, నిశ్చయాత్మకమైన బుద్ధి బ్రహ్మముతో కూడిన దగుచుండగను, బ్రహ్మజ్ఞాన మనెడి నిప్పుచేత కర్మమనెడి బంధమును దహించును

**ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్॥**

నాసికయొక్క అగ్రభాగమునందు మనస్సుతోగూడ క్షణముసేపైనను తత్త్వజ్ఞానార్థము నిశ్చలదృష్టిని నెవడుపొందునో, (నిలుపునో) అట్టివాడు నూర్లకొలది జన్మములనుండి యార్జింపబడిన పాపమును సమస్తమును దాటుచున్నాడు

గలిగినవాడై, యలసట మాని, ప్రణవాది జపమును, అగ్నికార్యమును, గురుసేవ మొదలగు సత్కర్మములను నెల్లప్పుడును జేయుచుండువాడే బ్రహ్మతత్త్వము నెఱుంగ గలుగును

**వేదాభ్యాసేన సతతం శౌచేన తపసైవ చ।**
**అద్రోహేణ చ భూతానాం జాతిం స్మరతి పౌర్వికీమ్॥**
**పౌర్వికీం సంస్మరన్ జాతిం బ్రహ్మైవాభ్యసతే పునః।**
**బ్రహ్మాభ్యాసేన చాజస్రమనంతం సుఖమశ్నుతే॥**

ఎల్లప్పుడు వేదముల అధ్యయనముచేతను, ఆచారముచేతను, తపస్సు చేతను, భూతములయెడల ద్రోహము చేయమిచేతను, జన్మాంతరముల నన్నింటి నెఱిగి, యచ్చట సుఖదుఃఖములను జ్ఞప్తికి దెచ్చుకొని శ్రవణ, మనన, నిదిధ్యాసములచే బరమాత్మను జింతించుచు నెడతెగని బ్రహ్మసాక్షాత్కారముచే ననంతసుఖము నొందుచున్నాడు

**వేదాభ్యాసోఽన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియా క్షమా।**
**నాశయన్త్యాశు పాపాని మహాపాతకజాన్యపి॥**

శక్తికొలది దినదినము బ్రహ్మవిద్యాభ్యాసము చేయుట, అతిథిసేవ మొదలగునవి చేయుట, కష్టముల కోర్చుట అనునవి మహాపాతకముల వలనను, ఉపపాతకములవలనను గలిగెడు కష్టముల నన్నిటిని శీఘ్రమే నశింప జేయుచున్నవి

**యథైధస్తేజసా వహ్నిః ప్రాప్తం నిర్దహతి క్షణాత్।**
**తథా జ్ఞానాగ్నినా పాపం సర్వం దహతి వేదవిత్॥**

అగ్ని యేలాగున దాపున నున్న కట్టెల నెల్ల క్షణములో దహించునో, ఆలాగున జ్ఞానమనెడి అగ్నిచేత బ్రహ్మవిద్యాభ్యాసకుడు సకల పాపములను దహించును

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే॥**

తపస్సు, బ్రహ్మజ్ఞానమున్ను విప్రునకు మిక్కిలి మేలొసంగును తపస్సుచే చేసిన పాపము పోవును, బ్రహ్మజ్ఞానముచే మోక్షము నొందుననుట శ్రుత్యర్థమే వివరించుచున్నది

**యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్ ॥**

ద్విజుడు శాస్త్రవిహితములగు నగ్నిహోత్రాది సర్వకర్మలను బరిత్యజించియైనను, పరమాత్మచింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము, ఉపనిషదాది బ్రహ్మవిద్యాపరనము–వీనియందే ప్రయత్నపరుడై యుండవలయును

విశేషార్థము బాహ్యకర్మల నన్నిటిని జేయకపోయినను ఉపనిషత్పరనము, ప్రణవజపము, బ్రహ్మచింతనము, ఇంద్రియనిగ్రహ మైనను తప్పక చేయవలయును

**ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః।**
**ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా॥**

ఈ ఆత్మజ్ఞాన వేదాభ్యాసాదులే ముఖ్యముగ బ్రహ్మనిష్ఠునకు జన్మసాఫల్యహేతువులు ఏలయన, ద్విజుడు బ్రహ్మజ్ఞానవేదాదుల నభ్యసించి జన్మసాఫల్యము నొందునుగాని, ప్రకారాంతరమున గృతార్థుడు గానేరడు

**యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః।**
**యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥**

కొయ్యచే చేయబడిన యేనుగు, తొలుతో జేసిన మృగము, అధ్యయనము చేయని విప్రుడు, (సన్న్యాసియును)– వీరు ముగ్గురును నామమాత్రధారులే గాని, ఆ నామానుసారముగ గార్యములను జేయజాలరు

ఓమ్ తత్సత్ ఓమ్



# రెండవభాగము

## పరిణామమార్గము

ఈ పరిణామమార్గము గుణపరిణామ మనియు, స్వరూప పరిణామ మనియు రెండు విధముల గ్రహించదగినది గుణపరిణామము సామాన్య మనియు, స్వరూప పరిణామము విశేషమనియు గ్రహించవలయును గుణ పరిణామము సామాన్యమగు తపముచేతను, దైవభక్తిచేతను, ప్రాణా యామము చేతను కలుగును స్వరూప పరిణామము గొప్పతపస్సుచేతను, మహాయోగ సిద్ధిచేతను లేక గొప్పఋషుల నిగ్రహానుగ్రహములచేత మాత్రమే గలుగును ఈ గుణపరిణామముగూడ స్థూలమనియు, సూక్ష్మమనియు లేక కాయికమనియు, మానసికమనియు భిన్నభిన్నముగా నున్నదని గ్రహించు కొనదగును

మేహాది రోగములచేత రక్తములోగల చెడు అణువులచే శరీరము రోగగ్రస్తముగా మారునపుడు దివ్యౌషధములచేతను, చక్కని పథ్యముచేతను చెడు రక్తము మారిపోయి శుద్ధమై రక్తాణువులు పరిశుద్ధములై ఆరోగ్యము గలుగును ఇది కాయికమగు మార్పని తెలియవలెను ఆలాగున క్రూరత్వము, పాపబుద్ధి మొదలగు దుష్టగుణములతో చెడిన మనస్సు మైత్రి, కరుణ, ముదితాదులచే శుద్ధమై మారవలయును మఱల అవిద్యక మగు అనాత్మభావన, మూలావిద్యచే గలిగిన దేహాత్మభావమున్ను దైవభావన చేతను, బ్రహ్మచింతనచేతను, మహావాక్యశ్రవణపరమగు ఆత్మభావనచేతను మార్పు చెందవలయును ఈ మానసిక, ఆత్మీయములైన మార్పులు రెండును అంతరంగపరిణామమని గ్రహించుకొనవలయును

ఇక స్థూలదేహము శుద్ధమై యుండువాడైనను, యోగాభ్యాసాది తపస్సులచే దేహమును శుద్ధాత్మయుతముగ మార్చును ఇట్టివారు సిద్ధ పురుషులు ఇది అందఱికిని సాధ్యమైనది కాదు జీవన్ముక్తికిన్నీ అవసరము లేదు అణిమాద్యష్టసిద్ధులను గోరువారికి మాత్రమే యుపయోగపడును లేత్రాయములో మామిడికాయ మొదలైనవి చేదు వగరు గలవై యున్నప్పటి

కిన్ని, కొంత ముదురునప్పుడు పులుపుగా పరిణామమునుబొంది, మఱల పండగునప్పుడు మధురరసముగా మారును ఇదే గుణపరిణామ మన బడును ఆకు పచ్చరంగుగల కాయ పచ్చని రంగు గలదిగాను,పండ్లు ఎఱ్ఱని రంగు గలవిగాను మారుచుండును ఇదంతయు గుణపరిణామములో జేరినది

స్వరూప పరిణామము గొప్ప తపోబలముచేతనే కలుగవలసి యుండునని ముందు చెప్పడమైనది ఇది ఒక జంతువు మరియొక జీవిగా మారుట యగును కీటక మేలాగున భ్రమరముగా మారుచుండునో, పరుసవేదిచే ఇనుమేలాగున సువర్ణముగా మారుచుండునో, యా స్వరూప పరిణామము గూడ నీలాగున నుండును ఒకే జన్మమందే నహుష మహారాజు దేవతలకు అధిపతియై ఇంద్రుడయ్యెను ఆ జన్మమందే తనయొక్క దుష్ట ప్రవర్తనవలన అగస్త్యాది మహర్షుల శాపాగ్నివలన అజగరముగా పరిణమించి భూలోకములో పడిపోయెను ఇదే స్వరూప పరిణామమని గ్రహించుకొన వలయును ఆలాగున పట్టుపురుగు ముందుగ కంబళిపురుగుగ నుండి మఱల సంజీవిపురుగుగా మారుచుండును ఇదియును స్వరూప పరిణామ నియే తెలిసికొనవలసియున్నది పురుషప్రయత్నముచే నీలాటి మార్పును మనము తెలిసికొనినమాత్రమే నిమ్నజాతియందుండువాడుగూడ నున్నత జాతిలోనికి రాగలుగును రావచ్చునని ధైర్యముగూడ నతనికి నుదయ మగును

సాధారణముగా సంఘసంస్కారమనియు, శుద్ధిసంఘ మనియు ననబడినవి ఈ మార్గములో చేరినవే విశ్వామిత్రుడు క్షత్రియ వంశమున జన్మించినను తపస్సుచేత బ్రాహ్మణుడైనట్లు శాస్త్రములలో కనబడుచున్నది అయితే పై జెప్పిన పరిణామము మనుష్యులలో శూద్రులు, వైశ్యులు, క్షత్రియులు, ఆదిమనివాసులు బ్రాహ్మణత్వము నొందుటకు అవసరము లేదు ఏలనన, అంత్యజాతినుండి అగ్రజాతివరకు గల మనుష్యజాతు లన్నియు ఒకే జాతిగానే యుంటున్నవి ఏలనన రంగులోను, ఆకారములోను, మేధాసంపత్తి యందును, జననమరణములలోను,

శుక్లశోణితములలోను, మలమూత్ర ములలోను అందఱు ఒకేవిధముగానే యున్నారు

ఇచట చిరకాలమునుండి ఏర్పడిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిమ్నజాతులనునవి భావముచే నేర్పడినవేగాని, వస్తుతః లేవు వస్తుతః యుండినచో అజ, అశ్వ, గజ, గోవులకువలె భేదముండును ఆలాగున, శుక, పిక, మయూరాదులవలెను సృష్టిలోనే నేవిభాగ మేర్పడియుండును ఆలాగున ఆమ్ర, పనస, నారింజ మొదలగు వృక్షములవలె కూడ భేదముండును ఆలాటి దేదియు మనుష్యజన్మలో కన్పించుట లేదు అయితే సత్త్వరజస్తమో గుణాదులచేతను–సత్య, ధర్మ, తపస్సులచేతను భేదము గలదు ఇది బ్రాహ్మణుల కైనను, అంత్యజాలకైనను సమాన ధర్మము బ్రహ్మప్రాప్తి నొందవలసి యుండిన బ్రాహ్మణుడైనను, బ్రాహణేతరుడైనను, రజస్తమోగుణములను పరిత్యజించి, సత్త్వగుణములో నిలిచి, తపస్స్వాధ్యాయములచే ఆత్మశుద్ధి గలిగి మూడు గుణములకు పైనుండు జ్ఞేయమగు ఆత్మను (ఈశ్వరత్వమును) పొందవలసియుండును

చిరకాలమునుండి పైజెప్పిన నాలుగు వర్ణములతోను, చతురాశ్రమము లతోను గూడినవాడే తానని తలంచుచుండినను, ఆ తలంపును మాత్రము అటుంచి బ్రహ్మబోధకులు తమభావమును మార్పుజేసికొనుట దగును అపుడు బ్రహ్మప్రాప్తికొఱకు నెట్టి బ్రాహ్మణధర్మము అనుష్ఠించవలయునో, అట్టి ఆచరణగలిగి యుండవలయునని అతనికే బోధ కలుగును అప్పుడు శ్రుతియందు నెట్టి లక్షణము గలవాడు బ్రాహ్మణుడని నిరూపింపబడినదో అట్టి నియమమును అవలంబించిన మాత్రమే బ్రాహ్మణత్వము గలుగునని అతనికి గోచరమగును అట్లు గానిచో రజోగుణముండిన క్షత్రియత్వము మిశ్రగుణముండిన వైశ్యత్వము, తమోగుణముండిన శూద్రత్వము, పాపగుణ ముండిన అంత్యజాతిత్వమున్ను కలుగునని అతడు ఎఱుగ గలుగును ఇచట భావమున మార్పు గలిగిన చాలును అయితే ఆకలితో నుండువాడు భోజనము చేయకనే తాను తృప్తిగా భుజించినట్లు ఎట్లు భావన

కిన్ని, కొంత ముదురునప్పుడు పులుపుగా పరిణామమునుబొంది, మఱల పండగునప్పుడు మధురరసముగా మారును ఇదే గుణపరిణామ మన బడును ఆకు పచ్చరంగుగల కాయ పచ్చని రంగు గలదిగాను,పండ్లు ఎఱ్ఱని రంగు గలవిగాను మారుచుండును ఇదంతయు గుణపరిణామములో జేరినది

స్వరూప పరిణామము గొప్ప తపోబలముచేతనే కలుగవలసి యుండునని ముందు చెప్పడమైనది ఇది ఒక జంతువు మరియొక జీవిగా మారుట యగును కీటక మేలాగున భ్రమరముగా మారుచుండునో, పరుసవేదిచే ఇనుమేలాగున సువర్ణముగా మారుచుండునో, యా స్వరూప పరిణామము గూడ నీలాగున నుండును ఒకే జన్మమందే నహుష మహారాజు దేవతలకు అధిపతియై ఇంద్రుడయ్యెను ఆ జన్మమందే తనయొక్క దుష్ట ప్రవర్తనవలన అగస్త్యాది మహర్షుల శాపాగ్నివలన అజగరముగా పరిణమించి భూలోకములో పడిపోయెను ఇదే స్వరూప పరిణామమని గ్రహించుకొన వలయును ఆలాగున పట్టుపురుగు ముందుగ కంబళిపురుగుగ నుండి మఱల సంజీవిపురుగుగా మారుచుండును ఇదియును స్వరూప పరిణామ నియే తెలిసికొనవలసియున్నది పురుషప్రయత్నముచే నీలాటి మార్పును మనము తెలిసికొనినమాత్రమే నిమ్నజాతియందుండువాడుగూడ నున్నత జాతిలోనికి రాగలుగును రావచ్చునని ధైర్యముగూడ నతనికి నుదయ మగును

సాధారణముగా సంఘసంస్కారమనియు, శుద్ధిసంఘ మనియు ననబడినవి ఈ మార్గములో చేరినవే విశ్వామిత్రుడు క్షత్రియ వంశమున జన్మించినను తపస్సుచేత బ్రాహ్మణుడైనట్లు శాస్త్రములలో కనబడుచున్నది అయితే పై జెప్పిన పరిణామము మనుష్యులలో శూద్రులు, వైశ్యులు, క్షత్రియులు, ఆదిమనివాసులు బ్రాహ్మణత్వము నొందుటకు అవసరము లేదు ఏలనన, అంత్యజాతినుండి అగ్రజాతివరకు గల మనుష్యజాతు లన్నియు ఒకే జాతిగానే యుంటున్నవి ఏలనన రంగులోను, ఆకారములోను, మేధాసంపత్తి యందును, జననమరణములలోను,

కేవలము మూఢమనస్సైనచో బొత్తిగ జ్ఞానముండదు ఈ పరిణామము కలుగుట కుపాయమును చెప్పుచున్నారు

**జన్మౌషధి మంత్రతపస్సమాధిజాస్సిద్ధయః॥**

జన్మములు, మూలికలు, మంత్రములు, తపస్సులు, సమాధులు - వీనివలన బుట్టినట్టి సమాధి సిద్ధులు ఐదు విధములుగా నున్నవి

విశేషార్ధము సమాధిసిద్ధులు అనగా పరిణామములు జన్మము వలనను, కల్పసేవనమువలనను, మంత్రజపమువలనను, తపమువలనను, యమాద్యష్టాంగయోగమును శీలించుటవలనను గలుగును 1 కపిలాది ఋషులు జన్మముచేతను, 2 కల్పసేవనవలన మాండవ్యాది ఋషులును, 3 మంత్రజపమువలన నారదవామదేవాదులును 4 తపస్సువలన విశ్వామిత్రాదులును, 5 యోగసమాధులను శీలించుటవలన మత్స్యేంద్రాది యోగులును పూర్వముగల శారీరక మానసిక అణువులను మార్చి దివ్యశరీరు లైరి

**తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్॥**

ప్రాకృత విషయము లన్నిటిలోను వైరాగ్యము కలుగుటవలన, రాగద్వేషాది క్లేశములకు కారణమైన దోషబీజములు నశించుటవలన మోక్షము గలుగును ఈ బీజములకే సంస్కారములనియు, కర్మలనియు, గుణములనియు, స్వభావములనియు, వృత్తులనియు పేర్లని గ్రహించుకొనవలయును అగ్నియందు హోమించిన నవధాన్యములు భస్మములై పోవుటవలన మఱల నెట్లు అంకురింపవో, అట్లు జ్ఞానాగ్నియందు దహింపబడిన సంస్కారములు గల యోగి పునర్జన్మము నొందడు ఇందువలన గుణములతో, వృత్తులతో మాకేమి సంబంధము? మనస్సు ప్రధానమని చెప్పెడు కుయోగుల స్థితిని తెలిసికొనవచ్చును

**నిమిత్తమప్రయోజకం ప్రకృతీనామ్ ।**
**వరణభేదస్తు తతః క్షేత్రికవత్ ॥**

కర్మము ప్రకృతిభాగములయొక్క కారణ మగుటచేత జాత్యంతర

పరిణామమును పొందుటకును, కైవల్యప్రాప్తికిని అడ్డముగ నుండును ఎట్లన కృషిచేయువాడు పొలములోనికి వచ్చెడు నీళ్ళు పారుటకు తూములోగల నడ్డమును తొలగించిన జలమెట్లు స్వయముగ అప్రయత్నముగ మడిలోనికి ప్రవహించునో, ఆలాగున జ్ఞానమున కడ్డముగ గల గుణమును దొలగించిన అది స్వయముగానే ప్రవహించుచుండును కావుననే ''క్షేత్రికవత్'' అని చెప్పిరి దీనికి మఱియొక అర్థముగూడ గలదు వ్యవసాయమును చేయువారు భూమియందు విత్తనముల నేలాగున మార్చి మార్చి విత్తి పండింతురో, హృదయక్షేత్రముయొక్క పరిణామమున్ను ఆలాగున నుండును హృదయభూమి యేదో యొకరకమైన పైరుమాత్రము పండే భూమివంటిది కాదు, సర్వవిధ బీజములు పండుచుండెడు భూమివంటిది

**యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రావివేకఖ్యాతేః॥**

యోగాంగానుష్ఠానమువలన కలుగునట్టి చిత్తసాత్త్విక పరిణామ రూపమైన బుద్ధియొక్క ప్రకాశముచేత క్లేశరూపములైన చిత్తమలములు పోయి వివేకఖ్యాతి గలుగుచున్నది

విశేషార్థము, మసిగల చిమ్నీని శుద్ధముగ తుడిచినచో నెట్లు కాంతి ప్రస రించునో, యోగసాధనచే చిత్తమలము నశించిన వానియొక్క ఆత్మజ్ఞాన మవ్వి ధమున ప్రకాశించును

**సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః॥**

యోగసాధనలవలన పరిణామము కలుగునపు డొకవేళ నీ జన్మమున ముక్తి గలుగక పోయినను, ఉత్తమజాతియు, పూర్ణాయుర్దాయము, కావలసిన సుఖసాధనములు గలుగుచున్నవి

మఱియొక అర్థము – పూర్వజన్మకర్మల ననుసరించియే వర్తమాన కాలమున జీవులకు ఉచ్చనీచజాతియు, దీర్ఘాల్పాయుర్దాయము, నింద్రియ పూర్ణాపూర్ణత్వము, సుఖదుఃఖభోగములు గలుగుచుండును కావున కర్మవిషయములో మిక్కిలి జాగ్రత్త గలిగియుండుడు

**వీతరాగవిషయం వా చిత్తమ్ ॥**

దృశ్యవృత్తులును, దృశ్యభావనలును, దృశ్యసంకల్పములును లేని చిత్తము సమాధియందు గాలిలేని స్థలములో నుంచిన దీపమువలె నిశ్చలత్వము గలిగియుండును ఇట్టి చిత్తమే బ్రహ్మానుభవము కలుగుటకు దగియుండును ఈ సత్యమెఱింగిన, ధ్యానములో మనస్సునకు నిశ్చలత్వము కలుగలేదని చెప్పెడు వారికి సంశయము తొలగును

**స తు దీర్ఘకాలనైరన్తర్యసత్కారాసేవితో దృఢభూమిః॥**

ఆ ధ్యానాభ్యాసము బహుకాలమువరకు నెడతెగక ఆదరాతిశయముతో సేవింపబడిన యెడల దృఢమైనదశ, స్థిరమైన అవస్థ కలుగును

విశేషార్థము బ్రహ్మచర్యము, తపస్సు, సత్ప్రవర్తనము, అపరిగ్రహము మొదలగు శుద్ధప్రవృత్తి గలిగి, అలసట లేక కొంతకాలము అభ్యసించుచు వచ్చినచో తన చిత్తము, ధ్యానమునందు దార్ఢ్యము కలదగును

**అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః ॥**

అభ్యాసవైరాగ్యములచేత చిత్తవృత్తులను నిరోధించుటవలన మనోనిగ్రహము కలుగును అనగా దృఢభూమి సిద్ధించును

శ్రీకృష్ణభగవానుడు గీత ఆఱవ అధ్యాయమున నీ తత్త్వమునే యుపదేశించెను

**అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥**

**సత్త్వపురుషయో శ్శుద్ధిసామ్యే కైవల్యమ్॥**

సత్త్వమునకును (బుద్ధికిని), పురుషునకును నిర్మలత్వము ఏక కాలమునందు కలుగుటయే కైవల్యము

విశేషార్థము చిత్తములోగల రజస్తమఃసత్త్వాణువులు (అనగ)

గుణములు నశించి, విశుద్ధసత్త్వము గలుగునపుడు జీవునియందుగల మాయాకల్పితమగు కర్తృత్వాద్యభిమానములు నశించునపుడే కైవల్యప్రాప్తి గలుగును ఈ రెండు మార్పులు నేకకాలముననే గలుగవలయును దీనివలన దేహమునకును, ఆత్మకు నేమి సంబంధమని చెప్పెడు శుష్క వేదాంతుల భావమెటువంటిదో విజ్ఞులు తెలిసికొందురుగాక! నూనెలో నూనెయు, జలములో జలమును కలియునేగాని ఒకదానిలో మరియొకటి కలియదు ఆలాగున శుద్ధబ్రహ్మమందు ఐక్యము కావలసియుండిన జీవుడుకూడ బ్రహ్మమువలె శుద్ధుడు కావలయును ఇతర శాస్త్రములు నిట్టిదమననే చెప్పుచున్నవి

**యథా జలం జలే క్షిప్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతమ్ ।**
**అవిశేషో భవేత్తద్వజ్జీవాత్మపరమాత్మనోః ॥**

**సర్వార్థైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః ॥**

అనేక విషయములయందు పరిణమించు చిత్తధర్మము సర్వార్థత యనబడుచున్నది ఒకే విషయమునందు పరిణమించు చిత్తధర్మము ఏకాగ్రత యనబడుచున్నది సర్వార్థతా పరిణామముయొక్క లయమును, ఏకాగ్రతా పరిణామముయొక్క యుదయమును కలుగుచుండగ సమాధి పరిణామమని చెప్పబడుచున్నది

గీత రెండవ అధ్యాయమందును శ్రీకృష్ణ భగవాను డిట్లే యుపదేశించెను

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥**

**తతః క్షీయతే ప్రకాశావరణమ్॥**

ప్రాణాయామాది యోగ మభ్యసించుటవలన, నాత్మయం దావరించి యుండు మాలిన్యము (వరణము) నశించును

చిత్తమునందు దుష్టాణువు లుండుటచేతనే పాపకర్మములను జేయుటకు ప్రేరేపించుచుండును భూమియందు బీజములు కనబడక యుండినను వర్షము కురియునపు డెట్లంకురించునో, ఆలాగున మనస్సు నందు పూర్వజన్మ సంస్కారములు కనపడక పోయినను, తదనుగుణముగ పరిణమించునపుడు గుణము లావిర్భవించుచుండినచో, నట్టి సంస్కారము లింకను నశించలేదని తెలిసికొనవలయును

**కాయేన్ద్రియసిద్ధి రశుద్ధిక్షయాత్తపసః ॥**

తపస్సుచేయుటవలన చిత్తమునందలి మాలిన్యము తొలగుచున్నది అందువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకును, మనస్సునకును అద్భు తములగు దివ్యశక్తులు గలుగుచున్నవి ఇది రోగియైన వానియొక్క రోగము ఔషధసేవచే నశించినపుడు గలిగెడు శక్తివంటిదగును

**సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్ ॥**

పరమేశ్వరేనియం దతిశయమైన భక్తిచేయుటవలన సమాధిలాభము కలుగును

ఒకవేళ యోగము తపస్సును చేయ శక్తిలేకపోయినను విషయవిరక్తిగలిగిన నిర్మల మనస్సుతో సర్వేశ్వరునియందు తదేక ధ్యానమనెడి పరమభక్తి గలిగి యోగులకువలెను తాపసులకుండవలెను ఆత్మశుద్ధి పరిణామము కలుగు చుండును

**సదా జ్ఞాతా శ్చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామాత్ ॥**

ఆ చిత్తముయొక్క యధిపతియైన చిన్మాత్రుడగు పురుషునకు పరిణా మము లేనందువలన చిత్తముయొక్క వృత్తులు నిరంతరమును దెలియ బడినవిగ నున్నవి

ఆత్మస్వప్రకాశుడై పరిణామ రహితుడై సదా యుండుటవలననే ఆ చిత్తవృత్తులను అనగా మనస్సుయొక్క మార్పులను సదా చూచుచున్నాడు

ఇది చిత్తముయొక్క ఆవరణమును దాటిపోయిన యోగి మాత్రమే తెలిసికొనుటకు శక్తిగలవాడుగ నుండును

**తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తిర్గుణానామ్ ॥**

అట్టి స్వప్రకాశబోధమగు జ్ఞానము కలిగిన యనంతరము సత్వాది గుణములయొక్క, మోక్షమువఱకును గలుగు అనులోమవిలోమ పరిణామములయొక్క సమాప్తి గలుగచున్నది ఇట్టి హృదయములో గల గుణములన్నియు నశించినపుడు చిత్తము పరమపదమందు విశ్రాంతి నొందుచున్నది ఇదియే సమాధి యనబడును

**పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవే కైవల్యం స్వరూపాప్రతిష్ఠా వా చితిశక్తిరితి ॥**

భోగ మోక్ష రూపములైన పురుషార్థములు గల సత్వాది త్రిగుణముల యొక్క పునరావృత్తి లేని విలోమ పరిణామముయొక్క పరిసమాప్తిగాని, లేక పురుషుని యందుండు చిత్ప్రకాశము స్వస్వరూపమైన సచ్చిదానంద మయాఖండపరిపూర్ణమైన పరబ్రహ్మమందు నెలకొనుటగాని కైవల్యమనబడుచున్నది

మేఘము లేని శుద్ధాకాశమందు శరత్కాల పూర్ణిమనాటి యర్ధరాత్రులలో పూర్ణచంద్రు డేలాగున ప్రకాశవంతుడై చల్లదనము గలిగియుండునో, వసంతకాలమున శుద్ధాకాశమధ్యమున మధ్యాహ్నకాల సూర్యుడెట్లు ప్రకాశించుచుండునో, అట్టి యవస్థయే హృదయాకాశమందలి యాత్మప్రబోధమందు సమాధిజ్ఞానము కలుగుటయని సాధకులు గ్రహించుకొనవలయును శ్రీపతంజలిమహర్షి రచించిన యోగసూత్రములనుండి కొన్ని సూత్రము లిచ్చుట నిరూపించడమైనది ఇవి ముముక్షువుల కెంతయు నుపయోగకరమని తలంచెదము, ఈ విషయమున శ్రీకృష్ణభగవానుడు షష్ఠాధ్యాయమున నుపదేశించినదియు గమనింపదగును

**యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।**

**యోగినో యతచిత్తస్య యజ్ఞతో యోగమాత్మనః॥**

పరిణామమును గురించి తెలిసికొనదగిన వానిని తెలుపడ మయినది ఇదే మానవులను ఊర్ధ్వగతికి తీసికొని వెళ్ళును ఇది తెలియకపోయిన మీజాతి ఆలాగున నున్నది, మీ జన్మ మాలాగున నున్నది, మీకర్మ మాలాగున నున్నదని చెప్పుచు శాస్త్రము మాత్రము చదువుకొనినవారు జనులను దుఃఖములనుండి తరింపజేయు నుపాయమును దెలుపక, పాపకర్మయందే పడియుండులాగున జేసి సదా క్లేశమును పొందులాగున జేయుదురు పరిణామముచే గలిగిన మార్పును గుఱించి ఇదివరలో కొంత తెలుపడ మైనది పాలు ఏలాగున పెరుగుగ పరిణామమును పొందునో, చెఱకురస మేలాగున పులుపుగా మారి సారాయి చేయుటకొఱకు కల్లుగా మారునో, పరిణామముయొక్క స్థితియు నాలాగున నుండును మఱియు, ప్రయత్నముచే బెల్లమేలాగున పంచదారగ మారునో (యిదియు పరిణామఫలమని తెలిసికొనవలయును ), ఆలాగున అంత్యజాతి యందుండు వాడైనను, చక్కని పరిణామమువలన అగ్రజాతిగ మారునని మనువుగూడ నుపదేశించెను

**శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।**
**క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ॥**

ఉత్కృష్టమైన కర్మలవలన శూద్రుడు బ్రాహ్మణత్వ మొందును నికృష్టమైన కర్మలవలన బ్రాహ్మణుడైనను శూద్రత్వము నొందును ఈలాగు ననే క్షత్రియులను గూర్చియు, వైశ్యులను గూర్చియు గ్రహించు కొనవలయును

ఇట్టి పరిణామమును గుఱించియే యిదివరలో మీకు తెలుపడమైనది ఇంకను మీకు ధైర్యము కలుగుటకు ఆత్మపరిణామములో ప్రయత్నము కలు గజేయుటకు కొన్ని శాస్త్రములను తెలిపెదను శాస్త్రవాక్యము లుండిన మాత్రమే నమ్మెడు స్వభావ మొకటి అనాదికాలమునుండి దృఢముగ నాటి యున్నది తక్కిన యుక్తులును, దృష్టాంతములు నెన్ని చెప్పినను నమ్మెడు

స్వభావము మనలో చాలమందికి లేదనియే చెప్పవచ్చును ఒకవేళ శాస్త్రవాక్యములను నమ్మెడు స్వభావము మంచిదైనను, ఆ శాస్త్రముల నెవరు రచియించిరి? ఎప్పుడు రచయించిరి? దేనికొఱకు రచియించిరి? అని ఇంతమాత్రమైన విమర్శనబుద్ధి గలిగియుండుట మంచిది

అట్లు గాక, సంస్కృతములోని యొకశ్లోకము చెప్పినచో అంధవిశ్వాస ముతో దానినే పరమార్థమని నమ్ము స్వభావము మంచిది కాదు ఆశ్లోకము ఏగ్రంథములోనిది? ఏ సమయమును గుఱించి, యే యవస్థను గుఱించి చెప్పబడెనో, దానినైనా తెలిసికొనేలాగున చూడవలయును పాశ్చాత్యుల కును, మనకును గల భేదమిదియే వారొక శ్లోకమును చెప్పినంత మాత్ర మున నమ్మరు అది దృష్టాంత రూపముగ చూపిన మాత్రమే నమ్మెదరు ఈలాగున తెలిసికొనుటకు కొంత సంస్కృతజ్ఞాన ముండవలెను ఏలనన మన విజ్ఞానమంతయు సంస్కృతభాషయందే గలదు అట్టి సంస్కృతజ్ఞానము విరివిగా అందఱికిని లేకపోవుటచేతనే యీ భారతదేశ మింత అధఃపతన మొందినది ఈ మహామోహమునుండి జనుల నుద్ధరింప జేయువలసి యుండిన, సంస్కృతజ్ఞానము అందఱికిని గలిగే లాగున జేయ వలయును ఇక పరిణామమును గూర్చి శాస్త్రము చెప్పినది చూడుడు

**అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్ ।**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం కతకరేణువత్ ॥**

అజ్ఞానముచే కలుషరూపుడైన జీవుడు బ్రహ్మజ్ఞానాభ్యాసముచే శుద్ధు డగుచున్నాడు ఎట్లన చిల్లగింజ నరుగదీసిన గంధము బురదనీటిని పరిశుద్ధముగా జేసి తాను తనరూపము కనపడకుండ నేలాగున దానియందు కలిసి పోవుచున్నదో, ఆలాగే జ్ఞానమున్ను ఆత్మయందు లీనమైపోవుచున్నది ఇది శ్రీశంకరభగవత్పాదులు ఆత్మశుద్ధిని గుఱించి చేసిన యుపదేశము

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా।**
**స్వభావస్సచ్చిదానందనిత్యనిర్మలతాఽఽత్మనః॥**

సూర్యునికి ప్రకాశము, నీళ్లకు చల్లదనము, అగ్నికి ఉష్ణత్వమున్ను స్వతస్సిద్ధమైన స్వరూపమైనట్లు, ఆత్మకును సత్తు, చిత్తు, ఆనందము, నిత్య నిర్మలత్వాదులే స్వరూపమని తెలిసికొనవలయును ఇట్టి ఆత్మయొక్క స్వరూపమును మరచిపోయి, ఇది నాజాతి స్వభావము, నా ఆశ్రమ స్వభావము, నా దేశస్వభావము, నా వాక్స్వభావము, నా మనస్సుయొక్క స్వభావము'' అని యీలాగున అనాత్మక దేహాదులను గుఱించి స్వభావ మని గొప్పగ జనులు చెప్పుచుందురు ఇదంతయు అనాత్మ స్వభావమని తెలిసికొనుట లేదు ఇది అస్వభావమనియు, దుస్స్వభావమనియు గ్రహించి ఆత్మయొక్క స్వరూపము సచ్చిదానందమని తెలిసికొనిన, అందరి ఆత్మలును నాలాగున నుండునను జ్ఞానము కలుగును, అప్పుడు మాత్రమే యుపన్యాస వేదికపై నెక్కి గంభీరముగ గర్జించు ''నా సోదరీ సోదరులారా'' అను వాక్య మర్థవంత మగును

**నిత్యశుద్ధవిముక్తైకమఖండానందమద్వయమ్ ।**
**సత్యం జ్ఞానమనన్తం యత్పరం బ్రహ్మాహమేవ తత్ ॥**

ఎల్లప్పుడు పరిశుద్ధముగాను, మోక్షస్వరూపముగాను, ఏకముగాను, అఖండముగాను, ఆనందస్వరూపముగాను, అద్వైతముగాను, సత్యస్వరూపముగాను ఏది గలదో, అట్టి పరబ్రహ్మమే తన ఆత్మగా నుండునని తలచి ధ్యానమును జేయవలయును ఇదే తనయొక్క స్వరూప మగును తక్కిన పైజెప్పిన స్వభావము లన్నియు తన్ను మరచి తననీడయే తానని తలంచినట్లుండును

**ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్॥**

సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవలన రోగములు నశించినట్లు ఎల్లప్పుడును తన ఆత్మను బ్రహ్మస్వరూపముగా నభ్యాసము చేయుటవలన గలిగెడు సంస్కార రూపమైన సద్వాసన, ఆవరణ విక్షేప శక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగా పోగొట్టునని దృఢముగ నమ్మవలయును

ఇదియే దివ్యౌషధముచే రోగాణువులు నశించి శుద్ధాణువులుగ పరిణామము బొందెడు మార్గమని గ్రహించుకొనవలయును

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధిగుణాంస్త్యజేత్।**
**స సచ్చిదాదిధర్మత్వాద్భజే భ్రమరకీటవత్॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసుకొనివచ్చి చేయవలసిన ప్రకారముగ చేసినమాత్రముచేతనే, ఆ పురుగు తన తలంపును చలించకుండ దానియందుంచినందుచేత తనయందు పూర్వముండిన పురుగు ధర్మమును వదలి భ్రమరస్వరూపమును బొందుచున్నది అట్లే శ్రవణాదుల చేత ఆత్మతత్త్వమును విచారింపగానే జీవధర్మమును వదలి, సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపమును బొందును ఇదియే జీవన్ముక్తి యని తెలిసికొనవలెను

ఇదియే కీటకము భ్రమరముగా పరిణామమును బొందెడు మార్గమని గ్రహించుటగును

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని అందఱును చూచి నప్పటికిని గ్రుడ్డివాడు ఆ సూర్యుని చూడనేరనట్లు సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని శ్రవణాదులవలన విచారించి తెలిసికొన్న ఆత్మజ్ఞానియే ఆయాత్మను తన్నుగా జూచుచున్నాడు అజ్ఞాని మాత్రము చూడనేరడు అందుచే అందఱికిని ఆ యాత్మ అగపడ దనుచున్నాడు

ఈశ్వరుడుండిన నేల కనబడుట లేదని చేసెడు ప్రశ్నమున కిదియే సమాధానము

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్॥**

ఏ యాత్మలాభముకంటె వేఱు లాభము గొప్పది లేదో, ఏయాత్మ సుఖముకంటె మఱియొక గొప్పసుఖము లేదో, యే యాత్మజ్ఞానముకంటే వేరే తెలియదగిన గొప్ప జ్ఞానము లేదో అదియే బ్రహ్మమని నిశ్చయించి తెలిసి కొనవలయును

ఇక యోగనాసిష్ఠమందు శ్రీ వసిష్ఠుడు తెలిపిన పరిణామమును చూడుడు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽవ్యహం యుతః॥**
**యథైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః॥**

ఏలాగున సువర్ణము వెండి, రాగి, ఇత్తడి మొదలైనవాటితో కలిసి నపుడల్పమగు వెలకలది యగుచున్నదో, ఆలాగున శుద్ధజ్ఞాన స్వరూపుడగు జీవుడు అవిద్యతో గూడినవాడై యుండగ, తన యొక్క యీశ్వరత్వము నశించి జీవత్వమును పొందుచున్నాడు అట్టి మలినబంగారమును స్ఫుట మొనర్చి శుద్ధపరచినపు డేలాగున శుద్ధమైన బంగారముయొక్క విలువను బొందుచున్నదో, ఆలాగున తపస్స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధానాదుల వలన మాలిన్యము నశించినపుడు జీవుడు ఈశ్వర స్వరూపమును బొందు చున్నాడు

దీనికన్న ఆత్మపరిణామమును గుఱించి యేమి చెప్పవలయును? ఇందువలన జీవులకు నెంత ధైర్యము, ఉత్సాహము, ఊర్జితము కలుగుచున్నదో చూడుడు

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః॥**
**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్।**
**నశ్యత్యేష న సందేహ స్తస్మాదుద్యమవాన్ భవ॥**

ఇదియే దివ్యౌషధముచే రోగాణువులు నశించి శుద్ధాణువులుగ పరిణామము బొందెడు మార్గమని గ్రహించుకొనవలయును

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధిగుణాంస్త్యజేత్।**
**స సచ్చిదాదిధర్మత్వాద్భజే భ్రమరకీటవత్॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసుకొనివచ్చి చేయవలసిన ప్రకారముగ చేసినమాత్రముచేతనే, ఆ పురుగు తన తలంపును చలించకుండ దానియందుంచినందుచేత తనయందు పూర్వముండిన పురుగు ధర్మమును వదలి భ్రమరస్వరూపమును బొందుచున్నది అట్లే శ్రవణాదుల చేత ఆత్మతత్త్వమును విచారింపగానే జీవధర్మమును వదలి, సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపమును బొందును ఇదియే జీవన్ముక్తి యని తెలిసికొనవలెను

ఇదియే కీటకము భ్రమరముగా పరిణామమును బొందెడు మార్గమని గ్రహించుటగును

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్ ॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని అందఱును చూచి నప్పటికిని గ్రుడ్డివాడు ఆ సూర్యుని చూడనేరనట్లు సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని శ్రవణాదులవలన విచారించి తెలిసికొన్న ఆత్మ జ్ఞానియే ఆయాత్మను తన్నుగా జూచుచున్నాడు అజ్ఞాని మాత్రము చూడ నేరడు అందుచే అందఱికిని ఆ యాత్మ అగపడ దనుచున్నాడు

ఈశ్వరుడుండిన నేల కనబడుట లేదని చేసెడు ప్రశ్నమున కిదియే సమాధానము

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

తపస్సుచే గలిగెడు పరిణామము ఈపై రెండు శ్లోకములచే తెలిసికొనదగును

**దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।**
**తథేంద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్॥**

ఏలాగున పాషాణము, సౌవీరము, గంధకము మొదలగు విషధాతువులు స్ఫుటము చేయుటవలన దివ్యౌషధము లగుచుండునో, ఆలాగున మనస్సు నందుగల దోషములు, ఇంద్రియములకు గల దోషములు మొదలగున వన్నియు ప్రాణాయామముచే నశించి శుద్ధము లగుచుండును ఇదే యోగముచే ఆత్మకు గల పరిణామమని తెలియదగును కైవల్యోపనిషత్తు నందు చెప్పిన దాని చూడుడు

**వేదాన్త విజ్ఞానసునిశ్చితార్థాస్సన్న్యాసయోగా ద్యతయశ్శుద్ధసత్వాః ।**
**తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాత్పరిముచ్యన్తి సర్వే ॥**

వేదాన్తవిజ్ఞానముచే లెస్సగా నిశ్చయింపబడిన యర్థము నెఱింగిన వారును సన్న్యాసయోగముచేత పరిశుద్ధమైన యంతఃకరణము కలవారునగు యతులు పరబ్రహ్మమును బొందుచున్నారు వారందఱును (ఆయతులు) కడపటి జన్మముయొక్క అంతమందు బ్రహ్మలోకమునందు పరమాత్మను బొంది పూర్ణముగ విముక్తి నొందుచున్నారు (పునర్జన్మరహితమగు శాశ్వత కైవల్యము నొందుచున్నారనుట) ఇచట గూడ ''వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః'' అని నిరూపించుటచే బ్రహ్మవిద్యవలననే వేదాంతముయొక్క సునిశ్చితార్థము తెలిసికొనుటకు సాధ్యపడుననియు, అందువలననే విశుద్ధాంతఃకరణులై, పరమాత్మను బొందుచున్నారనియు నిరూపించడమైనది, ఇప్పుడు వజ్రసూచికోపనిషత్తు ఇచ్చట నిరూపింపబడుచున్నది

ఇదియు నూట యెనిమిది యుపనిషత్తులలో చేరినదే దీని నిచట నిరూపించుటకు కారణమేమన, సంస్కారము వలన జీవుడు పరిణామము నొంది బ్రహ్మత్వమును బొందవచ్చునని నిరూపించుటకేగాని, మఱియొక

భావముతో గాదు ఈలాగున నిరూపించిన జీవులు ఉత్సాహోర్జితములు గలిగి దోషరాహిత్య మొనర్చుకొని శుద్ధాత్ము లగుటకు ప్రయత్నింతురు

– వజ్రసూచికోపనిషత్తు –

**వజ్రసూచీం ప్రవక్ష్యామి శస్త్రమజ్ఞానభేదనమ్ ।**
**దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషామ్ ॥**

**బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రా ఇతి చత్వారో వర్ణాస్తేషాం వర్ణానాం బ్రాహ్మణ ఏవ ప్రధాన ఇతి వేదవచనానురూపం స్మృతిభిరప్యుక్తమ్॥**

అజ్ఞానమును ఖండించెడి ఆయుధమైన అజ్ఞానులకు దూషణము గాను, జ్ఞానులకు భూషణముగాను నుండునట్టి ''వజ్రసూచి'' యనెడి యుపనిషత్తును చెప్పుచున్నాను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాలుగు వర్ణము లనియు, ఆ వర్ణములలో బ్రాహ్మణుడు మాత్రమే ముఖ్యు డనియు వేదవాక్యములకు సరిగా అనుగుణముగా స్మృతులచేతను గూడ చెప్పబడియున్నది

**తత్ర చోద్యమస్తి, కో వా బ్రాహ్మణో నామ? కిం జీవః? కిం దేహః? కిం జాతిః? కిం జ్ఞానం? కిం కర్మ? కిం ధార్మిక? ఇతి ॥**

ఆ విషయములో విచారింపదగిన దొకటి గలదు అదేమనగ బ్రాహ్మణు డనెడి పేరుగల వాడెవడు? అతడు జీవుడా? దేహమా? వర్ణమా? జ్ఞానమా? కర్మమా? లేక ధర్మము జేసెడివాడా? అని

**తత్ర ప్రథమో జీవో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, అతీతానాగతానేక దేహానాం జీవస్యైకరూపత్వాత్, ఏకస్యాపి కర్మవశాదనేకదేహసంభవాత్సర్వ శరీరాణాం జీవస్యైక రూపత్వాచ్చ, తస్మాన్న జీవో బ్రాహ్మణ ఇతి ॥**

పైన జెప్పబడిన వానిలో మొదట చెప్పబడిన జీవుడు బ్రాహ్మణు డంటిరా? అది కాదు ఎందువలననినన 1 ఇదివఱకు వచ్చిపోయిన, ముందు రాబోవునట్టి అనేక దేహములలోనున్న జీవుడొకడే గనుకను 2 జీవుడొక్క

డైనప్పటికిని, కర్మాధీనతవలన ననేక శరీరములలో పుట్టుచున్నాడు కనుకను జీవుడు బ్రాహ్మణుడు కాడు, 3 సమస్తదేహములలో జీవునికి ఒకటే రూపము గనుకను, ఈ పైన జెప్పబడిన కారణమువలన జీవుడు బ్రాహ్మణుడు కాడు

**తర్హి దేహో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, ఆచండాలాది పర్యన్తానాం మనుష్యాణాం పాంచభౌతికత్వేన దేహస్యైకరూపత్వాజ్జరామరణధర్మాథ, ధర్మాది సామ్య దర్శనాత్, బ్రాహ్మణో శ్వేతవర్ణః, క్షత్రియో రక్తవర్ణః, వైశ్యః పీతవర్ణః, శూద్రః కృష్ణవర్ణః ఇతి నియమాభావాత్, పిత్రాృదిశరీరదహనే పుత్రాదీనాం బ్రహ్మహత్యాది దోషసంభవాచ్చ తస్మాన్న దేహో బ్రాహ్మణ ఇతి ॥**

అయితే దేహము, బ్రాహ్మణుడని యంటిరా? అది కాదు ఎందుచేత నన-1 దేహము పంచభూతముల మిశ్రమ మగుటచే (చండాలాది పర్యంతము మునుష్యులయొక్క దేహము ఒకటే రూపముగలది) పాంచ భౌతికము అగుటవలనను, 2 వృద్ధాప్యము, చావు, అధర్మము మొదలైనవి యందఱికిని సామాన్యము లగుటవలనను, 3 బ్రాహ్మణుడు తెల్లనివాడు క్షత్రియుడు ఎఱ్ఱనివాడు, వైశ్యుడు పచ్చనివాడు, శూద్రుడు నల్లనివాడనెడి నియయము లేనందునను, 4 తండ్రి మొదలైన వారియొక్క శరీరములను కొడుకులు దహనము చేయునెడల కొడుకులకు బ్రహ్మహత్య మొదలగు దోషములు సంభవించుచున్నవి గనుకను నీపైన జెప్పబడిన కారణముల వలన దేహము బ్రాహ్మణుడు కాదు

**తర్హి జాతి ర్బ్రాహ్మణ ఇతి చేత్తన్న, తత్ర జాత్యన్తరజన్తుష్వనేక జాతిసంభవా మహర్షయో బహవస్సన్తి। ఋష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జాంబూకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్, వ్యాసః కైవర్తకన్య కాయాం, శశపృష్ఠా ద్గౌతమః, వసిష్ఠ ఊర్వశ్యాం, అగస్త్యః కలశే జాత ఇతి శ్రుతత్వాత్, ఏతేషాం జాత్యా వినా ఉప్యగ్రే జ్ఞాన ప్రతిపాదితా ఋషయో బహవస్సన్తి తస్మాన్న జాతిః బ్రాహ్మణ ఇతి ।**

అయితే జాతి బ్రాహ్మణుడని యంటిరా? అది సరి కాదు ఎందుచేత ననిన, ఒకజాతిలో జాత్యంతరప్రాణులు పుట్టుచున్నవి కనుక జాతి బ్రాహ్మణత్వమునకు ముఖ్యకారణము కాదు అనేకులు గొప్ప ఋషు లున్నారు వారి జనన మెట్టిదనిన ఋష్యశృంగుడు ఆడుమృగమునందు బుట్టినవాడు కౌశికుడు దర్భవలన బుట్టినవాడు, జాంబూకుడు నక్కవలన బుట్టినవాడు వాల్మీకి పుట్టలోనుండి బుట్టినవాడు,వ్యాసుడు చెంబ డి(దాశకన్య) స్త్రీయందు బుట్టినవాడు గౌతముడు కుందేటి వెనుక భాగ మువలన బుట్టినవాడు వసిష్ఠుడు ఊర్వశియందు బుట్టినవాడు అగస్త్యుడు కుండయందు పుట్టెనని మనము వినుచున్నాము కనుక, వీరలది బ్రాహ్మణజాతి కాకపోయి నప్పటికిని తరువాత కాలమందు జ్ఞానమును గలుగజేసెడి వారుగ నుండిరి ఈలాటి ఋషు లనేకులు గలరు అందువలన జాతి బ్రాహ్మణుడు కాదు

**తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతి చేత్తన్న, క్షత్రియాదయోఽపి పరమార్థ**
**దర్శినోఽభిజ్ఞా బహవస్సన్తి, తస్మాన్నజ్ఞానం బ్రాహ్మణ ఇతి,**
**తర్హి కర్మ బాహ్మణ ఇతి చేత్తన్న, సర్వేషాం ప్రాణినాం**
**ప్రారబ్ధ సంచితాగామి కర్మసాధర్మ్య దర్శనాత్ కర్మాభిప్రేరితా**
**స్సన్తో జనాః క్రియాః కుర్వన్తీతి, తస్మాన్న కర్మ బ్రాహ్మణ ఇతి॥**

అయితే జ్ఞానము బ్రాహ్మణుడని యంటిరా? అదియును సరికాదు ఎందుచేతనన, రాజులు మొదలైన వారలలోకూడ యథార్థమును తెలిసికొనినట్టి జ్ఞానవంతులైన వారనేకులు గలరు ఆకారణమువలన జ్ఞానము బ్రాహ్మణుడని చెప్పుట సరికాదు కర్మము బ్రాహ్మణుడని యంటిరా? అది యును కాదు సర్వజీవులలో ప్రారబ్ధము, సంచితము, ఆగామి యనెడి పేర్లు గల కర్మములయొక్క సామ్యమును జూచుచున్నాము ఈ కర్మలు అందటి యందు సమానముగ నున్నని కనుక కర్మము బ్రాహ్మణుడు కాదు కర్మచేత ప్రేరేపింపబడినవారై జనులు ఆకర్మప్రేరిత కార్యములను జేయుచున్నారు కనుక కర్మ బ్రాహ్మణుడు కాదు

**తర్హి ధార్మికో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, క్షత్రియాదయో హిరణ్య దాతారో బహవస్సన్తి, తస్మాన్నధార్మికో బ్రాహ్మణ ఇతి । తర్హి కో వా బ్రాహ్మణో నామ, యః కశ్చిదాత్మాన మద్వితీయం జాతిగుణ క్రియా హీనం షడూర్మిషడ్భావేత్యాది సర్వదోషరహితం సత్యజ్ఞానానన్దానన్త స్వరూపం స్వయం నిర్వికల్ప మశేషకల్పాధారమశేష భూతాంతర్యామిత్వేన వర్తమాన మంతర్బహిశ్చాకాశవదనుస్యూత మఖండానన్దస్వభావ మప్రమేయ మనుభ వైకవేద్య మవరోక్షతయా భాసమానం కరతలామలకవత్సాక్షాదవరోక్షీ కృత్య కృతార్థతయా కామరాగాదిదోషరహిత శ్శమదమాది సంపన్నో భావ మాత్సర్య తృష్ణాశామోహాదిరహితో దంభాహంకారాదిభిరసంస్పృష్టచేతా వర్తతే, ఏవముక్తలక్షణో యస్స ఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతిస్మృతిపురాణేతి హాసానా మభిప్రాయః । అన్యథా హి బ్రాహ్మణత్వసిద్ధిర్నాస్త్యేవ సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మభావయే దాత్మానం సచ్చిదానందం బ్రహ్మ భావయేదిత్యుపనిషత్ ॥**

అయితే, ధర్మముచేయువాడు బ్రాహ్మణుడని యంటిరా? ఆ మాట సరికాదు డబ్బునిచ్చెడి క్షత్రియులు మొదలుగా గలవారనేకమంది గలరు అందువలన ధర్మమును జేసెడివాడు బ్రాహ్మణుడు కాడు అట్లగుచో బ్రాహ్మణుడనెడి పేరుగలవాడు ఎవడంటిరా? ఎవడైతే, యేకమైనట్టి జాతి గుణక్రియలు లేని జరామరణ శోక మోహ క్షుత్పిపాసలను షడూర్ములను, పుట్టుట, ఉండుట, వృద్ధిబొందుట, మారుట, చిక్కుట, నశించుటలను ఆరు భావములును (వికారములు) లేని సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతత్వము, స్వరూపముగా గలిగి, సంకల్ప మందన్యధావృత్తి లేని సర్వసంకల్పములకు ఆధారుడైన సమస్త భూతములకు నంతర్యామిగ్నై యున్నటువంటి, ప్రమాణగోచరమైన, అనుభవముచేతనే తెలిసికొనదగిన, ప్రత్యక్షముగ ప్రకాశించునట్టి, ఆత్మను అరచేతిలోనుండెడి యుసిరికకాయ వలె చేసుకొని కృతకృత్యుడై కామరాగాది దోషములు లేనివాడై, శాంతి శమదమాది గుణములు గలవాడై, మాత్సర్యము, తృష్ణ, ఆశ, మోహము

లేనివాడై, మఱియు అహంకారము, డంబము, మొదలైన వానికి లోబడని మనస్సు గలవాడెవడో వాడు మాత్రమే బ్రాహ్మణుడని వేదములు పురాణములు స్మృతులు ఇతిహాసములు మొదలగు వాని తాత్పర్యము పైన జెప్పబడిన దానికి వేరుగ బ్రాహ్మణత్వసిద్ధి లేనేలేదు అట్టి సత్తు, చిత్తు, ఆనందము స్వరూపముగా గల ఆత్మను అద్వితీయ పరబ్రహ్మముగా తలంపవలయును అట్టి సచ్చిదానందస్వరూపమైన ఆత్మను అద్వితీయ పరబ్రహ్మమునుగా భావించవలయును ఉపనిషత్సమాప్తి సూచకముగా ద్విరుక్తి (రెండు సార్లు) చెప్పబడినది ఓం

వేదాంత విషయమున ఆరంభవాదమనియు, పరిణామవాదమనియు వివర్త వాదమనియు మూడువాదములు గలవు వీనిని సర్వమతాను యాయులు నంగీకరించియున్నారు

– ఆరంభవాదము –

**ఆరంభవాదినోఽన్యస్మాదన్యస్యోత్పత్తి మూచిరే ।**
**తంతోః పటస్య నిష్పత్తేర్భిన్నౌ తంతుపటౌ ఖలు ॥**

ఆరంభవాదులు వేరైన తంతువులవలన వేరుగ వస్త్రము పుట్టుటచేత కారణముకంటె కార్యము భిన్నమని చెప్పుదురు ఇంతమాత్రమువలన కార్య కారణములకు భేదమెట్లు సిద్ధించుననగా, కార్యకారణములగు వస్త్ర తంతువులు రెండును పరస్పరవిరుద్ధ పరిమాణములు కలిగియుండుట వల్లను, పరస్పర విరుద్ధ క్రియావంతములై యుండుటవలనను, రెంటికిని పరస్పరము భేదము కలదు అనగా తంతువులు గుండ్రములై యనేకములై కప్పుకొనుట మొదలగు కార్యముల కుపయోగించక యుండుట వలనను, పటము దీర్ఘవిస్తరమై, యేకమై, ఆచ్ఛాదనాది కార్యముల కుప యోగపడుటవలనను నా తంతు వస్త్రములు రెండును భిన్నములే యగునని యభిప్రాయము

– పరిణామవాదము. –

**అవస్థాంతరతాపత్తిరేకస్య పరిణామితా ।**
**స్యాత్క్షీరం దధి మృత్కుంభః సువర్ణం కుండలం యథా ॥**

ఒక వస్తువు పూర్వావస్థను విడిచి, మఱియొక యవస్థను బొందుట పరిణామమని చెప్పబడును ఇందుల కుదాహరణము – పాలు పెరుగగుటయు, మృత్తిక ఘట మగుటయు, సువర్ణము కుండలము లగుటయు నని గ్రహించవలయును

ఈపై జెప్పిన ఆరంభ పరిణామవాదములవలె మనుష్యజాతి మఱియొక రూపముగా మారనవసరము లేదు దారములు వస్త్రము లగునట్లును, క్షీరము దధియగునట్లును నిచట మారవలసిన పనిలేదు

– వివర్తవాదము –

**అవస్థా న్తరభావస్తు వివర్తో రజ్జుసర్పవత్ ।**
**నిరంశేఽప్యస్త్యసౌ వ్యోమ్ని తలమాలిన్యకల్పనాత్ ॥**

పూర్వావస్థను విడువకయే మఱియొక యవస్థగా భాసించుట వివర్త మనబడును దీనికి దృష్టాంతము రజ్జురూపముగా నున్న ద్రవ్యము, రజ్జ్వాకారమును విడువకయే సర్పరూపముగా ప్రకాశించుటయే ఇది వివర్తమని చెప్పబడును నిరవయవమని యంగీకరించబడిన ఆకాశమందు అధోముఖేంద్ర నీలకటాహత్వ మలినత్వముల నాకాశస్వరూపము నెఱుంగనివా రారోపించుచున్నారు కనుక, నిరవయవద్రవ్యమందుగూడ వివర్తకారణత్వము సంభవించగలదని తెలియువలయును ఈ వివర్తవాదమును దృఢముగా భావించుటకు శక్తి గలిగినచో మానవుడు పొందవలసిన యున్నత స్థానమునకు గల ప్రతిబంధము లన్నియు తొలగిపోయినట్లే యని గ్రహించవలయును దీనికి కావలసిన దృష్టాంతములు ప్రమాణములు, యుక్తులు అన్నియు నిదివరలోనే చెప్పబడినవి

ఈ విషయములో మీ యొక్క ఆహారాది ఆచరణలను మాత్రము మార్చు కొనిన చాలును అప్పుడు మీకే యీసత్యము బోధపడగలదు అట్లు ఆహారాచరణానుష్ఠానములను మార్చకపోయిన, బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు గాను, క్షత్రియుడు క్షత్రియుడుగాను, వైశ్యుడు వైశ్యుడు గాను, శూద్రుడు శూద్రుడుగాను, అంత్యజుడు అంత్యజుడుగాను నీ మహాకల్పాంతము వఱకు నుండవలసినదే దీని నెవరును మార్పు జేయజాలరు ఒకరు డాక్టరుగాను, కలెక్టరుగాను తమ్ము భావించుచుండినచో నది వారికి పూర్వము మనుష్యజాతి మార్పుచే గలిగినది కాదు వారి యొక్క విద్య వలన డిగ్రీవలన నేర్పడినదని అందఱు నేలాగున దెలిసికొనగలుగుచున్నారో ఆలాగున మానవునియొక్క భావనాపరిణామము నుండునని తెలిసికొన వలయును

అట్లు మానవజాతియందు సృష్టిలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అంత్యజ ఇత్యాది జాతు లుండలేదు ఒక్కొక్క విభాగము అనగా సంఘము ఏర్పడినప్పుడు దానిలో చేరినవారు ఆయా జాతికి సంబంధించిన వారైరి ఈ విషయము విస్తారముగ చూడదలంచువారు లోకోద్ధారకమను గ్రంథములో చూడదగును మఱియు ప్రపంచములో గల సకల జాతులయొక్క యావిర్భావ మెట్లు కలిగినదో చారిత్రాత్మకముగ చక్కగా విచారణ చేసిన యీ పరమతత్త్వమును దెలిసికొనగలరు ఆలాగే ఒకడు మాత్రము పవిత్రజాతియొక్క యాహారాచరణాదులు శీలించినచో నప్పుడే అది యొకజాతిగా మారగలుగునా? అని సంశయింప పనిలేదు ప్రపంచములోగల సర్వజాతులు(మతస్థులు) నెట్లేర్పడినవని విచారించిన వాటికన్నిటికిని మూలపురుషు డొక్కడేర్పడి యాధర్మరహస్యములను జనులకు బోధించుటచే వారి వాక్యములలో విశ్వాసము కలిగి ఆయా సంఘములలో చేరినవారే యిప్పుడు నానాజాతులుగా నేర్పడినారని తెలియగలదు

శ్రీ క్రీస్తువునకు ముందుగా క్రైస్తవు లుండలేదు శ్రీ మహమ్మదుకు ముందుగా మహమ్మదీయులను ఒక వర్గముండలేదు శ్రీబుద్ధునికి

ముందుగా బౌద్ధులను నొక జాతి యుండలేదు ఆలాగున శ్రీనానక్‌నకు ముందుగా సిక్కులనే జాతియుండలేదు శ్రీదయానందసరస్వతికి ముందుగా ఆర్యసామాజికులు ఏర్పడలేదు శ్రీరామమోహన్‌రాయ్‌కి ముందుగా బ్రాహ్మమతస్థులని ఒక సంఘ ముండలేదు పైజెప్పిన వారి యొక్క ధర్మబోధలలో నమ్మకము గలిగి చేరిన మానవులందఱు నాయా జాతులైరి ప్రపంచముయొక్క చరిత్ర యీలాగుననే యున్నది

– అనుబన్ధ చతుష్టయము –

**అధికారీ చ విషయః సమ్బన్ధశ్చ ప్రయోజనమ్ ।**
**శాస్త్రారంభఫలం ప్రాహురనుబన్ధచతుష్టయమ్ ॥**

లక్షణ గ్రంథమునకు నాలుగంగము లుండవలయును వీనిని అనుబంధ చతుష్టయమని యందురు ఈ నాలుగంగములను నిరూపించిన గ్రంథమే పూర్ణాంగములతో గూడిన గ్రంథమని విద్వజ్జనసమ్మతము

శాస్త్రము నారంభించునపుడు ఈ శాస్త్రమునకు 1 అధికారి యెవడు? 2 విషయమేది? 3 సంబంధమేమి? 4 ప్రయోజనమేమి? అని విచారింపవలయును

అధికారిలక్షణము –

**చతుర్భిస్సాధనైస్సమ్యక్ సమ్పన్నో యుక్తిదక్షిణః ।**
**మేధావీ పురుషో విద్వానధికార్యత్ర సమ్మతః ॥**

సాధనచతుష్టయ సంపన్నుడును, ఊహాపోహకుశలుడును విద్వాంసుడు నగు పురుషు డీశాస్త్రమున కధికారిగా నంగీకరింపబడెను

విషయము –

**విషయశ్శుద్ధచైతన్యం జీవబ్రహ్మైక్యలక్షణమ్ ।**
**యత్రైవ దృశ్యతే సర్వవేదాన్తానాం సమన్వయః ॥**

వేదాంతవాక్యము లన్నియు శుద్ధచైతన్య బ్రహ్మమునే బోధించునవి గావున, జీవబ్రహ్మైక్య రూపమగు నాశుద్ధబ్రహ్మమే వేదాంతశాస్త్రమునకు విషయ మగుచున్నది

సంబంధము –

**ఏతదైక్యప్రమేయస్య ప్రమాణస్యాపి చ శ్రుతేః ।**
**సంబంధః కథ్యతే సద్భిర్బోధ్యబోధకలక్షణః ॥**

జీవబ్రహ్మైక్యమను విషయమునకు, సిద్ధాంత ప్రతిపాదకమగు వేదాంత శాస్త్రమునకును, బోధ్యబోధకభావము సంబంధమనుట తెలియ దగినది బోధ్యము, తెలుపునది బోధకము ఎట్లనగా, వేదాంతశాస్త్రముచే తెలియబడునది జీవబ్రహ్మైక్యము జీవబ్రహ్మైక్యమును దెలుపునది వేదాంత శాస్త్రము ఇట్లు శాస్త్రమునకు విషయమునకు బోధ్యబోధకభావము సంబంధ మని యెఱుంగునది

ప్రయోజనము –

**బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సన్తః ప్రాహుః ప్రయోజనమ్ ।**
**యేన నిశ్శేషసంసార బన్ధాత్సద్యః ప్రముచ్యతే ॥**

జీవుడు బ్రహ్మము ఒకటేయని తెలిసికొనగా నప్పుడే సంసారరూప మగు బంధమునుండి విముక్తిని బొందుచున్నాడు కావున నిద్దానికంటె శ్రేయమైనది యింకొకటి లేదు కావున జీవబ్రహ్మములకు భేదము లేదను అఖండాకార జ్ఞానమే వేదాంతశాస్త్రమునకు బ్రయోజనము

**ప్రయోజనం సప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్ ।**
**ప్రయోజనమనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే ॥**

మందబుద్ధి గలవాడైనను, ఫలమును గోరకే యే కార్యమునందును ప్రవర్తింపనేరడు కావున నీ శాస్త్రమునందు ప్రవృత్తి కలుగుటకు ప్రయోజనము నిమిత్త మగుచున్నది

వేదాంతశాస్త్రమునకు నీపై నిరూపింపబడిన యనుబంధ చతుష్టయము నిదేరీతిగా గలదు ఇది కర్మశాస్త్రమునకు, ఉపాసనాశాస్త్రమునకు, యోగశాస్త్రమునకును అనుబంధచతుష్టయము ఆయా దానికి సంబంధించి యుండునని తెలియవలయును



# మూడవ భాగము

## విద్యామార్గము

తైత్తిరీయ శిక్షావల్లి మొదలగు నుపనిషత్తుల నుండియు, నితరములగు శ్రుతిస్మృతులనుండియు, ఆర్ష ఆశయములనుండియు నీ క్రింద ప్రమాణములు సంక్షిప్తముగ నిరూపించడమైనది

**స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్॥**

అధ్యయన అధ్యాపనములనుండి ప్రమాదమును బొందకూడదు తైత్తిరీయశిక్షావల్లి యెట్టి పవిత్ర ధర్మములను బోధించుచున్నదో చూడుడు దీనికి మూడు అర్థములు గలవు 1 ఆచార్యుడు అధ్యయనము చేయించుటలోను, శిష్యుడధ్యయనము చేయుటలోను అలసట నొందకూడదనియు, 2. శిష్యుడధ్యయనము చేసిన దానిని మఱల జిజ్ఞాసువులకు అధ్యాపనము చేయవలయుననియు దీనియందునలసట పొందకూడదనియు, 3 ఆచార్యుడు అలసట లేకనే చెప్పవలయుననియు, శిష్యుడు ఏమరుపాటు లేక అధ్యయనము చేయవలయుననియు నుపదేశింపబడుచున్నది వేదకాలపు ఈ యాశయమెంత పవిత్రమైనది? ఇట్టి ధర్మము ఎల్లప్పుడు గలిగి యుండిన లోక మెంత బాగుపడియుండును? ఇంకను దీనిని గుఱించియే శ్రుతి మఱియొక వచనమును తెలుపుచున్నది

**స్వాధ్యాయా న్మా ప్రమదః॥**

అధ్యయనమునుండి ప్రమాదము నొందకుము తొలుత గురు శిష్యులిద్దరిని గురించి చెప్పి పిమ్మట శిష్యులను గురించి మరింత హెచ్చరిక చేయడ మైనది శాస్త్రపరనమందు కొంచెమైనను అజాగ్రత్త పొందకుడు ఈవిషయమును మనువెంత జాగ్రత్తతో నుపదేశించినది మొదటనే తెలుపబడి యుండెను విద్య లేని సంఘము ఎప్పటికిని పరాధీనమై యుండవలసినదే ఇప్పుడుండిన జనసముదాముయొక్క పరిస్థితిని గమనించిన నీ సత్యమును దెలిసి కొనగలరు విద్యమాత్రము చదివి ఆచరణ లేకుండ నుండవలయునని అభిప్రాయము కాదు విద్యను జదివి యాలాగున నాచరించిన నిహపర సుఖముల రెంటిని బడయవచ్చును ఆచరణ లేనిచో ఇతరకార్యలచే జనులు ఏలాగున నిహసుఖమును మాత్రము పొందుచున్నారో వీనికిని అంతియే ఫలము గలుగునని మాత్రమే చెప్పబడుచున్నది

**అన్యవిద్యాపరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్ ।**
**బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్ ॥**

బ్రహ్మవిద్య తప్ప ప్రపంచములోగల యెన్ని విద్యల నభ్యసించినను దేహముతోగూడ అవియు నశించిపోవును బ్రహ్మవిద్య యొకటి మాత్రము ఇచట జీవించి యున్నప్పుడును, దేహమును వదలి పరలోకవుం దున్నప్పుడును శాశ్వత సౌఖ్యమును కలుగజేయును కావుననే శ్రీకృష్ణ భగవానుడు ''అధ్యాత్మవిద్యా విద్యానాం'' అని గీతలో తెలిపిరి విద్యలలో ఆత్మవిద్య యొకటిమాత్రమే విద్యయని చెప్పదగును లేక విద్యలన్నిటిలోను బ్రహ్మవిద్య యొకటియే ముఖ్యమనియు తెలుపడమైనది ఏలనన, దేనివలన అవిద్య నశించునో, దానికే విద్యానామము సార్థక మగును అట్టి అవిద్య యనగ అజ్ఞానము బ్రహ్మవిద్యచే మాత్రమే నశించును

**అజ్ఞానం తస్య మూలం స్యాదితి తద్ధాన మిష్యతే ।**
**బ్రహ్మవిద్యాఽత ఆరబ్ధా తతో నిశ్శ్రేయసం భవేత్ ॥**

కర్మములకు గారణము అజ్ఞానము, కనుక నట్టి అజ్ఞాన నివృత్తికై

బ్రహ్మవిద్య చెప్పబడుచున్నది బ్రహ్మవిద్య కలుగగనే అజ్ఞానము నశించి స్వరూపావస్థానరూపమగు మోక్షసుఖము ప్రతిబంధ రహితముగ స్ఫురించును

**విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే ॥**

ఎవడు విద్యయొక్క స్వరూపముతో బాటు అవిద్యయొక్క స్వరూపమునుగూడ దెలియుచున్నాడో, అనగా పరవిద్యతో సహా అపరవిద్యను గూడ దెలిసికొనుచున్నాడో, యతడు అపరవిద్యచే కర్మోపాసనలవలన మృత్యువును తరించి, ఆత్మజ్ఞానముచే మోక్షమును బొందుచున్నాడు

**విద్యావిలాసమనసో ధృతశీలశిక్షాః**
**సత్యవ్రతా రహితమానమలాపహారాః ।**
**సంసారదుఃఖదళనేన సుభాషితాయే**
**ధన్యా నరా విహితకర్మపరోపకారాః ॥**

విద్యాభ్యాసమునందు తత్పరమైన మనస్సుగలవారై, సుందర శీలస్వభావయుక్తులు, సత్యభాషణాది నియమములను పాలించుచు అభిమానము నుండి అపవిత్రతనుండియు దూరులై,హృదయమాలిన్యములను బోగొట్టుట చేతను, ఇతరులకు సత్యోపదేశము చేయుటచేతను, విద్యాదానము చేయుట వలనను, సంసారుల దుఃఖమును దూరము చేయుటచేతను ప్రకాశించుచు వేదవిహితకర్మలచే బరోపకారమే యొనర్చు స్త్రీలును, పురుషులును ధన్యులు

**అద్భిర్గాత్రాణి శుధ్యన్తి మనః సత్యేన శుధ్యతి ।**
**విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి ॥**

నీటిచే బాహ్య అవయవములు, సత్యాచరణముచే మనస్సు, విద్యచేతను, తపస్సుచేతను, జీవాత్మయు, బ్రహ్మజ్ఞానముచే బుద్ధియును పవిత్రము లగుచున్నవి

**ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ, సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ, తపశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ, దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ, శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ, అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ, అగ్ని హోత్రం చ స్వాధ్యాయప్రవచనే చ, అతిథయశ్చస్వాధ్యాయ ప్రవచనే చ, మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ, ప్రజా చ స్వాధ్యాయ ప్రవచనే చ, ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనే చ, ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవనే చ ॥**

యధార్థమైన యాచరణతో జదువుచు, జదివింపుచు నుండ వలయును సత్యాచారముతో సత్యవిద్యలను జదువుచు జదివింపుచు నుండ వలయును తపస్సొనర్చుచు, వేదాదిశాస్త్రములను జదువుచు, జదివింపుచు నుండవలయును బాహ్యేంద్రియములను దుష్టాచారములనుండి తొలగించి, చదువుచు జదివింపుచు నుండవలయును మనోవృత్తిని సమస్త దోషముల నుండి తొలగించి చదువుచు చదివింపుచు నుండవలయును ఆహవనీయాది యగ్నుల నెఱుగుచు, జదువుచు జదివింపుచు నుండవలయును అగ్ని హోత్రవము చేయుచు, చదువుచు జదివింపుచు నుండవలయును అతిధులయొక్క సేవచేయుచు జదువుచు, జదివింపుచు నుండవలయును మనుష్య సంబంధమగు వ్యవహారములను యధాయోగ్యముగా జేయుచు, జదువుచు, జదివింపుచు నుండవలయును, మనుష్య సంబంధమగు వ్యవహారములను యధాయోగ్యముగా జేయును చదువుచూ చదివించుచూ జదివింపుచు నుండ వలయును సంతానమును రాజ్యమును బాలించుచు, జదువుచు జదివింపుచు నుండవలయును వీర్యమును రక్షించుచును, వృద్ధి పరచుచును జదువుచు జదివింపుచు నుండవలయును తమ సంతానమును, శిష్యులను బాలించుచు జదువుచు జదివింపుచు నుండవలయును

**అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజశ్శనైః ।**
**గురౌ వసన్ సఞ్చినుయాద్బ్రహ్మాధిగమకం తపః ॥**

ఈ ప్రకారముగ కృతోపనయనుడగు ద్విజబ్రహ్మచారియగు కుమారుడు, బ్రహ్మచారిణియగు కన్యయు, మెల్ల మెల్లగా వేదార్థముయొక్క

జ్ఞానమును, తపస్సును వృద్ధిపరచుచు పోవలయును

**సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినస్సుఖమ్ ।**
**సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్సుఖమ్ ॥**

సుఖపరులై యుండువారికి విద్య యబ్బదు విద్యార్జనయం దాసక్తిగల వారికి సుఖాసక్తి తగదు సుకుమారత్వబుద్ధి గలిగినవాడు విద్యను మానుటయే మంచిది విద్యాసుఖమును (జ్ఞానసుఖమును) కోరునేని ఈ బాహ్యసుఖమును త్యజించవలయును

**సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!**
**అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥**

ఓ అర్జునా! విద్యాధ్యానాభ్యాసములచే దేనియందు రమించుచున్నాడో, దుఃఖనాశనమునుగూడ పొందుచున్నాడో- యిప్పుడు అట్టి మూడువిధము లగు సుఖములను గూర్చి చెప్పద వినుము

**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥**

అట్టి విద్యాతపస్సులచే నేర్పడు సుఖము ఆరంభమునందు విషమువలె నుండును అదియే పర్యవసానమందు అమృతమువలె మారుచుండును అట్టి పరమాత్మవిషయకమైన బుద్ధియొక్క నైర్మల్యమువలన గలిగిన సుఖము సాత్త్విక సుఖమని చెప్పబడుచున్నది

**విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**

ఇంద్రియార్థ విషయములయందు మనస్సు రమించుటవలన నేసుఖము మొదట అమృతమువలె గన్పించునో, అదియే పరిణామావస్థ గలుగునప్పుడు విషరూపముగ మారుచుండును విద్యాతపస్సులను జేయక, మొదట సుఖముగా గన్పించెడు విషయములకు లోబడు వానిస్థితి

యీలాగున నుండును రజోగుణస్వభావము గలవాడిట్టి ఆపాత రమణీయములగు విషయసుఖముల వాంఛించును సత్త్వగుణము కలవాడు సహనశక్తి గలిగి కార్యములను నిర్వహింప గలుగును రజోగుణము గలవానికి సహనశక్తి యుండదు

**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత**
**స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।**
**శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే**
**ప్రేయో మన్దో యోగక్షేమాద్వృణీతే ॥**

శ్రేయస్సు ప్రేయస్సు మనుష్యుని పొందుచున్నవి విద్వాంసు డగువాడు ఆశ్రేయఃప్రేయస్సులను మనస్సుచే బాగుగా విచారించి యెయ్యది శ్రేష్ఠమో, యెయ్యది నికృష్ణమో దానిని విభజించుచున్నాడు ధీరుండగువాడు ప్రేయస్సును విడిచి శ్రేయస్సునే వరించుచున్నాడు అల్పబుద్ధిగలవాడు దేహ సౌఖ్యాది నిమిత్తమువలన పశుపుత్రాది లక్షణమగు ప్రేయస్సునే వరించు చున్నాడు ప్రేయస్సన ప్రపంచసౌఖ్యము, శ్రేయస్సన మోక్షసుఖము ధీశాలురగువారు ఏ దైన నొక కార్య మారంభించు నప్పుడు పైజెప్పిన రెండు గుణములు( శ్రేయః ప్రేయములు) వారిని జేరుచుండును బుద్ధిమంతు డగువాడు ప్రేయస్సును జారవిడిచి శ్రేయస్సును చేపట్టును ఈ పరీక్ష ప్రతిశూరునకు ధీరునకు గలుగుచునే యుండును

**అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే ।**
**ఉత్పన్నాయాం తు విద్యాయామావిద్యకమనాద్యపి ॥**
**ప్రబోధే స్వప్నవత్సర్వం సహ మూలం వినశ్యతి॥**

అవిద్యయు తత్కార్యమగు ప్రపంచజాతము అనాదులే అయితే విద్య ఉత్పత్తి కాగానే మేల్కాంచిన తరువాత స్వప్నములోని పదార్థములవలె స్వప్న మువంటి అవిద్య, అవిద్యాకార్యము అనాదినిష్పన్నము లైనను నిశ్శేషముగా నశించును

**కర్మణా పితృలోకాది నిషిద్ధైర్నరకాదికమ్ ।**
**విద్యయా బ్రహ్మసాయుజ్యం తద్దీనః క్షుద్రతాం గతః ॥**

పుణ్యకర్మలచేత పితృలోకాది ప్రాప్తియు, నిషిద్ధకర్మలచే నరకాది లోకప్రాప్తియు కలుగును విద్యచేత బ్రహ్మైక్యమును పొందును అట్టి విద్య లేనివాడు నీచత్వమునే పొందును,

**ప్రదీప స్సర్వవిద్యానాముపాయస్సర్వకర్మణామ్।**
**ఆశ్రయస్సర్వధర్మాణాం విద్యోద్దేశే ప్రకీర్తితా ॥**

బ్రహ్మవిద్య సమస్త విద్యలకు దీపమువంటిది సమస్తకర్మలకు నుపాయమైనది సకల ధర్మములకు ఆశ్రయము ఇటుల మానవోద్దేశ్యములో చెప్పబడెను

**శ్రుతిస్మృతీ ఉభే నేత్రే విప్రాణాం పరికీర్త్యతే।**
**ఏకేన వికలః కాణః ద్వాభ్యామన్ధః ప్రకీర్తితః॥**

బ్రహ్మజ్ఞానులకు శ్రుతిస్మృతులు ఇవి రెండు నేత్రములని చెప్పబడు చున్నవి వీటిలో ఒకటి లేకపోయిన( కాణః) ఒక కన్ను లేనివాడగుచున్నాడు రెండునులేనిచో గ్రుడ్డివాడే గదా।

**అపూర్వః కోఽపి కోశోఽయం విద్యతే తవ భారతి ।**
**వ్యయతో వృద్ధి మాయాతి సంచయాచ్చ వినశ్యతి ॥**

ఓ సరస్వతీ! నీయొక్కకోశము ( బొక్కసము) విద్యాకోశము అపూర్వము,నవీనమైనది మఱియు అనిర్వాచ్యము, అనంతము నగుటచే నిట్టిదని చెప్పుటకు వీలులేనిది లోకములో ధనకోశము( ధనాగారము) ను వ్యయము చేసిన నాశనము చెందును దాచి పెట్టిన వ్యయము లేనిదగును ఈవిద్యాకోశమో, యెంత వ్యయము చేసిన, అంతకంతకు వృద్ధిగాంచును వ్యయము చేయకపోయినచో వాడని ఇనుమువలె విద్యయు క్రమముగా నశించును

**అనేకసంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శకమ్ ।**

**సర్వస్య లోచనం శాస్త్రం యస్య నా స్త్యన్ధ ఏవ సః ॥**

శాస్త్రమనునది సమస్త సందేహములను పోగొట్టునది మన దృష్టికి గోచరముగాని దానినిగూడ చూపించును యధార్థముగ శాస్త్రదృష్టియే దృష్టిగాని యితర మగు దృష్టి దృష్టి కానేరదు అట్టి శాస్త్రదృష్టి గలవాడే నేత్రములు గలవాడగును తదితరుడు గ్రుడ్డివాడే యగును

**సర్వద్రవ్యేషు విద్యైవ ద్రవ్యమాహురనుత్తమమ్ ।**
**అహార్యత్వాదనర్ఘ్యత్వాదక్షయత్వాచ్చ సర్వదా ॥**

సకల ద్రవ్యములలోను విద్యయను ద్రవ్యమే మిక్కిలి ఉత్కృష్టమైనది ఇంతకన్న ఉత్తమ మగునది భువిలో లేదు ఈ విద్యాద్రవ్యము ఇతరులచే హరింప శక్యము గాదు వెలలేనిది, యెప్పుడును నాశనము లేనిది ద్రవ్యమో దీనికన్న విరుద్ధధర్మము గలది

**హర్తుర్నగోచరం యాతి దత్తా భవతి విస్తృతా ।**
**కల్పాన్తేఽపి న యా నశ్యేత్ కిమన్యద్విద్యయా సమమ్ ॥**

అపహరించువానికి నీ విద్య దొరుకదు ఇతరుల కిచ్చినచో విస్తారమును గాంచును ప్రళయకాలములోగూడ నీవిద్య(జ్ఞానము) నశించునది కాదు లోకములో విద్యకు సమమగునది మఱియొకటి గలదా?

**జ్ఞాతిభిర్భజ్యతే నైవ చోరేణాపి న నీయతే ।**
**దానే నైవ క్షయం యాతి విద్యారత్నం మహాధనమ్ ॥**

ఈవిద్యాధనము బంధువులచే విభాగింపబడునది కాదు. దొంగలచే అపహరింపబడునది కాదు దానముచే నశించునది కాదు ఈ విద్యారత్నము తఱుగని నిధివంటిది

**సంయోజయతి విద్యైవ నీచగాఽపి నరం సరిత్ ।**
**సముద్రమివ దుర్ధర్షం నృపభాగ్యమతః పరమ్ ॥**

నిమ్నముగా ప్రవహించు నది గంభీరమగు సముద్రము నెటుల చేరు

చున్నదో, యావిధముగనే స్వాధీనపడని రాజును, విద్యయను నది నీచుడగు మనుష్యునిగూడ చేర్చును అనగా విద్యవలననే రాజాశ్రయము లభించును తరువాత సంపత్తుకు కొఱత లేదు

**విద్యా శస్త్రం చ శాస్త్రం చ ద్వే విద్యే ప్రతిపత్తయే ।**
**ఆద్యా హాస్యాయ వృద్ధత్వే ద్వితీయాఽఽద్రియతే సదా ॥**

శస్త్రవిద్య శాస్త్రవిద్యయను రెండు విద్యలు లోకములో జ్ఞానము కొఱకగుచున్నవి శస్త్ర విద్యయో, వార్ధక్యదశ రాగానే పరిహాసము కొఱకగును శాస్త్ర విద్య సర్వావస్థలయందును ఆదరింపబడుచున్నది

**శునః పుచ్ఛమివ వ్యర్థం జీవితం విద్యయా వినా ।**
**న గుహ్యగోపనే శక్తం న చ దంశనివారణే ॥**

శునకముయొక్క తోక తన గుహ్యస్థానమును ఆచ్ఛాదించుటకుగాని, యీగలను తోలుకొనుటకుగాని ఉపయోగపడక యెటుల వ్యర్థముగా నుండునో, అటులనే విద్యలేనివాని జీవితము నిరుపయోగమైనది

**సద్విద్యా యది కా చిన్తా వరాకోదరపూరణే ।**
**శుకోఽప్యశనమాప్నోతి రామరామేతి చ బ్రువన్ ॥**

ఉత్తమగతిని పొందించు సద్విద్య యుండినచో జాలును. దీనమగు ఉదరపోషణమునకై చింతించ నవసరము లేదు చిలుక కూడ 'రామ రామ' యని చెప్పుచు భోజనమును సంపాదించుకొనుచున్నది కనుక మనుష్య జన్మమునకు ఫలితము సద్విద్యను సంపాదించడమే

**అనపేక్షితగురువచనా సర్వాన్ గ్రంథీన్ విభేదయతి సమ్యక్ ।**
**ప్రకటయతి పరరహస్యం విమర్శ శక్తి ర్నిజా జయతి ॥**

విద్యవలన గలిగిన విమర్శనాశక్తి యితరుల యపేక్ష లేకయే సమస్త సంశయములను బాగుగా ఛేదించుచున్నది. ఇతరుల నిగూఢమగు అభిప్రాయములను సులభముగా ప్రకటించుచున్నది

**వసుమతీ పతినాఽపి సరస్వతీ బలవతా రిపుణాఽపి న నీయతే ।**
**సమ విభాగహరైర్న విభజ్యతే విబుధబోధబుధైరపి సేవ్యతే ॥**

ఈ విద్యాదేవత భూమండలాధిపతిచేతను, గొప్ప శత్రువుచేతను, భాగము పంచుకొన్నవారిచేతను హరింప శక్యము కాదు భయరహితమగు అక్షయమగు ధనము వంటిది గొప్ప జ్ఞానులచేత గూడ సేవింపబడుచున్నది

**శ్రియః ప్రదుగ్ధే విపదో రుణద్ధి యశాంసి సూతే మలినం ప్రమార్ష్టి ।**
**సంస్కారశౌచేన పరం పునీతా శుద్ధా హి బుద్ధిః కిల కామధేనుః ॥**

పరిశుద్ధమగు బుద్ధి(జ్ఞానము) అనగా సంస్కరింపబడిన విద్య సంపదల నొసగును, ఆపత్తుల పోగొట్టును, కీర్తిని గలుగజేయును బుద్ధి మాలిన్యమును పోగొట్టును సంస్కారముచే శుద్ధమగుటచేత మనుష్యుని శుచిగా చేయును

**న చోరహార్యం న చ రాజహార్యం న భ్రాతృభాజ్యం న చ భారకారి ।**
**వ్యయే కృతే వర్ధత ఏవ నిత్యం విద్యాధనం సర్వధనప్రధానమ్ ॥**

దొంగలచే అపహరింపబడనిదియు, రాజులచే తీసుకొనుటకు సాధ్యపడనిదియు, సోదరులచేత విభజించుటకు వీలులేనిదియు, భారము కానిదియు నగు విద్యాధనము వ్యయము చేయగా వృద్ధినే పొందును కనుక అన్ని ధనములకన్న నిది ప్రధానముగా నున్నది

**మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే**
**కాన్తేవ చాభిరమయత్యపనీయ ఖేదమ్ ।**
**లక్ష్మీం తనోతి వితనోతి చ దిక్షు కీర్తిం**
**కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా ॥**

విద్య యనునది తల్లివలె రక్షించును తండ్రివలె హితమును బోధించును ప్రియురాలివలె దుఃఖమును పోగొట్టి సంతోషింపజేయును సంపత్తును కలుగజేయును కీర్తిని సమస్త దిక్కులలో వ్యాపింపజేయును

విద్య యనునది కల్పవృక్షమువలె సమస్తము నొసంగును

**విద్యానామ నరస్య కీర్తిరతులా భాగ్యక్షయే చాశ్రయో**
**ధేనుః కామదుహా రతిశ్చ విరహే నేత్రం తృతీయం చ సా ।**
**సత్కారాయతనం కులస్య మహిమా రత్నైర్వినా భూషణమ్**
**తస్మాదన్యముపేక్ష్య సర్వవిషయం విద్యాధికారం కురు ॥**

విద్య యనునది మనుజానికి స్థిరమగు కీర్తివంటిది దారిద్ర్యదశలోను ఆశ్రయ మగుచున్నది కోరిన కోరికల నొసంగెడు కామధేనువు ప్రియజన వియోగము గలుగునెడల అతులమగు సంతోషమును గలుగజేయునది ఆవిద్య మూడవ నేత్రముగా నున్నది (జ్ఞానదృష్టి) గౌరవమునకు స్థానము, కులమునకు ప్రతిష్ఠ విద్యాభూషణము రత్నములు లేకనే ప్రకాశించును కనుక ఓ మానవులారా, ఇతర వస్తుచింతనలన్ను మాని సుస్థిరమగు విద్యయందే యధికారులు కండు( విద్యనే సంపాదించుడు)

**కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చంద్రోజ్జ్వలా**
**న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతా మూర్ధజాః ।**
**వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే**
**క్షీయన్తేఽఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్ ॥**

పురుషునకు భుజకీర్తులు, సూర్యహారములు, చంద్రహారములు మొదలగు సొమ్ములుగాని, స్నానము, చందనము పూసికొనుట, పూవులు ముడుచుకొనుట, కేశములు దువ్వుకొనుట - ఇవి యేవియు అలంకార ములు గావు సంస్కరింపబడిన వాక్కుమాత్రమే (సంస్కృతవిద్య) పురుషుని అలంకరించును సువర్ణమయాది భూషణము లన్నియు నశించును వాగ్భూషణ మొక్కటియే నశించని భూషణము

**రూపయౌవన సంపన్నా విశుద్ధకులసంభవాః ।**
**విద్యాహీనా శోభన్తే నిర్గంధా ఇవ కింశుకాః ॥**

సౌందర్యము, యౌవనము గల వారలైనను పవిత్రమగు కులములో

జన్మించిన వారైనను, విద్యలేని వారలు వాసనలేని మోదుగుపువ్వువలె ప్రకాశించరు ( ఎఱ్ఱబాడిసె పువ్వువలె నిరుపయోగము )

**కోకిలానాం స్వరో రూపం పాతివ్రత్యం తు యోషితామ్ ।**
**విద్యా రూపం విరూపాణాం క్షమా రూపం తపస్వినామ్ ॥**

కోకిలకు కంఠస్వరమే సౌందర్యము స్త్రీలకు పతిభక్తియే సౌందర్యము కురూపులకు విద్యయే సౌందర్యము యోగులకు శాంతమే సౌందర్యము

**కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః ।**
**వసన్తకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥**

లోకములో జ్ఞానులు అజ్ఞానులును ఆకారాదులలో ఒకే రీతిగానుందురు అందుచే కోకిల, కాకి వీటికివలె వారలకు భేదము కనబడదు వంసతకాలము రాగానే కాకియొక్కయు, కోకిలయొక్కయు భేదము స్వరముచే గుర్తెఱుంగునటుల, జ్ఞానులయొక్కయు అజ్ఞానులయొక్కయు భేదము సభామధ్యమున విస్పష్టముగా తెలియబడుచున్నది

**హంస శ్శుక్లో బక శ్శుక్లః కో భేదో బకహంసయోః ।**
**నీరక్షీరవిభాగే తు హంసో హంసో బకో బకః ॥**

తెల్లకొంగ, హంస వర్ణములో ధవళములై( తెల్లనివై) యున్నవి ఆకారభేద మేమియు నగపడుట లేదు జలమునుండి పాలను వేరు చేయుటయందు హంస హంసయే, కొంగకొంగయే అనగా వాటి యోగ్యత యప్పుడే బయల్పడును ఇటులనే కాషాయాంబరాది వేషములు ధరించిన సన్న్యాసులును జ్ఞానసంపన్నులగు పరివ్రాజకులును, ఆకారవేషాదులలో సమానులుగానే యుందురు అయినను తత్త్వార్థము గ్రహించుటలలోను, యథార్థమగు బ్రహ్మతత్త్వమును బోధించుటలోను, పరమహంసలయోగ్యత స్పష్టమగుచున్నది

**ఉభాభ్యామేవ పక్షాభ్యామాకాశే పక్షిణాం యథా ।**
**తథా గతి ర్ముముక్షూణాం జ్ఞానేనాపి చ విద్యయా ॥**

ఏలాగున పక్షులకు సుఖముగ ఆకాశమునందు విహరించుటకు రెండు పక్షము లవసరములో, ఆలాగున ముముక్షువులకు బ్రహ్మమందు ప్రవేశము కలుగుటకు జ్ఞానము విద్యయు అత్యవసరములు

**యథా జలేనానలేన నై కేన పచనక్రియా ।**
**తపోవిద్యాద్వయేనైవ నైకస్మాన్మోక్షసంగతిః ॥**

ఏ విధముగ కేవలము జలముచేతనుగాని, అగ్నిచేతగాని పచనకార్యము జరుగదో, అందుకు రెండును అవసరములో, ఆలాగున కేవలము తపస్సుచేతను కేవలము విద్యచేతను మోక్షము నొందుటయు సాధ్యపడదు మోక్షప్రాప్తికి తపమున్ను విద్యయు నవశ్యముగ అపేక్షితములే

**జలాగ్నిభ్యాం యథా యంత్రః చలత్యన్యతరేణ న ।**
**తథా విద్యాం చ యోగం చ ప్రాప్య జీవో విముచ్యతే ॥**

ఏలాగున నిప్పుచేతను, నీటిచేతను మాత్రమే యంత్రము నడుచునో యొకదానిచే మాత్రము నడువజాలదో,ఆలాగున విద్యచేతను, యోగము చేతను మాత్రమే జీవుడు ముక్తి నొందగలడు ఒకదానిచే మాత్రము ముక్తుడు గాజాలడు

**యథా చౌషధపథ్యాభ్యామామయః పరిశామ్యతి ।**
**తథైవ భవరోగోఽపి విద్యానుష్ఠానతశ్చ్యవేత్ ॥**

రోగము ఔషధపథ్యములచేత నెటుల శమించునో, అటులే భవరోగ మున్ను విద్యవలనను,అనుష్ఠానమువలనను క్రమముగ నశించును

**నేత్రహీనో యథా స్వర్ణం న పరీక్షేత క్వచిత్ ।**
**తథా విద్యావిహీనోఽపి న చాత్మానం నిరీక్షతే ॥**

గ్రుడ్డివాడు ఏలాగున సువర్ణము వరపువేసి ఒకప్పుడైనను వన్నె తెలు

సుకొనజాలడో, అదేరీతిగ విద్యాహీనుడును ఆత్మానాత్మల వివేచనచేసి బ్రహ్మమును దెలిసికొనజాలడు

**నిదానమూఢస్తు యద్వన్న శక్నోతి చికిత్సితుమ్ ।**
**తద్వద్విద్యావిహీనోఽపి బ్రహ్మాణం నైవ విన్దతి ॥**

ఆయుర్వేదములో జెప్పిన రోగవిదానము (కారణము) దెలియనివా డేలాగున చికిత్సచేయుట కనర్హుడో, ఆలాగున విద్యలేనివాడు బ్రహ్మమును దెలిసికొని పొందుటకు సమర్థుడు గాడు

**యథాఽన్ధః కర్ణధారస్తు సమ్యగ్జ్ఞావం న చాలయేత్ ।**
**తథా న శ్రుతహీనోఽలం సంసారార్ణవలంఘనే ॥**

ఏలాగున కన్ను గనబడని చుక్కానివాడు ఓడను చక్కగ నడపి గమ్య స్థానమును జేర్చజాలడో, ఆలాగున గురుముఖమున శాస్త్రశ్రవణమును చేయనివాడు సంసారసాగరమును స్వయముగ తరించుటకుగాని యితరులను తరింపజేయుటకుగాని శక్తుడుగాడు

**యథాఽన్ధ శ్చిత్రితుం నాలం చిత్రం చిత్తవిభావితః ।**
**తథా విద్యావిరహితః బ్రహ్మ నిశ్చేతుముత్తమమ్ ॥**

ఏలాగున అంధుడు తన హృదయభావము ననుసరించి చిత్తరువును చిత్రింప సమర్థుడు గాడో,ఆలాగున విద్యలేనివాడు ఉత్తమమగు బ్రహ్మమును నిశ్చయించి ధ్యానము జేయజాలడు

**శూరోఽవ్యనాత్త శస్త్రాస్త్రః రణే జయతి నో రిపూన్ ।**
**శ్రుతిస్మృతివిహీనోఽపి మాయాం నైవ తరేద్ధ్రువమ్ ॥**

మిక్కిలి శూరుడైనను, యోధుడైనను అస్త్రశస్త్రములు లేనిచో రణ రంగమందు నేలాగున శత్రువులను జయించజాలడో, ఆలాగున శ్రుతిస్మృతుల సారమెఱుంగనివాడు అవిద్యాసంబంధ గుణములను జయించజాలడు, ఇది నిశ్చయము

**వినా జలం వినా చాన్నం యథా జీవో న జీవతి।**
**విద్యాం జ్ఞానం వినా తద్వదమృతత్వం న విన్దతి॥**

జీవుడు, అన్నమును జలమును లేనిచో నేలాగున సుఖముగా జీవింప జాలడో, అదేరీతిగ విద్యయును జ్ఞానమును లేనిచో మోక్షమును బొంది శాశ్వతానందమును పొందజాలడు

**వినాఽగ్నిం చ వినా వాయుం న ద్రవే ల్లోహఖండకః ।**
**విద్యాం యోగం చ న వినా భవేత్కర్మాపి భస్మసాత్ ॥**

నిప్పు, తిత్తిచే ఊదబడిన గాలియు లేనిచో ఏలాగున ఇనుము మొదలగు లోహఖండము కరుగదో, ఆలాగున ధ్యానయోగము, సంస్కృత విద్యయున్ను, లేనిచో కర్మము భస్మము గాజాలదు

**యథా చోచ్ఛ్వాసనిశ్వాసౌ వినా న సుఖజీవనః ।**
**విద్యాజ్ఞానవిహీనోఽపి సుఖం బ్రహ్మ న విన్దతి ॥**

మానవుడు ఉచ్ఛ్వాస నిశ్వాసములు జక్కగ నడువని వాడైనచో నేలాగున సుఖముగ జీవింపజాలడో, అట్లు విద్యయు జ్ఞానమును లేనివాడు బ్రహ్మసుఖము పొందజాలడు

**అన్నవ్యంజనసంయోగో యథా భోజనభాజనమ్ ।**
**తథా జ్ఞానం చ విద్యా చ యోగసిద్ధేర్హి కారణమ్ ॥**

మానవుడు అన్నమును కూరయును శుద్ధములుగా నుండినచో నేలా గున సుఖముగ భోజనము జేయగలడో, ఆలాగున విద్యయును, జ్ఞానమును యోగసిద్ధికి కారణము లగుచున్నవి

**యావద్వర్షాతపాభ్యాం వై సస్యానాం చ ప్రయోజనమ్ ।**
**తావచ్ఛాస్త్రం చ యోగశ్చ సాధకస్య సహాయకృత్ ॥**

ఎంతకాలమువఱకు అనుకూలమగు వానయు, నెండయు గలిగి యుండునో అంతవఱకు సస్యములు ప్రయోజనపడును ఆలాగున ఎంత

వఱకు శాస్త్రశ్రవణము, యోగాద్యనుష్ఠానము కల్గియుండునో అంత వఱకు నవి సాధకునికి సహాయకములై యుండును

**గమనే యతమానోఽపి యథాఽంధో వర్త్మ నాప్నుయాత్ ।**
**ఆత్మమార్గే తథా మర్త్యో విద్యాహీనోఽపి సాధకః ॥**

గుడ్డివాడు యత్నపూర్వకముగ నడవగలడుగాని, మార్గమును మార్గపార్శ్వ వస్తువులను నేలాగున దెలుసికొనజాలడో, అలాగున సాధనపరుడై యుండినను నరుడు విద్యావిహీనుడైనచో బ్రహ్మమార్గమును దెలుసుకొని ముక్తిపదమును జేరజాలడు

**శిలాయాశ్చ సురాక్షారస్యోభయస్యైవ యోగతః ।**
**వహ్నిః తపోవిద్యయోశ్చ జ్ఞానం చావిర్భవేద్ధ్రువమ్ ॥**

ఏలాగున మణిశిలయు పొటాసియుము కలియునప్పుడు అగ్ని యావిర్భవించునో, అలాగున తపస్సుతోగూడ విద్యయును జేరునపుడు బ్రహ్మజ్ఞానాగ్ని ప్రజ్వరిల్లును ఇది ధ్రువము(సత్యము)

**ప్రాణవాయుద్వయాదేవ యథా వారి భవేత్తథా ।**
**విద్యాతపోద్వయేనైవ జ్ఞానమాత్మ ప్రకాశకమ్ ॥**

ఏలాగున రెండు విధములగు ప్రాణవాయువులయొక్క అనగా ఆక్సిజన్ హైడ్రోజన్ వీటియొక్క కలయికచేత జలముద్భవించునో, అలాగున విద్య, జ్ఞానము ఈరెంటిచేత ఆత్మను ప్రకాశింపజేసెడి జ్ఞానము కలుగు చుండును

**యథాఽన్నేన క్షుధా శాంతా పిపాసాఽపి చ వారిణా ।**
**ఏవం జ్ఞానేన విశ్రాన్తిర్విద్యయా శోకమోచనమ్ ॥**

ఏలాగున అన్నముచే ఆకలిశాంతియు, జలముచే దాహశాంతియు, జీవులకు గలుగుచుండునో, అలాగున జ్ఞానముచేత ఆత్మవిశ్రాంతియు, బ్రహ్మవిద్యచేత శోకశాంతియు జీవులకు గలుగుచుండును

**క్షారనీరయుతస్తప్తః సమలో నిర్మలః పటః ।**
**విద్యాయాశ్చ సదాచారాత్ శుద్ధ్యేన్నిర్గత పాతకః ॥**

ఏలాగున రజకుండు చవుడుచేతను, జలముచేతను మలిన వస్త్రమును ఉడుకబెట్టి, ఉతికి శుభ్రముగా జేయుచుండునో, ఆలాగున బ్రహ్మ విద్యచేతను, సదాచారానుష్ఠానముచేతను సాధకుడు పాపమలమునుండి విముక్తుడగు చున్నాడు

**త్రిధాతునాడీమజ్ఞాత్వా యథా వైద్యో న రోగవిత్ ।**
**తథాऽవిద్యో న పురుషో గుణాతీతం ప్రపశ్యతి ॥**

ఏలాగున వాత, పిత్త, శ్లేష్మములను నాడీత్రయగమనము తెలియని వాడు రోగమును దెలియనివా డగుచున్నాడో, అట్టివాడెట్లు వైద్యుడు గాడో, ఆలాగున విద్యావిహీనుడగు పురుషుడు త్రిగుణముల నెఱింగి గుణత్రయాతీతమగు బ్రహ్మమును బొందజాలడు

**మూకస్త్వేక మపి బ్రూయాన్న భావం హృదయస్థితమ్ ।**
**తథా జ్ఞాన్యపి చావిద్యః నాలం లోకాన్ ప్రబోధయేత్ ॥**

మూగవాడు ఎంత విజ్ఞానవంతుడై యుండినను తనయొక్క హృదయభావమును గొంచెమైనను జనులకేలాగున జెప్పశక్తుడు గాడో అదే రీతిగ నెంత ఆత్మజ్ఞాని యైనను, విద్యావంతుడు గానిచో లోకమునకు ధర్మము నుపదేశింపజాలడు

**రసజ్ఞోऽపి న మూకస్తాన్ యథా వక్తుమలం భవేత్ ।**
**జ్ఞానవానసి నిర్విద్యో నాలం బోధయితుం జనాన్ ॥**

మూగవాడు షడ్రసోపేతములగు శ్రేష్ఠవస్తువులను భుజించి తృప్తుడై యుండినను ఆరసములను ఏలాగున నితరులకు జెప్పజాలడో, ఆలాగున జ్ఞానముచే తృప్తిబొందిన పురుషుడైనను విద్యలేని వాడైనచో ఆ దివ్య బోధమును శ్రుతియుక్త్యనుభవములచే జనులకు బోధింపజాలడు.

**అంధో యథా బాణధారీ న లక్ష్యం విధ్యతి క్వచిత్।**
**సాధకోఽపి చ నిర్విద్యస్తథా బ్రహ్మ న విన్దతి॥**

అంధుడు ఎంత బలస్థుడై యుండినను ఏలాగున బాణమును చేబూని లక్ష్యమును భేదింపజాలడో, ఆలాగున యోగాద్యనుష్ఠానమందు సాధకుడు ఎంత నిపుణుడైనను వేదాంత విద్య లేనిచో బ్రహ్మమును బొందజాలడు

**విద్యాహీనస్య యజ్జ్ఞానం తజ్జ్ఞానం కూపభేకవత్ ।**
**శాస్త్రజన్యం తు యజ్జ్ఞానం విపులం శోభనం చ తత్ ॥**

విద్యలేనివాని జ్ఞానము కూపస్థమండూకమువంటిదే యగును విశాలమైన విశ్వైకజ్ఞానమును, శాస్త్రమర్యాదయును అతనికి నుండదు ఉత్కృష్టశాస్త్రజ్ఞాన మైనచో నది ప్రపంచజ్ఞానమును విపులమగు వేదాంత జ్ఞానమును గలుగజేయును

**బధిరః ఖలు సంగీతరసం భోక్తుం న పారయేత్ ।**
**ఏవం విద్యావిహీనోఽపి వేదాంతశ్రవణామృతమ్ ।**
**తథా భక్తిరసం వాఽపి జ్ఞాతుం భోక్తుం న పారయేత్ ॥**

బధిరుడు (చెవిటివాడు) ఏలాగున సంగీతరసమును అనుభవింపజాలడో, ఆలాగున విద్యావిరహితుడు వేదాంతశ్రవణజనిత జ్ఞానామృతమును గాని, భక్తిరసమునుగాని అనుభవించుటకు (తెలిసికొనుటకు) సమర్థుడుగాడు కావున ఉత్తమమగు సద్విద్య ఉండినమాత్రమే వేదాంతజ్ఞానమును, భక్తిరసమును అనుభవించి జన్మసాఫల్యమును జేసికొనుటకు సమర్థుడగును

**ఓం అసతో మా సద్గమయ**
**తమసో మా జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతం గమయ॥**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

ద్వైవిద్యే వేదితవ్యే తు

శబ్దబ్రహ్మ పరం చ యత్



శబ్దబ్రహ్మణి నిష్ణాతః

పరం బ్రహ్మాధిగచ్ఛతి

ఓమ్

# పీఠిక

నిర్విఘ్న యోగసిద్ధి కలుగుటకై ముముక్షువులకు, భక్తులకు కావలసిన విషయము లన్నియు విస్తారమును సంక్షిప్తమును గాక గ్రహించవలసిన సారమంతయు దీనియందు నిరూపించడమైనది ప్రస్తుత మెచ్చుట చూచినను, పురాతన ఋషుల చరిత్రముల నవలోకించినను ముఖ్యముగ ఒక్క సంగతి కనబడుచున్నది అదేమన స్త్రీపురుష లొకేస్థలమునం దుండుటయే యగును ఇది యుభయులకును శ్రేయస్కరము కాదు దీనియందు స్త్రీయొక్క దోషమేమియు ప్రత్యేకముగా చెప్పదగినది లేదు సృష్టియొక్క శక్తి ఆలాగున నుంటున్నది సృష్టికర్త తన శక్తినంతయు దీనియందే స్థిరపరచియున్నాడు అది లేనిచో సృష్టియే నశించును ఏ తపశ్శక్తిచే బ్రహ్మసృష్టి చేసెనో, అట్టి తపఃప్రభావము గలవాడు మాత్రమే సృష్టిని జయించగల్గును అయితే బ్రహ్మయొక్క తపఃప్రభావము అమోఘమైనది, అపారమైనది లేనిచో బ్రహ్మాండములను, చరాచరప్రాణికోట్లను సృజింప జాలడు మానవునకు తనయాత్మ జయమునకు అంత మహాతపస్సు అక్కర లేదు తనయందుగల విషయ దోషమును రహిత మొనర్చిన చాలును

**పృథివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థనిమిత్తకమ్ ।**
**జిహ్వోపస్థపరిత్యాగే కో న ముచ్యేత బన్ధనాత్ ॥**

భూలోకములోగల సమస్త ప్రాణికోటులును జిహ్వేంద్రియ, గుహ్యేంద్రియములకొరకే సకల కార్యములను చేయుచున్నవి ఈ రెండింద్రియములను నిగ్రహించినవాడు ఎవడు ముక్తుడు కాకున్నాడు? అని పరాశర మునివరుడు వచించెను ఈ రెండింద్రియము లెంతవఱకు తెరువబడి యుండునో అంతవరకు మోక్షద్వారము మూయబడి యుండును ఈ యింద్రియద్వయ మెప్పుడు మూయబడునో మోక్షద్వార మప్పుడు తెరువబడును అయితే ఈ యింద్రియ ద్వంద్వమును బంధించిన ఎట్లు జీవించ గలుగుదుమని సందేహపడ నక్కరలేదు ఈ యింద్రియములు

రెండింటిలో రెండేసి వృత్తులు గలవు తక్కిన నేత్రాదింద్రియము లన్నిటిలోను ఒక్కొక వృత్తిమాత్రమే గలదు ఈ యింద్రియములలోగల ఒక్కొక వృత్తిని తొలగించిన సమరసజ్ఞానము గలుగును జిహ్వేంద్రియమునకు రసమును గ్రహించుట, వాక్యము నుచ్చరించుట యని యుభయవృత్తులు గలవు గుహ్యేంద్రియమునకు దేహసంరక్షణకొఱకు నీరును వదలుట, మఱి యొక్కటి సృష్టి చేయుట యనునవి గలవు ఇచట సృష్టి హేతుకార్య ముపేక్షించిన వానికి పునర్జన్మ ముండదు పురుషునకైననేమి, స్త్రీకైననేమి ఈ సృష్టివృత్తు లెంతకాలమువఱకుండునో, అంతవరకు పునర్జన్మము తప్పక గలుగును జన్మరాహిత్యము పొందదలంచువాడు ఈ యింద్రియములను నిరోధించుకొనవలయును ఆలాగుననే రసమును గోరి భోగపరత్వమును పొందనీయక యోగపరత్వమునకు దగిన యాహారము భుజించిన ఈజిహ్వేంద్రియమును నిరోధించినవాడగును అట్టివా డమృతత్వమును పొందగలుగును కావుననే శాస్త్ర మీలాగున వచించుచున్నది?

**వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వప్యసక్తో హి నరో నారాయణో భవేత్ ★॥**

బ్రహ్మదేవుడు రెండు విధములగు భ్రమలతో గూడ మానవులను సృష్టించెను ఆ భ్రమ లెవ్వియన కాంతలయందును కనకమందును కలుగునవి యని గ్రహించేది ఈ యిరుతెగల భ్రమలనుండి విముక్తి నొందిన నరుడు నారాయణుడగును లేక అట్టి మనుష్యుడు ఈశ్వరుడగును ఈ జీవుడే శివత్వము నొందగలుగును శివజీవైక్యము, నరనారాయణైక్యము, ఆత్మ పరమాత్మైక్యము పొందగలవా డిట్టిస్థితి గలిగియుండవలయును, అట్టి జీవిమాత్రమే సంసార కాలచక్రమునుండి, సంసార భ్రమనుండి విముక్తి పొందగలగును కావుననే భ్రమం చక్రే అని ప్రయోగింపబడినది ''ఖండితం హి జగత్సర్వం సదేవాసురమానుషమ్''– సర్వప్రాణికోటులును, దేవతలును, అసురులు, రాక్షసులు వీరెల్లరు దీనివలననే బద్ధులైరి అని

★'' భర్గో నామ నరాకృతిః'' అని పాఠాంతరము

దత్తాత్రేయులు వచించిరి దీనిని జయించిన వాడు మాత్రమే బ్రహ్మనిష్ఠు డగును కావుననే భారతమున నిట్లు వచించడమైనది ఈక్రింద కనబడు శ్లోకము భారతమునందేగాక మనుస్మృతి మొదలగు అనేక గ్రంథములందు కనబడుచున్నది మనుమహర్షి కృతయుగమునందుండిన వారగుటచే ఆ మనుస్మృతి శ్లోకమును ఈవల నుండువా రంగీకరించియున్నారు ఆ శ్లోకమున కట్టి ప్రభావము గలిగి యుండుటచేతనే స్మృతులలోను, సంహితలలోను, పురాణములలోను కనబడుచున్నది ఆ శ్లోకమిది

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥**

విరక్తుడై బ్రహ్మనిష్ఠ చేయువాడు తల్లితోగాని, కుమార్తెతో గాని, తోడ బుట్టువుతోగాని యొకే స్థలమున ఉండరాదు ఏలయన ఇంద్రియ సమూహము మిక్కిలి బలము గలిగినది బ్రహ్మవేత్తయొక్క మనస్సునైనను కరుగజేయగలుగును స్త్రీలనుండి పురుషులకు చెప్పేలాగున, పురుషుల నుండి స్త్రీలును సంరక్ష చేసికొనవలయును మఱియు బ్రహ్మనిష్ఠనుండి పతితుడగుటకు కారణమొండు గలదు అది ఈక్రింద నిరూపింపబడు చున్నది

**విహితస్యాననుష్ఠానాత్ నిషిద్ధస్య చ సేవనాత్ ।**
**అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥**

విధిప్రకారము తనయొక్క అనుష్ఠానమును చేయకపోవుటచేతను, నిషిద్ధ కార్యములలో ప్రవేశించుటచేతను, ఇంద్రియముల నిరోధము కలుగకపోవుటచేతను మానవుడు పతితుడగుచున్నాడు ఓహో! దీనికన్న పరమోపదేశము మఱియొకటి కావలయునా?

ఇక నీ పీఠికను వ్రాసి పెంచదలంచలేదు ఒక ఋషిదగ్గర చిరకాలము సేవ చేయుచుండిన శిష్యుడు తీర్థయాత్ర చేయవలయునను తలంపుతో గురుదేవుని ప్రార్థించగా ఆ మహాత్ముడు కరుణ గలిగి ఆశీర్వదించి ఈక్రింద

చెప్పెడి శ్లోకము నుపదేశించి దీని నెప్పుడెప్పుడు స్మరింతువో అప్పుడు నాదగ్గఱ నుండినవాడ వగుదువు అని చెప్పి పంపెను

**బ్రహ్మచర్యమహింసాం చ సత్యం చైవాపరిగ్రహమ్ ।**
**యత్నేన హే రక్షత హేరక్షత హే రక్షతేతి ॥**

ఓ కుమారుడా! ఆత్మపుత్రుడా! ప్రయత్న పూర్వకముగ బ్రహ్మ చర్యమును అహింసను, సత్యమును, అపరిగ్రహమును ఎల్లప్పుడు రక్షింపుమా! రక్షింపుమా! రక్షింపుమా! యని ముమ్మారులు పలికెను నిర్మల హృదయమున్ను, గురుదైవములయందు విశ్వాసమున్ను కలిగినవానికి దీనికన్న ఎక్కువ చెప్పవలసిన పని లేదు ''గురుదైవత భక్తానాం న భయం విద్యతే క్వచిత్'' గురుదేవుని యందును, ఇష్టదైవము నందును విశ్వాసము గలవారి కెచ్చటను విఘ్నమును, భయమును గలుగవు పురుషులకు బ్రహ్మనిష్ఠయందెంత యధికారము గలదో, స్త్రీలకును అట్టి యధికార మనాదికాలమునుండి యేర్పడియున్నది విశాలమైన ప్రదేశమున స్త్రీ పురుషులకు ప్రత్యేక స్థలము లేర్పడియుండిన ఒకే స్థలములో నుండుట అంత విరోధము లేదుగాని, అట్లుగానిచో నుభయులును వేరు వేరు ప్రదేశములయం దుండుటయే శ్రేయస్కరము

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు
ఓం తత్ సత్ ఓమ్

చరాచర సుఖాభిలాషి

శ్రీమలయాళస్వామి



# నిర్విఘ్న యోగసిద్ధి

## మొదటి భాగము

**ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।**
**తేజస్వి నావధీతమస్తు । మా విద్విషావహై ॥**
**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

సహ – నౌ – అవతు – సహ – నౌ – భునక్తు – సహ – వీర్యం– కరవా వహై – తేజస్వి – నౌ – అధీతం – అస్తు – మా –విద్విషావహై॥

(బ్రహ్మ=పరబ్రహ్మము), నౌ సహ=గురుశిష్యులగు మా యిరువురను, అవతు = రక్షించునుగాక! నౌ సహ = మా యిరువురను భునక్తు= (ఆత్మజ్ఞానమును) అనుభవింపజేయుగాక! సహ = మేమిరువురముగూడ, వీర్యం = సామర్థ్యమును, కరవావహై = సంపాదింతుముగాక! నౌ= మా యిద్దరియొక్క, అధీతం = అధ్యయనము, తేజస్వి=తేజోవంతమైనది, అస్తు=అగుగాక, మా విద్విషావహై=పరస్పరము ద్వేషింపకుందుముగాక!

పరబ్రహ్మము(పరమేశ్వరుడు) శిష్యాచార్యులమగు మమ్ము రక్షించుగాక! మమ్ములను పాలించు గాక! మేమిద్దరమును విద్యాసామర్థ్యమును గలిగి యుందుము గాక! మా యిద్దరియొక్క యధ్యయనము తేజోవంత మగును గాక! మేమిద్దరము వైమనస్యము లేక యుందుముగాక!

ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవికము లను దోషత్రయము శమించుట కొరకును, కాయిక వాచిక మానసికములను దోషత్రయము శాంతించుటకొఱకును, ఉచ్చారణ క్రియా ద్రవ్యములలో లోపమేదైన ఉండినచో క్షయించుటకొఱకున్ను ముమ్మారు శాంతిమంత్రమును

పఠించడమైనది ఇది కృష్ణయజుర్వేద తైత్తిరీయోపనిషత్తుయొక్క శాంతిపాఠమై యున్నది దీనిని పవిత్రభావముతో పఠించువారికి పైజెప్పిన దోషత్రయము నశించుటయే గాక, గురుశిష్యులకు ఎప్పటికిని మనోవైరుధ్యము గలుగకపోవునదేగాక, సదా పరస్పరప్రేమయు, ఆంతరంగిక విశ్వాసమున్ను గలిగియుందురు

**యోగసిద్ధేశ్చ న్తరాయా బలాదాయా న్తి భూరిశః ।**
**తేషాం నివ ర్తనోపాయః గురుదైవతధర్మతః ॥**

యోగసిద్ధికి అనేకముగా విఘ్నములు ప్రకృతిబలమువలన వచ్చు చున్నవి వాటిని నివర్తించు ఉపాయము గురువు, దైవము, ధర్మము అను వానివలన సిద్ధించుచున్నది శ్రీగురుదేవునియొక్కయు, ఈశ్వరుని యొక్కయు, ధర్మదేవతయొక్కయు కడుంగడు అనుగ్రహముచే బహుళ ముగా సంభవించుచున్న యంతరాయము లన్నియు దొలగుచున్నవని భావము

ఈశ్వరకరుణగాని, గురుదేవుని యనుగ్రహముగాని, ధర్మదేవత యాశీర్వాదముగాని లేనిచో సాధకునికి గల విఘ్నములు దొలగవు ప్రతి దానికిన్ని ఒక్కొక్క ధర్మదేవత గలదని యార్షసిద్ధాంతము ఆస్తికు లయినవారు ఈశ్వరునిపై నమ్మకము గలిగియుందురు ఆస్తిక్యబుద్ధి లేనివారు కూడ ధర్మబుద్ధి గలిగి ప్రవర్తించుదురు వాస్తవముగ విచారించిన రెండును ఒకటియే ధర్మబుద్ధి గలిగి ప్రవర్తించువారిని ధర్మదేవత ఎల్లప్పుడును రక్షించు చుండును. వారికి ఎలాటి అపాయమున్ను గలుగనీయక తన నీడవలె వెంబ డించి రక్షించుచుండును రాజును అంగరక్షకులు ఏలాగున ఏలాటి అపాయ మున్ను గలుగనీయక చూచుచుందురో, ఈ ధర్మదేవతయు నాలాగున విఘ్న ములు గలుగనీయక సంరక్షించుచుండును కావుననే ''ధర్మో రక్షతి రక్షితః'' ధర్మమును రక్షించువారిని ధర్మము రక్షించునని చెప్పుట ధర్మమున కధిదేవత యేలాగున నుంటున్నదో, ఆలాగున నధర్మమునకున్ను అధిదేవత గలదు అది సమయము దొరకుటకు కనిపెట్టి సమయము దొరకగానే

విఘ్నములను గలుగజేసి పతితునిగా జేయును పాతకకృత్యము లొనర్చెడి గొప్పదొం॥ను పోలీసువారు కనిపెట్టియుండి సమయము దొరకినప్పుడు ఎట్లు బంధింతురో అధర్మపరుని గతియు నాలాగున నుండును కావుననే గురువుయొక్క కృపయు, లేక యీశ్వరకరుణయు, లేక ధర్మదేవత యను గ్రహము గలిగేలాగున ప్రతివారును చూచుచుండవలయును అందువలననే కొన్ని కార్యములు తీర్మానము చేయదలంచినపుడు కుదరకపోయిన ఇచ్చట కొన్ని దుష్టశక్తులు గలవని చెప్పుదురు

**తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।**
**ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే ॥**

**(ఆత్మబోధము)**

శాస్త్రోక్తములయిన జప, ధ్యాన, తపము లీశ్వరార్పణ బుద్ధితో చేయు నపుడు సమస్తపాపములు నశించి, ప్రకృతివికృతులు క్షయించి, నిర్మల హృద యులై పరమశాంతు లగుదురు తదుపరి రాగద్వేషములు నశించి, విషయ విరక్తి గలిగి వైరాగ్యమును పొందుదురు పిమ్మట మోక్షమందు తీవ్రతర విచారణ గలుగును అట్లున్నవారు నిరతిశయానంద మోక్షము నొందుదురు ఈలాగున ఆత్మశుద్ధి గలుగకపోవుటయే అనేక విఘ్నములు గలుగుటకు కారణమగుచున్నది

**పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః ।**
**గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥**

పై నుదాహరించిన ప్రకార మాచరించువారి హృదయము దూదివలె పవిత్రమై యుండును అగ్ని ప్రవేశించినపుడు దూది యేలాగున భస్మమగు చున్నదో ఆలాగుననే గురూపదేశ సమయములందు హృదయగ్రంథులు నశించి, స్వరూపజ్ఞానసిద్ధి యుదయించును ఆలాగుననే గురువునందును దైవమునందును భక్తి గల సకల మనుజులకును ప్రయాసము లేకయే త్వరలోనే యాత్మసిద్ధి గలుగునని యపరోక్షానుభూతి

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥** (కఠోపనిషత్తు)

ఒకని హృదయమందున్న సమస్త సంకల్పములు, సంస్కారములు నశించునప్పుడు శరీరముతో గూడియుండినను ఈ లోకములోనే అతడు ముక్తుడును, పరబ్రహ్మానందము ననుభవించినవాడును అగుచున్నాడు

**కొందఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు**
**గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేక**
**ఉపరతిసుఖంబు గానక విపులవిషయరాగ**
**లోలత జెడుదు రూరక మహాత్మ!** (సీతారామాంజనేయము )

వేదాంతమునకు అనగా బ్రహ్మవిద్యకు గలిగిన పతనమునకు ఇదియే కారణము ముముక్షు అవస్థలో, సాధనావస్థలో, అభ్యాసావస్థలో, జిజ్ఞాసావస్థలో నుండువారు తమ్ము ముక్తాత్ముల మయితిమని తలంచి విధినిషేధముల నతిక్రమించి ప్రవర్తించిరి అందువలననే అపాయములో బడిపోవుటకు కారణమైనది పైజెప్పిన నలువురకును వాసన నశించదు ఆ పేర్లలోనే దీని యొక్క రహస్యము గలదు మోక్షము నిచ్ఛించువాడు ముముక్షువనియు, సాధ్యావస్థకు యత్నించువాడు సాధకుడనియు, ఆరూఢస్థితి నొందుటకు ప్రయత్నించువా డభ్యాసియనియు, తత్త్వమును దెలిసికొనుట కాసక్తి గలవాడు జిజ్ఞాసువనియు అర్థము గలిగియున్న సంగతిని మఱచుటచేతనే ఇంత యనర్థము గలిగినది వీరు తమలోగల దోషములను గనిపెట్టి ప్రాయశ్చిత్తాదులు చేయుచుండుటచే త్వరలోనే శుద్ధాత్ము లగుదురు

**వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।**
**మలినా జన్మ హేతుస్స్యాత్ శుద్ధా జన్మవినాశినీ ॥**

జీవులకు శుద్ధమనియు, అశుద్ధమనియు వాసనలు ద్వివిధములు మలిన వాసన యైనయెడల విషయమందు ప్రవేశించి యనేకమైన జననమరణములను దుఃఖసాగరమునకు పాత్రుడగును శుద్ధవాసన యైనచో

జన్మరహితమగు శాశ్వతానంద ముక్తిని పొందును

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్ ।**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥**

మంచి చెడుగులను రెండు మార్గములుగా ప్రవహించెడు వాసనయను నదిని గొప్ప పురుష ప్రయత్నముచే యశుభ వాసననుండి శుభవాసనా మార్గముగా ద్రిప్పవలయును అని వాసిష్ఠము

నదిలో ప్రయాణము చేయు నావికులు నది రెండు పాయలుగ చీలుచుండు స్థలమున ఏ పాయలో తాము పోవలయునో ఆ దారికి పడవను ద్రిప్పి గమ్యస్థానమును జేరునట్లు ధీమంతులు తమ వాసనను శుభమార్గములోనికి మరలించుటకు ప్రయత్నించవలయును

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

అభ్యాస వైరాగ్యములచే మనస్సును స్వాధీనము జేసికొనుటకు సాధ్యము గానివానికి యోగానుభవము సిద్ధించదని నాయొక్క నిశ్చయాభిప్రాయము కాని ప్రతిదినము క్రమక్రమముగా వైరాగ్య ధ్యానాభ్యాస ప్రయత్నములచే మనస్సు స్వాధీనమగును ఇది నా మతము అని గీత

స్వేచ్ఛగా అరణ్యములో సంచరించెడు గజమునుబట్టి క్రమాభ్యాసముచే నెట్లు మావటివారు స్వాధీనము జేసికొందురో, అలాగున విషయారణ్యములో సంచరించెడు మనస్సనెడి గజమును అనుష్ఠానముచే క్రమముగా వశపరచుకొనవలయును స్వాధీనపడువఱకు మితమైన యాహారమును బెట్టి సాయంప్రాతఃకాలములలో మావటివాడు శిక్షణ నిచ్చుచుండును అలాగున యుక్తాహారము, రెండు సంధ్యలలో ధ్యానానుష్ఠానములను జేయువారికి కొంతకాలమునకు మనస్సు వశపడును

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**

**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాఽమ్భసి ॥**

ఇంద్రియములు పూర్వసంస్కారముచే ప్రపంచవిషయములపై బోవు నపుడు అట్లు పోనీక అడ్డుపరచి ధ్యానమందు నిలుపవలయును అట్లు పోయినచో సముద్రమందు గొప్పగాలికి లోబడిన నావ మునుగునట్లు వీని ప్రజ్ఞయు నశించును

తుపానుగాలి రేకెత్తు లక్షణమును నావికులు తెలిసికొని యోడను అపాయము గలుగని స్థలములోనికి జేర్చునట్లున్ను, లేక లంగరువేసి కట్టి వేయునట్లున్ను సాధకుడు ఏ స్థలములో నుండిన విషయవాసనచే మనస్సునకు మాలిన్యము గలుగునని తోచునో ఆ స్థలమును తప్పక విడువవలయును ఎంత చక్కని దృష్టాంతముతో భగవాను డుపదేశించెనో లది గ్రహించిన ఇంద్రియములు ఎట్లు ప్రవర్తించినను మనసే ప్రధానమని చెప్పెడివారి స్థితిని గ్రహించుకొనవచ్చును

**అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిలభూశ్రియమ్ ।**
**రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి ॥**

రణరంగమునందు ధీరుడై శత్రుసంహారముజేసి మహామండలా ధిపత్యమును బొందక నేను రాజు, నేను రాజనిన మాత్రమున రాజగునా? కాదుగదా? అలాగుననే యింద్రియములనెడి సైన్యములను, మనశ్చిత్తాహం కార బుద్ధులనెడి మంత్రిప్రభృతులను జయింపక మోక్షసామ్రాజ్య పట్టా భిషిక్తుడై రాజయోగి గానేరడు అని వివేకచూడామణి

బాహ్యరాజ్య జయమెట్టిదో ఆత్మరాజ్య జయమున్ను అట్టిదే

**అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।**
**ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్ ॥**

మూఢు డనుభవములేక పరబ్రహ్మానుభవము గలవానివలె వ్యర్థముగా సంతోషించుచున్నాడు అది యెట్లున్నదనగా చెరువుకట్టయందున్న వృక్షా

గ్రఫలము నీటియందు ప్రతిఫలించుచుండగా దానిని జూచి తాను నీటలో మునిగి పండును తీసికొని భుజించుటకు యత్నించువానివలె నున్నది

ఈదృష్టాంత మెటువంటిదో పుస్తకములలోగల వేదాంతవాక్యములను మాత్రము వల్లించి చెప్పువాని స్థితియు నాలాగుననే యుండును

**పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్ ।**
**ధీపూర్వం రేత ఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవ చ ॥**

సన్న్యాసి యయినవానికి రెండు దోషములున్నచో వాడు నిశ్చయముగా పతితుడగును అని యేవనగా, ఒకటి మనఃపూర్వకముగా కృత్రిమభావముతో రేతోనష్టము గలుగజేయుట, రెండవది స్వార్థమునకు ద్రవ్యమును సమకూర్చుట ఈ రెండును బ్రహ్మనిష్ఠుల కుండరాదని సన్న్యాస సముచ్చయము

**తావదేవ నిరోద్ధవ్యం యావద్హృది గతం క్షయమ్ ।**
**ఏతద్జ్ఞానం చ ధ్యానం చ శేషోఽన్యో గ్రంథవిస్తరః ॥**

ఎంతవఱకు హృదయమందు వృత్తిరాహిత్యము గలుగలేదో అంత వఱకును బ్రహ్మానుసంధానమగు ధ్యానమున్ను, శ్రవణ, మనన, నిది ధ్యాసనములనున్ను విడువరాదు యోగముచేతను, జ్ఞాన శాస్త్రముచేతను గురుముఖమునుండియు ఈ రహస్యమే తెలిసికొనందగినది ఇతరములగు సమస్త వేదాన్త శాస్త్రములయొక్క సారమిది యొకటియే

**అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః ।**
**విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః ॥**

ఏలాగున మదించిన దుష్టగజము అంకుశము వినా స్వాధీనము గాదో, ఆలాగున విషయములలో ప్రవర్తించు మనస్సు వైరాగ్యపరమగు ధ్యాన నిష్ఠాభ్యాసము వినా స్వాధీనపడదు అనగా మనోనిరోధమునకు వైరాగ్య పరమగు ధ్యానయోగమే ముఖ్యసాధన మగును

**ధర్మోపదేశసమయే జనాస్సర్వేఽపి పండితాః ।**
**తదనుష్ఠాన సమయే మునయోఽపి న పండితాః ॥**

పరుల కుపదేశించెడి సమయములో జనులందరును మహాపండితులే గాని తానుపదేశించునట్లు అనుష్ఠించెడి విషయములో మునులుగూడ అసమర్థులుగా నుంటున్నారు

**పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణామ్ ।**
**ధర్మే స్వకీయేఽనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః ॥**

వేదాంతమును పరుల కుపదేశించుట చాలా సులభము ఆ చెప్పెడి విధముగా ననుష్ఠానమందుండు మహాత్ముడు ఎచ్చటనో యొకానొకడు మాత్రము గనిపించును

**కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాః సురాగిణః ।**
**తేఽవ్యజ్ఞానతయా నూనం పునరాయాన్తి యాన్తి చ ॥**

బ్రహ్మమునుగూర్చి మాట్లాడుటయందు మహాసమర్థులై యుండియు, పరిశుద్ధ సదాచారహీనులును, విషయాసక్తులు నైనవారెవరు గలరో వారు నిశ్చయముగ అజ్ఞానాంధకారమగు తమస్సులో బడియుండు వారు. వీరు మఱల మఱల చచ్చుచు పుట్టుచు నుందురుగాని మోక్షమును బొందజాలరు

**యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి ।**
**తథాఽఽత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే ॥**

ఏలాగున అగ్నియందు వేగించిన వి త్తనమునకు అంకురించు శక్తి నశించి యుండునో ఆలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైన సంస్కారముగల యాత్మ జ్ఞానికి ప్రపంచ విషయవృత్తులు భస్మములై యుండును

నిప్పులో వేగిన విత్తనమును,పచ్చివిత్తనములును చూచునపుడొకే విధముగ నుండినను వేగిన విత్తనమును భూమిలో నాటిన మొలకెత్తదు

పచ్చిదియైనచో మొలచును ఆలాగున విషయవాసన నశించని వానికి విషయసంసర్గము గలుగునప్పుడు వికారము గలుగును వాసనా క్షయము గలిగిన యోగి యైనచో విషయవికారము గలుగదు

**అబ్ధివద్ధృతమర్యాదా భవన్తి విగతాశయాః ।**
**నియతిం న విముంచంతి మహాన్తో భాస్కరా ఇవ ॥**

మహాత్ములగు విగతాశయులు సముద్రమువలె మర్యాదను గాపాడుదురు సూర్యాదులవలె విధిప్రకారము సన్మార్గమున తప్పక నడతురు అని వాసిష్ఠము

ఏలాగున సముద్రము గొప్పదైనను తన కేర్పడిన చిన్నదైన కట్టను దాటక హద్దులో నిలిచియుండునో, మఱియు సూర్యాదిగ్రహము లెంత గొప్ప ప్రకాశవంతము లయినను తమ కేర్పడియుండు జ్యోతిశ్చక్రరేఖనుండి తప్పక నడుచుచుండునో ఆలాగున ఎంత మహిమగల జ్ఞానియైనను, తన విధిని దాటి యొక్క యడుగైన పెట్టడు ఒక చిన్నకార్యము నయిన జేయడు

**కర్మానురూపేణ గుణోద్గమో భవేద్గుణానురూపేణ మనః ప్రవృత్తిః ।**
**మనోనుగైస్తైరుభయాత్మకేంద్రియైర్నివర్త్యతే పుణ్యమపుణ్యమత్ర ॥**

కర్మమునకు తగినట్లు గుణము కలుగును గుణమునుబట్టి మనస్సు ప్రవర్తించును మనస్సు ననుసరించి యింద్రియములు పుణ్యమునుగాని, పాపమును గాని యాచరించుచుండునని శ్రీశంకర భగవత్పాదులు

కర్మశుద్ధి గలుగనిచో మనశ్శుద్ధి గలుగదనియు, మనశ్శుద్ధి లేనిచో ఇంద్రియములకు శుద్ధి సిద్ధించదనియు ఇందువలన గ్రహించుకొనవల యును మనస్సే ప్రధానమని చెప్పి విషయలోలురై యుండువారి మత మిచ్చట ఖండించడమైనది కర్మయే ప్రధానమని చెప్పబడియున్నను దేహేంద్రియ ములు చేయు ప్రవృత్తికి మాత్రమే మనస్సు కారణమగును కొంత లోతుగా దిగి విచారించిన కర్మానుగుణముగానే మనస్సు ప్రవర్తించునను సత్యమును కనుగొనగలము కావున కర్మమును (ప్రవర్తనమును) మార్పు చేసికొనిన

మాత్రమే మనస్సులో మార్పు గలుగును

వంతెన మొదలగు పనులు జేయువారనేకు లుండినను వారికి కారణ పురుషుడు ఇంజనీరుగా సామాన్యజనులు దలంతురు పనిలోగాని, పనివారిలోగాని యేదైన మార్పు చేయవలసి యుండిన సాధారణజనులు ఇంజనీరుతో ఎూట్లాడుదురు ఇంజనీరులో ఏవైన లోపము లుండిన గొప్పవారు ఎూత్రమే ఇంజనీరుకు కారణభూతమగు ప్రభుత్వముతో మాట్లాడుదురు

ఆలాగున సాధారణ మానవులు ఇంద్రియములు చేయు చేష్టలకు మనస్సు కారణమని తెలిసికొనువఱకు మాత్రమే వెళ్ళుదురు గొప్ప ప్రజ్ఞావంతు డగాధముగా విచారించిన మనస్సునకు కారణము కర్మ యని గ్రహించుకొని కర్మను సవరించుటకు యత్నించును అప్పుడే యది సరిపడును అట్లుగానిచో శుభాశుభ గుణములు గలిగి మనస్సుండుటకు కారణమేమి? అను ప్రశ్నకు సమాధానము లభించదు 'ఇంద్రియాణాం మన శ్చాస్మి''యని గీతలో వచించుట కిదియే కారణము మఱియొక స్థలమున ''గహనా కర్మణో గతిః'' అనియు, ''కవయోఽప్యత్ర మోహితాః'' అనియు ప్రయోగించుట కిదియే కారణము ఒకస్థలమున మనస్సు కారణముగా కనిపించినను దీర్ఘముగా ఆలోచించిన మనస్సు కార్యముగాను, కర్మ కారణముగాను గోచరించక మానదు

**మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

మలినమయిన యద్దములో నేలాగున తనరూపము గనుపించదో ఆలాగున పరిపక్వముగాని హృదయము గలవారికి తనలో తానై వెలుగు చుండు దైవస్వరూపము గోచరింపదని మునిభావబోధిని

మలినమగు అద్దములో జూచువారు బ్రాహ్మణులుగాని, అబ్రాహ్మ ణులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని, గృహస్థులుగాని, సన్న్యాసులుగాని,

పండితులుగాని, పాండిత్యము లేనివారుగాని యేలాగున తమ స్వరూపమును జూడజాలరో, ఆలాగున మలిన హృదయు లెవ్వరైనను తనలో వెలుగుచుండు పరమాత్మను దర్శింపజాలరు

**యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే।**
**తస్మాన్నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥**

ఏకారణముచేత మనస్సుయొక్క నిర్విషయస్థితియే ముక్తియని చెప్పబడుచున్నదో, అట్టి కారణమువలన ముముక్షువైనవాడు నిరంతరము మనస్సునకు నిర్విషయస్థితి గలిగేలాగున ప్రయత్నించు చుండవలయును

**ఆచారహీనం న పునంతి వేదా యద్యప్యధీతాస్సహ షడ్భిరంగైః ।**
**ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః ॥**

నాలుగు వేదములున్ను, షడంగములైన ఆరు శాస్త్రములున్ను చదివిన వాడైనను ఆచరణ లేనివాడైనచో పక్షులు రెక్కలు రాగానే గూటిని విడిచి వెళ్ళిపోవునట్లు అంత్యకాలమున వీడు చదివిన వేదశాస్త్రము లన్నియు వీనిని విడచి వెళ్ళిపోవును

**న తపస్తప ఇత్యాహుర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।**
**ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః ॥**

మహర్షులు కేవల తపస్సును తపస్సని చెప్పరు మఱియేమన ఉత్తమమైన బ్రహ్మచర్యమునే తపస్సని వర్ణించిరి ఎవ డూర్ధ్వరేతస్సు గలవాడగునో యట్టివాడు మనుష్యుడు గాడు, దేవుడే యగును అని జ్ఞానసంకలన తంత్రమున ఈశ్వరవచనము

''తైలక్షయే యథా దీపో నిర్వాణమధిగచ్ఛతి''- తైలము నశించిన వెంటనే జ్యోతి యారిపోవునట్లు బ్రహ్మచర్యమనెడి యోజస్సు క్షీణించినచో మానవుని ప్రజ్ఞయు క్షయించును మఱియు పెట్రోలు మొదలగు వానిచే నడుపబడు యంత్రములు నూనె యగుయిపోయినచో ఎట్లాగిపోవునో,

ఆలాగున శరీరమ నెడి యంత్రమునకు తైలమువంటి శుక్రము క్షీణించిన మానవుని మానసిక కాయికశక్తి యంతయు క్షీణించిపోవును కావుననే శుక్ల వృద్ధియగు ఇరువది సంవత్సరములవఱకున్ను, శుక్లము క్షీణించిన 50సంవత్సరముల ఆవలనున్ను ఉద్యోగమున కర్హత లేదని చెప్పెడి రహస్యము

ఈ బ్రహ్మచర్యము నాలుగు విధములు 1 నైష్ఠిక బ్రహ్మచారి యనియు, 2 గృహస్థ బ్రహ్మచారి యనియు, 3 విధుర బ్రహ్మచారి యనియు, 4 అఖండ బ్రహ్మచారియనియు, ఈ బ్రహ్మచారులను పిలిచెదరు 1 ఆజీవితము బ్రహ్మచర్యమును శీలించువాడు నైష్ఠిక బ్రహ్మచారి యనియు, 2 ఋతుకాలమున మాత్రము విషయమందు ప్రవర్తించువాడు గృహస్థ బ్రహ్మచారి యనియు, 3 కొంతకాలము గృహస్థాశ్రమమందుండి విరక్తి గలిగి వానప్రస్థ జీవితమును గడుపువారు లేక దాంపత్య వియోగము గలిగిన పిమ్మట బ్రహ్మచర్యమును నిర్వహించువారు విధురబ్రహ్మచారు లనియు, 4 అఖండ బ్రహ్మకారవృత్తి గలిగి బ్రహ్మమందే విహరించువారిని నఖండ బ్రహ్మచారులనియు గ్రహించుకొనవలయును

వీరిలో శుకగార్గులు నైష్ఠిక బ్రహ్మచర్యమును అనుష్ఠించినవారలు చూడాలా జనకులు గృహస్థబహ్మచర్యవ్రతమును సలిపినవారలు విశ్వామిత్ర మైత్రేయాదులు విధుర బ్రహ్మచర్యమును శీలించినవారలు బ్రహ్మభావముతో విహరించువారు అఖండ బ్రహ్మచారులని పిలువబడుదురు

**యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ ।**
**మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥**

ఇహలోకమున జీవించియున్నపుడు మీ హృదయములో ఏ భావము గలిగియుండునో, పరలోకములోను మీ కట్టి భావము గలిగియుండును పరలోకమున నెట్టి భావముండునో, దాని కనుగుణమగు జన్మమే మఱల గలుగుచుండును కావున ఇచ్చటనే బ్రహ్మకారవృత్తి గలిగియుండిన

పరములోను అట్టి బ్రహ్మాకారస్థితి గలుగును ఇచట భేదబుద్ధిని గలిగి యుండువాడు మఱల మఱల జననమరణములనే పొందుచుండును అని కఠోపనిషత్తు

ఇచ్చట ఆత్మశుద్ధి లేక యాత్మజ్ఞానమును బొందకపోయిన పరములోను, మఱియొక జన్మము వచ్చునపుడును అదే ప్రకారముండును కనుక జీవించి యుండునపుడే జీవేశ్వరుల యైక్యజ్ఞానమును బొందేలాగున జూడవలయును సాధారణముగ వైష్ణవులు చనిపోయినపుడు పరమపదము వేంచేసినారనియు, ఆలాగున శైవులు మరణించునపుడు శివలోకప్రాప్తిని పొందిరనియు చెప్పుదురు అట్టి విష్ణుత్వముగాని, శివత్వముగాని జీవించియున్నపుడు గలిగిన మాత్రమే మోక్షము గలదుగాని వేఱుమార్గము లేదని శ్రుతియే చెప్పుచున్నది

**న హి దుఃఖప్రదం వస్తు సుఖం దాతుం సమర్హతి ।**
**కిం విషం పిబతో జంతోరమృతత్వం ప్రయచ్ఛతి ॥**

దుఃఖమును గలుగజేసెడి కృత్యము సుఖమును గలుగజేయజాలదు ఎట్లన, విషపానమును జేసినవానికి మరణము గలుగునేగాని యమృతత్వ మెట్లు గలుగును?

కావున ఇచ్చటనే నిర్విషయస్థితిని పొంది యమృతత్వమును బొందే లాగున జూడవలయును అట్లు గాక యిచ్చట విషయముల ననుభవించు వారికి అమృతత్వమెట్లు లభించును?

**అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్ ।**
**మృషా హి సాధ్యతే మృత్యుః సత్యేన సాధ్యతేఽమృతమ్ ॥**

ప్రతివారియొక్క హృదయములో నమృతకలశమున్ను, విషకుంభ మున్ను ప్రతిష్ఠితములై యున్నవి అసత్యవర్తనము గలవానికి మరణ హేతువగు విషపాత్రమే లభించును సత్యవర్తనము గలవానికి మృత్యు రహితమగు అమృత కలశము సిద్ధించును

అసత్యప్రవర్తనముచే లాభము, సుఖము లభించునని కొందఱు తలం తురు వారికి దుఃఖమున్ను, నష్టమున్ను గలుగునేగాని సుఖమున్ను, లాభమున్ను గలుగదు సత్యప్రవర్తనము గలవానికే సుఖలాభములు సిద్ధించును మాయయొక్క భ్రాంతివలన ఈసత్యమును జను లెఱుంగకున్నారు

**అనిష్కల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ ।**
**నరస్యాంగారకస్యేవ సదా క్షీరాభిషేచనమ్ ॥**

కల్మషముగల మనస్సుతో గూడినవాడు సమస్త తీర్థములయందు స్నానము జేయుటచేత పాపవిముక్తుడు గాడు ఎట్లన బొగ్గును తెల్లని గోక్షీర ములో ఎంత కడిగినను దానికి ఎట్లు నలుపుబోయి తెలుపు రాజాలదో ఇతని యొక్క స్థితియు నాలాగున నుండును

ఆవుపాలు పవిత్రముగాను, తెల్లగాను ఉండినను బొగ్గును తెలుపు చేయుటకు ఆపాలలో నెన్ని సారులు ముంచి కడిగినను తెలుపు కాదుగదా! తీర్థయాత్రలు చేయువా రీసత్యమును హృదయములో నుంచుకొనిన పుణ్యాత్ము లగుదురు

**సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యథా ।**
**ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్ధతే ॥**

అగ్నిహోత్రుడు కట్టెలచేతను, నెయ్యిచేతను ఎట్లు వృద్ధిని బొందు చుండునో ఆలాగున విషయభోగములచేత ఆశ మఱల మఱల వృద్ధి నొందునేగాని శాంతి నొందదు

విషయసుఖముల ననుభవించిన శాంతించునని కొందరు చెప్పుదురు పైదృష్టాంతముచే నిది తెలిసికొనవచ్చును ఘృతసమిధాదులను వేయక యుండిన అగ్ని యేలాగున స్వయముగా చల్లారిపోవునో, ఆలాగున విషయ త్యాగముచేతనే ప్రకృతి శమించును గాని వేఱు మార్గము లేదు అని మనుస్మృతి

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వంద్వ మోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥**

పాపక్షయమునకును, ఆత్మశుద్ధికిని తగిన పుణ్యకర్మలను జేసెడు ఏ జనులయొక్క పాపము నశించినదో, అట్టివారు రాగద్వేషమువలన గలిగిన మోహమునుండి విడువబడినవారై అచంచలమైన వ్రతనిష్ఠ గలవారై నన్ను ధ్యానించుచున్నారు అని గీత

ఈశ్లోకముచే పాపము గలిగినందుచేతనే తాను ప్రారంభించిన అనుష్ఠానము లన్నిటికి విఘ్నములు గలుగుచున్నవనియు, అట్టి పాపము ఈశ్వరార్పణ బుద్ధితో నాచరించెడు పుణ్యకర్మలచే మాత్రమే నశించు ననియు, పాపము నశించిన మాత్రమే ఏలాటి విఘ్నములు గలుగక నిరాటంకముగ బ్రహ్మనిష్ఠ, జప,ధ్యాన,తపో, యోగాదులు జరుగ గల వనియు శ్రీభగవాను డుపదేశించెను

**మచ్చి త్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।**
**అథ చేత్త్వమహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥**

ఓ యర్జునా! నా యందు చిత్తము నేకాగ్రపరచి యుందువేని నీయొక్క సమస్త ప్రతిబంధములున్ను నశించి నా అనుగ్రహమునకు పాత్రుడువు కాగలవు ఈ వాక్యమున విశ్వాసము గలిగి ఆచరింపక పోయితివేని తప్పక పతన మొందగలవు అని గీత

**యావదాత్మా న లబ్ధోఽయం శుద్ధం జ్ఞానం చ నోదితమ్ ।**
**మలీనవిషయే రాగస్తావదజ్ఞానినో భవేత్ ॥**

ఎంతవరకు ఈ ఆత్మ లభించలేదో, శుద్ధమైన జ్ఞాన ముదయము కాలేదో, ఎంతవరకు విషయవాసన నశించలేదో, అంతవరకు తానజ్ఞాన దశలో నున్నట్లే తలంచవలయును

ఈశ్లోకముచేతనే బ్రహ్మనిష్ఠు లెచట పొరపాటు పొందుచున్నారో తెలు పడమైనది నిర్విషయస్థితి పొందకయు విషయవాసన నశింపకయు తాము

జీవన్ముక్తుల మైత్రిమని తలంచుటవల్లనే ప్రమాదములో పడిపోవుచున్నారు

**అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకః ।**
**న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా ॥**

గృహాంతర్భాగములో గల చీకటి దీపముయొక్క వార్తవలన నేలాగున నశింపదో, ఆలాగున హృదయగుహయందు గల అజ్ఞానతమస్సు శాస్త్రములను పఠించుటచేగాని, చెప్పుటచేగాని తొలగదు చక్కని అనుష్ఠానము గలిగియుండిన నశించును

గురువులుగాను, ప్రబోధకులుగాను ఉండువారు ఈ పరమసత్య మును మరువక యుందురుగాక!

**అంతశ్శుద్ధివిహీనైస్తు యేఽధ్వరా వివిధాః కృతాః ।**
**న ఫలంతి మునిశ్రేష్ఠ! భస్మని న్యస్తహవ్యవత్ ॥**

ఆత్మశుద్ధి లేనివారు అనేక విధములగు యజ్ఞములుగాని, వ్రతములు గాని, దానములుగాని, తీర్థయాత్రలుగాని చేసినను అవి ఫలమును కలుగ జేయజాలవు అవి యన్నియు బూడిదయందు హోమించిన హవిస్సువలె వ్యర్థములగును

**యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।**
**యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥**

జ్ఞానసిద్ధికొఱకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠానపరులు తమ యందున్నట్టి పరమాత్మను దర్శించుచున్నారు ఆత్మసంస్కారము లేనివారు, అంతఃకరణశుద్ధి లేనివారు పైజెప్పిన వారివలె ప్రయత్నించువారుగా నటించినను ఈ ఆత్మను చూడజాలరు

వేషముచేతను, పేరుచేతను మహాత్ములవలె నటించినను ఆత్మశుద్ధి లేని వారు తమలోగల పరమాత్మను జూడజాలరు సారవంతమైన భూమిలో వ్యవ సాయమును జేయువారు పొందెడి ఫలమును ఊషరక్షేత్రములో జేయు కృషి

వలు లెట్లు పొందగలరు? అనగా విత్తనమున్ను, వ్యవసాయపు పనులున్ను ఉభయుల కొకేవిధముగ నున్నను క్షేత్రమందు గల భేదముచే ఫలాఫలములు ఎట్లు భేదము గలిగియున్నవో, అంతఃకరణశుద్ధి గలవారికిని, లేనివారికిని ఇట్టి భేదము గలిగియుండును

**నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః ।**
**నాశాంతమానసో వాఽపి ప్రజ్ఞానే నైనమాప్నుయాత్ ॥**

దుర్వ్యాపారమునుండి విరమింపనివాడు ఈయాత్మను బొందజాలడు ఇంద్రియవిషయములనుండి శాంతి నొందని వాడున్ను ఈ యాత్మను బొందజాలడు మనస్సు సమాహితము కానివాడును ఈయాత్మను దర్శింపజాలడు మనోవృత్తులు సంపూర్ణముగ విలయము నొందనివాడును ఈ యాత్మను బొందజాలడు మఱల నెవరికి ప్రాప్తించును? ప్రజ్ఞాన సాక్షాత్కారము గలవారికి మాత్రమే ఆత్మ సిద్ధించును అని కఠశ్రుతి

**యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః ।**
**న వశ్యం హృదయం యస్య తస్య శాంతిర్న సిద్ధ్యతి ॥**

ఎవడు నిర్మలభక్తితో సర్వేశ్వరుని ఆరాధించలేదో, ఎవనికి సద్గురుకృప గలుగలేదో, ఎవనికి హృదయము స్వాధీనముగా లేదో వానికి ఆత్మశాంతి( జ్ఞానసిద్ధి) గలుగనేరదు అని సర్వవేదాంతసార సంగ్రహము

**నాస్తి బుద్ధిరయు క్తస్య నచాయుక్తస్య భావనా ।**
**న చాభావయతశ్శా న్తిరశాన్తస్య కుతస్సుఖమ్? ॥**

మనోనిగ్రహము లేనివారికి బ్రహ్మభావము గలుగదు బ్రహ్మభావన లేనివారికి ప్రకృతిదోషము శమించదు ప్రకృతి నశింపని వానికి ఆత్మసుఖ మెక్కడిది? అని గీత

ఆత్మశుద్ధి లేనివారికి స్వస్థానమునందుగాని, ఇతర పుణ్యప్రదేశము లలో గాని, యేకాంతమునం దుండినను శాంతి గలుగదు

**దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్।**
**బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥**

శివవిష్ణ్వాది దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను పూజించుటయు, మృజ్జలములచేత శరీరశుద్ధియును, సత్యదయాదులచే హృదయశుద్ధియు, సన్మార్గవర్తనము, బ్రహ్మచర్య వ్రతమును, జీవహింస చేయక యుండుటయును శరీరముచే జేయందగిన తపస్సని ఋషులు చెప్పుచున్నారు

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥**

పరులమనస్సును నొప్పించనిదియు, నిజమైనదియున్ను, హితముగ నుండునట్టిదియు నగు వాక్య మేది కలదో, అట్టి వాక్యమును చెప్పుటయు, వేదోపనిషత్ గీతలను పఠించుటయు, ప్రణవాది మంత్రములు జపించుటయు వాచిక తపస్సని వేదముచే చెప్పబడుచున్నది

**మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥**

నిర్మలమైన మనస్సు కలిగియుండుటయు, అందరి ఎడల సౌమ్య భావము కలిగియుండుటయు, మౌనము అనగా బ్రహ్మచింతన చేయుటయు, లెస్సగా మనోనిగ్రహము కలిగియుండుటయు, శుద్ధమైన మనస్సు కలిగియుండుటయు (బహ్మభావన గలిగియుండుటయు) అనునవి మానసిక మైన తపస్సని చెప్పబడుచున్నది

ఈ మూడు శ్లోకములలో త్రివిధ తపస్సులను గురించి వివరించడ మైనది 1 దేహతపస్సు,2 వాక్తపస్సు,3 మానసికతపస్సు, తపశ్శబ్దమునకు శుద్ధము చేయుట, దహింపజేయుట యని అర్థములు గలవు దేహశుద్ధియు, వాక్శుద్ధియు, మనశ్శుద్ధియు గలిగియుండుట, లేక దేహదోషము, వాక్ దోషము, మానసిక దోషము భస్మీకరించుట అనియు గ్రహించదగును

ఈత్రికరణశుద్ధి లేకపోవుటచేతనే అనేక విఘ్నములు కలుగుచున్నవి దేహశుద్ధి గలిగిన బ్రహ్మచర్య శుద్ధియు, శీతోష్ణముల సహించుశక్తియు, వజ్రకాయమును కలుగును ఇట్టివారు ఎంతసేపు నిష్ఠలో నుండినను శరీరమునకు బాధ కలుగదు వాక్శుద్ధి కలిగిన చెప్పిన వాక్యములన్నియు ఫలించును హృదయశుద్ధి కలిగిన సంకల్పము లన్నియు ఫలించును ఇదే త్రివిధ తపస్సులచే గలిగెడు ప్రయోజనము కావుననే మహనీయులను గురించి చెప్పినపుడు వారు వాక్శుద్ధి, వాక్సిద్ధి, సంకల్పశుద్ధి, సంకల్పసిద్ధి కలవారని జనులు చెప్పు వాడుక గలిగియున్నది

ఈశుద్ధిత్రయము లేనికారణముచేతనే అనేక విఘ్నములు గలుగుచున్నవి శ్రీకృష్ణభగవానులు అందరికిని ఆచరించుటకు తగిన తపస్సునే చెప్పిరి అట్లుగాక కొన్ని శాస్త్రములలో తపస్సని చెప్పినపుడు అరణ్యవాసము, కందపక్వ ఫలాదులను భుజించుటనియు, నిరాహారత్వము కలిగియుండుటనియు వినినప్పుడే జనులు భయపడెదరు కావుననే భగవానులు ''బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః'' అని సెలవిచ్చిరి పైచెప్పిన ప్రకారము అనేకులు జ్ఞానతపస్సుచేత పవిత్రాత్ములై పరమాత్ముడగు తన్ను పొందుచున్నారని చెప్పిరి

**నివృత్తిమార్గే దాంపత్యం సానుకూలం భవేద్యది ।**
**పూర్వస్మిన్ పుణ్యపుంజేన నా స్తిచేత్ ప్రవ్రజేత్ పుమాన్ ॥**

స్త్రీలకుగాని, పురుషులకుగాని యుండవలసిన భాగ్యములన్నిటిలోను ముఖ్యమైనది అనుకూల దాంపత్య మేర్పడుట యగును ముఖ్యముగా నారీమణులకు అనుకూల దాంపత్యమునకు మించిన మహాపుణ్యము మఱియొకటి లేదు ఇది కలుగనిచో ఎంత శ్రీమంతులైనను, ఉన్నతోద్యోగులైనను శాంతి గలుగదు అట్లు దాంపత్యానుకూలత గలుగనిచో నివృత్తిమార్గమున మహాసంకట మేర్పడును కలిగెనేని పూర్వజన్మములో నుభయులును ఒకేదైవమును, లేక ఒకే గురువును ఆరాధించిన వారలుగా నుండవలయును అనుకూలము కలుగనిచో సన్న్యాసము తప్ప మరి గతి లేదు

**అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్ ।**
**పుణ్యపుంజేన శుద్ధం తచ్చి త్తమైకాగ్ర్యమృచ్ఛతి ॥**

అనాత్మయగు దృశ్యవిషయములో అరుచి కలుగుటయు, ఆత్మ ధ్యానమం దభిరుచి గలుగుటయు గలిగెనేని పూర్వజన్మములో చేసిన అనేక పుణ్యకర్మఫలమనియే గ్రహింపవలయును అట్లైననే ఆత్మశుద్ధి గలిగి చిత్తైకాగ్రత యేర్పడును అని అనుభూతి ప్రకాశము

**విషయాసంగరూపో యః పాప్మాஉసావాసురత్వతః ।**
**విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోஉయమాదౌ నివ ర్త్యతామ్ ॥**

విషయాసక్తి స్వరూపమేది కలదో, అది పాపస్వరూప మనియు, ఆసుర స్వరూపమనియు గ్రహించుకొనవలయును ఇది మోక్షేచ్ఛను ప్రతిబంధించును అందువల్ల ముముక్షువులు ప్రప్రథమమున విషయవాంఛను నివృత్తి చేసుకొనవలయును

**యథా కాష్ఠమయో హ స్తీ యథా చర్మమయో మృగః ।**
**యశ్చ విప్రోஉనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥**

కఱ్ఱతో చేయుబడిన యేనుగున్నూ, చర్మముతో చేయుబడిన జింకయున్ను, అధ్యయనము చేయని విప్రుడున్ను (సన్న్యాసియు) ఈ ముప్వురు నామమాత్రమేగాని ప్రయోజనము లేదు అనగా నామధారులని యర్థము అని మనుస్మృతి

**పరాన్నేన తు భు క్తేన మైథునం యోஉధిగచ్ఛతి ।**
**యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే ॥**

పరాన్నము భుజించెడు ఏ గృహస్థుడు భార్యతో చేరునో వానికి బుట్టెడు సంతానములు ఆ అన్నము పెట్టిన వానివే యగును ఏలన అన్నము చేత పురుషులకు శుక్లమున్ను, స్త్రీలకు రక్తమున్ను ఏర్పడును ఈ రెండింటి వల్లనే పిండోత్పత్తి యగును అని శంఖలిఖిత స్మృతి

పాపాన్నముచే నేర్పడిన బిడ్డలు పాపరూపులే యగుదురు పుట్టిన తరువాత వారి నెంత శిక్షించినను మంచిస్థితికి రాజాలరు కావున వంశోద్ధారకులగు ఉత్తమసంతానములు గలుగవలసియుండిన మాతాపితరులు ఆహారములో జాగ్రత్త వహించవలయును ఆలాగున పాపాహారము భుజించి తప మొనర్చువారుకూడా మెలకువ గలిగియుండవలయును ఏలన అన్నముచే రసము, రసమునుండి రక్తము, రక్తమునుండి మాంసము మొదలగు సప్తధాతువులున్ను, మనోబుద్ధి చిత్తాహంకారములును ఏర్పడును సాత్త్వికాహారమని తలంచిన చాలదు వస్తువు శుద్ధమైనను వచ్చే మార్గము అశుద్ధమైనచో అది పాపాహారముగాను, తామసాహారముగాను తలంచవలయును కావున సాత్త్వికాహార మెచట దొరకునో యని భ్రమపడి పరుగెత్తకూడదు సత్యార్జిత ధనముచే శుద్ధవస్తువుతో చేయబడు పదార్థమే సాత్త్వికాహారమగును

**అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్షచరా ద్విజాః।**
**తం గ్రామం దండయేద్రాజా చోరభుక్తి ప్రదో హి సః ॥**

బ్రహ్మచర్య వేదవ్రతాదినిష్ఠ లేనివారున్ను, గురుదీక్షా వ్రతమును శీలించని వారును, వేదోపనిషద్గీతాదులను చక్కగా అధ్యయనము చేయనివారును అగు బ్రాహ్మణులుగాని, సన్న్యాసులుగాని భిక్షాన్నము భుజించి ద్రిమ్మరులై తిరుగుచుండిన అట్టివారికి అన్నముపెట్టు గ్రామస్థులను రాజైనవాడు దండించవలయును ఏలన దొంగలకు అన్నముపెట్టి పోషించువారు ఎట్లు దండనార్హులో వీరును అట్టి వారే యగుదురు అని పరాశరస్మృతి

వేదకాలమున రాజ్యమును, మతమున్ను రాజశాసనములో నుండెను అందువల్లనే అట్టి కాలపు విప్రులును, యత ...ను, వేదవేదాంత పారంగతులును, బ్రహ్మనిష్ఠాపరులును నైయుండిరి

**పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥**

బ్రహ్మదేవుడు ఇంద్రియములను బహిర్ముఖముగా సృజించెను కావున సర్వజీవులు బాహ్యమునే గాంచుచున్నారుగాని అంతరాత్మను చూచుట లేదు ఎవడో అంతఃకరణ శుద్ధిగల ధీరుడు మాత్రమే అమృతత్వ స్వరూపమగు ఆత్మ నవలోకింప దలంచి అంతర్ముఖుడై పరగి తుదకు ప్రత్యగాత్మను సాక్షాత్కరింప జేసికొన గలుగుచున్నాడు అని కరోపనిషత్తు

ఒక వెడల్పుగల అద్దమును పట్టుకొని బాహ్యముగా నుంచినచో పురోభాగవస్తువు లన్నియు దానియందు ప్రతిఫలించునేగాని అద్దమను పట్టుకొనిన వాని దేహము ప్రతిబింబించ జాలదు గదా? అట్టి అద్దమును తనవైపు త్రిప్పిన బాహ్యదృశ్యము ప్రతిబింబింపక తనదేహము ప్రతిఫలించునట్లు అంతర్దృష్టియు, బాహ్యదృష్టియు గల వానిస్థితి గలిగియుండును కావున చిత్తనిరోధమున్ను, నిర్మలత్వమును ఎంత అవసరమో గ్రహించుకొనవచ్చును

**కామబంధనమేవేదం నాన్యద స్తీహ బంధనమ్ ।**
**కామబంధన ముక్తో హి నేహ భూయోఽభిజాయతే ॥**

కామము(విషయాసక్తి) ఒకటియే ఈజీవుని కిచట బంధనమునకును, పతనమునకును, విఘ్నములకును కారణము ఇది ఒకటి తప్ప ఏ బంధనమును, విఘ్నమును లేదు ఈ కామబంధనమునుండి విడుదలబొందిన జీవి మరల జనన మరణములను పొందదు కామబంధనమే బంధనముగాని మఱియొకటి ఆత్మను బంధించునది లేదని శ్రీ వేదవ్యాస భగవానులు శిష్యులతో అనేకసార్లు చెప్పిరి



# రెండవభాగము

## యోగవిఘ్నములు

**యశ్ఛందసామృషభో విశ్వరూపః । ఛందోభ్యోఽధ్యమృతాత్సంబభూవ । స మేంద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవ ధారణో భూయాసం । శరీరం మే విచర్షణం। జిహ్వా మే మధుమత్తమా । కర్ణాభ్యాం భూరి విశ్రువం। బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ ॥**

యః–ఛందసాం– ఋషభః – విశ్వరూపః – ఛందోభ్యః –అధి– అమృతాత్– సంబభూవ – సః – మా – ఇంద్రః – మేధయా –స్పృణోతు – అమృతస్య – దేవ – ధారణః – భూయాసం – శరీరం– మే – విచర్షణం – జిహ్వా– మే – మధుమత్తమా – కర్ణాభ్యాం – భూరి – విశ్రువం – బ్రహ్మణః – కోశః– అసి – మేధయా – పిహితః – శ్రుతం – మే – గోపాయ॥

యః = ఏ ప్రణవము ( ఈశ్వరుడు), ఛందసాం = వేదములలో, ఋషభః = శ్రేష్ఠమైనదో, విశ్వరూపః = సర్వరూపమైనదో, ఛందోభ్యః = వేద రూపములైన, అమృతాత్ = అమృతమునుండి, అధి సంబభూవ = గలిగెనో, ఇంద్రః = పరమేశ్వర స్వరూపమైన, సః = అట్టి పరమాత్మ, మా = నన్ను, మేధయా = ప్రజ్ఞచేత, స్పృణోతు = సంతోష పెట్టునుగాక! హే దేవ= ఓ ప్రకాశస్వరూపుడవగు పరమేశ్వరా! అమృతస్య = బ్రహ్మజ్ఞానముయొక్క, ధారణః= ధరించువాడనుగా, భూయాసం = అగుదును గాక! మే, నాయొక్క, శరీరం=దేహము, విచర్షణం–యోగ్యమైనదిగా (భూయాత్= అగుగాక!), మే=నా యొక్క, జిహ్వా=నాలుక, మధుమత్తమా = అమృత స్వరూపముగా, (భూయాత్=అగుగాక!) కర్ణాభ్యాం=చెవులతో, భూరి= అతిశయుముగా, విశ్రువం=శ్రవణము చేయునుగాక! బ్రహ్మణః= పరమాత్మకు, కోశః=నివాసస్థానముగా, (త్వం=నీవు) అసి=అగుచున్నావు మేధయా=లౌకికప్రజ్ఞచేత, పిహితః=కప్పబడితివి (సః=అటువంటి) (త్వం= నీవు) మే=నాయొక్క, శ్రుతం=శ్రవణముజేసిన వేదజ్ఞానమును, గోపాయ= రక్షించుమా!

ఏ ప్రణవస్వరూపుడగు పరమేశ్వరుడు వేదములలో శ్రేష్ఠుడు గానున్నాడో, అమృతరూపములైన వేదములనుండి సముత్పన్నమైన సర్వరూపుడై యున్నాడో, అట్టి సర్వేశ్వరుడు నన్ను ప్రజ్ఞావంతునిగను, సంతోషవంతునిగను చేయుగాక! ఓ ప్రకాశస్వరూపుడవగు పరమాత్మా! నేను బ్రహ్మజ్ఞానమును ధరించువాడనుగా నగుదునుగాక! నా శరీరము జ్ఞానయోగ్యమైన దగునుగాక! నానాలుక అమృతస్వరూప మగునుగాక! శ్రోత్రములచేత విశేషముగా వినువాడ నగుదునుగాక! ఓ పరమాత్మా! నీవు పరబ్రహ్మమునకు అధిష్ఠానముగా నున్నావు లౌకిక జ్ఞానముచేత నావరింపబడి యున్నావు ఆ నీవు నాశ్రవణ జ్ఞానమును రక్షించుమా!

ఈలాటి వేదములలో చెప్పబడిన శాంతిమంత్రములను అర్థము తెలిసే లాగున పఠించి ప్రార్థింపక పోవుటయే విఘ్నములు కలుగుటకు కారణమగు చున్నది విఘ్నములు నశించుటకొఱకే వేదములలో ఇట్టి మంత్రములను పరమేశ్వరుండు ఏర్పరచుట యైనది

**అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్ ।**
**కలుషీకృతచిత్తానాం ధర్మస్సమ్యక్ న భాసతే ॥**

ఆహారదోషముచే సర్వదా చిత్తమునకు కల్మషము గలుగును కల్మషచిత్తము గలవారికి ధర్మరహస్యమైన జ్ఞాన ముదయించదు

బురదనీటియందు చంద్రబింబము ప్రకాశించనట్లు కలుషిత హృదయములలో జ్ఞానము ప్రకాశించదు ఆహారము శరీరమునకు గదా, మనస్సునకేమి సంబంధమని తత్త్వచింతన లేనివారు పలుకుదురు ఆహారముయొక్క కనిష్ఠభాగము మనోబుద్ధి చిత్తాహంకారములుగా మారుచుండునన్న సత్యమును వారెరుంగకయున్నారు దానికి సంబంధించిన ప్రమాణము క్రింద తెలుప బడును ఆహారనియమము లేనివానికి ఆత్మనియమ ముండదు

**ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః ।**
**స్మృతిలాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః ॥**

శుద్ధాహారముచే మనఃశుద్ధియు, మనశ్శుద్ధిచే దృఢమైన ప్రజ్ఞయు కలుగును దృఢప్రజ్ఞచే సర్వగ్రంథులు (హృదయములోని ముడులు) నిశ్శేషముగా నశించును అని సన్న్యాస సముచ్చయము

**అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమగ్రహః।**
**జనసంగశ్చ లౌల్యం చ షడ్భిర్యోగో వినశ్యతి ॥**

శుద్ధాహారమైనను మితిమీరి తినుటయు, అధికశరీర పరిశ్రమ చేయుటయు, అధికభాషణమును, మూర్ఖపు పట్టుదల గలిగియుండుటయు, ప్రాకృత జనులతో కలిసియుండుటయు, విషయలోలత్వము కలిగి యుండుటయు- అను ఈ ఆరింటివల్ల యోగమునకు విఘ్నము కలుగునని హఠయోగప్రదీపిక

**వ్యాధిస్త్యానసంశయప్రమాదాలస్యావిరతిభ్రాంతిదర్శనా।**
**లబ్ధభూమికత్వానవస్థితతత్త్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః ॥**

రోగము, యోగనిష్ఠానర్హత, సంశయము, అజాగ్రత్త (సోమరితనము), మత్తత (మాంద్యము), అతృప్తి, భ్రమ, సమాధియందు మనస్సు నిలువకపోవుట, చిత్తచాంచల్యము అను ఈ తొమ్మిదిన్ని చిత్తస్థైర్య భంగకరములు, యోగమునకు విఘ్నములని పతంజలిమహర్షి అభిప్రాయము ఈ విఘ్నములనుండి నివృత్తి గలుగుటకు అనన్యభక్తితో పరమేశ్వరుని ధ్యానించవలయును ఈ విషయమై యోగపాదమున 23వ సూత్రమును చూడుడు

**ఈశ్వరప్రణిధానాద్వా।**

ముందు వివరింపబడిన శ్రద్ధాద్యుపాయములవలన సమాధియు, తత్ఫలమును మిగుల శీఘ్రముగా సిద్ధించుచున్నను, భగవత్ప్రణిధానమను సుకరమగు సాధనవలన అంతకన్న శీఘ్రముగ సమాధియు, తత్ఫలమును ప్రాప్తించును

అష్టాంగ యోగసాధనములకన్న సులభముగా కేవల ఈశ్వరార్పణ హృదయముతో పరమేశ్వరుని ధ్యానించువానికి నిర్వికల్ప సమాధియు, కైవల్యప్రాప్తియు కలుగును

**స్త్రీణాం స్త్రీసంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్ ।**
**క్షేమే వివిక్త ఆసీనశ్చింతయేన్మామతంద్రితః ॥**

తీవ్రతర ముముక్షువైనవాడు స్త్రీలను, స్త్రీలతో సంబంధముగల పురుషులను సహా దూరముగా విడిచి యేకాకియై నిర్మలమైన ఏకాంత స్థలమునందు ఆసీనుడై యింద్రియ సంయమియై ఆత్మచింతన చేయవలయునని శుకులు భాగవతమున తెల్పిరి

స్త్రీసంబంధము గలవాడైనచో విరక్తుని మనస్సునుకూడ క్రమముగా విషయవాసనలోనికిగాని, వివాహములోనికిగాని దింపుటకు అవకాశము కలదు పురుషులకు చెప్పినది స్త్రీలకుగూడ అన్వయించును వైరాగ్యము గల స్త్రీలు పురుషులుండే స్థలములో ఉండుట మంచిది గాదు

**రసాయన క్రియావాదో జ్యోతిషం క్రయవిక్రయమ్ ।**
**వివిధాని చ శిల్పాని వర్జయేత్పరదారవత్ ॥**

రసాయన క్రియలున్ను, రసవాదవిద్య (బంగారము చేయుట), వైద్యము, మాంత్రికము, జ్యోతిషము, క్రయవిక్రయములు మరియు అనేకములగు శిల్పములు మొదలైనవానిని తీవ్రతర ముముక్షుత్వము గలవాడు ఏకపత్నీవ్రతనిష్ఠ గలవాడు పరస్త్రీలతో సంబంధము చేయనట్లు వర్జించ వలయును.

పైజెప్పినవానివల్ల ప్రాకృత జనులు ఎక్కువగ జేరి బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధమును కలుగజేయుదురు దీనివల్ల పరోపకారదూరులై యుండవలయునని అభిప్రాయము గాదు. పై తెలిపిన కార్యములు చేయువారు అనేకులుంటున్నారు తీవ్రబ్రహ్మనిష్ఠులు చాలా అరుదైరి పైన నిరూపించినవారు దేహమునకు సంబంధించిన రోగమును నివృత్తి చేయుదురేగాని ఆత్మకు సంబం

ధించిన భవరోగమును రహిత మొనర్చజాలరు భవరోగము గలవారు దేహారోగ్యమును, భోగమున్ను గలిగియుండినను ఆత్మశాంతిని, మానసిక సుఖమును పొందజాలరు

**సమాధౌ క్రియమాణే తు విఘ్నాశ్చాయాంతి వై బలాత్ ।**
**అనుసంధానరాహిత్యమాలస్యం భోగలాలసమ్ ॥**

**లయస్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా ।**
**ఏవం యద్విఘ్నబాహుళ్యం త్యాజ్యం తద్బ్రహ్మవిజ్ఞనైః ॥**

యోగసమాధి నభ్యసించువానికి విఘ్నములు తనంతటనే బలాత్కారముగానే వచ్చుచుండును అవేవనగా బ్రహ్మానుసంధానము లేకుండుట సోమరితనము, భోగాసక్తి, ఏమియు తెలియక పోయెడు అవస్థ, నిద్ర, వివేకము మందగించుట, రసాస్వాదము (నేను బ్రహ్మానుభవము పొందినవాడనను అభి మానము), ఏమియు తోచకపోవుట అను ఎనిమిదిన్నీ యోగవిఘ్నములు (అపరోక్షానుభూతి 127, 128)

ఇట్టి విఘ్నములను ఆహారనియమముచేతను, కొంత ప్రాణాయామముచేతను, మెలకువగల బ్రహ్మనిష్ఠుల దగ్గర నుండుటచేతను నివృత్తి చేసుకొనవలయును

**అగ్నికుండసమా నారీ ఘృతకుంభసమో నరః ।**
**సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥**

స్త్రీ నిప్పుకుండవంటిది, పురుషుడు నేతికుండతో సమానుడు కాబట్టి యీ రెండింటి సంయోగముచే నాశముకల్గును కనుక స్త్రీని వర్జించవలయును అని అవధూతగీతలో దత్తాత్రేయవచనము

నిప్పుకుండపై నేతికుండను పెట్టిన ఎట్లు కరుగక యుండదో బ్రహ్మనిష్ఠులగు స్త్రీపురుషులయొక్క ఏకస్థల నివాసమున్ను అటువంటిదే పురుషులకు చెప్పేలాగున బ్రహ్మచర్య వ్రతమును సల్పు నారీమణియు గ్రహించు

కొనవలయును ప్రకృతియొక్క శక్తి ఆలాగున నుండునని శ్రీదత్తాత్రేయులే చెప్పియుండగా, ఇక సందేహము ఏల? విశాలమైన ప్రదేశములలో దూర దూరముగా స్త్రీపురుషులకు ప్రత్యేక నివాసస్థల ముండిన అంత బాధా కరము గాదు

**గౌడీ మాధ్వీ తథా పైష్టీ విజ్ఞేయా త్రివిధా సురా ।**
**చతుర్థీ స్త్రీ సురా జ్ఞేయా యయేదం మోహితం జగత్ ॥**

1 బెల్లము, చెరుకుపాలు మొదలగువానిచే చేయు సారాయి 2 ఇప్పపువ్వు, మరికొన్ని వస్తువులు కలిపి చేయు సారాయి, 3 మినపపిండి, తుమ్మచెక్క మొదలగు కొన్ని వస్తువులు కలిపి ఉత్పత్తి చేయు సారాయి(కల్లు) అని సారాయి మూడు విధములు, ఆడుది నాల్గవదియైన గొప్ప సారాయి యని తెలిసికొనుము ఈ స్త్రీమోహమను సారాయిచేత సమస్త ప్రాణులును బద్ధుల గుచున్నవి (అవధూతగీత) 'దేవాసుర మానుషం'- దేవతలు, అసురులు, రాక్షసులు, మానవులు ఈ నాల్గవ సారాయిచేత మోహపరవశులై పోవుచున్నారు పైజెప్పిన మూడు సారాయిలవల్ల కొంతసేపు మాత్రమే కైపు కలిగి ఒడలు తెలియక పోవునేగాని, నాల్గవ సురాపానముచే గలిగెడు కైపు ఈ జన్మ అంతమువరకే గాక మరుజన్మమువరకు నిలచియుండును ఇది పూర్వ జన్మవాసన యని చెప్పబడును

**వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వప్యనక్తో హి నరో నారాయణో భవేత్ ॥**

బ్రహ్మదేవుడు రెండు విధములగు మాయలచేత జీవులను సృష్టించెను అవి యేవన కాంతయు, కనకము నగును ఈ రెంటినుండి విముక్తి బొందిన నరుడు నారాయణుడగును ఆలాగున పురుష సంబంధమును, ధనమును విడిచినచో నారి నారాయణి యగును ఇది ఉత్తమ గృహస్థాశ్రమములో నుండువారిని గురించి చెప్పినది కాదు విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారిని గురించి తెల్పినదని గ్రహించుకొనవలయును

**అసమ్మానాత్తపోవృద్ధిః సమ్మానాత్తపసః క్షయః ।**
**అర్చితః పూజితో విప్రో దుగ్ధా గౌరివ సీదతి ॥**

బహుమాన సత్కారాదులు కలుగవలెనని తలంచి యుండు యోగి క్రమముగా కృష్ణపక్ష చంద్రునివలె క్షయించును ఆలాగున గౌరవాదులు కావలయునని తలంపులేని యోగి శుక్లపక్ష చంద్రునివలె వృద్ధినొందును మఱియు గౌరవాదులకు లోబడిన యోగిజ్ఞానముకూడ పాలు పితికిన తరువాత ఆవుయొక్క పొదుగు చిక్కిపోవునట్లు క్షయించును అని మనుస్మృతి

**మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।**
**చరత్యత్ర న గచ్ఛంతు సాధవో హే ముముక్షవః ॥**

విషయమను మహారణ్యమునందు మనస్సను (ప్రకృతియను) పెద్దపులి తిరుగుచున్నది కాబట్టి సాధువులగు ముముక్షువులారా! మీ రచ్చోటికి వెళ్లవద్దని వివేకచూడామణి

**అభక్ష్యభక్షణే శ్రద్ధా తథాఽభక్షస్య భక్షణమ్।**
**అభక్ష్యం బ్రహ్మవిజ్ఞానవిహీనస్యైవ దేహినః ॥**

శాస్త్రనిషిద్ధ భక్షణమునందు ఆశయు, ఆలాగున నిషిద్ధాహారము భుజించుటయు బ్రహ్మజ్ఞానమునకు హానికరము అని పాశుపత బ్రహ్మోపనిషత్

ఉపనిషత్తులే ఈ లాగున నుద్ఘోషించుచుండగా అది తినిన నేమి? త్రాగిన నేమి? మనస్సే కదా కారణమని చెప్పువారిని గురించి లోకమే గ్రహించుకొనవచ్చును

**జ్ఞానే మమోదితే భోగాః కిం కుర్వంతీతి యే విదుః।**
**భోగే సంగం మతేర్భంగం జ్ఞానశైథిల్యమాప్నుయుః॥**

జ్ఞానము కలిగిన పిమ్మట భోగము మమ్ము ఏమి చేయునని యెవరైన

విచారశూన్యులు తలంచిరేని విషయభోగములచే వారి మనస్సు చెడిపోవు ననియు, జ్ఞానముకూడ గాలిచే మేఘము శిధిలమై పోవునట్లు నశించుననియు గ్రహించుకొనవలయును

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥**

ఎవడు శాస్త్రమునందు చెప్పబడిన విధుల నతిక్రమించి యధేచ్ఛగా సంచరించునో వాడు తత్త్వజ్ఞాన మొందడు స్వర్గఫలమునుగూడ అను, భవింపడు ఇహలోకసుఖమునుకూడ పొందలేడు మరి యేమన దుర్గతినే పొందును

**సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తే తు కలౌ యుగే।**
**నానుతిష్ఠంతి మైత్రేయ। శిశ్నోదరపరాయణాః॥**

ఓ మైత్రేయుడా! కలియుగమున అందరున్నూ వేదాంతు లగుదురు బ్రహ్మమును గురించియే మాట్లాడుదురు బ్రహ్మనిష్ఠలు చేయవలసిన అనుష్ఠానములను కొంచెమైనను చేయరు మరియు నెట్లుందురనగా శిశ్నోదర పరాయణులై ప్రబలముగా తిరుగుచుందురని పరాశరవచనము

శిశ్నోదర పరాయణులనగా జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ సుఖములనే కోరువారు ఈ రెండింటియొక్క నిరోధ మెంతవరకు కలుగలేదో, అంత వరకు ముక్తిద్వారము తెరువబడదు వీటి నిరోధ మెప్పుడు కలుగునో అప్పుడే బ్రహ్మరంధ్రము తెరువబడును

**ఉత్తమాం వృత్తిమాశ్రిత్య నీచవృత్తిం సమాశ్రితః ।**
**ఆరూఢపతితో జ్ఞేయః సర్వకర్మబహిష్కృతః ॥**

ఎవడు పరమపావనమగు బ్రహ్మనిష్ఠాది సద్వృత్తుల నాశ్రయించి నీచ వృత్తియగు విషయభోగాదుల నవలంబించునో వాడు ఆరూఢపతితుడని తెలి యదగినది అట్టివాడు సమస్త పుణ్యకర్మములనుండి బహిష్కరింపదగిన

భ్రష్టుడని భావము

**ఇంద్రియాణాం హి చరతాం విషయేషు స్వభావతః।**
**బలాదాహరణం తేషాం ప్రత్యాహారస్స ఉచ్యతే ॥**

ఇంద్రియములకు స్వభావముగా విషయములందు సంచరించుట నైజగుణము ఆ యింద్రియములను ధ్యానబలము గల బుద్ధిచే నాకర్షించి పరబ్రహ్మనిష్ఠయందు నిలుపుట ప్రత్యాహారమని చెప్పబడును

ప్రవృత్తిమార్గముయొక్కయు, నివృత్తిమార్గముయొక్కయు స్వభావ మిచ్చుట నిరూపించడ మైనది విషయములలో సంచరించు స్వభావమును దానినుండి మఱలించుటయే నివృత్తిమార్గస్థుని కార్యము ప్రవాహవేగమునకు లోబడిపోయెడి అచేతనవస్తువులు సముద్రములోనికి చేరును చైతన్యజీవులు ప్రవాహమున కెదురేగి గమ్యస్థలములోనికి చేరుదురు ఇదియే ప్రవృత్తి నివృత్తి మార్గములలో నుండువారి లక్షణమని గ్రహించవలయును

**మణిమంత్రౌషధైర్వహ్ని స్సుదీప్తోఽపి యథేంధనమ్।**
**ప్రదగ్ధుం నై వ శక్తస్స్యాత్ ప్రతిబద్ధ స్తథైవచ ॥**

**జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీ ప్తస్సుదృఢోఽపి చ।**
**ప్రదగ్ధుం నై వ శ క్తస్స్యాత్ ప్రతిబద్ధస్తు కల్మషమ్ ॥**

మండుచుండెడి యగ్నిని మణిమంత్రౌషధములచే కట్టు గట్టునప్పుడు ప్రజ్వలించినట్లు కనిపించినను ఎట్లు దహనశక్తి లేకుండ పోవునో, యాలాగున శాస్త్రజ్ఞానాగ్ని ప్రకాశించి దృఢబోధ గలిగినను విషయవాసన యుండినచో కర్మబీజములను దహింపజేయ శక్తి గలిగియుండదు అని పరాశరసంహిత

ఘుటిక మొదలగు మణిమంత్రౌషధములచే అగ్నియొక్క దహనశక్తిని కట్టిన మామూలుగా వెలుగుచున్నట్లు కనపడినను కాల్చెడి శక్తి యుండదు ఇట్టి ఘుటికామణి మొదలగు ప్రయోగములవలననే కొందరు అగ్ని గుండములో గూర్చొనియున్నను కాలకుందురు* అది జ్ఞానశక్తిగాని,

యోగశక్తి గాని కాదు జనులను భ్రమింపజేయుటకు మాత్రమే యుపయోగ పడును

**న ప్రమాదోऽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా॥**

మోక్షమును గోరువారు సమాధినిష్ఠ విషయమై యజాగత్త నొంద దగదు సూర్యుడస్తమింపగా చీకటి ఉజ్జృంభించినట్లు ప్రమాదమునందు మాయ ఉజ్జృంభించుచున్నది అని వివేకచూడామణి

**విపరీతార్థధీర్యావన్న నిశ్శేషం నివర్తతే ।**
**స్వరూపస్ఫురణం యావన్న ప్రసిద్ధ్యత్యనర్గళమ్ ॥**

ఎంతవఱకు ఆత్మస్వరూపముయొక్క విపరీతభావన నిశ్శేషముగా తొలగదో, ఎంతవఱకు స్వరూపానుభవ మనర్గళముగ సిద్ధింపదో, అంత వఱకు వారు సమాధినిష్ఠలను, నిదిధ్యాసనముల నభ్యసించుచుండవలయు నని సర్వవేదాంతసంగ్రహము

**గృహకర్మసమాసక్తమహం బ్రహ్మేతి వాదినమ్।**
**కర్మబ్రహ్మోభయభ్రష్టం తం త్యజేదంత్యజం యథా॥**

గృహకృత్యములలో ఆసక్తిగల చిత్తముగలవాడై నేను బ్రహ్మసాక్షాత్కారము గలవాడనని చెప్పువాడు కర్మ, బ్రహ్మ ఉభయములనుండి భ్రష్టుడగును అట్టివాడు అంత్యజునివలె సజ్జన సంఘములనుండి తొలగింప బడదగినవాడు

గృహస్థాశ్రమసంబద్ధ ధర్మమును విడువనివాడును, బ్రహ్మసాక్షాత్కారస్థితిని పొందనివాడును ఉభయభ్రష్టు డనబడును చెట్టు నెక్కినవాడు పై కొమ్మయందు కాలిని పెట్టుటకు ముందుగా రెండవపాదము నెత్తిన ఏలాగున క్రిందపడిపోవునో ఆలాగున గృహస్థధర్మము ననుష్ఠించక, బ్రహ్మధర్మమును బొందక తన ధర్మమును విడిచినవాడును పతనము నొందును

**మక్షికాపాదమాత్రం తు యథా హి విషమం విషమ్ ।**
**క్రియా తు నిఖిలాఽల్పాపి విపాకే దారుణా భవేత్ ॥**

**అణుమాత్రం విషం య త్తద్గ్రాహకాలే లవాగ్నివత్ ।**
**తథైవానుభవే భోక్తుర్మహాపీడాం కరోతి హి ॥**

**తథైవ పాతకం కర్మ క్రియాకాలేఽల్పమేవ యత్ ।**
**తద్భోగసమయే కర్తుర్విపాకే మేరుతాం వ్రజేత్ ॥**

ఓ మానవుడా! కర్మఫలము మిగుల విచిత్రమైనది చెప్పెద వినుము మిగుల తెలివి గలవాడుకూడ కర్మకు లోబడి కష్ట మొందుచున్నాడు ఈగ కాలు మాత్రము మిగుల స్వల్పమైనను విషము చాలా పెద్దది కర్మ లొనర్చునపుడు స్వల్పముగా నున్నప్పటికిని అవి యనుభవకాల మప్పటికి మిగుల దారుణము లగును విషమును అణుమాత్రము పుచ్చుకొనినను అనుభవకాలమునకు స్వల్పమగు అగ్ని విశేషముగ ప్రజ్వలించునట్లు విశేషబాధను గలిగించును అదే రీతిగా పాపకార్యమును జేయునపుడు మిగుల స్వల్పముగ నున్నప్పటికిని అనుభవకాలము వచ్చునప్పటికి మేరు పర్వతమువలె మిగుల గొప్పది యగును అని మాఘపురాణము

పాపకర్మముయొక్క స్వభావమును విన్నారుగదా! మఱ్ఱివిత్తనము ఎంత సన్నదియైనను వృక్షముగా పరిణమించునపు డెంత గొప్పదిగా నుండునో పాపముయొక్క స్థితియు నాలాగున నుండును

**చిత్రామృతం నామృతమేవ విద్ధి చిత్రానలం నానలమేవ విద్ధి ।**
**చిత్రాంగనా నూనమనంగనేతి వాచావివేక స్త్వవివేక ఏవ ॥**

ఓ! రామచంద్రా చిత్రమందలి యమృత మమృతము గాదు చిత్ర మందలి యగ్ని యగ్నిగాదు చిత్రమందలి స్త్రీ స్త్రీగాదు ఇట్లే వాచా వివేకము వివేకము గానేరదు అది యవివేకమే యగును

అనుష్ఠానములేని వేదాంతబోధ లన్నియు సినిమాలో గనిపించెడి

క్షీరసాగర మథనమున గలిగెడు అమృతమువలెను, లంకాదహనము వలెను, స్త్రీబొమ్మలవలె నుండును అట్టి యమృతమును భుజించిన దేవత్వము సిద్ధించునా? అట్టి నిప్పులో తృణమైనను కాలునా? అట్టి స్త్రీతో సంసారమును జేసి సంతానమును గనగలుగునా? పైజెప్పిన బోధలవలన గలిగెడు ప్రయోజన మిట్టిదే

**ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి॥**

ఈ జన్మమునందే నరకవ్యాధికి చికిత్సను ఎవడొనర్పడో అనగా సంసార తరణోపాయమునకై యత్నింపడో అతడు పరలోకమును పొందినను ఏమి చేయగలుగును? ఔషధమును, వైద్యుడున్ను లేని దేశములో రోగము గలవాడు వెళ్ళి ఏమి బాగుచేసికొనగల్గును? అనగా సత్కర్మలచే స్వర్గాది లోకముల పొందినను అచట మోక్షసాధన కార్యముల నేమియు జీవులు చేయజాలరు దానికి మనుష్యలోకమే తగియున్నది కామ్యకర్మల ఫలమను భవించుటకు మాత్రము స్వర్గలోక మేర్పడినది అనగా మనుష్యజన్మలో మాత్రమే బ్రహ్మధ్యానమును జేయుటకు తగిన యంతఃకరణసృష్టి యేర్పడియున్నది అట్టి సామర్థ్యము దేవతలకుగాని, మరి యెవ్వరికిగాని కలిగియుండలేదు జన్మము లన్నింటిలోను మానవజన్మము జ్ఞానముతో గూడిన దనియు, ఉత్కృష్ట మైనదనియు చెప్పుటకు కారణమిదియే

**ఉపసర్గాః ప్రవర్తంతే దృష్టే హ్యాత్మని యోగినః॥**
**ఏతాంస్తే సంప్రవక్ష్యామి సమాసేన నిబోధ మే ॥**

**కామ్యాః క్రియా స్తథా కామాన్మనుష్యో యోఽభివాంఛతి ।**
**స్త్రియం దానఫలం విద్యాం మాయాం కుప్యం ధనం దివమ్ ॥**

**దేవత్వమమరేశత్వం రసాయనం వయః క్రియామ్ ।**
**మరుత్ప్రపదనం యజ్ఞం జలాగ్న్యావేశనం తథా ॥**

**శ్రాద్ధానాం సర్వదానానాం ఫలాని నియమాం స్తథా ।**

**తథోపవాసాత్ పూర్తాచ్చ దేవతాభ్యర్చనాదపి ॥**

**అతిథిభ్యశ్చ కర్మభ్య ఉపసృష్టోఽభివాంఛతి ।**
**విఘ్నమిత్థం ప్రవర్తేత యత్నాద్యోగీ నివర్తయేత్ ॥**

**బ్రహ్మసంగి మనః కుర్వన్నుపసర్గైః ప్రముచ్యతే ॥**

యోగుల కాత్మదర్శన కాలమం దేవిఘ్నవములు గలుగుచున్నవో, వాటిని నీకు సంగ్రహముగా జెప్పెద వినుము కామ్యక్రియలున్ను, అట్లే కామముచేత పురుషుడు, స్త్రీ, దానఫలము, విద్య, వంచనము, బంగారు, వెండి మొదలగునవిన్ని దానికంటె అన్యములైన లోహములున్ను, ధనము, స్వర్గము, దేవత్వము, ఇంద్రత్వము, రసాయనము, వయస్సు, క్రియ వాయువులో చరించుట, యాగము, జలస్తంభనము, అగ్నిస్తంభనము నందు ప్రవేశించుట, అ ట్లే శ్రాద్ధముయొక్క ఫలమును, సకలదానముల ఫలమును, వివేకములేని నియమముల నిచ్ఛగించుచున్నాడు అట్లే కరినోపవాసముల చేతను, ఇష్టాపూర్తములయిన గుంటలు, బావులు, తటాకములు మొదలగు నవి నిర్మించుటచేతను, దేవతార్చనలచేతను, అతిధులచేతను, బాహ్య కర్మములచేతను కలుగు విఘ్నములను గోరుచున్నాడు ఈలాటి విఘ్నములు కలుగుచున్నవి వాటిని యోగియైనవాడు ప్రయత్నముచేత మరలించి మనస్సును బ్రహ్మమునందు లగ్నముచేసి త్యజించి యావిఘ్నములనుండి విడివడుచున్నాడు అని హఠయోగ ప్రదీపిక-పీఠిక

ఇది ఒక్కొక్కదానిని విశదీకరించి వ్రాయవలసినచో గ్రంథ బాహుళ్య మగును కనుక అనుభవజ్ఞులద్వారా గ్రహించుకొనవలయును

**విహితస్యాననుష్ఠానాన్నిషిద్ధస్య చ సేవనాత్ ।**
**అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥**

విహితమైన యనుష్ఠానమును చేయకపోవుటచేతను, నిషిద్ధకార్య మును చేయుటచేతను, ఇంద్రియములయొక్క నిగ్రహము లేకపోవుట చేతను మనుజుడు పతితు డగుచున్నాడు

**యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥**

ఓ యర్జునా! ఇంద్రియములను విషయములనుండి మఱలించుటకు ప్రయత్నించుచున్న విద్యాంసుడైన పురుషునియొక్క మనస్సునుగూడ క్షోభ మును గలుగజేయునట్టి యింద్రియములు బలాత్కారముగ హరించుచున్నవి అని గీత

దీనియందు ''యతతః విపశ్చితః'' అను రెండు పదములను ప్రయోగించ డమైనది ప్రయత్నము జేయువాడును, విద్యావంతుడు అగువాని మనస్సు గూడ ఆకర్షింపబడునని చెప్పుచుండగా తదితరులను గుఱించి చెప్పవలయునా?

**ధ్యాయతో విషయాన్పుంసస్సంగ స్తేషూపజాయతే ।**
**సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥**

**క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః।**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥**

ఇంద్రియ విషయములను చింతించుచున్న మనుజునకు ఆ విషయ ములందాసక్తి కలుగుచున్నది అట్టి యాసక్తిచే కోరిక గలుగుచున్నది కోరిక వలన కోపము జనించుచున్నది కోపమువలన నవివేకము గలుగుచున్నది యుక్తాయుక్త వివేకము లేని యవివేకమువలన మతిభ్రమ గలుగుచున్నది మతిభ్రమవలన బుద్ధి నశించుచున్నది అట్టి బుద్ధినాశమువలన తాను తప్పక నశించుచున్నాడు

ఇవన్నిటికిని విషయవాంఛయే కారణ మగుచున్నది అట్టి సంకల్పము గలుగునపుడే నివృత్తి చేసిన ప్రమాదము గలుగదు చింతచెట్టు అంకురించు నపుడే సులభముగ గోటితో త్రుంచివేయువచ్చును పెద్ద మానైనచో తీసివేయుట కెంత ప్రయాసమో వాసనావృత్తులయొక్క స్వభావ మాలాగున నుండును

**న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥**

పురుషుడు చేయవలసిన యనుష్ఠానములను చేయకపోవుటచేత నిష్కామకర్మముచేత పొందలసిన మోక్షమును బొందడు నిష్కామ కర్మానుష్ఠానమును వదలుటచేతను, లేక దేహసన్న్యాసము మాత్రముచేతను నైష్కర్మ్యసిద్ధిని పొందడు

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥**

ప్రతి ఇంద్రియముయొక్క విషయమునందును ఇష్టానిష్టములు గలిగియుంటున్నవి కనుక ఆ రాగద్వేషములకు అధీనము గాకూడదు ఆ రాగద్వేషములు ఈ ముముక్షువగు పురుషునకు శత్రువులు అనగా విఘ్నకారులు

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః ।**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున! ॥**

ఓ యర్జునా! యధికముగా భోజనము జేయువానికిని, బొత్తిగా భుజింపని వానికిని, నధికముగా నిద్రించువానికిని, బొత్తిగా నిద్రించని వానికిని యోగము సిద్ధింపదు

1 ఎక్కువ భుజించుట, 2 భోజనము లేకుండుట, 3 అధికముగా నిద్రించుట, 4 నిద్రలేకపోవుట – యీ నాలుగు యోగమునకు విఘ్నములు

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరహితుడై అనేక జన్మములందు అనుష్ఠించుటవలన పొందదగిన యోగసిద్ధిని బొందుచున్నాడు పిమ్మట సర్వోత్తమమగు మోక్షమును బొందుచున్నాడు

ఏ వృక్షమునుండి యెక్కువ ఫలము లభించునో, యది ఫలించుట

కున్ను ఎక్కువ కాలము పట్టును స్వల్పఫలము నిచ్చెడు కూరగాయల చెట్లు త్వరలో ఫలించినను శీఘ్రముగనే నశించును బ్రహ్మనిష్ఠులు హృదయ క్షేత్రమున ప్రణవస్వరూపమగు పరబ్రహ్మబీజమును బెట్టి పోషించుచున్నారు దీని ఫలమారంభించిన యనంత కల్పములవఱకును నశించని బ్రహ్మానంద ఫలమును గలుగజేయున దగుటచే ఫలించుట కెక్కువ కాలము పట్టును కావుననే "న స పునరావర్తతే" అనియు "యస్మాద్భూయో న జాయతే" యనియు శ్రుతిస్మృతులు ఘోషించు చున్నవి "యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ" యని గీతాచార్యు డుపదేశించుట కిదియే హేతువు

**యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।**
**న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ ॥**

ఓ యర్జునా! దుష్టబుద్ధిగల యే మనుజుడు అతినిద్రను, భయమును, దుఃఖమును, దిగులును, మదమును విడువడో అట్టి స్వభావము తామస గుణమే యగును ఇవిన్ని యోగమునకు విఘ్నకారులు అని గీత

**స తరతి స తరతి స లోకాంస్తారయతి ।**

ఎవడు సంసార సాగరమును దాటునో వాడే దాటినవాడు వాడు లోకములో నుండువారిని దాటించుటకు శక్తిమంతు డగునని నారదభక్తి సూత్రము

దీనివలన తాను తరించిన పిమ్మటనే ఇతరులను తరింపజేయుటకు యత్నించవలయును లేనిచో ప్రయోజన ముండదు శ్రీ బుద్ధదేవుని జీవిత చరిత్రములో నీ విషయము గనందగును శ్రీశంకర, శ్రీయేసు, శ్రీమహమ్మదు మొదలగు ప్రవక్త లాలాగుననే చేసిరి వారి చరిత్రములో నీ విషయము తెలిసికొనవచ్చును

**స్త్రీ ధన నాస్తిక చరిత్రం న శ్రవణీయమ్ ॥**

భగవద్భక్తులు, విరక్తపురుషులు స్త్రీ ధన నాస్తికులయొక్క చరిత్రము

లను వినరాదు ఈ మూడును బ్రహ్మజ్ఞానమునకు విఘ్నములు

**శుద్ధిద్వయం మహత్కార్యం దేవానామపి దుర్లభమ్ ।**
**కౌపీనశుద్ధిః ప్రథమా వాక్యశుద్ధిరనంతరా ॥**

దేవతలకు సహా మహత్కార్యమగు ఈ శుద్ధిద్వయము మహా దుర్లభము మొదటిది కౌపీనశుద్ధి –రెండవది వాక్యశుద్ధి

కౌపీనశుద్ధి యనగా బ్రహ్మచర్యవ్రతము వాక్ శుద్ధియనగా సత్యవచనము, నిషిద్ధాహారమును కోరకుండుట దేవతలు మొదలు మనుష్యులందరును ఈ శుద్ధిద్వయమును పొందకనే మాయామోహములో బడిపోవుచున్నారు ఈ ద్వివిధశుద్ధులు లెకపోవుటయు విఘ్నకారణము

**ద్వయమేతన్న సిద్ధంచేజ్జీవితం తు నిరర్థకమ్ ।**
**యథా త్వం విద్ధి పుణ్యాత్మన్ రంధ్రపాత్రే చ పాచనమ్ ॥**

జిహ్వోపస్థల రెంటియొక్క శుద్ధి గలుగనిచో నతని జీవితము నిరర్థకము ఓ పుణ్యాత్ముడా! అదెట్లనిన వినుము రంధ్రము పడినపాత్రము పచనక్రియ కెట్లుపయోగపడదో యాలాగున నుండును

**ఉలూకస్య యథా భానురన్ధకారః ప్రతీయతే ।**
**స్వప్రకాశే పరానందే తమో మూఢస్య జాయతే ॥**

గుడ్లగూబకు సూర్యప్రకాశము చీకటిగా కనబడునట్లు మూఢునకు స్వప్రకాశ పరానందమునందు చీకటియే కనబడును

అంతఃకరణమున తమోగుణము గలవానికి నిరతిశయానంద బ్రహ్మసుఖమందు దృష్టి గోచరింపదు

**లయ, విక్షేప, కషాయ, రసాస్వాదేభ్యో రక్షితం**
**మే చిత్తమవిఘ్నేన బ్రహ్మణ్యవస్థితం భూయాత్ ॥**

లయము (ఆలస్యము), సోమరితనము చేగాని, నిద్రచేగాని ప్రవృత్తి

రహితమైనది విక్షేపము- వృత్తి బహిర్ముఖ మగుట, కషాయము రాగాది దోషమువలన కలిగెడి మనోమాలిన్యము, రసాస్వాదము- తాను యోగసమాధి పొందినట్లు గలిగెడి భావము ఇది యానందమయ కోశమున గలుగును పైజెప్పిన నాలుగును నిర్వికల్ప సమాధినిష్ఠకు ప్రతిబంధకములు అనగా విఘ్నములు అని బ్రహ్మవిదాశీర్వాద పద్ధతి

ప్రతివారును ధ్యానానుష్ఠానానంతరము ఈ బ్రహ్మవిదాశీర్వాద పద్ధతి యను చిన్నగ్రంథమును పారాయణచేయుట మంచిది అట్లయిన యోగ విఘ్నములను దెలిసికొనవచ్చును విఘ్ననివృత్తియును త్వరలో సిద్ధించును.

**వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానాభ్యాసవశాత్ జ్ఞానరక్షా, తపస్సిద్ధిః, సర్వసమత్వం, దుఃఖనివృత్తిః, సుఖావిర్భావ ఇత్యేతత్పంచ ప్రయోజనసిద్ధిర్భూయాత్॥**

వాసనానాశమువలనను, మనోనాశమువలనను, తత్త్వజ్ఞానాభ్యాసము వలనను కలిగిన జ్ఞానరక్ష, తపస్సిద్ధి, సర్వసమత్వము, దుఃఖ నివృత్తి, సుఖా విర్భావము అను నీ అయిదు ప్రయోజనములయొక్క సిద్ధి కలుగునుగాక।

ఇట్టి యీశ్వర ప్రార్థనమువలన విఘ్నములు తొలగును

**రాహుగ్రస్తస్య సోమస్య యథా జ్యోత్స్నా న భాసతే।**
**తథా తమోఽభిభూతానాం భూతానాం నశ్యతే సుఖమ్॥**

ఏలాగున రాహువుచే గ్రస్తమైన చంద్రునియొక్క ప్రకాశము కొంచెమైనను కనుపించక యావరణమైపోవునో, ఆలాగున తమోగుణముచే వ్యాప్తమైన హృదయముగల జీవులయొక్క ఆత్మప్రకాశమున్ను ఆవరణమై పోయి శాశ్వతమైన దివ్యసుఖమును పొందజాలదు

సంపూర్ణ రాహుగ్రస్త గ్రహణకాలమున చంద్రప్రకాశము కొంచెమయి నను కనుపించదు గ్రహణవిమోచనము గలిగి రాగా రాగా ఏలాగున కొంచెము కొంచెముగా ప్రకాశమేర్పడి పూర్ణవిమోచనము గలుగునపుడు

బాగుగా ప్రకాశించునో, ఆలాగున అనుష్ఠానముచే ప్రకృతిదోషము హృదయమునుండి తొలగుచుండ కొంచెము కొంచెము ఆత్మశాంతియు ఆత్మసుఖమున్ను గలుగుచు, సంపూర్ణముగా ప్రకృతి నశించునపుడు నిరతిశయానందము గలుగును

**యోగాభ్యాసేన మే రోగ ఉత్పన్న ఇతి కథ్యతే।**
**తతోఽభ్యాసం త్యజేదేవం ప్రథమం విఘ్నముచ్యతే॥**

**ద్వితీయం సంశయాఖ్యం చ తృతీయం చ ప్రమత్తతా ।**
**ఆలస్యాఖ్యం చతుర్థం చ నిద్రారూపం తు పంచమమ్ ।**

**షష్ఠం తు విరతిర్భ్రాన్తిః సప్తమం పరికీర్తితమ్ ।**
**విషమం చాష్టమం చైవ అనాఖ్యం నవమం స్మృతమ్ ॥**

**అలబ్ధిర్యోగతత్త్వస్య దశమం ప్రోచ్యతే బుధైః ।**
**ఇత్యేతద్విఘ్నదశకం విచారేణ త్యజేద్బుధః ॥**

1 యోగానుష్ఠానముచేత నాకిట్టి వ్యాధి గలిగినదని తలంచి అందువలన నేను అనుష్ఠానమును విడిచితిని యనునది మొదటివిఘ్నము, 2 సంశయము, 3 ప్రమాదము, 4 ఆలస్యము, 5 అతినిద్ర, 6 అనుష్ఠానము నందు ప్రీతి లేకుండుట 7 భ్రమ, 8 ప్రయాసమని తోచుట, 9 అశాస్త్రప్రవర్తనము 10 ఆత్మనిష్ఠయందు నిలుకడ లేకపోవుట- యోగీశ్వరులచేత ఈవిధముగ దశవిఘ్నములు చెప్పబడినవి కావున బుద్ధి మంతుడు ఈ పైజెప్పిన దశవిఘ్నములు గలుగనీయక చూడవలయును

**జపంతః ప్రణవం నిత్యం ముచ్యంతే సర్వపాతకైః ।**
**నదాఽభ్యాసేన సంయుక్తాః పరం మోక్షం లభన్తి చ ॥**

ఈ విఘ్నములు నశించుటకును, పాపదోషములు క్షయించుటకును, బ్రహ్మభావముతో గూడిన ప్రణవమును నిత్యమును జపించవలయును దీని వలన సర్వవిఘ్నములును, పాపములును నశించును ఈ లాగున అను

స్థానమును జేయువారు పరమమయిన మోక్షమును పొందగలరు

ఎంతవఱకు హృదయమున పాపముండునో అంతవఱకు విఘ్నములు గలుగుచుండును ప్రణవమును గాని, యితరములగు దివ్యమంత్రములనుగాని హృదయములో మనస్సు నుంచి యీశ్వరభావముతో జపము చేయుచుండిన దోషము నశించును జపకాలములో తాను జపించెడి యిష్టదేవతయొక్క భావమును హృదయమున నిల్పి ప్రతిమంత్రమున్ను, దివ్య శక్తిని గలిగినదిగా భావించి ప్రతిబీజాక్షరమున్ను హృదయమున స్ఫురించే లాగున నెమ్మదిగా జపమొనర్ప వలయును అట్లయినమాత్రమే పాపరాసులన్నియు నిప్పుచే దూది కాలిపోవునట్లు భస్మము లగును

**సర్వపాపేషు నష్టేషు బుద్ధిర్భవతి నిర్మలా ।**
**సైవ బుద్ధిస్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః ॥**

ఎప్పుడు ధ్యాన జప తపస్సులచే పాపకర్మము లన్నియు నశించునో అప్పుడు బుద్ధి నిర్మలమగును విఘ్నములు నశించును అట్టి దోషరహితమైన విశుద్ధబుద్ధి యేది గలదో అట్టి బుద్ధియే జ్ఞానోపలబ్ధిని కలుగజేయునని మహర్షులు చెప్పిరి

**యది శైలసమం పాపం విస్తీర్ణం బహుయోజనమ్ ।**
**భిద్యతే ధ్యానయోగేన నాన్యో భేదః కదాచన ॥**

అనేక యోజనముల విస్తీర్ణమై మహాపర్వతమువలె నుండు పాపములన్నియు, ధ్యానయోగము ఒక్కదానిచే మాత్రమే నశించుటకు యోగ్యమగునే గాని వేఱు ఏ యుపాయముచేతను, ఒకప్పుడును భేదింప శక్తి చాలదు

అనేక యోజనముల విస్తీర్ణము గలిగి యనేక కాలములనుండి పడియుండు కట్టెలన్నియు, అగ్నికణము పడినంతనే యెట్లు బూడిదయై పోవునో ఆలాగున దివ్యమంత్రమును దివ్యభావముతో జపించెడివారి పాపకర్మములున్ను, విఘ్నములున్ను నశించును

**యావచ్చ పాతకం దేహే తావత్సిద్ధిర్న జాయతే ।**
**గతే చ పాతకే తస్య సర్వం చ సఫలం భవేత్ ॥**

ఎన్ని ధ్యానానుష్ఠానములు చేయువాడైనను ఎంతవఱకు దేహములో పాతకము నశించలేదో అంతవఱకు దైవజ్ఞానసిద్ధి యేమియు కలుగదు ధ్యాన జపాదులచే పాపములు నశించునపుడు సమస్త సాధనలు ఫలమును గలుగజేయును

ఒకప్పుడు తప్పుపని చేసి కారాగృహములో నెంతకాల ముండ వలయునని శిక్ష యేర్పడి యుండునో అట్టి కాలము పూర్తియగులోపల బయటికి వచ్చుటకు యత్నించిన కాపలావారు అడ్డగించి లోపలకు త్రోయుదురు కాలము పూర్తియగునపుడు ఇదివఱలో తన్ను నిరోధించిన విరోధులే ప్రేమతో బయటికిని విడిచిపెట్టుదురు ఆలాగున పాతక ముండువఱకు పరమశాంతితో నిష్ఠయందుండుటకు యత్నించినను విఘ్నములు గలుగుచునే యుండును పాపము నశించిన నిరతిశయ పరమసుఖనిష్ఠలో నుండనచ్చును అయితే కారాగృహములో నుండువారి ప్రవర్తనము మంచిదిగా నుండిన సంవత్సరమునకు రెండు మాసములుగాని, నాలుగు మాసములుగాని శిక్ష తగ్గించు నేర్పాటు గలదు ఇచ్చటగూడ దుష్టప్రవృత్తి గలిగియున్నచో కాలమును పొడిగించు పద్ధతిగూడ ఉన్నది ఆలాగున అనుష్ఠాన కాలములో గలిగెడి విఘ్నములను ఓర్చుకొని వ్రతమును చెడనీయక యుండెనేని త్వరలోనే విఘ్నములు నశించును అట్లుగాక ప్రవర్తనము చెడెనేని దీర్ఘకాలము దుఃఖము ననుభవించవలసి యుండును

**ఆచారాన్మోచితో విప్రో న వేద ఫలమశ్నుతే ।**
**ఆచారేణ తు సంయుక్తస్సంపూర్ణఫలభాక్ భవేత్ ॥**

వేదాధ్యయన తత్పరుడై యున్నను ఆచరణయందు జాగ్రత్త లేక పోయిన వేదాధ్యయన తపస్సుల ఫలము ననుభవింపజాలడు ఆచరణయందు జాగ్రత్త గలవాడు తపస్స్వాధ్యాయేఽశ్వర ప్రణిధానముల కెంతఫలము

శాస్త్రములో చెప్పబడియున్నదో దానిని తప్పక పొందగల్గును అని మనువు

ఎంత శ్రేష్ఠమైన ఔషధసేవ చేయుచున్నను పథ్యము సరిగా లేనిచో ఔషధముయొక్క ఫలము నెట్లు పొందజాలడో, దీనియొక్క స్థితియు ఆలాగున నుండును

**భయం క్రోధమథాలస్యమతిస్వప్నాతిజాగరమ్ ।**
**అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్ ॥**

భయము, కోపము, సోమరితనము, అతినిద్ర, అతిజాగరణము, అత్యాహారము, అనాహారము– వీనిని ధ్యాననిష్ఠగల యోగి ఎల్లప్పుడును విడువవలయును ఇవియు విఘ్నములే

**వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాంగృహేఽపి పంచేన్ద్రియ నిగ్రహ స్తపః ।**
**అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ॥**

రాగద్వేషములు గలవాడు వనమునందుండినను దోషములే గలుగు చుండును గృహస్థాశ్రమ మందుండినను పంచేన్ద్రియముల నిగ్రహము గల వాడు తాపసుడే యగును నిందితముగాని కర్మను జేయువాడెచ్చట నుం డినను జ్ఞానియే(ముక్తుడే) యగును రాగరహితునకు గృహము తపోవన మువంటి పుణ్యభూమి యగును

ఒకడు క్షీరాన్నమును జేయదలంచినచో రుచిగా నుండవలసిన స్వగృ హములో వండినను, లేక యేకాంత స్థలమున వండినను పంచదార, పాలు, ద్రాక్ష, జీడిపప్పు,సగ్గుబియ్యము సరిగానుండిన మాత్రమే అది హృద్యముగా నుండును వీటిలో నేది తగ్గినను గృహమందుగాని, వనమందుగాని రుచిగా నుండదు జ్ఞానముయొక్క స్థితియు నీలాగున నుండును అయితే యేకాంత ప్రదేశము బ్రహ్మనిష్ఠులకు శ్రేష్ఠమని చెప్పుటకు కారణమేమన గాలి విశేషముగా వీచుచుండు ప్రదేశమున వండిన యాలస్య మగును శ్రమయున్ను గలుగును గాలిలేని ప్రదేశమైనచో త్వరలో పక్వమగును శ్రమ యుండదు ఇంతే భేదముగాని పదార్థములలో కొఱత గలిగిన ఎచ్చటనైనను రుచిగా

నుండదు ఆలాగున శమదమాది గుణములు పూర్తిగా నుండిన గృహమందైనను, వనమందైనను ముక్తిని పొందవచ్చును ఏకాన్త ప్రదేశములో నుండిన మనోనిశ్చలత్వమునకును, ఏకాగ్రతకును, నిర్మలత్వమునకు కొంత సహాయ మేర్పడును మఱి యేమియు విశేషము లేదు

మఱియు సన్న్యాసియైనను, ఆశ్రమమఠములలో నుండినను, గృహ కార్యములనే చింతించుచు దానిని వృద్ధిచేయజూచినచో అతడు నీచస్థితినే పొందును సంసారమందుండినను, ఆశ్రమములో, మఠములో నుండువారి సంకల్పమునే గలిగియున్నచో ఆశ్రమవాసులను పోషించెడి హృదయమును గలిగియుండిన యాత డుత్కృష్టస్థితిని బొందును దేహావసాన కాలమున మొదట చెప్పినవాడు సంసారమును, రెండవాడు సన్న్యాసముయొక్క స్థితిని పొందగలుగును జనకుడు గృహమందుండినను హృదయమును సన్న్యాస ముగా జేసెను కనుక ముక్తుడయ్యెను జడభరతుడు వనమందుండినను దృశ్యరూపమగు లేడిభావము హృదయమందుండుటచే జింకయై పుట్టెను సూక్ష్మబుద్ధి గలవారు ఈసత్యమును దెలిసికొన యత్నించవలయును

**నాన్యద స్తి సురేశానా మిష్టసిద్ధిప్రదం దివి ।**
**దోగ్ధ్రీ ధేనుర్యథా నీతా దుఃఖదా గృహమేధినామ్ ॥**

**తథైవ జ్ఞానవాన్విప్రో దేవానాం దుఃఖదో భవేత్ ।**
**త్రిదశాస్తేన విఘ్న న్తి ప్రవిష్టా విషయం నృణామ్ ॥**

యోగాదులంజేసి దేవాదులను మఱచి, అనుష్ఠానమును వదలి అనిర్వాచ్య జ్ఞానానందానుభవ ప్రమత్తుడై ప్రవర్తించినచో దేవతలు ఇష్టా పూర్తిని బడయలేమి కోపము వహించి శపింతురు (విఘ్నముల నొనర్తురు) మఱియు పాలుపితుకు ఆవును వేఱొకడు పెడదారిం గొంపోవ గృహమేధి యెంత యలమట బొంది చింతించి వెదకి తనదారికి త్రిప్పుకొనునో, ఆలాగు ననే అమరవరులు చింతిలువారలై తమ త్రోవను వీడి కైవల్య పథములో ద్రొక్కు వానిని పలువిధముల విఘ్నములు బన్నుచు ముందుకు పోనివ్వరు –

అని శివగీత–

ఎంత బ్రహ్మనిష్ఠుడైనను, యోగియైనను, అహంకరించి ధర్మా నుష్ఠానము నతిక్రమించి ప్రవర్తించినచో దేవతలు ముందుకు పోనీయక విఘ్నములను గల్పించి పతితునిగా చేయుదురు ఈ రహస్యము దెలియక పోవుటయే కొందఱున్నత స్థితిలోనికి వచ్చియు పడిపోవుటకు కారణ మగుచున్నది కావున ప్రతిముముక్షువును శాస్త్రవిధ్యతిక్రమమును జేయరాదు

**యద్యేవం దేవతా విఘ్నమాచరంతి తనూభృతామ్।**
**పౌరుషం తత్ర కస్యాస్తి యేన ముక్తిర్భవిష్యతి ।**
**సత్యం సూతాత్మజ! బ్రూహి తత్రోపాయోఽస్తి వా న వా ॥**

ఓ మహానుభావా! సూతపుత్రా! ఈ తీరున దేవతలు స్వంతత్రులై తమ తృప్తికిగా నరులు పోవు జ్ఞానసరణిని విఘ్నములచే నరికట్టుచుండిరేని ముక్తి పదంబు నొందుటెప్పుడు? ఎట్టి పౌరుషముచేనైన ఆ విఘ్నములను దొలగ ద్రోయు తెఱువున్నదా? నిక్కము తెలుపు మనుటయు సూతం డిట్లనియె

సూత ఉవాచ –

**కోటిజన్మార్జితైః పుణ్యైః శ్శివే భక్తిః ప్రజాయతే ।**
**ఇష్టాపూర్తాని కర్మాణి తేనాచరతి మానవః ॥**

**శివార్పణధియా కామాన్ పరిత్యజ్య యథావిధి ।**
**అనుగ్రహాత్తేన శంభోర్జాయతే సుదృఢో నరః ।**
**తతో భీతాః పలాయన్తే విఘ్నం హిత్వా సురేశ్వరాః ॥**

అనేక జన్మములనుండి యొనర్చు పుణ్యఫలములవలన ఈశ్వరుని యందు భక్తి పుట్టుచున్నది ఆ హేతువున మనుజుడు అభిమతార్థ ప్రదములగు సత్కర్మము లాచరించును అతడాచరించు కర్మముల నీశ్వరార్పణబుద్ధితో చేసెనేని తానీశ్వరుని యనుగ్రహమున సంకల్పసిద్ధు

డగును అమోఘంబగు నీశ్వరానుగ్రహంబున వాని సంకల్పమునకు గలుగు నంతరాయంబు లంతరించుటజేసి దేవతలు తాము వ్యర్థ ప్రయత్నులగుట నూహించియు, సర్వేశ్వరాగ్రహంబున తమకేమి కీడు మూడునో యని భీతిల్లియు అట్టివాని యుద్యమంబున కేలాటి విఘ్నము నొనర్పజాలక పారిపోయెదరు

ఒక గ్రామమున నొక ధనికుడుండేవాడు అతనికి ఆ జిల్లా పోలీసు సూపరింటెండెంటు నిండా మిత్రుడై యుండెను అతడు క్రింది జవానులను లక్ష్యము చేయువాడు కాడు అయితే సూపరింటెండెంటు ఇతనికి మిత్రుడని యెరింగియుండుటచేత సర్కిల్ యిన్‌స్పెక్టరు, సబ్‌యిన్‌స్పెక్టరు మొదలు జవానువఱ కెవరున్ను అతని జోలికి పోయేవారు గారు అంతేగాక సహాయముగూడ చేయుచుండిరి కారణమేమన సూపరింటెండెంటు ఇతనికి మిక్కిలి ప్రియు డగుటచే ఇతనికి నేదైన ప్రతిబంధమును గలుగజేసిన సూపరింటెండెంటు గారికి ఆగ్రహము గలిగి తమ కేదైనా కీడు మూడునని తలంచి యుండువారు ఈశ్వరానుగ్రహము గలవాని వారి స్థితి యీలాగున నుండును

మఱియొక్క గ్రామమున నొక శ్రీమంతుడుండేవాడు అతనికిని, ఆ జిల్లా సూపరింటెండెంటుగారికిని విరోధము కారణాంతరములచే గలిగియుండెను ఈ రహస్య మెఱింగియుండు క్రింది యధికారులు సర్కిల్ యిన్‌స్పెక్టరు మొదలు జవాను వఱకుండు వారందఱును ఇతనికి బాధలు గలుగజేయుచునే యుండిరి ఈశ్వరానుగ్రహము గలుగని వారిస్థితి యీలాగున నుండును

**ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణా ద్విత్రాణాముపజాయతే ॥**

అద్వితీయమగు పరబ్రహ్మనిష్ఠ స్థిరమగుట యనునది మహాఘోర సంసార దుఃఖమును తొలగించి రక్షించుటకు పరమేశ్వరునియొక్క కరుణా

కటాక్షవీక్షణానుగ్రహముచే మాత్రము ఏ యిద్దరు, ముగ్గురికో ఏర్ప డుచున్నది అని అవధూతగీతలో దత్తాత్రేయ వాక్యము

బ్రహ్మజ్ఞానులలో శ్రీదత్తాత్రేయులకు సమాను లయినవారు మఱియొక రుండియుండలేదు ఏలయన ఆయన త్రిమూర్త్యాత్మక స్వరూపుడు అట్టివాడే అవధూత గీతయందు మొదటనే ఈశ్వరానుగ్రహము లేనివారు సంసార దుఃఖములనుండి(విఘ్నములనుండి) దరిజేరజాలరను చెప్పుటకన్న పరమ ప్రమాణమేమి గావలయును?

**ఉత్సాహః సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః।**
**షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవోఽపి తిష్ఠతి॥**

1 ఆసక్తి, 2 సాహసము, 3 ధైర్యము, 4 సూక్ష్మబుద్ధి, 5 ఆత్మశక్తి, 6 కార్యదీక్ష -యీ యారు గుణము లెవనియందు గలవో వానికి దైవ సహాయము గలుగును

దీనియందొక రహస్యము గలదు పైజెప్పిన యారు గుణములు గలిగి ప్రవర్తించిన పిమ్మటనే దైవానుగ్రహము గలుగునని చెప్పడమైనది అట్లు తాను చేయవలసిన కార్యమును జేయక ఈశ్వరానుగ్రహము కలుగలేదని చెప్పిన నేమి ప్రయోజనము? ఇది యొక విధమగు సోమరితనమే యగును ఇప్పుడు లోకములో చాలామంది యిట్టి స్వభావము గలవారై యున్నారు

**యోగతత్త్వం ప్రవక్ష్యామి యోగినాం హితకామ్యయా।**
**యచ్ఛ్రుత్వా చ పఠిత్వా చ సర్వపాపైః ప్రముచ్యతే॥**

యోగులయొక్క మేలుకొరకు యోగతత్త్వమును చెప్పుచున్నాడను దీనిని వినినప్పటికిన్ని, చదివినప్పటికిన్ని సకల పాపములనుండి విముక్తి నొందు చున్నాడు అని యోగతత్త్వోపనిషత్తు

ఈ యుపనిషత్తు శ్రీమన్నారాయణమూర్తి చతుర్ముఖ బ్రహ్మదేవున కుపదేశించినది

**విష్ణుర్నామ మహాయోగీ మహాభూతో మహాతపాః ।**
**త త్త్వమార్గే యథా దీపో దృశ్యతే పురుషోత్తమః ॥**

పురుషోత్తముడైన మహావిష్ణువు మహాయోగియై సకలభూతములకును ఆశ్రయుడై, మహాతపస్సంపన్నుడై, తత్త్వమార్గమునందు దీపమువలె ప్రకాశించుచున్నాడు

**తమారాధ్య జగన్నాథం ప్రణిపత్య పితామహః ।**
**పప్రచ్ఛ యోగత త్త్వం మే బ్రూహి చాష్టాంగసంయుతమ్ ॥**

సకలలోకాధిపతియగు ఆ విష్ణువును బ్రహ్మదేవు డారాధించి నమస్కరించి యెనిమిదంగములతో కూడిన యోగతత్త్వమును నాకు బోధింపుమని యడిగెను

**కామః క్రోధో భయం వాఽపి మోహెూ లోభో మదో రజః ।**
**జన్మ మృత్యుశ్చ కార్పణ్యం శోక స్తంద్రా క్షుధా తృషా ॥**

**తృష్ణా లజ్జా భయం దుఃఖం విషాదో హర్ష ఏవ చ ।**
**ఏభిర్దోషైర్వినిర్ముక్తస్స జీవః కేవలో మతః ॥**

జీవుడు కామము, క్రోధము, భయము, మోహము, లోభము, మదము,రజోగుణము, జన్మము, మరణము, కృపణత్వము, శోకము, సోమరితనము, ఆకలి, దప్పిక, అత్యాశ, లజ్జ, భీతి, దుఃఖము, విషాదము, సంతోషము – ఇవి మొదలగు దోషములచేత విడువబడినవాడై కేవలుడై యుండవలయును

ఇట్టి ప్రకృతిగుణములతో కూడియుండువరకు జీవుడనబడును ఈ గుణములనుండి విడుదల పొందినప్పటినుండి కేవల శివస్వరూపు డగును

**తస్మాద్దోష వినాశార్థ ముపాయం కథయామి తే ।**
**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్ ॥**

**యోగోఽపి జ్ఞానహీనస్తు న క్షమో మోక్షకర్మణి ।**

**తస్మాద్ధ్యానం చ యోగం చ ముముక్షుర్ధృఢమభ్యసేత్ ॥**

కాబట్టి యీ దోషములు నివృత్తి చేయుటకు నీకుపాయమును జెప్పెదను యోగములేని జ్ఞానమెట్లు మోక్షమొసంగును? అట్లే జ్ఞానము లేని యోగమును మోక్షము నొసంగదు కాబట్టి మోక్షమును కోరువాడు జ్ఞానమును, యోగ మును చక్కగా నభ్యసింపవలయును

**అజ్ఞానాదేవ సంసారో జ్ఞానాదేవ విముచ్యతే ।**
**జ్ఞానస్వరూపమేవాదౌ జ్ఞానం జ్ఞేయైక సాధనమ్ ॥**

అజ్ఞానముచేతనే సంసారము కలుగుచున్నది జ్ఞానము చేతనే సంసారదుఃఖ నివృత్తి యగుచున్నది ఆదియందు జ్ఞానస్వరూపముగానే యుండినది ఆజ్ఞానము జ్ఞేయమునకు సాధనమై యున్నది

**ప్రథమాభ్యాసకాలే తు విఘ్నాస్స్యు శ్చతురానన ।**
**ఆలస్యం కథనం ధూర్తగోష్ఠీ మంత్రాదిసాధనమ్ ।**

**ధాతుస్త్రీలౌల్యకాదీని మృగతృష్ణామయాని వై ।**
**జ్ఞాత్వా సుధీస్త్యజేత్సర్వాన్ విఘ్నాన్ బుద్ధిప్రభావతః ॥**

యోగము నభ్యసించుకాలమున ప్రథమమున విఘ్నములు సంభవించును అవి యెవ్వియనగా సోమరితనము, ఆత్మస్తుతి, దుర్జన సహవాసము, దుష్టమంత్రమును సాధించుట, రసవాదము, స్త్రీలోలత-అనునవి ఈయోగ విఘ్నములను బుద్ధిమంతుడైనవాడు ఎండమావులవలె దలంచి పుణ్యప్రభావము వలన త్యజించవలయును

సాధకులలో చాలమంది ఈలాటి భ్రమలో బడిపోయెడివారు గలరు పై జెప్పినవన్నియు ఎండమావులవలె చూచుటకు మాత్రమేగాని ప్రయోజన ముండదు ఎండమావులను చూచునప్పుడు జలము గలదని తలంచి ఎంత పరుగెత్తిపోయినను నీరు దొరకక దాహశాంతి కాక క్లేశమును పొందునట్లు పైజెప్పిన వానియొక్క స్వభావమని గ్రహించుకోవలయును

**కందర్పస్య యథా రూపం తథాఽస్యాదపి యోగినః ।**
**తద్రూపవశగా నార్యః కాంక్షంతే తస్య సంగమమ్ ॥**

**యది సంగం కరోత్యేష తస్య బిందుక్షయో భవేత్ ।**
**వర్జయిత్వా స్త్రియాస్సంగం కుర్యాదభ్యాస మాదరాత్ ॥**
**యోగినోఽంగే సుగంధశ్చ జాయతే బిందుధారణాత్ ।**

ఇట్టి యోగి మన్మథునివంటి అందము గలవాడుగ నుండును స్త్రీలు అతని యందమును చూచి మోహింతురు అప్పు డీయోగి స్త్రీలతో చేరిన యింద్రియనష్టము కల్గును కావున స్త్రీసంగమును త్యజింపవలయును మిక్కిలి శ్రద్ధతో యోగము నభ్యసింపవలయును ఇట్లు అభ్యసించుచు ఇంద్రియమును స్ఖలనము చేయకుండు యోగిశరీరమునందు మంచి పరి మళము కల్గును

బ్రహ్మచర్యముచేతను, యోగధారణచేతను దివ్యదేహము గల్గును అప్పుడెటువంటి స్త్రీలకైన ఆ యోగియొక్క సంసర్గమునకు అపేక్ష గల్గును అట్టి స్త్రీలు మంచి స్వభావమున్ను, పుణ్యబుద్ధియు కలవారైనను యోగియొక్క బ్రహ్మతేజస్సునం దట్టి ఆకర్షణశక్తి గలిగియున్నది అయస్కాంతము ఇనుము నేలాగున బలాత్కారముగ నాకర్షించునో అట్టి ఆకర్షణశక్తి సృష్టియందు గలదు ఒకడు బ్రహ్మచర్యవ్రతమును సేవించి తపమొనర్చుచుండెనేని అతడు తక్కువజాతి వాడైనను, రూపలావణ్యము లేకపోయినను, ఉన్నతస్థితిలో నుండు స్త్రీలైన అతని సంస్పర్శమును అభిలషించుదురు కావుననే బ్రహ్మచర్యవ్రతనిష్ఠ గలిగి ధ్యానయోగతపస్సు నొనర్చువాడు స్త్రీలుండు స్థలంబున నుండరాదని శాస్త్రము తెలుపు చున్నది

**తతో రహస్యుపావిష్టః ప్రణవం ప్లుతమాత్రయా ।**
**జపేత్పూర్వార్జితానాం తు పాపానాం నాశహేతవే ॥**

ఏకాంతమున గూర్చుండి పూర్వజన్మకర్మ దోషములు నశించుట

కొఱకు ప్రణవమును (ఓంకారము) మూడు మాత్రల కాలము జపించవలయును

ప్రణవమునుగాని, ఇష్టదేవతా మంత్రమునుగాని, చిత్తైకాగ్రతతో హృదయమున నిలిపి జపించవలయును ఆ దివ్యమంత్రము ప్రకాశమైనదై తన అంతఃకరణలోగల సమస్తదోషములను భస్మమొనర్చునదిగా భావన చేయవలయును

**సర్వవిఘ్నహరో మంత్రః ప్రణవః సర్వదోషహా।**
**ఏవమభ్యాసయోగేన సిద్ధి రారంభసంభవా ॥**

ప్రణవము బ్రహ్మభావముతో జపమొనర్చిన సకల విఘ్నములను, సకల పాపములను నశింపజేయును ఇట్లు జపించుటచేత ప్రారంభమునుండి అనేక దివ్యసిద్ధులు గలుగును జ్ఞానముదయ మగును

**యామమాత్రం ప్రతిదినం యోగీ యత్నాదతంద్రితః ।**
**యథా వా చిత్రసామర్థ్యం జాయతే యోగినో ధ్రువమ్ ॥**

యోగియైనవాడు ప్రతిదినమును సోమరితనము లేక ఒక జాము అభ్యసించిన యెడల వానికి వివిధములగు దివ్యసామర్థ్యములు కల్గును

మూడు జాములు ధ్యానము చేయుట యుత్తమ పక్షమనియు, రెండు జాములు మధ్యమ పక్షమనియు, ఒక జాము కనిష్ఠపక్ష మనియు గ్రహించుకొనవలెను మూడు ఘంటల సమయము ఒక జామని గ్రహించేది బ్రహ్మముహూర్తమున ప్రారంభించి పండ్రెండు ఘంటల సమయమువరకు ధ్యానములో నుండిన మూడు జాముల సమయ మగును ప్రాతఃకాలమునుండి తొమ్మిది ఘంటలకాలమువరకు ధ్యానములోనుండు టొక జామనంబడును ఇంతవరకైన చేయనిచో ఆత్మప్రబోధము కల్గదు ఇట్టివారుకూడ ఇప్పుడు అరుదైరి అందువలన పూర్వికఋషుల, యోగీశ్వరుల, సిద్ధపురుషుల స్థితిని ఇప్పుడుండువారు పొందక పోవుచున్నారు

**శిష్యాశ్చ స్వస్వకార్యేషు ప్రార్థయంతి న సంశయః ।**
**తత్తత్కర్మకరవ్యగ్రస్యాభ్యాసో విస్మృతో భవేత్ ॥**

శిష్యులు తమ తమ కార్యములు చేయుటకై ప్రార్థించుచుందురు ఆకార్యములందు బుద్ధిని వినియోగించుచుండిన యెడల యోగాభ్యాసము తరిగి పోవును

ఈ భగవద్వాక్యమును బ్రహ్మనిష్ఠుడు బాగుగ నాలోచించుకొన వలయును ధ్యానయోగముచే కొంత ఆత్మశక్తి గలుగునప్పుడు శిష్యులనేకులు చేరుదురు మఠము కట్టుటకు కొందరును ఆశ్రమము స్థాపించుటకు మరికొందరును, సంస్కృతపాఠశాల నెలకొల్పుటకు వేరు కొందరును, దేవాలయమును నిర్మించుటకు కొందరును, వార్తాపత్రికలను ఆరంభించుటకు కొందరును, ప్రచారముకొఱకు కొందరును, సత్రము కట్టుటకు కొందరును ప్రోత్సహించుచుందురు ఇత్తరి శిష్యుల వాక్యము లాలకించి అజాగ్రత్త పడక చూచుకొనుచుండవలయును లేనిచో గుమాస్తా ఉద్యోగమునకు తయారైనపుడు చదువు మాని యుద్యోగమునకు వెళ్ళినవాని గతియే కల్గును పాపమిత డేమి చేయగల్గును? పై చదువున్ను పోయినది గొప్ప యుద్యోగానికి అర్హత లేకపోయెను చిన్నఉద్యోగము నాశింపక ఉన్నతమైన చదువు చదువుచుండిన గొప్ప యుద్యోగము వచ్చును కావలసిన ధనమును, ప్రజల ఆమోదమున్ను బడయవచ్చును అప్పుడెంత గొప్ప కార్యమైనను సులభముగా సాధింపవచ్చును అట్లు కానిచో శ్రమ పడవలసియుండును ఈతత్త్వమును తీవ్ర ముముక్షుత్వము గలవారు జ్ఞప్తిలో నుంచవలయును యోగసిద్ధి జీవన్ముక్తి గలుగువరకు అనుష్ఠానము విడనీయక చూచుకొనిన అనేక శ్రీమంతులేగాక మహారాజులుకూడా తన ఆజ్ఞకు బద్ధులై యుందురు అట్టి స్థితిలో ఎంత గొప్పకార్యమైనను ప్రయాసము లేక జరిగిపోవును

**అవిస్మృత్య గురోర్వాక్య మభ్యసేత్తదహర్నిశమ్ ॥**

కాబట్టి గురువాక్యమునందు మరుపులేనివాడై నిరంతరమును అభ్యాసము చేయవలయును

పైచెప్పిన విఘ్నములు తొలగుటకు గురువాక్యమందును శాస్త్రవాక్యమునందును ఏమరుపాటు కలుగక ఈశ్వరునియందు విశ్వాసము గలిగి అనుష్ఠానము చేయవలయును

**ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః।**
**దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్॥**

1 ఆసనము, 2 పాత్రలోపము, 3 సంచయము, 4 శిష్యసంగ్రహము, 5 దివాస్వాపము, 6 వృధాలాపము అను నీయారును సన్న్యాసికి ప్రతిబంధకములు (విఘ్నములు) అని నారదపరివ్రాజకోపనిషత్తు

వీటికిగల అర్థములు ఒక్కొక్క శ్లోకముచేత క్రింద వ్రాయబడుచున్నవి దివాస్వాపమనగా పగటినిద్ర

**ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే ।**
**వర్షాభ్యోఽన్యత్ర యత్ స్థానమాసనం తత్ప్రకీర్తితమ్ ॥**

**1. ఆసనము**

గ్రామములలో నొక దినముకంటె, పట్టణములలో ఐదు దినముల కంటె అధికకాలము నిలువడమున్ను, చాతుర్మాస్యము నాలుగు మాసములలో తప్ప ఇతర కాలములయందొకచోట విశేషకాలము నిలుచుట ఆసనమనబడును

ఇది ధర్మబోధకులై సంచరించు బోధకులకు యతులను గురించి చెప్పడమైనది ఒకే స్థలములోనుండి ధ్యానానుష్ఠానము చేయువారిని గురించి గాని, వేదాంతశాస్త్రశ్రవణము చేయువారిని గురించి గాని చెప్పినది కాదు

**2.పాత్రలోపము.**

**ఉక్తాలాబ్వాది పాత్రాణామేకస్యాపి న సంగ్రహః ।**
**భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే ॥**

సన్న్యాసి యగువాడు భిక్షాన్నము భుజించు నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ, కమండలువు, వెదురుకఱ్ఱ, మట్టి మొదలగు పాత్రలే యుండును వీటిలో నేదైన నొక దానినైన గ్రహింపక పోవుట పాత్రలోపమని చెప్పబడును

పైజెప్పిన పాత్రలుండిన దొంగలభయయుముండదు లోహపాత్ర సంబంధముండిన ఎవరైన అపహరించుదురు అందువల్ల ధ్యానకాలములో గాని యాత్రాకాలములో నిద్రాసమయమందుగాని సంకల్పము గలుగుట కవకాశ ముండును

**3. సంచయము.**

**గృహీతస్య తు దండాదేర్ద్వితీయస్య పరిగ్రహః ।**
**కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః ॥**

దండకాషాయాదులను పరిగ్రహించి అవి ఖిలమైన తరువాత తిరిగి ధరించుటకుగాను రెండు మూడు దండములను, ఆలాగున కాషాయ వస్త్రములను సంపాదించి పెట్టుకొనుట సంచయ మనబడును

ఎప్పటి కెంత కావలయునో అంతమాత్రమే ఏ వస్తువైన దగ్గర నుంచ వచ్చును భావికాలమునకు కావలయునని తలంచి సంపాదించి యుంచ కూడదు ఇదియు యాత్రాపరుడైన సన్న్యాసికి విధించడమైనది ఆశ్రమము లను, మఠములను స్థాపించి బ్రహ్మవిద్యను వృద్ధిపరచుటకు తలంచిన వారైనచో బ్రహ్మచారులకును, సాధనపరులగు వారికిని తగిన యేర్పాటు చేసికొనవచ్చును

**4. శిష్య సంగ్రహము**

**శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః ।**

**శిష్యాణాం తు న కారుణ్యాత్ స జ్ఞేయః శిష్యసంగ్రహః ॥**

శుశ్రూష, లాభము, పూజ, కీర్తి–అను వాని నపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనబడును కేవలము దయచేత శిష్యులను కృతార్థులను చేయవలయుననెడి ఇచ్ఛచేత చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనబడదు

బ్రహ్మనిష్ఠులైనవారు తగిన యోగ్యతలేని వారిని చేర్చుకొనిన వారివల్ల ఏదో లాభము గలుగునని తలంచినచో అది గొప్పప్రతిబంధమే యగును ఆత్మశుద్ధియు, వైరాగ్యమును లేనివారిని చేర్చుకొనిన మరల అనేక కష్టములు పడవలసియుండును

**5. దివాస్వాపము.**

**విద్యా దినం ప్రకాశత్వాదవిద్యా రాత్రిరుచ్యతే ।**
**విద్యాభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే ॥**

బ్రహ్మవిద్య ప్రకాశస్వరూప మైనందున దివా (పగలు) అని చెప్ప బడును అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనబడును ఉపనిష ద్విద్యయనెడి పగటియందు ప్రమాదము (అజాగ్రత్త) గలిగియుండుటయే దివాస్వాప (పగటినిద్ర) మనంబడును

ఇపు డచటచట పురుషులలోను, స్త్రీలలోను భక్తి వైరాగ్యములు గలిగి అనుష్ఠానము చేయువారు కొంతమంది యుండినను, విద్యయందు చాల అశ్రద్ధ గలిగియున్నారు ఈకొరతను తొలగించుటకు విద్యయందుకూడ కొంత శ్రద్ధను వహించుకొనవలయును లేనిచో అట్టివారు పగలు నిద్ర పోయెడి వారివలె నుందురని శ్రుతి యుద్ఘోషించుచున్నది

**6. వృథాలాపము**

**ఆధ్యాత్మికాం కథాం ముక్త్వా భైక్షచర్యాం గురుస్తుతిమ్ ।**
**అనుగ్రహోత్పృథి ప్రశ్నే వృథాలాపస్స ఉచ్యతే ॥**

అధ్యాత్మ విషయమైన కధలను దేహధారణార్థమైన భిక్షాచరణమందు, భిక్షాందేహి అను శబ్దోచ్చారణమును, పరమేశ్వర స్తవమును మాత్రము సన్న్యాసి చేయవలయును వీటికంటె నిరతములైన లోకసమాచారములను అనుగ్రహముచేతనైన అడిగే వారికి చెప్పుటకూడ వృధాలాప మనంబడును

యతులు అధ్యాత్మ జ్ఞానవిషయమై ధర్మబోధనార్థమై మాత్రమే వాక్యము లుచ్చరించవలయును ఈశ్వరకీర్తన, భజనాదులు, గీతా పారాయణ, ఉపనిషత్ పఠనాదులు చేయుచుండవచ్చును భిక్షాన్నమునకు వెళ్ళినప్పుడు ఒక్కొక్క సంప్రదాయ మనుసరించి ఒక్కొక్క వాక్యము నుచ్చరించుదురు 1 భవతి భిక్షాం దేహి, 2 హరిః ఓమ్, 3 ఓమ్ తత్ సత్, 4 అలర్, 5 నారాయణ– ఈలాటి పద్ధతులు గలవు

**ప్రతిగ్రహసమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్ ।**
**ప్రతిగ్రహేణ హ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి ॥**

ప్రతిగ్రహమందు సమర్థత గలిగియుండినను అట్టి స్వభావము మానవలయును పరవస్తు పరిగ్రహముచే శీఘ్రముగా తన బ్రహ్మతేజస్సు నశించును

పరవస్తుపరిగ్రహముచే తన పుణ్యము నశించును కేవలము బ్రహ్మనిష్ఠనాసె, అధ్యయనముగాని చెయువారు, తమ కత్యవసరమునకు మాత్రము అన్నవస్త్రాదులను గ్రహింపవచ్చును లేనిచో బ్రహ్మనిష్ఠయున్ను, అధ్యయనమున్ను, ధర్మబోధయున్ను జరుగదు

**కర్మత్యాగాన్న సన్న్యాసో న ప్రేషోచ్చారణేన తు ।**
**సంధౌ జీవాత్మనో రైక్యం సన్న్యాసః పరికీర్తితః ॥**

విహిత కర్మానుష్ఠానములను మానుటవల్లగాని, ''సన్న్యస్తం మయా'' అని ప్రేషోచ్చారణవలనగాని సన్న్యాస మేర్పడదు ప్రత్యగభిన్న బ్రహ్మానుభవమే సన్న్యాస మనంబడును

ఎవరెవరికి ఏ అనుష్ఠానము చెప్పబడియుండునో అట్టి దానిని విడిచి పెట్టుట సన్న్యాసము గాదు ఆలాగున సన్న్యాసము ననుగ్రహించు సమయమున ప్రేషోచ్చారణమను పద్ధతి యొకటి గలదు ఇది శాస్త్రోక్తముగా సన్న్యసించెడు గురుశిష్యులయందే గల్గును అందుచేతను సన్న్యాసము పూర్తి కాజాలదు ఆత్మసన్న్యాసమే, లేక మానసిక సన్న్యాసమే నిజమైన సన్న్యాసము

**ద్రవ్యార్థమన్న వస్త్రార్థం యః ప్రతిష్ఠార్థ మేవ వా।**
**సన్న్యసేదుభయభ్రష్టః న ముక్తిం నాప్తుమర్హతి ॥**

ధనముకొఱకుగాని, అన్నవస్త్రములకుగాని, తనను అందరు గౌరవింతురనిగాని, తలంపుతో సన్న్యసించిన యెడల ఉభయలోక భ్రష్టత గలుగును ముక్తిగలుగదు అని మైత్రేయోపనిషత్తు

పైజెప్పిన విధముగ సన్న్యసించువా రెక్కువగుటయే పతితు లగుదురనుటకును, సన్న్యాసముయొక్క విలువ తగ్గుటకున్ను హేతువగుచున్నది సంపూర్ణ వైరాగ్యము, ఆత్మశుద్ధియు గలిగి సన్న్యసించిన వారైనచో, సన్న్యాసమున కింత పతనము కలుగదు

**యస్మిన్ శాంతిః శమః శౌచం సత్యం సంతోష ఆర్జవమ్ ।**
**అకించనమదంభశ్చ స కైవాల్యాశ్రమే వసేత్ ॥**

ఎవనియందు శాంతి, శమము, శౌచము, సత్యము, సంతోషము, ఆర్జవము, దీనత్వము లేకుండుట, దంభము లేకుండుట అను గుణములు గలవో వాడు మోక్షధామము నందుండుట కర్హుడగును

**స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్ ।**

తన యోగసాధన మాహాత్మ్యమున స్వర్గవాసులు తన్ను బ్రీతిపూర్వకముగా, తమలోకముల కాహ్వానించినను, వారి యాహ్వానమున బ్రీతి నుంచరాదు వారిచే బ్రార్థితుడనైతిని గాన కృతకృత్యుడ నైతినని తలంప

రాదు అట్లు చేసెనేవి మరల నాతడు సంసారాద్యనిష్టముల ననుభవించును
(యోగదర్శనము)

యోగసిద్ధి ప్రారంభమగు కాలమున దేవతలు, అప్సరస్త్రీలు, దేవలోకములో నుండు అమృతము, దివ్యరసాయనము, మందారపుష్పము మొదలగు భోగ్యవస్తువులను తెచ్చి భక్తితో సమర్పించి తమ స్వర్గలోకమున కాహ్వానింతురు అప్పుడు మందబుద్ధి గలవాడైనచో నాకు ఇంత గొప్ప ప్రభావము గలిగెనని తలంచి వారికి లోబడి పోయినచో యోగభ్రష్టుడై మరల జననమరణ క్లేశమగు సంసారములో బడిపోవును శుకబ్రహ్మాది ఋషులు తప మొనర్చెడి కాలమున రంభాద్యప్సరః స్త్రీలు చేసిన చేష్టలను జ్ఞాపకములో నుంచుకొనవలయును ఇచట దేవశబ్దమునకు అప్సరఃస్త్రీలకు, మనుష్య లోకములో గల శ్రీమంతులు, ప్రభువులు, వధూమణులు అని గ్రహించుకొనవలయును వీరు దివ్యపదార్థములను తెచ్చి సత్కరింతురు సుఖ భోగము లనుభవింపవచ్చునని తలంచి లట్టివారి స్థలము లోనికి వెళ్ళుదలంచెడు యోగులు, తపస్వులు, వైరాగ్యనిష్ఠ గలవారలు ఈ పరమరహస్యమును జ్ఞప్తిలో నుంచుకొనవలయును ఈలాగున చెడినవారు చాలమంది గలరు కావుననే కఠోపనిషత్తునందు ఈలాగున తెలుపడమైనది-

**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః।**
**శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే ॥**

ఒకరు ఆత్మజ్ఞానమందు ప్రయత్నించు సమయమున శ్రేయస్సును ప్రేయస్సును వానికి ప్రాప్తించును శ్రేయస్సనగా=మోక్షము ప్రేయస్సు= ప్రాపంచిక భోగము అప్పుడు ధీరుడైనవాడు దీనిని బాగుగా యోచించి (దోషములను గనిపెట్టి) అశాశ్వతములైన భోగమును త్యజించి శాశ్వతమైన మోక్షమును గోరును మందబుద్ధి గలవాడు (ఆత్మశుద్ధి లేనివాడు) భోగమును గొప్పదని తలంచి విషయమందు ప్రవేశించును

కఠోపనిషత్తున మొదటనే ఈవిషయమంతయు తెలుపడమైనది ఈ కఠోపనిషత్తు విరక్తులకు ఎంతో మేలు కలుగజేయును ప్రపంచములో

నయమనియు, భయమనియు రెండు సాధనలవల్ల ఒక్కరిని లోబరచు కొనుదురు ఆలాగున తపఃసిద్ధి, యోగసిద్ధి ప్రారంభమగు కాలమున దేవతలు కష్టమును కలుగజేసియో, దానికి లోంగకపోయిన ఇష్టమును కలుగజేసియో భ్రష్టునిగా చేయుదురు మొదట అనేక కష్టములు కలుగజేయుదురు ధైర్యముతో దాని నెదుర్కొని నిష్ఠచేయుచుండిన మరల పైచెప్పిన భోగములచే భ్రష్టత్వము నొనర్ప యత్నము చేయుదురు

చాలామంది కష్టమును సహించెదరు గాని సుఖము వచ్చునప్పుడు పడిపోవుదురు బ్రహ్మనిష్ఠుడు సుఖభోగములు అనేకములు వచ్చినను అవియు యోగవిఘ్న హేతువులని తలంచి జాగ్రత్త పడెనేని వాని నేమియు చేయజాలవు అట్లుగాక మనతపస్సుచేత యోగశక్తిచేత ఇవి యన్నియు గలిగినవని తలంచి దానికి లోబడినచో పతనము నిక్కము ఒకవేళ భోగము లనేకములు వచ్చినను తననిష్ఠకు భంగములేక, ఆహారాది నియమమును విడనాడక, వచ్చిన వస్తువులను భక్తులకొరకు వినియోగ పరచుచుండిన పతనము కలుగదు ముక్తి గలుగువరకే ఇట్టి పరిస్థితి నెదుర్కొన వలసియుండును తర్వాతయే విఘ్నములను దేవతలు చేయరు అంతేకాదు దాసులై భక్తులై సేవ చేయుచుందురు ఉపకార మొనర్తురు వైరాగ్యము గలవారియొక్కయు, లేనివారియొక్కయు లక్షణము ఈ శ్లోకము నిరూపణ చేయుచున్నది

**సాలంకారా చ యా నారీ శోభితా సా సుతన్తుతా ।**
**యా నారీ నిరలంకారా శోభితా సా వితంతుతా ॥**

**త్యాగేన శోభతే యోగీ గృహీ భోగేన శోభతే ।**
**ఏతద్ధి లక్షణమితి శృణు రాగవిరాగయోః ॥**

పుష్పవస్త్రాభరణ కుంకుమాదులచే ముత్తైదువస్త్రీ శోభించును ఆలాగున వితంతువైన స్త్రీ ఎంత కెంతకు నిరలంకారముగ నుండునో దానికదే శోభించును ఎంత కెంతకు త్యాగియో అంతకంతకు యోగి

శోభించును గృహస్థుడు ధనధాన్య వస్తుగృహాదులచే శోభించును రాగి యొక్కయు, విరాగి యొక్కయు లక్షణ మీలాగున నుండునని గ్రహింపుడు

ఈ శ్లోకము సన్న్యాసులకును, వితంతు స్త్రీలకును బాగుగా ఆలోచించదగినది అప్పుడు సన్న్యాసి యెట్లుండవలెనో, వితంతు స్త్రీలెట్లుండవలెనో తెలిసికొనవచ్చును ముత్తైదువ యలంకారము వితంతువు నకు నెంత గర్హ్యమో, నీచమో, గృహస్థునియొక్క భోగము సన్న్యాసి కంత పరమనీచము, నిందితము అని మరువకుందురు గాక!



# మూడవ భాగము

## యోగవిఘ్న నివారణోపాయములు

**ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణి చ సర్వాణి । సర్వం బ్రహ్మోపనిషదం। మాహం బ్రహ్మ నిరాకుర్యాం। మామా బ్రహ్మ నిరాకరోత్। అనిరాకరణ మస్త్వనిరాకరణం మే అస్తు। తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు। తే మయి సంతు। ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

ఆప్యాయంతు– మమ– అంగాని–వాక్–ప్రాణః–చక్షుః–శ్రోత్రం–అథో– బలం– ఇంద్రియాణి–చ– సర్వాణి–సర్వం–బ్రహ్మ– ఉపనిషదం–మా – అహం–బ్రహ్మ–నిరాకుర్యాం–మా–మా –బ్రహ్మ–నిరాకరోత్–అనిరాకరణం– అస్తు– అనిరాకరణం–మే– అస్తు–తత్– ఆత్మని–నిరతే–యే– ఉపనిషత్సు–ధర్మాః– తే–మయి–సంతు– తే–మయి– సంతు

మమ=నాయొక్క, అంగాని=అవయవములు, వాక్=వాక్కు, ప్రాణః= ప్రాణము, చక్షుః=నేత్రము, శ్రోత్రం=కర్ణము, అథః=అట్లే, బలం=బలము, సర్వాణి -సమస్తములైన, ఇంద్రియాణి= ఇంద్రియములు, ఆప్యాయంతు= తృప్తినొందునుగాక (శుద్ధము లగునుగాక), సర్వం= సమస్తము, ఉపనిషదం= ఉపనిషత్ప్రతిపాదితమగు, బ్రహ్మ=బ్రహ్మమే, అహం= నేను, బ్రహ్మ=పరమాత్మను, మా నిరాకుర్యాం= నిరాకరించకుందునుగాక, మా=నన్ను, బ్రహ్మ= పరమాత్మ (ఈశ్వరుడు), మానిరాకరోత్= నిరాకరించకుందును గాక! అనిరాకరణం= ఆదరము, అస్తు= కలుగుగాక! మే= నాకు, అనిరాకరణం=విశ్వాసము, అస్తు=కలుగుగాక తదాత్మని= ఆ పరబ్రహ్మమునందు, నిరతే= ఆసక్తి గలవాని విషయమై, ఉపనిషత్సు= ఉపనిషత్తులయందు యే= ఏ ధర్మములు ప్రతిపాదింపబడినవో, తే= ఆ, ధర్మాః=ధర్మములు, మయి=నాయందు, సంతు= ఉండుగాక, తే= ఆధర్మములు,మయి=నాయందు, సంతు= ఉండుగాక!

నాయొక్క వాగాదీంద్రియము లన్నియు పుష్టిమంతములగుగాక!

(సమర్థములగు గాక!) ఈ సర్వము నుపనిషద్వేద్య పరబ్రహ్మస్వరూపమే నేను బ్రహ్మము నుపేక్షింపకుందునుగాక! నన్ను బ్రహ్మము పరిత్యజించ కుండుగాక! నాయందు బ్రహ్మమునకు విశ్వాసము గలుగుగాక! బ్రహ్మము నందు నాకాదరణ గలుగుగాక! ఆ యాత్మస్వరూపమం దాసక్తి గలవారికి నుపనిషత్తులయందు ఏపవిత్ర ధర్మము లుపదేశింపబడినవో, ఆ ధర్మములు నా యందెల్లప్పుడు నుండును గాక! నాయందు సుస్థిరములగుగాక!

ఆదరాతిశయముకొఱకు ద్విరుక్తి ప్రయోగము చేయబడినది దోషత్రయ శాంతికొరకు ముమ్మారు శాంతిమంత్రము ఏర్పడినది

ఇటువంటి యుపనిషచ్ఛాంతిమంత్రములను ధ్యాననిష్ఠానంతరము భక్తి గలిగి యేకాగ్ర మనస్సుతో అర్థసహితముగా పఠింపక పోవుటయె విఘ్న ములు నశింపకపోవుటకు కారణము భక్తితో పఠించెనేని అన్ని యోగవిఘ్న ములును నివారణము లగును

**యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః।**
**నిరాశా చ నిరీహా చ నిత్యమేకాంతశీలతా॥**

యోగమునకు మొట్టమొదట నుండవలసినది 1 వాఙ్నిరోధము (మిత భాషణము) 2 పరవస్తు పరిగ్రహవర్జనము, 3 దేనియందును ఆశ లేకుం డుట, 4 సంకల్పములను రహిత మొనర్చుట, 5 ఏకాంతమందుండుట – ఇవి యైదును మోక్షమునకు ముఖ్యద్వారములని వివేకచూడామణి

పైజెప్పిన ప్రకారము ప్రవర్తింపక పోవుటయే విఘ్ననివారణము కలుగక పోవుటకు కారణము

**సత్సంగో వాసనాత్యాగోఽధ్యాత్మవిద్యావిచారణమ్ ।**
**ప్రాణస్పందనిరోధశ్చేత్యుపాయాశ్చేతసో జయే ॥**

మనస్సు నశించి పరబ్రహ్మస్థితి గల్గుటకై నాల్గు సాధనములు ముము క్షువుల కత్యావశ్యకములు 1 సత్పురుషుల సహవాసము, 2 విషయ

వాసనాత్యాగము, 3 అధ్యాత్మవిద్యావిచారణము, 4 ధ్యానయోగాభ్యాసములు ముముక్షువుల కివి ముఖ్యముగా నుండవలసినవి అని వాసిష్ఠము

మనోజయముకొరకు దీనియందు కొంత ప్రాణాయామముకూడ విధించడమైనది స్వల్పప్రాణాయామము అందరికిన్నీ అత్యవసరము శరీర దార్ఢ్యము, మనోనిర్మలత్వమును, పాపక్షయమున్ను దీనివల్ల త్వరలో సిద్ధించును అయితే బ్రహ్మచర్యము, శుద్ధాహారము, ఏకాంతవాసము ప్రాణయామమునకు ముఖ్యగా నుండవలసినవి

**అవిద్యాం శ్రేష్ఠయా శ్రేష్ఠః క్షాళయన్నేవ తిష్ఠతి ।**
**మలం మలేనాపహరన్ యుక్తిజ్ఞో రజకో యథా ॥**

బుద్ధిమంతుడైన చాకలివా డేలాగున భూమియొక్క మలమైన చవిటి మన్నుచే వస్త్రముయొక్క మలినమును పోగొట్టునో, అలాగున అవిద్యా సంబంధమైన కర్మమును, విద్యాసంబంధమైన(జ్ఞానసంబంధమైన) శ్రేష్ఠ కర్మముచే పోగొట్టవలయును అని వాసిష్ఠము

శుద్ధాశుద్ధములు రెండును ప్రకృతి ధర్మములే చవుడును, వస్త్రములోగల మాలిన్యమును రెండున్ను ప్రకృతి ధర్మములే అయితే శుద్ధకర్మచే అశుద్ధకర్మము నశించును అప్పుడే విశుద్ధ స్వరూపమగు ఆత్మజ్ఞానముదయించును

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

ఏకాంత ప్రదేశమున నుండువాడును, ధ్యాననిష్ఠకు భంగము రాకుండుటకై సాత్త్వికమైన శుద్ధాహారమును మితముగ భుజించువాడును, వాక్కును, మనస్సును, శరీరమును స్వాధీనములో నుంచినవాడును, ధ్యానయోగ మందాసక్తి గలవాడును, లెస్సగా వైరాగ్యము గలవాడునై ఎవడు గలడో వానికి విఘ్నములు కలుగవు శీఘ్రకాలమున జీవన్ముక్తి సిద్ధించును అని గీత

ఇట్టి నియమములను పాటింపకపోవుటచేతనే విఘ్నములు కలుగుచున్నవి

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్షపరాయణః ।**
**కామక్రోధాదయో దోషా న భవంతి మితాశనాత్ ॥**

మోక్షాపేక్ష గలవాడు నిత్యము మితాశనుడై యుండవలయును అందువల్ల కామక్రోధాది దోషములు నశించును అని సన్న్యాస సంగ్రహము

ఇట్టి నియమము లేకపోవుటయే కామక్రోధాదులు గల్గుటకును, పతనము గల్గుటకును కారణము

**పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।**
**ఆరోగ్యసిద్ధిర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥**

పథ్యము, ఔషధసేవయు ఏరోగిచే చేయంబడునో వానిచేతనే ఆరోగ్యసుఖ మనుభవింపబడుచున్నది ఇతరులు చేయు పథ్యౌషధసేవచే పొందసాధ్యము గాదు తనకు గల భవరోగమునకు తానే ధ్యానానుష్ఠానము చేయక ఇతరులు చేసిన చాలునని తలంచుటయు అటువంటిదే (వివేక చూడామణి)

గురువు చేయు అనుష్ఠానము చాలునని తలంచి అనుష్ఠానము చేయని శిష్యునియొక్కయు, భర్త చేసిన అనుష్ఠానము చాలునని తలంచెడు భార్య యొక్కయు, లేక భార్య చేసిన అనుష్ఠానము చాలునని తలంచెడు భర్త యొక్కయు, ఆలాగున తండ్రి చేసిన చాలునని తలంచెడు పుత్రుని యొక్కయు, పుత్రుడు చేసిన చాలునని తలంచెడు తండ్రియొక్కయు స్థితి ఈలాగున నుండును అయితే భార్యాభర్తలు, గురుశిష్యులు, తల్లిదండ్రులు, కుమారులుచేయు పుణ్యకర్మానుష్ఠానములలో పరస్పరము ప్రేమ కలిగి యనుసరించియుండిన కొంతవరకు ఫలము గలుగవచ్చును ఈశ్వర జ్ఞానము, జీవన్ముక్తి మాత్రము వారికి వారే చేసికొనవలయును

గురువు వెళ్ళునప్పుడు శిష్యునియొక్క నీడయు, శిష్యుడు పోవునపుడు గురువుయొక్క ఛాయయు ఒకటితో నొకటి సంబంధపడక వారి వారి నీడ వారివారితో నుండునట్లు అంత్యకాలస్థితియు నుండునని గ్రహించుకొన వలయును భార్యాభర్తలయొక్క స్థితియు, తల్లి, తండ్రి, కుమారుడు, కుమార్తెలయొక్క స్థితియును ఈలాగున నుండునని ఈశ్వరదృష్టియే మనకు చూపుచున్నది

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥**

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః।**
**ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మ విశుద్ధయే॥**

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥**

పరిశుద్ధమైన ప్రదేశమందు చలింపనిదియు, మిక్కిలి ఎత్తు గానిదియు, మిక్కిలి పల్లము గానిదియు నగు స్థలమున మొదట దర్భాసనము, దానిమీద కృష్ణాజినము, దానిమీద వస్త్రము మొదలైన ఆసనములను స్థాపించి ఆ యాసనమందు కూర్చుండి చిత్తముయొక్కయు, ఇంద్రియముల యొక్కయు వ్యాపారమును నిగ్రహించినవాడై, మనస్సును ఏకాగ్రముగా చేసి ఆత్మయొక్క పరిశుద్ధతకొరకు ధ్యానయోగమును చేయవలయును దేహమధ్యభాగమును, శిరస్సును, కంఠమును సమముగా నిక్కించి చలనము లేనివాడై స్థిరుడై తన నాసికాగ్రము (భ్రూమధ్యమును) చూచునట్లు దృష్టి నిలిపి ఇతర విషయములందు దృష్టినిగాని, మనస్సునుగాని పోనివ్వక పరమ శాంతుడై పరమాత్ముని ధ్యానము చేయవలయును అని గీత

కొన్ని గ్రంథములలో ఏకాంతప్రదేశము మొదలగు వానిని తెలుపడమైనది అది అందరికిని సాధ్యముగాదని తలంచి శ్రీకృష్ణభగవానుడు దయగలిగి శుద్ధమైన ప్రదేశముండిన చాలునని తెలిపెను శుద్ధమైన

స్థలములనుండి ధ్యానము చేయువారికి విఘ్నములు గలుగవు పుణ్యభూమి మంచిదని తెలుపుట కిదియే కారణము అచట పుణ్యజీవులుగాని, దేవతలుగాని, మహాత్ములుగాని సూక్ష్మరూపముతో నుందురు మలినమైన పాపభూమి యైనచో అచట భూతప్రేతపిశాచములు నివసించుచుండును అట్టి స్థలము యోగనిష్ఠకు విఘ్నము కలుగజేయును

**పవిత్రే నిర్మలే దేశే నిత్యానుష్ఠానతోఽపి వా ।**
**నిర్వేదనేన మౌనేన జపమేతత్సమారభేత్ ॥**

ఆలాగున పవిత్రమైన ఏ స్థలమందుగాని ఆసీనుడై నిత్యానుష్ఠానము చేయువాడు చలనము లేనివాడై, మౌనముతో కూడి జపమాచరించవలెను

**ఏకవారం చరేద్భైక్ష్యం న ప్రసజ్జేత విస్తరే ।**
**భైక్ష్యప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥**

సన్న్యాసియగువాడు (బ్రహ్మనిష్ఠుడు) ఏకకాలము మాత్రమే భుజించవలయును అధికముగా తినుటయే స్వభావముగా గలిగియుండరాదు అధికము తినుటలో ఆసక్తి గలవాడు నిశ్చయముగా విషయలోలు డగును వీనికి ఇంద్రియ నిగ్రహముండదు అని సన్న్యాస సంగ్రహము

ఆహార నియమము లేనివానికి మనోనియమము గలుగదు

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్।**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥**

విరక్తుడై బ్రహ్మనిష్ఠచేయువాడు తల్లితోగాని, సోదరితోగాని, కుమార్తెతో గాని యేకాంత స్థలమున నుండరాదు ఎందుకనగా ఇంద్రియముల సమూహము మహాబలము కలది, మహాబ్రహ్మవేత్తల మనస్సునుకూడ ఆకర్షించి విషయములందు ప్రవేశపెట్టును ఆలాగున విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయు స్త్రీలుకూడా విజన ప్రదేశమందు తండ్రి, సోదరుడు, పుత్రుడు, వీరలే యుండు స్థలమందు ఉండరాదని చెప్పిన నిక

తదితరులతో గలసియుండుట ఎంత ప్రమాదమో ఆలోచించవచ్చును ఏ విధమైన ప్రమాదమును కలుగకూడదని తలంచి శాస్త్ర మీలాగున చెప్పినది
( మనుస్మృతి )

**బోధాదూర్ధ్వం చ తద్ధ్యేయం జీవన్ముక్తిప్రసిద్ధయే ।**
**కామాది క్లేశబంధేన యుక్తస్య న హి ముక్తతా ॥**

బ్రహ్మనిష్ఠా బలముచే తత్త్వబోధము కలిగినను జీవన్ముక్తి దృఢపడుట కొరకు మరల మరల బ్రహ్మచింతనమును, తదేకధ్యానమున్ను ఆవశ్యకముగా చేయవలయును అని పంచదశి

**తత్త్వం బుద్ధ్వాపి కామాదీన్ నిశ్శేషం న జహాసి చేత్ ।**
**యథేష్టాచరణం తే స్యాద్ధర్మశాస్త్రాతిలంఘినః ॥**

బ్రహ్మనిష్ఠుడు పరతత్త్వము నెరింగి బ్రహ్మబోధ గలిగినను విషయాసక్తి మొదలగు కామాదులను నిశ్శేషముగా విడువడేని ధర్మశాస్త్రము నతిక్ర మించిన కారణముచే జ్ఞానభ్రష్టు డగును కావున యథేష్టాచరణము కూడనే కూడదు

విద్యారణ్యు లీలాగున చెప్పుటచే బ్రహ్మనిష్ఠులెంతో జాగ్రత్త వహించ వలసియుందురు ఇప్పుడు ప్రపంచములో యథేష్టాచరణమే జీవన్ముక్తి లక్షణమనియు, బంధవిముక్తుని స్వభావమనియు, నియమమునకు లోబడియుండుట బంధవిముక్తి కాదనియు చెప్పువారు కొందరు లేక పోలేదు మీ దృష్టిలోనే అట్టివారు గలరు అట్టి శాస్త్రోల్లంఘనమే వారి అభివృద్ధికి దట్టమైన అడ్డుగా నిలిచియున్నదని గ్రహించుకొనవలయును

**విశుద్ధాద్వైతతత్త్వస్య యథేష్టాచరణం యది ।**
**శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచిభక్షణే ॥**

అద్వైత పరబ్రహ్మజ్ఞానవేత్త స్వేచ్ఛాచరణము గలిగి విధినిషేధముల నతి క్రమించి ప్రవర్తించినచో కుక్కకును, పరమపావనుడగు మహాత్మునకును ఏమి భేదమని సురేశ్వరాచార్యులు వేదాంతవార్తికమందు వ్రాసిరి

**వాసనాయా స్తథా వహ్నె ఋణవ్యాధి ద్విషామపి ।**
**స్నేహవైరవిషాణాం చ శేషః స్వల్పోఽపి బాధతే ॥**

విషయవాసన, అగ్ని, అప్పు, వ్యాధి, శత్రువు, పుత్రకళత్రాదుల యందు ప్రేమ, ఇతరులయందు విరోధము, విషము – ఇవి కించిత్తైన మిగిలియున్నచో క్రమముగా వృద్ధియై మిక్కిలి బాధించును కావున ఇవి నిశ్శేషము నశింపజేసేలాగున చూడవలయును అని వాసిష్ఠము

**యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి ।**
**తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయమేవోపశామ్యతి ॥**

ఏలాగున కట్టెలు నశించినపుడు అగ్ని స్వయముగా నశించునో ఆలాగున వృత్తులు నాశమగునప్పుడు మనస్సు తనకు తానే మాయమై పోవును

మనస్సనియు, కర్మమనియు, అజ్ఞానమనియు పర్యాయనామములు నిప్పు మండుచుండిన మాత్రమే కట్టెలు దహించును ఆలాగున అధ్యాత్మ జ్ఞానసిద్ధి ప్రజ్వలించి రాగా రాగా కర్మకట్టెలు క్షయించును అందువల్ల కర్మజనిత విఘ్నములును నశించును

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణమ్ ।**
**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥**

ప్రతిబంధము లుండినచో జ్ఞానమునకు ఆటంకము గలుగును ప్రతి బంధములు ముావ్విధములు అవి వర్తమానప్రతిబంధ మనియు, భూత ప్రతిబంధ మనియు, భావిప్రతిబంధ మనియు చెప్పుదురు ఇవి వేదాంత పంచదశిలో కనందగును వాటిలో వర్తమానప్రతిబంధము గొప్పది అందులో అన్నిటికన్న గొప్పవి 1 విషయాసక్తి, 2 ప్రజ్ఞామాంద్యము, 3 కుతర్కము, 4 విపరీతవాదము, 5 అనవసరముగ విరోధము పెట్టుకొనుట

ఇవి యన్నియు ముఖ్యమైన విఘ్నములని గ్రహించుకొనవలయును

**క్షాళయంతి మలేనైవ మలం క్షాళనకోవిదాః ।**
**వారయన్త్యస్త్రమస్త్రేణ విషం ప్రతివిషేణ చ ॥**

భూమియందుండు పంకిలముచే గలిగిన మాలిన్యమును భూమియం దేర్పడిన చవిటిమట్టిచే పోగొట్టునట్లును, ఆగ్నేయాస్త్రమును వారుణాస్త్రముచే నశింపజేయునట్లును , విషదోషమును స్ఫుటము చేసిన పాషాణాది విషములచే రహితము చేయునట్లును, నాగాస్త్రమును గారుడాస్త్రముచే భేదించునట్లును, ఇనుమును ఉక్కుతో నరుకునట్లును పాపకర్మములచే కలిగెడు విఘ్నములను పుణ్యకర్మానుష్ఠానముచే రహితము చేయవలయును

**మృద్వాసనే సమాసీనో జిత చిత్తేంద్రియక్లమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥**

మెత్తని యాసనమందు కూర్చుండి యింద్రియాది వృత్తులను నిశ్చలముగా చేసికొని మనసు లయమొంది బ్రహ్మాకారస్థితి గల్గు పర్యంతము ఓంకార మంత్రమును పరమాత్మపరముగా భావనచేసి ధ్యానము చేయవలయును

ప్రణవమును హృదయమున పరబ్రహ్మభావముతో లేక ఈశ్వర భావముతో దివ్యప్రకాశభావన కలిగి జపించవలయును ఈలాగున చేసిన విఘ్నము లన్నియు నశించును మెత్తని యాసనమైన ఎంతసేపు ధ్యానమందుండినను పాదములకు బాధ కలుగదు కరుకైన గట్టిదైన ఆసన మైనచో కొంచెము సమయమునకే పాదములకు నొప్పి కలుగవచ్చును

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**

ఎవరు ఇతరచింత లేనివారై నన్నే శరణుపొంది ధ్యానింతురో అట్టి

అచంచలనిష్ఠ గలవారల యోగక్షేమములను నేనే వహించెదను అని భగవానుడు గీతయందుపదేశించినాడు

పైజెప్పిన విశ్వాసముతో ధ్యానముచేయు పరమభక్తుల విఘ్నము లన్నింటిని భగవానుడే రహితమొనర్చి రక్షించును అప్రాప్యమైన దానిని ప్రాపింపజేయుట యోగమనియు, ప్రాప్తించిన దానిని సంరక్షించుట క్షేమమనియు గ్రహించుకొనవలయును

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥**

భగవద్ధ్యానాసక్త చిత్తము గలవారిని అచిరకాలములోనే సంసార సాగరమునుండి నే నుద్ధరించుచున్నాను అని భగవా డుపదేశించెను

పరమభక్తులకు గల విఘ్నము లన్నిటిని అచిరకాలములో రహిత మొనర్చి రక్షించెదనను భగవత్ప్రతిజ్ఞాపూర్వక వాక్యములో విశ్వాసము కలిగి యుండుడు అన్ని విఘ్నములను క్షయించుటకు ఇదే యుపాయము

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥**

ఎల్లప్పుడును భగవంతుడనగు నాయం దేకాగ్రచిత్తము గలిగి ప్రీతి పూర్వకముగా భజించునట్టి ధ్యానపరులకు పరమేశ్వరుడనగు నన్ను పొందుటకు ఏ జ్ఞానము కలుగవలయునో అట్టి జ్ఞానమును కలిగించు చున్నాను

పరమభక్తితో సర్వేశ్వరుని ధ్యానించువారికి ఏ జ్ఞానమువల్ల మోక్షము సిద్ధించునో అట్టి జ్ఞానమును భగవంతుడే కలుగజేయుచున్నాడని చెప్పిన వాక్యము లందు విశ్వాసము కలిగియుండుడు

**తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥**

ఎల్లపుడును ధ్యానముచేయు భక్తుల ననుగ్రహించుటకొరకు మాత్రము వారి యంతఃకరణ మందున్నవాడనై వారియొక్క అజ్ఞాన జన్యమైన మోహాంధకారమును వెలుగుచున్న జ్ఞానమనెడి దీపముచేత పోగొట్టు చున్నాను

అంధకార నిబిడమైన గృహాంతరాళములో తనకు కావలసియుండు సమస్త పదార్థము లుండినను చీకటిచే గ్రహించుకొనుటకు సాధ్యము కానప్పుడు ఏలాగున ఒకడు మంచిదీపము వెలిగించిన ఏవస్తువు లెచ్చట నున్నవని తెలిసికొనవచ్చునో, తీసుకొనవచ్చునో, ఆలాగున భగవంతుడే భక్తుల హృదయములలో దివ్యజ్యోతిని వెలిగించి జ్ఞానమును చూపగల్గును కావుననే ఈ శ్లోకమునందు ''అనుకంపార్థమేవ'' భక్తులయందుగల అనుగ్రహము మాత్రమే గాని మరియొక విధముగ కాదని వచించెను

**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।**
**కామ క్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥**

ఎవడు ఈదేహమును విడుచుటకంటె ముందీలోకమునందే కామ క్రోధములవలన బుట్టిన వికారములను సహించుటకొరకు సమర్థుడగు చున్నాడో వాడే యింద్రియ నిగ్రహముగల యోగియై ఆత్మజ్ఞానముతో నిత్యసుఖి యగుచున్నాడు

దేహముతో కూడియున్నప్పుడే ప్రకృతిదోషము లన్నిటినుండియు ముక్తులు కావలయును జీవన్ముక్తియని చెప్పుటకు కారణమిదియే ఒక్క ముష్టి నవధ్యానములను భూమిలో చల్లివేసిన ఏయే విత్తనము వేగియుండలేదో అది మొలకెత్తునట్లు అంత్యకాలమున ఏ సంస్కారము మిగిలియుండిన దాని కనుగుణమగు జన్మము తప్పక వచ్చును ఉడికిన విత్తనము అంకురించనట్లు జ్ఞానాగ్నియందు దహించిన సంస్కారము గలవారికి మరల జన్మ ముండదు అట్టి యవస్థ జీవించి యున్నప్పుడే కలుగవలయును

**ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**

**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥**

ఎవరియొక్క మనస్సు సకల భూతములయందును బ్రహ్మము సమముగా నున్నదను విషయమునందు నిశ్చలమై యున్నదో, అట్టివారు ఈలోకమందే జన్మమును జయించిన వారగుచున్నారు మరియు బ్రహ్మము ప్రకృతి దోషరహితమైనది కనుక అట్టి దోషరహితులు సదా బ్రహ్మమునందున్న వారగుచున్నారు

ఇహైవ- యిచ్చటనే- జీవించి యున్నప్పుడు ప్రకృతిదోషము నశించినవారై యుండిన మాత్రమే బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలిగి ముక్తులగుదురు నీటిలో నీరు నూనెలో నూనె కలియునేగాని, నీటిలో నూనెయు, నూనెలో నీరును ఐక్యము గానట్లు పరమాత్మ స్వరూపమెంత శుద్ధమైనదో, అంతశుద్ధత జీవునికి కలిగినప్పుడే, జీవేశ్వరుల యైక్యము సిద్ధించును

**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేష న సందేహస్తస్మాదుద్యమవాన్భవ ॥**

పుత్రా! జీవునియొక్క మలము సహజసిద్ధంబైనను తండులము యొక్క పొట్టు దంచుటవల్ల యెట్లు నశించుచుండునో, ఆలాగున పురుష ప్రయత్న పరమగు ధ్యానజ్ఞానములచేత జీవునియొక్క మాయామలము కూడ నశించును కావున ప్రయత్నవంతుడవు కమ్ము అని వాసిష్ఠము

జీవుడు నిత్యశుద్ధ జ్ఞానస్వరూపు డనియే వేదాంతము ఉపదేశించుచున్నది ప్రకృతిదోషము లన్నియు అంతఃకరణ ధర్మములే, అట్లుగాక జీవులకు ప్రకృతిగుణములు స్వభావములని యొకవేళ నెవరైన వచించిరను కొనుడు అట్లైనను పుట్టుకతో పొట్టు, తౌడు వడ్లయందు కలిగియుండినను దంచుటవలన వదలిపోవును కావున పురుషప్రయత్నముచే ప్రకృతిదోషము వదలిపోవును ఓహో! యెంత ధైర్యమును చెప్పిరి

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా!**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః ॥**

తండులము (బియ్యము) యొక్క పైనున్న పొట్టు దంచుటవల్ల ఎట్లు వదలిపోవుచున్నదో, స్ఫుటముచేత రాగియొక్క చిలుమెట్లు నశించి సువర్ణ మగుచున్నదో, అట్లే యోగముచేతను, జ్ఞానముచేతను జీవునియొక్క అజ్ఞాన రూపమగు మలినము నశించుచున్నది అని వాసిష్ఠము

**న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।**
**మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥**

**మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ॥**
**తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥**

ఎవడు సోమరితనముచే శరీర సుఖమును మాత్రము గోరుచుండునో అట్టి వానికి పుణ్యము లభింపదు కాయక్లేశము సహించు వానికే పుణ్యము లభించును ఏలాగున మథనము వినా క్షీరమునుండి నవనీతము జనింపదో, మర్దనము లేనిచో చెరుకునుండి రసము జనింపదో, ఆలాగున శరీరపరిశ్రమ చేయనివానికి జ్ఞానము సిద్ధించదు కాయక్లేశము సహించి అనుష్ఠానము చేయువానికి మహాధర్మమగు దైవము ప్రత్యక్షమగును అని పద్మపురాణము

మోక్షమార్గము సోమరులు పోవు దారికాదు, సోఽహంపరులు ప్రయాణముచేయు మార్గము చెరకునందు పంచదార కనబడకపోయినను, పాలయందలి వెన్న గోచరించక పోయినను చేయవలసిన క్రియలు చేయు నప్పుడు ఎట్లు గోచరించునో, దేహములోగల దైవజ్ఞానస్థితియు ఆలాగున నుండును పాలను తరచకపోయిన ఏలాగున కుళ్ళి చెడిపోవునో, చెరుకును సకాలమున కొట్టి గానుగాడనిచో ముదిరి యెట్లు బెండై పోనో ఆలాగున మంచి కాలములోనే యాత్మజ్ఞానము సంపాదించుటకు యత్నించవలయును ముదుసలికాలము వచ్చునపుడు జ్ఞానము సంపాదించు కొనవచ్చునని తలంచినచో పైజెప్పిన పాలు చెరకు గతియే సంభవించును

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఓ యర్జునా! ఎప్పుడు నీయొక్క బుద్ధి అజ్ఞానకల్మషమును దాటగలదో అప్పుడు ఇంతవరకు గురువులచేతగాని, శాస్త్రములచేతగాని నీ స్వబుద్ధితోగాని చింతించిన దానియొక్క యర్థము గోచరమగును తరువాత నిక వినదగినది మరియొకటి లేదను బోధముకూడ గల్గును అప్పుడే వేదముచే బోధింపబడిన సత్యము గోచర మగును లేక సంపూర్ణముగా ప్రకృతి వదలిపోవును అని గీత

ఈ స్థితి గలుగకపోవుటయే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము సిద్ధింపక పోవుటకు హేతువు సముద్రమునకు ఈవల నుండువారు ఆవలి దరియందున్న దానినెట్లు చూడగల్గుదురు?

**అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ।**
**మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్ ॥**
**మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం మనః ॥**

మనుజుడు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్నిచే త్రివిధములుగా మారుచుండును స్థూలభాగము మలమూత్రములుగాను, మధ్యభాగము రసమై, రక్తమై, మాంసాది సప్తధాతువులుగాను పరిణమించును కనిష్ఠ భాగము మనస్సుగా మారును అని సుశ్రుతము

ఇప్పుడేది భుజించినను మనస్సే ప్రధానమని చెప్పెడువారి సిద్ధాంత మును విజ్ఞులు తెలిసికొనవచ్చును కావున అన్నమును మార్పు చేసుకొనిన మాత్రమే మనస్సునకు మార్పు గల్గునని విజ్ఞులు గ్రహించుకొనవలయును ఆహారముయొక్క పృథివీతత్త్వము అహంకారముగాను, జలతత్త్వము చిత్తము గాను, అగ్నితత్త్వము బుద్ధిగాను, వాయుత త్త్వము మనస్సుగాను, ఆకాశ తత్త్వము అంతఃకరణముగాను మారుచుండును అని ఆయుర్వేద మెంత దీర్ఘముగ ఆలోచించుకొని తెలిపెనో గ్రహించుకొనుడు

**వివి క్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః ।**
**భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః ॥**

ఏకాంత ప్రదేశమున సానుకూలమైన ఆసనములో కూర్చున్నవాడై, సర్వవిషయములలోను వైరాగ్యమును కల్గినవాడై, ఇంద్రియములను జయించినవాడై, ఆత్మవ్యతిరిక్త వస్తువునందు బుద్ధిని పోనివ్వని వాడై ఒక్కడై దేశకాల వస్తుపరిచ్ఛేద శూన్యమైనటువంటి తనయాత్మను సత్త్వజ్ఞానానంద స్వరూపునిగా ధ్యానము చేయవలయును

''వివిక్త దేశే'' అని చెప్పుటచేత నిష్ఠకు ప్రతిబంధములేని స్థలముండిన చాలును కేవల మేకాంత ప్రదేశమని తలంచవలదు ఇట్టి స్థలములో నుండుటచే విఘ్నములు గలుగవు

**ఆజీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।**
**పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వనివృత్తయే ॥**

జీవించి యుండువరకు మూడు ధర్మములను ఆచరించుచుండ వలయును అవి యేవన, గురుభక్తి, దైవభక్తి, వేదాంతశాస్త్ర విచారణము వీని వల్లనే మొదట జ్ఞానము కలిగియుండును కృతజ్ఞత తెలుపుటకు ఈ మూడును ఆచరణీయములు, ఆచరింపనిచో కృతఘ్నుడగును అని సర్వవేదాంతసారసంగ్రహము

జీవన్ముక్తునకు మరల అనుష్ఠించవలసిన దెద్దియు లేదని యొక అభి ప్రాయము కలదు శ్రేష్ఠుడైనవాని యాచరణ చూచియే శిష్యులును, తదితరు లును ఆచరింతురు అంతవరకైన తా ననుష్ఠించివచ్చిన మార్గము ననుసరించి యుండిన నితరులుకూడ చూచి అనుష్ఠింపగలరు ఇదియునుగాక యిట్టి పవిత్రధర్మము ఋషిపారంపర్యముగా అనుష్ఠింపబడుచు వచ్చుచున్నది అట్లు చేయనిచో కృతఘ్నత్వదోష మాపాదించును ఆచరించుచు వచ్చిన నిప్పుడు కలిగియుండు జ్ఞానమునకు మరింత మెరుగు కలుగునే గాని లోపము లేదు ఆచరించనిచో నొకవేళ కీడు కలుగవచ్చును అదియునుగాక సంపూర్ణ వాసనాక్షయము, మనోనాశము, ఆత్మజ్ఞానోదయము గలుగని వారుండినచో తప్పక ప్రమాదములో పడిపోవుదురు అందువల్లనే శంకరభగవత్పాదు

లీలాగున తెలిపిరి కావుననే గీతలో ఈక్రింది విధముగ శ్రీ కృష్ణభగవానులు తెలిపిరి

**యద్యదాచరతి శ్రేష్ఠ స్త త్త దేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥**

శ్రేష్ఠుడైనవాని యాచరణచూచియే తక్కినవారు ఆచరింతురు శ్రేష్ఠ పురుషుడు దేనిని ప్రమాణముగా నంగీకరించునో లోకము గూడ దానిని అను సరించును

**సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్ ॥**

పరమేశ్వరునియందు అతిశయమైన భక్తి గల్గుటవల్లను, సమస్తమును ఈశ్వరార్పణ చేయుటచేతను, నిర్విఘ్నముగా నిర్వికల్పసమాధి (బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము) కలుగును అని యోగదర్శనము

విఘ్ననివృత్తి కీలాగున నుండుటయే యుపాయమని గ్రహించు కొనవలయును

**యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥**

పరమభక్తుడైనవాడు ఏలాగున తన ఇష్టదైవమందును, మరియు గురుదేవునియందును సర్వోత్కృష్టమైన భక్తి గల్గియుండునో ఆలాగున అట్టి మహాత్ముడైన వానికి మాత్రమే ఈ వేదాంతార్థము స్పష్టముగా గోచరమగును అని శ్వేతాశ్వతరోపనిషత్తు

ఇట్లుండువారికి విఘ్నములు తొలగిపోవును

**యస్యవాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా ।**
**స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥**

ధర్మముయొక్క ఉన్నతిని గోరువారు సదా సత్యమందు వర్తింప

వలయును ఎవనియొక్క వాణియును, మనస్సును శుద్ధములుగను, స్వాధీనములుగ నుండునో అతడే సమస్త వేదాంతాద్యనుష్ఠానములయొక్క ఫలమును పొందగల్గును తక్కినది మరుభూమిలో గనుపించెడు ఎండ మావులను చూచి జలమని తలంచి పరుగెత్తిన వానివలె నుండును

**ఫలం కతకవృక్షస్య యద్యప్యంబుప్రసాదకమ్।**
**న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి ॥**

కతకచూర్ణము మట్టినీటిని నిర్మలపరచు శక్తి కలిగియుండినను దాని పేరుమాత్రము చెప్పిన బురదనీ రేలాగున శుద్ధము కాదో, బురదనీటిలో అరగ తీసినమాత్రమే నిర్మలోదకము కాగలుగునో, ఆలాగున వాక్కుతో వేదాంతము చెప్పిన చాలదు, మనస్సు నైక్యపరచవలయును

**అనుష్ఠితం తు యద్దేవైర్మునిభిర్యదనుష్ఠితమ్ ।**
**నానుష్ఠేయం మనుష్యైస్తచ్ఛోక్తం కర్మ సమాచరేత్ ॥**

దేవతలును, మునులును చేసినట్లు సామాన్య మనుష్యులు చేయరాదు వారెట్లాచరించే లాగున చెప్పిరో ఆలాగున చేయవలసియుండును

నిగ్రహానుగ్రహశక్తి గల రామకృష్ణాది దేవతలు, సిద్ధపురుషులు కొన్ని స్థలములలో అమానుషక్రియలు చేసియుందురు వానిని చూచి సామాన్య మనుష్యులట్లు చేయరాదు వారు జనులకు ఆచరించుటకు దేనిని చెప్పిరో ఆలాగుననే వర్తించవలయును శ్రీశంకరాచార్యు లొక సమయమున మద్య పానము చేసినట్లును, మరియొక సమయంబున కరిగిన కంచును త్రాగి నట్లును చెప్పుదురు ఇప్పుడుకూడ పాషాణమును మూలికలో నూరి మ్రింగు వారు గలరు కాని అది అందరికిని ఎట్లును సాధ్యము కాదు ఆలాగున జ్ఞానికి విధినిషేధములతో సంబంధము లేదని చెప్పి తిరుగుచుండువారు కొందరు గలరు అట్టి ప్రమాదములో పడిపోకూడదని ఋషులు కరుణ గలిగి ఉపదేశించియున్నారు

**వేదాంతశతరుద్రీయ ప్రణవాదిజపం బుధాః ।**

**స త్త్వశుద్ధికరం పుంసాం స్వాధ్యాయం పరిచక్షతే ॥**

ఉపనిషత్తులుగాని, వేదములలో కొన్ని భాగములుగాని, ప్రణవము, గాయత్రి, శ్రీరామ, శివ, నారాయణాది మంత్రజపములుగాని గీతాపఠనము గాని ఇవియన్నియు అధ్యయమునకు సంబంధించిన వనియు వీనిలో నేదైన నొకదాని యనుష్ఠానము వలననే మానవుల పాపము నశించి ఆత్మశుద్ధి కలుగు ననియు బ్రహ్మవేత్తలు వచించిరి

పైజెప్పిన వానిలో నెవరికి దేనియందు విశ్వాసము గల్గునో దాని జపమువల్ల పాపము నశించును అప్పుడు విఘ్నములు తొలగిపోవును

**అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైశ్శైలోఽపి చూర్ణ్యతే ।**
**బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృంభణమ్ ॥**

ఓ రామచంద్రా! అభ్యాసప్రభావ మెట్టిదో చూడుము అభ్యాసముచే అజ్ఞానియు క్రమముగా జ్ఞాని యగుచున్నాడు, పర్వతములు చూర్ణ మొనర్ప బడుచున్నవి బాణములును అతిసూక్ష్మమగు లక్ష్యమును భేదించుచున్నవి అని వాసిష్ఠము

అభ్యాసముచే అజ్ఞానియు విజ్ఞాని యగుచున్నాడు విద్యావిహీనుడు గొప్పవిద్వాంసుడగుచున్నాడు పర్వతము రాళ్ళు తీయుటచేత తరుగు చున్నది స్థూలమైన గురిని భేదించి రాగా రాగా అతిసూక్ష్మమైన లక్ష్యమును కొట్టు శక్తి గలుగుచున్నది కావున అభ్యాసముయొక్క ప్రభావము ఇటువంటిదని గ్రహించునది

**బ్రహ్మహత్యాసహస్రాణి భ్రూణహత్యాశతాని చ ।**
**ఏకో హి ధ్యానయోగశ్చ దహత్యగ్నిరివేంధనమ్ ॥**

సహస్ర బ్రహ్మహత్యలును, వందలాది భ్రూణహత్యలును ధ్యాన యోగముచేత నశించును ఎట్లన కొండంత కట్టెలు గోరంత నిప్పుచే భస్మమగును గదా?

ధ్యానయోగముచే పాపరాసులన్నియు భస్మమైపోవును

**పురమేకాదశద్వార మజస్యావక్రచేతసః ।**
**అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే॥**

ఏకాదశ ద్వారములు గల ఈ పురము (శరీరము) నిత్యవిజ్ఞాన స్వరూపుడైన యీశ్వరునికి నివాసగృహము అట్టి సర్వేశ్వరుని ధ్యానయోగా నుష్ఠానముచే పొందువాడు మరల సంసారదుఃఖమును పొందడు వాడు ముక్తుడు మరల మోహము నొందడు అని కఠోపనిషత్తు

దీనియందు మానవునికి పదనొకండు ద్వారములు చెప్పడమైనది జంతువులకును, సామాన్య మనుజాలకును నవద్వారములు సమానములు దీనియందు బ్రహ్మరంధ్రమొకటి రెండవది కుండలీబోధము అను రెండు విశేషద్వారములు తెలుపడమైనది ఈ రెండు ద్వారములు తెరువబడు నప్పుడే బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గల్గును ( ఈశ్వరదృష్టి గలుగును) జీవగుణములు నశించి దైవత్వగుణము లుదయమగును ఇవి తెరువబడని వారు సామాన్య మనుజాలు కావుననే ఆత్మజ్ఞానము గలుగనివారు పశుప్రాయులని వర్ణింపబడిరి దీనికి దివ్యదృష్టియనియు, జ్ఞానదృష్టి యనియు, యోగదష్టియనియు, సమ్యగ్దృష్టియనియు పేరులు దేవాలయము మూయబడినప్పుడు దేవుని దర్శనమెట్లు గలుగదో, తెరువబడునప్పుడెట్లు దర్శనమగునో, ఈ శరీరదేవాలయముయొక్క స్థితియు అటువంటిదే కావుననే ''దేహో దేవాలయః ప్రోక్తః'' అని వర్ణించిరి దీనియందు ''విముక్తశ్చ విముచ్యతే''- రెండు విధములగు ముక్తులు తెలుపడమైనవి 1 బాహ్యబంధముల నుండి విముక్తి గలుగవలయుననియు, 2 అంతటితో తృప్తిపడక ఆత్మబంధము తొలగినప్పుడే హృదయగ్రంథులు నశించునప్పుడే నిత్యముక్తి సిద్ధించుననియు గ్రహించుకొనవలయును

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥**

నియతమైన ఆహార విహారములు గలవాడును, కాలోచితకర్మను అనుష్ఠించువాడును, ఉచితమైన నిద్ర, జాగరణ గలవాడును అగు యోగికి సమస్త విఘ్నములను నశింపజేయునట్టి యోగసిద్ధి గలుగును అని గీత

ఇచ్చట ఆహారమును గురించి బాగుగా జాగ్రత్తపడుటకొరకే ప్రథమ మున ''యుక్తాహార''యని ప్రయోగించుటకు కారణమైనది ఆహారపు మార్పులవల్లనే పైజెప్పిన అన్నిటికిని మార్పు గలుగును ఆహార విషయము సామాన్య మని తలంచరాదు ఆ విషయమై ఆయుర్వేదమేమి చెప్పినదో చూడుడు-

**రసాద్ర క్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।**
**మేదసోఽస్థి తతో మజ్జా మజ్జా శుక్రస్య సంభవః ॥**

అనగా అన్నజలాదులగు ఆహారపదార్థములు 1 రసము, 2 రక్తము, 3 మాంసము, 4 మేదస్సు, 5 ఎముకలు, 6 మజ్జ (క్రొవ్వు), 7 శుక్లము అని సప్తధాతువులుగా పరిణామము పొందుచుండును ''తస్మాదన్నమయం మనః'' మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఈలాగున ఆహారము యొక్క సూక్ష్మాంశముగా మారుచుండును కావుననే వీనిని సూక్ష్మేంద్రియ ములని చెప్పిరి అందువల్ల మనోబుద్ధి చిత్తాహంకారములు శుద్ధములు కావలసియుండిన శుద్ధాహారము తప్పక యుండి తీరవలయును

**ద్వౌ భాగౌ పూరయేదన్నైస్తోయేనైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్ ॥**

ముముక్షువులందరు ఉదరమును సగభాగము అన్నపదార్థముల చేతను, పాతికభాగము జలముచేతను, పాతికభాగము వాయుసంచారార్థమై కాళీగాను ఉంచవలయును ఇది యాహార నియమము దీనికే యుక్తాహారమని పేరు వీరు నిరంతరము బ్రహ్మనిష్ఠయందు ఉండవచ్చును

**ఆత్మసంమితమాహారమాహరేదాత్మవాన్యతిః ।**
**అత్యంతక్షుధితస్యాపి సమాధిర్నైవ జాయతే ॥**

ఆత్మనిష్ఠయందుండువాడు తనయాత్మ కెంతవరకు తృప్తియని తోచునో, అంతవరకే భోజనము చేయువలయును మిక్కిలి ఆకలితో కూడినవానికిని , మిక్కుటముగా భుజించిన వానికిని సమాధి సిద్ధించదు

**హితం మితం సదాఽశ్నీయాద్యత్సుఖేనైవ జీర్యతే ।**
**ధాతుః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయేద్యతిః ॥**

ఆహారము మితముగాను, శుద్ధమైనదిగాను, ప్రీతికరమైనదిగాను ఎల్లప్పుడు నుండవలయును ఏయాహారము భుజించిన సుఖముగాను, త్వరితముగాను జీర్ణమగునో అట్టి యాహారమునే భుజించవలయును ఏది భుజించిన ధాతుప్రకోపము గల్గునో అట్టి పదార్థమును దేనినికూడ బ్రహ్మనిష్ఠ డెప్పుడును భుజించరాదు

ధాతుప్రకోపమనగా విషయాసక్తి, దాహమును గలుగజేయుట సరిగా జీర్ణము కాక నిద్రాభంగము అందువల్ల స్వప్నములో శుక్లనష్టము గలుగుట యగును. ఈలాటి ఉద్రేకమగు ఆహారపానీయములను బ్రహ్మనిష్ఠుడు భుజింపరాదు ఎక్కువ నెయ్యి, నూనెగల పదార్థములను త్యజింపవలయును నెయ్యి ఎక్కువవాడిన శాంతి గల్గునని తలంచువారు కొందరు గలరు స్వయముగా ఈశ్వర సృష్టిలోనే శరీరమున కెంత క్రొవ్వు కావలయునో, అది ప్రతి పదార్థములోను గలదు ఒకవేళ పాలు ఎక్కువ వాడవచ్చునేగాని, నెయ్యి ఎక్కువ వాడకూడదు వాడినచో బ్రహ్మచర్యమును తప్పక నష్టపరచును అది పాలనుండి విడిపోయిన దగుటచే దేహములో నిముడదు నిజముగా వస్తు పరిశోధన చేసినచో మానవ శరీరమునకు కావలసిన చక్కెర, నెయ్యి, ఉప్పు మొదలైన వన్నియు పదార్థములలోనే సృష్టికర్త అమర్చియున్నాడు

**యదుహ వా ఆత్మసంమితమన్నం తదవతి తన్న హినస్తి ।**
**యద్భూయో హిన స్తి తద్యత్కనీయో న తదవతి ॥**

ఎంత అన్నము దేహమునకు చాలునో అంత అన్నము తన్ను రక్షించును దానికన్న అధికముగా తిను అన్నము తన్ను భక్షించును.

దానికన్న తక్కువ యగు అన్నము దేహమును పోషించుట లేదని శతపథ బ్రాహ్మణము

విశేషకాలములో కొందరు ఎక్కువ భుజించుటచే అజీర్ణమునకు లోబడి బాధపడుట చూచుచున్నారుగదా! ఆహారము సరిగా లేనివారు శరీరదార్ఢ్యము కలిగి తాము నిర్వహించవలసిన పనులను చేయజాలకనే యున్నారు మితముగా భుజించువారు ఆరోగ్యవంతులై తాము చేయవలసిన కార్యక్రమములను చక్కగ నిర్వహించుచున్నారు శరీరమొక యంత్రము వంటిది నిప్పు నీళ్ళు ఎక్కువైన స్టీము అధికరించి బాయిలరును పగుల గొట్టును నిప్పు నీరు సరిగా లేనిచో యంత్రము పనిచేయజాలదు శరీరము యొక్క స్థితియు ఈలాగున నుండును

**సాయం ప్రాతర్మనుష్యాణామశనం దైవనిర్మితమ్ ।**
**నాంతరం భోజనం దృష్టముపవాసీ తథా భవేత్ ॥**

మనుష్యులకు భోజనము దైవనిర్మితము అది ఉదయము రాత్రి రెండు సారులు మాత్రమే అట్టివాని కేలాటి వ్యాధియు నుండదు ఈరెండు మారులు తప్ప నితర సమయములలో నేమియు భుజించనివాడు నిత్యోప వాసి యని చెప్పబడినది లేక ఈ రెండు సారులు తప్ప అధికముగ భుజించు వాడు ఉపవాసవ్రతము చేయవలయును

శాంతిపర్వమందు ధర్మరాజు భీష్ముని ఆహారనియమ మడిగినప్పుడు ఈ లాగే చెప్పెను ఆయుర్వేదమందు మొదటనే యీలాగున తెలుపడమైనది ఈ ఆయుర్వేదశాస్త్ర మెవరికొరకు నిర్మింపబడినది అని యడుగగా ఆహార నియమము, బ్రహ్మచర్యనియమము ఆచరింపని వారికని తెలుపడమైనది ఆ హారనియమము, బ్రహ్మచర్య నియమము గలవారికి వైద్యులును వైద్యశా స్త్రమును అవసరము లేదని తెలియందగిన దనియు తెలుపడమైనది

**ఏకవారం చరే ద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే ।**
**భైక్షేప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥**

సన్న్యాసి యగువాడు ఏకకాలము మాత్రమే భోజనము చేయ వలయును అధికముగా తినుట కూడదు అధికము తినుటలో ఆశ కలవాడు నిశ్చయముగా విషయలోలు డగును అట్టివానికి ఇంద్రియనిగ్రహ ముండదు అని సన్న్యాస సంగ్రహము

ఒకసారి భుజించువాడు యోగియనియు, రెండుసారులు భుజించు వాడు భోగియనియు(గృహస్థుడు) మూడుసారులు తినువాడు రోగి యనియు, నాలుగు సారులు తినువాడు ప్రాణముతో కూడిన శవమనియు తెలియందగును ఏకభుక్తము చేయువారికి విశేష శారీరక మానసికమైన పని యుండిన మాత్రము రాత్రులలో ఏదైన పానీయముగాని, ఫలములుగాని, స్వల్ప ఫలాహారముగాని యుండవచ్చును బౌద్ధమతములో భిక్షువులు భిక్షిణులు మధ్యాహ్న మొక్కసారి మాత్రమే భుజింపవచ్చును ఇతర కాలములలో దాహముగా నుండిన మంచినీరు మాత్రమే త్రాగవలయును శ్రీబుద్ధదేవున కున్న సుకుమారత్వము దేవేంద్రునికి సహ లేదనియే బౌద్ధగ్రంథములలో వర్ణించడమైనది అటువంటి రారాజాయొక్క ఏకపుత్రుడును భిక్షుకులకు నియమించిన ప్రకారము ఒకపూట మాత్రమే భోజనము చేయుచుండెను గృహస్థులు నిమంత్రణము చేసిన రోజామాత్రమే భిక్షువులతో వెళ్ళి భోజనము చేసి ధర్మోపదేశము సలిపి మరల ఏకాంతస్థలములోనికి వెళ్ళేవారు భిక్షకు ఆహ్వానించని రోజులలో బుద్ధభగవానుడు భిక్షాన్నముతోనే జీవించెను

**నాసమానసహాయేషు నివసేద్యోగవిత్ క్వచిత్ ।**
**వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు ॥**

ధ్యానయోగి తనకు సమానమైన గుణము కలవారుండు స్థలములో మాత్రమే యుండవలయును అట్లు సమాన గుణములేని స్థలములలో నొకప్పుడును ఉండరాదు నిర్మలశీలము, పుణ్యస్వభావము, తపస్సును కలవారుండు ప్రదేశమందే నివసింపవలయును

సామాన్యముగా సాధకులు తనకన్న ఎక్కువ నియమనిష్ఠ గలవారి

స్థలములోనే యుండవలయును అట్టివారి సహవాసమే యుచితము తనకన్న తక్కువస్థితిలో నుండువారియొక్కయు, తక్కువ స్వభావము గలవారి యొక్కయు స్థలములో నుండరాదు ఎక్కువ గుణము గలవారు దొరకక పోయిన తనకు సమానమైన వారైనను ఉండవలయును లేనిచో ఏకాకియై యుండుటయే మేలు

**ముహూర్తమపి నాసీత దేశే సోపద్రవే యతిః ।**
**ఉపద్రవే తు మనసి సమాధిర్నైవ జాయతే ॥**

ఒక ముహూర్తసమయ మైనను ఉపద్రవ (శాంతిలేని) స్థలములో ధ్యానయోగి నివసించరాదు మనోబాధ గల స్థలములో నుండిన నిర్వికల్ప సమాధి సిద్ధింపదు

ముఖ్యముగా ఏప్రదేశములో నుండిన విషయవాసన గలుగునో, అట్టి స్థలమును తప్పక స్త్రీయైనను, పురుషుడైనను త్యజింపవలయును అనగా ఏ ప్రదేశమున విషయవాసన గల స్త్రీ యుండునో, అచ్చోట పురుషుడును ఏ స్థలమున విషయవాసనగల పురుషుడుండునో ఆ ప్రదేశమున స్త్రీయును ఉండరాదు విఘ్నములలో నిదే మొట్టమొదటిది

**సమాధినా నయేత్కాలం వృథా చిన్తాం వివర్జయేత్ ।**
**ధ్యానేన విలయం యాన్తి పాపాని బహుజన్మనామ్ ॥**

కాలము కొంచెమేయని తెలిసి వ్యర్థము చేయక, వ్యర్థమైన చిన్తలను హృదయములోనికి రానీయక సమాధినిష్ఠలో కాలమును గడుపవలయును ఇట్టి ధ్యానమువలన అనేక జన్మములలో జేసిన పాపములుగూడ నశించును

**ఇన్ద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।**
**ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥**

ఇంద్రియము లన్నింటిలోను జిహ్వేంద్రియము, గుహ్యేంద్రియమును మహాబలము గలవి కావున ధ్యానాద్యనుష్ఠానము జేయువాడు మొట్టమొదట

నీ రెండింద్రియములయొక్క విషయములను జయించుటలో మిక్కిలి యత్నము గలిగియుండవలయును

ఈ రెండింద్రియములను జయించినచో, మఱల ప్రకృతి దగ్గరకు చేర జాలదు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽవ్యహం యుతః ॥**

**యథైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున అపరంజి బంగారైనను రజతతామ్రాదులతో మిళితమైన దానికి స్వల్పమైన వెల గలుగునో, ఆలాగున శుద్ధజ్ఞానశివ స్వరూపుడగు ఆత్మ దేహాద్యహంకారములతో గూడినవాడైన వానియొక్క శివత్వము నశించి జీవత్వమును బొందుచుండును మలినమగు బంగారమును స్ఫుటమువేసిన అపరంజి బంగారముగా మారి పూర్వముండిన విలువ యేర్పడునట్లు భక్తి, ధ్యాన, జ్ఞానాదులచే జీవుడు సంస్కరింపబడినప్పుడు జీవత్వము నశించి శివత్వము గలుగుచుండును అని వాసిష్ఠము

మలినమగు బంగార మెంతవరకు స్ఫుటము జేయబడదో అంతవరకు అపరంజి బంగారముయొక్క విలువ గలుగనట్లు జీవునియందుగల ప్రకృతి దోషముధ్యాన తపస్సులచే నెంతవరకు నశించదో, అంతవరకు జీవుడు దీనావస్థను బొందియుండును వసిష్ఠమునీంద్రుడు ఎటువంటి దృష్టాన్తమును దెలిపిరి ప్రపఞ్చములో పవిత్రాత్ములైన వారిని భగవంతునివలె పూజించుట జూచుచున్నారముగదా! ఆలాగున పాపజీవులను కారాగారములో కఠినముగా శిక్షించి పశువులకంటెను నీచముగా జేయుటయు గానవచ్చుచున్నది గదా! వసిష్ఠులు దెలిపిన యుపదేశమువల్ల శ్రద్ధగలవారికి తరించుటకెంతో యుత్సాహము గలుగుచున్నది

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**

**తేషా మాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

తనలోగల యజ్ఞానమును ఎవరు రహిత మొనర్చుచున్నారో అట్టివారికి ఆత్మజ్ఞానము సూర్యునివలె ఆ పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింప జేయుచున్నది

మేఘముచే సూర్యుడుగాని చంద్రుడుగాని ఆవరింపబడియున్నప్పుడు కనిపించరు గాలివలన మబ్బు తొలగునప్పుడు ఎట్లు కనబడుదురో ఆత్మ జ్ఞానోదయముయొక్క స్థితియు నాలాగున నుండును మేఘావరణము గలిగియుండు నపుడును సూర్యచంద్రులు పూర్ణముగనే ఉంటున్నారు మబ్బువలన గోచరించక పోవుచున్నారు ఆలాగున అజ్ఞానదశలోను ఆత్మజ్ఞానము పూర్ణముగనే యుంటున్నది జ్ఞానులకును, అజ్ఞానులకును ఇంతియే భేదము మేఘముతో గూడియుండునట్లు అజ్ఞానులును, మేఘము తొలగిపోయినరీతి జ్ఞానులును ఉంటున్నారు మఱియు సూర్యోదయములేని కారుచీకటిలో ఏమియు గనిపించదు భాస్కరోదయము గలిగిన తదుపరి అంతయు గనిపించెడు తీరున అజ్ఞానావస్థలో ఈశ్వరస్సృష్టిశక్తి ఏమియు తెలియదు జ్ఞానోదయము కాగానే ఈశ్వరస్సృష్టిశక్తి కనిపించును

**న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

ఓ యర్జునా! నీ యొక్క యీ మాంసచక్షువువలన విశ్వరూపధరుడ నగు నన్ను జూడజాలవు కావున అప్రాకృతమైన దివ్యనేత్రము నిచ్చు చున్నాను ఈ దివ్యదృష్టిచే నాయొక్క యోగమహిమను (ఈశ్వరశక్తిని) జూడుము

పంచభూతాత్మకమైన ఈనేత్రము పంచభూతమయములైన వస్తువులను జూచుశక్తిని మాత్రమే గలిగియున్నది ఈశ్వరత్వమును జూడజాలదు రత్నములైనను దీపము నేలాగున ప్రకాశింపజేయజాలవో, దీప మేలాగున స్వప్రకాశమై రత్నాది వస్తువులను ప్రకాశింపజేయునో, ఆలాగున

జడమునకును, చైతన్యమునకును తారతమ్యము గలదు పైజెప్పిన వాక్యమువలన జీవునికి దివ్యదృష్టి కలుగవలసియుండిన ఈశ్వరుని యనుగ్రహముచేత మాత్రమే కలుగవలసియున్నదని గోచరించుట లేదా? ఈశ్వరభక్తివల్ల గలిగెడి ప్రయోజన మిట్టిది

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।**
**కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥**

సర్వదోషములకు మూలము కామము, క్రోధము, లోభము, కనుక నీ మూడును నరకమును బొందుటకును, ఆత్మనాశమునకును కారణములు అందువలన నరకమునుండి విడివడదలంచినవారు ఈ మూడింటిని వదలవలయును

**ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనశ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥**

ఓ యర్జునా! నరకద్వారమునకు హేతువులైన ఈ మూడుదుష్టగుణములచే విడివడిన నరుడు తనకు శ్రేయస్సును గలుగజేసెడి దైవభక్తి జీవకారణ్యధ్యానాదులను జేసికొనుచో సర్వోత్కృష్టమైన మోక్షగతిని బొందుచున్నాడు

పాపమునుండి యేలాగున విమోచనము గలుగునో అను చింత గలవారికి భగవానుడే ఉపాయమును తెలిపియున్నాడు కామక్రోధలోభములు నరకద్వారములనియు, ఈ మూడు గుణములను త్యజించి యాత్మశ్రేయస్సుకొఱకు యత్నించువాడు మోక్షద్వారమును తెరచినవాడనియు నుపదేశించిరి దీనికంటె నుపాయమును ఎవరేమి వచించగలరు?

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**

యజ్ఞ దాన తపంబులు ఫలాభిలాషలేని ప్రజ్ఞాశాలురకు చిత్తశుద్ధిని

గలుగజేయును గాన యజ్ఞ దాన తపోరూపమగు కర్మలను తప్పక చేయ వలయును

పాపకర్మ లుండుటచేతనే విఘ్నములు గలుగుచున్నవని పలుసారులు తెలుపడమైనది అట్టి పాపశాంతి గలుగునప్పుడే విఘ్నములు నశించును అట్టి పాప శాంతికొఱకు పైజెప్పిన మూడువిధులను ఆచరించవలయును కావుననే ''న త్యాజ్యం కార్యమేవ తత్'' తప్పక చేయవలయుననియు, ఉపేక్ష చేయరాదనియు తెలిపిరి తనకుగల దోషములు, లేక దుఃఖములు నశించుట కొఱకును, సుఖములు పుణ్యములు గలుగుట కొఱకును పైజెప్పిన యజ్ఞ దాన, తపస్సుల నాచరించునప్పుడు మనస్సున బాగుగ ధ్యానము జేసినచో అట్టి ఫలము బొందగలరు అయితే ఇది కామ్యకర్మతో గూడినది గదాయని సందియపడ నక్కరలేదు దుఃఖనివృత్తి గలుగుటకొఱకు పరమాత్మని ధ్యానించి చేయు కర్మయు, బంధనివృత్తికొఱకు గాగలది గాన దానివలన దోషము లేదు లాభప్రాప్తి నిమిత్తము చేయునది ఫలమును గలుగజేయునే గాని దానిచే దైవప్రీతి గలుగదు అయితే నిష్కామ కర్మయోగము కేవలము ముముక్షువులకుమాత్రమే చెల్లును తక్కిన పుణ్యకర్మలు సాధారణ జనులు చేయుటలో విరోధము లేదు

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥**

నన్నాశ్రయించెడి వాడెల్లప్పుడు సర్వకర్మలను చేయుచున్నవాడైనను నాయనుగ్రహమువలన నిత్యమైనదియు, నాశము లేనిదియు నగు మోక్షమును బొందుచున్నాడు

దీనియందు 'సర్వకర్మాణి' యని చెప్పుటచే విధిచోదితమగు గృహస్థాశ్రమమునందుండినను లేక విరక్తుడై యేకాంతమునందున్న వాడైనను విరోధము లేదు ''మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమ వ్యయమ్'' అని భగవంతుడు చెప్పుటచే భగవదనుగ్రహమువల్లనే విఘ్నము

లన్నియు తొలగి శాశ్వతమగు మోక్షపదము లభించునని గ్రహించవలయును భగవదనుగ్రహము గలుగవలసియుండిన భగవత్ప్రీతికర కార్యములను భగవదర్పిత భావముతో జేయవలయును

**మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।**
**అథ చే త్త్వమహంకారాన్న శ్రోష్యసి వినజ్ క్ష్యసి ॥**

ఓ యర్జునా! నన్ను ధ్యానించుచున్న, నీవు నా యనుగ్రహమువలన సకలములైన సంసారబంధములను (సమస్త విఘ్నములను) దాటగలవు అట్లుగాక యహంకారము గలిగి, విననొల్లవేని చెడియెదవు అనగా మోక్షభ్రష్టుడ వగుదువు

''మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి'' ఇచట సర్వదుర్గాణి అని సర్వనామ ప్రయోగమును జేయుటవలన సమస్త విఘ్నములను దాటగలవు అను భగవద్వాక్యమున విశ్వాసమును గలిగియుండుడు

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥**

ఓ యర్జునా! అన్నివిధములచే నా సర్వేశ్వరుని రక్షకునిగ వేడుకొనుము ఆ సర్వేశ్వరుని యనుగ్రహమువలన సర్వోత్కృష్టమగు పరమ శాంతిని (ప్రకృతి రహితమగు నుపరతిని), శాశ్వతమగు మోక్షమును బొందగలిగెదవు

ఈ శ్లోకములోను ''తమేవ శరణం గచ్ఛ'' అనియు, ''తత్ప్రసాదాత్పరాం శాన్తిం'' అనియును ఉపదేశించుటవలన పరమేశ్వరానుగ్రహము వల్లనే విఘ్నము లన్నియు తొలంగును గీతయొక్క యంతిమస్థితిలోను నిట్లుపదేశించుటవలన మిక్కిలి జాగరూకతతో నిది గ్రహించవలసియున్నది పైజెప్పిన ప్రకారము అర్జునుడు మొదలగువారు చేసికొనుటవలననే భగవంతుడు వారికిగల సమస్త విఘ్నములను రహిత మొనర్చి సామ్రాజ్య పట్టాభిషిక్తులనుగా చేసెను యుద్ధములో భీష్మ, ద్రోణ, కర్ణాదులను

జయించుట భగవదనుగ్రహమునగాక మరేమున్నది? అంతియగాక అర్జునునకు భగవంతుడే సారధిగా నుండి విజయమును గలుగజేసెను భగవదనుగ్రహబలమును దీనిచేతనే గ్రహించుకొనవచ్చును ఇచట సామ్రాజ్యవిజయము, పట్టాభిషేకము ముముక్షువులకు మోక్షసామ్రాజ్యాభిషేకమని గ్రహించదగినది అంతరాయములు ఆటంకములే

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥**

నాయందర్పిత చిత్తము గలవాడ వగుము నాయందు భక్తిగలవాడవు గమ్ము నన్నే నమస్కరించు వాడవు గమ్ము సకలమును నాయందు సమర్పించితివేని నన్ను బొందెదవు నాకిష్టుడవైనందున నీకు సత్యముగా ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాడను

''సత్యం తే ప్రతిజానే'' – ఇచట భగవంతుడు ప్రతిజ్ఞజేసి (ఆనపెట్టి) చెప్పుటయు, ఇది సత్యమని పలుకుటయు జూచినచో సర్వవిఘ్నములనుండి విముక్తి గలుగవలసి యుండినను, ''మామేవైష్యసి'' భగవంతుని (మోక్షమును) పొందవలసియుండిన, ఇది యొక్కటియే యుపాయమని తప్పక గ్రహించవలసియుండును ఈశ్వరవిశ్వాస మొకటి లేనిచో జీవునకు ఆత్మశాంతి గలుగుటలో వేరొండుపాయము లేదు

కష్టావస్థలో ఉన్నప్పుడిట్టి ఈశ్వరవిశ్వాస మొక్కటియే ఆత్మశాంతిని గలుగజేయును అయితే ఈశ్వర విశ్వాసము గలవానివలె నటించి యధర్మమును గావించిన నతనికి ఈశ్వరకరుణ గలుగునా? యనెడి ప్రశ్న యొక్కటి లోకమున నిలిచియున్నది ఈశ్వర విశ్వాసము గలవాడైనచో నతడీశ్వర ధర్మమునకు భిన్నమైన కార్యమును జేయుడనియే దానికి సమాధానము ఈశ్వర భక్తునివలె వేషములు భాషణములు గలిగియుండి అధర్మకార్యమును జేయుచుండిన, నతని హృదయములో నీశ్వర విశ్వాసము లేదనియే మనము గ్రహించవలయును అతడు సీతాపహరణకొఱకు

రావణుడు ధరించిన పరమర్షివేషమువంటివాడని మనము గ్రహించ వలయును

ఆపత్కాలములో ఈశ్వర విశ్వాస మొక్కటి లేనిచో మనస్సమాధా నము గలుగుటకు వేరు మార్గము లేదు సముద్రములో పడిపోయినవాడు నావికుని సహాయము లేనిచో నెట్లు తీరము జేరగలుగును? అగాధమైన పాడునూతిలో బడినవాడు రెండవ వాని సహాయము లేనిచో నెట్లు వెలుపలికి రాగలుగును? అలాగున నీ విఘ్నములనుండి విముక్తి గలుగవలసియుండిన ఈశ్వరానుగ్రహము తప్పక గలిగియుండవలయును గజేంద్రుని చరిత్రయే ఇందులకు దార్కాణము

ఐతే వేదాంతములయొక్క నిజస్వరూపము చక్కగ తెలియని వా రీ విషయమై ఇది భక్తియోగమేగాని తత్త్వవిచారణ పరమగు జ్ఞానవిచారణ గాదనియు, తక్కువ మెట్టనియు బలుకుదురు వేదాంతసత్య మెఱింగిన మహనీయులందరు ముఖ్యముగా శంకరాచార్యులుగూడ ఈశ్వరాను గ్రహము లేనిచో ఈశ్వర తత్త్వమును బొందజాలరని వక్కాణించిన భాగముల నుండి కొంతవరకు ఈ గ్రంథములో నిరూపించడమైనది ఇక నీ విషయమై విస్తారముగా వ్రాయవలసి యుండిన అదియే ఒక గొప్ప గ్రంథమగును ఇట్టి ఈశ్వరకృపకు దూరులై ''అహంబ్రహ్మాస్మి'' యను మహావాక్యమును జెప్పువారలలో చాలమంది పతితు లగుటకును, విఘ్నబాహుళ్యముచే బద్ధులగుటకున్ను ఇదియే కారణము నిజముగా లోతులోనికి దిగి దీర్ఘముగా నాలోచించిన వేదాంత తత్త్వమగు ''అహం బ్రహ్మాస్మి'' యొక్క ఫలమే కలుగును ఏలన నతడు తనయొక్క జీవభావమును త్యజించి బ్రహ్మభావన జేయుటయు నొక విధమగు ఉపాసనయే యగును అట్టి బ్రహ్మభావమునలో రూఢిగ నిలుకడ గలిగినవారు ధన్యులే

అయితే బ్రహ్మము ప్రకృతిరహిత మగుటచే అట్టివాని నుండి ప్రకృతి గుణము లెవ్వియు బయలుపడగూడదు ఆలాటి స్థితి గలుగుటకు మహా ప్రజ్ఞావంతులకు మాత్రమే సాధ్యమగును తక్కిన వారలందరు ఇట్టి యీశ్వర

భక్తిపరమగు బ్రహ్మైత్మైక భావమును బొందుటయే సులభమార్గము దీనినే శ్రీ శంకరభగవత్పాదులు ''భేజే భ్రమర కీటవత్'' అను భ్రమరకీటక న్యాయమని తెలిపిరి పైజెప్పిన విధముగ వేదాంతతత్త్వ బ్రహ్మసిద్ధిలో ఆరూఢస్థితి గలిగియుండిన మహాత్ముడైన తనయొక్క సర్వేంద్రియముల ద్వారా రోమకూపములతో సహా ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములతో సహా బ్రహ్మభావమున కనువైన ప్రకృతివాసనగాని, గుణముగాని గలిగియుండ రాదు ఉండినచో గిల్టునగను బంగారునగయని చెప్పి విక్రయమునకు తెచ్చినవానివలె నుండునని మనము గ్రహించుకొనవలయును

**ఈశ్వరానుగ్రహాచ్ఛాన్తి దాన్త్యాదిగుణసంయుతమ్ ।**
**జన్మ చేల్లభ్యతే తస్మిన్ విద్యయా మోక్షమాప్నుయాత్ ॥**

ఈశ్వరానుగ్రహమువల్లనే జీవునికి శమదమాది గుణములతో గూడిన జన్మము లభించును అట్టి శాన్తిదాన్త్యాది దైవగుణములు గల జన్మమందే జ్ఞానము గలుగును అట్టి జ్ఞానమువల్లనే జీవన్ముక్తి (మోక్షము) సిద్ధించును అని అనుభూతిప్రకాశము

**వనం తు సాత్త్వికో వాసో గ్రామో రాజస ఉచ్యతే ।**
**తామసం ద్యూతసదనం మన్నికేతం తు నిర్గుణమ్ ॥**

సాత్త్వికులకు వనవాసము, రాజసులకు గ్రామవాసము, తామసులకు జూదమాడు స్థలమును, నిర్గుణులకు నా స్థానమును (పరమేశ్వర స్థానము) ఇష్టములు

**దేవానామమృతం నౄణామృషీణాం చాన్న మోషధిః ।**
**దై త్యరక్షఃపిశాచాదేర్దత్తం మద్యామిషాది చ ॥**

బ్రహ్మదేవుడు సృష్టికాలమున ఎవరెవరి కేయే యాహారములను విధించెనో, వాని నీశ్లోకము నిరూపించుచున్నది 1 దేవతలకు అమృతము, 2 మానవుల కన్నము, 3 ఋషులకు కందమూల ఫలాదులు 4 భూతప్రేత పిశాచ రాక్షసాదులకు మద్యమంసాదులును బ్రహ్మదేవునిచే నేర్పరుపబడెను

కావున మద్యమాంసాదులను ఎవరికొఱకేర్పరచిరో విజ్ఞులు తెలిసికొనగలరు

దీనియందు సత్త్వగుణము గలవారి కేకాంత ప్రదేశమును విధించెను ఆలాటి స్థలములో నుండిన విఘ్నములు గలుగనేరవు

**ఇన్ద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్ ।**
**జితేన్ద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః ॥**

ఇంద్రియములయొక్క జయముకొఱకు రాత్రింబవళ్ళు యోగానుష్ఠానమును గలిగియుండవలయును ఇంద్రియజయము గలవాడు మాత్రమే ప్రజలను స్వాధీనములోనుంచి నడుపుటకు శక్తిమంతుడగును అని మనుస్మృతి.

ప్రభువు ప్రజలను, బోధకుడు జనులను, గురువు శిష్యులను ధర్మమార్గములో నడుపుటకు ఇంద్రియజయము గలుగవలయును వ్యష్టికిని, సమష్టకిని పరస్పర సంబంధము గలదు తన దేహములోగల ఇంద్రియములను తన యిష్టానుసారముగా నడుప శక్తిగలవాడు మాత్రమే లోకమున గల జనులను న్యాయమార్గములో నడుపగలుగును రాజులకును ఇట్టి భక్తి గలిగియుండిన మాత్రమే ప్రజలను న్యాయమార్గములో నడుప సమర్థత గలుగును

**అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాన నిశ్చయః ।**
**ఇత్థం విచార్య మార్గౌ ద్వౌ జగాద పరమేశ్వరః ॥**

ఒకానొకనికి యోగము సాధ్యము గాదు కాని జ్ఞానము సాధ్యమగును మఱియొకనికి జ్ఞానము సాధ్యము గాదు కాని యోగము సాధ్యమగును. ఈ ప్రకారము భగవాను డాలోచించి రెండైన యోగజ్ఞాన మార్గములను సృష్ట్యాదియందే ఏర్పాటుచేసెను

జీవులకు పూర్వజన్మ సంస్కారము ననుసరించియే యోగమునందుగాని, జ్ఞానమునందుగాని, భక్తియందుగాని, నిష్కామకర్మయందుగాని

ప్రవృత్తి గలుగుచుండును ఆయా సంస్కారముల ననుసరించి యభిరుచి పుట్టును ప్రకృతిగుణములు నశించిన నెవ్వారైనను ముక్తు లగుదురు

**యోగాత్పరతరం పుణ్యం యోగాత్పరతరం శివమ్ ।**
**యోగాత్పరతరం సూక్ష్మం యోగాత్పరతరం న హి ॥**

ధ్యానయోగమునకంటెను శ్రేష్ఠమైన పుణ్యము వేరొండు గానం బడదు ధ్యానయోగముకన్న అధికతరమగు మంగళకరము మఱియొకటి లేదు ధ్యానయోగమునకన్న శ్రేష్ఠమైనది, గ్రహించందగినది సూక్ష్మతరము నైన జ్ఞానము మఱియొకటి లేదు ధ్యానయోగమునకన్న ఉత్కృష్టమగు వస్తువు మఱియొకటి గానంబడదు

**శ్రవణం మననం ధ్యానం విద్యాయాస్సాధనం త్రయమ్ ।**
**అజ్ఞానం సంశయో భ్రాన్తి రిత్యేతేషాం నివర్తకమ్ ॥**

శ్రవణముచే నజ్ఞానము, మననముచే సంశయము, నిదిధ్యాసముచే భ్రాన్తియు నశించును బ్రహ్మవిద్యయొక్క సాధనత్రయము దీనివలన నిరూపించడ మైనది

**శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానోఽప్యనేకశః ।**
**న విజానాత్యయం తత్త్వమీశానుగ్రహవర్జితః ॥**

బహుకాలము తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణము గావించి నను, బహువిధములుగా దేశికేంద్రునిచే బోధింపబడినను ఈశ్వరాను గ్రహము లేనివాని కీతత్త్వము బోధపడనేరదు అని సర్వవేదాన్తసార సంగ్రహము (శ్రీశంకరాచార్యులు)

**పతిహీనా యథా నారీ మాతృహీనో యథా శిశుః ।**
**గురుహీన స్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥**

భర్తలేని స్త్రీయు, ఆలాగున తల్లిలేని శిశువును, తద్విధముగనే గురు వులేని మానవుని జన్మయు నిరర్థకము

బ్రహ్మనిష్ఠుడైన గురువు లభించిన విఘ్నములు గలుగనీయక తగు మార్గము నుపదేశించును

**శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే ।**
**సాధవో న హి సర్వత్ర చన్దనం న వనే వనే ॥**

ఎచట చూచిన కొండలలో రాళ్ళు గనిపించునేగాని వాటిలో మాణిక్య మెంత దుర్లభమో, ఆలాగున గజము లనేకములు గోచరించును గాని గజము త్యముగల యేనుగెంత దుర్లభమో, ఆలాగున ఎచట చూచినను విస్తారముగ వనములలో పలువిధములగు వృక్షములు గనిపించునుగాని శ్రీగంధపు చెట్టెంత యరుదుగ నుండునో, ఆలాగున నెచట జూచినను సాధువు లనేకులు గనుపించినను నిజమగు సాధనానుష్ఠానము గల సాధువు లభించుట కడుంగడు దుర్లభము అని అష్టావక్రగీత

**దుర్లభో విషయత్యాగో దుర్లభం త త్త్వదర్శనమ్ ।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా ॥**

విషయనివృత్తి మహాదుర్లభము, తత్త్వదర్శనముగూడ అట్లు దుర్లభము సహజామనస్కస్థితి మిక్కిలి దుర్లభము ఇవన్నియు సద్గురు దేవునికృప వలననే గలుగవలసియున్నవి అని హఠయోగప్రదీపిక

విరక్తుడైన శిష్యునకు వైరాగ్యపురుషుడగు గురువు దొరకుట కన్న మించిన భాగ్యము లేదు ఆలాగున పుణ్యవతియగు నారీమణికి ఉత్తముడగు భర్త లభించుటకన్న మించిన భాగ్యము లేదు

**బహుజన్మ కృతైః పుణ్యైః వైరాగ్యం ఖలు జాయతే ।**
**వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నైవజాయతే ॥**

అనేకజన్మములలో జేసిన నిష్కామ పుణ్యకర్మలచేతనే జీవులకు వైరాగ్యము జనించును అట్టి వైరాగ్యము లేకయే జీవికిని జ్ఞాన మేకాలమందైనను గలుగుట లేదు.

రోగులు, దారిద్ర్యపీడితులు, అనేక సంతానములు గలవారు, వార్ధక్యావస్థలో నుండువారు, తక్కువజాతిలో జనన మొందిన వారు, నివసించుటకొక గుడిసెయైనను లేక తిరిగెడివారు, నిరాధారులైన వారుగూడ విరక్తిని బొందక మఱల మఱల సంసారవిషయములలోనే పడియుండుట జూడ ఉత్తమకులములో బుట్టి, సర్వావయవములు పూర్ణముగా గలిగి, ఆరోగ్యవంతుడై, సర్వసౌఖ్యములుండి, యౌవనదశయం దున్నప్పుడే, విషయాదుల యందు విరక్తి గలిగియుండిన ఆ జీవి యెంత పుణ్యాత్ముడో యోచించ వచ్చును

**నా స్తి శ్రద్ధాసమం పుణ్యం నా స్తి శ్రద్ధాసమం సుఖమ్ ।**
**నా స్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప ॥**

ఓ రాజా! శ్రద్ధగల స్వభావమునకు సమమగు పుణ్యము వేరొండు గానరాదు శ్రద్ధగల స్వభావమునకన్న సుఖము మఱియొకటి లేదు శ్రద్ధగల స్వభావమునకన్న వేరొక తీర్థస్నాన ఫలము ఈ ప్రపఞ్చమున గానరాకున్నవి

**యుంజీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।**
**ప్రణవే నిత్యయు క్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥**

ఇట్టి ప్రణవమునందు సాధకుడు మనస్సును బొందింపజేయ వలయును ప్రణవమే నిర్భయమగు బ్రహ్మము, ప్రణవమునం దెల్లప్పుడు మనస్సును లయముగావించి ధ్యానము జేయువాని కెచ్చోటను భయ ముండదు వాని కెల్లప్పుడును మంగళమే గలుగును, విఘ్నము లుండవు

**అథాతస్సంప్రవక్ష్యామి శుద్ధకైవల్యము క్తిదమ్ ।**
**అనుగ్రహాన్మహేశస్య భవదుఃఖస్య భేషజమ్ ॥**

ఓ మునివరులారా! నేను శ్రీపరమేశ్వరుని యనుకంపాతిశయంబున పరమపవిత్ర మైనదియు, సంసారమను రోగమునకు నౌషధ మగునదియు బ్రహ్మరూపకమగు ముక్తినిచ్చు కైవల్యప్రదమునగు జ్ఞానమును జెప్పుచున్నాడను( శివగీత)

''అనుగ్రహాన్మహేశస్య''- ఈశ్వరానుగ్రహము వల్లనే విఘ్నము లన్నియు దొలగి ముక్తి గలుగును

**కంచిత్కాలముమామహేశ భవతః పాదారవిందార్చనైః**
**కంచిద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః ।**
**కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం**
**యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు ॥**

ఓ ఉమామహేశ్వరా! కొంతకాలము నీ పాదార్చనచేతను, కొంత కాలము నీ ధ్యానసమాధులచేతను, కొంతకాలము నీ నమస్కారముల చేతను, కొంతకాలము నీకథాశ్రవణములచేతను, కొంతకాలము నీదర్శన ములచేతను, కొంతకాలము నీస్తోత్రములచేతను కూడి సంతోషముచేత నీయందుంచబడిన మనస్సు గలవాడెవ్వడో వాడు జీవించియుండినను ముక్తుడే (శివానందల హరి- శ్రీశంకరాచార్యులవారి వాక్యము)

పై జెప్పిన ప్రకారము చేయువారి మనస్సు ఎల్లప్పుడు ఈశ్వర భావములో నుండుటచే నిరతములగు చెడు సంకల్పమున కవకాశమే కలుగదు రాత్రికాలమున నింటిలో దీపము వెలుగుచుండిన చీకటి ప్రవేశింప జాలనట్లు అతని హృదయమందును తమస్సు ప్రవేశింపజాలదు

**ఆశ్రమధ్యాననిరతః సంశయచ్ఛిత్సుబుద్ధిమాన్ ।**
**నిత్యానుష్ఠానసంయుక్తస్త్వాచార్యః పరికీర్తితః ॥**

తన యాశ్రమమునకు తగిన ధ్యానానుష్ఠానములు గలవాడును, సంశ యమును ఛేదించువాడును, నిర్మలమైన బుద్ధిగలవాడును, నిత్యానుష్ఠానము నందు మంచి నిష్ఠగలవాడును ఆచార్యు డనంబడును (గురుగీత- ఈశ్వరవాక్యము )

**భావహీనో నరస్సర్వం కృత్వాఽపి న విముచ్యతే ।**
**భావయుక్తః పునస్సర్వమకృత్వాఽపి విముచ్యతే ॥**

ఆత్మభావనాశుద్ధి లేనివాడు ఎన్ని పుణ్యకర్మానుష్ఠానములను, బ్రహ్మ విచారణను చేసినను మోక్షమును బొందజాలడు ఆత్మయందు శుద్ధమైన స్థితి గలిగి బ్రహ్మభావన జేయువాడు పైజెప్పిన క్రియల నేవియు చేయకుండి నను జీవన్ముక్తుడగును

భావనతో జేయకపోవుటయే జపధ్యానాదులచే పొందెడి ఫలమును బొందకుండుటకు గారణము హృదయమందు పవిత్రత గలిగి దైవభావన గలవా డేక్రియలను జేయకుండినను ముక్తుడగును పూర్వీక ఋషులు జపించిన మంత్రములను ధ్యానములను ఇపుడుండు వారు చేసియు ఆ మహనీయులు బొందిన స్థితిని బొందకుండుటకు వారు భావనప్రకారము చేయకపోవుటయే కారణమగును

ఈ విషయమై పతంజలి మహర్షి యోగదర్శనమున నిట్లు వచించిరి

**తజ్జపస్తదర్థభావనమ్ ।**

ఏ మంత్రమును జప మొనర్చునో దానియొక్కయర్థమును దైవ భావమును గలిగి జపము చేయవలయును

**మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః ।**
**శతకోటిప్రజప్తోఽపి తస్య సిద్ధిర్న సిధ్యతి ॥**

సాధకుడు తాను జపించు మంత్రార్థమును, ఆమంత్రాధిష్ఠాన దైవమును భావనచేయక నూరుకోట్ల జప మొనర్చినను దానియందు చెప్పబడిన సిద్ధిని బొందజాలడు

సాధకుడు, జపధ్యానపరాయణు డీసత్యమును బాగుగ జ్ఞప్తిలో నుంచుకొని ప్రవర్తించవలయును

**బ్రహ్మజ్ఞానాత్పాశహానౌ క్షీణక్లేశో న జన్మభాక్ ।**
**పాశాశ్చతుర్విధాశ్చైవ శాస్త్రేషు ప్రతిపాదితాః ॥**

బ్రహ్మజ్ఞానమువలన పాశములు నశింపగానే క్లేశములు లేనివాడై

జీవుడు మరల జన్మించడు పాశములు నాల్గువిధములని శాస్త్రములయందు చెప్పబడినవి

**మలో మాయా కర్మ తత్త్వతిరోధానం చ తే మతాః ।**
**మలో జ్ఞానక్రియాశక్త్యోశ్ఛాదకో దోష ఉచ్యతే ॥**

మలము, మాయ, కర్మ, తత్త్వము మూతబడియుండుట – యని పాశములు నాల్గువిధములు మలమనగా జ్ఞాన క్రియాశక్తులను మూతవేసియున్న దోషమునకు పేరు

**రాగాది హేతుర్మాయోక్తా కర్మ పుణ్యం చ పాతకమ్ ।**
**మూఢై స్తత్త్వతిరోధానం సర్వైరప్యనుభూయతే ॥**

రాగద్వేషాదులను కలిగించునది మాయ యనబడును పుణ్యము, పాపము కర్మ యనబడును తత్త్వతిరోధానము నిజము తెలియకుండుట మూఢులందరికిని అనుభవసిద్ధమే

ఈ దోషములు నశించుటకు ఈశ్వరానుగ్రహము తప్ప వేరు మార్గము లేదని అనుభూతిప్రకాశము

**ఉపాయః ప్రణవేనాత్మధ్యానం తేనైష లభ్యతే ।**
**తిలాత్తైలాదయో యద్వల్లభ్యా స్తత్తదుపాయతః ॥**

ఓంకారముతో ఆత్మను ధ్యానించ ట యుపాయము దానిచేత బ్రహ్మము తెలియబడును తిలలనుండి నూనె మొదలగునవి ఆయా యుపాయములతో నెట్లు తీయబడునో అట్లు

**సర్వవ్యాపినమాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్ ।**
**ఆత్మవిద్యాతపోభ్యాం తముపలభ్య విముచ్యతే ॥**

పాలలో నేయివలె సర్వత్ర జగత్తులో వ్యాపించియున్న ఆత్మను ఆత్మ జ్ఞానముచేతను, తపస్సుచేతను దెలిసికొని ముక్తిని బొందును

**యదు క్తం ప్రణవధ్యానం స యోగ స్తత్ర యత్నవాన్ ।**
**మనో బ్రహ్మణి యుంజాన స్తత్సాక్షాత్కురుతే ధియా ॥**

ఏ ప్రణవధ్యానము చెప్పబడినదో అది యోగ మనబడును దానికై యత్నించువాడు మనస్సును బ్రహ్మమునందు గూర్చిన వాడగుచు బుద్ధితో బ్రహ్మమును సాక్షాత్కరించుకొనును

**ఉరోఽంసమూర్ధస్థానేషు త్రిషు దేహం సమున్నతమ్ ।**
**అవస్థాప్యాసనం జిత్వా ప్రత్యాహారం సమాశ్రయేత్ ॥**

వక్షఃస్థలము, భుజము, శిరస్సు- ఈ మూటియందు దేహము నున్నతముగా నుంచి యాసనమును జయించి అనగా లొంగదీసుకొని ప్రత్యాహరము చేయవలయును

**హృద్యక్షాణాం నిరోధో యః ప్రత్యాహారః స ఉచ్యతే ।**
**జయేత్ప్రాబల్యమక్షాణాం ప్రాణాయామేన ధైర్యవాన్ ॥**

ఇంద్రియములను హృదయమందు నిలుపుటయే ప్రత్యాహార మనబడును ప్రాణముల ప్రాబల్యమును ప్రాణాయామముచేత ధైర్యవంతుడై జయింపవలెను

**ప్రాణాధీనవ్యాపృతానామక్షాణాం ప్రాణరోధనాత్ ।**
**నిరోధః స్యాత్తతశ్చిత్తం ధారయేతాప్రమాదతః ॥**

ప్రాణమున కధీనమైన వ్యాపారముగల యింద్రియములకు ప్రాణమును నిరోధించుటయే నిరోధము పిమ్మట పొరపాటులేక మనస్సును నిలుపవలెను

**సమే శుచౌ శర్కరాది మశకాది వివర్జితే ।**
**మనోఽనుకూలేఽవస్థాయ దేశే ధ్యానం సమాచరేత్ ॥**

హెచ్చుతగ్గులు లేనిది, శుచి యగునది, రాళ్ళు మొదలయినవి లేనట్టిది, దోషములు మొదలగులయినవి లేనట్టిది తన మనస్సున

క్లిష్టమునగు ప్రదేశమునందు ధ్యానము చేయవలయును

**నాడీరూపాణి నీహారధూమాన్యత్ర విభాంతి చేత్ ।**
**బ్రహ్మసన్నిధిమాప్తా ధీరితి నిశ్చీయతాం తదా ॥**

మంచుపొగవలె నాడీరూపములు కనబడినట్లయిన బుద్ధి బ్రహ్మ సమీపమునకు జేరెనని యపుడు నిశ్చయించవలయును

**నిర్జరత్వవితృష్ణత్వ శుభగంధాది చేద్భవేత్ ।**
**యోగసిద్ధిః ప్రవృత్తేతి జ్ఞాత్వా యోగే స్థిరో భవేత్ ॥**

ముసలితనము లేకుండుట, దాహము లేకుండుట, సుగంధము వాసించుట మొదలగునవి గలిగిన యోగసిద్ధి ప్రారంభించినదని తెలిసి యోగమందు నిలకడ గలవాడు గావలయును

**మేఘచ్ఛన్నం చంద్రబింబం మేఘాపాయేఽతినిర్మలమ్ ।**
**తథైవ బుద్ధిచాంచల్యశాంతావాత్మా ప్రసీదతి ॥**

మేఘముతో గప్పబడిన చంద్రబింబము మేఘము పోయిన పిమ్మట అతినిర్మల మగునట్లు బుద్ధిచాంచల్యము శాంతించగా నాత్మ నిర్మల మగును

**స్వాత్మతత్త్వప్రసాదేన బ్రహ్మత త్త్వం ప్రసీదతి ।**
**శాస్త్రాద్బుద్ధం బ్రహ్మత త్త్వమాత్మత్వేనానుభూయతామ్ ॥**

తన యాత్మతత్త్వము ప్రసన్న మగుటచేత బ్రహ్మతత్త్వము ప్రసన్న మగును అంతవఱకు శాస్త్రమువలన దెలిసికొనిన బ్రహ్మతత్త్వము తానే యని యనుభవము నొందగలుగును

**అజం ధ్రువం మాయికై స్తైః కార్యైః సర్వైర్వివర్జితమ్ ।**
**జ్ఞాత్వా దేవం పరాత్మానం సర్వపాపైర్విముచ్యతే ॥**

జన్మము లేనిది, నిత్యమైనది, ఆయా మాయాకార్యములు లేనిదియు నగు దానినిగా పరమాత్మను దెలిసికొని సర్వపాపములచే విడువంబడును

**ఏష దేవః సర్వదిశు వహ్న్యాదిష్వఖిలేషు చ ।**
**వర్తతే తం విచింత్యాథ ప్రణమేత్సర్వదైవతమ్ ॥**

ఈదేవుడన్నిదిక్కులయందును, అగ్ని మొదలయిన అన్ని వస్తువులయందును గలడు అతనిని ధ్యానించి సర్వకాలములందును అతనికి నమస్కరింపవలయును

ఇక మనుమహర్షి మనుస్మృతియందు కట్టకడపటి యధ్యాయమునందు తెలిపిన భావమును గుఱించి చూడుడు –

**యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః ।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్ ॥**

మానవుడు శాస్త్రవిహితములగు ఇదివరలో జెప్పబడిన అగ్నిహోత్ర నిత్యనైమిత్తిక కర్మల నాచరించక పోయినను పరమాత్మచింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము (ఉపనిషదాది పారాయణము) – వీనియందైనను ప్రయత్నము గలిగియుండవలయును

అన్ని యనుష్ఠానములను జేయకపోయినను పైజెప్పిన మూడింటి యందైనను ప్రయత్నవంతుడై యుండవలయునని మనుపుపదేశించెను ఇది సామాన్యజనులకు సయితము సాధ్యమైనదే అంతమాత్రముగూడ జేయక పోయిన ఆత్మశుద్ధి యెట్లు గలుగును? మోక్షసౌఖ్యమును ఎట్లు బొందగలుగును?

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సమస్త ధర్మములను విడిచి నన్నొకనినిమాత్రము శరణుబొందుము అట్లయిన నేను నిన్ను సమస్త పాపములనుండి విముక్తునిగా జేసెదను, దుఃఖింపకుము

మనుమహర్షి సమస్తధర్మములను సంగ్రహించి ఆత్మజ్ఞానము,

ఇంద్రియ నిగ్రహము, ప్రణవజపము అను మూడు విషయములనైన తప్పక యనుష్ఠించు విధమును ఉపదేశించెను శ్రీకృష్ణభగవానుడు ఇంకను ధర్మములను సంక్షేపమొనర్చి యొక్క అనన్య భగవచ్చింతనమునే యుపదేశించెను మనువు కృతయుగమందుండినవాడు అందువలన పైజెప్పిన మూడు ధర్మములనైన ఆచరించు లాగున దెలిపెను

శ్రీకృష్ణభగవానుడు ద్వాపరాంతమునందుండిన వాడగుటచే కాలగతి నాలోచించి మనువు చెప్పిన మూడు వాక్యములనుగూడ మానవు డనుష్ఠించలేడని తలంచి ఒక్క అనన్యభక్తి నైన గలిగియుండు లాగున నుపదేశించెను ఇది శ్రీభగవద్గీత యొక్క యంతిమోపదేశము ( అ 18 శ్లో॥ 66) గీతయొక్క ఋష్యాది న్యాసములలో దీనిని గీతయొక్క శక్తియనియు, గీతయొక్క కీలకమనియు తెలుపడమైనది "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః

**"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి కీలకమ్"॥**

అనన్యభక్తి యనగా సామాన్యమని తలంచరాదు దీనికే చరమశ్లోక మని పేరు గలిగియున్నది హృదయములో నొకే దైవచింతన దప్ప, దైవ భావము దప్ప ఇతర సంకల్పములుగాని భావములుగాని జనింపగూడదు ఇట్టివారికి భగవత్ప్రాప్తి గలుగుటకు గల విఘ్నము లన్నిటిని దొలగించి భగవానుడే మోక్షమును గలుగజేయును సంశయము లేదు



# నాల్గవ భాగము

## నిరతిశయానంద బ్రహ్మప్రాప్తి

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

పూర్ణం–అదః–పూర్ణం– ఇదం–పూర్ణాత్–పూర్ణం– ఉదచ్యతే – పూర్ణస్య – పూర్ణం – ఆదాయ – పూర్ణం – ఏవ – అవశిష్యతే॥

అదః = పరోక్షమగు పరబ్రహ్మము, పూర్ణం=అంతటను నిండి యున్నది, ఇదం= నామరూపాత్మకమై ప్రత్యక్షమగు బ్రహ్మము, పూర్ణం= పరమాత్మ రూపముతో నంతటను వ్యాపించియున్నది పూర్ణాత్ = కారణబ్రహ్మమునుండి, పూర్ణం = కార్యబ్రహ్మము ఉదచ్యతే = ప్రకట మగుచున్నది పూర్ణస్య = కార్యాత్మక బ్రహ్మముయొక్క, పూర్ణం = ఆత్మస్వరూపత్వమును, ఆదాయ=గ్రహించి, పూర్ణమేవ=పరిపూర్ణ పరబ్రహమే, అవశిష్యతే=మిగులుచున్నది

ఈ పరబ్రహ్మము, ఆకాశమువలె సర్వత్ర వ్యాపించి నిరుపాధికమై యున్నది వ్యవహార యోగ్యమైన ఈ సోపాధిక బ్రహ్మము పరమాత్మ స్వరూపముతో వ్యాపించియున్నది నిరుపాధిక కారణబ్రహ్మమునుండి సోపాధిక కార్యబ్రహ్మము ప్రకటమగుచున్నది కార్యబ్రహ్మమునకు ఆత్మ స్వరూపైకరసత్వమును బొందించి (జ్ఞానముచే తత్తదుపాధిగత సంబంధమును దూరీకరించి) పరిపూర్ణబ్రహ్మమే ప్రజ్ఞానఘనమై శేషించియున్నది దోషత్రయ నివారణకొఱకు శాన్తిత్రయ మేర్పడినది అని మొదటనే వ్రాయడమైనది

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్నసుషుప్తులు మొదలుగా గల ఈదేహేంద్రియ ప్రపంచము

లను ఏ యాత్మ ప్రకాశింపజేయుచున్నదో, అట్టి యాత్మను పరమాత్మ స్వరూపముగా దెలిసికొనినవాడు సమస్త బంధములనుండి విముక్తుడై పర బ్రహ్మాకార స్థితి గలవాడగుచున్నాడు (కైవల్యోపనిషత్తు)

ఇట్టిభావన ఒక్కదానివలన సమస్తబంధములును, విఘ్నములును దొలగిపోవును మొట్టమొదట అట్టి భావన గలుగుటకు కొంత ప్రయాసగా నుండినను ఎప్పటికినైన నిట్టి స్థితి గలుగనిచో బంధనములుగాని, విఘ్నములు గాని తొలగవు నిరతిశయానంద బ్రహ్మప్రాప్తియు సిద్ధించదు ఇది ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అను మహావాక్యమునకు సంబంధించినది యగును

గాలిలేని స్థలమున ప్రమిద, తైలము, వత్తియు నమర్చిన తదుపరి దీపమును వెలిగించిన నెట్లు వెలుగునో, ఆలాగున నిర్వాసనస్థలమను వాయువులేని ప్రదేశము, వైరాగ్య మను ప్రమిద, అనన్యదైవభక్తియను తైలమును ఏర్పడిన పిమ్మటనే ''తత్త్వమసి'' అను మహావాక్యము నుపదేశించిన ''అహం బ్రహ్మాస్మి''యను జ్ఞానజ్యోతి వెలుగుచుండును దీపము వెలిగిన వెంటనే చీకటి పారిపోవునట్లు ఆత్మజ్యోతి వెలిగిన తత్‌క్షణమే యవిద్య హృదయమునుండి వెడలిపోవును ప్రమిద, తైలము, వత్తి సరిగా లేని గాలి గల స్థలములో వెయ్యి నిప్పుపుల్లలు గీచి వెలిగించినను దీపము మండని విధమున పైజెప్పిన నాలుగు సాధనలు గలుగనిచో తత్త్వమసి మహావాక్యము నెంతకాలము శ్రవణము చేసినను బ్రహ్మజ్ఞానోదయము గలుగదు పూర్విక ఋషులకును, వర్తమాన జనులకును ఇచటనే భేదమేర్పడినది అందువలననే నాలుగువేదముల సారమగు నాలుగు మహావాక్యములను ఇప్పుడుండు ముముక్షువులు శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులు చేసియు ఫలమును బొందకపోవుచున్నారు మఱియు ప్రస్తుత జనులలో చాలమంది శ్రవణము మాత్రముచేతనే తృప్తులగుచున్నారు మనన, నిదిధ్యాసనలను జేయువారు చాల అరుదైరి ఆ కారణమువలనను పూర్విక ఋషుల స్థానమును బొందజాలరైరి

దీనియందు మఱియొక రహస్యముగూడ గలదు బంగారము, వెండి,

రాగి, ఇత్తడి మొదలైన లోహములతో జేయబడిన ప్రమిదలైనను విరోధము లేదు తైలము, వత్తి, గాలిలేని ప్రదేశముండి వెలిగించినచో దీపము వెలుగుచుండును అట్లయిన బదరికాశ్రమమునందుగాని, హృషీకేశమునందుగాని, కాశియందుగాని, స్వగృహమందుగాని యుండినను దీపము వెలుగును పైసాధనలు నాలుగు గలిగి యుండినచో ఎచ్చోట నుండినను ఆత్మజ్ఞానజ్యోతి వెలుగును లేనిచో నెచ్చట నుంచినను వెలుగదు మఱియు నాలుగు విధములగు లోహములను చెప్పినట్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులైనను విరోధమేమియు లేదు సాధనములు నాలుగింటిని కలిగి యుండిన చాలును ఇంకను వినుడు ఆపాత్రలు ఎఱుపు, తెలుపు, పసుపు, నలుపు రంగులను కలిగియున్నను బాధ ఏమియు లేదు ఆలాగుననే సన్న్యాసి, వానప్రస్థ, గృహస్థ, బ్రహ్మచారులైనను విరోధ ముండనేరదు సాధనములు నాలుగు గలిగియుండిన చాలును

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః**
**శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః ।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా**
**ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥**

ఈ ఆత్మ యనేకులచేత శ్రవణమునకును పొందబడుట లేదు ఈ యాత్మను అనేకులు వినుచున్నను తెలిసికొనజాలరు ఈ ఆత్మనుగూర్చి చెప్పువా రరుదు ఈ ఆత్మను నిపుణముగా గ్రహించిన వారును అరుదు నిపుణుడైన ఆచార్యునిచే సుశిక్షితుడైన జ్ఞాతయు అరుదు (కఠోపనిషత్తు)

వేలకొలది జనులలో పుణ్యవిశేషముచేతను, ఈశ్వరుని యనుగ్రహముచేతను ఆత్మసంస్కారము గల జీవు లరుదు వారిలో నుత్తమ, మధ్యమ, మంద, తీవ్రాధికారులను తారతమ్య ముంటున్నది కావుననే కొందరు శ్రవణము మాత్రమే చేయుదురు మఱికొందరు మననమును గొంతవరకు శీలింతురు ఇకకొందరు నిదిధ్యానములోనికి ప్రవేశింతురు సాక్షాత్కారము వరకు అనుష్ఠించువారు చాల అరుదుగా నుందురు అయితే

దీనియందొక రహస్యము గలదు ఏ ఏ జన్మములో ఏయే స్థితిలోనికి వచ్చునప్పు డేయే కారణములచే ఈ దేహము పతనమై పోయినను మఱల వచ్చెడి జన్మలో నిపుడు గలిగియుండు ప్రతిబంధములు లేని జన్మము తప్పక గలుగును ఇది బ్రహ్మవిద్యానుష్ఠానములో గల ఫలితము గీతయందును శ్రీకృష్ణభగవాను డీలాగున వచించెను-

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వే త్తి త త్త్వతః ॥**

మనుష్యులలో వేలకొలది సంఖ్యలయం దొకానొకడు పూర్వపుణ్య విశేషములచే ఆత్మజ్ఞానసిద్ధికి యత్నించుచుండును అట్లు యత్నము జేయువారలలో జ్ఞానసిద్ధిని బొందినవారిలో సయితము ఒకానొకడు నన్ను (పరమాత్మను) బొందగలుగుచున్నాడు

ఇచటగూడ ప్రారంభించినవాడు పూర్ణత్వమును బొందక పోయినను విరోధము లేదు పుణ్యాత్ముల లోకమును బొంది మఱల పూర్ణత్వమును బొందుటకు దగిన ప్రజ్ఞయు, జ్ఞానమును, బలమును గల జన్మము నొందును

**ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥** అని గీత

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥** (కఠోపనిషత్తు)

ఎవనియొక్క అంతఃకరణములోగల సమస్త ప్రపంచ వాసనా రూపమగు వృత్తులు సంపూర్ణముగా వదలిపోవునో, అట్టి బ్రహ్మనిష్ఠు డిచటనే యమృతత్వమును బొందుచున్నాడు ఈ దేహముతో గూడియున్నప్పుడే బ్రహ్మమును బొందుచున్నాడు అని కఠవల్లి శ్రుతి

ముక్తియనగా విడుదల అని యర్థము దేనినుండి విడుదల? ఆత్మ కనాత్మ వస్తువులతోగల బంధములనుండి విడుదల యని భావము అది

ఇచట జీవించి యున్నప్పుడే గలుగవలయును కావుననే ఆముక్తి జీవ న్ముక్తి అని పేర్కొనబడినది మరియు ''అత్ర బ్రహ్మ సమశ్నుతే'' అని చెప్పబడినది

**ఏకాకీ రమతే నిత్యం స్వభావగుణవర్జితః ।**
**బ్రహ్మజ్ఞానరసాస్వాదీ జీవన్ముక్తస్స ఉచ్యతే ॥**

ఎవ డేకాంతమునందు ఏకాకియై ఇదివరలో గలిగియుండు ప్రకృతి గుణములను విడిచి బ్రహ్మజ్ఞానామృతముచే తృప్తుడగునో వాడు జీవన్ముక్తుడని వచింపబడుచున్నాడు అని జీవన్ముక్త గీత

స్వభావగుణ మనగా నిది నా జాతిస్వభావము, నా దేహ స్వభావము, నా వాక్కుయొక్క స్వభావము, నా యాశ్రమస్వభావము, నా మానసిక స్వభావము, నాదేశస్వభావము అని యీలాగున స్వభావమును గురించి గొప్పగా జెప్పుకొనువారు కొంతమంది గలరు ఈ స్వభావములను త్యజించవలయు నని విజ్ఞు లుపదేశించినను, ఇది నా పూర్వజన్మకర్మస్వభావమని వీరముగా బలుకువారుగూడ లేకపోలేదు ఆత్మజ్ఞాని యీ స్వభావమును దేహసంబంధము, మానసిక స్వభావమని తలంచి అతనిని ననాత్మ స్వభావము గలవానినిగా గుర్తించి ఆత్మయొక్క స్వభావము బొత్తిగా తెలియని వాడనియే తలంచును

ఆత్మానాత్మ విచారణచే, పైజెప్పిన స్వభావము లన్నియు అనాత్మ స్వభావములని త్యజించి, తన యాత్మస్వరూపముయొక్క లక్షణమును గ్రహించుకొన్నప్పుడే ముక్తి గలుగును అట్లుగాక ఒకడు ధరించియుండు తెలుపు, నలుపు , ఎఱుపు, పసుపు రంగులుగల ఉడుపులను జూచి నీ వెవరవని యడిగినచో తాను ధరించిన యుడుపుల యాకృతిని రంగులను జూపి అదే తానని చెప్పినచో అట్టి వానిని జూచి జనులేమి తలంతురు? ఇతడు పిచ్చివాడని గ్రహింతురు అట్టి భ్రమలేని మానవుండైన తన పేరును, జాతినిమాత్రమే చెప్పును ఆలాగున అజ్ఞానభ్రాన్తిగల మానవుడు పైజెప్పిన స్వభావము తానని వచించును ఈ విషయమై శంకరాచార్యులు తెలిపినది చూడుడు–

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావస్సచ్చిదానంతనిత్యనిర్మలతాఽఽత్మనః ॥**

సూర్యునకు ప్రకాశమును, నీళ్ళకు చల్లదనము, అగ్నికి ఉష్ణత్వమును స్వతస్సిద్ధమైన స్వభావ మైనట్లు, ఆత్మకు సత్ చిత్ ఆనందాదులే స్వభావమని ముముక్షువు తెలిసికొనవలయును

**ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥**

ప్రశాన్తమైన మనస్సు గలవాడును, రజోగుణము నశించినవాడును, కల్మషరహితుడును, బ్రహ్మమే తనయాత్మ యను నిశ్చయము గలవాడు నగు యోగిని ఉత్తమమైన నిరతిశయానందము వచ్చి పొందును

ఈశ్లోకమున చెప్పిన గుణములు గలవానిని నిరతిశయానందము స్వయముగా వచ్చి వరించునని తెలుపడమైనది విరక్తుడై యాత్మనిష్ఠ గలవాడు మోక్షముకొఱకు ప్రయత్నింప నక్కరలేదు మోక్షము వచ్చి వీనిని వరించును ఇట్టి విరాగిని బ్రహ్మనిష్ఠుని ముక్తికాంత స్వయముగా వచ్చి వరించును అట్లు గానివాడు మోక్షము కొఱకు వెదకి వెదకి ప్రార్థించినను లభించదు రాచకన్య ధీరుడైన రాకుమారుని వరించునేగాని, రోగిష్ఠుడు, హీనకుల సంజాతుడగు వాడు కోరినను దొరకునా? మోక్షలక్ష్మి యను ముక్తికాంతయొక్క స్థితి యీలాగున నుండును మఱియు బ్రహ్మచర్య వ్రతనిష్ఠగలవాడును, వేదాధ్యయన పరుడును, ఇంద్రియజయము గలవాడును నగు బ్రాహ్మణునికి శ్రేష్ఠకులజాలు శ్రీమంతులును నగు విప్రులు సుగుణనిధియు, విద్యావతియునగు తమకన్నెను దానము చేయుదురేగాని హీనజాతిసంజాతుడును, దుర్గుణభూయిష్ఠుడునగు వాడెంత ధనమిచ్చినను, ప్రాధేయపడినను ఇవ్వనేర్తురా? బ్రహ్మజ్ఞానముయొక్క స్థితియునీలాగున నుండును

**అచ్యుతోఽహమనన్తోఽహం గోవిందోఽహమహం శివః ।**

**ఆనన్దోఽహమశేషోఽహమజోఽహమమృతోఽస్మ్యహమ్ ॥**

**నిత్యోఽహం నిర్వికల్పోఽహం నిరాకారోఽహమవ్యయః ।**
**సచ్చిదానందరూపోఽహం పరిపూర్ణోఽస్మి సర్వదా ॥**

**బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహమితి నిశ్చయః ।**
**శుద్ధబోధస్వరూపోఽహం నిర్మలోఽహం సనాతనః ॥**

నేనచ్యుతుండను, నేననంతుండను, నేను గోవిందుడను, నేను శివుడను, నే నానందస్వరూపుడను, నే నశేషుండను, నే నజాడను, నే నమృత స్వరూపుడను అగుచున్నాను నేను నిత్యుండను, నేను నిర్వికల్పస్వరూపుడను, నేను నిరాకారుండను, నే నవ్యయుండను, నేను సచ్చిదానంద స్వరూపుడను, నే నెల్లప్పుడు పరిపూర్ణ స్వరూపుండనుగా నుంటున్నాను నేను పరబ్రహ్మస్వరూపుడను, నేను సంసారినిగాను, నేను ముక్తుండను ఇది నిశ్చయము నేను శుద్ధబోధస్వరూపుండను, నేను నిర్మలుండను, నేను సనాతనుడనై యుంటున్నాను ఇట్లు శ్రీవేదవ్యాసులు మానసిక స్నానవిధి యందు భావనచేయుట కుపదేశించిరి ఇట్టి బ్రహ్మభావనవలననే జీవుని యొక్క అజ్ఞానము నశించునుగాని వేరుమార్గమున నశించదు జలస్నానముచే దేహమలము నశించునేగాని ఆత్మమలము నశించదు

**ధ్యానహ్రదే జ్ఞానజలే రాగద్వేషమలాపహే ।**
**యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్ ॥**

ధ్యానమను అగాధమగు మడుగునందు, రాగద్వేషములనెడి మలినమును పోగొట్టు జ్ఞానజలమందు ఎవడు స్నానమాచరించునో అతడు అజ్ఞానమను మాలిన్యము లేనివాడై సర్వోత్తమమగు బ్రహ్మమును బొందుచున్నాడు

కావున బాహ్యతీర్థములలో స్నానమాచరించినందుచే కృతార్థుడ నైతినని తలంచి మోసపోక ఆత్మతీర్థములో స్నానము చేయులాగున జూడ వలయును భారతమున ధర్మరాజు, భీష్ముని తీర్థమాహాత్మ్యమును అడిగి

నప్పుడు సమస్తతీర్థములయొక్క మహిమయు, స్నానవిధియు, అనంతరము జేయవలసిన దాన ధ్యానములను గుఱించి తెలిపి చివరి కీయాత్మతీర్థమును గురించిన ఒక శ్లోకము నుపదేశించెను తీర్థయాత్ర చేయువారు స్నానము, దానము, ధ్యానము అను నంతిమ నకారత్రయమును గలిగి యుండవలయు నని వచించిరి శాంతిపర్వమున భీష్ముడు చెప్పిన శ్లోకము-

**ఆత్మానదీ సంయమతోయపూర్ణా సత్యహ్రదా శీలతటాదయోర్మిః ।**
**తత్రావగాహం కురు పాణ్డుపుత్ర న హ్యన్యథా శుధ్యతి చాంతరాత్మా ॥**

ఆత్మ యనునది యింద్రియముల సంయమమను జలములతో నిండినది సత్యమను మడుగుతో గూడినది పవిత్రశీలమను తీర్థములతో గూడినది జీవరాసులలో కరుణయను నలలతో గూడినది ఓ ధర్మరాజా! అట్టి నదిలో స్నానమాచరింపుమా! వేరు ఏ విధమైన దానివలనను అంత రాత్మశుద్ధి కాజాలదు

**ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తై రేవ విగతశ్శుద్ధః పరమాత్మేతి గద్యతే ॥**

ఆత్మయనియు, జీవాత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు పేరు గల ఈ యాత్మవస్తువు ప్రకృతిగుణములను సత్త్వరజస్తమస్సులచే బద్ధుడై జీవుడను పేరు గలిగియుండును అట్టి ప్రకృతిసంబంధ త్రిగుణములనుండి బ్రహ్మ నిష్ఠానుష్ఠానముచే శుద్ధుడై విడుదల పొందునప్పుడు పరమాత్మ యని చెప్ప బడుచున్నది అని విష్ణుపురాణము

ప్రకృతితో గూడియున్నప్పుడు జీవుడనియు, ప్రకృతినుండి విముక్తిని బొందినప్పుడు శివుడనియు గ్రహించదగినది ఈవిషయమై యిదివరలో అపరంజి బంగారపు దృష్టాంతము తెలుపడమైనది

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ యాత్మలాభముకంటె అనగా బ్రహ్మప్రాప్తికంటె వేరు లాభము లేదో, యే జ్ఞానసుఖముకంటె వేరుసుఖము లేదో, యే యొక్క జ్ఞానమును తెలిసి కొనుటకంటె వేరుగ తెలియందగినది లేదో, అదియే బ్రహ్మమని నిశ్చయముగా తెలిసికొనవలయును అని యాత్మబోధము

బ్రహ్మప్రాప్తికి మించిన లాభముగాని, సుఖముగాని, జ్ఞానముగాని మఱియొకటి లేదని గ్రహించినవాడే ఆత్మజ్ఞానముయొక్క మహిమను ఎఱింగినవాడు ఏలన తక్కినవన్నియు నశించును ఈ యాత్మజ్ఞాన మొక్కటియే నాశము లేనిది

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాన్త్యజోఽపి వా ।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

ఆత్మనిష్ఠాపరమగు జ్ఞానయజ్ఞమనెడి యోడచే బ్రాహ్మణుడైనను సరి, అంత్యజుడైనను సరి ఈ దుఃఖసాగరమను సంసారమునుండి తరించినవాడై నిత్యశాంతియు, శాశ్వతసుఖమగు మోక్షమును బొందగలుగును

బ్రహ్మజ్ఞానము గలవా డెవ్వడైనను సంసారసాగరమును దాటి మోక్షపుదరిని జేరగలుగును

**ధర్మమేఘమిమం ప్రాహుస్సమాధిం యోగవిత్తమాః ।**
**వర్షత్యేష యతో ధర్మామృతధారాస్సహస్రశః ॥** (పంచదశి)

బ్రహ్మజ్ఞానులగు మహాత్ములు నిర్వికల్పసమాధిని (ఆత్మసాక్షాత్కారజ్ఞానమును) ధర్మమేఘమునుగా వర్ణించియున్నారు మేఘము కుంభవృష్టి చేయునట్లు ఈనిర్వికల్పసమాధి పుణ్యలక్షణములైన యమృతధారలను అపరిమితముగాను, సహస్ర సంఖ్యాకములుగాను వర్షించుచున్నది

ఇట్టి మహిమాతిశయ మీ యాత్మజ్ఞానమునందు లేనిచో రారాజులు, చక్రవర్తులు సహా వార్ధక్య దశారంభమునందు రాజ్యమును, రాజభోగమును త్యజించి వనమునకేగి యోగనిష్ఠ నవలంబింతురా?

**ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి ।**
**ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానన్దో విభాతి మే స్పష్టమ్ ॥**

సర్వదా నాయొక్క నిజరూపమగు దేశకాలాద్యనవచ్ఛిన్న ప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెఱిగితిని అందువలననే నేను కృతార్థుడనైతిని కృతార్థుడనైతిని మఱియు బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది అందువలన నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని

**ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య ।**
**ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి ॥**

మఱియు నిప్పుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేను చూచుచున్నవాడను గాను అందుచే నేను కృతార్థుడనైతిని నేను కృతార్థుడనైతిని నాయొక్క అనేక జన్మకర్మవాసనా సమూహము గల అజ్ఞానము ఎక్కడనో పారిపోయెను (నశించెను) అందుచేత నేను కృతార్థుడ నైతిని నేను కృతార్థుడ నైతిని

**ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్ ।**
**ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥**

మఱియు నాకు జేయందగినది కొంచెమైనను ఇప్పుడు లేనందున నేను కృతార్థుడ నైతిని నేను కృతార్థుడ నైతిని మఱియు పొందదగిన ఫలవర్గమంతయు ఇప్పుడు నాచే పొందబడినట్లాయెను కనుక నేను కృతార్థుడ నైతిని నేను కృతార్థుడ నైతిని

**ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవే లోకే ।**
**ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః ॥**

మఱియు నాయొక్క తృప్తికి సమానమైన వస్తువెద్దియు లోకమునందు లేదు అందువలన నేను ధన్యుడ నైతిని నేను ధన్యుడ నైతిని. ఈ

తృప్తికంటె మఱి యొకటి చెప్పందగినది కనబడని కారణముచేత నేను కృతార్థుడ నైతిని నేను కృతార్థుడ నైతిని మాటిమాటికి కృతార్థుడ నైతిని నేను కృతార్థుడ నైతిని, కృతార్థుడ నైతిని

**అహో పుణ్యమహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।**
**అస్య పుణ్యస్య సంపత్తే రహో వయమహో వయమ్ ॥**

ఆహా! నాయొక్క పుణ్యము దృఢముగా ఫలించెను ఓహో! నా యొక్క పుణ్యము దృఢముగా ఫలించెను ఈ పుణ్యసంపత్తివలన నోహో మేము ధన్యులము, అహో మేమే ధన్యులము

**అహో శాస్త్రమహో శాస్త్రమహో గురురహో గురుః ।**
**అహో జ్ఞానమహో జ్ఞానమహో సుఖమహో సుఖమ్ ॥**

**(దత్తాత్రేయోపనిషత్తు.)**

వేదాంతశాస్త్ర మెంత మనోహరము! వేదాంతశాస్త్రము ఓహో, ఎంత సారమైనది! ఓహో, వేదాంతగురు వెంత గొప్పవాడు! ఓహో, మాగురు వెంతగొప్పవాడు! ఓహో, అద్వైతాత్మ తత్త్వజ్ఞానమెంత మంచిది! అహో, అద్వైతాత్మ తత్త్వజ్ఞానమెంత సారమైనది! ఓహో మా యాత్మసుఖ మెంత గొప్పది! ఓహో! మా సుఖ మెటువంటిది, ఓహో! ఆశ్చర్య మాశ్చర్యము!!

దత్తాత్రేయులకు కలిగిన యానందావిర్భావము పట్టజాలక తాండవము చేసి యిట్లు వచించిరి నిరతిశయానందమనియు, అతిహర్ష మనియు దీనికి పేరుగలదు అందువల్ల ద్విరుక్తప్రయోగ మిచ్చోట దోషము గాదు ఆత్మజ్ఞానముయొక్క మహిమ యెట్టిదియో దీనివలన తెలిసికొనవచ్చును ఇట్టి మహిమ దీనియందు లేనిచో శ్రీబుద్ధ, శ్రీశంకర, శ్రీదయానంద, శ్రీవివేకానంద ప్రభృతులు బాహ్యలోకమును త్యజించి, ఆత్మలోకములో ప్రవేశింతురా?

**వాఞ్ఛంతి జన్మ మానుష్యం భువి దేవాశ్శతక్రతుః ।**
**చిద్విద్యాయాం పరోఽపాస్తో యతో నాన్యోఽధికారభాక్ ॥**

ఇంద్రుడును, దేవతలును ఎప్పుడెప్పుడు భూలోకములో మనుజ జన్మము లభించునాయని వాంఛించుచుందురు ఏలన బ్రహ్మవిద్యను సాధించి ముక్తిని బొందుటకు మనుష్యశరీరము తప్ప వేరు ఏ జన్మము నెత్తినవారికిని సాధ్యపడదు

దీనివల్ల మానవజన్మముయొక్క మహిమ యెట్టిదో తెలిసికొనవచ్చును దేవతలు ఒకానొకప్పుడు భూలోకమున మనుష్యులై యుండి యజ్ఞాది క్రతువు లొనర్చి స్వర్గలోకమును బొందిరి "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" ఆపుణ్యము నశించిన మఱల భూలోకములో మనుష్యులై పుట్టవలసి యుందురు ఇచటనే తపమొనర్చి జ్ఞానమును బొంది ముక్తులు గావలసి యున్నారు ఈ విషయమై కఠోపనిషత్తు నుడివినది చూడుడు-

**యథాఽఽదర్శే తథాఽఽత్మని**
**యథా స్వప్నే తథా పితృలోకే।**
**యథాఽప్సు పరీవ దదృశే తథా గన్ధర్వలోకే**
**ఛాయాఽఽతపయోరివ బ్రహ్మలోకే॥**

ఏవిధముగా అద్దమునందు తన ప్రతిబింబము స్పష్టముగా గనబడు చున్నదో, అదే విధముగా నిర్మలమైన మనుష్యబుద్ధియందు ఆత్మదర్శనము స్పష్టముగా నగుచున్నది స్వప్నమునందు తన దేహమేలాగున వికార రూప ముగా కనబడుచుండునో, పితృలోకమందును ఆలాగుననే యుండును నీటియందు తనముఖ ప్రతిబింబము స్పష్టముగా దెలియక ఎట్లు విభ క్తావయవములుగ కనబడుచుండునో, అట్లే గన్ధర్వలోకమున (స్వర్గలో కమున) ఆత్మదర్శనము స్పష్టముగా గలుగజాలదు మఱియు బ్రహ్మలోక మందుగూడ ఛాయాఽఽతపములవలె అనగా తనయొక్క నీడవలె అస్పష్టముగానే కనబడును కావున దీనిని బట్టి యాలోచించిన మానవుని

జన్మ యెట్టి గొప్పతనమును గలిగినదో గ్రహించుకొనవచ్చును

కుక్కకు టెంకాయ దొరకినట్లును కోతికి రత్నహారము లభించి నట్లును సామాన్యమానవులు మానవ జన్మము దొరకియు దానిచే బొందెడి ఫలమును బొందకయున్నారు

**సృష్ట్వా పురాణి వివిధాన్యజయాఽఽత్మశక్త్యా**
**వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశుమత్స్యాన్ ।**
**తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ**
**బ్రహ్మావలోకధిషణ ముదమాప దేవః ॥**

బ్రహ్మదేవుడు తనశక్తిచే వృక్ష, సర్ప, పశు, పక్ష్యాది వివిధ జంతువు లను సృజించి సంతోషింపక, మానవుని సృజించి యతడు పరబ్రహ్మస్వరూప మును తెలిసికొనుటకు తగిన బుద్ధిగలవాడని తలంచి సంతసించెను అని భాగవతము

బ్రహ్మదేవుడు సమస్త చరాచర ప్రాణికోటు లన్నిటిని సృష్టించిన తదుపరి వాటికి, వేటికిని ఆత్మజ్ఞానస్వరూపమును తెలిసికొనెడి శక్తి లేకపోవుట చేత తనసృష్టి నిరుపయోగమైనది గదా యని తలంచి విషాదపడెనట తరువాత మఱింత తపస్సుచేసి, ఆత్మశక్తిని కేంద్రీకరించి బ్రహ్మస్వరూపమును తెలిసికొనే లాగున మానవుని సృష్టించెను అతనిని పరీక్షించి బ్రహ్మావ లోకమును జేయందగిన బుద్ధిగలవాడని తలంచి, ఇప్పుడు తన సృష్టి సార్ధక మైనదని తలంచి యానంద భరితుడాయెను పైకరోపనిషత్తు వాక్యమును ఈ భాగవత వాక్యమును గ్రహించిన మానవజన్మయొక్క యుత్కృష్టత గ్రహించుకొనవచ్చును శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు ''జంతూనాం నరజన్మ దుర్లభమ్'' అనియు, ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవానుడు –

**ఆహారనిద్రాభయమైథునాని సామన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణామధికో విశేషో జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః ॥**

అనియు వచించిరి మరియు ''దుర్లభో మానుషో దేహః ప్రాణినాం క్షణ భంగురః'' అని భాగవతము తెలుపుచున్నది ఇక నీ విషయమై యెన్నియో ప్రమాణములు గలవు

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

బ్రహ్మాత్మైక్యజ్ఞానము దృఢముగ గలుగవరకు శమదమాది ధర్మములతో గూడినవాడై వేదాంత శ్రవణ, మనన, నిదిధ్యాసములను బ్రహ్మనిష్ఠులు తప్పక యభ్యసింపవలయును

రోగియైనవాడు సంపూర్ణారోగ్యము గలుగువరకు ఔషధపథ్యాదు లెట్లు గలిగియుండవలయునో, ఆలాగున భవరోగముగల జీవులుగూడ ప్రకృతిదోషము నశించువరకు బ్రహ్మాభ్యాసము, ఆహార నియమము, నివాసస్థల యోగ్యతయు గలిగియుండవలయును పూర్వీక ఋషు లాలాగున నుండిరి వర్తమాన ముముక్షువు లట్లు చేయకపోవుటయే సంపూర్ణ భవరోగ విముక్తులు గాకపోవుటకు గారణము

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।**
**పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

నిశ్చయబుద్ధి గలవానిచేత నేవస్తువు తీవ్రవేగముతో రేయింబవళ్ళు భావింపబడుచున్నదో అట్టి జ్ఞేయవస్తువును భ్రమరకీటకమువలె నతడు పొందు చున్నాడు (అపరోక్షానుభూతి)

కీటకము ఎడతెగక భ్రమరమును భావనచేయుటచే తుమ్మెదగా మారునట్లు జీవుడున్ను ఎడతెరపిలేక బ్రహ్మభావన చేయుచుండవలయును

**అఖండైక రసం బ్రహ్మ చాఖండైకరసం వ్రతమ్ ।**
**అఖండైక రసో జీవ శ్చాఖండైకరసో హ్యజః ॥** 1

**అఖండైక రసో బ్రహ్మ చాఖండైక రసో హరిః ।**

అఖండైక రసో రుద్ర శ్చాఖండైక రసోఽస్మ్యహమ్ ॥ 2

అఖండైక రసో హ్యాత్మా హ్యాఖండైక రసో గురుః ।
అఖండైక రసం లక్ష్యమఖండైక రసం మహః ॥ 3

అఖండైక రసో దేహ శ్చాఖండైక రసం మనః ।
అఖండైక రసం చిత్తమఖండైక రసం సుఖమ్ ॥ 4

అఖండైక రసం కించి దఖండైక రసం పరమ్ ।
అఖండైక రసాదన్యత్ నాస్తి నాస్తి షడానన ॥ 5

అఖండైక రసం సర్వం చిన్మాత్రమితి భావయేత్ ।
చిన్మాత్రమేవ చిన్మాత్రమఖండైకరసం పరమ్ ॥ 6

భవవర్జిత చిన్మాత్రం సర్వం చిన్మాత్రమేవ హి ।
ఇదం చ సర్వం చిన్మాత్రమయం చిన్మయమేవ హి ॥ 1

చిత్తవృత్తివిహీనోఽహం చిదాత్మైకరసోఽస్మ్యహమ్ ।
సర్వదృశ్యవిహీనోఽహం దృగ్రూపోఽస్మ్యహమేవ హి ॥ 2

చిద్రూపమాత్రబ్రహ్మైవ సచ్చిదానందమద్వయమ్ ।
ఆనందఘన ఏవాహమహం బ్రహ్మాఽస్మి కేవలమ్ ॥ 3

సత్యానందస్వరూపోఽహం జ్ఞానానందఘనోఽస్మ్యహమ్ ।
విజ్ఞానమాత్రరూపోఽహం సచ్చిదానంద లక్షణః ॥ 4

బంధముక్తి విహీనోఽహం శాశ్వతానంద విగ్రహః ।
ఆద్విచైతన్యమాత్రోఽహ మఖండైక రసోఽస్మ్యహమ్ ॥ 5

ముక్తోఽహం మోక్షరూపోఽహం నిర్వాణసుఖరూపవాన్
నిత్యవిజ్ఞానమాత్రోఽహం సన్మాత్రానందవానహమ్ ॥ 6

అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం దేహదోషం వినాశయేత్ ।
అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం జన్మపాపం వినాశయేత్ ॥ 1

**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం మృత్యుపాశం వినాశయేత్ ।**
**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం ద్వైతదుఃఖం వినాశయేత్ ॥ 2**

**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం భేదబుద్ధిం వినాశయేత్ ।**
**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం చిన్తాదుఃఖం వినాశయేత్ ॥ 3**

**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్।**
**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం జ్ఞానానందం ప్రయచ్ఛతి ॥ 4**

**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం సర్వశోకం వినాశయేత్ ।**
**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం దృశ్యపాపం వినాశయేత్ ॥ 5**

**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం క్రోధశక్తిం వినాశయేత్ ।**
**అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్ ॥ 6**

(ధ్యానబిందూపనిషత్తు.)

ఇది ధ్యానానంతరము పగలు పారాయణచేయుటకు తగినది అర్థము సులభగ్రాహ్య మగుటచేత తాత్పర్యము వ్రాయలేదు

**అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।**
**అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥**

**(మాండూక్య ఉపనిషత్తు)**

ఈ జీవుడెప్పుడు మాయారూపమైన నిద్రనుండి మేలుకొనుచున్నాడో అప్పుడే జన్మాదులు లేని అద్వయస్వరూపమైన స్వయంప్రకాశకమగు నాత్మను తెలిసికొనుచున్నాడు(పొందుచున్నాడు)

మానవు డెంతవరకు నిద్రయందున్నాడో అంతవరకు తానెవ్వడు, ఎచ్చట నుంటున్నాడు, దేనికై యేతెంచెను అను మూడు విషయములను తెలిసికొనజాలడు నిద్రనుండి మేల్కాంచిన వెంటనే తానెవ్వడు, ఎచటనున్నాడు. ఎందులకై వచ్చెను- ఇవన్నియు నెఱుంగుచున్నాడు ఆలాగున మాయా

మోహముండువర కాత్మస్వరూప మిట్టిదనియు, జన్మమునకు గారణమును, జన్మాంతరస్థితియును తెలిసికొనలేడు ఇది అందరికిని నమభవమే పండితు డైనను, సార్వభౌముడైనను, సన్న్యాసియైనను, గృహస్థుడైనను, స్త్రీయయి నను, పురుషుడైనను, అగ్రజన్మము గలవాడైనను, అంతిమ కులజ ండైనను, ఆత్మప్రబోధ జ్ఞానోదయము గలుగువరకు నెవ్వరును తన నిజస్వరూపము నెఱుంగజాలరు

మఱియు నిద్రలో నుండువారు పై నిరూపించిన వారైనను నిద్రలో నుండు మరియొకనిని ఎట్లు లేపంజాలరో, నిద్రనుండి లేచినవాడు పైజెప్పిన వేలాదిజనులను నిద్రనుండి యెట్లు లేపగలుగునో, ఆలాగున ఆత్మ ప్రబోధము గలుగనివాడు అజ్ఞాననిద్రలో నుండువారిని ప్రబోధము గావించ జాలడు గురువులుగా నుండు వారందరును ఈసత్యము నెరుంగవలయును

ఇది బ్రహ్మణాది జాతులకును, సన్న్యాసాది ఆశ్రమములకును, స్త్రీ పురుషులకును సంబంధించినది గానేరదు కావున సన్న్యాసియే గురువుగా నుండవలయును బ్రాహ్మణుడే యుపదేశాధికారము గలిగియుండవల యును పురుషుడే అర్హుడు అని చెప్పునది సరిగాదు దేహధర్మము లన్నియు గురుత్వమునకు సంబంధించినవి గావు ఆత్మప్రబోధమే కారణమని గ్రహించుకొనవలయును ఔషధమును, రోగమును ఎరిగినవాడే వైద్యుడు గాని తక్కినవారెవరును కానట్లు ఈ బ్రహ్మోపదేశవిషయము గూడ తెలిసికొనవలయును

**ఘటమధ్యే యథా దీపో బాహ్యే నైవ ప్రకాశతే ।**
**భిన్నే తస్మిన్ ఘటే చైవ దీపజ్వాలా చ భాసతే ॥**
**స్వకాయం ఘటమిత్యుక్తం యథా జీవో హి తత్పదమ్ ।**
**గురువాక్యసమాభిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే ॥**

ఏలాగున కుండలోనుండు దీపము బాహ్యమున ప్రకాశింపనేరదో, అట్టి ఘటమును భేదించిన దీపజ్వాల యేలాగున బాహ్యమునకు

ప్రకాశించునో, ఆలాగున హృదయగుహయందు ఆవరింపబడియుండు అజ్ఞానమునకు ఘటమని పేరు దానియందు వెలుగుచుండు ప్రజ్ఞాన స్వరూపమై యుండు ఆత్మను దీపమని గ్రహించవలయును గురుబోధైక జ్ఞానమనెడి దండముచే ఉపాధిని పగులగొట్టునప్పుడు పరబ్రహ్మస్వరూప మగు జ్ఞానజ్యోతి ప్రకాశించును

కొందరు ఆత్మ స్వప్రకాశస్వరూప మైనది కావున దానిని తెలిసి కొనుటకు మఱియొక సాధనమేలయని యడుగుచున్నారు ప్రకాశించు చుండు దీపమును ప్రకాశింపజేయుటకు మరియొక దీప మేలాగున అవసరము లేదో ఆలాగున మరియొక గురు వవసరము లేదని వచింతురు ఇక కొందరు ఘటములోపల దీపము వెలుగుట సత్యమైనను, ఘటావరణ మును ధ్వంస మొనర్చకపోయిన దీపముండియు నేలాగున ప్రయోజనము లేదో, అది ప్రకాశింపజాలదో, ఆలాగున అజ్ఞానరూపమగు ఆవరణమును రహిత మొనర్చుటకు దగిన యనుష్ఠాన మవసరమనియు, గురువాక్య ముండవలయుననియు జెప్పుదురు ఈ మూలశ్లోకమున, ''గురువాక్య సమాభిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే'' అని యుండుటవలన గురువాక్య మవసరమని తేలుచున్నది పైవాక్యద్వయమునకు ఈ శ్లోకమున సమాధానము గలదు ఆత్మ స్వప్రకాశ మైనదియు సత్యమే ఆవరణ గలిగియుండుటయు నిజమే యగుచున్నది

**అహో జ్ఞానస్య మాహాత్మ్యం మయా వక్తుం న శక్యతే ।**
**అత్యల్పోఽపి యథా దీపస్సుమహన్నాశయేత్తమః ॥**
**జ్ఞానాభ్యాస స్తథాఽల్పోఽపి మహత్పాపం వ్యపోహతి ॥**

ఆత్మజ్ఞానమును గురించి సాక్షాచ్ఛంకరుండు సూతసంహితయందు వర్ణన చేయుచున్నాడు ఓహో! పరమాశ్చర్యము జ్ఞానముయొక్క మహి మను జెప్పుటకు నాకే యలవిగాదు దీపము చిన్నదైనను గృహాంత రాళములోనుండు గొప్పదగు చీకటిని ఏలాగున విలయ మొందించునో ఆలాగున నీ యాత్మజ్ఞానాభ్యాసము కొంచెమైనను అజ్ఞాన మనెడి మహాపాప

మును విలయ మొందింప గలుగును

జ్ఞానముయొక్క మహిమను గుఱించియు, అభ్యాసముయొక్క ప్రయోజనమును గుఱించియు మహేశ్వరుండు నవకాది యోగుల కుపదేశించినది చూడుడు–

**యథా వహ్నిర్మహాదీ ప్తశ్శుష్కమార్ద్రంచ నిర్దహేత్ ।**
**తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్నిర్దహతి క్షణాత్ ॥**

ఏలాగున మిక్కిలి ప్రజ్వలించుచున్న యగ్ని యెండినను గాని, ఎండ కుండినను గాని కట్టెలనన్నింటిని భస్మ మొనర్చుచుండునో, ఆలాగున ఈ జ్ఞానాగ్ని పాపపుణ్యములనెడి కర్మకట్టెల నన్నింటిని దహింపజేయుచుండును

పుణ్యపాపములను గూడ జ్ఞానాగ్ని దహింపజేయునని చెప్పుటలో వేదాంతతత్త్వము లెస్సగా తెలియని వారికొక సందేహము కలుగును, "పుణ్యముగూడ నశించునా? పుణ్యముకొఱకుగదా ఈసత్కర్మలను మనము చేయుచున్నా"మని తోచును ఇచట సకామముగా జేసిన పుణ్యకర్మగూడ పునర్జన్మమునకు హేతువగుచున్నది మంచి విత్తనముగాని, చెడువిత్తనము గాని భూమిలో పాతినచో రెంటింటికిని నంకురించు స్వభావ మెట్లు గలిగియుండును? వేగిన విత్తనములైనచో అంకురించక జీర్ణించి పోవును. ఆలాగున సకామ పుణ్యకర్మలకు పునర్జన్మము గలుగును కావున జన్మ రాహిత్యము గలుగదని భావము

మానవుండు ప్రప్రథమమున కొంత ఆత్మశుద్ధి గలుగునప్పుడు పాపకర్మముల నన్నింటిని మానును పుణ్యకర్మలను ఫలాసక్తితో జేయును అధికమగు ఆత్మశుద్ధి గలుగునప్పుడు ఫలాసక్తిని విడిచి ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మ మొనర్చును అందువలన మనస్సు మిక్కిలి శుద్ధమగుతఱి ఆత్మోద యమగును అత్తఱి జేయు పుణ్యకర్మలన్నియు నిష్కామముగా జేయునవి యగుటచే పునర్జన్మమును గలుగజేయవు మహనీయు లందరీలాగుననే చేయుచుందురు ఈ సత్యమును తెలిసికొనజాలక శాస్త్రజ్ఞానములేని

కొందరు వేదాంతులు ''పుణ్యకర్మగూడ చేయరాదు, ఆ కర్మఫల మనుభవించుటకుగాను మఱల జన్మమును ఎత్తవలసియుండు'' నని పలుకుదురు ఇది వారి బుద్ధిమాంద్యముచే కలిగిన ప్రమాదము అయితే గురుసేవ లెస్సగా జేయవలెననియు, ధన, తను, మనములను గురుస్వాముల వారికి సమర్పింప వలయుననియు చెప్పుదురు దీనికి మాత్రము ఫలమెద్దియు లేదా? యని విజ్ఞులెవ్వరైన నడిగిరేని శేషం కోపేన పూరయేత్ లేక మౌనేన ఇంతియే సమాధానము దొరకును

**రాజయోగస్య మాహాత్మ్యం కో విజానాతి తత్త్వతః ।**
**తజ్జ్ఞో నివసతే యత్ర స దేశః పుణ్యభాజనమ్ ॥**

**దర్శనాదర్చనాదస్య త్రిస ప్తకులసంయుతాః ।**
**అజ్ఞా ముక్తి పదం యా న్తి కిం పునస్తత్పరాయణాః ॥**

**అంతర్యోగం బహిర్యోగం యో జానాతి విశేషతః ।**
**త్వయా మయాఽప్యసౌ వంద్య శ్శేషైర్వంద్యస్తు కిం పునః ॥**

ఆత్మసాక్షాత్కార జ్ఞానముయొక్క మాహాత్మ్యమును ఉన్నదున్నట్లు ఎవ్వడెఱుంగగలుగును? అట్టి మహాత్ము డెచ్చట నివసించుచున్నాడో ఆ దేశము పుణ్యభూమి యగును. ఈ యోగిని దర్శించుటచేతను, పూజించుట చేతను ఇరువదియొక్క తరములవా రజ్ఞానులైనను తరింతురు అంతర్యోగ మును, బహిర్యోగమును ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు నాచేతను, నీచేతను నమస్కరింపదగినవాడు ఇట్లుండగా తదితరులచే పూజింపదగిన వాడని మఱల చెప్పవలయునా? అని సూతసంహితయందు పరమశివుడు వామదేవాదులకు తెలిపెను

**సర్వపాపప్రసక్తోఽపి ధ్యాయన్నిమిషమచ్యుతమ్ ।**
**భూయ స్తపస్వీ భవతి పంక్తిపావన పావనః ॥**

పాపము గలవాడైనను ఒక నిమిషము నారాయణ మూర్తిని ధ్యానము చేసిన యెడల సమస్త పాపములు నశించినవాడై పాపములనుండి విముక్తి

గలిగినవాడై మఱల గొప్ప తపస్వి యగును అట్టి మహాత్ముడెప్పు డేపంక్తిలో గూర్చొని భోజనము చేయునో, ఆ తరుణమున నా పంక్తిలో గూర్చొనిన వారందరును పావను లగుదురు

ఇట్టి కారణమువలననే మహనీయుల పంక్తిలో నందరును భోజనము చేయుటకు వాంఛింతురు అయితే భోజన సమయములో ఇతర భావము లెవ్వియు మనస్సులోనికి రానీయక, ఆ మహనీయుని చూచుచు వారెట్టి భావ మును గలిగియున్నారో అట్టి దైవభావము గలిగి మౌనముతో భోజనము చేయవలయును

**యద్యేకో బ్రహ్మవిద్భుంక్తే జగ త్తర్పయతేఽఖిలమ్ ।**
**విధేయమపి సత్కారం యద్యల్పమపి తద్బహు ॥**

బ్రహ్మవేత్తయగువా డొకనికి భోజనముచే తృప్తిని గలుగజేసిన యెడల ప్రపంచమున కంతయు తృప్తిని గలుగజేసిన వాడగుచున్నాడు అట్టి బ్రహ్మవేత్తకు అతి స్వల్పమయిన సత్కారము నాచరించినను అదియే మిక్కుట మగుచుండును

బ్రహ్మవేత్త చరాచరములలో వ్యాపించియుండు బ్రహ్మమునే తన యాత్మగా దైవభావన చేయుటచే నిట్టి ఫలితము గలుగుట కవకాశ మగు చున్నది

**యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయసుఖస్యైతే కలాం నార్హ న్తి షోడశీమ్ ॥**

ప్రపంచములో సకల సంకల్పములను పూర్తిగా అనుభవించిన వాని కేసుఖము గలదో, స్వర్గలోకమం దేమహత్తయిన దివ్యసుఖములు గలవో, అవన్నియు అంతఃకరణములోగల తృష్ణాదిదోషములు నశించిన సంయమి యొక్క నిర్వాణసుఖములో పదునారవ భాగము సుఖము నైనను గలుగజేయజాలవు

**సమాధినిర్ధౌతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదన్తఃకరణేన గృహ్యతే ॥**

సమాధినిష్ఠచేత చక్కగా శుద్ధము చేయబడినదియును, ఆత్మ యందుంచబడినదియును అగు మనస్సున కేబ్రహ్మసుఖము గలుగు చున్నదో, దానిని వాక్కుచే నుడువుట కెవ్వరికిని అలవిగాదు అనుభవైక వేద్యమై యున్నది

మందబుద్ధిగల యొక శిష్యుడు గురుదేవులతో కలకండ గుణమెట్టిదని యడిగెను మధురమే దాని స్వభావమని గురు డుపదేశించెను తదుపరి ఆ శిష్యుడు మధురమెట్టిదని యడిగెను మధుర మిట్టిదని చెప్పుటకు వేరు పదము లేదు అది మధురమే కావున నీవు స్వయముగా తిని చూడవలసినదే యని గురుమూర్తి సమాధాన మొసంగెను ఈ బ్రహ్మాత్మానందముయొక్క స్థితియు ఆలాగున నున్నది

**సంసారార్ణవమగ్నానాం జన్తూనామవివేకినామ్ ।**
**అగతీనాం గతిస్సాక్షాద్జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

జననమరణమను భవార్ణవమున మునింగిన వారికిని, అవివేకులగు మానవులకును, ఏ సహాయము లేనివారికిని, కేవల మీ యాత్మజ్ఞాన మొక్కటియే గతి యగును అనగా నిది యొకటియే దరిజేర్చును

**అయమాత్మా స్వయంజ్యోతిర్మహానందమయశ్శివః ।**
**అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః ॥**

ఈ యాత్మ స్వయంజ్యోతిస్స్వరూపము, మహానందమయము, ప్రకృతిదోషములు లేని శివస్వరూపము యోగనిష్ఠ లేనివారికి అప్రత్యక్షము, ధ్యాననిష్ఠ గలవానికి ప్రత్యక్షము.

ఆత్మజ్ఞానానుభవము గలుగక పోవుటకును, కలుగుటకును కారణ మిచట నిరూపించడమైనది

**సంసారదుఃఖతప్తానామాత్మజ్ఞానామృతాంభసా ।**
**తాపశాంతిర్న చాన్యేన సత్యమేవ న సంశయః ॥**

సంసారదుఃఖమనెడి తాపత్రయాగ్నిచే తపించెడు జీవకోట్లకు ఆత్మ జ్ఞానమనియెడు అమృత మొక్క దానివల్లనే తాపశాంతి గలుగునుగాని వేరు మార్గము లేదు ఇది సత్యము, సంశయ పడకుము

**ముక్తిస్తు బ్రహ్మత త్త్వజ్ఞానాదేవాస్య న చాన్యథా ।**
**స్వప్రబోధం వినా నై వ స్వస్వప్నో హీయతే కథమ్ ॥**

జీవన్ముక్తి కలుగవలయునని సాధనచేయువానికి, బ్రహ్మసాక్షాత్కార జ్ఞాన మొక్కదానిచేతనె అది సిద్ధించును ఎట్లన స్వప్నావస్థలో నుండువానికి జాగ్రదవస్థ గలుగకపోయిన స్వప్నములో గనిపించిన దృశ్యము లన్నియు మిధ్యయని బోధ యెట్లు గలుగును?

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమంధవత్ ॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని, గ్రుడ్డివాడు తప్ప అందరును చూచినప్పటికిని, వాడాసూర్యుని చూడనేరనట్లు సచ్చిదా నందాత్మ సర్వత్ర వ్యాపించియున్నప్పటికిన్ని శ్రవణాదులవలన విచారించి తెలిసికొనిన ఆత్మజ్ఞాని ఆ యాత్మను చూచుచున్నాడు అజ్ఞాని చూడలేడు (ఆత్మ బోధము)

ఈశ్వరుడు ఆత్మ యొకటి యుండిన ఏల కనిపించుటలేదను ప్రశ్నకు అనేకవేల సంవత్సరములకు పూర్వమే సమాధానము చెప్పడమైనది అట్టి ఆర్ష గ్రంధములను చదువకపోవుట చేతను, అట్టి ఋషిసదృశులతో సహవాసము చేయకపోవుట చేతను ఇట్టి సందేహములు గలుగుచున్నవి

**నిమిషం నిమిషార్ధం వా యత్ర తిష్ఠన్తి యోగినః ।**
**తత్రైవ సర్వశ్రేయాంసి త త్తీర్థం తత్తపోవనమ్ ॥**

ఒకనిమిషముగాని, అర్ధనిమిషముగాని ఆత్మసంయములగు యోగులు ఎచట బ్రహ్మనిష్ఠ చేయుచుందురో అచట సర్వశ్రేయస్సులు గలుగును ఆ స్థలము పుణ్యతీర్థముగను, తపోవనముగను అగుచున్నది

ఇప్పుడు ప్రపంచములో కానిపించెడు పుణ్యాశ్రమములు, పుణ్య తీర్థములు, పుణ్యక్షేత్రములు ఒక కాలమున మామూలు ప్రదేశములుగా నుండినవి అచ్చోట మహనీయాత్ములు తపస్సు జేయుటచేతను, బ్రహ్మనిష్ఠ చేయుటచేతను బ్రహ్మవిచారణ సలుపుటచేతను ఇప్పుడు పుణ్యక్షేత్రము లైనవి

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బాహ్యములగు ఇంద్రియసుఖములయం దాసక్తి లేని యంతఃకరణము గలవాడై తనయాత్మయందు ఏ జ్ఞానసుఖమును బొందునో అట్టి యక్షయ మగు సుఖమును బ్రహ్మయందు నిశ్చలమైన యంతఃకరణము గలవాడు బొందగలుగును అని గీత

**స్నాతం తేన సమ స్తతీర్థనిచయే ద త్తం మహీమణ్డలం**
**విప్రేభ్యః పితృదేవతాస్సురగణాస్సర్వేఽపి సంతర్పితాః ।**
**జప్తా మంత్రసహస్రకోటిరమునా త ప్తం చ తీవ్రం తపో**
**యస్య బ్రహ్మవిచారణే క్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః ॥**

ప్రపంచములోగల సమస్త తీర్థములలో సంకల్పదాన పూర్వకముగా స్నానము చేసిన ఫలమేది గలదో, చక్రవర్తి యయినవాడు పుణ్యకాలములో కాశ్యాది క్షేత్రములలో వేదవేదాంత పారంగతులగు బ్రాహ్మణులకు భూమండల మంతయు దానమిచ్చిన ఫలమేది గలదో, విప్రులను, పితృ దేవతలను, సంతృప్తిగా ప్రతిష్ఠించి పూజించిన ఫలమేది గలదో, గాయత్ర్యాది మహామంత్రముల నన్నింటిని వెయ్యికోట్ల సారులు జపించిన ఫలమేది గలదో, కృచ్ఛ్రచాంద్రాయణాది తీవ్రతపస్సుచే గలిగెడు ఫలమేది గలదో– అవన్నియు

నొక్క క్షణకాలము వృత్తిరహితమై బ్రహ్మాకార వృత్తిలో నుండెడు ఫలమునకు సరి కానేరవు (యోగవాసిష్ఠము)

**వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥**

నియమ పూర్వకముగా వేదవేదాంతములను జదువుటవలనను, సాంగోపాంగములుగా యజ్ఞముల నన్నిటిని ఆచరించుటవలనను, కాయ శోషణాదులగు కృచ్ఛ్రచాంద్రాయణాది తపముల నొనర్చుటచేతను, దేశకాల పాత్రానుసారముగా సమస్తదానముల నాచరించుటవలనను కలిగెడి పుణ్యఫల మేది గలదో, ధ్యానయోగి వీటన్నిటివలన గలిగెడు ఫలమునకన్న యధికమైన ఫలమును బొందుచున్నాడు పై నిరూపించిన వారు పొందెడు ఫలమునకన్న ఎక్కువైన మోక్షమును బొందుచున్నాడు అని గీత

బ్రహ్మనిష్ఠచే గలిగెడు ప్రయోజన మెట్టిదియో, దీనియందు నిరూపించడమైనది పైజెప్పిన సత్కర్మలను జేయు శక్తిలేదని తలంచి వ్యాకులమును బొందు బీదలు కొందరు గలరు అట్టివారిపై కరుణగలిగి భగవాను డీ శ్లోకమును ఉపదేశించెను అక్షర పరబ్రహ్మమును బొందెడు అష్టమాధ్యాయమున నిది చెప్పుటవలన శాశ్వత బ్రహ్మప్రాప్తికి ధ్యానయోగమే యుపకరించునని తెలుపడమైనది దీనికి విద్యతోగాని, ధనముతో గాని, జాతితోగాని ఏలాటి సంబంధమును లేదు కేవలము ధ్యానయోగ మొకటియే చాలును ఇది సర్వజనులకు సులభము, అనుష్ఠేయమున్ను అయియున్నది

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥**

ఈ లోకమందాత్మజ్ఞానముతో సమానమగు పవిత్రమైనది మఱి యొకటి లేదు అట్టి జ్ఞానమును యోగనిష్ఠుడు అనుష్ఠానము పరిపక్వ మగునపుడు తానే తనయందు బొందుచున్నాడు అని గీత

''కాలేనాత్మని విన్దతి'' అని తెలుపుటచే కాలము పరిపక్వదశను

బొంది నప్పుడు, అట్టిజ్ఞాన ముదయ మగుచున్న దనియు, కాలపరిపక్వత గలుగువరకు అనుష్ఠానమును విడువరాదనియు నుపదేశించడమైనది. మఱియు అట్టి జ్ఞానము ఇతర లోకములలోగాని, స్థలములలోగాని పొంద బడునది గాదనియు, తనలోనే కలుగవలయుననియు గ్రహించు కొనవలయును

**యథాఽగాధనిధేర్లాభే నోపాయః ఖననం వినా ।**
**మల్లాభేఽపి తథా స్వాత్మచింతాం ముక్త్వా న చాపరః ॥**

భూమియొక్క అగాధ భాగమునందుండు నిక్షేపమును తీయుటకు గడ్డపారచే త్రవ్వుటగాక మఱియొక యుపాయ మెట్లు లేదో, అలాగున బుద్ధిగుహయందుండు జ్ఞానధనము లభించుటకొఱకు తదేకధ్యానమగు నిరంతర చిన్తనము వినా, వేరుపాయము లేదని ఆత్మగీత చెప్పుచున్నది

**స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః ॥**

బ్రహ్మాభ్యాసమన్ననో చాలకాలమువరకును ఎడతెగని తపముచేతను, బ్రహ్మచర్యముతోడను, శ్రద్ధతోడను, అనుష్ఠింపబడినదై దృఢజ్ఞానానుభవము (సమాధిస్థితిని) గలుగజేయును

శ్రీపతంజలిమహర్షియు పై జెప్పిన యభిప్రాయమునే యోగదర్శ నమునందు తెలిపిరి

**న తత్సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥**

ఏకాంతవాసియై, రాగరహితుడై, మౌన (మనన) శీలుడగు మహాత్మునికి ఏయొక్క బ్రహ్మానందము గలదో, అట్టిసుఖము దేవేంద్రునికి గాని, చక్రవర్తులకు గాని లేనే లేదు (గురుగీత.)

**రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని ।**
**ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా ॥**

ఎవడు బ్రహ్మానంద రసామృతమును పానముచేసి పరమాత్మధ్యానము నందు తృప్తుడగుచున్నాడో, ఆ మహాత్ముడు దేవేంద్రునిగూడ పేదవాడైన భృత్యునివలె చూచుచున్నాడు అట్లుండ రాజులయొక్క గతి యేమున్నది!

**నాతస్సుఖతరం కించిత్త్రిషు లోకేషు విద్యతే ।**
**వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసంగస్య యత్సుఖమ్ ॥**

సమస్తమైన కామాది విషయములను వదలినవాడై నిస్సంగుడైన వానికే యొక్క బ్రహ్మానందము గలదో, దానికి సరియయిన మఱియొక సుఖము మూడు లోకములయందును లేదు( గురుగీత )

**తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్ ॥**

పరవైరాగ్యముగలిగి అనుష్ఠానము చేయు యోగిచిత్తమున నింతకు ముందున్న క్లేశబీజములు, వేగినవడ్లు మొలకలెత్తని చందమున, సంపూర్ణ ముగా నశించిపోవును ( యోగదర్శనము )

అనేక జన్మములనుండి వచ్చిన సంస్కార బీజములన్నియు జ్ఞానాగ్ని యందు దహించిపోయినందుచే,జ్ఞానులకు ప్రకృతిగుణము లుండవు ఉండినచో వేగని విత్తనములవలె జ్ఞానాగ్నియందు కర్మబీజములు దహించ బడలేదని గ్రహించుకొనవలయును

**సత్త్వపురుషయో శ్శుద్ధిసామ్యే కైవల్యమ్ ।**

బుద్ధిసత్త్వమునకు వివేకఖ్యాతి యుదయించుటవలన పురుషుని (ఆత్మ) తో సమానమగు నైర్మల్య మొదవును అట్టి బుద్ధినైర్మల్యము సిద్ధించెనేని సిద్ధ్యంతరాపేక్ష లేకయే కైవల్యము లభించును

బుద్ధియందుగల సత్వరజస్తమోగుణములు నశించు నప్పుడును, ఆత్మయందుగల అవిద్యాక్లేశములు నశించునప్పుడును కైవల్యప్రాప్తి గలుగును జీవుడు శుద్ధజ్ఞాన స్వరూపుడైనను మూలావిద్యచే గూడియుండు వరకు శుద్ధజ్ఞానస్వరూపుడు గాజాలడు శుద్ధజ్ఞానప్రకాశుడుగా జీవుడును

త్రిగుణదోషములు నశించినదిగా హృదయమును ఎప్పుడేర్పడునో అప్పుడే మోక్షము సిద్ధించును ఇందువల్ల ఆత్మస్వరూపము తెలిసికొనిన చాలు ననియు, ప్రకృతిగుణములతో నేమి సంబంధమనియు, గుణములు దృశ్య ములుగదా, దృక్కయిన తనకు ఏమి బాధ గలదనియు చెప్పు వేదాంతము యొక్క రహస్యము ముముక్షువులు తెలిసికొనందగినది

**మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య**
**విషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్ ॥**

సుఖవిషయమున, దుఃఖవిషయమున, పుణ్యవిషయమున, పాపవిష యమున (క్రమముగా) 1 మైత్రి, 2 కరుణ, 3 ముదిత, 4 ఉపేక్షలయొక్క భావనవలన చిత్తము నిశ్చలమగును అనగా నిర్మల మగును అనగా పుణ్యాత్ములతో మైత్రియు, దీనులయందు దయయు, తనకన్న యధికులను జూచి యానందించుటయు, పాపాత్ములయం దుపేక్షయు (సంబంధము లేక యుండుట) గలిగియుండవలయును అట్లయిన మనోనిర్మలత్వమున కేలాటి మార్పును గలుగదు

లోకములో నేదైన నొక సంస్థను నిర్వహించు వాడెల్లరతోను సమ త్వము గలిగియుండుట అసాధ్యమగునని తలంపుగల మహనీయాత్ములు గూడ చాలమంది గలరు దుష్ట, శిష్ట భేదము లేక అందరిని సమానముగా జూచుట గదా జ్ఞానము భేదముతో జూచిన నజ్ఞాన మగును. కార్యము నిర్వహించు నప్పుడు రాజ్యమును పాలించునప్పుడు, సంస్థను నడపునప్పుడు దుష్టులను, శిష్టులను వేరు వేరుగా జూడకపోయిన కార్యము జరుగదు గొప్ప వివేకజ్ఞానులకు గూడ నిది గొప్పధర్మసంకట మగు గండముగా నున్నది కావున శ్రీపతంజలిమహర్షి చెప్పిన ఈ చతుర్విధోపాయములచేత గొప్ప సంస్థను నిర్వహించుకొని ఆత్మశాంతికి భంగములేక యుండవచ్చును శ్రీ యోగవాసిష్ఠమున శ్రీవసిష్ఠులకును, శ్రీరామచంద్రులకును గలిగిన వాదప్రతివాదములు దీనిని గురించియే యేర్పడెను ఆ ఘట్టము యోగవాసిష్ఠమున గనందగును

**కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన ।**
**అపారసచ్చిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ॥**

ఎవని మనస్సు ఒక్కక్షణ కాలమైనను అపారజ్ఞానసారమగు పరమాత్మ ధ్యానమందు లీనమగునో, అట్టివాని కులము పవిత్రమగును తల్లి కృతార్థురాలగును తండ్రియును కృతార్థు డగును వాడు నివసించు భూమియు పుణ్యక్షేత్ర మగును అని సూతసంహిత

మహాత్ములయొక్క జన్మముచే గలిగెడి ఫలితమెట్టిదో ఇచట నిరూపించడమైనది

**సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।**
**హృదయే నాస్తి సర్వాస్థా ము క్త ఏవో త్తమాశయః ॥**

జీవన్ముక్తస్థితి గలిగిన పిమ్మట నిరంతర సమాధినిష్ఠలో నుండినను సరి, లేక పరప్రాణుల కుపకారము చేయుచుండినను సరి, హృదయమునందేలాటి విషయభావములును, దృశ్యవాసనలును లేనందుచే వారు సర్వదా ముక్తు లగుచున్నారు ఇదియే యుత్తములయొక్క యాశయము

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥**

మూఢబుద్ధిగలవా డేప్రవృత్తి చేయకున్నను, అతని మనస్సు నిరంతరము ప్రపంచవిషయములలో ప్రవర్తించుచునే యుండును ఆత్మసాక్షాత్కారము గల ధీరుని యింద్రియములు సత్కర్మలో ప్రవర్తించుచుండినను, ఫలాపేక్ష లేక ప్రవర్తించుచుండుటచే అవి నివృత్తిఫలమునే గలుగజేయుచుండును

వేదాంతముయొక్క కీలక మిచట నిరూపించడ మైనది ఆత్మశుద్ధి లేక కొందరు ఏకర్మమును జేయకయుండుటయే గొప్పతనమని తలంతురు ఆత్మజ్ఞానులు ఫలాపేక్షను విడిచి, పరప్రాణులకు మేలుచేయునది చూచి, అట్టి

శుద్ధాత్ములను ప్రవృత్తిగల వారివలె తక్కువగా జూచెదరు విద్యా వివేకములేని లోపమే వారికిట్టి విపరీత భావము గలుగుటకు కారణము వేగిన విత్తనములు ఎచట చల్లినను మొలకలెత్త నేరవు పచ్చివిత్తనములను మూటగట్టి ఏకాంత ములో నుంచినను నీరుతడి గలిగిన వెంటనే మొలకలెత్తు విధముగ, పైజెప్పిన యుభయులయొక్క స్థితియు నుండును అయితే అంతఃకరణ శుద్ధిగలిగి ఆత్మజ్ఞానము దృఢముగ గలుగువరకు తననిష్ఠకు విఘ్నము గలుగని లోక సేవగాని, పరోపకారములుగాని, దైవకైంకర్యము గాని, పుణ్యకర్మగాని చేసిన జాలును లేనిచో, అసలు మూలమునకే మోసము వాటిల్లును మూలము చెడిన వృక్షము వ్యర్థమగు నట్లు తన నిష్ఠనుండి పతనము గలిగినచో అంతయు వ్యర్థమగును ఈ రహస్యము బుద్ధిమంతు డెఱింగియుండవలయును

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సమస్త భూతాంతరాత్ముడగు నన్ను సర్వచరాచరములలో వెలుగు చుండు ఒకేయాత్మగా తెలిసినవాడై యెవడున్నాడో, అట్టి జ్ఞానయోగి సర్వ ప్రకారముగా వర్తించుచున్న వాడైనను, ఎల్లప్పుడు నాయందున్న వాడగు చున్నాడు అనగా పైజెప్పిన ప్రకారము నిరంతరము సమాధినిష్ఠ యందుండినను, లేక ఫలాపేక్షలేక పరప్రాణుల కుపకారము జేయు చుండినను గృహస్థాశ్రమమునందుండినను, లేక సన్న్యాసాశ్రమము నందుండినను, వనమందుండినను, పట్టణమునందుండినను విరోధము లేదు అతడు దేశకాల దేహేంద్రియముల కతీతస్థితిలో నుండుటవలన పైజెప్పిన వేవియు అతని కడ్డు రాజాలవు ఆమార్పులన్నియు నతని ప్రారబ్ధ కర్మానుసారముగా నుండును అని గీత

బ్రహ్మవేత్త తన జీవనాధారమునకు తగిన ధనమున్నచో నేలాగున జీవయాత్ర గడుప వచ్చునో, ఆ విషయము నిరూపించబడుచున్నది

**అత్రాహోరార్థం కర్మ కుర్యాదనిర్విణ్ణం**

**కుర్యాదాహారం ప్రాణసంరక్షణార్థమ్ ।**
**ప్రాణాస్సంధార్యా స్తత్త్వసంపాదనార్థం**
**తత్త్వం సంపాద్యం యేన భూయో న జన్మ॥**

ఆహారముకొఱకై ధర్మవిరుద్ధముగాని కర్మను జేయవలయును ప్రాణ సంరక్షణకొఱకు మాత్రమే ఆహారమును భుజింపవలయును ప్రాణసం రక్షణము తత్త్వసంపాదనకొఱకే యగును పునర్జన్మరాహిత్యమున్కై తత్త్వ మును సంపాదింపవలెను అని వాసిష్ఠము

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥**

దేనియందును ఆశలేనివాడును, మనోనిగ్రహము గలవాడును, పరవస్తు పరిగ్రహము లేనివాడును దేహధారణకు మాత్రము విధి ననుసరించిన కర్మను జేయువాడు పాపమును బొందడు అనిగీత

పూర్వముండు మహర్షులు అరణ్యములోనుండి యీలాగుననే జీవించిరి గృహస్థులైన జనకుడు, తిరవళ్ళూరినాయన, కబీరుదాసు, ఘోరాకుంభారు, వీరబ్రహ్మయ్యగారు మొదలగు మహనీయులు గృహస్థాశ్రమములో నుండియు నిట్టివిధి ననుసరించియే జీవించిరి పరవస్తు పరిగ్రహముచేత పుణ్యము నశించి దాతయొక్క పాపము తనలో చేరు చుండును అందువలననే పరవస్తు పరిగ్రహమునుగురించి మనువు చెప్పిన వాక్యము ఈ గ్రంథమున నిరూపించినది జూడుడు భుక్తికిమాత్రము నిషేధము లేని పనిని చేయుట ముక్తికి అడ్డు గాజాలదు భోగముపెరిగిన యోగము తరుగునని గ్రహించుకొనిన చాలును అయితే నిరంతరము బ్రహ్మనిష్ఠ యందుండువారిని, తీవ్రతర బుద్ధితో నధ్యయనము చేయువారిని ఈ విధి బాధింపజాలదు సామాన్యు లందరును పైజెప్పిన విధముగా జరుపుటయే మంచిది

ఇక చెప్పబోయెడి విషయము త్రిపుటిరహితమైనది దృగ్దృశ్యముల

యేకత్వము దీనినే నిర్వికల్ప సమాధియనియు, అద్వైత బ్రహ్మసాక్షాత్కార స్థితి యనియు గ్రహించుకొనవలయును ఇది వేదాంతముయొక్క విచారణచే గలిగెడి పరమకాష్ఠ యని తెలియందగును ఈ స్థితిలోనికి వచ్చుటకే జప, జ్ఞాన, భక్తి యోగములన్నియు నేర్పడినవి

**అజ్ఞానాద్భాసతే సర్వం త్వయి రజ్జౌ భుజంగవత్ ।**
**ప్రజ్ఞానాల్లీయతే సర్వం త్వయి రజ్జౌ భుజంగవత్ ॥**

అజ్ఞానముచేత నీయందు రజ్జువునందు సర్పమువలె నీ దృశ్యము ప్రతీతి యగుచున్నది ప్రజ్ఞానమువలన నీయందు, రజ్జువునందు కల్పింపబడిన సర్పము లీనమై రజ్జువుమాత్రము ప్రతీతి యగునట్లు దృశ్యము లీనమై నీవు మాత్రము శేషింతువు

ఒక యవస్థయందు త్రాడుప్రతీతి గాక సర్పప్రతీతి గలుగుచున్నది మఱియొక యవస్థయందు త్రాటియందు సర్పము లేనిదై త్రాడు మాత్రమే ప్రతీతి యగునుగాని సర్పప్రతీతి గలుగదు ఇదియే అజ్ఞాన జ్ఞానావస్థలలో గలిగెడి యవస్థయని గ్రహించదగినది వాస్తవముగా త్రికాలములందును రజ్జువునందు సర్పము లేనప్పటికిని అవిచారణచే సర్పము గోచరించుచున్నది భయము గలుగుచున్నది దీపసహాయముచే పరిశోధన సలుపునప్పుడు త్రాడు వ్యక్త మగుచున్నది సర్పభీతి నశించుచున్నది ఇది వేదాంతములో వివర్తవాదమనియు, వేదాంతముయొక్క తుదిస్థితి యనియు గ్రహించుకొనవలయును

**రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్।**
**నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్ ॥**

త్రాటిని పామువలె సత్యజ్ఞానానంద స్వరూపియగు నాత్మను కించిద్జ్ఞుడగు జీవునిగా భ్రమించి భయమును బొందుచున్నాడు శ్రుతి, యుక్త్యనుభవములచేత నేను కించిజ్జ్ఞుడనగు జీవిని గానేరను, ఇక నేమన సర్వపరిపూర్ణ స్వరూపుడనని గుర్తెఱింగి నట్లయిన భయ మేమాత్ర మైనను

లేనివాడు కాగలడు

కారుచీకటిలో త్రాడు కనిపించదు ప్రాతః సంధ్యాకాలములలో మంద ప్రకాశమందు త్రాటిని చూచి సర్పమను భయము గలుగుచున్నది మఱల సూర్యుడు ప్రకాశించుతరి త్రాడుగానే గోచరించుచున్నది సర్పభ్రాంతి గలుగదు ఆలాగున గాఢాజ్ఞానస్థితిలో నుండువారికి ఆత్మను గుఱించిన విచారణ చేయనందుచే సంశయము గలుగదు సూర్యోదయమైన పిమ్మట నుండువారికిని సందేహ ముండదు ఇంకెవరికి సంశయము గలుగుచున్న దనగా మందప్రకాశముగ అరుణోదయ స్థితిలో నుండువారి కేర్పడుచున్నది ఆలాగున కేవల బద్ధాత్ములకును కేవల ముక్తాత్ములకును సందేహము గలుగదు జిజ్ఞాసువులకే కలుగుచుండును అట్టి సందేహము గలవారు తమ్ము పాపులని గాని, హీనులనిగాని తలంచవలదు వీరు మధ్యమస్థితిలోనికి వచ్చినవారు అరుణోదయ స్థితిలో నున్నవారు అరుణోదయముయొక్క స్థితిలో సూర్యోదయము గాబోవుచున్నదనియు, కాలరాత్రి తొలగిపోయిన దనియు ఎట్లు గ్రహించుచున్నారమో, ఆలాగున కొలది కాలములోనే సంశయము నశించి పూర్ణబ్రహ్మైక్యైక జ్ఞానము గలిగి ధన్యులు గాగలరనియు తలంచవలయును

**రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం న తిష్ఠతి ।**
**అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచః శూన్యతాం గతః ॥**

రజ్జువుయొక్క యథార్థజ్ఞానము గలుగుచుండగా రజ్జువునందు త్రికాలములయందును సర్పము ఉండలేదని దృఢముగ జ్ఞానమెట్లు గలుగుచున్నదో ఆలాగున నధిష్ఠానమగు యాత్మయొక్క దృఢజ్ఞానము గలుగుచుండగా కల్పితమగు జగద్భ్రాంతియు నశించును

**గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా ॥**

కొయ్య యొక్కటైనను అనేక గృహోపకరణములుగా నేర్పడి

నట్లును, ఇనుమొక్కటైనను అనేక యంత్రములుగాను, ఖడ్గాదులుగాను ఏర్పడి నట్లును, మాయచే నొకేబ్రహ్మము అనేకములుగా గనిపించుచున్నది గృహపరికరములయొక్కయు, యంత్రములయొక్కయు నామరూపములు తీసివేసిన నొకే కట్టెయు, నొకే లోహ మెట్లగుపడుచుండునో, ఆలాగున మూఢత్వముచే అనేకత్వమును, జ్ఞానిత్వముచే నేకత్వమును గలుగుచున్నవి

ఒకే కట్టెచే అనేకములగు బొమ్మలను జేయునట్లు మాయచే నానాత్వ మేర్పడినది విచారణ చేసిన నొకే సద్వస్తువు మాయచే ననేక వస్తువులైనట్లు గ్రహించుకొనవచ్చును ఆలాగున బాహ్యదృష్టిచే అనేక విధములుగా గనపడిన ఈ జగత్తు ఆంతరదృష్టిచే జూచువారికి నొకే సద్వస్తువుగా గోచరించును ఆలాగున నొక వృక్షమును చూచినప్పుడు ఫలము, పుష్పములు, విత్తన ములు, గుజ్జులు, రసములు భిన్న భిన్నముగా గనిపించినను, విచారణ సలిపిన అవన్నియు నొకేబీజమునుండి యేర్పడినట్లు తెలిసికొననగును ఆత్మవిచారణ చేయని వారికి జగత్తు అనేకముగానే గోచరించును విచారణచేయువారి కేకముగా గనిపించును

**యథాతరంగకల్లోలైర్జలమేవ స్ఫురత్యలమ్ ।**
**పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘైస్తథాత్మతా ॥**

సముద్రమునందుగల తరంగ, బుద్బుద, ఫేనాదులు సముద్ర జలమున కన్యములుగా నుండవు ఒకేతామ్రము పంచపాత్ర, కమండలువు మొదలగు అనేక పాత్రములుగా గనిపించినను, నిజముగ విచారించిన నొకే తామ్రరూపముగా నెట్లుండునో, ఆలాగున నీ ప్రపంచములో గనిపించెడు నానా త్వము ఒకే బ్రహ్మ యగుచున్నది అని అపరోక్షానుభూతి

**మర్త్యోఽహమితి సంధాయ మ్రియతే జాయతే చ సః ।**
**బ్రహ్మాఽహమితి సంధాయ ముచ్యతే న చ జాయతే ॥**

మర్త్యుడను బుద్ధి యెంతకాలమువఱకు మానవుడు గలిగియుండునో అంతవరకు మరణించుటయు, జన్మించుటయు జరుగుచుండును బ్రహ్మమే

తాననియెడి అనుసంధానము గలిగియుండిన తప్పక ముక్తుడగును వాడు మఱల జన్మించడు

ఇప్పుడు గ్రంథము పూర్తి చేయబడుచున్నది నిజస్వరూపములో మన స్సును ఎల్లప్పుడు నిలుపశక్తి లేనివారికి యోగధారణతో గూడిన ధ్యానమును గీత అ 5, శ్లో॥ 27,28, లలో పరమరహస్యముగా శ్రీభగవాను డుపదే శించెను

**స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥**

**యతేంద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।**
**విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥**

ఎవడు బాహ్యములగు స్పర్శాదివిషయములను బయలున నుంచి మనస్సునందు జొరనీయక దృష్టిని కనుబొమలయొక్క మధ్యప్రదేశమునందే నిలిపి ముక్కులోపల సంచరించునట్టి ప్రాణాపానవాయువులను సమముగా జేసి ★స్వాధీనములైన యింద్రియములు, మనస్సు, బుద్ధియును, నశించిన యాశయు భయమును, క్రోధమును గలవాడో, మోక్షమునం దాసక్తిగల వాడును, మననశీలము (మౌనము) గలవాడునగునో అతడెల్లప్పుడు ముక్తుడే

**ఏతదాలంబనం శ్రేష్ఠమేతదాలంబనం పరమ్।**
**ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥**

---

★ ఇది కేవల కుంభకమును గుఱించిన యోగసాధన యగును దీని యందు ఏలాటి అపాయ మును గలుగదు దీనికి కేవల కుంభకమని పేరు పద్మాసనమందుండిగాని సిద్ధాసన మందుండిగాని మూలబంధ, ఉడ్యాణబంధ, జాలంధరబంధమును జేసికొని ప్రాణాపానములను ఏకముజేసి ప్రణవమునుగాని, సోఽహం మంత్రమునుగాని భావనజేసికొని స్వప్రకాశానందమయాత్మలో నుండులాగున అభ్యాసము చేసికొనవలయును ఈ విషయమై వ్యాసాశ్రమమువారిచే వ్రాయబడిన గీతార్థప్రకాశమను గ్రంథమున అ 5, శ్లో।27,28లోను, రజతోత్సవసంచిక 35-వ పేజీలోను జూడందగును రజతోత్సవ సంచికలో ఫోటోతో గూడ జూడవచ్చును

ఈ ఓంకారరూపమగు బ్రహ్మప్రాప్తి సాధనము శ్రేష్ఠమయినది ఈ ఓంకారరూపమగు ఆలంబనమే పరబ్రహ్మ సంబంధమైనది ఈ యోంకార రూపమగు ఆలంబనమును తెలిసికొని బ్రహ్మలోకమును పొందుచున్నాడు అనగా బ్రహ్మప్రాప్తి గలవాడగుచున్నాడు

ఆలంబన మనగా సహాయమని యర్థము నడువశక్తిలేని వాడు కఱ్ఱ సహాయముతోగాని మఱియొకని సహాయముతోగాని యెట్లు నడుచు చుండునో, ఆలాగున స్వయముగ "అహం బ్రహ్మాస్మి" అను భావన చేయుటకు మనః పరిపక్వత లేనివారు ఈ ప్రణవముయొక్క సహాయముతో బ్రహ్మప్రాప్తిని ప్రయాసము లేక పొందవచ్చును అనగా ఓంకారమును ఉచ్చరించి ఓంకారముయొక్క నాలుగవపాదమును అర్ధమాత్రయగు పరబ్రహ్మమును తన యాత్మగ భావన చేయుచుండవలయును ఇట్లభ్యసించుచు రాగా రాగా ఓంకారశబ్దము సహా లీనమై ఓంకారార్థ పరబ్రహ్మము మాత్రము మిగిలియుండును( కఠోపనిషత్తు)

**జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేంద్రియః ।**
**పఠేదుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చి న్తయేత్ ॥**

ఎవడు నియమము గలవాడై మనోజయము, ఇంద్రియజయము గలిగి యర్థముతో గూడి ప్రణవమును జపించునో, మఱియు ఉపనిషత్పారా యణము వేదాంతార్థవిచారణయు చేయునో– అట్టివాడిచటనే ఈ దేహముతో నుండునపుడే మోక్షమును బొందగలుగును

బ్రహ్మనిష్ఠులయొక్క యంతిమస్థితి యీలాగున నుండవలయును ఇంద్రియజయము గలిగి ప్రణవముయొక్క నాల్గవ పాదమును భావనచేసికొని యోంకారమును జపించుటయు, ఉపనిషత్పారాయణయు, వేదాంత విచార ణయు గలిగియుండవలయును

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**జ్ఞాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥**

తనయాత్మను క్రింది అరణిగాను, ప్రణవమును పై అరణిగాను చేసికొని జ్ఞాననిర్మథనము చేయునప్పుడు, అరణినుండి అగ్ని యుదయించు నట్లు ఆత్మలో పరమాత్మను దర్శింపగల్గును

కట్టెలో నిప్పు నిగూఢమై యున్నప్పటికిని అరణిగాచేసి తరచునప్పుడు నిప్పు పుట్టి కొయ్యను కాల్చివేయునట్లు పైజెప్పిన అభ్యాసమువలన జ్ఞానము గలిగి అజ్ఞానమును నశింపజేయును ఆలాగున క్షీరమున నవనీతము నిగూఢమై యుండినను చిలుకుటచే వెన్న బయలుదేరునట్లు, ఆత్మలో పర మాత్మయు ధ్యానమథనమువలన గోచరించును

**ఓంకారాది జపోఽప్యేవం భావగర్భో హ్యుదాహృతః ।**
**ధ్యేయవస్తుస్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః ॥**

ప్రణవము మొదలగు మంత్రజపములు తత్తద్దైవభావ గర్భితములుగా నుండవలయును ధ్యేయవస్తువుయొక్క దృఢజ్ఞానముకొరకు జప మేర్పడినది

''ధ్యేయవస్తు స్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః'' అని చెప్పుటచే సాకార రూపమైనను నిరాకార రూపమైనను ధ్యానించువారు ధ్యేయా కారముయొక్క దృఢత కలుగుటకొఱ కాయా మంత్రములను జపిం చవలయునని యేర్పడినది ఆలాగున జపము ధ్యానమై మారునప్పుడు జప ముగూడ ఆగిపోయి ధ్యేయాకారమాత్ర వస్తువై నిలుచును అట్టి స్థితి గలుగువరకు జపధ్యానాదులు గలిగియుండవలయును

**ప్రణవస్సర్వవేదాదిః ప్రణవశ్శివవాచకః ।**
**మంత్రాధిరాజరాజశ్చ మహాబీజ మతఃపరమ్ ॥**

ప్రణవము సర్వవేదములకు ఆదిమూల మైనది ప్రణవము ఈశ్వర వాచకము (మంగళస్వరూపము) ప్రణవము మంత్రము లన్నిటికి రాజాధి రాజుగా నుంటున్నది దీనికే మహామంత్రమనియు, మంత్రబీజమనియు పేరు గలదు దీనికి మించిన మహామంత్రము మఱి యొకటి లేదు

**ఓమితీదం సర్వమితి శ్రుతిరాహ సనాతనీ ।**
**భవంతోఽపి విదిత్వైవం ప్రణవార్థమహేశ్వరమ్ ॥**
**వేదగుహ్యం చ సర్వస్వం తారకం బ్రహ్మ ముక్తిదమ్॥**

సర్వమును ఈ ప్రణవస్వరూపమని సనాతనమగు వేదము పలుకుచున్నది. అందువలన మీరందరును ఈ ప్రణవస్వరూపమును ఈశ్వరస్వరూపముగా నెఱుంగవలయును ఇది వేదములలో నిగూఢమైనది సమస్తమును దీనియందు గలదు ఇదియే ముక్తి నిచ్చెడి తారక బ్రహ్మస్వరూపము అని సూతసంహిత మహేశ్వరుండు సనకాదిఋషుల కుపదేశించెను

**జపంతః ప్రణవం నిత్యం ముచ్య న్తే సర్వపాత కైః ।**
**సదాభ్యాసేన సంయుక్తాః పరం మోక్షం లభన్తి చ ॥**

ప్రణవమును బ్రహ్మానుసంధానముగా జపమాచరించువారు సర్వపాపములనుండి విముక్తు లగుదురు అట్టి ప్రణవాభ్యాసముతో గూడిన వారు శ్రేష్ఠమగు మోక్షమును బొందుచున్నారు

**ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।**
**కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ ॥**

సృష్ట్యాది బ్రహ్మదేవుని కంఠమునుండి వెలువడిన శబ్దములు రెండు మొదటిది ''ఓంకారము'' రెండవది ''అథ'' అనెడి శబ్దము కావున నివి రెండును పరమపవిత్రములైన మంగళ శబ్దములు

ఓం శాంతిః శాంతిః శాంతిః

సంపూర్ణము

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు

ఓమ్ తత్ సత్



ఓమ్

# పీఠిక

## ''నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప! ''

ఓ అర్జునా! నాయొక్క దివ్యములైన విభూతులకు అంతము లేదని శ్రీ కృష్ణభగవాను డుపదేశించడమైనది భగవంతు డేలాగున అనంతుడో, ఆలాగున భగవచ్ఛక్తియు అనంతమే యని మనము గ్రహించుకొనవలయును ఆలాగున ''అనంతా వై వేదాః'' వేదములుగూడ అనంతములు అప్పుడు వేదార్థములు గూడ అనంతములని అంగీకరించవలయును భగవద్గీత జ్ఞానరత్నముల ఖని గనిలో త్రవ్వగ త్రవ్వగ రత్నములు బయటబడునట్లు గీతను ధ్యానించగ, చింతించగ జ్ఞానరత్నములు బయలుపడుచుండును అయితే దీనికి భగవదనుగ్రహము గలిగియుండవలయునని మరువకూడదు ఆకాశము వర్షాకాలమున మేఘావృతమై యుండగ ప్రకాశముగల చంద్రుడుగాని, సూర్యుడుగాని కనిపించరు శరదృతువు వచ్చునపుడు మేఘము తెల్లబడుటవల్ల సూర్యచంద్రులు సుమారుగ గోచరింతురు వసంత గ్రీష్మ ఋతువులు ఆవిర్భవించినపుడు ఆకాశ మెంత నిర్మలముగా నుండునో, అపుడు నక్షత్రములు, అతి సూక్ష్మనక్షత్రములు గూడ ఎట్లు దృష్టికి గోచరించునో, ఆలాగున హృదయము నిర్మలమై, వినిర్మలమై రాగా రాగా సూక్ష్మమైన ఈశ్వరశక్తి, నిగూఢమైన గీతార్థము మనకు గోచరించును ఇదివరలో గీతాశయము, గీతాప్రభావము వ్రాయడమైనది ఇపుడు ''గీతాగమనము'' అను దానిని గూడా వ్రాయ తలంపు గలిగినది ఇక ఈ విషయమై విస్తరింపం బూనలేదు. ప్రస్తుత విషయములోకి ప్రవేశించెద

భగవద్గీతా మాహాత్మ్యము మామూలుగా వరాహపురాణమందు భూదేవికి శ్రీవిష్ణుమూర్తి యుపదేశించినది అన్ని గీతలలోను 23 శ్లోకములు గలది మాత్రమే కలదు నైమిశారణ్యమందు శౌనకాది మహర్షులకు సూతమహర్షి గీతామాహాత్మ్యము నుద్దేశించి 52 శ్లోకములు చెప్పెను ఇది మహాభగవద్గీతయందు గలదు

ఋషిరువాచ -

**గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత! మే వద ।**
**పురాణమునినా ప్రోక్తం వ్యాసేన శ్రుతిచోదితమ్ ॥**

అనేకవిధములైన కథలను వినుచు శౌనకఋషి సూతమహర్షి నిట్లు ప్రశ్నించెను "ఓ సూతమహర్షీ! శ్రీ వ్యాసమహర్షిచే చెప్పబడిన ప్రకారము వేదోక్తమగు శ్రీ మద్భగవద్గీతా మాహాత్మ్యమును నాకు చెప్పుము"

సూత ఉవాచ -

**పృష్టం వై భవతా యత్తన్మహద్గోప్యం పురాతనమ్ ।**
**న కేన శక్యతే వక్తుం గీతామాహాత్మ్యముత్తమమ్॥**

శౌనకమహర్షియొక్క ప్రశ్నను విని సూతుడిట్లు వచించెను ఓ శౌనకమహర్షీ! నీవు ఏ గీతామాహాత్మ్యమును గురించి అడిగితివో, అయ్యది అతిగోప్యమై, ప్రాచీనమైనదిగా ఉంటున్నది అందువలన గీతయొక్క అత్యుత్తమమైన మాహాత్మ్యమును సంపూర్ణముగా ఎవ్వడును చెప్పుటకు సమర్థుడు కాడు

సూతుడు చెప్పిన ఈ క్రింది శ్లోకమును గ్రహించిన గీతార్థ మెటువంటిదో అందరున్నూ గ్రహించుకొనగలరు

**కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌన్తేయ ఏవ చ ।**
**వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః ॥**

ఈ గీతామాహాత్మ్యమును సంపూర్ణముగా శ్రీకృష్ణభగవాను డొక్కడే యెరుగుచున్నాడు మరియు అర్జునుడు కొంచెము ఎరుగుచున్నాడు అట్లే కొంచెము శ్రీ వ్యాసమహర్షి, శుకమహర్షి, యాజ్ఞవల్క్యమహర్షి, శ్రీ జనకచక్రర్తులు ఎరుంగుచున్నారు.

**గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః ।**
**మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలకహాస్యతామ్ ॥**

ఎవడైతే గీతాసంబంధమైన జ్ఞానము నెల్లప్పుడు అభ్యాసయోగముచే వినుట లేదో, ఆ మూర్ఖుడు మోక్షమును కోరినట్లయినచో బాలకునివలె పరిహాసాస్పదు డగుచున్నాడు

బాలకుడు నేను మోక్షమునకు పోవుచున్నానని చెప్పినచో అది యెంత అర్థశూన్యమైనదో గదా! ఏలన బ్రహ్మనిష్ఠులైన వేదార్థ మెఱింగిన వారిచే పొందదగినది మోక్షము ఆలాగున గీతాశాస్త్రమును చదువక మోక్షము గలుగునని చెప్పుటయు అటువంటిదే

**మోక్షస్థానం పరం పార్థ! సగుణం వాఽథ నిర్గుణమ్ ।**
**సోపానాష్టాదశైరేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

ఓ అర్జునా! సగుణమైనట్టి లేక నిర్గుణమైనట్టి మోక్షస్థానమునకు 18 అధ్యాయములను సోపానములుగా చేసికొని మనుష్యుడు పరబ్రహ్మమను మోక్షమును పొందచున్నాడు

శ్రీకృష్ణభగవానుడు సగుణ నిర్గుణోపాసనలు రెండున్నూ మోక్షహేతువులని తెలుపడమైనది

**దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి ।**
**యథా న వేదైర్దానైశ్చ యజ్ఞ తీర్థవ్రతాదిభిః ॥**

ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టు డగుచున్నాడో, అటుల వేదాధ్యయనముచేగాని, దానముచేగాని, తీర్థయాత్రచేగాని, వ్రతముచేగాని సంతుష్టు డగుట లేదు

గీతాప్రభావము ఎటువంటిదో దీనివల్ల తెలిసికొనవచ్చును

**పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై।**
**సంతుష్టాః పితరస్తస్య నిరయాద్యాంతి సద్గతిమ్ ॥**

ఎవడు శ్రాద్ధమునందు పితృదేవతలను గూర్చి గీతాపఠము చేయునో, యతనియొక్క పితృదేవతలు సంతుష్టు లగుచున్నారు మరియు నరక

విముక్తులై పుణ్యలోకమును పొందుచున్నారు

శ్రాద్ధకాలములో, గురువుయొక్క ఆరాధనకాలములో గీతా పారాయణము చేసిన కలిగెడు ఫలము ఇచట నిరూపించడమైనది

**గీతాపారేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః ।**
**పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాద తత్పరాః ॥**

ఇవ్విధముగా పితృదేవతలు శ్రాద్ధముచే మరియు గీతాపఠనముచే ప్రసన్నులై పుత్రునికి ఆశీర్వాదమిచ్చుచు పుణ్యలోకమునకు పోవుచున్నారు

తల్లిదండ్రులైన పుత్రులకున్నూ, గురువైన శిష్యులకున్నూ, దేవతలైన భక్తులకున్నూ ఆశీర్వాదమిత్తురు పితరులు పుత్రుల నాశీర్వదించి పితృలోకమునకు వెళ్ళుదురు

**శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః ।**
**పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాద తత్పరా ః ॥**

ఎవడు నూరు గీతాపుస్తకములను దానము చేయునో, వాని పితృదేవతలు వీనిని ఆశీర్వదించి ఈ గీతాదాన పుణ్యఫలముచే పుణ్య లోకమును పొందుచున్నారు

గీతాదానముయొక్క పుణ్యము ఈ శ్లోకమున నిరూపించడమైనది ఇది పూర్ణదానముయొక్క ప్రయోజనము ఇక వారి వారి శక్తి ననుసరించి చేసిన దానికి తగిన ఫలమును పొందగలరు

**సమ్యక్ శ్రుత్వా చ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్ ।**
**తస్మై ప్రీతోఽస్మి భగవాన్ దదామి మనసేప్సితమ్ ॥**

ఎవడు గీతార్థము విని గీతాపుస్తకమును దానము చేయుచున్నాడో, వానికి మనోవాంఛిత ఫలమిచ్చెదనని శ్రీకృష్ణభగవానుడు స్వయముగా పలికెను

పారాయణము చేయ శక్తి లేనివారు శ్రవణము చేయుచు గీతాదానము చేయవచ్చును వారు కోరిన ఫలమును పొందగలుగుదురు ఫలమును కోరనిచో మోక్షము ఇవ్వబడునని శ్రీ కృష్ణభగవానుడు స్వయముగా చెప్పెను ఫలమును గోరిన సకామకర్మ యగును ఫలమును కోరనిచో నిష్కామకర్మ యనంబడును

**భూతప్రేత పిశాచాద్యాస్తత్ర నో ప్రవిశంతి వై ।**
**అభిచారోద్భవం దుఃఖం పరేణాపి కృతం చ యత్ ॥**

ఏ యింటియందు గీతాపారాయణము జరుగుచున్నదో అచ్చట భూత, ప్రేత, పిశాచాదులు మరియు శత్రువుచే చేయబడిన మంత్ర, యంత్రాదిక అభిచారప్రయోగమువల్ల కలిగెడు బాధలెవ్వియు ప్రవేశింపజాలవు

గీతాపారాయణము స్వగృహములోగాని లేక యితరస్థలములో గాని చేయుచుండిన యాస్థలములోనికి పై జెప్పిన దోషము లెవ్వియు ప్రవేశింపజాలవు ఓమ్

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు
ఓమ్ తత్సత్

చరాచర సుఖాభిలాషి
మలయాళస్వామి



# శ్రీ గీతాగమనము

## ప్రథమ కాండము - కర్మయోగము

గీతాగమనమనియు, గీతామార్గమనియు, గీతయొక్క నడత యనియు, గీతాప్రయాణమనియు, గీతయొక్క పోకడ యనియు ఈ శబ్దములన్నియు పర్యాయపదములే యగును శ్రీ భగవద్గీత వేదసారమనియే మహనీయాత్ములందరున్నూ, పండితప్రవరు లందరున్నూ అంగీకరించియే యున్నారు అయినను మతప్రవక్తలలో కొందరు గీత దైవోపాసననే తెలుపుచున్నదనియు, మరికొందరు కర్మయోగమునే వచించుచున్న దనియు, ఇంకకొందరు యోగమార్గమునే యుపదేశించుచున్నదనియు, వేరు కొందరు జ్ఞానమునే నిరూపించుచున్నదనియు తెలుపుదురు వీర్లలో ద్వైత విశిష్టాద్వైత అద్వైతమతస్థులందరున్నూ అంతర్భూతులై యుంటున్నారు త్రిమతస్థులున్నూ వీరిలో చేరినవారలే

ఇక వేదార్థనిర్ణేత లగువారు కర్మ, భక్తి, జ్ఞానములతో మిళితమై యుండినదే భగవద్గీత యని వక్కాణింతురు ఏలన, వేదము కాండత్రయా త్మకము అనగా కర్మయోగ, భక్తి యోగ, జ్ఞానయోగములతో కూడినది అప్పుడు వేదముయొక్క సారమే గీత యైనచో కాండత్రయమున్నూ గీతయందు ఉండేతీరవలెను సముద్రమునుండి ఒక్క జలబిందువును తీసి పరిశోధించిన ఆ మహాసముద్రమునకున్న ఉప్పుగానుండుట, ద్రవత్వము మొదలగు గుణములు తప్పనిసరిగా ఆ బిందువునందు కూడా ఉండే తీరవలెను ఆలాగున వేదసముద్రము యొక్క యంశమే గీత యైనచో కాండత్రయాత్మకమగు వేదసారము గీతలో నుండవలెను కదా! మహామేరువునుండి తీసి ఒక్క చిన్న రాతిముక్కను పరిశోధించిన మేరుపర్వత శిలయందు గల లక్షణమంతయు ఆ చిన్న రాతి ముక్కయందు కూడా

కనుపించును.

ఆలాగున మేరువంత గొప్పదగు వేదముయొక్క యంశమే శ్రీభగవద్గీత యైనచో ఆ లక్షణమంతయు సూక్ష్మముగా గీతయందు కనబడవలెను అయితే పై చెప్పిన త్రిమతస్థులున్నూ, కర్మోపాసనను జ్ఞానమునూ గీతలో అంగీకరించినను, కొందరు కర్మయోగమే శ్రీకృష్ణసిద్ధాంతమనియు, మరికొందరు ఉపాసన యనగా భక్తియోగమే శ్రీకృష్ణమతమనియు, వేరుకొందరు జ్ఞానమే కృష్ణభగవానుని లక్ష్యమనియు వచింతురు వారంగీకరించిన భాగమునకు అన్యములగు రెండునూ వారు నిర్ణయించిన దానిని జేరుటకు మార్గములనియు వాదింతురు వారు అంగీకరించిన మార్గమే ముఖ్యమనియు, తక్కినవి రెండున్నూ గౌణములనియు నుపన్యసింతురు వారనుసరించునదే సాక్షాన్మోక్షసాధనమనియు, తక్కినవి రెండున్నూ పరంపరామోక్షమును కలుగజేయునవనియు వాదింతురు ఈ సత్యము ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతుల గీతాభాష్యములలోను, మతాసంప్రదాయ గ్రంథములలోను చూడందగును అయితే భావములో ముగ్గురికిని అభిప్రాయభేదములుండినను వారందరున్నూ వేదములను, వేదసారమగు భగవద్గీతను పరమప్రమాణములని నమ్మువారలే, పారమార్థికులే, భగవదంశభూతులే, జగద్గురువులే, మనందరికిన్నీ వంద్యులే సంశయము లేదు

పండితులు పై జెప్పినవారిని కర్మకాండోద్ధారణ కొరకున్నూ, ఉపాసనాకాండోద్ధారణకొరకున్నూ, జ్ఞానకాండోద్ధారణ కొరకున్నూ భగవదంశసంభూతులై యవతరించిన వారలనియే తలంతురు వీరిలో శ్రీ మధ్వాచార్యులు కర్మకాండోద్ధారణ కొరకున్నూ, శ్రీరామానుజాచార్యులు ఉపాసనకాండోద్ధారణ కోరకున్న శ్రీశంకరులు జ్ఞానకాండోద్ధారణ కొరకున్నూ అవతరించివారలే యని నమ్ముదురు

జీవులయొక్క సంస్కార గుణములను బట్టి ఈ ముగ్గురున్నూ లోకమునకు అత్యవసరమైనవారని వారు తలంతురు దేహేంద్రియముల

యొక్క శుద్ధి యుత్తమసంస్కారమగు కర్మయోగముచేతనే సిద్ధించును. జీవుల యొక్క యాత్మశుద్ధి దైవోపాసనాయోగముచేతనే కలుగును. ఆత్మ పరమాత్మల యొక్క ఏకత్వమనెడు జ్ఞానము బ్రహ్మవిచారణముచేతనే సిద్ధించును అపుడే సంశయ, విపర్యయ, అసంభావనలనెడు మూడు దోషములును నశించును వైరాగ్యాది సాధనచతుష్టయ సంపత్తి బ్రహ్మవిద్యకు బహిరంగ సాధన మనియు, శ్రవణ మనన నిదిధ్యాసనములు అంతరంగ సాధనములనియు వేదాంతశాస్త్రముయొక్క సిద్ధాంతము పై నుదాహరించిన ఉపాసనాకాండమున శైవవైష్ణవాదు లందరునన్నా అతర్భూతులు యోగముకూడా ఉపాసనాకాండములో అంతర్భూతము పాతంజలాది యోగగ్రంథములలో ఇది కనందగును ఇక ఈ విషయమై యెక్కువ చెప్పందలంచలేదు

ప్రస్తుత కార్యక్రమములోనికి మరలెద ఈ విషయమై శ్రీమధు సూదనసరస్వతీ స్వాములవారు తమ గీతాభాష్యమునందు ఈలాగున వ్రాసిరి

**సహేతుకస్య సంసారస్యాత్యంతోపరమాత్మకమ్ ।**
**పరం నిశ్శ్రేయసం గీతాశాస్త్రస్యోక్తం ప్రయోజనమ్ ॥**

**సచ్చిదానందరూపం తత్పూర్ణం విష్ణోః పరంపదమ్ ।**
**యత్ప్రాప్తయే సమారబ్ధా వేదాః కాండత్రయాత్మకాః ॥**

**కర్మోపాస్తి స్తథా జ్ఞానమితి కాండత్రయం క్రమాత్ ।**
**తద్రూపాష్టాదశాధ్యాయైర్గీతా కాండత్రయాత్మికా ॥**

సహేతుకమైన సంసారముయొక్క నివృత్తిరూపకమైన మోక్షము నొసంగుటయే గీతాశాస్త్రమునకు పరమప్రయోజనమని చెప్పబడినది సచ్చిదానందరూపమగు పరిపూర్ణపరమపద ప్రాప్తికొరకే వేదములుకూడా కాండత్రయాత్మకముగా నారంభింబడినవి కర్మ, ఉపాసన, జ్ఞానకాండము లని వానికి పేర్లు ఆ వేదరూపమై అష్టాదశాధ్యాయములతో కూడిన భగ

వర్ధీతయు క్రమముగా కర్మ, ఉపాసన, జ్ఞానకాండ త్రయాత్మమై యున్నది.

ప్రథమాధ్యాయమునుండి షష్ఠాధ్యాయాంతము వరకు నిష్కామకర్మ యోగమును, సప్తమాధ్యాయమునుండి ద్వాదశాధ్యాయాంతము వరకు (ఉపాసన) భక్తియోగమునూ, త్రయోదశాధ్యాయమునుండి అష్టాదశా ధ్యాయాంతమువరకు జ్ఞానయోగమును తెలుపడమైనది షష్ఠాధ్యాయాంత మున ఆత్మసంయమయోగమును అనగా యోగమును తెలుపుటచేత యోగముగూడ దీనియందంతర్భాగముగా నుంటున్నది నిష్కామకర్మ యోగాంతమున ఈ యోగశాస్త్రము నుపదేశించుటవల్ల యోగసాధనచే దేహేంద్రియ మనస్సులయొక్క శుద్ధి కావలసియుండునని స్పష్టమగుచున్నది అట్టి యంతఃకరణశుద్ధి కలిగిన తరువాత ఉపాసనాయోగమగు భక్తియోగము ఆరంభించబడినందుచేత ఉపాసనవల్లనే జీవునియొక్క ఆవిద్యకమగు మలము నశించవలయునని తెలియుచున్నది తర్వాత పదమూడవ అధ్యాయము నుండి జ్ఞానయోగము నారంభించినందుచే కర్మ, ఉపాసన, జ్ఞానములనెడు కాండత్రయముయొక్క అర్థము స్పష్టపడుచున్నది

అంతఃకరణములో మల విక్షేప ఆవరణములని మూడు దోషములు గలవు (1) మలము- పాపముతో కూడినది ఇది పూర్మజన్మకృతముగా నుండవచ్చును వర్తమానజన్మకృతముగా నుండవచ్చును ఇది తమోగుణ సంబంధము (2) విక్షేపము - ఇది రజోగుణసంబంధము ఇట్టి గుణము గలవారి మనస్సు చంచలత గలిగియుండును, వీరికి నిశ్చలత్వముండదు (3) ఆవరణము - ఇది ఆత్మను తెలియనీయక ఆచ్ఛాదనము చేయుచుండును అంతేగాక ఆత్మస్వరూపమును మరుగుపరచి తెలియనీయక అవిద్యాశక్తివల్ల దేహాత్మబుద్ధిని కలుగ జేయుచుండును

(1) నిష్కామపరమగు పుణ్యకర్మచే మలనివృత్తియు, దైవోపాసనచే విక్షేపనివృత్తియు, సాధనచతుష్టయ సంపన్నుడై మహాత్ములగు గురువుల వద్ద వేదాంతవిచారణ చేయుటవల్ల ఆవరణ నివృత్తియు నగును ఈ మూడు దోషముల నివృత్తికొరకై కర్మోపాసనా జ్ఞానములను మూడు మార్గము

లేర్పడినవి ప్రతివారున్నూ తప్పనిసరిగా ఈ మూడున్నూ అనుష్ఠించియే తీరవలెను

అయితే పాపము సంపూర్ణముగా నశించినవాడైనచో ఉపాసనా యోగమున్నూ, విక్షేపము నిశ్శేషముగా నశించినవాడైనచో జ్ఞానయోగ మున్నూ అవలంబించిన చాలును అయితే ఈ మూడు దోషములు తనయందు నశించినవా యని ప్రతి ముముక్షువు, సాధకుడు, బ్రహ్మ విచారణాపరుడు తనలో తానే విచారణ చేసుకొనవలయును లేనిచో ప్రమాదములో పడిపోవుటకు అవకాశము గలుగును జ్ఞానయోగావలంబు లైనవారు గూడ పైనుదాహరించిన కర్మోపాసనా యోగములను అవలంబించిన దోషము లేదు గాని మల విక్షేప జనిత దోషములు తమయందే దైన ఉండినచో, ఈ రెండు యోగములను అనుసరింపకపోయిన తప్పక ప్రమాదము కలుగును ఇదే దీనియందుగల నిగూఢ రహస్యము పూర్వీక ఋషులకున్నూ, వర్తమాన జ్ఞానులకున్నూ గల భేదమిదే ఈ విషయము గీతాప్రభావమను గ్రంథమున చూడందగును దానియందు గీత త్రిషట్కమందును అన్ని అధ్యాయములోను నిష్కామకర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగమును తెలుపు టకు గల కారణములను నిరూపించి ఆయా యధ్యాయములలో గల శ్లోకములనుకూడ నిరూపించడ మైనది శ్రీ శంకరభగవత్పాదులు గూడ వేదాంత డిండిమమందు ఈ సత్యమును నిరూపించిరి

**కర్మాణి చిత్త శుద్ధ్యర్థమైకాగ్ర్యార్థ ముపాసనా ।**
**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞాన మితి వేదాంతడిండిమః ॥**

హృదయనైర్మల్యముకొరకై సత్కర్మలు విధింపబడినవి మనస్సు యొక్క ఏకాగ్రతకై ఉపాసనాకాండ నియమింపబడినది దుఃఖలేశమును లేని పరమసుఖరూపమగు మోక్షమును బడయుటకు బ్రహ్మజ్ఞానము ఏర్పడినది అని వేదాంతభేరి మ్రోగుచున్నది

ఇప్పుడు కాండత్రయాత్మకమగు వేదముయొక్కయు, షట్కత్రయ మగు గీతయొక్కయు, వేదాంతాచార్యులగు శంకరునియొక్కయు యభిప్రాయమును ముముక్షు జనులారా! తెలిసికొన్నారుగదా! ఇక దీని కన్న పరమప్రమాణ మేమికావలయును? ఈ సత్యమును తెలిసికొనకనే వేదాంతులలో కొందరు నిష్కామకర్మయోగమును, భగవదుపాసనా యోగమును చిన్న చూపుతో చూచుచున్నారు ఒకవేళ వారిలో ఎవరికైన మల విక్షేపములు నశించియుండునుగాక! అయితే వారుగూడ పై జెప్పిన మార్గములవల్లనే ఇప్పుడు ఈ జ్ఞానస్థితిలోనికి వచ్చియున్నారని మరచి పోవుటవల్ల కృతఘ్నుతా దోషమునకు పాత్రులగుదురని మాత్రము మరువక యుందురుగాక!

సూర్యుడు అంతట ఒకే విధముగా ప్రకాశించుచుండువాడైనను, నిర్మలముగను,నిశ్చలముగను, నిరావరణముగ నున్న పాత్రలో మాత్రమే కనిపించును. చంద్రుడున్నూ ఆలాగుననే నీటిలో తనముఖమును చూచుటయును ఆలాగుననే యుండును అట్లు హృదయనిర్మలత్వమున్నూ, నిశ్చలత్వమున్నూ, నిరావరణత్వమున్నూ గలుగునపుడే హృదమునకు సాక్షియై వెలుగుచుండు ఆత్మను, దైవమును చూడగలుగును పాత్రము ఏ లోహముతో ఏ యాకృతిలో చేయబడినదైనను విరోధము లేదు నీటికి నిర్మలత్వ నిశ్చలత్వ నిరావరణత్వములు కలిగియుండే లాగున మీరు చూచు కొనిన చాలును బ్రాహ్మణాది ఏ జాతులలో, సన్న్యాసాది ఏ యాశ్రమము లలో నుండిన స్త్రీ పురుషులైనను పై జెప్పిన విధముగా అంతఃకరణములో గల మూడు దోషములు లేనివారైనచో మీలో గల దైవమును మీ యాత్మ స్వరూపముగా తెలిసికొనగలరు దర్శించగలరు అదే మీరై యుండగలరు మరియు దీపము వెలుగవలసియుండిన - ప్రమిద, తైలము, వత్తి మూడు నుండవలయును, ఆలాగున జ్ఞానజ్యోతి వెలుగవలసియుండిన నిష్కామ కర్మయోగమును ప్రమిదగాను, తైలమును ఉపాసనాయోగముగాను, జ్ఞానమును వత్తిగాను నిశ్చయించుకొనవలయును అప్పుడు జ్ఞేయమగు

యాత్మజ్యోతి వెలుగుచుండును అత్తరి అజ్ఞానమనెడి చీకటి తొలగిపోవును ఆలాగున మీరు మోక్షస్థాపనమను గమ్యమును చేరవలసియుండిన బాయిలరు అను కర్మయోగమును, జలమగు భక్తియోగమును, అగ్నియగు జ్ఞానయోగమును, అగ్నియగు జ్ఞేయయోగమును అవలంబించి ప్రయాణము చేయువలయును అప్పుడు మంచి యింజన్ తగిలించిన రైల్వేపెట్టెలో ప్రయాణించినట్లుండును త్వరితముగా గమ్యస్థానమగు మోక్షమును పొందవచ్చును

ఆలాగున ఒక దేవాలయములో ప్రవేశించి దేవుని దర్శనము చేయవలసియుండిన 1 ముఖమండపము, 2 అంతరాళస్థలము, 3 మూల స్థానముయొక్క ద్వారము దాటిపోవలయును ఆలాగున శరీరమనెడు దేవాలయములో నుండు దేవుని చూడవలసియుండిన కర్మయోగమనెడు ముఖమండపమును, భక్తియోగమనెడు అంతరాళస్థలమును, జ్ఞానయోగ మనెడు మూలస్థాన దేవాలయ కవాటమును దాటవలయును కావున కర్మ యోగముచే దేహేంద్రియ శుద్ధి గలిగి, ఉపాసనాయోగముచే సూక్ష్మదేహ మున్నూ, జ్ఞానయోగముచే కారణదేహమును దాటవలయును కనుకనే గీతలో ''ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయుతే'' యని యుపదేశించిరి ''క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'' యని యుపదేశించుటకు కారణమిద్దియే

**జ్ఞాన లభ్యం పరం మోక్షం ప్రాహుస్తత్వార్థ చింతకాః ।**
**తద్జ్ఞానం భక్తిమూలం చ భక్తిః కర్మవతాం తథా ॥**

వేదావేదాంతార్థ తత్వము నెరింగిన పరమఋషులు పరమోత్కృష్ట మగు మోక్షము ఆత్మజ్ఞానముచేతనే గలుగుననియు, అట్టి జ్ఞానము అనన్యదైవభక్తి వలననే సిద్ధించవలెననియు, అట్టి భగవద్భక్తి నిష్కామ కర్మయోగానుష్ఠానము వలననే లభించవలసియుండుననియు వచించిరి ఇది కాండత్రయాత్మకమగు వేదముయొక్క సిద్ధాంతము సూక్ష్మముగా

తెలుపడమైనది మరియు ఆత్మబోధయందు శ్రీ శంకరాచార్యులు తెలిపినది చూడుడు

**సదా సర్వగతోఽప్యాత్మా న సర్వత్రావభాసతే ।**
**బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥**

సూర్యుండు భూమి యంతటను ప్రకాశించినను రాళ్ళు, మట్టి మొదలగు స్థలములలో ప్రతిబింబించుటలేదు ఆలాగున ఆత్మ అందరిలోను ఉన్నప్పటికిన్నీ ప్రకాశించుట లేదు నిర్మలమైన దర్పణమునందు సూర్య బింబము ఎట్లు బాగుగా ప్రతిబింబించునో, ఆలాగున ఆత్మయు అందరిలోను సమానముగా నున్నప్పటికిన్నీ స్వచ్ఛమైన బుద్ధియందు మాత్రమే ప్రకాశించును ఇందువల్ల ఆత్మ అందరిలోను సమానముగా నుండునది సత్యమైనచో అందరికిన్నీ ఆత్మజ్ఞానము కలుగవలసినదిగదా! ఈశ్వరుండు ఏల పక్షపాతముగా సృష్టించవలయునన్న ప్రశ్నకు సమాధానము లభించడమైనది ఇచట మలవిక్షేపావరణములు మూడున్నూ తొలగ వలయునని గ్రహించేది మరియు ఈ విషయమై అమృత బిందూపనిషత్తు తెలిపినది చూడుడు

**ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।**
**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥**

పై చెప్పిన విధముగా ఇచట చంద్రబింబమును గురించిగూడా నిరూపించడమైనది చంద్రుడు సమముగా భూలోకమంతట ప్రతిబింబించు చున్నను గోడ, పలక మొదలగు వానిలో కనిపించుటలేదు స్వచ్ఛమైన నీటిలోను, అద్దములోను స్పష్టముగా గోచరించుచున్నాడు ఆలాగున ఆత్మ లేక ఈశ్వరుడు అందరిలోను పక్షపాతము లేక వెలుగుచుండినను నిర్మల హృదయములందు మాత్రమే గోచరించుచుండును కావున హృదయశుద్ధి, ఆత్మశుద్ధి అందరున్నూ చేసికొనవలయును అప్పుడు ఈశ్వరసాక్షా త్కారము, ఆత్మసాక్షాత్కారము అందరికిన్నీ గలుగును

ఇక ప్రస్తుత విషయములోనికి మరలెద కాండత్రయాత్మక మగు వేదముయొక్క మొదటిభాగమగు కర్మయోగమున్ను, గీత యొక్క ప్రథమ షట్కమగు ఆరుఅధ్యాయములున్ను నిష్కామకర్మ యోగమును ఉపదేశించుటవల్ల గీత వేదముయొక్క సారమని యిదివరలో తెలుపడమైనది ఈ ఆరు అధ్యాయములలో నిష్కామకర్మయోగమును గురించిన ముఖ్యము లైన ప్రమాణములు మాత్రము ఇచట చూపబడును వేదమని చెప్పుటవల్ల వేదాంతమని కూడా గ్రహించుకొనవలెను

**న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥**

పురుషుడు చేయవలసిన యనుష్ఠానములను చేయకపోవుటచేత, నిష్కామకర్మముచేత పొందవలసిన పదవిని పొందడు నిష్కామ కర్మాను ష్ఠానమును వదలుటచేతను లేక దేహసన్న్యాస మాత్రముచేతను నైష్కర్మ్యసిద్ధిని పొందడు

నైష్కర్మ్యసిద్ధి యనగా నిష్కామకర్మయోగముచే పొందవలసిన జ్ఞానమని అర్థము సురేశ్వరాచార్యులు వ్రాసిన నైష్కర్మ్యసిద్ధి యను గ్రంథములో కర్మయోగమును దూరీకరించినట్లు కొందరు చెప్పుదురు ఆ గ్రంథము నామూలాగ్రము చదివి పూర్వాపరములను పరిశోధించిన ఈ సత్యము బోధపడును అపుడు శ్రీకృష్ణభగవానుని ఆశయము నను సరించియే సురేశ్వరాచార్యులు ప్రవర్తించినట్లు గోచరము గాగలుగును

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥**

ఎవరెవరు ఏయే స్థితిలో నుందురో, వారికి తగిన యనుష్ఠానము చేయకుండుటకన్న చేయుట మేలైనది కాబట్టి నీవు శాస్త్రముచే నియమింప బడిన అనుష్ఠానము చేయుము ఏలయనగా కర్మము చేయకుంటివేని జీవయాత్రకూడా చక్కగా జరుగదు

శ్రీకృష్ణభగవానుడు సామాన్యముగా మోటు జనులగురించియు ఇచట తెలుపడమైనది అట్లుండగా శ్రేష్ఠులను గురించి మరల చెప్పవలయునా! ప్రత్యక్షముగా ప్రపంచమున చూడుడు అనేకులు సోమరులు, యాచకులు జీవనోపాయమునకు తగిన కర్మగూడా చేయక అన్నము, వస్త్రము, నివాస స్థలముకూడ లభింపక శ్రమపడుచున్నారు గదా! ఇచటనే ఈ లాగున నుండువారు పరమున శాశ్వత సుఖమగు కైవల్యమును ఎట్లు పొందగలరు? వీరే ఈలాగున నుండగా ముముక్షువులని, సన్న్యాసులని చెప్పి తిరుగుచుండు అనుష్ఠానము లేనివారి గతిని ఏమని చెప్పవలయును? నిష్కామ కర్మయోగ పరులై, అనుష్ఠానపరులైన వారు సుఖజీవితము గలిగి ఎట్లు గౌరవార్హులై యుంటున్నారో ఈ సత్యమును గూడా చూడుడు

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥**

ఫలాభిలాషను వదలి విధిచోదితమైన కర్మను చేయువాడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును. కనుక నీవు ఫలాభిలాషను వదలి చేయదగిన కర్మను చేయుము

కర్మయోగముయొక్క కీలకము శ్రీకృష్ణభగవానుడు ఇచట నిరూపించడమైనది ఫలాసక్తితో కూడిన కర్మయే బంధించును ఫలాసక్తి వదలి చేయు కర్మ ముక్తిని కలుగజేయును. ఇదే గీతయొక్క ఆశయమని గ్రహించవలయును. గాంధీగారు వ్రాసిన గ్రంథమునకు అనాసక్తియోగమని పేరిడుటకు కారణ మిదియే

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥**

కర్మఫలము నందలి యాసక్తిని విడిచిపెట్టి యెల్లప్పుడును ఆత్మ యందు తృప్తి బొందిన మనస్సు గలవాడును, దేనినీ ఆశ్రయింపని వాడు నగుచు కర్మమునందు ప్రవర్తించినవాడైనను, కొంచెమైనను ఏ కర్మము నైనను

చేయనివాడే యగును

సోమరులు కర్మము చేయకనే బద్ధులగుచున్నారు సోఽహంపరులు నిష్కామ బుద్ధితో కర్మయోగమును చేయుచు కూడా ముక్తులగుచున్నారు

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥**

దేనియందును ఆశలేనివాడును, చిత్తమును దేహమును స్వాధీనములో నుంచువాడును, సమస్తవస్తుసంపాదనయందు ప్రీతి లేనివాడునునై శరీరము మాత్రము నిలుచుటకు తగిన నిషిద్ధముగాని పనిని చేయుచుండినను అజ్ఞానస్వరూపమగు సంసారబంధమును పొందడు అట్టి కర్మవలన సంయమికి సంసారమాలిన్యముగాని, కర్మబంధముగాని గలుగదు

విరక్తులై అపరిగ్రహవ్రతనిష్ఠ గలవారు ఎట్లు జీవింపవలయునో, ఆవిషయము నిచట తెలుపడమైనది ''శారీరం కేవలం కర్మ'' అని తెలుపుటవల్ల శరీర సంరక్షణకొరకు మాత్రమని గ్రహించవలయును యోగపరుడై యుండవలయునే కాని భోగపరుడై యుండరాదు జీవించుటకు మాత్రము తినవలయునుగాని తినుటకొరకు జీవించరాదు

**యుక్తః కర్మ ఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥**

నిష్కామకర్మయోగి ఫలాభిలాషను వదలి కర్మలను చేయుచు, చిత్తశుద్ధిద్వారా ఆత్మనిష్ఠ గలిగినందుచేత మోక్షమును పొందుచున్నాడు ఫలాభిలాషతో కర్మను చేయువాడు కోర్కెచేత ఫలమునం దాసక్తి గలవాడై కర్మచేత బద్ధుడగును

ఇది కర్మయోగముయొక్క రహస్యము

**యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।**

**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥**

యోగము నభ్యసించువాడు నియమింపబడిన మనోబుద్ధీంద్రియములు గలవాడును, ఆశలేనివాడును, దేనిని సంపాదించుటయం దిచ్ఛ లేనివాడును, ఏకాంతస్థలమునం దొంటరిగా నున్నవాడగుచు ఎల్లప్పుడును మనస్సును ఆత్మయందు లయపరచి ధ్యానించువాడుగా నుండవలయును

ఈ అధ్యాయమున్నూ, 4వ అధ్యాయమున కొంతభాగమున్నూ అష్టాంగయోగమును గూర్చి నిరూపించినవి ఇందువల్ల కర్మ, ఉపాసన, జ్ఞానములనెడు కాండత్రయమును గురించే వేదము తెలుపడమైనదనియు, వేదసారమగు గీతయు కాండత్రయమునే ప్రతిపాదించడమైనదనియు, యోగమును గురించి తెలుపలేనిదనియు తలంచనక్కర లేదు యోగము ఉపాసనాంతర్గతమని మొదటనే తెలుపడమైనది ఈ అధ్యాయమున యోగ సాధనను గురించి, సాధకుని గురించి విపులముగా వర్ణించడమైనది పాతంజల, హఠయోగ, ఘేరండసంహిత మొదలగు యోగగ్రంథములలో గల సారము సంగ్రహించి యిచట శ్రీకృష్ణభగవాను డుపదేశించడమైనది కావుననే ప్రతిఅధ్యాయాంతమందును ''ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే'' యని ప్రయోగించిరి దీనియందు యోగశాస్త్రము కూడా నిరూపించడమైనది

**యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమముగల యోగి పై చెప్పబడిన ప్రకారము ఎల్లప్పుడాత్మను పరమాత్మయందైక్యపరచి ధ్యానించెడు అలవాటు గలవాడై బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్యముగా గలదియు, నాయందుండునట్టియునగు ప్రకృతి శమించిన పరమశాంతియగు నిర్వాణమును పొందుచున్నాడు

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥**

ఓ శ్రీకృష్ణమూర్తీ! మనస్సు చపలస్వభావము గలది, దేహేంద్రియము లను బలవముగా క్షోభ పెట్టునది, మరియు ఎవనిచేతను నిరోధింప ప్రయాసకరమైనది కావున అట్టి మనస్సును, వాయువును నిరోధించుట ఎట్లు శక్యము కాదో, ఆలాగున నిగ్రహించుటకు అశక్యమైనదిగా నేను తలంచుచున్నాను

అర్జునుని వంటి వానికే మనోనిగ్రహము దుస్సాధ్యమై యుండగా ఇక సామాన్యుల గురించి చెప్పవలయునా! అయినను మనోనిరోధమున కుపాయము గలదని భగవాను డుపదేశించియున్నాడు

**అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥**

ఓ అర్జునా! మనస్సు నిగ్రహింప శక్యము కానిది, మిగుల చపలమైనది అనునట్టి విషయమునందు సందేహమేమియు లేదు అయినను ఓ అర్జునా! ఆ మనస్సును అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపవచ్చును

దీనియందు ''మనో దుర్నిగ్రహం'' అని చెప్పుటవల్ల మనోనిగ్రహము ప్రయాసముతో కూడినదని తెలిపిరే గాని యసాధ్యమని తెలుపలేదు అది అభ్యాసవైరాగ్యముల వల్ల నిగ్రహించుకొనవచ్చునని కూడా భగవానుండు తెలిపెను దేనికి ప్రభావము గలదో యది ప్రయాసముచేతనే సాధింప దగును ఇపుడు ప్రథమషట్కమగు కాండత్రయములో మొదటి దానిని సంక్షిప్తముగా వ్రాయడమైనది ఓమ్

## ద్వితీయ కాండము - ఉపాసనాయోగము

కాండత్రయాత్మకమగు వేదమున మొదట కర్మయోగమును ఉపదేశించడ మైనదని తెలుపడమైనది గీతయున్నూ ఆలాగున మొదట కర్మయోగమును ఉపదేశించి ద్వితీయ షట్కమగు 7వ అధ్యాయమునుండి 12వ అధ్యాయమువరకు భక్తి యోగమును గూర్చి తెలుపడమైనది కావుననే

12వ అధ్యాయమున భక్తియోగమును ఉపదేశించడమైనది నిష్కామకర్మ యోగముచే అంతఃకరణ శుద్ధి గలుగకపోయినచో నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానము కలుగదు హృదయనైర్మల్యము గలుగునప్పుడు ఈశ్వరు డొకడే శాశ్వతుడనియు, ఈ దేహాది జగత్తంతయు అశాశ్వతమనియు బుద్ధి యుదయమగును అప్పుడు ఈశ్వరకృపచేతనే తరించవలసియుండునని తత్త్వముదయమగును జీవుడు ప్రకృతికి అధీనుడనియు, అట్టి ప్రకృతి ఈశ్వరాధీనమనియు రహస్యము గోచరమగును అందువలన పరమేశ్వరుని కృప గలుగకపోయిన ప్రకృతినుండి విమోచనము గలుగజాలదను తత్త్వము అవగాహనము గాగలుగును ఇదే భగవద్భక్తిచేత గలిగెడు ప్రయోజనము

**మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ! ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥**

నాకంటె శ్రేష్ఠతరమైనది లేక అన్యమైనది మరియొకటి కొంచెమైనను లేదు పూసల సమూహములు దారమునందువలె ఈ సమస్త ప్రపంచము నాయందు కూర్చబడియున్నది

మొదటిపాదములో పరమాత్మకన్నా అన్యమైనది, ఉత్కృష్టమైనది కొంచెమైనను మరియొకటి లేదని తెలిపి, అట్టి పరబ్రహ్మము మణిగణములో దారమువలె అన్నిటిలోను అంతర్యామియై యుండి అన్నిటిని ఆ పరమేశ్వరుడే భరిస్తున్నాడని తెలుపడమైనది పూసలనేకరకములుగా ఉండినను, నూలు ఒకటిగా నున్నట్లు ఈ చరాచర ప్రపంచము లన్నిటిలోను ఒకే పరమాత్మ అంతర్యామియై వెలుగుచున్నట్లు నిరూపించ డమైనది ఉపాసనాకాండమందు ఉపాస్య ఉపాసకభేద ముండును అనగా జీవుడు వేరు, ఈశ్వరుడు వేరని భేదము గలదు మొదట చెప్పినది జీవేశ్వరుల యొక్క ఏకత్వమును గురించినదనియు, రెండవది ద్వైతమును గురించినదనియు గ్రహించుకొనవలయును అద్వైతవేదాంతము తప్ప తక్కిన మతము లన్నియు ఈ రెండవ మార్గమును అవలంబించియే యుండును

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥**

ఈ త్రిగుణాత్మకమైన నాయొక్క ప్రకృతి దేవసంబంధ మైనది అనగా నావలన కలిగినది కనుక సామాన్యులు దాట శక్యము కానిది ఎవరు నన్ను శరణుపొందుచున్నారో వారు ఈ మాయను ప్రయాసము లేకనే దాటుచున్నారు

దైవమాయ యనియు, విష్ణుమాయ యనియు, శివమాయ యనియు చెప్పునది యొకటియే కావుననే దైవనానుగ్రహము గలుగనిచో మాయను దాటుట సాధ్యము కాదని వచించెడు రహస్యము

**అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**

ఎవడైతే మరణకాలమునందు నన్నే స్మరించుచు లేక ధ్యానించుచు దేహమును విడిచిపోవుచున్నాడో, వాడు నాయొక్క విష్ణుస్వరూపమును లేక మోక్షమును పొందుచున్నాడు ఈ విషయమునందు కొంచెమైనను అనుమానము లేదు

లక్ష్యమును గురిపెట్టి విడిచిన బాణము లక్ష్యములో చేరునట్లు పరమేశ్వరధ్యానముతో దేహము వీడిపోయినవాడు పరమేశ్వరునే చేరును

**యం యం వాऽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్ ।**
**తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః ॥**

ఓ యర్జునా! ఎవండు మరణకాలమందు, ఏయే భావన గలవాడై దేహమును విడుచుచున్నాడో, వాడెల్లప్పుడున్నూ ఆయా రూపముయొక్క స్మరణముచేత కలిగిన సంస్కారము గలవాడైనందున ఆయా స్వరూపమునే పొందుచున్నాడు

ఈ శ్లోకము పై జెప్పిన దానిని దృఢపఱచుచున్నది. అయితే

అంత్యకాలమున దైవభావము గలిగియుండిన చాలునుగదా! ఇప్పటినుండి యేల చేయవలయును అని సంశయించవలదు అంత్యకాలమున కలిగిన మంచిదే, అయితే కలుగునా? లేదా యని ఎవరు చెప్పగలరు కావుననే ''సదా తద్భావ భావితః'' యని ప్రయోగించిరి అనగా మరణకాలమునకు పూర్వము హృదయమున ఎట్టి భావన గలిగియుండునో అదే అప్పుడు స్మృతికి వచ్చును ఒకవేళ అంతిమ స్థితిలో వాత పిత్త కఫాది దోషములచే స్మృతి లేకపోయినను, దేహము వదలిన పిమ్మట పూర్వముండెడు జ్ఞప్తి గలుగును ఒక ఉత్తరముపై అడ్రసు సరిగా వ్రాసి పోస్టులో వేసిన మన ప్రయత్నము లేకనే ఏ దేశములో ఎవరికి చేరవలయునో పోస్టల్ వారు ఆ జాబును వారికి చేర్చినట్లు అంత్యకాలమునకు ముందుగా హృదయములో గల, భావితస్థలములోనికి దైవదూతలు చేర్చుదురు

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

బ్రహ్మమును ప్రతిపాదించునట్టి ఏకాక్షరమగు ''ఓమ్'' అనునట్టి ప్రణవము నుచ్చరించినవాడై, ఆయోంకారమున కర్థమైన పరమాత్మయగు నన్ను స్మరించుచున్నవాడై, శరీరమును విడిచి ఎవడు పోవుచున్నాడో అట్టివాడెవడైనను సర్వోత్తమమైన మోక్షమును పొందుచున్నాడు

ప్రణవమును అందరున్నూ జపించవచ్చునా? అని కొందరు అడుగుదురు ఓంకారమను గ్రంథమును చదివిన ఈ సంశయము నివృత్తి గాగలదు దీనియందు ''మామనుస్మరన్'' అని ప్రయోగించుటవల్ల ఓంకారార్థమగు పరబ్రహ్మమును, పరమాత్మను భావనలో కలిగియుండ వలెనని నిరూపించడమైనది భావనలేని మంత్రము, జపము, తుపాకుమందు గూర్చి గుండువేయక ప్రేల్చిన వచ్చు శబ్దమువలె నుండును అది పట్టి శబ్దమే గాని లక్ష్యమును భేదింపజాలదు కేవలము మనస్సులో భావము మాత్రము కలిగి మంత్రము నుచ్చరించకపోయినను విరోధము లేదు మంత్రము నుచ్చరించి భావన లేనిచో పూర్ణఫలమును గలుగజేయదు మరియు ''యః

ప్రయాతి'' అని ఉండుటవల్ల పై విధమున ఎవరైనను ధ్యానించిన బ్రహ్మపదమును పొందవచ్చును

**అనన్య చేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥**

ఓ యర్జునా! ఏ యోగి యితర విషయమైన చింత లేనివాడై బ్రతికియున్నంతవరకును ఎడతెగక నన్ను స్మరించుచుండునో, సర్వ కాలములయందును సమాహిత చిత్తుడైన యట్టి యోగికి నేను సులభుడనై యుందును

ఈ శ్లోకము భక్తులపై కరుణ గలిగి శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించెను పై నుదాహరించిన ప్రణవధ్యానముతో బ్రహ్మభావన గలిగి యుండడము అందరికిన్నీ సాధ్యము కాదని తలంచి ''యో మాం స్మరతి నిత్యశః'' అని తెలుపడమైనది ఇచట భగవత్స్మరణ నామసంకీర్తన భజనయని గ్రహించదగినది కావుననే ''తస్యాహం సులభః పార్థ'' అని ప్రయోగించుట ఇది సులభమార్గమని చెప్పుటంవల్ల పైజెప్పినది ప్రయాసమని ధ్వన్యర్థముచే గ్రహించుకొనవచ్చును కావుననే పై శ్లోకమునకు పై భాగమున నుండు 12వ శ్లోకమున ''సర్వద్వారాణి సంయమ్య'' యని ప్రయోగించిరి ఈభగవత్ స్మరణ చేయువారికి కొన్ని విశేషణములు భగవానుడు నిరూపించి నాడు అవి ఎవ్వియన అనన్యచేతాః, సతతం, నిత్యయుక్తస్య, యోగినః – అనునవి భజనపరులు, సంకీర్తనపరులు ఈ పదములయొక్క అర్థమును బాగుగా యోచించుకొనవలయును, లేనిచో మందుమాత్రము సేవించి పథ్యము చేయనివారి గతియే గలుగును

**అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

ఏ పరమభక్తులు ఇతరచింతలు లేనివారై పరమదైవమగు పరమాత్మనగు నన్ను ఎల్లప్పుడును ధ్యానించువారై సేవించుచున్నారో, అట్లు

సర్వకాలములయందు సమాహితచిత్తులైన వారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను

''యోగక్షేమం వహామ్యహం''- తదేకనిష్ఠ గలవారికి గలిగెడు ప్రయోజనమేమియో, పరమభక్తులకు భగవంతుడు గలుగజేయునదేదియో యిచట నిరూపించడమైనది అవి యోగక్షేమములే అప్రాప్తమైన దానిని ప్రాప్తింపజేయుట యోగమనియు, ప్రాప్తమైనదానిని సంరక్షించుట క్షేమమనియు చెప్పబడును భగవత్ప్రాప్తికి గాని మరి దేనికైన గాని, ఏమి కావలయునో దానిని భగవంతుడు కలుగజేయుననియు, ప్రాప్తించిన భక్తి జ్ఞాన, వైరాగ్యములను ఇక మరి ఏదైన ఉండిన దానిని భగవంతుడే చెడనీయక సంరక్షించుననియు ప్రతిజ్ఞా పూర్వకముగా వాగ్దానముగా చేయడమైనది కావుననే 'వహామ్యహం' అని పలుకడమైనది

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్ ।**

**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥**

ఎల్లప్పుడును భగవంతుడనగు నాయందేకాగ్ర చిత్తులును, ప్రీతి పూర్వకముగా నన్ను భజించువారునునైన నిరంతర ధ్యానపరులకు పరమేశ్వరుడనగు నన్ను పొందుటకు సాధనమగు ఏ జ్ఞానము కలుగవలెనో అట్టి జ్ఞానమును గలిగించుచున్నాను

తదేకనిష్ఠులగు పరమభక్తులకు మోక్షముకొరకై యే బ్రహ్మజ్ఞానము, యే యాత్మజ్ఞానము గలుగవలయునో అట్టి జ్ఞానమును భగవంతుడే గలుగజేయుచున్నాడని తెలపడమైనది కావున అనన్య భక్తియోగముచేతను ఆత్మజ్ఞాన ముదయము గాగలుగును అని భగవంతుడే తెలిపెను భగవద్వాక్యములో విశ్వాము కలుగనిచో మరల ఎట్లు తరింప గలుగును?

**తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః ।**

**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

నిరంతరము ధ్యానముచేయు భక్తుల ననుగ్రహించుటకొరకు వారి యంతఃకరణమం దున్నవాడనై, వారియొక్క అజ్ఞానజన్యమైన మోహాంధకారమును వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత పోగొట్టు చున్నాను

చీకటిగదిలో గల వస్తువులు అంధకార నిబిడమై యున్నప్పుడు ఏలాగున ఎవరికిన్నీ గోచరింపవో, దీపము వెలిగించిన వెంటనే చీకటి పారిపోయి వస్తువులన్నిటిని స్పష్టముగా ఎట్లు చూడగలుగునో పై జెప్పిన వాక్యమున్ను ఇటువంటిదే

భగవద్భక్తివల్ల కలిగెడు ప్రయోజనము ఇట్టిదని భక్తులు గ్రహించేది కావుననే ''అనుకంపార్థం '' అని ప్రయోగించిరి అనుకంపార్థ మనగా నిర్హేతుక కరుణతో అని అర్థము

**న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

ఓ అర్జునా! నీయొక్క ప్రాకృతమైన ఈ నేత్రముచేత విశ్వరూప ధరుడనగు నన్ను చూచుటకు శక్తుడవు కావు కావున అప్రాకృతమైన దివ్యనేత్రము నిచ్చుచున్నాను ఈ దివ్యనేత్రముచేత నాయొక్క యోగ మహిమను (ఈశ్వరశక్తిని) చూడుము

పంచభూతాత్మకమగు ఈ నేత్రము పంచభూత నిర్మితవస్తువులను మాత్రమే చూడగలుగును ఆత్మ లేక ఈశ్వరుడు అప్రాకృత దివ్య స్వరూపము దానిని దివ్యదిష్టిచేతనే చూడవలయును అనగా దివ్యోపదేశము చేతనే కననగును అది ఈశ్వరానుగ్రహముచేతగాని, దివ్యత్వముపొందిన గురువులచేతగాని కనుగొనవలసియుండును ఈసత్యమును తెలియక పోవుటచేతనే కొందరు ఈశ్వరుడుండిన ఏల కనుపించుట లేదని ప్రశ్నింతురు

**న వేదయజ్ఞాధ్యయనైర్నదానైర్న చ క్రియాభిర్న తోపోభిరుగ్రైః ।**

**ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥**

ఇటువంటి విశ్వరూపముగల నన్ను నీకంటె ఇతరు లెవ్వరున్నూ చూచియుండలేదు మరియును ఋగాది వేదములను అధ్యయనము చేయుటచేతగాని, యజ్ఞాదికర్మల నాచరించుటచేతగాని, దానముల చేయుటచేతగాని, అగ్నిహోత్రాది కర్మలను చేయుటచేతగాని, యుగ్రము లయిన తపస్సులు చేయుటచేతగాని నన్ను చూచుటకు శక్యము గాదు

పై జెప్పిన కర్మలుమాత్రము చేసినను భగవద్భక్తి లేనిచో భగవద్ జ్ఞానము గలుగదని గ్రహించేది ఈశ్వరభక్తి యొకటిమాత్రము కలిగి యుండినచో పై జెప్పిన కర్మలు చేయక పోయినను మోక్షము గలుగును ఇది పరమభక్తులపై కరుణ గలిగి చెప్పిన వాక్యము ఏలన పైజెప్పిన యజ్ఞాది క్రతువులు వేదాధ్యయనము అందరు చేయజాలరు కావున పైజెప్పిన కార్యవులు చేయలేమని భక్తులు చింతించవలదు

**నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధోద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥**

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

నన్ను ఏ విధముగా నీవు చూచితివో యిటువంటి రూపము గల నేను వేదాధ్యయనములచేతను, తపస్సుచేతను, దానముచేతను, యాగముచేతను కూడా చూచుటకు శక్యుడను కాను ఇట్టి రూపమును ధరించిన నేను మదేకనిష్ఠమైన భక్తిచేతనే యధార్థముగా తెలిసికొనుటకున్ను, దర్శించుట కున్ను, నాయందైక్య మగుటకున్ను సాధ్యమైనవాడ నగుచున్నాను

పై జెప్పిన 48వ శ్లోకమునందలి ''న వేదయజ్ఞాధ్యయనైః'' అను వాక్యమునే మరల పునరుద్ధరించి యిచట ''నాహం వేదైః'' అని చెప్పుటకు కారణమేమన పై నుదాహరించిన కర్మలు చేయలేదని పరమభక్తులు సంశయ పడనక్కరలేదని తెలుసుకొనుటకు చెప్పడమైనది ఈ 54వ శ్లోకములో

పరమభక్తిచేత గలిగెడు మూడు ప్రయోజనములు వచించడమైనది అదేమన ''జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుమ్''= బ్రహ్మతత్త్వమును ఈశ్వరతత్త్వమును తెలిసికొనుటకున్నూ, దర్శించుటకున్నూ, ఐక్యమొందుటకున్నూ ఈ అనన్యభక్తి యొక్కటియే చాలును

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥**

1 సకలభూతముల పట్ల ద్వేషికానివాడును,2 అందరిలోను మిత్రత్వము గలవాడును, 3 జీవకారుణ్యము గలవాడున్నూ, 4 మమత్వము లేనివాడును, 5 అహంకారము లేనివాడును, 6 సుఖ దుఃఖములయందు సమత్వము గలవాడును, 7 ఓర్పుగలవాడునై ఉండవలయును

దీనివల్ల భక్తి ఒకటి మాత్రము గలిగియుండిన చాలదనియు, భక్తులకు గల భాగవత ధర్మముకూడా గలిగియుండవలెననియు నిరూపించడమైనది భక్తిమాత్రము గలిగి భాగవతుల ధర్మము లేనిచో ఔషధసేవమాత్రము చేసి, పథ్యము చేయనివాని గతియే గలుగునని భక్తులు మరువకూడదు

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥**

ఎవడు ఇష్టవస్తువులు లభించినపుడు సంతోషింపనివాడును, అనిష్టస్థితి సంభవించినపుడు ద్వేషింపనివాడును, ప్రియవస్తువుల వియోగమునందు పరితాపము నొందనివాడును, ప్రాప్తముగాని వస్తువులను కోరని వాడును, శుభాశుభకర్మలచే విడువబడినవాడును, భగవంతునియందు సదా భక్తి గలవాడు నగుచున్నాడో అట్టివాడు నాకు మిక్కిలి ప్రియుడు అని భగవంతుడు స్వయముగానే చెప్పెను

ఇది ప్రపన్నుడు, లేక జీవన్ముక్తుడైన వానియొక్క స్థితియని గ్రహించుకొనవలయును ఇది సామాన్యభక్తులకు గాని, సాధకులకుగాని, సాధ్యము గాదు ముక్తావస్థలో మాత్రమే యిట్టి స్థితి గలుగును ముక్తులమని

తలంచువారు తమకు ఇట్టి స్థితి గలిగినదా లేదా యని నిరంతర మాలోచించుకొనవలయును. కలుగనిచో కలుగజేసేలాగున ఎల్లప్పుడు విచారించుకొనవలయును దీనితో ఉపాసనాకాండమగు భక్తియోగమున ద్వాదశాధ్యాయము పూర్తియగుచున్నది



# తృతీయ కాండము - జ్ఞానయోగము

వేదము కాండత్రయాత్మకమనియు, వేదార్థనిరూపకమగు భగవద్గీతయు త్రిషట్కముతో కూడినదనియు ఇదివరలో తెలుపడమైనది ప్రథమషట్కము కర్మయోగమును, ద్వితీయషట్కము ఉపాసనా యోగమును, తృతీయషట్కము జ్ఞానయోగమును గురించియు తెలుపు చున్నవని యిదివరలో నిరూపించడమైనది క్రమముగా ఈ మూడు యోగములను అందరున్నూ అభ్యసించవలయును దానికి కారణము మొదటనే నిరూపించడమైనది. జన్మాంతర సంస్కారముచే కర్మోపాసనలు రెండున్నూ గలిగిన సంస్కారజీవి యైనచో జ్ఞానయోగమున ప్రవేశించ వచ్చును అయితే అట్టివానికి కర్మోపాసనలచే అంతఃకరణశుద్ధియు, విక్షేపనివృత్తియు గలిగియుండవలయును అట్టివానిని గురుదేవుండు తప్పక పరిశోధించి యే యోగమున కర్హుడో దానిని ఉపదేశింపవలయును

విద్యార్థియైన వాడు కాలేజీలో చేరవలయునని తలంపుతో వచ్చినను ప్రిన్సిపాల్ అయినవారు ఈ విద్యార్థి దానికి తగినవాడా అని పరీక్షించియు, సర్టిఫికెట్లును చూచియు ఎట్లు నిర్ణయించునో అట్లు పరిశోధించి చేర్చనిచో క్రింది తరగతిలో చదువవలసిన పాఠమును చదువక పై తరగతిలో చేర్చిన ఎట్లు వ్యర్థమగునో జ్ఞానయోగముయొక్క స్థితియు ఆలాగున నుండును అయితే హైస్కూలువరకు చదివిన వానిని ఆ తరగతిలో గాని, దానికన్న క్రింది తరగతిలో గాని ఉంచుటయు సరికాదనికూడా ప్రిన్సిపాల్ గ్రహించు కొనవలసియుండును పైజెప్పిన మూడు యోగములయొక్క స్థితియు

గురుదేవుడు తెలిసికొనియుండవలయును అప్పుడే యది శోభించును, అభివృద్ధిని పొందును ఈ విషయమై శాస్త్రాంతరము చెప్పినది చూడుడు

**యథా సౌధాదినిర్మాణం గగనే వితథం భవేత్ ॥**
**తథా యోగాదికం త్యక్త్వా జ్ఞానసిద్ధిం సువిప్లత ॥**

ఏలాగున మూడంతస్తులతో నిర్మించదలంచిన సౌధమునకు రెండంతస్తులు కట్టిన పిమ్మట మూడవ అంతస్తు కట్టిన నిలుచునే కాని రెండంతస్తులు కట్టకనే బారువులు వేసి ఆకాశమధ్యమున ఇటుకరాయి, సున్నముతో కట్టదలంచిన ఏలాగున నిలువజాలక క్రిందికి జారిపడిపోవు చుండునో, యాలాగున నిష్కామకర్మ, ఉపాసన చేయక జ్ఞానయోగము నభ్యసించిన ధ్యేయాకారములో మనస్సు నిలువక ప్రపంచవృత్తిలోనికి సంకల్పములోనికి జారిపోవుచుండునని ముముక్షువులు గ్రహించుకొన వలయును

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే ।**
**అనాది మత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే ॥**

ఏది తెలియదగినదో దేని తెలిసికొని మోక్షమును పొందుదురో అట్టిదానిని స్పష్టముగా జెప్పెదను వినుము ఆది లేనిదియు, నిరతిశయము నగు ఏ బ్రహ్మము సత్పదార్థము కాదనియు, అసత్పదార్థము కాదనియు చెప్పబడుచున్నదో దానిని స్పష్టముగా చెప్పుచున్నాను

ఇచట తాను పొందవలసినది జ్ఞేయబ్రహ్మమనియు, అది "సత్"గాని "అసత్"గాని కాదనియు, సదసత్ విలక్షణమనియు గ్రహించుకొన వలయును ఇది వేదాన్తశాస్త్రముచేతనే తెలియుటకు సాధ్యమగును అసత్తు అయిన జడమునకన్నను, సత్తు అయిన జీవునికన్నను అది విలక్షణము ఈ జ్ఞేయబ్రహ్మమును పొందుటకు జ్ఞానము కావలయునని నిరూపించడమైనది. ఇచట జ్ఞానమనగా జ్ఞానికి ఉండవలసిన గుణములని గ్రహించదగును దానిని ఈ అధ్యాయమున 8వ శ్లోకమునుండి 12వ శ్లోకమువఱకు

ఉపదేశించడమైనది బ్రహ్మజ్ఞానము పొందదలంచువారు అమానిత్వాది 20 లక్షణములు గల జ్ఞానమును పొందవలయును ఈ జ్ఞానమునకే జ్ఞేయమని పేరు గలదు ఈ జ్ఞేయము ఉన్నత ఉద్యోగమనియు, జ్ఞానము దానికి తగిన పరీక్ష యనియు గ్రహించుకొనవలయును ఉద్యోగము కావలసిన దానికి తగిన పరీక్షలో ఉత్తీర్ణుడు కావలసియుండునుకదా! మరియు జ్ఞానము, అనగా ఈ జ్ఞేయము పండు అనియు, ఉపాసన పుష్పమనియు, నిష్కామ కర్మయోగము ప్రూననియు ముముక్షువులు గ్రహించందగినది

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥**

బ్రహ్మాది స్తంబపర్యంతములగు సమస్త వస్తువులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని ఎవండు సర్వము నశించినను నశింపని వానినిగా చూచుచున్నాడో, వాడే చూచువాడు

దేహేంద్రియములు నశించునవి ఆత్మ నాశము లేనిది. అట్టి ఆత్మను, ఈశ్వరుని ఎవండు చూచుచున్నాడో వాడే నేత్రము గలవాడు తక్కినవానిని చూచేవాడు కన్ను ఉన్నప్పటికిన్నీ లేని గ్రుడ్డివానితో సమానము ఏలన వాడు చూచేది నశ్వరవస్తువులనే, శాశ్వతమైన ఆత్మను ఈశ్వరుని చూడనివాడు గ్రుడ్డివాడే

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హి నస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా తెలిసికొని తనచేత తన్ను చంపుకొనని వాడగుచున్నాడు అట్లు పరమాత్మను సమముగా సర్వములో చూడనివాడు తనయాత్మను తాను చంపుకొనినవానితో సమానుడు అట్టి దైవమును సాక్షాత్కరించిన వాడు మోక్షమును పొందుచున్నాడు

బహుజన్మసుకృతపుణ్యకర్మలచే లభించదగిన మానవజన్మ

లభించియు, దానిచే పొందవలసిన దైవమును, మోక్షమును పొందనివాడు ఆత్మహత్య చేసుకొనినవానితో సదృశుడని గ్రహించేది

**పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।**
**యద్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥**

దేనిని తెలిసికొని మునులు, ఋషులు, యోగులు, పరమభక్తులు ఉత్తమమైన మోక్షమును పొందిరో, అట్టి జ్ఞానము పరమాత్మ విషయక మగుటవలనను, జ్ఞానము లన్నిటిలో నుత్తమ మైనదగుటవలన నికను చెప్పెదను

ప్రపంచ సంబంధజ్ఞానము గలవారు పలువురు గలరు అట్టి జ్ఞానముచే కనుగొను సూక్ష్మాది సూక్ష్మ విషయములన్నియు నశించునవే ఆత్మజ్ఞాన మొక్కటియే నాశము లేనిది దానిని కనుగొన్నవారు ఇహమందును, పరమందును నిర్మలశాంతిని పొందగలరు కావుననే యిది ''జ్ఞానానాం జ్ఞానముత్తమం'' అని నిర్ణయించబడినది

**ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥**

ఈ జ్ఞానము నాశ్రయించి నా సాయుజ్యమును పొందినవారు జగత్సృష్టికాలమునందును జన్మించరు ప్రళయకాలమునందును దుఃఖము నొందరు

ఆత్మజ్ఞానముచే గలిగెడు ప్రయోజనమేమని కొందరు తలంతురు అది యిచట నిరూపించడమైనది దుఃఖములన్నిటిలోను మరణ దుఃఖము గొప్పది జ్ఞానులట్టి దుఃఖమును పొందరు మరల గర్భవాసములో పుట్టుట గూడా మహాభయంకర దుఃఖము కావున ముక్తాత్ములు మరల పుట్టరు అది జ్ఞానమువల్ల గలిగెడు గొప్పలాభము, గొప్ప ఆనందము

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**

**యతంతో౽ప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥**

జ్ఞానసిద్ధికొరకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠానపరులు తనయందున్నట్టి యాత్మను చూచుచున్నారు ఆత్మసంస్కారము లేని మలినబుద్ధి గలవారు పై యోగులవలె వేషము వేసుకొనినను ఈ యాత్మను దర్శింపజాలరు

మహనీయులు తాము వేసుకొనిన వేషము ననుసరించి యత్నించు వారగుటచే వారు అంతఃకరణశుద్ధి గలిగి మోక్షమును పొందుచున్నారు అట్టి వేషమును వేసియు మహాత్ముల యనుష్ఠానము లేనివారు ఆత్మసంస్కారము లేనివారగుటచే ఆత్మదర్శనము గలుగక బద్ధులగుచున్నారు సుక్షేత్రము లోను, ఊషరక్షేత్రములోను ఒకేరకమగు విత్తనము వేసినప్పటికిన్ని భూమియొక్క మంచిచెడుగులవల్ల ఒక దానిలో బాగుగ పండుట, మరియొక దానిలో పండకపోవుట ఎటువంటిదో, అద్దము ఒకేరకమైనను నిర్మల దర్పణమునందు తన్ను బాగుగా చూచుటయు, మలినమైన యద్దమునందు చూడకపోవుటయు ఎటువంటిదో, హృదయముయొక్క శుద్ధత్వాశుద్ధత్వ ముల ననుసరించి ఫలమునూ ఈ లాగుననే యుండును

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**

యజ్ఞ దాన తపంబులు ఫలాభిలాషలేని ప్రజ్ఞాశాలురకు చిత్తశుద్ధిని గలుగజేయును గాన యజ్ఞ దాన తపోరూపమగు కర్మమును విడువక తప్పక చేయవలయును

సన్న్యాసయోగమున ఇట్లు చెప్పుటవల్ల యజ్ఞ దాన తపములు నిష్కామముతో చేయనిచో అంతఃకరణశుద్ధి గలుగదని భగవంతుడు ఇచ్చుటనూ హెచ్చరించడమైనది

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥**

జీవన్ముక్తు డగువాడు పొందబడిన యధ్యాత్మప్రసాదమను ప్రకాశము గలవాడుగుటవల్ల దుఃఖింపడు, దేనిని కోరడు సమస్తప్రాణులయందును సమభావము గలవాడును, నాయందలి శ్రేష్ఠమైన భక్తిగల్గి, అన్నిటిలోను నన్నే చూచువాడుగానుండి బ్రహ్మప్రాప్తిని పొందుచున్నాడు

ఇది బ్రహ్మజ్ఞానియొక్క లక్షణమని గ్రహించుకొనేది ఆత్మజ్ఞానులు ఇట్టి స్థితి తమకు కలిగినదా లేదా యని తమలో దాము చూచుకొనచుండ వలయును

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥**

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥**

ఓయర్జునా! సర్వాంతర్యామియగు ఈశ్వరుండు సకలప్రాణుల యొక్క హృదయములందుండి మాయచేత సకలభూతములను, వారివారి జన్మాంతర సంస్కారము ననుసరించి త్రిప్పుచు ఆయాకర్మములందు ప్రవర్తింపజేయుచున్నాడు ఓ యర్జునా! అన్నివిధములచేత నా సర్వేశ్వరునే రక్షింపుమని వేడుకొనుము ఆసర్వేశ్వరుని యనుగ్రహమువలననే సర్వోత్కృష్టమగు పరమశాంతిని, శాశ్వతమగు మోక్షమును పొందగలవు

ఈ అధ్యాయము ముగింపు చేయబోవుచున్నాడు ఇది జ్ఞానయోగ మైనను కర్మోపాసనలు రెండును లేనిచో ఇట్టి యాత్మజ్ఞానమును పొందజాలరని తలంచి పైనుదాహరించిన 5వ శ్లోకమున ''యజ్ఞ దాన తపః'' కర్మలను విడువరాదనియు, 61, 62 వ శ్లోకములలో ''ఈశ్వరస్సర్వ భూతానాం'', ''తమేవ శరణం గచ్ఛ'' అనియు ప్రయోగించడమైనది ఇది ఆత్మవేత్తలైనవారు బాగుగ జ్ఞప్తిలో నుంచదగినది

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥**

రహస్యము లన్నిటికంటె నతిరహస్య మైనదియు, ఆత్మజ్ఞానపరము నగు ఈగీతాశాస్త్రమును నేను నీకు చెప్పితిని నేను చెప్పియున్న యాత్మజ్ఞాన సాధనమగు నట్టి దీనియొక్క సకలార్థములను చక్కగా నాలోచించి పిమ్మట నీకేది యిష్టమో దానిని చేయుము

''యథేచ్ఛసి'' అని ప్రయోగించుటవల్ల భగవానుండు నిష్కామ కర్మయోగ కీలకమును ఇచ్చుట తెలిపినాడు లేకపోయిన ఇది నిష్కామ కర్మయోగము కాజాలదు ఇక గీతాశాస్త్రమును, ఆత్మజ్ఞానమును జనులకు బోధించువానికి కలిగెడు ఫలితమును నిరూపించుచున్నాడు

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

ఎవ డీపరమరహస్యమగు గీతాశాస్త్రమును నా భక్తులకు చెప్పుచున్నాడో, వాడు సంశయరహితుడై నాయందు సర్వోత్కృష్టమైన భక్తిని చేసి నన్నే (మత్సాయుజ్యమునే) పొందుచున్నాడు సంశయము లేదు

''మద్భక్తేషు'' అని భగవానుడే స్వయముగా చెప్పుటవల్ల ఈ గీతాశాస్త్రము, ఒక జాతికి గాని, ఒక మతమునకు గాని ఒక ఆశ్రమమునకు సంబంధించిన వారికి మాత్రము గాని కాదనియు, భగవంతునియందు భక్తిగల వారందరికిన్నీ ఏర్పడినదనియు, అందువల్ల భక్తిగల సర్వజనులకు దీనిని బోధించవలసినదనియు గ్రహించవలయును కావుననే సప్తమీ బహువచనములో ''మద్భక్తేషు'' అని ప్రయోగించడమైనది

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥**

మనుష్యులలో నాభక్తులకు గీతను చెప్పువానికంటె నధిక ప్రియమును చేయువాడొక్కడున్నూ నాకు లేనే లేడు భూమియందు వానికంటె నితరుడు మిక్కిలి యిష్టుడు నాకు గలుగనుకూడా గలుగడు

గీతాశాస్త్రమును భక్తులకు చెప్పువానికన్న నాకు మిక్కిలి ప్రీతి గలవాడు భూలోకమున ఇదివరలో ఒక్కడున్నూ ఉండి ఉండలేదు ఇప్పుడున్నూ ఉండుట లేదు ఇకను ఉండుబోడు అని భగవానుడు స్వయముగానే చెప్పెను దీనికన్న పరమప్రమాణము ఇకఏమి కావలయును?

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీ ర్విజయోభూతి ర్ధ్రువానీతిర్మతిర్మమ ॥**

ఓ ధృతరాష్ట్రమహారాజా! యోగసిద్ధులకు ప్రభువగు నీశ్వరుడను, విల్లును ధరించిన యర్జునుడు నున్నటువంటి పక్షమేదో యచ్చటనే రాజ్యలక్ష్మియు, జయలక్ష్మియు, నైశ్వర్యాబివృద్ధియు న్యాయమును తొలగక నిలుచునని నాయభిప్రాయము

ధ్వన్యర్థముగా సంజయుండు ధృతరాష్ట్రమహారాజానకు కట్టకడపటి తన అభిప్రాయమును తెలిపినాడు దీనివలన ఎవరియందు భగవంతుని అనుగ్రహము గలిగియుండునో వారికే విజయము గలుగును ఇది ఒకటే భక్తులు గ్రహించిన చాలును దీనితో తృతీయకాండమగు జ్ఞానము సంపూర్ణమయ్యెను

గొప్పదైన పర్వతము గాని, సముద్రము గాని చిన్నదైన మానవ నేత్రములో ఎట్లు కనపడునో యాలాగున కర్మోపాసన జ్ఞానములనెడు గీతాషట్కత్రయము ఈ చిన్న వ్యాసములోనే కనందగును గ్రంథాంతరము నందలి కాండత్రయాత్మకమగు కర్మ, భక్తి, జ్ఞానములను గురించిన ఈ క్రింది శ్లోకములను నిరూపించి విరమించెద

**ఫలస్యకారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్ ।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్ ॥**

ఫలమునకు పుష్పము కారణము, పుష్పమునకు వృక్షము కారణము ఇచట నిష్కామ కర్మయోగమును వృక్షముగాను, అనన్యదైవభక్తిని

పుష్పముగాను, జ్ఞానమును ఫలముగాను వర్ణించడమైనది ఫలముయొక్క మాధుర్యమును, రుచిని ఆరోగ్యమును, రంగును, సుగంధమును మాత్రము కూర్చుండి వర్ణించిన ఏ కాలమందైనను పండ్లు దొరుకునా? భుజింప గలరా? ఆలాగునే జ్ఞానమాహాత్మ్యమును, ప్రభావమును, ఆనందమును కూర్చుండి మాట్లాడిన అది యెప్పటికినీ లభించునది గాదు వృక్షమును పోషించిన అదే స్వయముగా పుష్పించి పండ్లు పండి క్రిందికి రాలుచుండును ఆలాగున అనుష్ఠానము సరిగా చేయుచూ వచ్చినచో అదే దైవకృపకు పాత్రమై జ్ఞానఫలమును గలుగజేయును అయితే ఫలావస్థలో పుష్పముగాని, వృక్షముగాని కనపడకపోయినను, వృక్షమునుండియే పుష్పమున్నూ, ఫలమున్నూ గలిగినట్లు విజ్ఞులు కనుగొనగలరు

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ ॥**

మూఢుడైన వానియొక్క నివృత్తియు ప్రవృత్తియే యగును. ఆత్మజ్ఞానము గల ధీశాలికి ప్రవృత్తికూడా నివృత్తిఫలమునే కలుగజేయును అని అష్టావక్రమునీంద్రుడు జనకమహారాజుగారికి ఉపదేశించెను ఇది అష్టావక్రగీత గీతాసారమంతయు ఈ రెండు శ్లోకములలో గర్భితమై యుంటున్నది

(శ్రీ సురేశ్వరాచార్యులు నైష్కర్మ్యసిద్ధియందు కర్మను ఖండించినట్లు కొందరు తలంతురు ఈ క్రింద వ్రాయబడిన సురేశ్వరాచార్యుల వాక్యములు నైష్కర్మ్యసిద్ధియందు చూచిన దీనియొక్క సత్యము బోధపడగలదు కర్మ కాండమును అచటచట ఖండించుదానికి కారణము శ్రీ శంకరవిజయమున చూచినచో బోధపడును )

శ్రీ సురేశ్వరాచార్యులవారు దీనిని సాకల్యముగా నిరూపించి యున్నారు ఇది అందరికినీ ఉపాదేయమగును, గమనింపుడు

నిత్యకర్మానుష్ఠానాద్ధర్మోత్పత్తిః, ధర్మోత్పత్తేః పాపహానిః, తతశ్చిత్త శుద్ధిః, తతస్సంసార యాథాత్మ్యావబోధః, తతో వైరాగ్యం, తతో

ముముక్షుత్వం, తతస్తదుపాయపర్యేషణం, తతస్సర్వకర్మ తత్సాధన సన్న్యాసః, తతో యోగాభ్యాసః, తతశ్చిత్తస్య ప్రత్యక్ప్రవణతా, తతస్తత్త్వమస్యాదివాక్యార్థ పరిజ్ఞానం, తతోఽవిద్యోచ్ఛేదః, తతస్స్వాత్మన్యే వావస్థానమ్ (నై సి 135వాక్య )

నిత్యనైమిత్తికాది కర్మల నాచరించి వాని ఫలమును పరమేశ్వరునకు సమర్పించుచుండిన యెడల కొంతకాలమున కావ్యక్తియొక్క చిత్తమున పాపములను నశింపజేయునట్టి యదృష్టము జనించును దానివలన చిత్తమునందలి పాపములు నశించిపోవును అందువలన చిత్తము దర్పణము వలె నిర్మలమై నిత్యవస్తువును వివేకించి తెలిసికొనెడి సామర్థ్యము కలదై యుండును అప్పుడాచిత్తమునకు సంసారముయొక్క వాస్తవస్థితి తెలియును అనగా సంసారము అనిత్యము, అశుచి, దుఃఖమయము, హేయము నగునని తెలియునని భావము సంసారముయొక్క యధార్థ స్వరూపము ఇదియే యగునుసుమా।

ఇట్లుండగా సంసారము నిత్యము శుచి, సుఖరూపము, ఉపాదేయ మని తలంచుట చిత్తదోషమువలననే యని యెరుగవలయును ఇట్లు సంసారముయొక్క యాథార్థ్యము నరయుట వలన, దానియందు వైరాగ్య ముత్పన్నమగును పిమ్మట నిత్య, నిరతిశయ సుఖస్వరూపమగు మోక్షమును సంపాదించవలయునను నిచ్ఛ జనించును పిదప నా మోక్ష సాధనముల గూర్చి విచారించును విచారించి యెరింగిన తరువాత వాని నను‌ష్ఠింప నిశ్చయించి నిత్యాది కర్మలు, ఆ కర్మలకు సాధనములైన గృహస్థాశ్రమాదులునూ ప్రతిబంధకములుగా దోచుటవలన, వానినన్నిటిని యథాశాస్త్రముగా పరిత్యజించి వివిదిషాసన్న్యాసమును స్వీకరించును తరువాత సద్గురు సన్నిధియందు వేదాన్తములయొక్క శ్రవణమనన నిదిధ్యాసములను యోగము నభ్యసించును మిక్కిలి శ్రద్ధతో చిరకాలము చక్కగా నాచరించబడిన ఈ యోగాభ్యాసమువలన సంశయ అసంభావనా విపరీత భావనలు నశించును అందుచేత చిత్తము శబ్దాదివిషయములనుండి మరలి

శుద్ధ చిద్రూపుడైన ప్రత్యగాత్మయందు ప్రవర్తించి తదేకాయత్తమై యుండును

అనంతరము వేదాంతములయందు తత్త్వమస్యాది మహావాక్యములచే బోధితమైన జీవబ్రహ్మైక్యసాక్షాత్కారము, అపరోక్షముగా ననుభూతమగును అట్టి యపరోక్షానుభవమువలన ననాదినుండి ప్రవృత్తమైన యజ్ఞానము, సూర్యోదయముచే నంధకారమువలె మటు మాయమగును అనంతరము స్వరూపావస్థానము సిద్ధించును అనగా నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, కేవలాఖండ పరిపూర్ణంబై యుండును ఇదియే మోక్షమని తాత్పర్యము శ్రీశంకరాచార్యుల అభిప్రాయమున్నా అపరోక్షానుభూతి యందు తెలిపినది చూడుడు

**స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।**
**సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥**

తనయొక్క వర్ణాశ్రమధర్మము బ్రహ్మార్పణముగా జేయబడిన కర్మానుష్ఠానమువలన గలిగిన పుణ్యముచేతను, తపస్సుచేతను, భగవంతుని సంతోషింపచేయుటవల్ల భగవదనుగ్రహము గలుగును స్వవర్ణాశ్రమ ధర్మమనగా తానుదేన్ని పొందుట కిచ్ఛగించి యనుష్ఠించుచున్నాడో దానికి సంబంధించిన కర్మయని తెలియవలెను అపుడు వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తి ఆవిర్భవించును ఈ అపరోక్షానుభూతి గ్రంధమున మొట్టమొదట చెప్పినది నిరూపించడమైనది ఇక కట్టకడపట తెలిపినది చూడుడు

**పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః ।**
**గురుదైవత భక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥**

పరిపక్వహృదయము కలవారికి కేవలము ఈ బ్రహ్మాత్మైక్యసాక్షాత్కార జ్ఞానము త్వరలో గలుగును అట్లే గురువునందును, దైవమునందును భక్తి గల సకల జనులకును సులభముగను శీఘ్రముగను సిద్ధించును

గురుభక్తియొక్కయు, దైవభక్తియొక్కయు ప్రభావము చూచితిరా?।

"కించిత్పక్వకషాణాం హఠయోగేనసంయుతః" పై జెప్పిన విధముగా సంపూర్ణముగ అంతఃకరణశుద్ధి కలుగని వారికి హఠయోగమున చెప్పిన అష్టాంగ యోగము అనుష్ఠింపదగినది శ్రీశంకరులు, వారి ముఖ్యశిష్యులగు సురేశ్వరాచార్యులు జీవులపరిపక్వత ననుసరించి చెప్పినది చూడుడు ఇదియే కాండత్రయాత్మకమగు వేదముయొక్కయు, షట్కత్రయమగు గీత యొక్కయు ఆశయము కట్టకడపట సర్వకర్మపరిత్యాగమునన్నా, సన్న్యాసమునన్నా, జ్ఞేయబ్రహ్మమందు నిలకడయు గలుగవలెనని యుపదేశించిరి ఓమ్



# ఓం సత్యం శాన్తం దయ

ప్రతివారు ఏ కార్యమునైన ప్రారంభించు నపుడుగాని, మాట్లాడునప్పుడుగాని పై జెప్పిన నాలుగు పదములను మూడు సార్లు ఉచ్చరిగించి అర్థమును భావన చేసి ప్రారంబించిన ఆ కార్యము నిర్విఘ్నము గాను, నిర్దోషము గాను జరుగును. ఓంకారమును ఉచ్చరించునపుడు వారి వారి మతానుసారముగా ఇష్టదైవమును భావన చేసుకొనవలెను.

# శ్రీ మలయాళయతీంద్రగీతా

# పీఠిక

## శ్రీగురుధ్యానము

**ప్రకృతివికృతిశూన్యాం సచ్చిదానందరూపాం**
**సదమలహృది దివ్యాం జ్ఞానతేజఃప్రదీప్తామ్ ।**
**అనుపమగుణరాశిం భావయేదార్యవన్ద్యాం**
**సకలకలుషహన్త్రీం సద్గురోః పాదుకాం తామ్ ॥**

పరిశుద్ధాత్మ స్వరూపులారా!

మహామహిమ సంపన్నుడగు శ్రీసర్వేశ్వరుని దయ అపారము కరుణామయుడగు భగవంతుడు అనన్తసంసార సముద్రమును దాటుట కయ్యే యీ మానవశరీర మను దృఢనౌక నొసగియున్నాడు మనుష్య జన్మము జ్ఞానము సంపాదించి భగవత్సాన్నిధ్యమును (మోక్షమును) బడయుటకయ్యే వచ్చినదని మరువకూడదు అప్పుడే మన జన్మము సార్థకమగును ఏలననగా పుణ్యాతిశయముచే దేవతాదు లూర్ధ్వలోకమున నున్నవారలై సుఖాధిక్యముచే బద్ధులయిరి ఆలాగున పాపాధిక్యముచే పశుపక్ష్యాదులును సంసార బంధములో జిక్కి జ్ఞానహీనములై యుంటున్నవి మనుష్యజన్మము మాత్రము సర్వశ్రేష్ఠమై జ్ఞానార్జనమునకు కడుంగడు యోగ్యమై ముక్తిని గలుగజేయునదిగా ఉన్నది దేవతలుగూడ మనుష్య జన్మము వచ్చి మేమెప్పుడు ముక్తుల మగుదుమా అని కోరుచున్నారని శాస్త్రములు వచించుచున్నవి కనుక దీని యుత్కృష్టత మరి చెప్పవలయునా! మానవజన్మమును గురించి శ్రీఆదిశంకరు లీలాగున నుడివిరి–

**దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥**

మానవజన్మము, మోక్షేచ్ఛ, మహాపురుషుని ఆశ్రయము– ఈ మూడును మిక్కిలి దుర్లభములు అవి దైవానుగ్రహముచేతనే లభించు చున్నవి

మఱియు సకలమానవకోట్లు తరించుటకై ఆభగవంతుడు జ్ఞానము లనదగు వేదముల ననుగ్రహించియున్నాడు వేదములనగా ప్రకృతి

విలక్షణుడగు సర్వేశ్వరునియొక్క యప్రాకృతబుద్ధితో వెలువడిన శాశ్వత సత్యములు ఆ వేదములయొక్క గభీరార్థములనే మహర్షులును ప్రకృతిరహిత బుద్ధిచే స్వాత్మజ్ఞానమహిమచే గ్రహించి వ్రాసిరి అవియే స్మృతులనబడును తరువాత వేదముల సారములయిన యుపనిషత్తులయొక్కయు, వేదార్థమునే ప్రతిపాదించు స్మృతులయొక్కయు విషయము లన్నిటిని క్రోడీకరించి జనులకు సులభముగా నర్థమగునటుల రచించిన గీత లేర్పడినవి గీత యనుశబ్దమునకు గానమని యర్థము గావున సకలవిషయములను సందేహము లేకుండా, పరస్పర విరోధము లేకుండా ఉచ్ఛైస్స్వరముతో సారముగా నుద్ఘోషింపబడినవే గీతలని వ్యవహరింపబడుచున్నవి

కావున మహాశయులారా! లోకములో భగవత్సంబన్ధములైన భగవద్గీత, శివగీత, బ్రహ్మగీత, శ్రీరామగీత మొదలగు కొన్ని గీతలు గలవు ఆలాగున పరమ ఋషిసంబన్ధములైన వ్యాసగీత, సూతగీత, ఋభుగీత అవధూతగీత, అష్టావక్రగీత మొదలగునవియు గలవు వీనిలో భగవద్గీత, వ్యాసగీతాదులు భారత సూతసంహితాదులలో నన్తర్గతములై యున్నవి అవధూతగీత అష్టావక్రగీతలు స్వతన్త్ర గ్రంథములు శ్రీదత్తాత్రేయులవారు అవధూత గీతకున్ను, అష్టావక్ర మునివరులు అష్టావక్రగీతకున్ను కర్తలు. ఈలాటి గీతలు ముప్పైయాఱు ప్రస్తుతము లెక్కలోనికి వచ్చుచున్నవి

శ్రీవివేకానందస్వాములవారు ఇంగ్లీషున శ్రీయతిగీత యని యొక చిన్నపాత్తమును రచించి యున్నారు శ్రీరమణ గీతయను పవిత్రగ్రంథమొకటి యుంటున్నది అది శ్రీరమణ మహర్షులచే చెప్పబడి శ్రీగణపతిశాస్త్రుల వారిచే ఛన్దోబద్ధము (శ్లోకరూపము) చేయుబడినది ఇకను అనేక గీతలుండవచ్చును జ్ఞాపకములోనికి వచ్చిన విచ్చోట వ్రాయబడినవి.

పై జెప్పినవిధముగా శ్రీసద్గురు మలయాళ స్వాములవారిని గూడ కొందఱు బ్రహ్మనిష్ఠులు, సాధువులు, పండితులు, నారీమణులు తమ ఉత్తమాశయముల నన్నింటిని ఒక గీతారూపముగా ప్రవచించిన ప్రస్తుతకాలమున కెంతో యుపయోగ ముండునని ప్రార్థించిరి అందుచే నీ మలయాళయతీన్ద్రగీత యను గ్రంథరాజ మావిర్భవించెను

"లోకమున భగవత్తత్త్వము నుద్ధరించుటకై భగవంతుడే స్వయముగా నవతరించుచున్నాడు మఱియు నట్టి మహానుభావులను లోకమునకు భగవంతుడు పంపుచున్నాడు ఈ తత్త్వమును భగవద్గీతాది శాస్త్రములలో బాగుగా నిరూపించియున్నారు కావున లోకోద్ధరణ తత్పరులగు మహాపురుషు లెవరు గలరో, వారందఱును భగవద్ధర్మమును నిలబెట్ట వచ్చిన వారనియు, సాక్షాద్భగవత్స్వరూపులే యనియు తలంచవలయును కాబట్టి కృత, త్రేతా , ద్వాపరాది యుగముల ననుసరించి యనేకులు భగవదవతార పురుషులు, ఋషిపుంగవులున్ను గీతలను వ్రాసిరి వర్తమానకాలము ననుసరించి సర్వజనులున్ను తరించు లాగున ధర్మమును ప్రతిపాదించెడు గ్రంథము కొఱతగా నుండుటచే ఆకొఱంతను పూర్తిచేయుటకయ్యే తాము జన్మించితిరి, భగవంతునిచే పంపబడితిరి అని మా అందఱియొక్క యాశయమై యున్నది" అని భక్తులు విజ్ఞాపనము జేసికొనుటవలననున్ను, బ్రాహ్మణాది వర్ణములయొక్కయు, సన్న్యాసాద్యాశ్రమములయొక్కయు, సత్యాది యుగములయొక్కయు ధర్మములు సంకరములైపోయినందుచే యథార్థమగు బ్రాహ్మణ లక్షణమున్ను, సన్న్యాసి లక్షణమున్ను యుగ ధర్మమున్ను తెలియవలసియుండునని యనేకధర్మతత్త్వజ్ఞులు ప్రార్థించుట వలననున్ను ఈ యతీంద్రగీత వ్రాయవలసివచ్చెను కావున సత్యాదియుగముల గురించియు, బ్రాహ్మణాది జాతుల గురించియు, సన్న్యాసాద్యాశ్రమముల గురించి గల నిజతత్త్వమును ఈగీతవలన సర్వులు తెలిసికొని తరించగలరు

ఈగీతయందు ప్రశ్నించినవారి నామధేయముల నీగ్రస్థమునందే మీరు చూడగలరు ఈ ప్రశ్నలన్నిటికి శ్రీవారిచ్చిన సమాధానములను గద్య రూపముగాను, కొంత పద్యరూపముగాను 18 అధ్యాయముల మొదట వ్రాసియిచ్చిరి తరువాత నిది ఛన్దోబద్ధము గావింపబడెను అందులో 3,4,6, 13,14,15- అధ్యాయములను శ్రీకాశిలో ఉంటున్న వేదాంతశిరోమణి, న్యాయమీమాంసాశాస్త్రులగు శ్రీమాధవచైతన్య బ్రహ్మచారిగారును, 5,7,11,16,17 అధ్యాయములను ఆ వారణాశియందే నివసించుచున్న సాహిత్య విద్యాప్రవీణ, సాహిత్యాచార్య వేదాంతాచార్యులగు శ్రీబి కృష్ణ చరణముగారున్ను శ్రీగురుశాసనమును పరమపవిత్రముగా శిరమున

నిడికొని ఛన్దోబద్ధముగా శ్లోకరూపముగా వ్రాసి పంపిరి నేనును శ్రీసద్గురు దేవుని యనుగ్రహముచేతను, అపారకరుణానిధియగు సర్వేశ్వరు డొసంగిన జ్ఞానముచేతను, మిగత యేడు అధ్యాయములను ఛన్దోరూపముగా వ్రాసితిని ఇందులో మా సామర్థ్య మేమియు లేదు దయాసముద్రులగు శ్రీసద్గురు స్వాములవారి అపారకరుణాకటాక్షమే, సంకల్పసిద్ధియే సమస్తమును జేసెను మేము నిమిత్తమాత్రులము

**హరిహరవిధిరూపస్సద్గురుశ్శాన్తమూర్తిః**
**నిరుపమసుఖరాశిర్నిత్య సత్యస్స్వభావః ।**
**సదమల నిజయోగాద్భాసమానః కృపాళుః**
**కిమపి కిమపి కుర్వన్కారయత్యేష ఈశః ॥**

ఈగ్రంథము గద్యరూపమయిన మూలము ననుసరించియే సాధ్య మయినంతవరకు వ్రాయబడెను ప్రమాదవశమున నేవైన దొసగులు దొరలియుండిన అది మా యజ్ఞాన విలసితమేగాని వేరు గాదు శుద్ధనిర్గుణ పరబ్రహ్మస్వరూపులగు శ్రీసద్గురుదేవుని వాగమృతమందేలాటి దోషము లుండవని మా నమ్మకము ఈ విషయమును పాఠకులు గమనింతురుగాక!

మఱియు నీగ్రన్థరచనయందు శ్రీవ్యాసాశమ సంస్కృతోన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయులు సాహిత్యశిరోమణి, ఉభయవేదాన్త ప్రవర్తకులు శ్రీపి సి గోపాలాచార్యులవారును నాకెంతో సహాయమును నొనర్చిరి వారికి నా ధన్యవాదములు దీనిలో ఏవైన లోపము లుండిన తెలిపెడు పండితోత్తములకు, సాధుపురుషులకు, బ్రహ్మనిష్ఠుల కెల్లప్పుడు కృతజ్ఞులము వానిని మరుముద్రణమున సవరించి ముద్రించగలము

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు
ఓం తత్ సత్

ఇట్లు శ్రీసద్గురు పాదధూళి
సాహిత్యశిరోమణి, సాహిత్యసుధాకర,
శివచరణము

శ్రీసద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీమలయాళ యతీంద్రగీతా ప్రస్తావన

**ఓంకారవాచ్యమాత్మానం సచ్చిదానందవిగ్రహమ్ ।**
**సర్వవేదాన్తసంవేద్యం సద్గురుం తమహం భజే ॥**

ఓంకారముచే వచింపబడువాడును, పరమాత్మ యయినవాడును, సచ్చిదానంద స్వరూపుడును, సకలోపనిషత్తులచే బాగుగా దెలియదగిన వాడును అయిన సద్గురుదేవుని భజించుచున్నాను

**అస్తి వ్యాసాశ్రమః ఖ్యాతస్సత్యధర్మ ప్రచారకః ।**
**స్వానుష్ఠానైకనిష్ఠానాం జిజ్ఞాసూనాం సమాశ్రయః ॥** 1

**ధర్మైః కృతయుగఖ్యాతైరంచితోఽస్మిన్కలౌ యుగే ।**
**కాశీబుగ్గమహాతీర్థ పూతస్సద్భక్తసేవితః ॥** 2

సత్యధర్మములను ప్రచారమొనర్చు చున్నదియు, అనుష్ఠానపరులైన జిజ్ఞాసువులకు ఆశ్రయమైనదియు, ఈ కలికాలములో కూడ కృతయుగ ధర్మముతో కూడినదియు, కాశీబుగ్గయను తీర్థముతో పవిత్రమైనదియు, సదాచరణపరులైన భక్తులచే సేవింపబడునదియునగు సుప్రసిద్ధమైన శ్రీవ్యాసాశ్రమము విరాజిల్లుచున్నది

**కైలాసవాసిగణ సేవితమూర్ధభాగో**
**నన్ద్యద్రిరిత్యభిహితోఽస్తి మహాగిరీన్ద్రః ।**
**యస్యైవ పర్వతవిభో స్సదువత్యకాయాం**
**వ్యాసాశ్రమో విలసతి ప్రథితప్రభావః ॥** 3

**బుద్ధాదిమతకర్తార స్సర్వే గచ్ఛన్తి పూజ్యతామ్ ।**
**యత్ర ప్రబోధ్యతే సర్వమతధర్మసమన్వయః ॥** 4

**ఉత్తారకశ్శివో యత్ర లింగరూపేణ పూజ్యతే**
**యేన సాఽనుగృహీతాఽభూజ్జపాలాఖ్యా తపస్వినీ ॥** 5
**కూర్మపుష్కరిణీదివ్యతీర్థేన చ విరాజితః ।**
**యత్ర స్నాన్తి తపోనిష్ఠాస్సాధనాభ్యాసశాలినః ॥** 6

**పర్కటీ తరుణా దేవతావాసేన విభూషితః ।**
**యత్ర పూర్వమతప్యంత తపస్తీవ్రం మునీశ్వరాః ॥ 7**

**న్యగ్రోధనారికేళామ్ర ముఖ్యవృక్షై ర్విరాజితః ।**
**సర్వత్ర శారికాకీర మంజుల ధ్వనిశోభితః ॥ 8**

**జాత్యాది భేదభావస్తు యత్ర నైవానుమన్యతే ।**
**గుణప్రధానతాం బుద్ధ్వా ప్రవర్తన్తే బుధోత్తమాః ॥ 9**

మఱియు నా యాశ్రమము, కైలాస వాసియగు మహేశ్వరునియొక్క ప్రమథగణములతో సేవింపబడుచున్న శిఖరభాగము గలిగినట్టియు, నందిపర్వతమని పేర్కొనబడుచున్నదియు నగు మహాపర్వతముయొక్క పాదప్రదేశమునందు సుప్రసిద్ధ ప్రభావము గలదై విరాజిల్లుచున్నది అచ్చట శ్రీబుద్ధదేవుడు, శ్రీశంకరాచార్యులు మొదలగు మతకర్తలందరు పూజింపబడుచున్నారు మరియు సకల మతధర్మములకు సమన్వయము బోధింపబడుచున్నది పూర్వము జపాల అను తపస్విని అనుగ్రహించిన ఉత్తారకేశ్వరుడు అచ్చట లింగరూపముతో అర్చింపబడుచున్నాడు మరియు నా ఆశ్రమము కూర్మపుష్కరిణి తీర్థముతో విరాజమానమై, మిగుల చల్లనిదైయున్నది తపోనిష్ఠులు, సాధువులును అచ్చట స్నానము చేయుచుందురు దేవతలకావాసమైన గొప్ప జువ్విచెట్టుచే ఆచోటు అలంకరింప బడియున్నది పూర్వము అచ్చోట మునీశ్వరులు తీవ్ర తపము చేసి యుండిరి వటవృక్షము, నారికేళము, మామిడి మొదలగు మహావృక్షములతో గూడినదై, ఆశ్రమ ప్రదేశము శోభాయమానమైయున్నది అన్నిచోట్లను శుక పిక శారికాది పక్షుల యొక్క మనోహరధ్వనులచే నింపైనది ఆయాశ్రమమునందున్న వారందఱును జాతివర్ణాశ్రమ భేదములను పాటింపరు అచ్చట బుధులు గుణప్రాధాన్యమునే యెంచువారై, జ్ఞానవంతులై, ధన్యాత్ములై యుంటున్నారు

**యత్ర క్షేత్రే తు తిష్ఠన్తి భక్తా విజ్ఞానినస్తథా ।**
**అధ్యాత్మజ్ఞాన సంపన్నా మహిళామణయోఽపి చ ॥ 10**

మహాపురుష సంసేవ్యే సర్వసమ్మాన శోభితే ।
సర్వత్ర హోమధూమైశ్చ పరివ్యాప్తే సువాసితే॥ 11

నిత్యకల్యాణపూజాభిస్సన్తుష్టాఖిలదైవతే ॥
ప్రసన్నజంతుతతిభిః పక్షిభిస్సేవితేఽనిశమ్ । 12

మహాపవిత్రగీర్వాణ భాషాభ్యసనపావనే ॥
సర్వవర్ణస్థ సంస్తుత్యే రాగద్వేషమలాపహే ॥ 13

ఇకను ఆ కాశీబుగ్గ మహాక్షేత్రము భక్తులకును విజ్ఞానులకును నిలయమై యున్నది ఆత్మజ్ఞాన సంపున్నలైన నారీమణులు కూడా అందు గలరు సర్వాతిధుల సత్కారాదులచే శోభిల్లునదియు, సర్వత్ర హోమధూమములు వ్యాపించి పరిమళవంతముగా జేయబడినదియు, నిత్యకళ్యాణ పూజలచే సంతసించిన శివకేశవాది దైవములు గలదియు, భయములేక సంచరించు మృగములతోను పక్షులతోను సదా సేవింపబడు చున్నదియును, పవిత్రమైన సంస్కృత భాషయొక్క అభ్యాసముచే పరమ పావనమయినదియును, సకల వర్ణాశ్రమస్థులచే సేవింపబడునదియు, రాగద్వేషాది మాలిన్యమును పోగొట్టునదియు (పై శ్లోకముతో అన్వయము)

వ్యాసాశ్రమే మహాతీర్థమారాన్నైరృతికోణకే ।
ధ్యానయోగ్యః ప్రశాంతశ్చ కుటీరః పరిదృశ్యతే ॥ 14

రాగద్వేషాదిరహిత శ్శాన్త స్సద్భక్తతోషకః ।
తపశ్చర్యావిధానాది యోగసాధనపోషకః ॥ 15

అఖండబిల్వతరుభిః పలాశోదుమ్బరాదిభిః ।
దాడిమీకంటకిఫలైర్హరీతక్యాదిభిర్యుతః ॥ 16

తులసీవనసంశోభీ తథాఽమలకభూరుహైః ।
సంకీర్ణశ్చ ప్రసన్నశ్చ స్నిగ్ధచ్ఛాయాసుశీతలః ॥ 17

భక్తిగమ్యశ్చ విజ్ఞాన నిలయో మునివందితః ।
ప్రపన్నార్తి హరశ్శాన్తో విశుద్ధో హర్షదాయకః ॥ 18

**యస్య దర్శనమాత్రేణ యస్య కస్యాపి మానసమ్ ।**
**ప్రసన్నం జాయతే తూర్ణం విరక్తిగుణభూషితమ్ ॥ 19**

ఇట్టి పవిత్రమైన శ్రీవ్యాసాశ్రమమందు శ్రీకాశీబుగ్గతీర్థముయొక్క సమీపమున నైర్రుతి భాగమునందు విజనప్రదేశమున ధ్యానించుటకు మిగులతగువైన కుటీరము కనిపించుచున్నది ఆ పర్ణశాల రాగద్వేషాదులచే శూన్యమై పరమ ప్రశాంతమై సద్భక్తులకు తోషకమై జపతపాదుల నాచరించుటకు మిగుల యోగ్యమై, యోగసాధనలకు పోషకమై సర్వ విధముల నొప్పుచున్నది మఱియు నది అనేక బిల్వవృక్షములతోను, మోదుగ, మేడి, దానిమ్మ, పనస, కరక మొదలగు వృక్షములతో తులసీవనముతో శోభిల్లుచున్నది మరియు ఉసిరిక చెట్లతో అలలారుచున్నదై దట్టమగు చెట్ల నీడతో చల్లగా నుంటున్నది ఆ ప్రశాంతమగు పర్ణ కుటీరము భక్తిగమ్యము, విజ్ఞాననిలయము. మునులచే నమస్కరించ దగినదియును, ఆశ్రితుల ఆర్తిని పోగొట్టునదియును విశుద్ధమైనదియును, శాంతి నొసగునది యును, నిత్యము సంతోషమును కూర్చునదైయున్నది దాని సందర్శన మాత్రముచే నెట్టివాని మానసముగూడ శీఘ్రముగా ప్రసన్నమగుచున్నది త్వరలో పరమ వైరాగ్య గుణ భూషితమగుచున్నది

**తత్రైకదేశే విమలే ప్రశాన్తే సిద్ధాసనస్థం మునిసార్వభౌమమ్ ।**
**విజ్ఞానభూత్యా హృది రాజమానమాత్మానమాత్మన్యవలోకయన్తమ్ ॥ 20**

అట్టి మిగుల నిర్మల ప్రశాంతమగు నేకాంత ప్రదేశమందు సిద్ధాసనా సీనుడును, మునిశ్రేష్ఠుడును, హృదయమందు విజ్ఞాన విభూతితో విరాజిల్లు చున్నవాడును, ఆత్మలో నాత్మను సందర్శించువాడును,

**యోగీశ్వరం తం నిగృహీత వృత్తిం జితేన్ద్రియం భాసితవస్తుతత్త్వమ్ ।**
**సర్వాత్మభావైకసమాధినిష్ఠం పరే పదే స్వస్య విరాజమానమ్ ॥ 21**

యోగిశ్రేష్ఠుడును, సకల వృత్తులను నిగ్రహించిన వాడును, సకలేన్ద్రియ ములను జయించినవాడును, ఆత్మతత్త్వము నెరింగినవాడును, సమాధి నిష్ఠుడును, స్వస్థితిలో నున్నవాడును,

**తేజోనిధానం నిరుపాఖ్యమవ్యయం స్వరూపసంపత్తిదృఢత్వనిశ్చలమ్ ।**
**అఖండతత్త్వం పరిపూర్ణభావగం ప్రజ్ఞానరూపే రమమాణమాత్మని ॥ 22**

తేజోనిధియును, నామరహితుడును, నిరుపాధికుడైనవాడును, నాశము లేనివాడును, స్వస్వరూప విజ్ఞాన సంపదయొక్క దార్ఢ్యముచే నిశ్చలమైనవాడును, దేశకాలాది పరిచ్ఛేదములు లేక అఖండ స్వరూపుడై పరిపూర్ణుడై, ప్రజ్ఞానరూపమైన పరబ్రహ్మమునందు రమించువాడును

**సద్భక్తచేతోహర మార్యపూజ్యం దయాసముద్రం భవనాశకం చ ।**
**విజ్ఞాన నిష్ఠాశిఖరాగ్రదేశే సదా విభాన్తం మలయాళదేశికమ్ ॥ 23**

అనన్యభక్తి గలవారి మనస్సులను హరించువాడును, ఆర్యపూజ్యుడును, నిష్కళంక కరుణాసాగరుడును, సకల సంసార దుఃఖ వినాశకుడును, స్వాత్మానుభూతియగు విజ్ఞాన నిష్ఠయొక్క పరమకాష్ఠ నధిష్ఠించి భాసించువాడున్నైన మలయాళ సద్గురు మూర్తియును నగు,

**అపారతేజోనిధిమప్రమేయమనాద్యనంతం పరమం పరాత్పరమ్।**
**అసంగనామ్నా భువి కీర్త్యమానమనాదిమాయాపరివర్జితం గురుమ్ ॥**

అనంతతేజోనిధియును, ప్రమాణాతీతుడైన అగోచరుడును, ఆద్యంతములు లేనివాడును, పరమ పురుషుడును, పరాత్పరుడును, అనాది మాయను దూరీకరించినవాడును, అసంగానంద నామధేయముతో లోకమున నుతింపబడు వాడునునగు,

**సమాసాద్య ప్రశాంతం తం గురుం బ్రహ్మవిదాం వరమ్ ।**
**గురూపసత్తివిధినా సాష్టాంగం ప్రణిపత్య చ ॥ 25**
**భక్త్యా కృతాంజలిపుటస్సద్గురోర్దివ్యతేజసః ।**
**ఆదాతుం శాసనం మూర్ధ్నా స్థితోఽహం వినయాన్వితః ॥ 26**

బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడును, శాంతమూర్తియునైన శ్రీ సద్గురు దేవుని సమీపించి గురూపసదనరీతిగా సాష్టాంగముగా ప్రణమిల్లి భక్తితో కేల్మోడ్చిన వాడనై దివ్యతేజస్వి యైన సద్గురువు యొక్క ఆజ్ఞను శిరస్సున ధరించుటకై వినయాన్వితుడనై నిలిచియుంటిని

**కించిదున్మీల్య నయనే భగవాంస్తత్త్వకోవిదః ।**
**కారుణ్యసాంద్రగంభీరాః పీయూషాంబుధిశీకరాః ॥ 27**
**స్రవన్మాధుర్యసుభగా జ్ఞానవిజ్ఞానతృప్తిదాః ।**
**శీతలా నిర్మలాశ్శాంతా ఆనందామృతావర్షిణీః ॥ 28**
**దృష్టీః ప్రసారయామాస సంసారభయవిహ్వలే ।**
**ప్రపన్నే మయి దీనం మాం సముద్ధర్తుం సమీహయా ॥ 29**

ఆ పవిత్ర సమాధివ్యుత్థాన సమయమందు తత్త్వవేదియు భగవంతుడునై శ్రీసద్గురుస్వామి కొంచెము నేత్రములను దెరచి మిగులకారుణ్యముతో, అత్యంత గంభీర భావముతో నొప్పుచున్నవియును, అమృతసింధు బిందువు లను నొలుకునవియును, మాధుర్యమును స్రవింపజేయుచు మనోహరము లైనవియును, జ్ఞానవిజ్ఞాన సంతృప్తి నొసగునవియును, కడుచల్లనివియును, నిర్మలము లయినవియును, శాంతితో గూడినవియును, అమందానంద వర్షమును వర్షించునవియు నగు దృష్టులను శరణుజొచ్చి నట్టియు, అనంత సంసార దుఃఖభయముచే వివశుడనై నట్టియు, దీనుడనైన నన్ను ఉద్ధరించు కోరికతో ప్రసరింపజేసెను

**ప్రభాతకాలే కకుభో యాన్తి నిర్మలతాం యథా ।**
**తథా విభాన్తి విమలాన్యక్షాణి గురుదర్శనే ॥ 30**

గురుదేవు డనుగ్రహించు సమయమున ప్రభాత సమయమున సర్వ దిక్కులు నిర్మలములగు భంగి ప్రసన్న ప్రశాంత కరుణామయ శ్రీగురుదేవుని దర్శనముచే నింద్రియుము లన్నియు నుపశమించినవై నిర్మలములై తేజోవంతము లాయెను

**తదానీం ధన్యమాత్మానం పుణ్యసంచయభాజనమ్ ।**
**మన్యమానః కృపాపాత్రం దేశికేంద్రమవాదిషమ్ ॥**

అప్పుడు నన్ను నేను పుణ్యవంతుని గాను ధన్యునిగాను గురుదయా పాత్రునిగాను భావించుచు గురువర్యునితో నిట్లంటిని

(ప్రథమాధ్యాయము మొదటి శ్లోకముతో అన్వయము)

ఓం

# శ్రీ మలయాళయతీన్ద్రగీతా

## ప్రథమోఽధ్యాయః

## జ్ఞానయోగః

శివచరణ ఉవాచ

**వ్యాసాంశసంభవ ఇతి స్తూయమాన! జనైస్సదా ।**
**భగవన్ ! వస్తుతత్త్వజ్ఞ! సర్వధర్మవిశారద ॥ 1**

**త్రాహి మాం శరణం ప్రాప్తం శాధి మాం సుగుణే పథి ।**
**దీనరక్షణ! ధీశాలిన్! దేవదేవ ! జగద్గురో! ॥ 2**

**గురుదేవకృపాయోగాత్సంశయో మే వినఙ్క్ష్యతి ।**
**త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 3**

శివచరణము చెప్పెను

వ్యాసాంశ సంభూతులని జనులచే సర్వదా నుతింపబడువాడా! ఓ భగవంతుడా! వస్తుతత్త్వము నెఱింగిన వాడా! సర్వధర్మములను గ్రహించి ప్రబోధించు గురుదేవా! దేవ దేవా! జగద్గురో! దీనులను రక్షించుటయందు జాగరూకుడవగు జ్ఞానమూర్తీ! తమను శరణుజొచ్చిన నన్ను రక్షింపుము సన్మార్గమునందు (బ్రహ్మవిద్యయందు) నన్ను శాసింపుము శ్రీసద్గురు దేవా! తమ యపారకృపా మహిమచేతనే నాయొక్క సంశయము లన్నియు నిశ్శేషముగా నశించగలవు తమకన్నను వేఱొకరు సంశయచ్ఛేదన ధురీణులు నాకు లేరు తమరే శరణము

**బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా।**
**ఏతే గృహస్థప్రభవాశ్చత్వారః పృథగాశ్రమాః॥ 4**

**సర్వేషామపి చైతేషాం వేదస్మృతివిధానతః।**

**గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠస్స త్రీనేతాన్ బిభ ర్తి హి॥** 5

**యథా వాయుం సమాశ్రిత్య వ ర్త న్తే సర్వజన్తవః।**
**తథా గృహస్థమాశ్రిత్య వ ర్త న్తే సర్వ ఆశ్రమాః॥** 6

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసియని వేఱువేఱు ఆశ్రమములు గృహస్థునివలననే యేర్పడినవి, ఈ నాలుగాశ్రమముల వారిలో శ్రుతిస్మృతులందు జెప్పబడిన రీతిగా 1 బ్రహ్మచర్య, 2 వానప్రస్థ, 3 సంన్యాసాశ్రమములవారిని చక్కగా పోషించుచున్నందుచే గృహస్థుడే ఉత్తముడన బడును ప్రాణవాయువు నాశ్రయించి సకల ప్రాణికోట్లు జీవించునట్లు గృహస్థు నాశ్రయించి సకలాశ్రమములవారు (తక్కిన మూడాశ్రమముల వారు) ఉంటున్నారు

**యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమ్।**
**గృహస్థేనైవ ధార్యన్తే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ॥** 7

**ఏవం హి మనునా పూర్వం గదితం భాతి వై స్ఫుటమ్।**
**స్వధర్మనిరతాస్సర్వే గృహిణో యా న్తి తత్పదమ్॥** 8

గృహస్థుడు మూడాశ్రమములవారిని వేదాధ్యయనము చేయించియు, అన్నపానముల నొసంగియు ప్రతిదినవము పోషించుచున్నాడు కావున గృహస్థుడే అన్ని ఆశ్రమములవారిలో శ్రేష్ఠుడై యున్నాడు ఈలాగున మనుమహర్షి మనుస్మృతియందు స్పష్టముగా వచించిరి కావున స్వధర్మానుష్ఠానపరులగు గృహస్థులందరును పరమముక్తిని బొందుచున్నారు

**సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా।**
**ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః॥** 9

**ప్రవృత్తి లక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణమ్।**
**తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సన్న్యసేదిహ బుద్ధిమాన్॥** 10

ఈ సంసారమంతయు సారము లేనిదనియు, వినశ్వరమనియు

బాగుగా నాలోచించి సకల వేదాంతసారమైన శాశ్వతమగు పరబ్రహ్మమును వీక్షించుటయే సత్యమని యెరింగి ఆ పరబ్రహ్మ దర్శనరూప తత్త్వదృష్టితో బంధరూపమగు వివాహమును త్యజించి పరవైరాగ్యమును ధన్యాత్ములు కొందఱు ఆశ్రయించుచున్నారు ప్రవృత్తిమార్గము కర్మ యగును సకల వృత్తులను సన్న్యసించు నివృత్తిమార్గమే జ్ఞానము అందువలన సంసార బందమును (అనాత్మ బంధమును) వీడి పరమాత్మప్రాప్తి బొందదలచిన ధీమంతుడు నివృత్తిరూప జ్ఞానమును పురస్కరించుకొని సన్న్యసింప వలయును

**బ్రహ్మణైవం పురా ప్రోక్తం నారదాయ మహాత్మనే।**
**యత్యాశ్రమః పరం శ్రేష్ఠో జ్ఞానముక్తిప్రదశ్శివః ॥ 11**

బ్రహ్మదేవుడు తన కుమారుడగు నారదమహామునికొఱకు పూర్వము నివృత్తిపరమగు జ్ఞానము నాశ్రయించి సంన్యసించవలయునని ఈ ప్రకారము వచించిరి కనుక యత్యాశ్రమమే మిగుల శ్రేష్ఠమైనది, జ్ఞానముక్తుల నొసగునది, శివమైనది

**శ్రుతిస్మృత్యాదిశాస్త్రేషు యతీనాం గృహిణాం తథా।**
**శ్రేష్ఠత్వం కథయన్త్యేవ కే తేషామధికాస్స్మృతాః॥ 12**

మన్వాది స్మృతులను, నారదపరివ్రాజకోపనిషదాది శ్రుతులను పరిశీలించిన ఆ శాస్త్రములందు కొన్నిచోట్ల స్వధర్మానుష్ఠాన నిరతులగు గృహమేధులు పరమోత్కృష్టులనియు, అలాగున మఱికొన్ని ప్రదేశములందు సమస్తమును సన్న్యసించిన వీతరాగులైన యతీశ్వరులే సర్వపూజ్యులనియు కడుంగడు శ్రేష్ఠులనియు మహర్షులు వచించుచున్నారు కావున వారుభయులలో అధికులెవరు? అనగా గృహస్థులు శ్రేష్ఠులా? లేక సంన్యాసులు శ్రేష్ఠులా? అను విషయమును పరమదయతో నానతిండు

**సందేహముత్సార్య విచార్య కార్య మార్యాస్సమర్యాదముదాహరన్తు ।**
**గార్హస్థ్యమాలంబ్య తు వర్తతాం వా సన్న్యాసమాదృత్య నివర్తతాం వా॥ 13**

సందేహమును దూరీకరించి విచారించి దేనినైన చేయవలయును కావున ఆర్యులగు తమరు నిస్సంశయముగా నీవిషయమును ప్రతిపాదింతురు గాక! సకలాశ్రయమగు గృహస్థాశ్రమము నవలంబించి ప్రవర్తించ వలయునా? సర్వపూజ్యమగు సంన్యాసమును స్వీకరించి నివృత్తిమార్గములో నుండ వలయునా? అనగా ప్రవృత్తిమార్గము ముక్తిదాయకమా? లేక నివృత్తి మార్గము మోక్షప్రదమా? సెలవిండు

**స్వామిన్! మహాత్మన్! కృపయా వదైతత్ సంశీతివిష్టం న మనః ప్రసీదతి ।**
**శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసంతవల్లోకహితం చర న్తః ॥ 14**

స్వామీ! మహాత్మా! పరమదయతో నీ విషయమును వచింపుడు సంశయగ్రస్తమగు మనస్సెన్నటికిని ప్రసన్నతను వహింపజాలదు శాంతాత్ములును మహాత్ములు నగు సత్పురుషులు వసంతఋతువువలె లోకహితము నొనరించుచు నుందురు వారి జీవితము నంతయు లోకోపకారమునకే వినియోగింతురుగదా!

శ్రీ మలయాళయతీంద్ర ఉవాచ

**వత్స! సుష్ఠు కృతః ప్రశ్నో లోకానాం హితకారకః ।**
**సన్న్యాసినాం చ గృహిణాం సామరస్య ప్రవర్తకః ॥ 15**

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

నాయనా! మంచి ప్రశ్న వేసితివి ఇది సర్వజనులకెంతో హితమును గలిగించునది చాలా యుపయోగకరము పరమపావనులగు గృహస్థుల కును, లోకపూజ్యులగు పరమహంసలకును పరస్పర ముపకారకమై ఐకమత్య మొనగూర్చునది

**సమ్యక్సాధనసంపన్నా స్తత్త్వజ్ఞా ముక్తిమాప్నుయుః ।**
**చతురాశ్రమిణస్సర్వే స్వధర్మనిరతా యది ।**
**స్వప్రయత్నస్య యోగేన ముచ్యన్తే నాత్ర సంశయః ॥ 16**

లెస్సగా సకల సాధనలను పూర్తిచేసిన తత్త్వవేత్తలందఱు ముక్తిని జెందిరి కావున నేయాశ్రమములో నున్న వారైనను సరియే బాధక మేమియు లేదు ఆ నాలుగాశ్రమములవారును స్వధర్మనిరతులై బాగుగా ఆచరణ గలిగినవారై యుండినచో దృఢతరమగు స్వప్రయత్నముయొక్క అతిశయ ముచే తప్పక ముక్తులగుచున్నారు ఇందులో సంశయ మేమియు లేదు

**తేషు తేషు చ స్థానేషు వరీయాన్ స తు గద్యతే।**
**సదాచారేణ సంయుక్తో యః పునీతాశ్రమో భవేత్॥** 17

ఆయా స్థానములలో ఆయా ఆశ్రమములు శ్రేష్ఠములు ఆచరణ మాత్రము తప్పక యుండవలయును సదాచార సంపన్నుడైన ఏ యాశ్రమస్థుడైనను పవిత్రాశ్రమము గలవాడగుచో శ్రేష్ఠుడని చెప్పబడు చున్నాడు అనగా సర్వదా అనుష్ఠానముతో గూడియుండెనేని సర్వాశ్రమ ములు పునీతములే, శ్రేష్ఠములే, సకలాశ్రమస్థులు పునీతులే, శ్రేష్ఠులే

**నాత్ర సంశీతిలేశో వా శాస్త్రనిర్ణయ ఏష వై।**
**యః కోపి వా భవేన్నామ జ్ఞానీ చేన్ముచ్యతే బుధః॥** 18

ఇందులో సంశయలేశముగూడా లేదు శాస్త్రనిశ్చయముగూడ నిదియే ఏయాశ్రమమైనను ఎవడైనను గానిమ్ము, ఆత్మజ్ఞాన సంపన్నుడగు ప్రతివాడును భవసాగరమును తరించి శాశ్వతసౌఖ్యదమగు ముక్తిపదవి నవశ్యము పొందుచున్నాడు

**తథైవ మనునా ప్రోక్తం సాంప్రతం వత్స శ్రూయతామ్ ।**
**అభ్యాసాద్రమతే తత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥** 19

నాయనా! ఈ విషయమై మనుమహర్షి వచించిన దానినిప్పుడు వినుము మనుజుడు తీవ్రతరాభ్యాసముచే స్వస్వరూప పరబ్రహ్మమందు రమించుచున్నాడు సకల దుఃఖములు నాశమును బొందగా నిరతిశయానంద మును బొందుచున్నాడు

**న్యాయార్జితధనస్తత్త్వజ్ఞాననిష్ఠోఽతిథిప్రియః ।**
**శాస్త్రవిత్సత్యవాదీ చ గృహస్థోఽపి విముచ్యతే ॥ 20**

న్యాయముగా ధనమును సంపాదించువాడును, తత్త్వజ్ఞాన నిష్ఠుడును, అతిథులను సత్కరించు స్వభావము గలవాడును, శాస్త్రజ్ఞుడును, సత్యవాదియునగు గృహస్థుడు గూడ విముక్తుడగుచున్నాడు

**అవ్రతా హ్యనధీయానా యే చ భైక్షచరా ద్విజాః ।**
**స్వానుష్ఠానేన రహితా బధ్యన్తే యతయో దృఢమ్ ॥ 21**

ఉత్తమవంశమున జన్మించినవారైనను, యతీశ్వరులైనను స్వధర్మాచరణమును వీడి, వ్రతనిష్ఠులుగాక వేదాధ్యయనమును, గీతోపనిషదాది పారాయణము గావింపక, ధ్యానాద్యనుష్ఠానములు లేక, కేవలము భైక్షాచరణము జేయువారు దృఢముగా సంసారదుఃఖబద్ధు లగుచున్నారు (అట్టివారిని వారున్న గ్రామము గూడ రాజు తప్పక దండించవలయును అట్లు దండింప కుండనను ఆ రాజు మహాపాతకి యగునని శాస్త్రములు వచించుచున్నవి )

**ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమిన్ద్రియనిగ్రహః ।**
**ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥ 22**

**చతుర్భిరపి చైవైతైర్నిత్యమాశ్రమిభిర్ద్విజైః ।**
**దశలక్షణకో ధర్మస్సేవితవ్యః ప్రయత్నతః ॥ 23**

1 ధృతి, 2 క్షమ, 3 దమము, 4 అస్తేయము, 5 శౌచము, 6 ఇంద్రియనిగ్రహము, 7 ధీ, 8 విద్య, 9 సత్యము, 10 అక్రోధము లనునవి పది ధర్మలక్షణ ములు, ఈ నాలుగాశ్రమముల వారును ఈ పది ధర్మములను తప్పక ఆచరించవలయును

**నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే।**
**నానుష్ఠానాత్పరో ధర్మో నానుష్ఠానాత్పరం తపః ॥ 24**

తనయొక్క నిత్యానుష్ఠానమునకంటె శ్రేష్ఠమగు మఱియొక కార్య

ముగాని, అనుష్ఠానముకంటె శ్రేష్ఠమగు ధర్మముగాని, అనుష్ఠానముకంటె శ్రేష్ఠమగు తపస్సుగాని ముల్లోకములయందును లేదు

**తద్వ్యత్పత్తజ్ఞలిమునేర్భాషితం ముక్తిదం ధ్రువమ్ ।**
**తచ్ఛ కర్ణపుటే కృత్వా సంశయం ఛిన్ధి చానఘ ॥ 25**

ఆలాగున నీ యనుష్ఠానవిషయమై 'స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారానేవితో దృఢభూమిః' అను పతంజలి మహర్షియొక్క ముక్తినొసగునట్టి నిశ్చయమగు వాక్యమును వినుము అందుచే ఓ పాపరహితుడా! నీ సంశయమును నశింపజేసుకొనుము

**అవృత్తికీ స్థితిస్తస్య శాంతావస్థా చ చేతసః ।**
**సాధనానామనుష్ఠానమభ్యాసో వీర్యపూర్వకమ్ ॥ 26**

**ఆసేవితస్ససత్కారం విద్యాశ్రద్ధాది పూర్వకమ్ ।**
**అభ్యాసో దృఢభూమిస్స్యాద్దీర్ఘకాలం నిరంతరమ్ ॥ 27**

'స తు దీర్ఘ కాల' అను సూత్రార్థము వివరింపబడుచున్నది బుద్ధిని వృత్తిరహితముగా జేసికొని, మనస్సును సంకల్పరాహిత్యముచే శాంతావస్థను బొందించి, మిగులనుత్సాహముతో యోగసాధనముల ననుష్ఠించుటయే అభ్యాస మనబడును అది విద్యాశ్రద్ధాదులతో గూడుకొని విచ్ఛిత్తి లేక దీర్ఘకాలము మిగుల ఆదరముతో నాచరింపబడినచో ఆ యభ్యాసమే స్థిరమై నిలుచును

**ఏతదేవ పురస్కృత్య భగవాన్ప్రాహ భారతమ్ ।**
**గీతావాక్యమిదం తత్త్వం శృణు సంసారభేషజమ్ ॥ 28**

గృహస్థులు శ్రేష్ఠులా, సన్న్యాసులు శ్రేష్ఠులా యను విషయమును మనస్సున నిడికొనియే అర్జునునిగూర్చి శ్రీకృష్ణభగవానుడు వచించిన దానిని వినుము యధార్థ తత్త్వమగు నీ గీతావాక్యము సంసారవ్యాధి కౌషధము

''సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః ।

ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ।
యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥''

బాలురు (అజ్ఞానులు) కర్మసంన్యాసరూప సాంఖ్యయోగమును, నిష్కామకర్మయోగమును వేరైన వానినిగా జెప్పుచున్నారు పండితులాలాగున వచింపరు కావున సాంఖ్య నిష్కామకర్మయోగములలో నేదేని నొకదానిని చక్కగా నాచరించినవాడు మోక్షఫలము నొందుచున్నాడు ఏ పరమోత్కృష్టమగు మోక్షము సాంఖ్యయోగులచే పొందబడుచున్నదో, అదియే నిష్కామ కర్మయోగనిష్ఠలచేతను పొందబడుచున్నది కావున ఏ జ్ఞాని సాంఖ్య నిష్కామకర్మయోగములు ఒకటే యని తెలిసికొనుచున్నాడో, ఆ తత్త్వవేత్తయే నిజమును గుర్తెఱింగినవాడు సారమేమనగా గృహస్థులు, సన్న్యాసులు అని భేదమేమియు లేదు సమ్యగనుష్ఠానపరు లెవరైనను (వర్ణాశ్రమ భేదములు లేక) తప్పక మోక్షమును పొందుచున్నారని భావము

**శృణు సారతమం తత్త్వం గీతాశాస్త్రం బ్రవీతి యత్ ।**
**సర్వాశ్రమాణాం యతినాం సర్వసాధారణం స్మృతమ్ ॥ 29**

మఱియు సకలోపనిషత్సారమయిన యథార్థమయిన యీ గీతాశాస్త్రము ఏ పరమోపదేశమును జేయుచున్నదో, అద్దానిని వినుము సర్వదా ప్రయత్నశీలు రగువారు ఏయాశ్రమములో నుండినను, నే వర్ణస్థు లయినను బాధకము కాదు తారతమ్యము లేదు వారందఱును విజ్ఞానసమ్పన్నులై భగవంతుని (మోక్షమును) చెందుచున్నారని సర్వసాధారణముగా సమముగా నీ గీతాతత్త్వము బోధించుచున్నది

విహాయ కామాన్ యస్సర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకారస్స శాన్తిమధిగచ్ఛతి ॥
ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥

ఏ పురుషుడు సమస్తములయిన కోరికలను విడిచి యేవిషయము లయందును కావలయుననను తలంపుగూడ లేనివాడై, అహంకార మమకార ములు లేనివాడై సదా బ్రహ్మమందు విహరించుచున్నాడో, అట్టి విజ్ఞాని సకల దుఃఖనివృత్తి పరమానందరూప పరమశాంతిని బడయుచున్నాడు ఓఅర్జునా! యీ బ్రాహ్మీస్థితిని (బ్రహ్మవిజ్ఞానమును) పొందిన మహాపురుషు డెన్న టికిని మోహమును జెందడు అవసానకాలమందైనను ఈ బ్రహ్మనిష్ఠను పొందిన వాడు బ్రహ్మనిర్వాణమును (మోక్షమును) తప్పక పొందుచున్నాడు ఈ లాగున స్థితప్రజ్ఞ లక్షణమంతయు, సర్వసాధారణముగా నున్నది ఇది అది యననేమి, మహావిశాలభావముతో ప్రవర్తించిన శాస్త్రముల కన్నిటికంటె మహోత్కృష్టమయిన యీ గీతాతత్త్వశాస్త్రము సర్వసాధారణముగా సర్వసమముగా జాతి మత ఆశ్రమ భేదములు లేక వచించుచున్నది ఇంకను సంశయము గలదా? మఱియు నీ గీతాశాస్త్రముయొక్క ముఖ్యోద్దేశ మేమనగా గృహస్థాశ్రమములో నుండి నిగ్రహింపజాలనని తోచినచో త్యాగ మవసరమనియు మరువకూడదు దీనిని 17వ అధ్యాయమున జూడ వలయును

**శ్రూయతాం ధర్మసర్వస్వం యదుక్తం శ్రుతికోటిభిః ।**
**బద్ధోఽస్మి భావనాబద్ధః ముక్తిర్ముక్తోఽస్మిభావనా ॥ 30**

నాయనా! సకలోపనిషత్తులును ఏ పరమధర్మ తత్త్వసారమును ఉద్ఘోషించుచున్నవో వినుము 'నేను బద్ధుడను' అనుభావనయే బన్ధము నేను ముక్తుడను అను దృఢభావనయే విముక్తి(మోక్షము) కనుకనే ఈలాగున ఆత్మబోధగ్రంథము దెలుపుచున్నది

ఏవం నిరన్తరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥

నిరంతరము 'బ్రహ్మమే నేను' అను దృఢసంస్కారరూప భావనయే, దివ్యౌషధము సకల రోగముల నశింపజేయునటుల సమస్త అవిద్యా

దోషములను నిశ్శేషముగా నాశమొనరించుచున్నది కావున అట్టి అహం బ్రహ్మాస్మి భావనయే ముక్తి యగును

**వివేకచూడామణిసూక్తిరాజే ఇత్యార్యమిశ్రా కథయన్తి నూనమ్ ।**
**దేహాత్మభావేన జడస్య బంధో బ్రహ్మాత్మభావస్తు విముక్తిహేతుః ॥ 31**

మఱియు నదే విషయము నీలాగున వివేకచూడామణి యను మహోత్తమగ్రంథము విశదముగా సత్యముగా ప్రతిపాదించుచున్నది -

దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధిః దేహే చ జీవే విదుషస్త్వహంధీః।
వివేక విజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాఽఽత్మని॥

జడబుద్ధిగల అజ్ఞానికి దేహమే నేనను బుద్ధి యుండును కొంచెము విచారముగల పండితునకు దేహమునందును, జీవునియందును నేనను బుద్ధి యుండును అటుగాక బాగుగా విచారముచేసి అనాత్మనుండి ఆత్మను వేరుపరచిన వివేకవిజ్ఞానముగల మహాత్మునకు సర్వదా అహం బ్రహ్మాస్మి- నేను బ్రహ్మ మను స్థిరబుద్ధి యుండును

కావున నేను దేహమునని తలంచు మూఢబుద్ధి సంసారబంధమున దగులుకొనుచున్నాడు బ్రహ్మ భావన ముక్తికి హేతువు కావున నేను సర్వదా ముక్తుడను అని భావించు విరక్తుడు ఎప్పుడును సర్వపాశములనుండి విముక్తుడైనవాడే యగును, నిత్యనిరతిశయన సుఖమును పొందినవాడే యగును

**బ్రహ్మచర్యఞ్చ గార్హస్థ్యం వానప్రస్థాశ్రమం తథా।**
**సన్న్యాసశ్చేతి చత్వార ఆశ్రమాః పరికీర్తితాః ॥ 32**

1 బ్రహ్మచర్యము, 2 గార్హస్థ్యము, 3 వానప్రస్థము, 4 సన్న్యాసము అని నాలుగాశ్రమములు చెప్పబడినవి

**జాతివర్ణాశ్రమాస్సర్వే దేహధర్మా ఇతీరితాః ।**
**న హ్యాత్మధర్మాస్తే చ స్యుః కేవలం బద్ధహేతవః ॥ 33**

బ్రాహ్మణాదిజాతులు, శ్వేతాది వర్ణములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు- ఇవన్నియు దేహధర్మములే యగును ఆత్మధర్మములు కావు మఱియు నివి ఆయాప్రదేశములకు సంబంధించినవే కాని ముక్తహేతువులు గావు కేవలము బన్ధకారణములే యగుచున్నవి

**ఆశ్రమాది చతుష్టయం భువికల్పితం మునిపుంగవైః**
**దేహధర్మ ఇతీరితం న హి తత్త్వ వేదిభిరాదృతమ్ ।**
**స్వాత్మధర్మ ఇతీరితం హృది సచ్చిదాదిగుణత్రయం**
**తద్భజ న్తి మునీశ్వరా సుఖమాప్నువ న్తి చ శాశ్వతమ్ ॥** 34

ఆశ్రమములు నాలుగు, అలాగున జాతులు నాలుగున్ను మునులచే లోకనిర్వహణమునకై కల్పింపబడినవి అవి దేహధర్మములేగాని ఆత్మధర్మములు కావు అందుచే వానిని తత్త్వవేత్త లాదరించరు యధార్థము నెఱింగిన ఆ మహర్షులు ఆత్మధర్మము లయిన 1 సత్తు, 2 చిత్తు, 3 ఆనందము అను మూడుగుణములే స్వరూప లక్షణము లనియు నిర్ణయించిరి అందుచే ఆ మహావిజ్ఞానులు సచ్చిదానంద పరబ్రహ్మమును (ఆత్మను) పొందుచున్నారు అట్టి మునీశ్వరులు శాశ్వతసుఖమును పొందుచున్నారు

**నాశ్రమం కారణం ముక్తేర్న వనాని గృహాణి చ॥**
**తథైవ సర్వకర్మాణి శుద్ధిరేవ హి కారణమ్॥** 35

బ్రహ్మచర్యాద్యాశ్రమములు, బ్రాహ్మణాది జాతులు, అలాగున వనములు, గృహములు, సర్వకర్మలును ముక్తికి కారణములు గావు మఱి ఏమనగా ఆత్మశుద్ధియే నిత్యానందరూప మోక్షమునకు గారణము

**తత్సత్త్వశాలినో నూనం సర్వేఽప్యాశ్రమిణో బుధాః ।**
**ప్రతిబన్ధైశ్చ రహితాస్సదా ముక్తిం ప్రపేదిరే ॥** 36

**న కర్మణా న ప్రజయా న ధనేన న చేజ్యయా ।**
**ముక్తిస్తద్ధేతవే సిద్ధా స్వాత్మశుద్ధిస్తు కేవలా ॥** 37

అట్టి శుద్ధిరూప మనస్సత్త్వము గలవారెల్లరు ఏ ఆశ్రమములో, ఏవర్ణ ములో నున్న వారైనను, విజ్ఞానమునకు యోగ్యమయిన అన్తఃకరణశుద్ధి గలిగి యున్నందుచే నెల్లప్పుడు నేలాటి ప్రతిబన్ధము లేనివారై ముక్తిని పొందుచు న్నారు ఈ విషయమునే (అన్తఃకరణశుద్ధి గలవారే మోక్షమున కర్హులను విష యమునే) శాస్త్రము చెప్పుచున్నది –

వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాం గృహేఽపి పంచేన్ద్రియనిగ్రహస్తవః ।
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ॥

రాగద్వేషములు గలవారు వనమునందుండినను వారికి దోషములే గలుగుచుండును గృహస్థాశ్రమమునందుండినను పంచేన్ద్రియములయొక్క నిగ్రహము గలవాడు తాపసుడే యగును నిందితముగాని కర్మ చేయువాడు ఎచ్చట నుండినను జ్ఞానియే యగును రాగరహితునకు స్వగృహమే తపోవనము ఆలాగున సన్తానముచేతను, కర్మలచేతను, ధన ముచేతను, యజ్ఞయాగాదులచేతను ముక్తి సిద్ధించదు కేవలమాత్మశుద్ధి యొకటియే మోక్షకారణముగా సిద్ధించినది

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**సమ్యగ్దర్శనసమ్పన్నా విముక్తిం యాన్తి తే పరామ్ ॥ 38**

కాబట్టి కర్తవ్యాకర్తవ్య నిశ్చయమందు శాస్త్రమే ప్రమాణము నీకును ఆశాస్త్రమే సందేహనివృత్తిని గలుగజేయును సమ్యగ్దృష్టి, ఆత్మదృష్టి, గలవారెవరైనను పరమోత్కృష్టమగు ముక్తిని బొందుచున్నారు ఇందులకు శాస్త్ర ప్రమాణము.–

తే గృహే నివసన్తోఽపి మోక్షం యాన్తి న సంశయః ।
అరణ్యస్థో తపస్వీ చ సన్న్యాసీ యాదృశం వ్రజేత్ ॥

విషయదోషము లేమియు లేని శుద్ధాత్ములు గృహములో నున్నవారై నను, వనములోనుండి తపమొనరించు తపస్వియు, సర్వసంగపరిత్యాగ మొనరించిన సన్న్యాసియు ఎట్టి మోక్షస్థానము నధిష్టించుచున్నారో అట్టి

విముక్తినే అధిరోహించుచున్నారు దీనియందు సంశయము లేదు

**యతయశ్చ గృహస్థా వా వానప్రస్థాస్తథాఽవరే ।**
**బ్రహ్మైవలోకనధియా ముచ్యన్తే నాశ్రమాదినా ॥** 39

బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, యతీశ్వరులు, ఎవరైనను ఏ వర్గములో జేరినవారైనను నిరంతరము స్వస్వరూప పరబ్రహ్మమును దర్శించునట్టి బ్రహ్మమయి దృష్టి యుండినచో సుఖముగా ముక్తులగు చున్నారు కావున మోక్షమందు స్వాత్మదృష్టియే కారణము ఆశ్రమములు వర్ణములు ముక్తినీయజాలవు అవి పరమపద కారణములు గావు మనుస్మృతి ప్రమాణము -

వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్ ।
ఇహైవ లోకే తిష్ఠన్స బ్రహ్మభూయాయ కల్పతే ॥

వేదాంతార్థము నెఱింగిన బ్రహ్మవేత్త యే ఆశ్రమములో నేజాతిలో నుండినను ఈ లోకమునందే ఉండియు బ్రహ్మమై ముక్తిని పొందుచున్నాడు

**విధ్యుక్తమార్గేణ గృహస్థధర్మగా స్సమస్తధర్మాన్ప్రతిపత్తుమీశతే ।**
**సన్న్యాసమప్రాప్య విధూతబన్ధాస్తత్రైవ ముక్తిం సులభం లభన్తే ॥** 40

గృహస్థాశ్రమములో నున్నవారు శాస్త్రరీతిగా సమస్తధర్మములను నిర్వహించుటకు శక్తి గలవారైనచో, జ్ఞానము సంపాదింప ప్రతిబంధములు లేకుండిన, సన్న్యాసాశ్రమమును పొందకయే విజ్ఞానసమ్పత్తిచే మోహ బంధములను ద్రెంపి, ఆ గృహస్థాశ్రమమునందే సులభముగా ముక్తిని బడయుచున్నారు

**గార్హస్థ్యధర్మవిధినా నిజధర్మనిష్ఠా**
**విఘ్నానపోహ్య గురుదైవకృపాధియోగాత్ ।**
**ధ్యాతవ్యలక్ష్యపరమాత్మసమాధిరూఢా**
**రాజర్షయోఽత్ర జనకప్రముఖా విముక్తాః ॥** 41

గృహస్థాశ్రమధర్మములను విధిప్రకారము నిర్వర్తించుచు నిత్యము స్వధర్మానుష్ఠానపరులై శ్రీగురుదేవునియొక్కయు, సర్వేశ్వరునియొక్కయు పరమానుగ్రహమువలన సకలవిఘ్నములను పోగొట్టుకొని నిరంతరము ధ్యానింపదగిన పరమలక్ష్యమయిన ధ్యేయమగు పరమాత్మ యందు లక్ష్యము కల్గి నిర్వికల్పసమాధినిష్ఠులై రాజర్షులయిన జనకచక్రవర్తి, అశ్వపతి, దిలీపమహారాజా మొదలగు మహాత్ములందఱు నీగృహస్థాశ్రమము నందుండియే పరమముక్తిని బడసిరి కావున గృహస్థాశ్రమము మోక్ష హేతువగునా యని యిక సంశయింపనేల?

**గార్హస్థ్యమాశ్రిత్య విమోక్తుమిచ్ఛతో రేకాత్మభావేన మతిర్వ్యపేక్షితా ।**
**తయోస్సతోర్ధర్మపథానుయాయినోర్విముక్తికాంక్షా సుదృఢా సమా భవేత్॥**

గృహస్థాశ్రమములోనుండియే యీ సంసారసాగరమును తరించి సులభముగా ముక్తిని బొందవలయునని యిచ్ఛగించు భార్యాభర్త లిరువురును ఏకమనస్సు గలవారై యుండవలయును మఱియు నట్టి యపవర్గ ధర్మమార్గమున ప్రవర్తించుచున్న సతీపతు లిద్దఱికిని ముక్తిని బొంద వలయునను సంకల్పముగూడ సమానముగాను దృఢముగా నుండ వలయును లేనిచో సన్న్యాసమే శరణ్యము

**మధ్యాహ్నకాలోజ్జ్వలభాస్కరోఽపి ఛాయాఖ్యసత్యా సహితో విరాజతే।**
**భాస్వత్కలాషోడశపూర్ణచన్ద్ర శ్శుద్ధస్సుధాచన్ద్రికయా చకాస్తి॥ 43**

**యాగాదిసన్దీపితహవ్యవాట్చ స్వాహామహిమ్నైవ సదా విశోభతే।**
**ఏవం గృహిణ్యా చ గృహీ విభాతి శాంతిక్షమాముఖ్యగుణైరుపేతయా॥ 44**

మధ్యాహ్నమున గగనతలమధ్యము నధిష్ఠించియున్న సూర్యభగవాను డును స్వధర్మపత్నియగు ఛాయా( కాంతి, ఎండ) దేవితో గూడికొనియే విరా జిల్లుచున్నాడు పదునారు కళలతో గూడుకొన్న పరిపూర్ణశుద్ధ చంద్రుడును అమృతమువంటి వెన్నెలచేతనే ప్రకాశించుచున్నాడు. యజ్ఞయాగాదులందు మిగుల ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రుడును స్వాహాదేవి మహిమచేతనే

శోభిల్లు చున్నాడు ఆలాగున గృహమేధి శాంతి, క్షమ మొదలగు పవిత్రగుణములతో పరిపూర్ణురాలగు స్వధర్మపత్నిచేతనే పవిత్రుడై వెలుగొందుచున్నాడు

**ప్రతిబన్ధాశ్చ సిద్ధాశ్చేత్ గృహస్థాశ్రమవాసినామ్ ।**
**స్థితే తు పూర్ణే వైరాగ్యే సన్న్యాసః పరమా గతిః ॥ 45**

గృహస్థాశ్రమములో నున్నవారికి నెప్పుడును స్వధర్మోన్నతి మార్గ మునకు ప్రతిబంధములే జనించుచుండినప్పుడు తమకు పరిపూర్ణవైరాగ్య మున్నచో తప్పక సన్న్యసించవలయును అప్పుడు సన్న్యాసమే పరమ శరణ్యము

శివచరణ ఉవాచ

**బ్రహ్మచర్యం సమాప్యాథ గృహీ భూత్వేతి వేదతః ।**
**క్రమేణ సన్న్యసేద్విద్వానాహోస్విత్తద్విపర్యయః ॥ 46**

శివచరణము చెప్పెను

''బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహా ద్వనీభూత్వా ప్రవ్రజేత్'' = బ్రహ్మచర్యవ్రతమును పూర్తిచేసి గృహస్థాశ్రమమును ప్రవేశించవలయును తరువాత ఆయాశ్రమమునుండి వానప్రస్థాశ్రమమును స్వీకరించవలయును ఆ వ్రతనిష్ఠలన్నియు సంపూర్ణముగా నాచరించి సన్న్యసించవలయును అను శ్రుతివాక్యానుసారముగా క్రమముగా సన్న్యసించవలయునా? అటుగాక అట్టిక్రమము ననుసరింపకనే సన్న్యసింపవచ్చునా?

**యదా మనసి వైరాగ్యం జాతమిత్యాదిశాసనాత్ ।**
**యత్ర కుత్ర సమాసీనో సన్న్యస్తుం యుజ్యతే న వా ॥ 47**

'' యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు।

తదైవ సన్న్య సేద్విద్వానన్యథా పతితో భవేత్ ॥''

‘‘సమస్త వస్తువులయందు వైరాగ్యమెప్పు డుదయమగునో అప్పుడే విద్యాంసుడు సన్న్యసించవలయును లేనిచో పతితుడగును’’ అను శ్రుతిశాసనము ననుసరించి యే ఆశ్రమములో,నున్నవారైనను పరిపూర్ణముగా వైరాగ్యము గలిగినచో అచ్చోటినుంచియే సన్న్యసింపవచ్చునా? పరమదయతో నానతిండు

శ్రీమళయాళయతీన్ద్ర ఉవాచ

**సన్న్యాసభేదం ద్వివిధం వదన్తి తే**
**క్రమాక్రమాభ్యాం విషయాదియోగతః ।**
**నిర్వాసనాభావవియుక్త చేతసాం**
**క్రమోస్త్వుపాయోఽక్రమ ఏవ యోగినామ్ ॥ 48**

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

సన్న్యాస మనునది 1 క్రమసన్న్యాసము, 2 క్రమభిన్నసన్న్యాస (సద్యస్సన్న్యాస)మని రెండు విధములుగా నున్నది మొదటిదియగు క్రమసన్న్యాసము నిర్వాసనాస్థితి గలుగక విషయాదులందు ప్రవర్తించువారికి నేర్పడినదనియు, రెండవది(క్రమము లేకనే సన్న్యసించుట) వీతరాగులగు యోగులకు విధింపబడినదనియు ప్రసిద్ధములగు ధర్మసింధు, నిర్ణయసిన్ధు ఇత్యాది గ్రన్థములు చెప్పుచున్నవి

**యస్తత్త్వ వేత్తా విషయాన్విషాత్మకాన్ మన్యేత బాహ్యాన్తరశుద్ధధీ ర్యదా ।**
**క్రమం పరిత్యజ్య తదై వ సన్న్యసేత్ పురాగతే జన్మని సంస్కృతో హి సః ॥**

ఏ తత్త్వజ్ఞాని బాహ్యాభ్యన్తరశుద్ధిని బుద్ధినిగూడ జెరచునట్టి విషయముల నెప్పుడు విషముగా దలంచునో, అట్టి వైరాగ్యసమ్పన్నుడు తా నేయాశ్రమములో నున్నవాడైనను క్రమమును పాటింపక అప్పుడే సన్న్యసింపవచ్చును ఎందుకనగా ఆ పరిశుద్ధాత్ముడు పూర్వజన్మమునందే బాగుగా సంస్కరింపబడినవాడు అనగా మలినసంస్కారములను నశింపజేసి శుద్ధ

సంస్కారములతో గూడుకొన్నవాడు

**పురా బహూనాం జననాన్తరాణాం**
**పూర్వాశ్రమాదీన్బహుధాऽऽధితస్థౌ ।**
**తత్తత్సుఖాదీన్విషయాన్విధున్వన్**
**యో రాజతే బ్రహ్మణి న క్రమోऽస్య ॥** 50

ఆ శుద్ధాత్ముడు ముందుగా అనేక జన్మములలో బ్రహ్మచర్యాద్యాశ్రమములను మూడింటిని చక్కగా ననుష్ఠించి దాటెను కావున ఆవిషయసుఖములను పూర్తిగా పరిత్యజించి వైరాగ్యశాలియగు ఏధన్యాత్ముడు పరబ్రహ్మ ధ్యానమందు విహరించుచున్నాడో, ఆ మహాత్మునకు క్రమసన్న్యాసమవసరము లేదు క్రమము లేకనే సన్న్యసింపవచ్చును అట్టి మహానుభావుడు లోకోద్ధరణకై వచ్చిన పరమహంస యని తెలియవలెను

శివచరణ ఉవాచ

**కథన్ను శక్యం భగవన్వదస్తు జ్ఞాతుం గతే జన్మని యత్రవృత్తమ్ ।**
**మయాऽऽశ్రమాస్తే కతి తత్ర నీతాః జ్ఞాతుం తదేతచ్చ కిమస్తి చిహ్నమ్॥**

శివచరణము చెప్పెను

ఓ భగవన్తా! పూర్వజన్మవృత్తాన్తము నెటుల దెలియనగును? నాచే గత జన్మములో ఎన్ని ఈ యాశ్రమము లతిక్రమింపబడినవి అను విషయమును గ్రహించుటకు గుర్తు ఏదైన గలదా? పరమదయతో తమరే వచింపుడు

**త్వత్తస్తదిచ్ఛామ్యవగన్తు మద్య సంశీతిదూరీకరణే ప్రవృత్తాత్ ।**
**న చాన్యథా శామ్యతి మేऽన్తరాత్మా హ్యతో భవన్తం శరణం ప్రపద్యే॥** 52

ఓ స్వామీ! సర్వసంశయములను నిరాకరించుచున్న మీవలన ఆవిషయమున్ను దెలిసికొనగోరుచున్నాను అటుగాకుండిన నా అన్తరాత్మ ప్రశాంతిని పొందదు కనుక మిమ్ములనే శరణు పొందుచున్నాను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**జీవస్య దుఃఖాత్మకబన్ధహేతునా సంసారవార్ధిం క్రమితుం సమీహయా।**
**విమోక్తుమిచ్ఛోరఖిలేషు వస్తుషు వాన్తేష్వివ స్యాన్మహతీ జుగుప్సా॥ 53**

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

నానావిధ దుఃఖబంధములచే తపించుచున్న వాడగుటచే ఈ సంసార సముద్రమును దాటవలయునను దృఢేచ్ఛ గల జీవునకు వమనవస్తువులందు వలె సకల వస్తువులందును జుగుప్స(విరక్తి) గలుగుచున్నది వమనాన్నమందు తిరుగ నెవరికిని నిచ్ఛ జనించదు ఆలాగున పూర్వజన్మమందు బ్రహ్మచర్యాద్యాశ్రమములను శీలించి విషయములందును విరక్తిజెందిన వానికి తిరుగా వాంఛ జనించదు గదా కావున తిరుగా క్రమముగా నాశ్రమములను శీలించవలయుననుట సంభవించదు గదా।

**సమస్తవేదాబ్జతతేశ్చ భాస్వతా వ్యాసేన పిత్రా సుతరాం బభూవ సా ।**
**వాదోపవాదైశ్చలితా చ వాక్సుధా మహర్షిసేవ్యస్య శుకాఖ్యయోగినః ॥ 54**

ఈ విషయమందు సకలమహర్షులచే సేవింపదగిన శుకమహర్షికిని, వారి తండ్రియగు, సకలవేదములనెడు పద్మములను వికసింపజేయుట యందు సూర్యభగవానుడయిన వ్యాసమహామునికిని వాదోపవాద పురస్సరముగా అమృతమువంట సంభాషణ జరిగెను దానిసారము పైన తెలుపబడునదే యగును

**పూర్వజన్మని సంస్కారాదాత్మశుద్ధిః ప్రజాయతే ।**
**త్రిష్వాశ్రమేషు నిర్వేదాత్తేషు ప్రీతిం న గచ్ఛతి ॥ 55**

పూర్వజన్మ సంస్కారబలిమిచే నాత్మశుద్ధి గలుగుచున్నది అందుచే గడచిన మూడాశ్రమములందు వైరాగ్యము గలిగినందుచే మరల ఆమూడింటి యందు ప్రీతిని జెందడు

**హేతుభూతామిమాం బుద్ధ్వా శిష్యనిర్వాసనాస్థితిమ్।**
**చతుర్థాశ్రమయోగ్యత్వం గురుర్విన్దేత తత్త్వతః॥ 56**

మూడాశ్రమములందిచ్చ లేకుండుట యను కారణమును తెలిసికొని, శిష్యునియొక్క వాసనారాహిత్యస్థితిని గూడ గమనించి, శ్రీ గురుదేవుడు యధార్థముగా శిష్యునియొక్క సన్న్యాసాశ్రమార్హతను గ్రహించవలయును

**నేహాభిక్రమమార్గోఽస్తి బ్రహ్మచర్యాదిశాస్త్రతః।**
**యాదృశం విద్యతే తత్త్వం తాదృశే తం ప్రవేశయేత్॥ 57**

బ్రహ్మచర్యమునుండి క్రమముగా సన్న్యసించవలయునను శ్రుతి ననుసరించి వీతరాగుని విషయమున క్రమసన్న్యాసమార్గ మాశ్రయింప యోగ్యము గాదు శిష్యుడెట్టితత్త్వ మందున్నాడని గ్రహించునో ఆ తత్త్వమందే వానిని గురువు ప్రవేశపెట్టవలయును

**అధీతశాస్త్రేషు పరీక్ష్య యోగ్యతామ్**
**ఛాత్రస్య కక్ష్యావరనీయమంశమ్ ।**
**దద్యాచ్చ శిక్షాముచితాం గురూత్తమో**
**మహోత్తమాం చాఖిలతత్త్వగామినీమ్ ॥ 58**

ఆచార్యుడు శిష్యు డిదివరకు జదివిన శాస్త్రములలో వాని యోగ్యతను, ఇక కక్ష్యలో జదువవలసిన అంశాలను పరీక్షించి తరువాత దానికన్న ఎక్కుఎగు కక్ష్యలో శిష్యుని ప్రవేశపెట్టి తదున్నతగ్రంధములను పఠింపజేయునట్లు అఖిలతత్త్వములను తెలియజేయు ఉత్తమమైన బ్రహ్మవిద్యలో శిక్షణను గురూత్తముడు శిష్యున కొసగవలయును

(అనగా శిష్యుడెన్ని యోగసాధనలను శీలంచియున్నాడు, ఏభూమికలో నున్నాడు, వాని అన్తఃకరణ నిశ్చలత్వ పారిశుద్ధ్యము లెంతమట్టు కున్నవి– ఈలాగున శరణుజొచ్చిన శిష్యుని బాగుగా పరీక్షించి ఉచితమగు సాధనలను, ఉపదేశములను శ్రీ గురుదేవు డొసంగవలయును )

**ప్రశాన్తచిత్తోఽఖిలతత్త్వవేత్తా శిష్యాత్మశుద్ధిం బహుధా పరీక్ష్య।**
**యయా విముక్తిస్సులభా భవేద్వై తాం పద్ధతిం ఛాత్రగణాయ దద్యాత్॥59**

కావున ప్రశాంతిజెందిన చిత్తముగల పరబ్రహ్మతత్త్వవేత్తయగు శ్రీగురువరుండు శిష్యుని యాత్మశుద్ధిని ననేకవిధములుగా పరీక్షించి, యేమార్గముచే ముక్తి సులభముగా లభించునో ఆ పద్ధతిని యోగ్యతాను సారముగా శిష్యులకు నొసంగవలయును

**తథా ప్రసిద్ధం పరమార్థభూతం సంగోప్య తత్త్వం చతురాశ్రమాశ్చ ।**
**క్రమేణ సేవ్యా ఇతి భాషణం యత్ తద్ధీమతాం చర్వితచర్వణం స్యాత్॥ 60**

ఈలాగున వారి యోగ్యతనుబట్టి ఆశ్రమములను స్వీకరింపవచ్చునను తత్త్వము యథార్థమై స్పష్టమై నిస్సందేహముగా నుండగా, ఆ తత్త్వమును కప్పిపుచ్చి క్రమముగా నాలుగాశ్రమములను విరక్తులును అనుష్ఠింప వలయునని వచించు టేదిగలదో, అది ధీమంతులగు తత్త్వవేత్తలకు చర్విత చర్వణ మగును (అనగా భక్షించినదానిని మరల భక్షించుట, చెప్పినదానినే యూరకే చెప్పుట, చదివినదానినే చదువుట, గ్రహించినదానినే గ్రహించుటవలె నుండును )

**విరక్తచిత్తస్య శమాదిశాలినః క్రమేణ ముక్తిప్రతిపాదనం తథా ।**
**అధీతవిద్యస్య పరత్ర ధీమతః ప్రారంభకక్ష్యాసు యథాఽత్ర యోజనమ్॥**

శమదమాదులు గలిగిన విరక్తుడగు ముముక్షువునకును, ఆశ్రమ క్రమముగా ముక్తిని ప్రతిపాదించుట- యిది వరకు నితర కళాశాలలో జదివి యుత్తీర్ణుడయిన వానికిని, ఆపై తరగతి లేకున్నందుచే వచ్చినవానికిని, ఒక భాగము తప్పిపోయినదానిని పూర్తి జేసికొనుటకై తిరుగా నీ కళాశాలలో చేరదలంచిన వానికిని- అందరికిని ప్రథమకక్ష్యాశిక్షను విధించినటుల నుండును కొందఱు పూర్వజన్మమందు, యోగసాధనలను సాధించు సమయమున కాలమాసన్న మగుటచే శరీరమును విడిచియుందురు తిరుగా జన్మించునప్పుడు తామిదివరకు సాధించిన యోగసాధనములకు తర్వాతనే ప్రారంభింతురు అటుగాక పూర్వజన్మమందు యోగసాధనపరుడైనను ఏదైన నొకకారణాంతరముచే మరుజన్మమునకు వచ్చినవానినిగూడ క్రమమార్గము

ననుసరింపవలయు ననుట విశ్వవిద్యాలయుములో నన్నిభాగములం దుత్తీర్ణుడయిన వానిని తిరుగా ఓనమాలు చదువుమనునటు లుండునని తెలియవలయును

**విహఙ్గయానం బహుశాస్త్రసిద్ధం పిపీలికామార్గగతిస్తథైవ ।**
**విరక్త బుద్ధేః ప్రథమం గురూక్తం మన్దాత్మనామేవ గతిర్ద్వితీయా॥ 62**

శాస్త్రములలో 1 విహఙ్గమార్గము, 2 పిపీలికామార్గము అని రెండు మార్గములు వచింపబడియున్నవి తీవ్రవైరాగ్యము గలిగిన ధీమంతునకు మొదటిదియగు విహంగయానమే గురువరునిచే జెప్పబడియున్నది అటు గాక మందవైరాగ్యము గలిగిన మందమతులకే రెండవదియగు పిపీలికా మార్గము (క్రమము క్తిమార్గము) విధింపబడినది

**అయం చ విద్వజ్జనదూషితో హి క్రమేణ సన్న్యాస ఇతి ప్రవాదః ।**
**వినిన్దితం తద్యతిధర్మశాస్త్రే భుంజీత వాంతంత్వితికో బ్రవీతి॥ 63**

ఈ క్రమసన్న్యాసమే శ్రేష్ఠము, సర్వశాస్త్రసిద్ధము అని వాదించుట తత్త్వవేత్తలకు సమ్మతమయినది గాదు మఱియు నది యతిధర్మశాస్త్ర మునందు దూషింపబడినది వమనాన్నమును భక్షించవలయును అని యెవడు చెప్పును? కావున నానా జన్మలనుంచి నానాదుఃఖము లనుభవించి విరక్తిజెందిన భాగ్యశాలికి తిరుగా విషయప్రవేశమును విధింప నవసరము లేదు అది వానికి విషపానము వంటిదని తెలియవలయును

**తథాఽపి తత్త్వార్థ నివిష్టబుద్ధే శ్ఛాత్రస్య నిర్వృత్తికశుద్ధవాసనాః ।**
**సంశోధయేత్సద్గురురేవమేవ శిష్యస్స్వమప్యన్యవిధౌ ప్రమాదః ॥ 64**

అయినను (విరక్తి జనించినప్పుడు క్రమములేక సన్న్యసింపవచ్చునను విధి శ్రుతికిని సమ్మతమై, మహర్షి సంప్రదాయానుసిద్ధమై యున్నను) యథార్థమగు బ్రహ్మతత్త్వమును పొందదలంచి తన్ను సమీపించిన శిష్యుని యొక్క వాసనారహితమగు స్థితిని శ్రీగురుదేవుడు బాగుగా పరీక్షించ వలయును అట్టి వృత్తిరహితుడయిన విరక్తునికే సన్న్యాసాశ్రమము నొసంగ

వలయును మహావాక్యతత్త్వోపదేశము నొసగవలయు శిష్యుడు గూడ తన అన్తఃకరణస్థితిని, వృత్తులు, వాసనలు, గుణములు నశించినవా, లేవా అని పరీక్షించుకొనియే యత్యాశ్రమమును స్వీకరించవలయును లేనిచో ప్రమాదము తప్పక కలుగును.

**దేహాన్తరజ్ఞాత్మ విభాగయుక్త స్సన్న్యాసభేదస్త్రివిధో విభాతి।**
**శరీరసన్న్యాసముపేయుషోఽన్యద్వయోరభావాన్న సుఖం న శాన్తిః॥ 65**

సన్న్యాసము దేహమును, మనస్సును, ఆత్మను బట్టి 1 దేహసన్న్యాసము, 2 మానసికసన్న్యాసము, 3 ఆత్మసన్న్యాసము అని మూడు విధములుగా నున్నది వానిలో కేవలము దేహసన్న్యాసము మాత్రము పొందినవానికి తదితర సన్న్యాసద్వయము లేకున్నందుచే నాత్మప్రబోధజ్ఞానము, నిత్యసుఖము, నిత్యశాంతియు గలుగజాలవు

**వైరాగ్యసహితో న్యాసస్సంసక్తాఖిలగేహినామ్ ।**
**విధివద్బాహ్యసంస్కారాద్దేహసన్న్యాస ఉచ్యతే ॥ 66**

తాను మిగుల వైరాగ్యముతో గూడినవాడై తన బంధువర్గమును, మిత్రులను వదలి శాస్త్రరీతిగా బాహ్యసంస్కారముతో గూడ సన్న్యాసాశ్రమమును గ్రహించుట దేహసన్న్యాస మగును.

**దేహసమ్బద్ధసన్న్యాసస్సంకల్పానాం వినాశకః ।**
**అన్యసన్న్యాసయోస్సమ్యక్ప్రసూతే సకలాన్గుణాన్॥ 67**

ఆ దేహసన్న్యాసము చాలమట్టుకు సంకల్పములను నశింపజేసి మిగిలిన సంకల్ప, ఆత్మసన్న్యాసములు రెండింటికిని నానావిధములుగా సహాయము జేయుచున్నది

**సదా హృద్గతసంకల్పాన్నిరుధ్య వశినస్స్థితిః ।**
**స ఏవ చిత్తసన్న్యాసో యోగిభిః పరికీర్త్యతే ॥ 68**

సర్వదా మనస్సులోని సంకల్పములను పూర్తిగా త్యజించి చిత్తమును

వశపరచుకొన్న వానిస్థితియే మానసిక సన్న్యాసమని యోగులు వచించు చున్నారు

**సన్న్యస్తాఖిలసంకల్పో యస్తు నిర్వాసనాత్మకః ।**
**స ఏవ ముచ్యతే బన్ధాద్దేహసన్న్యాసమన్తరా॥ 69**

ఎవడు సకలసంకల్పములను వదలి వాసనారహిత మనస్సు గలిగియున్నాడో అట్టి తత్త్వవేత్త దేహసన్న్యాసము లేకపోయినను ముక్తుడే యగుచున్నాడు

**ఛిత్వా చ నిశ్శేషమనాత్మబన్ధాన్ జ్ఞానాసినా బ్రహ్మపదార్థబోధః ।**
**సన్న్యాసినాం యేన నిర న్తరస్స్యా త్స చాత్మసన్న్యాస ఇతి ప్రసిద్ధః ॥ 70**

జ్ఞానఖడ్గముచే అనాత్మబంధముల నన్నిటిని పూర్తిగా ఛేదించి అహంబ్రహ్మాస్మి ప్రబోధము నిరన్తరము దేనిచే గలుగుచున్నదో అదియే ఆత్మసన్న్యాసమని చెప్పబడెను

**తేనైన సిద్ధా నిఖిలాత్మభావః సమైక్యబోధశ్శివజీవయోశ్చ ।**
**ఆత్మానుభూతిః పరమోపశా న్తిర్నిరంతరానందసుధాప్రవాహః ॥ 71**

ఆ యాత్మసన్న్యాసముచే సర్వాత్మభావము, శివజీవైక్యజ్ఞానము, ఆత్మానుభవము, పరమశాంతి, అఖండానందామృతప్రవాహమున్ను సిద్ధించు చున్నవి, అదియే అమృతము, శివము

**భానుప్రకాశేన వినాంధకారో యథా న దూరీక్రియతే తథైవ ।**
**వినాత్మ సంన్యాసముపాధినాశో న సాధకస్యాత్ర కదాఽపి జాయతే ॥ 72**

సూర్యభగవంతుని ప్రకాశము లేకపోయినచో అంధకారము నశించదు ఆలాగున ఆత్మసన్న్యాసము లేకుండినచో ఆత్మసాధకుని ఆత్మకు ఉపాధినాశ మెప్పుడును సిద్ధించదు

**అనాత్మదూరీకరణం చ కేవలం యత్స్వాత్మనస్స్యాద్ధి తదేవ దుర్లభమ్ ।**
**విహాయ సన్న్యాసమముం తృతీయం మహత్పదం తన్న హి సిధ్యతీహ ॥73**

తనలో నున్న యనాత్మభావనల నన్నిటిని దొలగద్రోసికొని తాను బ్రహ్మమను ఆత్మభావన గలిగియుండుటేదియో అది కడుంగడు దుర్లభము మూడవదైన ఆత్మసన్న్యాసము లేని పక్షమున మహోత్కృష్టమయిన ఆ పరమ పదము సిద్ధించదు

**నిత్యానిత్యవివేక జన్యసుధియా దేహాది సన్న్యస్యతే**
**వాగాదీన్ద్రియవృత్తిసంయమబలాచ్చిత్తాది సన్న్యస్యతే ।**
**వేదన్తార్థవిచారతత్త్వజనుషా స్వాత్మాది సన్న్యస్యతే**
**సంస్కారాగత సిద్ధయత్నతతిభిర్జీవ స్తథా ముచ్యతే ॥** 74

నిత్యానిత్యవస్తువివేక మహిమచే దేహసన్న్యాసమున్ను, వాగాదీన్ద్రియములయొక్కయు, చిత్తముయొక్కయు వృత్తులను నిరోధించి సంయమముతో నుండుటచే మానసిక సన్న్యాసమున్ను, వేదాంతార్థ విచారణాజన్య తత్త్వజ్ఞానముచే ఆత్మసన్న్యాసమున్ను సిద్ధించుచున్నవి పై జెప్పబడిన సంస్కారముల బలిమిచే గలిగెడు దృఢతరప్రయత్నములచే జీవుడు క్రమముగా ముక్తుడగుచున్నాడు

**హృత్పఞ్జరస్థశుకవత్పరిభూయమానం**
**యావన్న ముఞ్చతి పరీతవిమోహపాశః ।**
**తావన్న విన్దతి జనః పరమాత్మరూపం**
**సన్న్యాసయోగ కలితస్సముపైతి ముక్తిమ్ ॥** 75

జీవుడు చిలుకవలె హృత్పంజరమునందు నానావిధ దుఃఖములచే తిరస్కరింపబడుచున్నాడు అట్టి జీవుని (తనను) ననాదిగా చుట్టుకొని వచ్చుచున్న మోహపాశ మెంతవరకు వదలకయున్నదో అంతవరకాత్మ స్వరూపమును తెలియజాలడు కావున ఆ యాత్మసన్న్యాస యోగముచే కూడినవాడు మాత్రమే (మోహజాలమును వదిలించుకొని) పరమాత్మ స్వరూపుడై ముక్తుడగుచున్నాడు పంజరమునుండి బయలువెడలిన శుకమువలె చిదాకాశమందు పరమానందముతో విహరించుచు నిత్యసుఖ

మును బడయుచున్నాడు

**యాం ప్రాప్య వేద్య పరమావధితాం భజన్తే**
**తామేవ ముక్తిపదవీం సుఖదాం వద న్తి ।**
**తత్రైవ శా న్తిముపగచ్ఛతి జీవలోక**
**స్తైనైష భూరి కృతకృత్యకతాముపైతి ॥** 76

ఏ నిత్యపరిపూర్ణాఖండానందవిజ్ఞాన ముక్తిపదవిని పొంది కట్టకడపట తెలియదగినదానిని తెలిసికొనినవా రగుచున్నారో, అట్టి ముక్తిపదవినే పరమసుఖప్రదమని వచించుచున్నారు అట్టి పరమవిశ్రాన్తిధామమమందే ముక్తజీవులెల్లరు పరమశాంతిని బడుయుచున్నారు అట్టి పరమపదప్రాప్తి చేతనే కృతార్థులగు చున్నారు

**ధన్యాశ్చ తే సతతత త్త్వ విహారశీలాః**
**పీయూషపాయిమదభృంగవదాత్మసక్తాః ।**
**విస్మృత్య దృశ్య మమలాత్మసుధాం పిబంత**
**స్వాత్మోన్నతిం పునరనాగమనం భజ న్తే ॥** 77

ఏ మహానుభావులు, సర్వదా బ్రహ్మతత్త్వమందే విహరించు స్వభావము గలవారై, మకరందామృతము త్రాగుచు సమస్తమును మరచిన తుమ్మెదవలె నిరంతరము ఆత్మలీనులై సకలదృశ్యమును మరచి ఆత్మామృత పానము చేయుచు ఉంటున్నారో, అట్టివారలే కడుంగడు ధన్యాత్ములు ఆ మహాత్ములు ఆత్మోన్నతిని పొంది పునరావృత్తిని పొందరు అనగా జననమరణరహిత ముక్తిని పొందుచున్నారు

**తదేవ సత్యం చ తదేవ శాన్తం తదేవ నిత్యం పరమం తదేవ ।**
**తదేవ ముక్తిశ్చ తదేవ బుద్ధం తదేవ గమ్యం చ సదా విభాతి ॥** 78

అదియే సత్యము, అదియే శాన్తము, అదియే నిత్యము, అదియే పర తత్త్వము, అదియే ముక్తి, అదియే జ్ఞానస్వరూపము, అదియే గమ్యస్థానము, అదియే సర్వదా ప్రకాశించుచున్నది

**తదేవ పరమం స్థానం తదేవ పరమం శివమ్ ।**
**తదేవ నిఖిలం తత్త్వం తదేవ పరమామృతమ్ ॥ 79**

అదియే పరమస్థానము, అదియే పరమశివము, అదియే సకల తత్త్వము, అదియే పరమామృతము

**జ్ఞానయోగస్య సర్వస్వం పీయూషామ్బుధిసన్నిభమ్ ।**
**తస్మిన్మజ్జనమాత్రేణ న విశతి పునర్భవమ్ ॥ 80**

ఈ జ్ఞానయోగముయొక్క సారము అమృతసముద్రము వంటిది యగును దానియందు స్నానము జేసినవారు తిరుగా జన్మించరు

**జ్ఞానయోగో హి యోగానాం శ్రేష్ఠో భౌమఫలప్రదః ।**
**జ్ఞానయోగస్థితబ్రహ్మనిష్ఠానాం నిష్కళాత్మనామ్ ॥ 81**

**జ్ఞానినాం విరళత్వాద్ధి లోకోఽయం తమసాఽఽవృతః ।**
**నాశయన్హి తమో జ్ఞానాన్ముక్తో భవ గురోఋణాత్ ॥ 82**

అజ్ఞానమును నశింపజేసి బ్రహ్మప్రాప్తిఫలము నొసగు నీజ్ఞానయోగము యోగములలో నన్నిటికంటెను శ్రేష్ఠమయినది ఇట్టి జ్ఞానయోగతత్పరులును నిష్కళాత్ములునగు బ్రహ్మనిష్ఠులు లోకములో నరుదైనందుననే ప్రపంచము అజ్ఞానావృతమై యున్నది కాన నిర్మలాత్మా! జ్ఞానప్రబోధముచే లోకాన్ధ కారమును నశింపజేసి గురుఋణమునుండి విముక్తుడవు కమ్ము

ఇతి శ్రీ మలయాళ యతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
జ్ఞానయోగోనామ ప్రథమోఽధ్యాయః

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీ మలయాళయతీన్ద్రగీత యందు
జ్ఞానయోగమను ప్రథమాధ్యాయము సమాప్తము



# ద్వితీయోఽధ్యాయః

# యోగవిజ్ఞానయోగః

శివచరణ ఉవాచ

**మోక్షస్య సిద్ధయే హేతుర్యోగో వా జ్ఞానమేవ వా।**
**అథవా జ్ఞానయోగౌ వా బ్రువన్తు పురుషోత్తమాః॥** 1

శివచరణము చెప్పెను

మోక్షము సిద్ధించవలయునన్న యోగము కారణమా? లేక జ్ఞానము కారణమా? అటుగాక యోగజ్ఞానములు రెండును హేతువులా? ఈ విషయమును పురుషోత్తములగు శ్రీగురుదేవులు పరమాదరముతో కరుణింతురు గాక!

శ్రీ మలయాళయతీన్ద్ర ఉవాచ

**అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః।**
**ప్రకారౌ ద్వౌ పురా దేవో జగాద పరమేశ్వరీమ్।**
**తథాఽపి ద్వితయం లబ్ధ్వా శీఘ్రం ముచ్యేత బన్ధనాత్॥** 2

శ్రీ మలయాళ యతీంద్రుడు చెప్పెను

లోకమున ముముక్షువులగు కొందరికి యోగమును సాధించుట కష్టముగా నుండును మరికొందరికి జ్ఞానము సులభసాధ్యము గాక యుండును కావున పరమేశ్వరుడు పార్వతికి మోక్షమునకు వారివారి సంస్కారముల ననుసరించి రెండున్ను, అనగా కొందఱికి యోగమార్గ మున్ను, కొందరికి జ్ఞానమార్గమున్ను బోధించెను అయినను ప్రతివారికిని యోగ-జ్ఞానములు రెండును నవసరములు గనుక ఈయోగజ్ఞానములను రెంటిని శీలించినవారు శీఘ్రముగా భవబంధమునుండి విడివడి శాశ్వత సౌఖ్యమును పొందుచున్నారు

**ఆత్మజ్ఞానేన ముక్తిస్స్యాత్తచ్చ యోగాదృతే న హి ।**
**యోగేన సహితం జ్ఞానం సులభం ముక్తిదం ధ్రువమ్ ॥ 3**

ఆత్మజ్ఞానముచేతనే ముక్తి లభించుచున్నది అయినను ఆ యాత్మజ్ఞానము యోగము లేక గలుగదు కావున యోగముతో గూడిన జ్ఞానమే సులభమై మోక్షము నొసగుచున్నది ఇది నిశ్చయము

**యోగాగ్నిర్దహతి క్షిప్రమశేషం పాపపంజరమ్ ।**
**తతశ్చిత్తం ప్రసన్నం స్యాత్ తతో జ్ఞానం ప్రజాయతే ।**
**తస్మాదనుభవజ్ఞానాద్బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 4**

యోగాగ్ని సమస్త పాపపంజరమును శీఘ్రముగా దహించుచున్నది అందుచే నంతఃకరణము శుద్ధమగుచున్నది అట్టి యన్తఃకరణ పారిశుద్ధ్యముచే జ్ఞానముదయించుచున్నది ఆ యనుభవజ్ఞానముచే నిర్వాణమును (మోక్షమును) పొందుచున్నాడు

**జ్ఞాననిష్ఠో విరక్తోఽపి ధర్మజ్ఞోఽపి జితేన్ద్రియః।**
**వినా యోగేన దేవోఽపి న ముక్తిం ప్రాప్తుమర్హతి॥ 5**

శ్రవణజ్ఞానవంతుడైనను, మహావైరాగ్యము గలవాడైనను, ధర్మజ్ఞుడైనను, సకలేన్ద్రియములను జయించినవాడైనను, కట్టకడకు దేవుడైనను యోగములేక ముక్తిని పొందుట కర్హుడు గాడు (పెనుగాలి కొట్టునప్పుడు నిరావరణముగా దీపము నెవడుంచినను వెలుగునా? అలాగున విషయ దోషములచే చిత్తచాంచల్యముండిన జ్ఞానజ్యోతిని వెలిగింప నెవనికిని సాధ్యముగాదు)

**ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ సువ్రత।**
**యోగో వృత్తినిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్॥ 6**

సకలవాసనలు నశించి మనోనాశము గలుగుటకు సకలవృత్తులను నశింపజేయు యోగము, ఆత్మస్వరూపమును దెలుపుజ్ఞానము– రెండును

అత్యంతావశ్యకములై యున్నవి ఓ వ్రతనిష్ఠుడా! యోగమనగా సకలవృత్తి నిరోధము, జ్ఞానమనగా లెస్సగా స్వస్వరూప పరమాత్మను దర్శించుట - యగును

**మనోవృత్తి వినాశశ్చ స్వస్యచిద్భావ ఏవ చ ।**
**ధ్యానవిజ్ఞానయోగాభ్యాం నూనం సిద్ధ్యౌ న సంశయః ॥ 7**

హృదయములోని వృత్తులన్నియు విలయమగుట, తాను చిద్రూప పరమాత్మ యగుట - ఈ రెండును క్రమముగా ధ్యానయోగముచేతను, జ్ఞానయోగముచేతను సిద్ధించును ఇది నిశ్చయము

**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్।**
**తస్మాద్యోగం చ జ్ఞానం చ తర్తుమిచ్ఛుర్ది సాధయేత్॥ 8**

యోగము లేకపోయిన జ్ఞాన మొకటిమాత్రము మోక్షమును ఎట్లు గలిగించును? కావున యోగమునున్ను, జ్ఞానమునున్ను సంసారమును తరింపగోరు ముముక్షువు నిశ్చయముగా సాధించవలయును

**యోగేన సాధితం జ్ఞానం సుదృఢం కల్మషాపహమ్।**
**వాయునా దీపితో వహ్నిస్సర్వం దహతి హి క్షణాత్ ॥ 9**

యోగానుష్ఠానపూర్వకముగా గలిగిన జ్ఞానము సకల కల్మషములను తప్పక వెంటనే నశింపజేయుచున్నది ఎటులనగా వాయువుచే ప్రజ్వలింపజేయ బడిన యగ్ని యొక్క క్షణములోనే సర్వమును దగ్ధము జేయుచున్నది గదా!

**విజ్ఞాన యోగౌ విహగస్య పక్షవత్ పుంసో విజానాతు విచక్షణో భవాన్।**
**విముక్తిసన్మార్గవిహారశీలతా తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి॥ 10**

ఆకాశమందు విహరించుటకై పక్షికేలాగున రెండు టెక్కలు ఆవశ్య కములై యున్నవో, ఒకటెక్క యుండినను పై కెగురజాలదో, ఆలాగున మోక్ష మనెడు గగనమందు విహరింప దలచినవానికి యోగజ్ఞానములనెడు రెండు పక్షములున్ను ముఖ్యముగ నవసరములై యున్నవి ఆ రెండింటిలో నేది

లేకున్నను, అనగా కేవలము యోగమున్నను, లేక కేవలము జ్ఞానమున్నను ముక్తివియద్విహారసిద్ధి యెన్నటికిని గలుగదు ముక్తుడు కాజాలడని భావము

**జ్ఞానహీనోఽన్ధ ఇత్యుక్తః పంగుర్యోగ వివర్జితః ।**
**ఉభౌ తౌ సంగతౌ నద్యాస్తరణే కుశలౌ యథా ॥** 11

**తథైవ జ్ఞానయోగాభ్యాం సమేతస్సాదకో జనః ।**
**సుఖేనైవ భవాంబోధిం తీర్త్వా మోక్షముపైతి హి ॥** 12

జ్ఞానము లేనివాడు గ్రుడ్డివానితో సమానుడు యోగము లేనివాడు కుంటివానితో సమానుడు కుంటివాడును, గ్రుడ్డివాడును కలిసికొని నదిని సులభమున్న దాటులాగున జ్ఞానయోగముల రెండింటిచేతను-సంసార సముద్రము సునాయాసముగా దాటి మోక్షమును పొందుచున్నారు నిత్యసుఖముననుభవించుచున్నారు

**అత్యన్తవిజ్ఞానవతః ప్రశాన్తిస్సమాధియుక్తస్య దృఢప్రబోధః ।**
**ప్రబుద్ధతత్త్వస్య హి బద్ధముక్తిర్ముక్తస్య జీవస్య సుఖానుభూతిః ॥** 13

అఖండవిజ్ఞానసమ్పత్తి గలవానికే నిరంతర నిరతిశయశాన్తి లభించును అట్టి దృఢప్రబోధము అనగా ఆ అఖండ విజ్ఞానము కేవలము చిరకాలము నిర్వికల్పసమాధియోగమును శీలించుటచేతనే సిద్ధించుచున్నది కావున యోగజ్ఞానములు రెండును కడుంగడు నావశ్యకములై యున్నవి ఈరెండు యోగములచేత స్వస్వరూప పరమాత్మను నెఱింగిన ప్రబుద్ధాత్మునకే యనాది సంసారబంధమునుండి విముక్తి లభించుచున్నది ఆలాగున విముక్తుడగు జీవునకు అనగా జీవన్ముక్తునకు నిరవధిక సుఖానుభవము గలుగును

**జ్ఞానం న సిద్ధ్యతి వినాఽఽన్తరయోగనిష్ఠాం**
**వహ్నేర్వినా భవతి తండుల ఓదనం కిమ్।**
**చిత్తం సమాధిదృఢనిశ్చలతాం విహాయ**
**నై వోపయాతి పురుషస్య చిదాత్మభావమ్॥** 14

ధ్యానయోగనిష్ఠలేక జ్ఞానానుభవ మెన్నటికిని గలుగనేరదు అగ్నిసం యోగములేక బియ్యమన్న మగునా? వహ్నిచే బాగుగా తండుల ముడికి నప్పుడే ఓదన మగుచున్నది ఆలాగున, యోగాగ్నిచే చిత్తము తప్తమగు నప్పుడే సకలదోషములు నశించి శుద్ధమై ఆత్మస్వరూప మగుటకు యోగ్య మగుచున్నది చిత్తము సమాధియందు దృఢనిశ్చలత్వమును పొందకపోయిన చిద్రూపమును పొందజాలదు అనగా ఆత్మపరమాత్మల కభేదము సిద్ధించదు

**జ్ఞానేన ముక్తిం శ్రుతయో వదన్తి తత్త్వద్ధి యోగేన వినా న లభ్యతే।**
**జ్ఞానస్య తత్త్వం నిరుపాఖ్యదుర్లభం తస్మాద్ద్వయం తిష్ఠతి తైలదీపవత్॥ 15**

జ్ఞానముచేత మోక్షము సిద్ధించునని శ్రుతులు వచించుచున్నవి కాని ఆ జ్ఞానము యోగములేక లభించుట లేదు మఱియు నా జ్ఞానతత్త్వము నామ రూపరహితము, దుర్లభము అందువలన యోగజ్ఞానములు, నూనె దీపముల వలె నున్నవి నూనెచేతనే దీపము మండుచున్నది అట్లే యోగతైలముచే జ్ఞానజ్యోతి ఆరకుండా సర్వదా వెలుగుచున్నది

**అష్టాంగయోగం సుదృఢాం చ భక్తిం వినాఽపి తత్త్వం యది వేత్తి కశ్చిత్।**
**గతే భవే తేన హి సాధితం తదాదర్శయోగేన విభాతి ధీప్రభా॥ 16**

అష్టాంగయోగసాధనలు, నిష్కామ కర్మాచరణము, అనన్యభక్తి మొద లగువానిని శీలించకనే యొకనొకడు మహాజ్ఞానియై యుండిన ఆ మహాను భావుడును పూర్వజన్మమందు యోగసాధనలు మొదలగువానిని బాగుగా ననుష్ఠించినవాడే యగుచున్నాడు మఱియు చిమ్నీవంటి యోగముచేత దీపమువంటి జ్ఞానజ్యోతి చక్కగా ప్రకాశించును అనగా యోగము జ్ఞాన మును సంరక్షించుచున్నదని అర్థము

**లోకే ప్రసిద్ధం న హి కారణం వినా కార్యస్య సిద్ధిర్భవతీతి కథ్యతే।**
**తథైవ యోగాదిక హేతుమన్తరా కార్యాత్మశుద్ధిర్న కదాఽపి సిద్ధ్యతి॥ 17**

లోకములో నెచ్చోటను ప్రసిద్ధకారణములేక కార్యము గలుగదను

విషయము విదితము అటులనే యోగాదులను కారణము లేక కార్య రూపమైన ఆత్మశుద్ధి ఎన్నడును సిద్ధించదు

**చిత్తోపశాన్తిర్హృదయస్య శుద్ధి ర్నైశ్చల్యసిద్ధిః పరమాత్మవిత్తిః ।**
**ఏతైర్వినా కేవలవాక్ప్రబోధశ్శుకస్య వాణీవ స కర్ణపేయః ॥ 18**

చిత్తశాంతి, హృదయశుద్ధి, నిశ్చలత్వము పరమాత్మ విషయక జ్ఞానము- ఇవి లేక వేదాంతవాక్యములను మాత్ర మఖండముగా బోధించు వాని వాక్యములు చిలుకపలుకుల వలె వినుటకు సొంపుగా నుండును అంతమాత్రమే, వేరు ప్రయోజనము లేదు

**విరక్తి సౌభాగ్య వివర్జితాని వేదా న్త వాక్యాని హి నిష్ఫలాని ।**
**క్షుధాఽఽతురాన్ సంపరితోషయన్తి వచోభి రాకల్పితషడ్రసాః కిమ్ ॥ 19**

విషయవిరక్తియను మహాభాగ్యము లేని వేదాంత వాక్యములు పూర్తిగా ప్రయోజనము లేనివగుచున్నవి ఎటుల ననగా బాగుగా ఆకలిబాధచే పరితపించుచున్నవారికి, కేవలము మాటలతో వర్ణించబడిన షడ్రసోపేతమైన పంచభక్ష్యపరమాన్నాదులు ఏ మాత్రమయినా సంతోషమును గల్గించునా? అనగా షడ్రసాన్నవర్ణన క్షుధను శమింప జేయజాలనటుల విరక్తి లేని వాని వేదాంతబోధ సంసారతాపమును శమింపజేయజాలదు

**ఏకాన్తభక్తిశ్చ సమాధియోగో నిష్కామయోగశ్చ తథా ప్రసిద్ధాః ।**
**చిత్తస్య ధర్మాః పరమాత్మతత్త్వం వేదాంతవిజ్ఞానవిశేషగమ్యమ్ ॥ 20**

ఏకాన్తభక్తి, సమాధియోగము, అట్లే నిష్కామ కర్మయోగము- ఇవి మానసిక ధర్మములే యనుట స్పష్టము పరమాత్మ తత్త్వజ్ఞానమో చిత్తధర్మాతీతమై, ఉపనిషద్విజ్ఞానమాత్రముచేతనే పొందదగినదిగా నున్నది

**స్వరూపత త్త్వే పరమాత్మబోధే నిర స్తదృశ్యాఖిలనామరూపే ।**
**విహారభాజాం సతతం విశుద్ధే సిద్ధా భవేత్సా పరమా ప్రశాంతిః ॥ 21**

సమస్తదృశ్యము నశించి నామరూప రహితమయిన పరమాత్మ

జ్ఞానముచే విశుద్ధ స్వస్వరూప తత్త్వమందు నిరన్తరము విహరించు ముక్తాత్ములకు నిత్యపరమశాంతి గలుగుచున్నది

**అఖండవిజ్ఞాన పరాత్మదీపే దేదీవ్యమానే హృదయా న్తరాళే।**
**తమః కథం వా స్థితిమేతి గేహే సతి ప్రదీపే న తమఃప్రవేశః ॥ 22**

అఖండవిజ్ఞాన పరమాత్మయను ప్రదీపము హృదయాకాశమందు ప్రకాశించుచుండగా, అజ్ఞానాంధకార మెట్లు హృదయములోనికి ప్రవేశించ గలదు? జ్ఞానజ్యోతి వెలుగగానే మాయాతమస్సు పరుగిడుచున్నదని భావము గృహమునం దొక దీపము వెలుగుచుండిన చీకటి ప్రవేశింపజాలదు గదా

**అనర్ఘ మాణిక్యమయూఖజాలై ర్దేవాలయో భాతి విచిత్రశిల్పైః।**
**ప్రతిష్ఠితా చేన్న చ దేవమూర్తిర్నిరర్థకా స్యాన్నిఖిలా వినిర్మితిః ॥ 23**

నానావిధమాణిక్య ఖచితములగు విచిత్రశిల్పములచే దేవాలయము నిర్మింపబడినను, అందు దేవతామూర్తి ప్రతిష్ఠ లేకపోయినచో ఆ దేవాలయము యొక్క నిర్మాణమంతయు వ్యర్థమై పోవుచున్నది

**తథైవ విద్వత్త్వకులీనతాదినా ప్రఖ్యాతకీర్తేః ప్రతిభాకరస్య।**
**స్వాత్మప్రతిష్ఠా యది తస్య న స్యాచ్ఛరీరదేవాలయ ఏవ శూన్యః॥ 24**

ఆలాగున విద్య, శ్రేష్ఠజాతి, ప్రసిద్ధకీర్తి, ప్రతిభ మొదలగువానిచే భూషితుడయినను ఆత్మప్రతిష్ఠ లేకపోయినచో వాని శరీరమనెడు దేవాలయము వ్యర్థము

**వేదాంతశాస్త్రేషు విచారణాయాం సంసారపాథోధివిలంఘనాయ।**
**దేహప్లవస్యాత్మ విబోధ ఏవ ప్రకృష్టకర్ణత్వముపైతి నూనమ్ ॥ 25**

వేదాంత శాస్త్రములను బాగుగా విచారించిన సంసారసాగరమును దాటుటకై, శరీరము నావవలె నున్నది చుక్కాని లేనిచో నడవజాలదు, కాబట్టి ఆ శరీరనౌకకు శ్రేష్ఠమైన ఆత్మజ్ఞానమే చుక్కానిగా నున్నది

**యదా తు నౌకా సుపథే ప్రయాతి స్థిత్యైవ కర్ణస్య తదా గతిస్స్యాత్।**
**తథైవ విజ్ఞానవతః ప్రవృత్తే స్స్వధర్మసత్యాదిగతిర్నిదానమ్ ॥ 26**

పడవ మార్గమునుండి తప్పిపోకుండా మంచిమార్గముననే పోవుచుండుటకు కారణము ఆ నావయందు చుక్కాని యుండుటయే ఆలాగున విజ్ఞానవంతుడైన మానవుని సత్ప్రవృత్తికి స్వధర్మము సత్యము మొదలైన అనుష్ఠానమే కారణమని తెలియవలెను

**మార్గం విహాయ యది నౌర్గళితా ప్రయాతి**
**సా నావికేన రహితేతి యథాఽనువిద్మః।**
**స్వాత్మప్రబోధరహితం విషయేషు సక్తం**
**విద్మస్తథా తమిహ తత్త్వదృశా విహీనమ్ ॥ 27**

మార్గము తప్పి పడవ పోవుచుండిన, అచ్చోట నావికుడు (చుక్కానివాడు) లేడని గ్రహించుచున్నారము ఆలాగున ఆత్మదృష్టిని తప్పి యింద్రియ విషయములందు ప్రవర్తించుచుండువానికి తత్త్వదృష్టి లేదని గ్రహింతుము అనగా ఆతడు త త్త్వవేత్త గాడు

**విహారభాజాం గగనే ఖగానాం పక్షద్వయేనైవ యథా గతిస్స్యాత్ ।**
**జితేన్ద్రియత్వాత్మవిచారణాభ్యాం తథాఽఽత్మతత్త్వే యతినాం విహారః ॥**

ఆకాశమందు విహరించెడు పక్షులకు రెండుఱెక్కలెటు లవసరములో ఆలాగున, ఆత్మతత్త్వ చిదాకాశమందు విహరించు యతీశ్వరులకు సర్వేన్ద్రియ నిగ్రహము, ఆత్మవిచారణ యను రెండు పక్షములుండ వలయును

**జలాగ్ని సాహాయ్యబలేన ధావితః ప్రయాతి యన్త్రస్తు యథా తథైవ ।**
**జ్ఞానస్య యోగస్య చ సాహచర్యాత్ ప్రయాతి నిర్వాణపదం ముముక్షుః॥ 29**

జలాగ్నుల రెంటియొక్క సహాయబలముచేతనే యన్త్రము పరుగిడునట్లు ముముక్షువు జ్ఞానయోగముల రెండింటియొక్క సాహచర్యబలముతో

నిర్వాణ పదమును పొందుచున్నాడు

**పశోర్యథా పాశనిబద్ధనాయ నిరాశ్రయే విష్ణుపదే న కోఽపి ।**
**శక్త స్తథా మానసబద్ధనాయ ప్రారమ్భకాలే నిరుపాఖ్యత త్త్వే ॥ 30**

ఆశ్రయములేని గగనమందు పశువును కట్టివేయ నెవడును నెట్లు సమర్థుడు గాడో, ఆలాగున నిరాశ్రయ నిరాకార పరబ్రహ్మమందు సాధన ప్రారంభకాలమున మనస్సును బంధింపజాలము

**యుజ్యేతే స్తంభపాశౌ చ పశుబంధనకర్మణి ।**
**చిత్తస్య నిగ్రహే తద్వత్ జ్ఞానయోగౌ సహాయకౌ ॥ 31**

పశువును బంధింప స్తంభమున్ను, రజ్జువున్ను కావలసినటుల మానసపశువును బంధింప యోగజ్ఞానములు రెండును సహకారకము లగుచున్నవి

**స్తమ్భే యథా మత్తపశుర్నిబధ్యతే తథైవ చిత్తం విషయాది దూషితమ్।**
**సాకారదృష్ట్యావృత నాసికాగ్రే సమ్యఙ్నిబద్ధం స్వవశీకృతం భవేత్॥ 32**

ఎట్టి దుశ్చేష్టగల పశువునైనను స్తమ్భమున కట్టివేయువచ్చును ఆతీరున విషయాదులచే దూషితమైన మత్తచిత్తమును సాకారదృష్టియందు గాని లేక భ్రూమధ్యదృష్టియందుగాని (ముక్కుయొక్క కొనయందుగాని) నిలిపినను వశీకరింపబడిన దగును

**తథాఽపి షట్చక్రవిహారదృష్టిస్సాకారదృష్ట్యాది న శాశ్వతం స్యాత్।**
**చిత్తస్య నైశ్చల్యవిశుద్ధిహేతోస్సర్వం తథాఽకల్ప్యత యోగశాస్త్రే॥ 33**

అయినను ఆధారాది షట్చక్రములందు మనసును నిలిపి శీలించుట యను దృష్టి సాకారదృష్టి మొదలయినవి శాశ్వతముల[illegible] యొక్క నిర్మలత్వమునకును, నిశ్చలత్వమునకును //ఆ సాధనయంతయూ యోగశాస్త్రమున కల్పింపబడినది

**నిరంజనే నిత్యవిశుద్ధత త్త్వే స్వాత్మస్వరూపే పరమా[illegible]**

**నిరంతరానందసుఖానుభూతి ర్నిత్యా భవేద్యా సతతం స్మరేత్తామ్ ॥ 34**

నిరంజన నిత్యశుద్ధ పరమార్థబోధ స్వస్వరూపమందు ఏ నిరంతర నిరతిశయానందానుభవము నిత్య (శాశ్వతము) మై యున్నదో దానినే సర్వదా మరువక స్మరించుచుండవలయును

**భక్తితైల సమాయుక్తే మనస్సంయమవర్తికే ।**
**వైరాగ్య పాత్రే సందీపితాత్మ దీపో వినిశ్చలః ॥ 35**

**శాంతసంకల్ప హృదయ నివాస స్థల సంస్థితః ।**
**భాతి తత్స్థాపకేష్వత్ర జాతిభేదో న లక్ష్యతే ॥ 36**

సర్వసంకల్పము లుపశమించినట్టి హృదయమనెడు గాలిలేని ప్రదేశ మందు, అనన్యభక్తియను తైలము, మనస్సంయమయోగమను వత్తి గల వైరాగ్యమను పాత్రయందు ఆత్మదీపము నిశ్చలముగా వెలుగును అనగా ప్రజ్ఞానం బ్రహ్మ యను జ్యోతి సర్వదా ప్రకాశించును ఆ దీపస్థాపకులలో జాతిభేదము లేదు అనగా పైసాధనము లన్నియు సమకూడినపుడు బ్రాహ్మణాదులలో నేజాతివాడు వెలిగించినను తప్పక వెలుగును

**తైలాది సాధన చతుష్టయ పూర్ణతాయాం**
**దీపో యథా జ్వలతి వహ్నిశలాకయైవ ।**
**యోగాదిసాధన చతుష్టయపూర్ణతాయాం**
**స్వాత్మాఽపి భాతి సతి తత్త్వమసీతి బోధే ॥ 37**

తైలాదులగు నాల్గు సాధనలు పూర్ణముగా నుండిన నిప్పుపుల్ల వెలిగించిన వెంటనే దీపము వెలుగుచున్నది ఆ ప్రకారము యోగాది సాధనలు నాలుగునుండిన తత్త్వమసి యను మహావాక్య ముపదేశింపబడగానే ఆత్మజ్యోతి వెంటనే నిరావరణమై ప్రకాశించును

**తైలాది లోపే తు యథా న దీపః ప్రకాశతే యోగవిధే రభావే ।**
**తథైవ చాత్మావగమో హృదంతః ప్రబోధ్యమానోఽపి న భాతి లేశతః ॥ 38**

పాత్ర తైలాదులలో నేదైన లేకపోయిన అగ్గిపుల్ల లెన్ని వెలిగించినను దీపము వెలుగనట్లు యోగాది సాధనలలో నేదైన లేకుండిన, తత్త్వమస్యాది మహావాక్య ప్రబోధ మెన్నిసార్లు చేయబడినను ఆత్మజ్ఞానము హృదయమున భాసించదు

**సంశ్రూయమాణేఽపి పదార్థతత్త్వే వేదాంతవిజ్ఞానసుదీప్తిబోధః ।**
**వైరాగ్యభక్త్యాదికపూర్త్యభావా ద్విద్యోతతే నైవ కదాఽపి సాధో!॥ 39**

ఓ సాధువా! వైరాగ్యాది సాధనలు పూర్తిగా లేకపోవుటవలననే బహుకాలము మహావాక్యార్థతత్త్వశ్రవణము చేయుచుండినను వేదాంత ప్రతిపాద్య విజ్ఞానదీప్తి ప్రబోధము ఎప్పటికిని భాసించదు

**ఇదంచ తత్త్వం బహుధా విచిన్త్య యోగాదిసిద్ధౌ స్వమతిం విదధ్యాత్।**
**లోకే సదా పుష్కలకారణేన కార్యం సమగ్రం భవతీతి విద్ధి॥ 40**

ఈ యథార్థవిషయమును బాగుగా నాలోచించి యోగాది సాధనల సిద్ధియందు బుద్ధి నుంచవలయును లోకమందు పూర్తిగా కారణము లుండిననే కార్యముగూడ పరిపూర్తి నొందును

**వైరాగ్యపాత్రాదిచతుష్టయేఽసతి**
**కాశ్యాం బదర్యామథ సంస్థితోఽపి వా।**
**విప్రస్తథా శ్రోత్రియపండితోఽపి వా**
**స్వాత్మప్రదీపోజ్జ్వలనే న శక్నుయాత్॥ 41**

విప్రుడైనను, మహాశ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైనను కాశి బదరికాశ్రమ మానస సరోవర తీర్థాదులలో నున్నవాడైనను వైరాగ్యపాత్రాదులగు నాలుగు పరికరములు లేకపోయిన ఆత్మజ్యోతిని వెలిగింపజాలడు అనగా ఎచ్చోటను ఎవడును ప్రకాశింప జేయజాలడని భావము

**వైరాగ్యపాత్రాదిచతుష్టయే సతి నారీజనో విప్రవరోఽన్త్యజోఽపి వా।**
**స్వగ్రామగేహేఽథ వనాన్తరేషు వా జ్ఞానప్రదీపం నితరాం ప్రదీపయేత్॥**

వైరాగ్యపాత్రాది చతుష్టయము అనగా నాలుగు సాధనలుండినచో స్త్రీగాని పురుషుడుగాని బ్రాహ్మణుడుగాని పంచముడుగాని వనములో నైనను స్వగ్రామమందైనను జ్ఞానదీపమును బాగుగా వెలిగించును ఎవడైనను ఎచ్చోటనైనను సాధనలుండిన జ్ఞానదీపమును వెలిగింపగల్గునని భావము

**వైదాంతతత్త్వే నిఖిలైకబోధే పరే పదే స్వాత్మని నిర్వికల్పే ।**
**న జాతిభేదో న చ లింగభేదస్స్వరూపవేత్తా సమతత్త్వమీయాత్॥ 43**

వేదాంతతత్త్వమగు నఖండబోధస్వరూప నిర్వికల్పపరాత్మక స్వాత్మ యందు జాతిలింగభేదములు లేవు ఎవడైనను స్వరూపవిజ్ఞాని సమతత్త్వ మును పొందును

**స్వజన్మభూమౌ ప్రతిబంధకా యది గచ్ఛేన్ముముక్షుర్విజనం ప్రదేశమ్ ।**
**తత్రాఽపి పూర్వస్థల ముక్తిహేతుమవిస్మరన్ సాధక ఏవ ముచ్యతే॥ 44**

స్వగ్రామమందు ప్రతిబంధకము లుండిన నేకాంత ప్రదేశమునకు జన వలయును అయినను స్వగృహమును స్వగ్రామమునుగూడ నెందులకు వదలితిమో ఆ కారణమును మరువకుండిన సాధకుడు ముక్తుడగును

**అయం పుణ్యప్రదేశస్స్యాత్ సిద్ధదేశోఽయ మిత్యుత ।**
**దేశస్య ముక్తిహేతుత్వం న కుత్రాపి విలోక్యతే ॥ 46**

**వైరాగ్యాది గుణా ఏవ సర్వదా ముక్తిహేతవః ।**
**ఇతి స్మరతి యో ధీరః స ముక్తో నాత్ర సంశయః ॥ 47**

ముక్తిగలుగుటయందు ఇది బహుపుణ్య ప్రదేశము, అది సిద్ధస్థలము నని ఒకానొక పుణ్యప్రదేశము ముక్తికి కారణమనుట ఎక్కడను లేదు వైరాగ్యాది గుణములు మాత్రమే ముక్తికి హేతువులు – అని గుర్తించిన ధీరుడే విముక్తిని పొందుచున్నాడు – అనుటలో సంశయములేదు

**పురాణవిఖ్యాతమునీశ్వరాణాం సంసిద్ధతత్త్వాఖిలవైభవామ్ ।**
**అద్య స్థితానాం చ యతీశ్వరాణామయం ప్రభేదో హి విలోక్యతేఽత్ర॥ 48**

బ్రహ్మతత్త్వ సిద్ధిగల పూర్వఋషులకును, ఆధునిక యతీశ్వరుల కును సాధనల ననుష్ఠించుటయందే భేద మీలోకమున కనబడుచున్నది

**పురాణకాలే మునయః ప్రసిద్ధా యుక్తా వివేకాదిక సాధనైశ్చ ।**
**తే సర్వయోగాంగసమాధినిష్ఠా ముక్తా బభూవుశ్శ్రవణాదియుక్తాః ॥ 49**

పురాణకాలమునందున్న సిద్ధపురుషులైన మునీశ్వరులు నిత్యానిత్యవస్తు వివేకాది సాధనచతుష్టయ సమ్పత్తి గలిగి శ్రవణ మనన నిదిధ్యాసముల సాక్షాత్కారమువర కనుష్ఠించి సర్వయోగాంగ సమాధినిష్ఠులై ముక్తులయిరి

**నైవం సదా సాధనయోగదక్షాః కలౌ యుగే కేవలసౌఖ్యసక్తాః ।**
**వేదా న్తవాక్యశ్రవణైక తుష్టా ముముక్షవో నై వ కదాఽపి ముక్తాః ॥ 50**

సామాన్యముగా నిప్పటి కలియుగములోనుండు ముముక్షువులు పూర్వమహర్షులవలె యోగసాధనలను శీలించనివారై కేవల సుఖాసక్తులై యున్నందుచే వేదాంతశ్రవణమే చాలును, అందుచేతనే మోక్షము లభించునని తలంచి తృప్తిపడుటచే నెప్పుడును ముక్తులు గాకయున్నారు

**వివేకవైరాగ్యశమాదిషట్కతాముముక్షుతాసాధనసంపదా జనాః ।**
**దూరీకృతాః పూర్ణతయా విమూఢాః పురాణసిద్ధర్షిపదం న లేభిరే ॥ 51**

1 నిత్యానిత్య వస్తువివేకము, 2 ఇహాముత్రఫలభోగవిరాగము, 3 శమాదిషట్కసమ్పత్తి, 4 ముముక్షుత్వము అను సాధనచతుష్టయసమ్పత్తి పూర్తిగా లేని మూఢజనులు పూర్వతనసిద్ధర్షులు పొందిన ముక్తిని పొందకపోయిరి ప్రయత్నలోపమేగాని వేరు గాదు

**సమ స్తయోగాఙ్గసమాధినిష్ఠా యే జ్ఞానసిద్ధా అపి విద్యమానాః ।**
**బ్రహ్మస్వరూపే నితరాం రమన్తే తే ముక్తిభాజో న హి సంశయోఽద్య॥ 52**

ఈకాలములో నున్నవారైనను ఎవరు సమస్తయోగాంగ సమాధినిష్ఠులై జ్ఞానసిద్ధులైయున్నారో, ఆ మహానుభావులు నిరన్తరము పరబ్రహ్మమందు

రమించుచున్నవారలై ముక్తులై యున్నారు ఆ మహాత్ములు జీవన్ముక్త విద్వాంసులు, సంశయము లేదు

**తత్త్వం పదార్థపరిశోధన భావలక్ష్యం**
**జ్ఞానామృతం సకలశోకనివారకం స్యాత్ ।**
**ఆనన్దదం నిఖిలవృత్తినిరోధకం త**
**న్ముక్తం కరోతి సుజనం నిజబోధయుక్తమ్ ॥** 53

తత్త్వంపదార్థ పరిశోధనచే లక్ష్యార్థమగు జీవబ్రహ్మైక్య జ్ఞానామృతము సకల శోకమోహములను నివారించుచున్నది ఆనందమును గలుగజేయు చున్నది సకలవృత్తులను నిరోధించుచున్నది నిజబోధ గల సజ్జనుని ముక్తునిగను జేయుచున్నది

**యోగస్య సాహచర్యాద్ధి జ్ఞానం సుష్ఠు ప్రకాశతే ।**
**నిరావరణజ్ఞానేన స్వానన్దమనుభుఞ్జతే ॥** 54

యోగముయొక్క సహాయమువలన జ్ఞానము బాగుగా ప్రకాశించు చున్నది అట్టి నిరావరణజ్ఞానముచే నానందము ననుభవించుచున్నారు

**యోగవిజ్ఞానసంసిద్ధో భవమగ్నాంస్తు తారయేత్ ।**
**ఆచరన్యోగమేనం హి లోకసన్తారకో భవ ॥** 55

ఓ విద్వద్వరేణ్యా! యోగము, విజ్ఞానము అను రెంటిలో ఆరితేరి నవాడే భవసాగరమున మునిగియున్న జీవుల నుద్ధరింపగలడు కాన నీయోగ విజ్ఞానముల రెంటిని చక్కగా తెలిసికొని బాగుగా నాచరించి లోకోద్ధారకుడ వగుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సార భూతాయాం
యోగవిజ్ఞానయోగో నామ ద్వితీయోఽధ్యాయః

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీ మలయాళయతీన్ద్ర గీతయందు
యోగవిజ్ఞానయోగమను ద్వితీయాధ్యాయము సమాప్తము



# తృతీయోఽధ్యాయః

# బ్రహ్మచర్యప్రభావయోగః

నిర్విషయానందబ్రహ్మచారీ ఉవాచ

**మహాత్మన్! బ్రహ్మచర్యం హి కతిధేతి బ్రవీతు మే।**
**ప్రవ్రజ్య బ్రహ్మచర్యాత్తు భవాన్ శాస్త్రవిదాం వరః॥ 1**
**బ్రహ్మచారి ప్రవృద్ధ్యర్థం సతతం కృతిమాన్ యతః।**
**అతః పృచ్ఛామ్యహం వర్ణీ విశదీకురుతాదిదమ్ ॥ 2**

నిర్విషయానంద బ్రహ్మచారి చెప్పెను

శాస్త్రవిద్యావిశారదులగు ఓ మహాత్మా! తాము బ్రహ్మచర్యాశ్రమము నుండియే సన్న్యసించినవా రగుటచేతను, మరియు బ్రహ్మచారుల యభివృద్ధికొఱకై నిరంతరము ప్రయత్నశీలు రగుటచేతను బ్రహ్మచర్యమును గూర్చి విశదముగ వినగోరెదను అనగా బ్రహ్మచర్యమనగా నేమి? అదెన్ని విధములుగా నున్నది? దాని ప్రభావమెట్టిది మొదలగు విషయములను విశదముగా దెలుప ప్రార్థించుచున్నాను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**నిర్మలాత్మం స్త్వదీయోఽయం ప్రశ్నస్సామయికో యతః ।**
**అద్య పాశ్చాత్యసంసర్గాదార్యధర్మో విలుప్యతే ॥ 3**

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

నిర్మలాత్మా! నేడు పాశ్చాత్య తద్విద్యాసంసర్గమువలన ప్రాచీనార్య జాతి ధర్మ మస్తమించుచున్నది ప్రస్తుత సమయమునకు నీవడిగిన ప్రశ్న మిక్కిలి యవసరముగా నున్నది కనుక బ్రహ్మచర్య, తద్భేద, తత్ప్రభావము లను గూర్చి చెప్పెద, వినుము

**బ్రహ్మచర్యపదస్యాత్ర యౌగికోఽర్థోఽయముచ్యతే।**
**బ్రహ్మ వేదం చరత్యేష ప్రాధీతే గురువేశ్మని॥ 4**

బ్రహ్మ చరతీతి బ్రహ్మచారీ యను వ్యుత్పత్త్యర్థమునుబట్టి గురుగృహమున బ్రహ్మచర్యవ్రతనిష్ఠ గలిగి వేదాధ్యయనమును జేయుట బ్రహ్మచర్యమగును

**ఆర్యైర్మునిభిరాఖ్యాతం బ్రహ్మచర్యం చతుర్విధమ్ ।**
**పృథఙ్నైష్ఠికగార్హస్థ్యవిధురాఖణ్డనామభిః ॥ 5**

బ్రహ్మచర్యము 1 నైష్ఠిక, 2 గార్హస్థ్య, 3 విధుర, 4 అఖండములనెడి నామములతో నాలుగువిధములుగ నున్నదని ప్రాచీనార్యమహర్షులచే జెప్పబడినది

**మరణాన్తమసంయోగస్స్త్రీభిర్నైష్ఠికముచ్యతే ।**
**ఋతుకాలానుగామిత్వం గార్హస్థ్యం పరికీర్తితమ్ ॥ 6**

ఇప్పుడు పై నాలుగువిధములగు బ్రహ్మచర్యములయొక్క స్వరూపము క్రమముగ తెలుపబడుచున్నది మరణాంతమువరకు స్త్రీసంపర్కము లేకయుండుటయే నైష్ఠికమనియు, ఋతుకాలమందు మాత్రము స్వభార్యాసంపర్కము గలిగియుండుట గార్హస్థ్యమనియు చెప్పబడినది

**బ్రహ్మనిష్ఠాపరత్వాద్వా దమ్పత్యోశ్చ వియోగతః ।**
**విధురం ప్రోచ్యతే ప్రాజ్ఞైర్బ్రహ్మచర్యం తృతీయకమ్ ॥ 7**

దంపతులయొక్క పరస్పర వియోగమువలనగాని లేక ఉభయులును బ్రహ్మనిష్ఠాపరు లగుటవలనగాని బ్రహ్మచర్య మవలంబించినచో నది విధురమని ప్రాజ్ఞులచే జెప్పబడుచున్నది

**గృహస్థవర్ణిభిస్సిద్ధిర్నైష్ఠికబ్రహ్మచారిణామ్ ।**
**న ప్రాప్యతేఽపవర్గే తు భేదో నాస్త్యుభయోరపి ॥ 8**

ఇట్టి బ్రహ్మచర్యావలంబకులగు దంపతులకు నైష్ఠిక బ్రహ్మచారులకు గలిగెడి సిద్ధి లభించకపోయినప్పటికిని వారికి గలిగెడి మోక్షప్రాప్తి వీరికిని గలుగును

**నిత్యం బ్రహ్మవిహారిత్వ మఖణ్డం కథ్యతే బుధైః ।**
**సర్వేష్వేతత్సమీచీనం వేదసమ్మతమిత్యపి ॥** 9

నిరంతరము బ్రహ్మమునందు విహరించుటయే యఖండ బ్రహ్మచర్య మనియు, ఇయ్యది తదితర బ్రహ్మచర్యములకంటె శ్రుతిసమ్మత మనియు శ్రేష్ఠమైనదనియున్ను పండితులు చెప్పుదురు

**స్త్రీసంయోగోఽన్యథా ప్రోక్తో యం వినాఽఽదిమవర్జితా ।**
**స్మృతికీర్తనసఙ్కల్పా గుహ్యాభాషణదర్శనే ॥** 10
**కేలిరధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరన్తిమా ।**
**తచ్ఛూన్యే బ్రహ్మచర్యన్తు కామధేనువదిష్టదమ్ ॥** 11

అష్టవిధములగు స్త్రీసంయోగము లేనప్పుడే శుద్ధమైన నైష్ఠిక బ్రహ్మచర్యము సిద్ధించునని వేదవేత్తలు వచించిరి అనగా 1 విషయభోగేచ్ఛతో పునఃపునః స్త్రీలను స్మరించుట, 2 స్త్రీలను వర్ణించుట, 3 స్త్రీస్పర్శాదులను సంకల్పించుట, 4 స్త్రీలతో రహస్యముగ మాట్లాడుట, 5 విషయాభిలాషతో స్త్రీలను చూచుట, 6 స్త్రీలతో నాటలాడుట, 7 స్త్రీసంయోగ నిశ్చయము, 8 స్త్రీసంయోగము అనునవి యెనిమిదియు దోషములు ఈయెనిమిదింటిలో నొక్కదోషము గూడ లేనట్టి బ్రహ్మచర్యము కామధేనువువలె నిష్టసిద్ధుల నిచ్చును

**అన్యతమోఽపి తద్యోగో యస్య నాస్తి మహాత్మనః ।**
**బ్రహ్మాదిదేవతాస్తస్య స్తుతిం కుర్వ న్తి సర్వదా ॥** 12

ఈ యెనిమిదివిధములగు దోషములలో నేయొక్కటియు లేని మహాపురుషుని బ్రహ్మాది దేవతలు గూడ స్తుతించెదరు

**పుత్రోత్పత్తినిమిత్తాయ సఙ్గమేఽపి కృతే ఋతౌ।**
**దమ్పత్యోర్బ్రహ్మచారిత్వం సిధ్యతీత్యార్యసమ్మతమ్॥** 13

పుత్రసంతానము కొఱకు ఋతుకాలమందు దంపతులకు పరస్పరసం

యోగము జరిగినను వారికి బ్రహ్మచర్యము సిద్ధించునని యార్యసమ్మతము

**ఏతయోస్సన్తతిర్లోకే తేజోధైర్య పరాక్రమైః ।**
**ఆయురారోగ్యశీలైశ్చ వంశోద్ధారాయ కల్పతే ॥ 14**

లోకములో నిట్టి దంపతుల సంతతి తేజోధైర్య పరాక్రమములతోను, ఆయురారోగ్యశీలములతోను ప్రకాశించుచు, వంశము నుద్ధరించుటకు సమర్థముగ నుండును

**పూర్వకాలేఽవ్యయం ధర్మ ఆసీద్భారతభూతలే ।**
**అతో మేధావినో భక్తా వేదవేదాంగపారగాః ॥ 15**
**జ్ఞానవైరాగ్యశీలాశ్చ దీర్ఘకాయా మహాబలాః ।**
**లోకసేవావినిద్రాస్స్త్రీపురుషాస్తత్ర జజ్ఞిరే ॥ 16**

పూర్వకాలమం దిట్టి ధర్మము భారతదేశమంతట నుండెను కనుకనే మేధావంతులు, భక్తశ్రేష్ఠులు, వేదవేదాంగపారంగతులు, జ్ఞానవైరాగ్యశీలురు, దీర్ఘకాయులు, మహాబలసంపన్నులు, లోకసేవాతత్పరులు నగు స్త్రీపురుషు లెందరో ఆకాలమున జన్మించిరి

**ససారనిస్సారవసుంధరోప్తయోస్సతత్త్వనిస్తత్త్వ విభిన్న బీజయోః ।**
**సంతానయోర్యాదృశమన్తరం తథా వర్ణిత్వతచ్ఛూన్యవతోర్గృహస్థయోః॥ 17**

సారవంతమైన భూమిలో నాటిన పుష్టిగల బీజమునుండి వచ్చిన వృక్షమునకున్ను, నిస్సారమైన భూమిలో నాటిన సారరహిత బీజమునుండి వచ్చిన వృక్షమునకున్ను నెంత తారతమ్య ముండునో, యంత తారతమ్యము గృహస్థ బ్రహ్మచర్యముగల దంపతుల సంతానమునకును, అదిలేని దంపతుల సంతానమునకును నుండును

**గృహస్థబ్రహ్మచర్యస్య విలోపాదద్య సన్తతౌ ।**
**ధర్మాయుర్బుద్ధిదేహానాం క్షీణతైవావగమ్యతే ॥ 18**

నేటి దంపతులలో గృహస్థబ్రహ్మచర్యము నశించినందున వీరికి గలుగు

సంతతియు ధర్మరహితమై, నల్పాయువై, స్వల్పబుద్ధి, కృశదేహములను గలిగియున్నది

**దేవవేదేష్వవిశ్వాసః స్వపిత్రోర్ద్రోహచిన్తనమ్ ।**
**రోగపీడా మృషావాదః పాపబుద్ధిశ్చ మూఢతా ॥**
**దుర్లక్షణాని చైతాని దృశ్యంతే తత్ప్రజాస్విహ ॥ 19**

మరియు నీశ్వరునియందును వేదశాస్త్రములయందును అవిశ్వాసము, మాతాపితృద్రోహము, రోగబాధ, అసత్యము, పాపబుద్ధి, మౌఢ్యము మొదలగు నీ దుర్లక్షణములు వారిసంతతియందు కనబడుచున్నవి

**న్యాయార్జితధన క్రీతభక్ష్యనిష్పన్నరేతసః ।**
**సముత్పన్నాః ప్రజా దివ్యా న్యాయపూర్ణా భవ న్తి హి ॥ 20**

న్యాయార్జితధనముతో శుద్ధపదార్థములను కొని యుక్తముగా భుజించుటచే నేర్పడిన వీర్యమువలన కలిగిన సంతతిమాత్రము దివ్యముగాను, న్యాయమార్గము ననుసరించునదిగాను నుండును

**తస్మాద్ద్రవ్యార్జనోపాయం సమ్యక్సఞ్చి న్త్య మానవాః ।**
**ప్రవ ర్తేరన్ సుసన్తత్యై శ్రేయస్కామాస్సువర్త్మని ॥ 21**

కనుక శ్రేయస్కాములగువారు సుగుణసంపత్తి గల సంతతికై ధనార్జనోపాయమును బాగుగా నాలోచించి సన్మార్గమున ప్రవర్తింపవలయును

**విరక్తైర్బ్రహ్మనిష్ఠైశ్చ స్మర్తవ్యస్త్వప్రమాదతః ।**
**దుష్టాహారేఽద్యమానే తు దుష్టా బుద్ధిర్భవేదితి ॥ 22**

దుష్టమైన ఆహారమును భుజించినచో దుష్టబుద్ధియే గలుగునని విరక్తులును, బ్రహ్మనిష్ఠులును ప్రమాదరహితులై స్మరించుచు సాత్త్వికాహారమునే సేవించుచుండవలయును

**సాత్త్వికాహారమాత్రేణ బ్రహ్మనిష్ఠా న సిధ్యతి ।**
**తదర్థం సత్యమార్గాప్తభక్ష్యమావశ్యకం భవేత్ ॥ 23**

కేవలసాత్త్వికాహారమును భుజించినంతమాత్రమున బ్రహ్మనిష్ఠ సిద్ధించదు మరేమన ఆ భుజించెడి వస్తువున్ను సత్యమార్గముచే వచ్చినదిగా నుండవలయును

**అన్యథా సాత్త్వికం వస్తు తామసం పరిణమ్య తత్ ।**
**భ్రష్టం చ సాధకం కుర్యాత్తస్మాజ్జాగృతిరిష్యతే॥ 24**

లేనిచో (అసత్యమార్గసంపాదితమగు) సాత్త్విక వస్తువుగూడ తామసముగ పరిణమించి సాధకుని భ్రష్టునిగా జేయును కనుక నీ విషయములో సాధకులు మిక్కిలి జాగరూకత గలిగియుండవలయును

**బ్రహ్మచర్యసమం వస్తు నాస్తీహపరలోకయోః ।**
**కరోతి శుద్ధం సూక్ష్మం తత్ స్థూలం వజ్రోపమం వపుః ॥ 25**

ఇందు బ్రహ్మచర్యప్రభావము వర్ణింపబడుచున్నది ఇహలోకమందుగాని, పరలోకమందుగాని బ్రహ్మచర్యముతో సమానమైన మరియొక వస్తువు లేదు ఇది సూక్ష్మశరీరమును శుద్ధపరచి స్థూలశరీరమును వజ్రతుల్యముగ జేయును

**బ్రహ్మచర్యవ్రతీ నిత్యం సమాధౌ స్థాతుమర్హతి।**
**శీతోష్ణక్షుత్పిపాసాది సహిష్ణుశ్శక్తిమాన్ భవేత్॥ 26**

మరియు నిట్టి బ్రహ్మచర్యవ్రతముగలవా డెంతకాలమువరకైనను సమాధియందు స్థిరముగా కూర్చొనగలడు ఆకలిదప్పులను, శీతోష్ణములను సహించుకొనువాడుగను, శక్తిగలవాడుగను నగును

**బ్రహ్మచర్యం యథా పుంసాం విహితం యత్ఫలాప్తయే ।**
**తథా తావత్ఫలావాప్త్యై స్త్రీణాం తద్వేదసమ్మతమ్ ॥ 27**

వేదములలో ఏ ఫలము నుద్దేశించి యేవిధముగ ఈ బ్రహ్మచర్యవ్రతము పురుషులకు విధించబడినదో, యట్టి ఫలముకొఱకదేవిధముగ స్త్రీలకును ఈ బ్రహ్మచర్యము విధించబడినది

**తైలనాశే యథా దీపః క్షిప్రమేవ వినశ్యతి ।**
**బ్రహ్మచర్యవినాశేఽపి క్షీణప్రజ్ఞో జనస్తథా ॥** 28

తైలము నశించినచో దీపమేలాగున శీఘ్రముగా నశించునో, యట్లే బ్రహ్మచర్యము క్షయించినచో మానవుడును ప్రజ్ఞాశూన్యుడగును

**భుక్తే చాహారపానీయే రసరక్తాదిరూపతః ।**
**సప్తప్రభేదే జాయేతే తాభ్యాం దేహః ప్రచాల్యతే ॥** 29

**తేషాం శుక్రం వీర్యవత్స్యాత్తన్నాశో విపదాం పదమ్ ।**
**తస్మాద్రక్షేత తన్నిత్యం తన్మూల్యం న విదుస్సురాః ॥** 30

మానవుడు భుజించిన ఆహారమున్ను, జలమున్ను క్రమముగా రసము, రక్తము, మాంసము, అస్థులు, మేధస్సు, మజ్జ, వీర్యములనెడి సప్తధాతువులుగా పరిణమించి యీ దేహేంద్రియములను నడుపుచున్నవి వానిలో శుక్రమనునది కడుంగడు బలవత్తరమైనది అది నశించుటయే సకలాపత్తులకు స్థానము అందుచే దానిని నిత్యము రక్షింపవలయును ఆ బ్రహ్మచర్యముయొక్క విలువను దేవతలు గూడ తెలియజాలరు

**నివాసాహారయోర్నిత్యం బ్రహ్మచర్యవ్రతీ జనః ।**
**నియమేన ప్రవర్తేత భవేత్స పతితోఽన్యథా ॥** 31

బ్రహ్మచర్యవ్రతు లాహారవిషయములోను, నివాసవిషయములోను నియమముగా ప్రవర్తింపవలయును లేనిచో వారు పతితు లగుదురు

**ఆహారదోషమాత్రేణ విలంబపతనం భవేత్ ।**
**నివాసదోషమాత్రే తు తత్క్షణం పతనం భవేత్ ॥** 32

ఆహారదోషముచే కొంతకాలవిలంబనముగా పతనమేర్పడును కాని నివాసదోషముచే వెంటనే పతనమేర్పడునని మరువరాదు

**జ్ఞానినాం నియమో నా స్త్రీతి వచాంసి చ మా శృణు ।**
**స్మర్తవ్యం నైష్ఠికైరిత్థం తే విఘ్నకరదేవతాః ॥** 33

జ్ఞానులకు నియమము లేదని చెప్పువారి వాక్యములను నీవు వినరాదు ఇట్టి వాక్యములను బలుకువారు బ్రహ్మచర్యవ్రతమునకు, తపోధ్యానాదులకున్ను విఘ్నదేవతలని నైష్ఠిక బ్రహ్మచారులు మరువరాదు

**కోశాగారే ధనం సర్వం జలం పూర్ణజలాశయే ।**
**రాజకీయైర్యథా నిత్యం రక్ష్యతే స్థితికామిభిః ॥** 34

**బ్రహ్మచర్యం ధనం రక్ష్యం తథా వ్రతిముముక్షుభిః ।**
**అన్యథా స్వస్థితేర్లోపో భవేదితి విచిన్త్యతామ్ ॥** 35

దేశమున కున్నతస్థితినిగోరు రాజభటులు ధనాగారములను, పూర్ణజలా శయములను నెట్లు రక్షించుదురో యట్లే యున్నతస్థితిని గోరు ముముక్షువులును బ్రహ్మచర్యమనెడి పరమధనమును జక్కగ రక్షించుకొనవల యును లేనిచో నాశము సంభవించును

**సర్వం బ్రహ్మేతి విజ్ఞానం యేషాం కర్మాణి తై రపి ।**
**యద్యదాచరతీత్యుక్త్యా క్రియేరన్ హితచిన్తయా ॥** 36

సమస్త జగత్తునందు బ్రహ్మభావన గల మహాత్ములుగూడ

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః।
న యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

అనెడి గీతోక్త్యనుసారముగా లోకహితము నుద్దేశించి నియమములను పాలించవలయును

**కిం కిం వా భుజ్యతాం నామ మనసో హి ప్రధానతా ।**
**ఇత్థఙ్చ శుష్కవేదాన్తవాదినస్సన్తి కేచన ॥** 37

ఏది భుజించినను, నేమిత్రాగినను దోషమేమియు లేదు, మనస్సేగదా ప్రధానమని వాదించెడు శుష్కవేదాంతులు కొందరు లోకములో గలరు

**తే విఘ్న దేవతాస్సత్యం పరివ్రాడ్వేషధారిణః ।**
**రాజయోగాభిమానేన విచరన్త్యవధూతవత్ ॥** 38

అట్టివారు సన్న్యాసవేషధారులై రాజయోగులమను నభిమానముతో నవధూతలవలె దిరుగుచున్నారు మరియు వారు నిజమగు సాధుసజ్జనుల తపోధ్యానాదులకు విఘ్నదేవతలుగనే యున్నారు

**త్రిధా విభజ్యతే భుక్తమన్నం జాఠరవహ్నినా ।**
**ఉత్తమం మధ్యమం చైవ కనిష్ఠమితి నామభిః ॥ 39**

మనము భుజించెడి యాహారమును జఠరాగ్ని ఉత్తమ, మధ్యమ, కనిష్ఠములనెడి మూడు విధములుగ పరిణమింప జేయుచున్నది

**సుశ్రుతోక్త్యనుసారేణ స్థూలం తత్ర మలం భవేత్ ।**
**రక్తం మధ్యమభాగశ్చ కనిష్ఠం మన ఏవ చ ॥ 40**

అందు స్థూలభాగము (ఉత్తమము) మలముగను, మధ్యమభాగము రక్తముగను, కనిష్ఠభాగము మనస్సుగను పరిణమించునని సుశ్రుతమనెడి వైద్యగ్రంధము చెప్పుచున్నది

**తస్మాదాహారశుద్ధిశ్చ మనసశ్శుద్ధికారణమ్ ।**
**బ్రహ్మచర్యం సమిచ్ఛద్భిరాహారావాసశుద్ధతామ్ ॥ 41**

**సమ్పాద్య భావశుద్ధ్యా హి సతతం బ్రహ్మచిన్తనమ్ ।**
**ఏకాన్తే స్థిరమాసీనైః కర్తవ్యం మోక్షసిద్ధయే ॥ 42**

ఆహారశుద్ధియే మనశుద్ధికి కారణముగా నున్నది కనుక బ్రహ్మ చర్యమును గోరువారు ఆహారశుద్ధిని, పవిత్రనివాసస్థానమును సంపాదించి యేకాన్తమున మోక్షసిద్ధికై బ్రహ్మచిన్తనమును జేయవలయును

**బ్రహ్మచర్యం హి జీవానామమృతం జీవనౌషధమ్ ।**
**ఋషిభిర్బహుధా గీతమేతచ్ఛ్రుతిశతైరపి ॥ 43**

బ్రహ్మచర్యము ప్రాణిమాత్రులకు అమృతతుల్యమైనది లేక జీవనౌషధము (కాన బ్రహ్మచర్యలోపముచే జీవనమే నష్టమగునని తెలియవలెను ) ఈ బ్రహ్మచర్యము(పరమపావనులగు) మహర్షులచేతను,

వేదములచేతను బహువిధములుగా కొనియాడబడియున్నది

**పావనం బ్రహ్మచర్యం హి యత్నసాధ్యం విశేషతః ।**
**నేదం విషయలోలాయ వాచ్యం మలినచేతసే ॥ 44**

కాన ఓ సంయతాత్మా! ఈ బ్రహ్మచర్యమును విశేషప్రయత్నముతో రక్షింపవలయును విషయలోలురగు మలిన బుద్ధిగల శ్రద్ధలేనివార కీబ్రహ్మ చర్యవ్రతమును చెప్పరాదు ఏలననగా వా రీపావనవ్రతము ననుష్ఠింపజాలరు

**బ్రహ్మచర్యమిదం ప్రోక్తం సర్వాభీష్టఫలప్రదమ్ ।**
**యస్తావత్పాలయేన్నిత్యం స గచ్ఛేద్బ్రహ్మణః పదమ్ ॥ 45**

సమస్త వాంఛితఫలముల నొసంగునట్టి బ్రహ్మచర్యమును గూర్చి చక్కగా జెప్పబడినది ఎవ డీబ్రహ్మచర్యమును సదా సంరక్షించుకొను చుండునో వాడు బ్రహ్మపదవిని బొందును

**బ్రహ్మచర్యమహింసాం చ సత్యం చాప్యపరిగ్రహమ్ ।**
**యత్నాత్సంరక్ష్య భూయాస్త్వం మహర్షీణాం కృపాస్పదమ్ ॥ 46**

బ్రహ్మచర్యము, అహింస, సత్యము, అపరిగ్రహము- వీటిని ప్రయత్నముతో రక్షించి నియమయుతుడవై మహర్షుల దివ్యకృపకు పాత్రుడవు కమ్ము

ఇతి శ్రీమలయాళ యతీన్ద్రగీతాయం ఉపనిషత్సార భూతాయాం
బ్రహ్మచర్యప్రభావయోగో నామ తృతీయోఽధ్యాయః

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్ర గీతయందు బ్రహ్మచర్య
ప్రభావయోగమను తృతీయాధ్యాయము సమాప్తము



# చతుర్థోఽధ్యాయః

# విద్యాయోగః

పరమేశ్వరానన్దగిరిరువాచ

**విదుషామేవ మోక్షస్స్యాన్నాన్యేషామితి లోకధీః।**
**యుక్తా న వేతి సన్దేహం ఛిన్ధి మే కృపయా ప్రభో!॥ 1**

పరమేశ్వరానన్దగిరి చెప్పెను

ఓ ప్రభూ! పండితులకు మాత్రమే మోక్షము లభించునుగాని తదితరులకు లభింపదనెడి లోకుల తలంపు యుక్తమైనదా? కాదా? అనెడి సందేహమును దయతో నివర్తింపజేయుదురు గాక!

శ్రీ మలయాళయతీన్ద్ర ఉవాచ

**సాధు పృష్టం త్వయా యోగిన్ యతీనాముత్తమోత్తమ!।**
**మోక్షప్రాప్త్యధికారిత్వం శృణు త్వం సావధానతః॥ 2**

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

యోగివర్యా! ఓ యతిశ్రేష్ఠా! నీవడిగిన ప్రశ్న చాల యుక్తముగా నున్నది కనుక మోక్షాధికారి విషయమునుగూర్చి చెప్పెదను సావధా నుండవై వినుము

**సర్వశాస్త్రాణ్యధీత్యాపి యే చాత్మజ్ఞానముత్తమమ్।**
**నైవాలభన్త తేష్వేవ బుద్ధిరేషా ప్రజాయతే ॥ 3**

సర్వశాస్త్రములను జదివిగూడ నుత్తమమగు నాత్మజ్ఞానము పొందలేని విద్వాంసులకు మాత్రము ఇట్టి సందేహము కలుగుచున్నది

**విద్యాజ్ఞానే యది స్యాతాం సేయం సర్వోత్తమా స్థితిః ।**
**విద్యాయాః కేవలాయాశ్చ జ్ఞానం కేవలముత్తమమ్ ॥ 4**

శాస్త్రజ్ఞానమును, ఆత్మజ్ఞానమును కలిగియుండుటయే సర్వోత్తమ

మైన స్థితి యనబడును అట్లు లేనిపక్షమున శాస్త్రజ్ఞానమును మాత్రము కలిగియుండుటకంటె ఆత్మజ్ఞానమును కలిగియుండుటయే మంచిది

**జ్ఞానినాం మోక్షసంప్రాప్తౌ సన్దేహో నైవ విద్యతే ।**
**విద్యామాత్రవతాం పుంసాం నేహాముత్ర సుఖం భవేత్॥ 5**

''జ్ఞానాన్మోక్షో న సన్దేహః'' ఇత్యాది ప్రమాణములనుబట్టి ఆత్మజ్ఞానము గలవారికి మోక్షప్రాప్తియం దించుకైనను సందేహము లేదు కాని యాత్మజ్ఞానము లేక కేవల శాస్త్రీయజ్ఞానము గలవారి కీలోకమందు గాని, పరలోకమందు గాని శాశ్వతానందము లభింపదు

**ప్రాకృతానాం నృణాం విద్యా భుక్త్యర్థముపయుజ్యతే।**
**కృష్యాదికర్మవత్సర్వా ము క్త్యర్థం నైవ కల్పతే॥ 6**

ప్రాకృత జనుల విద్యలన్నియు కృష్యాదికర్మలవలె భుక్తికొఱకుపయోగపడునేగాని, ముక్తికొఱ కెంతమాత్ర ముపయోగడవు

**విద్యాశబ్దస్సముత్పన్నో జ్ఞానార్థవిదధాతుతః ।**
**తన్ముఖ్యార్థస్తు తజ్జ్ఞానం యేనాజ్ఞానం నివర్తతే ॥ 7**

జ్ఞానార్థకమైన విద్ అను ధాతువునుండి విద్యాశబ్ద మేర్పడినది కనుక నెట్టి జ్ఞానముచే జననమరణములకు కారణభూతమైన మూలాజ్ఞానము నశించునోయట్టి జ్ఞానమే విద్యాశబ్దమునకు ముఖ్యార్థము

**అనధీత్యాపి శాస్త్రాణి బ్రహ్మజ్ఞానిగుణో యది ।**
**మోక్షగామీ భవేద్ధీమాన్ శౌచధ్యానాదితత్పరః ॥ 8**

శాస్త్రములను జదువకపోయినను బ్రహ్మజ్ఞానులకుండు శమాది గుణములు, నిరంతరము బాహ్యాభ్యంతర శుద్ధి, ధ్యానాదులు- ఇవి గలిగి యున్నచో జనులు మోక్షమును బొందగలరు

**ఆత్మజ్ఞానవిహీనస్య శాస్త్రవిద్యావిశిష్టతా ।**
**వేషధారిత్వమేవాతో న హి కించిత్ప్రయోజనమ్ ॥ 9**

ఆత్మజ్ఞాన శూన్యునకుగల శాస్త్రీయపాండిత్య మొక విధమగు వేషముమాత్రము వంటిదే యగును కనుక దానిచే మోక్షవిషయమై ఏమాత్రము ప్రయోజనము లభింపదు

**ప్రాక్తనాజ్జన్మసంస్కారాజ్జన్మన్యత్ర శమాదయః ।**
**ఆవిర్భవన్తి శాస్త్రాణి ధీమతోఽప్యనధీయతః ॥ 10**

ఈ జన్మమందు శాస్త్రములను జదువకపోయినప్పటికిని పూర్వజన్మ సంస్కారమువలన మహాత్ములకు శమదమాది గుణము లావిర్భవించును, శాస్త్రార్థములు గోచరించును కనుక అతడు పూర్వజన్మమందు శాస్త్రము జదివినవాడే యగును

**శాస్త్రోక్తలక్షణైర్హీనో విధివచ్ఛాస్త్రమభ్యసేత్ ।**
**వైధకర్మాణ్యనుష్ఠాయ మోక్షయత్నీ భవేన్నరః ॥ 11**

శాస్త్రములలో జెప్పబడిన బ్రహ్మజ్ఞాని లక్షణములు లేనివాడు నియమనిష్ఠలతో శాస్త్రము నభ్యసించి శాస్త్రవిహితములగు కర్మలను జేసి, తదుపరి మోక్షముకొఱకు యత్నించవలయును

**అధీతసర్వశాస్త్రస్య బ్రహ్మజ్ఞానం న చేద్యది ।**
**తస్య సర్వాణి శాస్త్రాణి భారభూతాని కేవలమ్ ॥ 12**

సమస్త శాస్త్రములను జదివినవానికి బ్రహ్మజ్ఞానము లేకపోయినచో, తాను జదివిన శాస్త్రము లన్నియు తనకు భారమేగాని వాటివలన మరేమియు సుఖము గలుగదు

**నానారుచిపదార్థేషు ఘూర్ణమానఖజాకయా ।**
**తుల్యస్సారమవిజ్ఞాయ వేదశాస్త్రాణ్యధీతవాన్ ॥ 13**

సర్వశాస్త్రములను జదవి యందలి సారమును దెలియని మనుష్యుడు అనేకరుచులు గల పదార్థములందు తిరుగుచుండు గరిటెతో సమానమైన వాడు

**తస్మాత్కర్పూరాచ్ఛన్దనభారవాహినో న చాస్య వైశిష్ట్యమనాత్మదర్శినః ।**
**గీతాసు కృష్ణేన ఖలూత్తరాసు భో! భక్తాయ సుష్ఠ్వాక్తమనన్యచేతసే॥ 14**

ఓ యతివరా! సకల శాస్త్రములను జదివియు నాత్మజ్ఞానము పొందని వానికి గంధపు చెక్కలను మోయుచు నందలి గంధము నాఘ్రాణించని గాడిద కంటె గొప్పతన ముండబోదని శ్రీకృష్ణభగవాను డుత్తరగీతయందు అనన్యభక్తుడగు నర్జునున కుపదేశించెను

**వర్తన్తి పణ్డితంమన్యా అవిద్యాయామధీత్య యే ।**
**అన్ధేన నీయమానాన్ధైస్తుల్యాస్తే ముండకోక్తితః ॥ 15**

శాస్త్రాధ్యయనము జేసియు, అవిద్యలోనుండి పండితులమని భావించువారు అంధుల నూతగాగొని వెళ్లెడి యంధులతో సమానులైనవారని ముండకోపనిషత్తు చెప్పుచున్నది

**ప్రాచీన జన్మసంస్కారా ద్విద్యాం యో లభతే నరః ।**
**పూజయన్నుత్తమాన్ గ్రంథాన్ వాచయఞ్ఛృణుయాచ్చ సః ॥ 16**

(ఈ జన్మమున శాస్త్రము చదువకపోయినను) పూర్వజన్మ సంస్కార బలముచే బ్రహ్మజ్ఞానమును బొందు మహాత్ముండుత్తమమైన గ్రంథములను పూజించుచూ, ఇతరులద్వారా వాటిని చదివించుచు శ్రవణము చేయుచుండును ఇదియే వాని బ్రహ్మజ్ఞానమునకు గుర్తు

**కేనాపి హేతునా ధ్యానం తపో వైరాగ్యమాశ్రయన్ ।**
**ఏకాన్తవాసమప్యాప్త్వా వేదశాస్త్రాణి వైదికమ్ ॥ 17**

**స్మార్తాదికర్మ నిన్దన్ యస్తిష్ఠేత్పాఖండమానవః ।**
**తం మూఢమాసురం మత్వా సుదూరే పరివర్జయేత్ ॥ 18**

అట్లుగాక ఏ కారణముచేతనో ఒకవిధమైన వైరాగ్యము నవలంబించి కొంత ధ్యానము, తపస్సు, ఏకాంతవాసమును జేయుచు నెవడు వేదశాస్త్రములను, వైదికస్మార్తాది కర్మలను నిందించుచుండునో వానిని

మూఢునిగాను, పాషండునిగాను, రాక్షసాంశజునిగాను దలంచి దూరముగా పరిత్యజింపవలయును

**స్వాత్మానుభూతిసంభూత్యా శాస్త్రజ్ఞానం వినాఽపి చ।**
**స్వస్మై ముక్తిర్భవత్యేవ కిం తు భక్తోపదేశనమ్॥ 19**

**మతభేదనిరాసేన శిష్యసన్దేహవారణమ్ ।**
**కర్తుం న శక్యతే తేన శాస్త్రస్యైతత్ప్రయోజనమ్॥ 20**

శాస్త్రజ్ఞానము లేకపోయినను అనుభవాత్మక ఆత్మజ్ఞాన మున్నచో తద్ద్వారా మనుష్యుడు ముక్తిని బొందును ఇతర భక్తులకును నుపయోగపడును కాని మతిభేద నిషేధపూర్వకముగ నుపదేశించి వారి సందేహములను నివారించుట కాతడు సమర్థుడు గాజాలడు అట్లు సందేహములను నివారించుటయే శాస్త్రములను చదివినందులకు ప్రయోజనము

**స్వాత్మహత్యా విధానాయ స్వల్పమేవాలమాయుధమ్ ।**
**మహాయుధశతం శత్రుం ప్రబలం హన్తుమిష్యతే ॥ 21**

**తథా స్వాత్మప్రబోధాయ కించిజ్జ్ఞానమలం భవేత్ ।**
**ఇష్యతే శిష్యబోధార్థం సర్వశాస్త్రార్థవిజ్ఞతా ॥ 22**

తనను చంపుకొనుటకు చిన్న ఆయుధ ముండిన చాలును కాని ప్రబలశత్రువును సంహరించుట కనేకాయుధము లెట్లవసరమో యట్లే తన యాత్మజ్ఞానముకొఱకు స్వల్పవిద్య సరిపోయినను, సర్వసంశయములను నివర్తింపజేసి శిష్యులకు ఉపదేశించుటకుగాను సర్వశాస్త్రజ్ఞాన మత్యవసరము

**సర్వదా బ్రహ్మనిష్ఠాయామీశ్వరధ్యానకర్మణి ।**
**నిమగ్నజీవినశ్శాస్త్రమనావశ్యకమజ్ఞవత్ ॥ 23**

అజ్ఞానికి శాస్త్ర మేలాగున నావశ్యకమైనదో ఆలాగున సర్వకాల సర్వావస్థలయం దాత్మనిష్ఠయందును, ఈశ్వంధ్యానమందును నిమగ్నుడై

యుండు పుణ్యజీవునకు శాస్త్రమవసరము లేదు

**ధ్యానవ్యుత్థానశీలస్య బాహ్యదృష్టినివృత్తయే ।**
**కాలం యాపయితుం మధ్యే సద్గ్రంథపరనం మతమ్ ॥ 24**

నిరంతరము ధ్యానాదులయందు నిలకడ గలుగని వానికి ధ్యానానంతరమున మనస్సు దృశ్యవిషయములలో బ్రవేశింపకుండుటకుగాను మధ్యకాలములో సద్గ్రంధపరనము, వేదాంతవిచారణ మొదలగునవి యావశ్యకములు

**పదవాక్యప్రమాణాని విరక్తాయ మహాత్మనే ।**
**న రోచన్తే రసాభావాత్తథాఽప్యధ్యాత్మవిత్తయే ॥ 25**

**వేదాన్తబ్రహ్మసూత్రాణాం తద్భాష్యాణాం సమన్వయః ।**
**ఆవశ్యక స్తదర్థోఽతః పరనీయాని తాన్యపి॥ 26**

**మహతాఽపి ప్రయాసేన సర్వైరపి ముముక్షుభిః ।**
**స్వపరజ్ఞానసిద్ధ్యర్థమన్యథా గత్యభావతః ॥ 27**

వ్యాకరణాది శాస్త్రములు విరక్తులగు ముముక్షువులకు రసహీనములుగాన అరుచికరములే అయినను అధ్యాత్మ జ్ఞానసంపాదనకు వేదాంత, బ్రహ్మసూత్ర, తద్భాష్యముల యర్థజ్ఞాన మావశ్యకము వాటి యర్థజ్ఞానము వ్యాకరణాది శాస్త్రాధ్యయనముచే సిద్ధించునుగాని మరియొక విధముగ సిద్ధింపదు అందుచేత స్వపరబోధసిద్ధికొఱకు వాటిని వారు చాల పట్టుదలతో చదువవలసియున్నది

**సర్వస్యాపి సమీచీనకార్యస్యాదౌ వ్యథా భవేత్ ।**
**భవిష్యత్సుఖమిచ్ఛన్తః ప్రవర్తన్తాం సుకర్మసు ॥ 28**

సత్కార్యములు ప్రారంభములో దుఃఖకరములుగ నున్నను రాబోవు గొప్ప సుఖమునకు హేతువులై యున్నందున వాటి నిట్టి సుఖమును గోరువారు తప్పక యనుష్ఠించవలెను

**విద్యాహీనాః ప్రశిష్యన్తే విద్వద్భిస్స్వార్థకామిభిః ।**
**తస్మాచ్ఛాస్త్రమధీయారన్ సర్వే స్వాతన్త్ర్యకామినః ॥ 29**

విద్యలేనివారందరును స్వార్థపరులగు విద్యావంతులచే పరిపాలించబడుదురుగాని స్వాతన్త్ర్యమును బొందజాలరు కనుక స్వాతన్త్ర్యమును గోరువారందరు తప్పక శాస్త్రము చదువవలసియున్నది

**అన్యథా పారతన్త్ర్యం స్యాద్దుఃఖమత్య న్తదుస్సహమ్ ।**
**లోకజ్ఞాస్తు విదిత్వైతద్విద్యాత్యాగం న కుర్వతే ॥ 30**

విద్యలేనిచో పరాధీనత తప్పదు పరాధీనతకంటె లోకములో మహత్తర దుఃఖము మరొకటి లేదు కనుకనే లోకజ్ఞానము గలవా రీవిషయమును బాగుగా గుర్తించి విద్యాభ్యాసమును విడువరు

**విర క్తత త్త్వజిజ్ఞాసు భగవద్భక్తసంహతేః ।**
**విద్వాంసో భక్తిహీనాస్స్యుర్విద్యాస్వరుచికారకాః ॥ 31**

విరక్తులకు, తత్త్వజిజ్ఞాసువులకు, పరమభక్తులకున్ను విద్యయందభిరుచి కలుగకపోవుటకు విద్వాంసులలో భక్తి, విరక్తి, కరుణ మొదలగు గుణములు లేకపోవుటయే ముఖ్యకారణము

**విరక్తాస్సంస్కృతం సమ్యక్ పఠిత్వా త త్త్వవేదినః ।**
**బోధయన్తు సదా త్వర్థి లోకేభ్యస్సుఖమేధతే ॥ 32**

కనుక విరక్తులు సంస్కృతభాషను, శాస్త్రములను లెస్సగా చదివి తత్త్వజ్ఞానులై ప్రబోధింతురుగాక! అటులయిన లోకమునకు సుఖము వృద్ధిపొందును

**శాస్త్రజ్ఞానవిహీనేన జ్ఞానినా బోధితోఽపి సన్।**
**సర్వథా న శృణోత్యేవ విద్యాభారేణ పణ్డితః॥ 33**

శాస్త్రజ్ఞానము లేని ఆత్మజ్ఞుడు ఎంతగా బోధించినను పండితుడు

తన పాండిత్యాధిక్యముచే దానిని లక్ష్యపెట్టడు

**ఏతత్సత్యం విదిత్వైవ మతకారా మతానుగాన్ ।**
**శాస్త్రవిద్యాసు నైపుణ్యం ప్రాపయన్త్యుత్తరోత్తరాన్ ॥ 34**

తత్తన్మతప్రవర్తకు లీసత్యము నెరింగియే తమ తమ శిష్యులను, మతానుయాయులనున్ను విద్యాభ్యాసములో ప్రవేశపెట్టి శాస్త్రజ్ఞానములో వారిని నిపుణులనుగ జేయుచుందురు

**సశాస్త్ర బ్రహ్మవిజ్ఞాన ఆచార్య త్వం గమిష్యతి ।**
**ప్రమాణాచ్ఛ్రోత్రియం బ్రహ్మనిష్ఠమిత్యాప్తమౌణ్డకాత్ ॥ 35**

మరియు "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అనెడి ముండక శ్రుతివాక్య ప్రమాణమువలన శాస్త్రజ్ఞానముతో గూడ బ్రహ్మజ్ఞానమును బొందినవాడే ఆచార్యుడగునని తెలియుచున్నది

**శాస్త్రమభ్యస్య విజ్ఞానం సమ్పాద్య కృషికో యథా।**
**తృణ్యాం త్యక్త్వా యవాన్ లాయాజ్ఞ్ఞానీ శాస్త్రం తథా త్యజేత్॥ 36**

కృషీవలుడెట్లు సారభూతమగు ధాన్యమును గ్రహించి నిస్సారమగు గడ్డిని విడుచునో యట్లే మేధాసంపన్నుడగు ప్రతిమానవుడును శాస్త్రములను చక్కగా జదివి యందలి సారాంశమును గ్రహించి పిదప శాస్త్రములను బరిత్యజించవలయును

**శ్రుతేర్బ్రహ్మవిదో మానాత్సన్తు వేదాన్తచి న్తకాః ।**
**జితేన్ద్రియా జితాత్మాన ఓంకారధ్యానతత్పరాః ॥ 37**

శ్రుతిని ప్రమాణముగ జేసుకొని బ్రహ్మవేత్త లెల్లప్పుడు జితేంద్రియులు, జితచిత్తులు, ప్రణవధ్యానపరులునై సదా వేదాంతవిచారమును చేయుచుండవలయును

**గాణ్డీవిసమయోద్ధాఽపి నిశ్శస్త్రో న జయీ భవేత్ ।**
**సశస్త్రోఽపి న యోధశ్చేద్రణే నైవ జయీ యథా ॥ 38**

**జ్ఞానాభావే సవిద్యోఽపి జ్ఞానమార్గే పరాజయీ ।**
**విద్యాఽభావే తథా జ్ఞానీ పరబోధే పరాజయీ॥** 39

అర్జునునివంటి యోధుడైనను సరియైన శస్త్రాస్త్రములు లేనిచో రణరంగమునందెట్లు విజయమును బొందజాలడో, దివ్యాస్త్రము లున్నప్పటికిని యుద్ధము చేయు నైపుణ్యము లేనివాడెట్లు విజయమును పొందజాలడో అట్లే విద్యావంతుడైనప్పటికిని యాత్మజ్ఞానము లేనిచో జ్ఞానమార్గమందు పరాజయమును పొందును ఆత్మజ్ఞానము గలవాడైనను శాస్త్రజ్ఞానము లేనిచో పరబోధలయందు(అనగా పరులకు బోధించుటలో) పరాజయమును బొందును కనుక శాస్త్రజ్ఞాన బ్రహ్మజ్ఞానములను గలిగియుండుటయే సర్వోత్తమ స్థితియని స్పష్టమగుచున్నది

**ఈశ్వరః పఞ్చభూతాత్మదేహానాం సుఖసిద్ధయే ।**
**వ్యోమాది పఞ్చభూతాని యథాఽస్రాక్షీత్సమానతః ॥** 40

**తథా సర్వనృబోధాయ వేదవేదాన్తనిర్మితిమ్ ।**
**కృతవానితి మత్వైవ లోకోద్ధారో భవేద్ధ్రువమ్ ॥** 41

పరమేశ్వరుడు పాంచభౌతిక దేహసుఖముకొఱకు ఆకాశాది పంచభూతముల నందరికిని సమానముగా నెట్లు సృష్టించెనో యట్లే సర్వాత్మసుఖానుభూతికొరకై వేదవేదాన్తములను శాస్త్రములనున్ను సృష్టించెననెడి నిష్పక్షపాతబుద్ధి కలిగినప్పుడే దేశమున్నతస్థితికి వచ్చును ఈ పరమసత్యము నందరు సదా జ్ఞప్తిలో నుంచుకొనవలయును

**అస్మాకం తు కృతే సృష్టా వృష్ట్యర్కేన్దుసమీరణాః ।**
**ఇత్థం కథయతాం లోకే యావతీ మూఢతా భవేత్ ॥** 42

**తావతీ సా భవేత్తేషాం యే చాహుస్స్వాత్మహేతవే ।**
**వేదవేదాఙ్గశాస్త్రాణి సృష్టానీతి స్వయంభువా ॥** 43

సూర్య చంద్ర వాయు వృష్ట్యాదు లన్నియు మాకొఱకే సృష్టింపబడిన

వని జెప్పువా రెంత సత్యదూరులో వేదవేదాంగ తపోజ్ఞానాదు లన్నియు మాకొఱకే బ్రహ్మదేవునిచే సృష్టింపబడినవని చెప్పువారున్ను అట్టివారే

**ఏతత్సత్యం విదిత్వైవం జనాః కృత్వా పరిశ్రమమ్।**
**పరతత్త్వం విజానీయుశ్చేత్కృతార్థా న చాన్యథా॥ 44**

ఈ సత్యము నెరిగి మానవులందరు పరిశ్రమపరులై పరమతత్త్వమును దెలిసికొనినచో మాత్రము కృతార్థు లగుదురుగాని లేనిచో నెప్పటికిని కృతార్థులు కాజాలరని దృఢముగా నమ్మవలయును

**బ్రహ్మవిద్యాం వరిష్ఠాం హి పూర్వబ్రహ్మవిదాం మతామ్।**
**దత్వా మన్దాధికారిభ్యః కుర్యాత్కలుషితాం న హి ॥ 45**

పూర్వీకులగు బ్రహ్మనిష్ఠులకు సమ్మతమై తదుపాసితమైన శ్రేష్ఠమగు బ్రహ్మవిద్యను ఈమందాధికారులకు బోధించి కలుషితము చేయరాదు

**మిథ్యాచారాన్సముద్దిశ్య బ్రహ్మవిద్యా ప్రదాయకాః ।**
**గురవో జ్ఞాన సంపూర్ణా స్తత్త్వజ్ఞా అపి లౌకికైః ॥ 46**

**ప్రాకృతా ఇవ భావ్యన్తే తద్దురాచారదర్శనాత్ ।**
**తతః కదావ్యనర్హేభ్యః బ్రహ్మవిద్యాం న బోధయేత్ ॥ 47**

మిథ్యాచారుల కొఱకు బ్రహ్మవిద్యా ప్రదానము గావించు గురువులు, జ్ఞానపూర్ణులైన తత్త్వజ్ఞులైనను వారి శిష్యుల దురాచారములను చూచి లౌకిక జనులు ఆ గురువులను ప్రాకృతజనులని భావింతురు అందుచే అనర్హులకు బ్రహ్మవిద్యను బోధింపరాదు

**ఆజీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।**
**ఆప్రాణం తత్త్వమేతద్ధి విస్మరేన్న హి సాధకః ॥ 48**

**తత్కృపాలేశమాత్రేణ జ్ఞానం లబ్ధం యతస్తతః ।**
**కృతజ్ఞస్తేషు వై భూయాత్కృతఘ్నో న కదాచన ॥ 49**

ఆత్మజ్ఞానియయినను జీవితాన్తమువరకు గురుశాస్త్రేశ్వరులందు భక్తివిశ్వాసములను గలిగియుండవలయును సాధకు డీరహస్యమును ప్రాణమున్నంతవరకు జ్ఞప్తియందుంచుకొనవలయును ఏలన గురుశాస్త్రేశ్వరుల కృపచేతనే జ్ఞానము లభించినందున వారియందు సదా కృతజ్ఞుడై యుండవలెనుగాని ఎప్పటికిని కృతఘ్నుడు కారాదు

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సార భూతాయాం
విద్యాయోగో నామ చతుర్థోఽధ్యాయః॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్ర గీతయందు
విద్యాయోగమను చతుర్థాధ్యాయము సమాప్తము



# పంచమోऽధ్యాయః
## స్త్రీవిద్యాధికారయోగః

అన్నపూర్ణామ్బా ఉవాచ

**శాస్త్రవిత్తత్త్వవిచ్ఛ్రేష్ఠ బ్రహ్మవిద్యార్హతా స్త్రియః।**
**అస్తి నేతి కథం తాత! శ్రోతుమిచ్ఛామి తత్త్వతః॥** 1

అన్నపూర్ణాంబ చెప్పెను

శాస్త్రనిర్ణయమును చక్కగ గుర్తెరింగినట్టియు, తత్త్వవేత్తలలో సత్తములునగు నోతండ్రీ! తమవలన స్త్రీలకు బ్రహ్మవిద్యయం దధికారము గలదా, లేదా అను విషయమై యథార్థమగు శాస్త్రనిర్ణయమును విన కుతూహలురాలను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**నిస్స్వానామపి భక్తానాం స్త్రీణాం మాతృపదాన్వితే ।**
**విద్యాజ్ఞానయుతే! మాతస్తవాయం సంశయః కుతః ॥** 2

శ్రీ మలయాళ యతీన్ద్రుడు చెప్పెను

బీదలకును, భక్తురాండ్రగు నారీమణులకును మాతృస్థానము నలంకరించి విద్య, జ్ఞానము ఇత్యాది సద్గుణములతో గూడిన ఓ తల్లీ! మీకిట్టి సంశయమేల కలిగినది?

**వ్యాధిగ్రస్తా యథా విప్రాశ్శూద్రా నార్యాదయోऽపి వా ।**
**అర్హన్త్యౌషధమత్యన్తం తద్వద్బ్రహ్మాధికారితామ్ ॥** 3

రోగపీడితులగు మానవులు బ్రాహ్మణులేమి శూద్రులేమి, స్త్రీలేమి, పురుషులేమి అందరును ఔషధసేవనమునం దెటుల నధికారము గలిగియున్నారో, అటులే భవరోగగ్రస్తులగు స్త్రీ పురుషులందరును బ్రహ్మవిద్యయం దధికారము గలిగియున్నారు

**ఔషధం సేవతే రోగీ పథ్యేనైవ యుతం యథా ।**

**వైరాగ్యాదిగుణై రేవం బ్రహ్మర్థీ బ్రహ్మ భావయేత్ ॥** 4

రోగి నియమపూర్వకమైన పథ్యముతో గూడియే ఔషధమును సేవించునట్లు బ్రహ్మవిద్యాభిలాషియు వైరాగ్యాది గుణములను గలిగి యుండియే బ్రహ్మభావన చేయవలయును

**సర్వేషామపి రుగ్ణానామాయుర్వేదో యథా సమః ।**
**ఈశ్వరోపాసనం జ్ఞానం తథా సర్వసమం మతమ్ ॥** 5

వేయేల! ఆయుర్వేదము లేక వైద్యశాస్త్రము వ్యాధిపీడితులగు సకల మానవులకు ఎటుల సమానమో, తత్సేవనమునం దందరును నెటుల నధికారము గలిగియున్నారో, అటులనే యీశ్వరోపాసనము బ్రహ్మజ్ఞానము మును మానవులందరికిని సమానము అనగా అందరికిని సమానార్హత కలదని తాత్పర్యము

**భుక్తౌషధోఽపి నిష్పథ్యో రోగశాన్తిం న విన్దతి ।**
**తథా శమాదిసంత్యక్తా లబ్ధబ్రహ్మోపదేశకాః ॥** 6

**స్త్రియో విప్రాస్తథా శూద్రా భవరోగాన్వితాః పునః ।**
**నాధిగచ్ఛన్తి నిర్వాణం పరం బ్రహ్మాద్వయం శివమ్ ॥** 7

ఔషధమును సేవించియు సరియగు పథ్యమును బాటింపని మనుజు డెవడైనను ఎటుల రోగవిముక్తిని బొందజాలడో, అటులే బ్రహ్మోపదేశమును బొందియు శమదమాది గుణరహితులై, సత్క్రమానుష్ఠాన శూన్యులైన బ్రాహ్మణులైనను, శూద్రాదులెవరైనను భవరోగవిముక్తులై నిరతి శయాద్వయ శివరూపమగు పరబ్రహ్మమును లేక నిర్వాణమును బొందజాలరు

**యది చేన్నార్హతా స్త్రీణాం హరివాక్యం కథం భువే।**
**గౌరింప్రతి శివేనోక్తః తత్త్వబోధః కథం వద॥** 8

స్త్రీలకు బ్రహ్మవిద్యయం దధికారము లేనిచో విష్ణుమూర్తి భూదేవికి

గీతామాహాత్మ్యము నెటుల చెప్పును? మఱియు పరమేశ్వరుడు గురుగీత యందు పార్వతీదేవికి బ్రహ్మతత్త్వోపదేశము నెటుల జేసెను?

**ధరోవాచేతి గీతాయా మాహాత్మ్యే వర్ణ్యతే కిల ।**
**తథైవ గురుగీతాయాం పార్వత్యాహేతి దృశ్యతే**
**యోగమన్త్రౌ భవాన్యై చ శివః ప్రాహేతి వీక్ష్యతే॥** 9

భగవద్గీతామాహాత్మ్యమునందు ధరోవాచ అని పఠించుచున్నాము అట్లే, గురుగీతయందు పార్వత్యువాచ అనియు గనపడుచున్నది మఱియు ఈశ్వరుడు యోగశాస్త్రమును, మన్త్రశాస్త్రమును పార్వతీదేవికి ఉపదేశించినటుల శాస్త్రమునందు గానవచ్చుచున్నది

**యాజ్ఞవల్క్యస్య చారణ్యే మైత్రేయ్యై బ్రహ్మబోధనమ్ ।**
**నానుస్మరసి కిం మాతః! వేదాన్తశ్రుతిపారగే! ॥** 10

చిరకాలము వేదాన్తశ్రవణ మొనర్చిన ఓ తల్లీ! బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి బ్రహ్మవిద్యోపదేశము చేసిన విషయమును మరచితివా?

అన్నపూర్ణామ్బా ఉవాచ

**త్వదీయబోధవాతేన హృదాకాశతమోఘనః ।**
**విచ్ఛిన్నస్తత్త్వనిష్ణాత! ఛిన్ధి మే సంశయాన్తరమ్ ॥** 11

అన్నపూర్ణాంబ చెప్పెను

ఆత్మతత్త్వమునం దారితేరిన ఓ సద్గురుమూర్తీ! భవదీయబోధరూపమగు ఝంఝామారుతముచే నాహృదయాంతరాళమున చిరకాలమునుంచి దాగియున్న అజ్ఞానమనెడి కారుమేఘము పటాపంచలైనది తండ్రీ! ఇంకొక సందేహముమాత్రము గలదు దానినిగూడ తొలగింపుడు

**బ్రహ్మచర్యే చ సన్న్యాసే స్త్రీణామనధికారితా ।**
**ఉద్ఘుష్యతే చ విద్వద్భిస్సత్యమత్ర వద ప్రభో! ॥** 12

గురుదేవా! స్త్రీలకు బ్రహ్మచర్యమునందు, సన్న్యాసగ్రహణమునందు అధికారము లేదని కొందరు విద్వాంసులు చెప్పుచున్నారు ఇది సత్యమా, తెలుపుడి

శ్రీ మలయాళయతీన్ద్ర ఉవాచ

**కృతకృత్యాఽసి ధన్యాఽసి మాతరాశంకసే పునః।**
**నారీజనహితాయైవ ప్రశ్నోఽయం సాధు కీర్తితః ॥ 13**

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

తల్లీ! నీవు వస్తుతః కృతకృత్యురాలవు ధన్యురాలవు అయినను నీకేల ఇట్టి సంశయము గలుగుచున్నది? కానీ నీ యీ ప్రశ్న నారీలోకమున కెంతో హితకరమైనది కనుకనే యీ ప్రశ్న చాల ఉచితమైనది

**కేవలం శాస్త్రవిద్వాక్యం న గ్రాహ్యమనివార్యతః ।**
**సుగ్రాహ్యం సర్వదా వాక్యమాత్మవిచ్ఛాస్త్రవేదినః ॥ 14**

కేవలము శాస్త్రాధ్యయన మొనర్చిన పండితమ్మన్యుల వాక్యమును అనివార్యముగ ప్రమాణమని గ్రహింపరాదు మఱి ఆత్మజ్ఞానానుభవముగల శాస్త్రవిద్వాంసుల వాక్యమునే యిట్టి ధర్మసందేహ సమయమున ప్రమాణముగ స్వీకరించవలయును

**కర్మసన్న్యాసినాం బ్రహ్మభావేనాత్ర మహాత్మనామ్ ।**
**త్యక్తస్వపరభేదానాం చరాచరహితైషిణామ్ ।**
**ఆత్మతత్త్వవిదామేవ ప్రమాణం విదుషాం వచః ॥ 15**

బ్రహ్మాత్మైక్యభావనచే సమస్తకర్మలను పరిత్యజించినట్టియు, సమస్త ప్రాణికోటులందున్న ఆత్మ ఒకటేయని తలంచి, స్వపరభేదభావమును వీడి నట్టియు, చరాచరహితము నాకాంక్షించునట్టివారునగు ఆత్మవేత్తలగు మహాత్ములయొక్క వాక్యములే ప్రమాణములు

**కర్మజ్ఞానాత్మకో వేదః కాండద్వయవిభూషితః ।**

**కర్మ ప్రాకృతలోకానాం జ్ఞానం చాత్మవిదాం విదుః ॥** 16

వేదము కర్మకాండమనియు, జ్ఞానకాండమనియు రెండువిభాగము లతో గూడియున్నది అందు కర్మకాండము ప్రాకృతజనులకు (అజ్ఞానులకు)ను, జ్ఞానకాండము విజ్ఞానులకును నేర్పడినది

**తతశ్చాత్మవిదో వాక్యమమృతం కిం న సేవ్యతే ।**
**అజ్ఞవాగ్విషకల్పా స్యాత్ వివేకోఽయం గురోః కృపా ॥** 17

కాన అమృతతుల్యమగు ఆత్మవేత్తవాక్యము నేల గ్రహింపరు? అజ్ఞాని పురుషుని వాక్యము విషతుల్యమగును ఈ రెండింటి భేదమును గ్రహించు వివేకబుద్ధి శ్రీగురుదేవుని సత్కృపచేమాత్రమే గలుగును

**సులభాయాశ్చ గార్గ్యాశ్చ చారిత్రం శ్రూయతే నను ।**
**సన్న్యాసబ్రహ్మచర్యాది సద్గుణైరుజ్జ్వలం మహత్ ॥** 18

(బృహదారణ్యకమున) సంన్యాసము, బ్రహ్మచర్యము ఇత్యాద్యాధ్యాత్మిక సద్గుణములతో జాజ్వల్యమానమై ప్రకాశించు గార్గి, మైత్రేయి, భారతమున సులభాయోగిని మొదలగు ఆదర్శనారీమణులయొక్క ఉజ్జ్వల చరిత్రమును వింటున్నాముగదా!

**విరాగం ప్రౌఢమాసాద్య నిరుధ్య చ మనో ధియమ్ ।**
**సదా ప్రణవనాదేన భవ బ్రహ్మ సుఖాత్మకమ్॥** 19

కాన ప్రౌఢమగు వైరాగ్యము నవలంబించి, మనోబుద్ధుల నేకాగ్రపరచి, నిరంతర ప్రణవోచ్చారణముతో నిరతిశయ సుఖస్వరూపమగు బ్రహ్మవు గమ్ము

**తత్త్వమస్యాదివాక్యోత్థ జీవబ్రహ్మైక్యతా ।**
**న శ్రుతా గురువాక్యేన వేదాన్తశ్రవణేన కిమ్ ॥** 20

గురువాక్యముచేతను, వేదాంతశాస్త్రశ్రవణముచేతను తత్త్వమస్యాది మహావాక్యజన్యమగు జీవబ్రహ్మల యభేదమును వినలేదా?

**శ్రుత్వాపి తత్త్వమస్యాది బ్రహ్మాహమితి భావనా ।**
**యస్య నాస్తి విమూఢోఽయం కృపాదూరో హి సద్గురోః ॥ 21**

గురూపదిష్టమగు తత్త్వమస్యాది మహావాక్యమును వినియు పరబ్రహ్మమే తానను దృఢభావము ఎవనికి గలుగలేదో, వాడు శ్రీగురు దేవునికృపకు దూరుడుగదా!

**ప్రణవబ్రహ్మమూఢస్య వేదాన్తశ్రవణం తథా ।**
**జపశ్చ సద్గురుధ్యానం యథా భస్మార్పితం హవిః ॥ 22**

అట్టి ప్రణవార్థ బ్రహ్మజ్ఞానశూన్యుడగు శిష్యునికి వేదాన్తశ్రవణము, జపము, తపము, ధ్యానము – ఇవన్నియు బూడిదలో వ్రేల్చిన హవిస్సువలె వ్యర్థమని తెలియుము

**వీక్ష్య బ్రహ్మవిదూరాంశ్చ శిష్యానేతాన్మహాగురుః ।**
**ఆత్మచ్యుతిపరాంశ్చిన్తాక్రాన్తచిత్తో విదూయతే ॥ 23**

ఉత్తముడగు గురువు బ్రహ్మజ్ఞాన దూరులును, ఆత్మపరాఙ్ముఖులును నగు నిట్టి శిష్యులను జూచి (అయ్యో! చిరకాల గురుకులవాసము జేసియు, వేదాన్తశాస్త్రము నామూలాగ్రము శ్రవణముజేసియు ఆత్మజ్ఞానమును బొందజాలక పోయిరే అని) చిన్తాక్రాన్తహృదయుడై పరితపించును లేక విచారించును

**వాసిష్ఠాదిషు బ్రహ్మజ్ఞా శ్చూడాలైవం మదాలసా ।**
**తథైవాన్యాశ్చ గార్హస్థ్యే శ్రూయంతే ప్రథితాస్త్రియః ॥ 24**

చూడాల,మదాలస మొదలగు బ్రహ్మజ్ఞలైన నారీమణులు పెక్కు మంది గృహస్థాశ్రమమునందున్న వారు యోగావాసిష్ఠాది గ్రంథములందు సుప్రసిద్ధులు కదా!

**కాత్యాయనీ చ సులభా శార్ ఙ్గీ విశ్వవరా తథా ।**
**తపస్వినీ చ మైత్రేయీ బ్రహ్మభావంగతా శ్రుతాః ॥ 25**

మఱియు కాత్యాయని, సులభ, శార్ఙ్గి, విశ్వవర, మైత్రేయి మొదలగు తపస్వినులు బ్రహ్మజ్ఞాన సంపన్నురాండ్రై బ్రహ్మప్రాప్తి నొందినటుల ఉపనిషత్తులలో గానవచ్చుచున్నది

**అనభ్యాసవశాచ్ఛాస్త్రే సంశయాస్సంభవన్తి హి ।**
**తతస్సంస్కృత భాషాయాస్సాదరాభ్యసనం కురు॥ 26**

శాస్త్రములను చక్కగ నభ్యసింపనందువలననే పూర్వోక్త సంశయములు గలుగుచుండును కాన సంస్కృతభాషను శ్రద్ధతో నభ్యసింపవలయును అప్పుడే పైసంశయము లెల్ల తొలగగలవు

**గార్గీం చ బ్రహ్మచారిణ్యశ్చూడాలాం చ గృహస్థకాః ।**
**వానప్రస్థాశ్చ మైత్రేయీం భిక్షుక్యస్సులభాం తథా॥ 27**

**ధ్యాయేయుశ్శుద్ధమనసా చిన్తయేయుశ్చ పావనమ్ ।**
**తాసాం సుచరితం తస్మా ద్భవేయుస్తాదృశో ధ్రువమ్॥ 28**

బ్రహ్మచారిణులు గార్గిని, గృహిణులు చూడాలను, వానప్రస్థులు మైత్రేయిని, సన్న్యాసినులు సులభాయోగినిని పవిత్రహృదయముతో నిత్యము ధ్యానింపవలయును మఱియు పవిత్రతమములై ఉజ్జ్వలములగువారి జీవిత చరిత్రముల ననుదినము పఠించుచు చిన్తన జేయుచుండవలయును అట్లయిన కొంతకాలమునకు ఆ మహాయోగినుల వలెనె మీరును కాగలరు నిశ్చయము

**యాదృశీ భావనా తీవ్రా సిద్ధిర్భవతి తాదృశీ ।**
**శంకరోఽప్యవదత్పూర్వం భేజే భ్రమరకీటవత్ ॥ 29**

భావనాశక్తి మహత్తరమైనది తీవ్రభావనతో నెవరు దేనిని భావన జేతురో వారు ఆయా రూపమును తప్పక పొందుదురు ఇదే తత్త్వమును పూర్వము శ్రీశంకరాచార్యులుగూడ భేజే భ్రమరకీటవత్ అనే నుడివిరి భ్రమరకీట న్యాయమువలె సాధకుడు, తత్తదిష్టదైవమును తీవ్రముగ భావించినచో తత్తద్రూపమును తప్పక పొందగలడని భావము

**అనాత్మభావనాబన్ధాదాత్మభావనయా పునః ।**
**ముక్తస్సుఖీ భవేద్ధీమాన్ పంజరాదివ కేసరీ ॥ 30**

సింహము బోనునుండి విముక్త మగునటుల ధీశాలియగు సాధకుడు నిరంతరాత్మభావనచే అనాత్మభావనా రూపమగు బంధమునుండి విముక్తుడై ముక్తిని బొంది నిరతిశయ సుఖస్వరూపు డగుచున్నాడు

**విద్యాధిదేవతా వాణీ ధనాధ్యక్షా చ పద్మజా ।**
**పార్వతీ జ్ఞానరూపా చ సర్వాశ్చైతా స్త్రియః ఖలు ॥ 31**

తల్లీ! వేయేల? విద్యాధిదేవతయగు సరస్వతియు, ధనాధిదేవతయగు లక్ష్మియు, జ్ఞానస్వరూపిణియగు పార్వతియు స్త్రీలే గదా (వీరందరును మీ వారలే ఈ సత్యము నెరుంగకయే జ్ఞానము లేకయున్నారు )

**భీతో నినాదేన మృగాధిపస్య యథా మృగో ధావతి కాననేషు ।**
**ఓంకారదీర్ఘస్మరణేన తద్వదనాత్మభావః ప్రజహాతి యుష్మాన్॥ 32**

సింహముయొక్క గంభీరమగు మహాగర్జనమును విన్నతోడనే అరణ్యము నందలి మృగము భీతిజెందినదై యెటుల నొక్కపెట్టున పరు గెత్తునో, అటులనే ఉచ్చైఃస్వరముతో ఓంకారమును దీర్ఘముగా నొక్కసారి యుచ్చరించితిరేని మీ హృదయములోగల అనాత్మభావములు, దుష్ట సంకల్పము లన్నియు నొక్కపెట్టున మటుమాయమై ఆత్మప్రబోధము కాగలదు

**బ్రహ్మబోధేన సంయాతి స్వరూపస్థితిమంజసా ।**
**స్వాన్త కాన్తారసంకల్పకంటకైర్గ్రసితః పుమాన్ ॥ 33**

తన హృదయారణ్యమున అనంతసంకల్ప రూపములగు కంటకములతో నావృతుడైన మానవుడు ఆత్మప్రబోధము లేక బ్రహ్మబోధము ( జ్ఞానము) గలుగుటతోడనే స్వస్వరూప స్థితిని పొందగలడు

**బ్రహ్మాచ్యుతాదయస్సర్వే వాణీ సేవాపరాయణాః ।**
**ప్రాప్తజ్ఞానా బభూవుస్తే మాతర్భీతిః కుతస్తవ ॥ 34**

తల్లీ! బ్రహ్మ, విష్ణువు మొదలయిన దేవతలందరు నారీస్వరూపిణి యగు సరస్వతి నుపాసించియే అనుత్తమమగు జ్ఞానమును బొందిరి కాన నీకు భయమేల?

**సుప్తస్సింహో యథా స్వీయాం శక్తిం నా వైతి వై తథా ।**
**దివ్యాత్మ శక్తిం నో వేత్తి మయానిద్రాగతో నరః ॥ 35**

నిద్రించుచున్న సింహము తనశక్తిని గుర్తించనటుల మాయా సుషుప్తిలోనున్న మానవుడు సైతము తన దివ్యమగు ఆత్మశక్తిని కనుగొన జాలడు

**ఆత్మబోధే సముత్పన్నే ప్రబుద్ధా భవతి స్వయమ్ ।**
**నిగూఢా స్వాత్మశక్తిశ్చ త్యక్తబన్ధ స్తదా భవేత్ ॥ 36**

ఆత్మప్రబోధోదయ మగుటతోడనే మీలో దాగియున్న దివ్యమగు ఆత్మశక్తి స్వయముగా ప్రకాశింపగలదు అపుడు మానవుడు భవబంధ విముక్తు డగుచున్నాడు

**ఉపాధ్యాయాన్దశాచార్య ఆచార్యాణాం శతం పితా।**
**సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే॥ 37**

**ఇత్యువాచ మనుః పూర్వం స్వస్మృతావృషిరుత్తమః।**
**మనుస్మృతిస్తు ధర్మాణాం ప్రమాణం ప్రథమం కిల॥ 38**

లౌకిక శాస్త్రములను బోధించు నుపాధ్యాయునికన్న ఆచార్యుడు (కులగురువు) పదిరెట్లు శ్రేష్ఠుడు ఆచార్యునికన్న కన్నతండ్రి నూరురెట్లు పూజనీయుడు తండ్రికన్నను మాతృదేవి వేయిరెట్లు పూజ్యురాలు – ఇట్లని ఋషిశ్రేష్ఠుడగు మనువు తన మనుస్మృతియందు దెలిపెను మనుస్మృతి ధర్మశాస్త్రము లన్నిటికిని ముఖ్యప్రమాణము గదా! (కాన మాతృస్థానీయులగు మీకు శాస్త్రము ఎంతటి గౌరవస్థాన మొసగినదో జూడుడు )

**ధనాదిదేవతా లక్ష్మీస్త్వఙ్గాతీయేతి పావనే! ।**
**లక్ష్మీనామప్రబోధేన లేఖారంభో విధేయతే ॥** 39

పవిత్రాత్మస్వరూపిణీ! ధనాధిదేవతయగు లక్ష్మి నారీలోకమునకు జెందినవారు గదా! కనుకనే స్త్రీలకు ఉత్తరము వ్రాయునపుడు లక్ష్మీసమానురాలైన అని సంబోదించి వ్రాయుట పరిపాటియైనది ఈ సత్యమునుగూడ మరచితిరా!

**విశిష్య మాతాపితరౌ లక్ష్మీనారాయణావితి ।**
**నామాదౌ కీర్తనాత్ స్త్రీణాముత్కర్షో బహుమన్యతే॥** 40

మరియు మాతాపిత లనియు, లక్ష్మీనారాయణులనియు, పేరు లుచ్చరించునపుడు కూడ స్త్రీలనే ముందు కీర్తించుటవలన వారియొక్క ఉర్కర్షత ఎంతగనో గౌరవింపబడినది

**కిం చ శ్రీరామకృష్ణాది నిమిత్తప్రభవాః పురా।**
**బుద్ధ శ్రీయేసు నబ్యాది గాన్ధ్యన్తాస్తత్త్వదర్శినః ॥** 41

**శ్రీమచ్ఛంకరమధ్వాది ప్రవక్తారశ్చ లేభిరే ।**
**జన్మ స్త్రీగర్భవివరే కథం హీనాస్త్స్రియశ్శుభే ॥** 42

**పూతగర్భాశ్చ హే మాతస్తత్త్వజ్ఞోదయహేతవః ।**
**పూతబ్రహ్మవిచారే హి నార్యోఽనర్హాః కథం వద ॥** 43

మఱియు కారణజన్ములగు శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారపురుషులు, తత్త్వజ్ఞాన సంపన్నులగు శ్రీబుద్ధదేవుడు, శ్రీ యేసుక్రీస్తు, శ్రీమహమ్మదునబి, శ్రీ మహాత్మాగాంధి, మఱి శ్రీశంకర శ్రీరామానుజ శ్రీమ ధ్వాది మతప్రవక్తలందరును స్త్రీగర్భముననే గదా జన్మించిరి పావనచరి తగవగు నో తల్లీ! పవిత్రగర్భమును దాల్చి తత్త్వజ్ఞులగు ఇట్టి మహనీయుల ఆవిర్భావమున కాదికారణభూతలైన మహాశక్తి స్వరూపిణులగు స్త్రీలు హీనలు, బ్రహ్మవిద్యయం దనధికారిణులు ఎటులగుదురు? యోచింపుము

**ఏవం హి గౌరవశ్రుత్వా స్త్రీణామాత్మాభిమానితా ।**
**వర్ధతే మోహపాశోఽసౌ ఛిద్యతామాత్మచిన్తనాత్ ॥ 44**

ఈ పైజెప్పిన స్త్రీలయొక్క గౌరవమును, పూజ్యభావమును విని ఆత్మాభిమానము పెంపొందగలదు అదియు మోహపాశమే కాన నిరన్తరాత్మచిన్తనచే ఈ మోహపాశమును కూడ ఛేదించుడు (లేదా ఆత్మాభిమానమును పెంపొందించుకొని తద్వారా ఈ దైన్యమనే మోహపాశమును ఛేదించుడు)

**దురహంకారజాలేన బద్ధో భవతి మీనవత్ ।**
**అహంభావోదయాభావో మోక్షస్య పరమావధిః॥ 45**

దురహంకార మంకురించినచో జీవుడు వలలో చిక్కిన చేపవలె మోహపాశ బద్ధుడగును అహంభావ ముదయించకుండుటయే అనగా నిరహంకార స్థితియే మోక్షమునకు పరమావధి

**నిత్యశుద్ధస్స్వయం జ్యోతిరాత్మా లింగాదివర్జితః ।**
**తద్విజ్ఞాన ప్రదీపేన నశ్యతి ప్రబలం తమః ॥ 46**

ఆత్మ స్త్రీపురుషాది భేదరహితమై నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వయం జ్యోతిస్స్వరూప మైనది ఇట్టి యాత్మబోధ మనెడి దీపముచేతనే అంధకారమనెడి మిథ్యాజ్ఞానము నశించును

**నైవ స్త్రీ న పుమానేష నైవ చాయం నపుంసకః ।**
**శరీరోత్పత్తి భేదేన తత్తల్లింగమితి శ్రుతిః ॥ 47**

ఈ యాత్మ వస్తుతః స్త్రీగాదు పురుషుడును గాదు, నపుంసకుడును గాదు మఱి ఆయా శరీరముల ఉత్పత్తి భేదముచే మాత్రమే ఆయా నామ,రూప, లింగ భేదములతో గూడిన దగుచున్నది అని శ్రుతివచనము

**నాహం మనుష్యో న చ దేవయక్షా న బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాః**
**న బ్రహ్మచారీ న గృహీ వనస్థో భిక్షుర్న చాహం నిజబోధరూపః॥ 48**

నేను మనుష్యుడనుగాను దేవతను గాను, యక్షుడుగాని గాను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములకు జెందినవాడను గాను ఇట్లే బ్రహ్మచారిని గాని, గృహస్థుడనుగాని, వానప్రస్థుడను గాని, సంన్యాసినిగాని గాను, మఱి వర్ణాశ్రమాదుల కతీతుడనైన స్వస్వరూపాత్మ జ్ఞానస్వరూపుడనే నేను

**ఏవం స్మర శ్రుతేర్వాక్యమాచార్యస్య తథైవ చ।**
**మోక్ష్యసే స్మరణాన్నిత్యం దేహభావాదివర్జితా॥ 49**

ఈ పూర్వోక్తమగు ''నైవ స్త్రీ న పుమానేషః'' అను శ్రుతివాక్యమును, ''నాహం మనుష్యః'' అను ఆచార్య (హస్తామల కాచార్య) వాక్యమును నిరంతర మనుసంధానము చేయుము అటుల అనవరత సంస్మరణచే దేహభావాది రహితవై ముక్తురాలవు కాగలవు

**దేహభావమహంభావం పరిత్యజ్య సునిర్మలే।**
**సోఽహంభావే విలీనా త్వం బ్రహ్మభూయాయ కల్పసే॥ 50**

దేహభావమును, అహంకారమును వీడి, సోఽహంభావమునందు లీనురాలవై నీవు నిరంతర బ్రహ్మానుసంధానముచే బ్రహ్మస్వరూపిణివి కాగలవు

**సత్యం జ్ఞానాది వేదోక్త లక్షణం హృది భావయ।**
**బ్రహ్మాహమితి బోధేన నిశ్చలా భవ మోక్షగా॥ 51**

''సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'' ఇత్యాది శ్రుతిచే ప్రతిపాదితమగు బ్రహ్మ యొక్క స్వరూపలక్షణమును బాగుగ మనన మొనర్చుము ''అహం బ్రహ్మాస్మి'' అను మహావాక్యజ్ఞానముచే దృఢాపరోక్ష సాక్షాత్కారము గలిగి చాంచల్య ముడిగి ముక్తిని బొందుము

**నాహం దేహో న చ ప్రాణో నేన్ద్రియాణి మనో న హి।**
**సాక్షిత్వాచ్ఛివ ఏవాస్మి కేవలస్సచ్చిదాత్మకః॥ 52**

**తటస్థలక్షణం బుద్ధ్వా విచార్యేదం ముహుర్ముహుః ।**
**దేహాదిభావనాముక్తా బ్రహ్మభావేన దీవ్యసే॥ 53**

దేహ ప్రాణ మనో బుద్ధ్యాదు లేవియు నేను గాను వీటికన్నిటికి విలక్షణమై జడములగు మనోబుద్ధ్యాదులను ప్రకాశింపజేయుచు వాటికి సాక్షియై యున్న కేవల సచ్చిదానంద ఘనస్వరూపుడనే నేను అను నీ తటస్థ లక్షణమును బుద్ధితో మాటిమాటికి మనన మొనర్చి, దేహాదిభావనను పరిత్యజించి నిత్యనిర్మల సచ్చిదానందఘన పరబ్రహ్మస్వరూపిణివై విరాజిల్లుదువు

**జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥ 54**

**ఇతి కైవల్యవేదాన్తే బ్రహ్మాత్మైక్యస్య భావనా ।**
**బన్ధచ్ఛేదసుఖోపాయః కీర్తితా శృణు తత్పరా ॥ 55**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాత్మకమగు నీ కాన్పించు ప్రపంచమంతయు దేనిచే ప్రకాశింపబడుచున్నదో, అట్టి బ్రహ్మమునే నేనని తెలుసుకొన్నచో సమస్త భవబంధములనుండి విముక్తు డగుచున్నాడు ఇట్లని కైవల్యోప నిషత్తునందు ఈబ్రహ్మాత్మైక్యభావనయే భవబన్ధచ్ఛేదనమునకు సుఖతరమగు ఉపాయముగా జెప్పబడినది కాన శ్రద్ధతో వినుము

**దృశ్యమేవ హి సాక్షిత్వం యేన బన్ధస్సునిశ్చితః ।**
**అతస్త్రిపుటిరాహిత్యే పూర్ణమేవావశిష్యతే ॥ 56**

కడకు సాక్షిభావనగూడ దృశ్యములో జేరినదియే దృశ్యమున్నంత వరకు బన్ధము తప్పదు కాన త్రిపుటి రాహిత్య మగునపుడే నామరూపాది శూన్యమగు పూర్ణబ్రహ్మ మిగులును లేక పూర్ణత్వము సిద్ధించును

**జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః పరే నాత్మని విద్యతే ।**
**చిదానన్దైకరూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్ ॥ 57**

**ఇతి శ్రుతే ర్విచారేణ జ్ఞాతృజ్ఞేయాది భేదతః ।**
**నిర్ముక్తా భవ హే మాతః పూర్ణశాన్తిశ్చ తే భవేత్ ॥ 58**

పరమాత్మయందు జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాత్మక త్రిపుటిభేదము లేదు బ్రహ్మ కేవలము సచ్చిదానన్ద స్వరూప మగుటచే స్వప్రకాశమై వెలుగుచున్నది ఈ శ్రుతిని బాగుగ మనన మొనర్చి త్రిపుటిరహిత వగుము ఓ తల్లీ! నీకును నిత్యనిరతిశయ పూర్ణశాన్తి లభించును

**స్త్రీణాం బ్రహ్మోపదేశాయ తారణాయ భవామ్బుధేః ।**
**భవత్యా జన్మలబ్ధం హి మా విస్మర గురోర్వచః ॥ 59**

**గురూపదేశానుష్ఠానం ధర్మ శ్శిష్యస్య సర్వదా ।**
**అతో యతస్వ సద్భక్త్యా గురువాక్యార్థసాధనే ॥ 60**

ఓ తల్లీ! స్త్రీలకు బ్రహ్మవిద్య నుపదేశించి (అన్వర్థతాది ప్రతిబన్ధకము లను తొలగించి) సంసార సాగరమునుండి తరింపజేయుటకే మీ కీ జన్మ గలిగినది ఈ గురూపదేశమును మరువకుము గురువాక్యమును మననము చేయుట, తదనుసారము యధావిధిగా ననుష్ఠించుట అనునవియే నిజమయిన శిష్యుని ధర్మము కాన అనన్యగురుభక్తి గలిగి గురువాక్యమును సాధించుటకై ప్రయత్నింపుము

ఇతి శ్రీ మలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
స్త్రీవిద్యాధికారయోగో నామ పంచమోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీ మలయాళయతీన్ద్ర గీతయందు
స్త్రీ విద్యాధికారయోగమను పంచమాధ్యాయము సమాప్తము



# షష్ఠో౽ధ్యాయః

# జాతినిర్ణయయోగః

నారాయణానన్దగిరిరువాచ

**బ్రహ్మం స్తత్త్వార్థనిర్ణేతస్తాపసోత్తమ వేదవిత్ ।**
**చాతుర్వర్ణ్యం కదా కేన కిమర్థం సృష్టమిత్యపి ॥** 1

**కులతో గుణతో వా తజ్జ్ఞాతవ్యమితి సంశయః ।**
**జాయతే హృది మే తాత! బ్రూహి నిస్సంశయం యథా ॥** 2

నారాయణానందగిరి చెప్పెను

సమస్త వేదముల నెరిగిన యథార్థ నిర్ణేతవగు ఓ తాపసోత్తమా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాలుగువర్ణము లెవరిచే సృష్టించ బడినవి? ఎప్పుడు సృజింపబడినవి? ఎందులకు సృజింపబడినవి?

మరియు నాజాతులు కులమును నిమిత్తముగా జేసికొని విభజింప బడినవా? లేక సాత్త్వికాది గుణముల ననుసరించి విభజింపబడినవా? యనెడి సంశయము నాకు కలుగుచున్నది కనుక నోతండ్రీ! పై విషయమును బోధించి నాసందేహమును నివారింపుడు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**చాతుర్వర్ణ్యవ్యవస్థాయాం సంశయో బహుకాలతః ।**
**జాయతే సర్వవిజ్ఞానాం సంశయార్హో౽వ్యయం యతః ॥** 3

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

ఓ యతిశ్రేష్ఠా! ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థావిషయములో బహుకాల మునుండి విజ్ఞులకు సహితము సందేహము కలుగుచునే యున్నది ఇయ్యది సంశయాస్పదమైనదే గదా?

**కదా కేన కథం కస్మై వ్యవస్థేయం వినిర్మితా ।**

**అద్యావధి న కేనాపి ప్రోక్తా సా నిశ్చయేన హి ॥** 4

ఎప్పు డీవర్ణవ్యవస్థ యేర్పడినది? ఎవరిచే నేర్పరచబడినది? ఎట్లేర్పరచబడినది? ఎందుకొఱకు నేర్పరచబడిన దనెడి విషయమును గూర్చి నేటివర కెవరును నిశ్చయముగా చెప్పియుండలేదు.

**జన్మ నై వేతి కేచిద్ధి గుణైరిత్యపరే విదుః ।**
**భగవత్కల్పితేత్యన్యే వివాదం కుర్వతే మిథః ॥** 5

ఈ వర్ణవ్యవస్థ జన్మముచే నేర్పడినదని కొందరు, సాత్త్వికాది గుణములచే నేర్పడినదని మరికొందరు, భగవత్కల్పితమని మరికొందరును జెప్పుచు, పరస్పరము వాదవివాదములను చేయుచున్నారు.

**వేదో క్త పురుషస్యైవ ముఖబాహూరుపాదతః ।**
**బ్రాహ్మణాద్యా అజాయన్తేత్యుచ్యతే బహుభిర్జనైః ॥** 6

''బ్రాహ్మణోఽస్యముఖమాసీత్'' అనెడి పురుషసూక్తమందున్న మంత్ర వాక్య ప్రమాణమునుబట్టి వేదపురుషుని ముఖబాహూరుపాదముల నుండి క్రమముగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు జన్మించిరని కొందరు చెప్పుచున్నారు.

**ముఖం కిమస్య కౌ బాహూ కావూరూ చరణౌ సతః।**
**ఇత్థం ప్రశ్నస్య సద్భావాద్వర్ణనాఽస్యేతి వర్ణితాః॥** 7

''ముఖం కిమస్యకౌబాహూ కావూరూపాదావుచ్యేతే'' అనెడి వాక్యమందు పరమాత్మకు ముఖమేమి? బాహువు లెవ్వి? ఊరువు లెవ్వి? పాదము లెవ్వి? యనెడి ప్రశ్నలుండుటవలన ఇది వేదపురుషుని వర్ణనయే గాని మరియొకటి గాదని జ్ఞానవంతులగు కొందరు పండితులు చెప్పుచున్నారు.

**శూద్రోఽజాయత ఇత్యేవం మంత్రవాక్యానుసారతః ।**
**ఆసీదితి పదస్యాపి హ్యుత్పత్తిం సంప్రచక్షతే ॥** 8

మరికొందరు పాదములనుండి శూద్రులు బుట్టిరను నర్థముగల ''పద్భ్యాం శూద్రోఽజాయత'' అను ఉత్తరవాక్యమునుబట్టి తత్పూర్వ మందున్న ''బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్'' అను వాక్యమందున్న ''ఆసీత్'' అను పదము నకు పుట్టెను అను నర్థమును గల్పించి బ్రాహ్మణాదులు ముఖాదులనుండి పుట్టిరని పూర్వోక్తుల యభిప్రాయమునే సమర్థించుచున్నారు

**నామరూపాదిశూన్యస్య బ్రహ్మణో రూపకల్పనమ్ ।**
**లోకసఙ్గ్రహ సిద్ధ్యర్థం యుక్త మిత్యుచ్యతే బుధైః ॥** 9

సర్వవ్యాపకుండైన పరమాత్మ నామ రూప జాతి రహితుడైనను లోక సంగ్రహముకొఱకు నామరూపములను గల్పించుకొనుట యుక్తమని కొందరి యభిప్రాయము

**పక్షపాతీ న వేశానః పక్షపాతీ భవేద్యది ।**
**రాగవిద్వేషయుక్తాచ్చ పుంసశ్శ్రేష్ఠః కథం భవేత్ ॥** 10

లోకసంగ్రహముకొఱకు నామరూపములను జాతులను కల్పించుకొను పరమేశ్వరుడు పక్షపాతము గలవాడా? లేక పక్షపాతము లేనివాడా? పక్షపాతియైనచో రాగద్వేషాదులు గల సాధారణ మనుష్యునికంటె శ్రేష్ఠుడెట్లగును?

**పక్షపాతాదిశూన్య శ్చేద్భేదసృష్టిం కథం సృజేత్ ।**
**ఇత్థం విమర్శకైః పృష్టా నోత్తరం కేఽపి తానదుః ॥** 11

పక్షపాతము లేనివాడైనచో అనగా సర్వసముడగు నాపరమేశ్వరుడు పరస్పర ద్వేషాత్యాచారాది భూయిష్ఠమగు నీజాతిభేదసృష్టి నెట్లు సృజించెను? అని విమర్శకు లడిగిన ప్రశ్నకు నేటివర కెవరును సరియగు నుత్తర మివ్వలేదు

**అపి యుక్తః ప్రాకృతైర్వా గుణైస్సర్వైర్మహేశ్వరః ।**

**అథవా త్రిగుణాతీతవిశుద్ధజ్ఞానవాన్ భవేత్ ॥ 12**

మరియు నీ పరమేశ్వరుడు ప్రాకృతములగు సత్త్వరజస్తమోగుణములతో గూడినవాడా? లేక త్రిగుణాతీతుడైన విశుద్ధ జ్ఞానస్వరూపుడా?

**యద్యయం త్రిగుణైర్యుక్తో నేష్టోఽస్మాకం కదాచన ।**
**యది జ్ఞానస్వరూపస్స్యాత్తదుత్పన్నా స్తథైవ హి ॥ 13**

త్రిగుణములతో గూడిన వాడనిచో నట్టి పరమేశ్వరుడు మాకవసరము లేదు లేక శుద్ధజ్ఞానస్వరూపు డనిచో నట్టి పరమాత్మనుండి పుట్టినవారందరు జ్ఞానస్వరూపులుగానే యుండవలయును

**శర్కరాప్రతిమాఙ్గాని తన్మయాని యథా తథా ।**
**జ్ఞానరూపాత్మనో జాతాస్సర్వే స్యుస్తత్స్వరూపిణః ॥ 14**

పంచదారచే చేయబడిన బొమ్మయొక్క సర్వాంగము లేలాగున పంచదారమయముగ నుండునో, యట్లే జ్ఞానస్వరూపుండగు పరమాత్మయొక్క ముఖబాహూరు పాదములనుండి పుట్టినవారందరును జ్ఞానస్వరూపులుగానే యుండియుందురు

**మూలాదారభ్య శాఖాగ్రపర్యన్తం హి ఫలప్రదాః ।**
**పనసాది ద్రుమాస్స న్తి కేచిల్లోకోపకారకాః ॥ 15**

**తత్ఫలానాం న భేదోఽస్తి మాధుర్యాదిగుణాదిషు ।**
**ఏవం ముఖాది జన్యానాం న స్యాత్కాచిన్మిథో భిదా ॥ 16**

మరియు లోకములో మూలమునుండి శాఖాగ్రపర్యంతము ఫలించు పనస, అత్తి మొదలగు ఫలవృక్షము లెన్నియో యున్నవి కాని వాటి ఫలములలో మాధుర్యాది గుణభేదము కనిపించుట లేదు అనగా మూలశాఖా తదగ్రభాగములనుండి యుత్పన్నమైన పనసాది ఫలము లన్నియు నొకే విధముగ మాధుర్యమును గలిగియున్నవి అట్లే ప్రకృతములో జ్ఞానస్వరూపుడగు పరమాత్మయొక్క ముఖబాహూరుపాదములనుండి

పుట్టినవారందరు జ్ఞానస్వరూపులుగనే యుండవలసియున్నది వారిలో పరస్పరము భేదముండరాదు

నారాయణానన్దగిరిరువాచ

**బ్రాహ్మణక్షత్రియాదీనాం రక్తభేదోఽస్త్యనాదితః ।**
**తస్మాద్వర్ణవిభేదస్స్యాదిత్యన్యే కిం తదుత్తమమ్ ॥** 17

నారాయణానన్దగిరి చెప్పెను

బ్రాహ్మణాది నాలుగువర్ణములకు రక్తభేద మనాదికాలమునుంచి యున్నది కనుక రక్తభేదమునుబట్టి నాలుగు జాతులకు విభాగ మేర్పడి యుండునని కొందరి వాదము ఇది సరియైనదా?

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**ఇదన్తు మహదాశ్చర్యం శ్రుతం నైవ కదాచన ।**
**పాశ్చాత్యజ్ఞానవిజ్ఞానమజ్ఞానం వేతి భాతి మే ॥** 18

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

ఇది చాల ఆశ్చర్యముగ నున్నది ఈవిషయము నిదివర కెప్పుడును వినియుండలేదు ఇయ్యది పాశ్చాత్యవిద్యావిజ్ఞానమా? లేక యజ్ఞానమా? యని సందేహము నాకు గలుగుచున్నది

**వస్తువిజ్ఞాన యాథార్థ్యజిజ్ఞాసుభిరసృగ్భిదా ।**
**భిషక్ఛిరోమణిభ్యస్సా జ్ఞాతవ్యాఽస్త్రాస్తి వేతి న ॥** 19

వస్తువుయొక్క యథార్థస్థితిని తెలిసికొనదలంచువారు బ్రాహ్మణాది వర్ణములలో రక్తభేద మున్నదా? లేదా యనెడి విషయమును రక్తపరీక్ష చేయు వైద్యకోవిదుల నడిగి తెలిసికొనవలెను

**రోగ్యరోగిప్రభేదేన ర క్తభేదస్తు దృశ్యతే ।**
**క్వచిదాహారపానీయప్రభేదేనాపి లక్ష్యతే ॥** 20

ఆరోగ్యానారోగ్యవంతుల రక్తములలో భేదము కనబడుచున్నది ఆహారపానీయ భేదమువలన గూడ కొందరిలో రక్తభేదము కనబడుచున్నది కాని వర్ణభేదముల ననుసరించి రక్తభేద మెక్కడను కనుపించలేదు

**కస్తావద్వఞ్చకో హ్యేవం హేత్వాభాసం సమబ్రవీత్ ।**
**అత ఏవార్యజాతీయా లేభిరే పరతంత్రతామ్ ॥** 21

ఏవంచకు డిట్టి దుష్టహేతువును జెప్పి జనులను మోసగించెనో తెలియకున్నది కనుకనే యార్యజాతీయులగు భారతీయులు పరతంత్రులైరి

**గాన్ధ్యాదయో మహాత్మాన అవతీర్యాత్ర భారతే ।**
**అకుర్వన్నార్యజాతీయాన్ విముక్తాన్ పరశాసనాత్ ॥** 22

గాంధీ మొదలగు మహాత్ము లనేకులు భారతదేశమందవతరించి భారతీయులను పరశాసనమునుండి విముక్తులనుగా జేసిరి

**యోగ్యతాం హి సమాలక్ష్య యోగ్యాయ స్థానమున్నతమ్ ।**
**యస్మిన్ దేశే న దీయేత స దేశో నంక్ష్యతి ధ్రువమ్ ॥** 23

**యోగ్యతాం వీక్ష్య యస్మైచి త్కస్మై స్థానం సమున్నతమ్ ।**
**యస్మిన్ దేశే ప్రదీయేత సోఽచిరాద్వృద్ధిమేష్యతి ॥** 24

ఏ దేశమందు యోగ్యతగలవానికి యోగ్యత ననుసరించి యున్నత స్థాన మివ్వబడదో యాదేశ మచిరకాలములో తప్పకుండా నశించును ఏ దేశమందు యోగ్యత గలవాని కెవని కైనను (జాతిమత వివక్షలేక) యోగ్యత ననుసరించి యున్నతస్థాన మివ్వబడునో యాదేశము త్వరలోనే గొప్ప అభివృద్ధిని బొందగలదు

నారాయణానందగిరిరువాచ

**జన్మసంస్కృతజీవో యో యుక్తశ్చేదుత్తమైర్గుణైః ।**
**ఉచ్చస్థానం స్వయం గచ్ఛేత్కోవాఽస్త్వత్ర నిరోధకః ॥** 25

నారాయణానందగిరి చెప్పెను

పూర్వజన్మ సంస్కారముచే నుత్తమగుణములు గలవాడెవడైనను స్వయముగనే యున్నతస్థితికి పోగలుగును ఈ విషయములో నడ్డు పెట్టువారెవరని కొందరు వాదింతురు ఈ విషయములో తమ యాశయ మేమిటి?

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**శ్రేష్ఠబీజే సముప్తేఽపి పఞ్చభూతైస్సహాయకైః ।**
**వినా వృక్షః కథం రోహేద్విశుద్ధాత్మన్ మహాశయ! ॥** 26

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

ఓ పరిశుద్ధాత్ముడవగు మహాశయా! బీజము శ్రేష్ఠమైన దైనప్పటికిని పంచభూతముల సహాయము లేనిచో నదెట్లంకురించి యభివృద్ధిని బొంది పూర్ణవృక్షము గాగలదు?

**తస్మాద్ధి పుణ్యజీవోఽపి గుణసంస్కారసంయుతః ।**
**విద్యాతపోభ్యాం హీనశ్చేత్పూర్ణజ్ఞానీ కథం భవేత్ ॥** 27

కాబట్టి పూర్వజన్మ పుణ్యసంస్కారము, ఉత్తమ గుణములనున్ను గలిగియున్న వాడైనను విద్యాతపస్సులు లేనిచో పూర్ణజ్ఞాని యెట్లు కాగలడు?

**తస్మాద్విద్యాతపోభ్యాం హి పూతాత్మేతి శ్రుతేర్వచః ।**
**రుద్ధవిద్యాతపోధ్యానా జనా వృద్ధిం న లేభిరే ॥** 28

''విద్యాతపోభ్యాం పూతాత్మా'' యనెడి శ్రుతియున్ను విద్యాతపస్సులచే పవిత్రతను బొందినవాడే పూర్ణజ్ఞాని యగునని ఘోషించుచున్నది ఈ విద్యా తపస్సులనుండి యడ్డగించబడిన జనులందరు నున్నతిని బొందలేక పోయిరి

**ఏవం నిషిద్ధాస్స్వమతే సుఖమప్రాప్య తే జనాః ।**

**మతాన్తరం సమాలమ్బ్య సంజాతా యవనాదయః ॥** 29

**సమస్తం భారతం దేశం మతద్వేషైరఖండయన్।**
**హైన్దవానాం మతం తస్మాద్బలహీనమజాయత ॥** 30

ఈ ప్రకారము నిషేధింపబడిన జనులు సుఖమును పొందక మతాన్తరములను స్వీకరించి యవనులు హూణులు మొదలైన వారుగా నయిరి వారలే సమస్త భారతదేశమును మతద్వేషములచే ఛిన్నాభిన్నముగా జేసిరి అందువలన హిందూమతము బలహీనమాయెను

**నిరోధకా నరా అన్తే స్వాత్మశక్తివిహీనతామ్ ।**
**గతాస్సమ్పాలితాశ్చాన్యైర్విదేశీయైః కుశాసకైః ॥** 31

ఉన్నతస్థితిని బొందదలచినవారి నడ్డుపెట్టినవారున్ను తుదకు స్వాత్మశక్తి విహీనులై దుష్టశాసకులగు విదేశీయులచే పరిపాలింపబడిరి

**అన్యోన్యద్వేషిణామేషామపహృత్యాఖిలం ధనమ్ ।**
**పరతన్త్రాన్ విధాయైతాన్ విదేశీయా విరేజిరే ॥** 32

పరస్పర విద్వేషముగల ఈయుభయులయొక్క ధనము నపహరించి తుదకు భారతీయుల నందరిని బానిసలనుగా జేసి విదేశీయు లభివృద్ధిని బొందిరి

**అధఃకర్తుం పరాన్ యస్తు సమీహేత దురాగ్రహాత్ ।**
**అధఃక్రియేత సోఽన్యైరిదమీశ్వరశాసనమ్ ॥** 33

దురాగ్రహముతో నితరుల నభివృద్ధిలోనికి రానీయక అణగ ద్రొక్కుటకు ప్రయత్నించువాడు పరులచే దప్పక అణగద్రొక్కబడునని పరమేశ్వరుని శాసనము

నారాయణానన్దగిరిరువాచ

**సంస్కృతాధ్యయనే ప్రజ్ఞా చాస్తే వర్ణేషు కేషుచిత్।**

**న సర్వేష్వితి యద్వాక్యం సత్యం కిం తాత! మే వద॥**

నారాయణానందగిరి చెప్పెను

ఓ భగవత్స్వరూపుడవైన తండ్రీ! సంస్కృతభాషను, శాస్త్రములను జదువుటకు దగిన ప్రజ్ఞ కొన్ని జాతులవారికి మాత్రమే యున్నదిగాని, యందరికిని లేదను వాక్యము సత్యమైనదా? కాదా? అను విషయమును తెలుపగోరుచున్నాను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**కింశబ్దేన తు తే గ్రాహ్యా బుద్ధిమన్తో భవ న్తి యే ।**
**పరం నై వైకజాతీయా గ్రాహ్యా నిష్పక్షపాతిభిః ॥** 35

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

ఓ యతివరా! కొందరు అను శబ్దముచే, పక్షపాతము లేని విశాల దృష్టి గలవారు బుద్ధిమంతులను శ్రద్ధగలవారినిమాత్రమే గ్రహించవలయును గాని యొకజాతివారిని మాత్రము గ్రహించకూడదు

**యుగేఽస్మిన్ నరనారీభిః సమ్యగ్వర్ణ చతుష్టయే ।**
**సంస్కృతాంగ్లాదిభాషాసు పాణ్డిత్యం కిం న లభ్యతే?॥** 36

ప్రస్తుత యుగములో నాలుగు వర్ణములందలి స్త్రీ పురుషులు సంస్కృతాంగ్ల భాషలయందును, (వ్యాకరణాది శాస్త్రములందును) చక్కని పాండిత్యమును సంపాదించుట లేదా?

**సమర్థస్యాపి చాధ్యేతుం నావకాశో భవేద్యది ।**
**కథం బుద్ధేర్వికాసస్స్యాన్మంజూషాస్థిత బీజవత్ ॥** 37

మంచి బీజమైనను పెట్టెలో నుంచినచో నదేలాగున అంకురించి వృక్షముగా నభివృద్ధిని బొందదో, యట్లే అధ్యయన సామర్థ్యమున్నవానికి కూడా చదువుట కవకాశము నివ్వకపోయినచో వారిబుద్ధి యెట్లు వికసించగలదు?

**కంఠాద్యవయవానాం హి సౌష్ఠవం యస్య విద్యతే ।**
**అక్ష్యాద్యుచ్చారణం తస్య సుకరం నాత్ర సంశయః ॥ 38**

వ్యాకరణ శాస్త్రమందు చెప్పబడిన అకార, కవర్గాద్యుచ్చారణము మంచి కంఠాద్యవయవములు గల వారందరకు సులభసాధ్యముగనే యున్న దను విషయము నిస్సందేహము

**అభ్యాసో యది విద్యేత విద్యాయాం బాల్యకాలతః ।**
**విద్యావన్తో భవేయుస్తే క్షిప్రం ప్రాక్తనవాసనాః ॥ 39**

పూర్వజన్మ విద్యాసంస్కారము గలవా రిజన్మములో బాల్యకాలము నుండి విద్యాభ్యాస తత్పరులై యున్నచో అచిరకాలములోనే గొప్పవిద్వాంసు లగుదురు

**అన్యథా మన్దవేగేన నాస్తి భేదోఽధికస్త్వితః ।**
**తస్మాన్నా స్తీశ్వరే దోషః కల్ప్యమానో జనైర్మృధా ॥ 40**

పూర్వజన్మవిద్యాసంస్కారము లేక వర్తమాన జన్మయందుగూడ బాల్యావస్థ దాటిన పిదప విద్యాభ్యాసమందు ప్రవేశించినవారు నెమ్మదిగా బహుకాలమునకు విద్యావంతు లగుదురు ఇంతకంటె నధికమైన భేదమే మియు లేదు కనుక వృధాగా అజ్ఞానులు కల్పించు దోషమేమియు పరమేశ్వ రునియందు లేదు

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥ 41**

**అశ్రద్ధధానాః పురుషాః ధర్మస్యాస్య పరన్తప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసార వర్త్మని ॥ 42**

**ఇత్యేతద్వచనైర్విద్యాప్రాప్త్యప్రాప్త్యధికారితా ।**
**గీతాయాం వాసుదేవేన ప్రోక్తా నిష్పక్షపాతినా ॥ 43**

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, అశ్రద్దదానాఃపురుషాః" ఇత్యాది

వచనములచే పక్షపాత రహితుడగు శ్రీకృష్ణభగవానుడు విద్యాప్రాప్త్యధికార మెవరికి గలదు, ఎవరికి లేదను విషయమును శ్రీమద్భగవద్గీతయందు స్పష్టముగా నుపదేశించెను అనగా శ్రద్ధ, ఆసక్తి, జితేంద్రియత్వము గలవారి కెవరికైనను జ్ఞానప్రాప్తి యున్నదనియు, నవి లేనివారి కెవరికైనను జ్ఞానప్రాప్తి లేదనియు భావము కనుక ఒకజాతికి సంబంధించినవారికే సంస్కృతాధ్యయన అధ్యాపన యోగ్యత యుండునని చెప్పుట శాస్త్రానుభవయుక్తి విరోధముగ నున్నది అందువలన పూర్తిగా నది యసత్యమేగాని సత్యము గాదని తెలిసికొనవలయును

**ఏకవర్ణమిదం పూర్వం పశ్చాద్దేవాసురౌ పునః ।**
**చాతుర్వర్ణ్యం తతో నానావర్ణాస్సమభవన్ కిల ॥ 44**

ఓ సాధుసత్తమా! సృష్ట్యాదిలో నొకేజాతి యుండెను తదుపరి దేవాసురభేదముచే రెండు విధములుగా జాతి యేర్పడెను పిదప నాలుగు వర్ణములుగా నేర్పడెను తరువాత క్రమముగా నానావర్ణము లేర్పడినవి

**చతుర్ణామపి వర్ణానాముత్పత్తిం క్రమశః శృణు ।**
**యుధిష్ఠిరేణ సంపృష్టో భీష్మః ప్రోవాచ భారతే ॥ 45**

మరియు శ్రీ మహాభారతమం దీచాతుర్వర్ణ్యోత్పత్తి విషయములో ధర్మరాజు భీష్మాచార్యులను ప్రశ్నించగా భీష్మాచార్యు లిట్లు చెప్పిరి

**ఏకవర్ణమిదం పూర్ణం విశ్వమాసీద్యుధిష్ఠిర! ।**
**కర్మక్రియావిశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥ 46**

ఓ ధర్మరాజా! సృష్ట్యాదిలో నీ విశ్వమందొకే ఆర్యజాతి యుండెను తదుపరి వారి వారి గుణకర్మలనుబట్టి నాలుగు వర్ణములుగా నేర్పడెను

**బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాన్ చతుర్వర్ణాన్ గుణాత్మకాన్ ।**
**విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః ॥ 47**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాలుగు వర్ణములున్న

క్రమముగా శుక్ల, రక్త, పీత, నీల గుణములనుబట్టి విభజింపబడినవి అనగా తెల్లని రంగుగలవారు బ్రాహ్మణులుగాను, ఎఱుపురంగు గలవారు క్షత్రియులుగాను, పచ్చని రంగుగలవారు వైశ్యులుగాను, నలుపురంగు గలవారు శూద్రులుగాను వ్యవహరించబడిరి

**శుక్లాదిగుణభేదేన వ్యవస్థేయం న యుజ్యతే ।**
**చతుర్ష్వపి చ వర్ణేషు దృశ్య న్తే శుక్లిమాదయః ॥ 48**

పైజెప్పిన శుక్లాది వర్ణభేదముచే చాతుర్వర్ణ్య వ్యవస్థ సంభవించదు కారణమేమన బ్రాహ్మణాది నాలుగు జాతులలోను నాలుగు రంగులు గలవారు గనబడుచున్నారు

**అత శ్శుక్లాదిశబ్దైస్తు లక్ష్యన్తే సాత్త్వికాదయః।**
**చాతుర్వర్ణ్యవిభాగోఽయం జ్ఞేయస్తదనుసారతః॥ 49**

కనుక శుక్లాదిశబ్దములవలన సాత్త్వికాది గుణములనే లక్షణావృత్తిచే గ్రహించి తదనుసారముగ చాతుర్వర్ణ్య వ్యవస్థను తెలిసికొనవలయును అనగా నిచ్చట శుక్ల రక్త పీతాసిత శబ్దములచే సత్త్వ, రజో, మిశ్ర, తమోగుణములను గ్రహించి సత్త్వాది గుణములు గలవారిని క్రమముగా బ్రాహ్మణాదులనుగా తెలిసికొనవలయును

**విస్తృత్య ధర్మశాస్త్రే హి తేషాం కర్మ సమీరితమ్ ।**
**ఏకస్మిన్నేవ వర్ణే తు చాతుర్వర్ణ్యం గుణాత్మకమ్ ॥ 50**

ఒకే మానవజాతియందు బ్రాహ్మణాది నాలుగు వర్ణములను గుణములచే విభజించి ఆయావర్ణమున కుచిత కర్మలను ధర్మశాస్త్రములయందు మహర్షులు విస్తారముగ నుపదేశించియున్నారు

**ఋజవశ్శుద్ధవర్ణాభాః క్షమావన్తో దయాళవః ।**
**స్వధర్మనిరతా యే స్యుస్తే ద్విజేషు ద్విజాతయః ॥ 51**

సన్మార్గగాములై, సా త్త్వికగుణము గలవారై, క్షమాశీలురై, దయావం

తులై, విహితకర్మానుష్ఠాన తత్పరులై ఎవరుండిరో వారందరు బ్రాహ్మణులలో బ్రాహ్మణులైరి

**కామభోగప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః ।**
**త్యక్తస్వధర్మారక్తాఙ్గాస్తే ద్విజాః క్షత్రతాం గతాః ॥** 52

విషయాసక్తులై, క్రోధముగలవారై, శౌర్యధైర్య సాహసములం దత్యన్త ప్రియులై, విహితకర్మలను విడచినవారై, రజోగుణప్రధానులై యున్న వారందరు క్షత్రియులైరి

**గోషు వృత్తిం సమాధాయ పీతాః కృష్యుపజీవినః ।**
**యేతు స్వకర్మవిముఖాస్తే ద్విజా వైశ్యతాం గతాః ॥** 53

గోసంరక్షకులై, కృషివలన జీవించువారై, సత్త్వ రజోమిశ్రిత గుణము గలవారై, విహితకర్మలను జేయనివారై యున్నవారందరు వైశ్యులైరి

**హింసానృతప్రియాః లుబ్ధాస్సర్వకర్మోపజీవినః ।**
**కృష్ణాః శౌచపరిభ్రష్టాస్తే ద్విజాః శూద్రతాం గతాః ॥** 54

ప్రాణిహింసాపరులై, అసత్యవాదులై, నీచస్వభావులై, నిషిద్ధకర్మానుష్ఠానపరులై, తమోగుణప్రధానులై, శౌచాచారభ్రష్టులై యున్న వారందరును శూద్రులైరి

**జాతిరేకా క్రమేణైవమేకస్మిన్నేవ జన్మని ।**
**గుణక్రియానిమి త్తేన నానాజాతిముపాగతా ॥** 55

ఈ ప్రకారముగా నొకేజాతి యొకే జన్మయందు గుణకర్మలను నిమిత్తముగా జేసికొని నానాజాతులుగా మారినది

**ఏకజాతిః కథం భేదచతుష్టయముపాగతా ।**
**ఇతి తే సంశయో మాభూస్తు గుణభేదేన యుజ్యతే ॥** 56

ఒకేజాతి నాలుగుజాతులుగా నెట్లు మారెనని సంశయింప నక్కర

లేదు ఏలనన గుణభేదముల ననుసరించి యట్టి మార్పు కలుగవచ్చును

**మహానుత్పద్య తేష్వేక ఉక్తలక్షణలక్షితాన్ ।**
**వ్యాహరన్ విప్రశబ్దేన కులమేకం వినిర్మమే ॥ 57**

మనుష్యులంద రొకేజాతిగ నుండు సమయమున నొకమహాపురుషు డుద్భవించి పై జెప్పిన బ్రాహ్మణగుణములు గలవారిని విప్రులని పిలుచుచు నొక బ్రాహ్మణకులము నేర్పరచెను

**శేషేష్వన్యస్సముత్పద్య శౌర్యాదిగుణినః పరమ్ ।**
**ఆహ్వాయన్ క్షత్రశబ్దేన నిర్మమే క్షత్రియం కులమ్ ॥ 58**

కొంతకాలమైన పిదప మిగిలినవారిలో మరియొక మహాపురుషుడు జన్మించి పైజెప్పిన క్షాత్రగుణములు గలవారిని క్షత్రియులని బిలుచుచు క్షత్రియజాతిని నిర్మించెను

**అవశిష్టేషు తేష్వేవ స్వకర్మత్యాగశీలిషు ।**
**వైశ్యశబ్దం ప్రయుఞ్జానో వైశ్యజాతిం వినిర్మమే ॥ 59**

తరువాత మరికొంత కాలమునకు మిగిలిన వారిలో మరియొక పురుషు డుద్భవించి పైజెప్పిన వైశ్యలక్షణము గలవారిని వైశ్యులని బిలుచుచు వైశ్యజాతిని నిర్మించెను

**అవశిష్టాశ్చ యే చాన్యే సర్వకర్మోపజీవినః ।**
**శౌచాచారపరిభ్రష్టాస్తే జనా శ్శూద్రతాం గతాః ॥ 60**

అందు మిగిలిన జనులు విధినిషేధములను పాటింపక సర్వకర్మలంజేసి జీవించుచు శౌచాచారములు లేనివారైనందున శూద్రులైరి

**యథా జినమునీన్ద్రస్య చోపదేశానుయాయినః ।**
**జైనా ఇతి సమాఖ్యాతా స్తథా బుద్ధానుయాయినః ॥ 61**
**బౌద్ధా ఇతి సమాఖ్యాతా ఏవం క్రీస్తానుయాయినః ।**

**క్రైస్తవా ఇతి విఖ్యాతాస్తథా నానక్ మతానుగాః ॥ 62**

**సిక్ఖశబ్దేన చ కథ్యన్తే దయానన్దానుయాయినః ।**
**ఆర్యసామాజికాః ప్రోక్తాస్సమాజోద్ధారహేతవః ॥ 63**

**శఙ్కరాచార్యసిద్ధాన్తవాదినోఽద్వైతిన స్తథా ।**
**మధ్వరామానుజాచార్యమతగా మాధ్వవైష్ణవాః ॥ 64**

**ఖ్యాతా మహమ్మదీయాశ్చ నబిసమ్మతయాయినః ।**
**ఏవమేవ హి వర్ణానాం స్యాద్వ్యవస్థేతి బుధ్యతామ్ ॥**
**ఇతోఽధికం పురాణేషు తత్ర తత్రావలోక్యతామ్॥ 65**

జైనమత ప్రవర్తకుండగు జినమహామునియొక్క యుపదేశముల ననుసరించినవారు జైనులనియు, బుద్ధోపదేశముల ననుసరించిన వారందరు బౌద్ధులనియు, క్రీస్తువు ననుసరించిన వారందరు క్రైస్తవులనియు, గురునానక్ యొక్క మతానుయాయులు సిక్కులనియు, దయానన్ద సరస్వతి మతము నవలంబించినవా రార్యసమాజము వారనియు, శంకరాచార్య మతావలంబులు అద్వైతులనియు, మధ్వాచార్య మతావలంబులు మాధ్వులనియు, రామానుజాచార్యుల మతము నవలంబించినవారు వైష్ణవు లనియు, మహమ్మదునబి మతము ననుసరించిన వారలు మహమ్మదీయు లనియు నెట్లు వ్యవహరింపబడిరో, అట్లే బ్రాహ్మణాది వర్ణవ్యవస్థయు తత్తద్గుణము, పురుషస్వభావము ననుసరించియే చేయబడినది ఇయ్యది పురాణములయందు విస్తారముగా తెలియబడును

**నిమ్నస్థితిమతాం పుంసామున్నతస్థితిగామినామ్ ।**
**నిరోధో నైవ కర్తవ్యో నాస్మిన్ పాపం భవిష్యతి ॥ 66**

ఉన్నతస్థితి కుచితయోగ్యతను సమాపాదించి దానిని గోరుచు ప్రస్తుతము క్రిందస్థితిలో నున్నవారిని తపోధ్యానాధ్యయనాది విషయములలో నడ్డుపెట్ట రాదు ఇందులో పాపమేమియు లేదు అందఱు నున్నతస్థితిని పొందగలరు

**కిన్తు మిశ్రవివాహేషు మిశ్రభోజనకర్మసు ।**
**నిర్బన్ధో నైవ కర్తవ్యో నాస్తి పాపం కృతేష్వపి ॥ 67**

కాని మిశ్రవివాహములందుగాని, మిశ్రభోజనములందు గాని నిర్బంధము చేయరాదు వారివారిష్టము ననుసరించి యవి యున్నను దోషము మాత్రముండదు

**అస్తి పాశ్చాత్యదేశేషు విభాగోఽయం చతుర్విధః ।**
**ప్రభుశ్రీమద్వణిక్భృత్యా ఇతి భేదముపాశ్రితః ॥ 68**

పాశ్చాత్యదేశములో గూడ 1 ప్రభువులు, 2 శ్రీమంతులు, 3 వ్యాపారస్థులు, 4 కూలివారనెడి నాలుగు బేదములున్నవి

**కేచిదాహురిదం కిన్తు న వ్యవస్థాఽత్ర తాదృశీ ।**
**యతో భృత్యోఽపి యత్నేన ప్రభుస్తత్ర భవిష్యతి ॥ 69**

ఇట్లని కొందఱు చెప్పుచున్నారు కాని భారతదేశమందలి వర్ణవ్యవస్థ పాశ్చాత్యుల వ్యవస్థవంటిది కాదు కారణమేమన పాశ్చాత్య దేశములలో నొకప్పుడు భృత్యుడుగా నుండినవాడు స్వప్రయత్నముచే ప్రభువు కావచ్చును

**ఏవం మహమ్మదీయేషు స న్తి సున్న్యాదినామభిః ।**
**చతుర్భేదా స్తథాఽప్యాత్మస్వాతన్త్ర్యం తన్మతే సమమ్ ॥ 70**

ఇదే విధముగనే మహమ్మదీయులలో గూడ షేక్, సున్ని, సయ్యద్, పఠాన్ అను నాలుగు తెగలున్నప్పటికిని వారి మతములో మతస్వాతంత్ర్య మందరికిని సమానముగా నున్నది

**వినైవ జన్మసంబన్ధం గుణైరాత్మని సంస్థితైః ।**
**బ్రాహ్మణాది విభాగోఽయం శ్రుతిస్మృతినిరూపితః ॥ 71**

జన్మసంబంధము లేకయే కేవల శమాదిగుణములచేత చతుర్వర్ణము లేర్పడినట్లుగ వజ్రసూచికోపనిషత్తునందును, భగవద్గీతయందును

జెప్పబడియున్నది

**చాతుర్వర్ణ్యవిభాగోఽయం స్వభావప్రభవైర్గుణైః ।**
**సమ్మతో వాసుదేవస్య జన్మపక్షేఽనవస్థితేః ॥** 72

నైసర్గికములైన శమాదిగుణములచేతనే బ్రాహ్మణాది నాలుగువర్ణము లేర్పడినవను విషయము శ్రీకృష్ణసమ్మతము కనుకనే శ్రీమద్భగవద్గీత అష్టాదశాధ్యాయమందు శ్రీకృష్ణభగవానులు బ్రాహ్మణత్వాది జాతుల విషయములో స్వాభిప్రాయము నీవిధముగ ప్రకటించిరి –

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాఞ్చ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల స్వరూపలక్షణములు వారివారి నైసర్గిక గుణములనుబట్టి ప్రత్యేకముగా విభజించి చెప్పబడినవని భావము బ్రాహ్మణత్వాది జాతుల నిరూపకములగు గుణము లేవియన–

శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥

నైసర్గికములైన అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపశ్శీలత, బాహ్యాభ్యంతరశుచి, ఓర్పు, ఋజుస్వభావము, జ్ఞానవిజ్ఞానములు, ఆస్తిక్యభావము మొదలగునవి గలిగియుండుటయే బ్రాహ్మణుని స్వరూపలక్షణము

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥

నైసర్గికములైన శూరత్వము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమున వెనుకకు పారిపోకుండుట, దానశీలత, ప్రజాపాలనము మొదలగు గుణములను గలిగియుండుటయే క్షత్రియుని స్వరూపలక్షణము

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥

నైజముగా కృషిగోరక్షవాణిజ్యాది కర్మశీలత్వము గలిగియుండుటయే వైశ్యుని స్వరూపలక్షణము నైసర్గికముగా పరుల నాశ్రయించి జీవించుటయే స్వభావముగా గలిగియుండుట శూద్రుని స్వరూపలక్షణము ఇదే విధముగనే శ్రీమద్భాగవత సప్తమస్కంధములో నేకాదశాధ్యాయమందును బ్రాహ్మణాదుల స్వరూపలక్షణములు జెప్పబడినవి

శమో దమస్తపశ్శౌచం సన్తోషః క్షాన్తిరార్జవమ్ ।
జ్ఞానం దయాఽచ్యుతాత్మత్వం సత్యఞ్చ బ్రహ్మలక్షణమ్ ॥

శౌర్యం వీర్యం ధృతిస్తేజస్త్యాగ ఆత్మజయః క్షమా ।
బ్రహ్మణ్యతా ప్రసాదశ్చ రక్షా చ క్షత్రలక్షణమ్ ॥

★ దేవగుర్వచ్యుతే భక్తిస్త్రివర్గపరిపోషణమ్ ।
ఆస్తిక్యముద్యమో నిత్యం నైపుణం వైశ్యలక్షణమ్ ॥

శూద్రస్య సన్నతిశ్శౌచం సేవా స్వామిన్యమాయయా ।
అమంత్రయజ్ఞో హ్యస్తేయం సత్యం గోవిప్రరక్షణమ్ ॥
(భాగ -7-11- 21, 22, 23, 24 )

ఈలాగున జన్మననుసరించిన వర్ణసిద్ధాంతము పై ప్రమాణములను బట్టి సిద్ధించుట లేదు

**స్వభావజపదేనాత్ర జన్మన్యస్మిన్నిసర్గజాః ।**
**గ్రాహ్యా జన్మాన్తరీయైస్తు గుణకర్మాదిభిర్యది ॥ 73**

**కల్ప్యమానే విభాగే హి క్షత్రియబ్రాహ్మణాదిభిః ।**
**రజస్సత్త్వతమోమిశ్రగుణైర్భావ్యం యథాక్రమమ్ ॥ 74**

''స్వభావప్రభవైర్గుణైః'' అను పాదమున కనేకు లనేకవిధములుగా నర్థములు చెప్పుటచే నీ శ్లోకమునం దాపాదమున కర్థమును వివరించుచున్నారు

---

★ దేవగుర్వనుగా భక్తిః –పాఠాంతరము

ఈ జన్మమందు నైసర్గికముగా కలిగెడి శమాదిగుణములనే స్వభావజ పదముచే గ్రహించుకొనవలయును జన్మాంతరీయ గుణములనే స్వభావ ప్రభవగుణపదముచే గ్రహించి తదనుసారముగా వర్ణవిభాగమును జేసినచో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు యథాక్రమముగా, సత్త్వ రజో మిశ్ర తమోగుణములు గలవారుగానే ఉండవలయును గదా!

**మయూరాదివిహఙ్గేషు గవాశ్వాదిషు జాతిషు ।**
**ప్రత్యక్షేణ యథా భేదో నైవం వర్ణేషు దృశ్యతే ॥ 75**

శుక పిక మయూరాది పక్షులయందును, గవాశ్వాది మృగములయందును, మత్స్యకచ్ఛపాది జలచరములయందును ప్రత్యక్షముగా నెట్లు ఆకృతిభేదము కనిపించుచున్నదో అట్లు బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములలో కనుపించుట లేదు

**సర్వత్ర దృశ్యతే నైవం వ్యభిచారస్తు దృశ్యతే ।**
**తస్మాజ్జన్మాన్తరగుణైర్విభాగో నోపపద్యతే ॥ 76**

కాని ఎక్కడను ఈ నియమము కనిపించుటలేదు నేడు బ్రాహ్మణులని వ్యవహరింపబడువారలలో రజోగుణ తమోగుణ ప్రధాను లెందరో గలరు ఆలాగుననే క్షత్రియ వైశ్య శూద్రులని వ్యవహరింపబడు వారలలోను సత్త్వగుణ ప్రధానులు, నిష్ఠాపరులు, పుణ్యకర్మానుష్ఠానతత్పరులగు వారెందరో గలరు కనుక జన్మాంతరీయ గుణముల నిక్కడ తీసికొన రాదు జన్మాంతరములో శమాది గుణములు లేనివారి కీజన్మములో స్వభావ సిద్ధముగ శమాదిగుణము లేర్పడవని యెవ్వరైన ననినచో అదిన్ని మేము కాదనముగాని యీ జన్మములో శమాది గుణములను బట్టియే పూర్వ జన్మమునందాయాత్మయం దాశమాది గుణముల ననుమానించెదము కనుక యిప్పుడెవరైతే శమదమాదులతో సత్యసంధులై తపశ్శీలురై యన్నిజాతులయందుగూడ నున్నారో, వారే గతజన్మలోగూడ నట్టి గుణములు గలవారుగ నుండిరని చెప్పవచ్చును ఇట్లు చెప్పినంత మాత్రమున

జన్మసంబంధమును కల్పించ నవసరము లేదు

**ఈశ్వరశ్చతురశీతిలక్షభేదేన సృష్టికృత్ ।**
**కథమాకృతిభేదేన బ్రాహ్మణాదీన్న సృష్టవాన్ ॥ 77**

ఇప్పుడు భగవత్కల్పితేత్యన్యే అనెడి పక్షమును అనగా నీ చాతుర్వర్ణ్య వ్యవస్థ భగవంతునిచే గల్పించబడినదనెడి వాదమును నిరాకరించుచున్నారు ఈ వాదమిదివరకే నిరాకరింపబడినది కాని యిచ్చట వ్యక్తముగా నిరాకరింపబడుచున్నది

ఈ వర్ణవిభాగ మీశ్వరకల్పితమైనచో నెనుబదినాలుగులక్షల జీవ రాసులను భిన్నభిన్నాకృతులతో సృజించిన సర్వశక్తుండగు పరమేశ్వరు డేల బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను భిన్నభిన్నాకృతి గలవారినిగ సృష్టించలేదు?

**తస్మాద్వర్ణవిభాగోఽయం నేశ్వరేణ ప్రకల్పితః ।**
**భగవత్కల్ప్యమానస్య నేక్ష్యతే పరివర్తనమ్ ॥ 78**

అందువలన జన్మ ననుసరించి యీ వర్ణవిభాగ మీశ్వరునిచే కల్పించబడినది గాదు మరియు భగవత్కల్పితమైన వస్తువున కెప్పుడు పరివర్తనము కనిపించుటలేదు

**విప్రక్షత్రియవిట్ఛూద్రజాతీనాం పరివర్తనమ్ ।**
**దృశ్యతే తు పురాణేషు విశ్వామిత్రస్య జాతివత్ ॥ 79**

కాని విశ్వామిత్రుని జాతివలె బ్రాహ్మణ క్షత్రియ విట్ఛూద్రజాతులకు పరివర్తనము పురాణములలో కనిపించుచున్నది

**కిఞ్చ తే మానవాస్సర్వే బుద్ధౌ జ్ఞానే తథా స్వరే ।**
**ఆకారే వ్యవహారే చ తథాఽవయవసౌష్ఠవే ॥ 80**

**ఉత్పత్తౌ మరణే చైవ వయస్యేవం ధనేఽపి చ ।**
**తుల్యరూపాస్సమీక్ష్యన్తే న తు భేదోఽత్ర దృశ్యతే ॥ 81**

మరియు జాతులన్నిటియందు బుద్ధిజ్ఞానములలోను, ఆకార వ్యవహారములలోను, అవయవ సౌష్ఠవమందును, జన్మమరణములందును, వయోధనములందును సమానులే కనుపించుచున్నారు గాని భేదమేమియు కనిపించుట లేదు.

**వర్ణసృష్టిర్గుణైః పూర్వజన్మనః కర్మభిర్యది ।**
**నానారుచిఫలోత్పాదకారకద్రుమవద్భవేత్ ॥ 82**

పూర్వజన్మ గుణకర్మలచే వర్ణములయొక్క సృష్టి యేర్పడినచో నది విభిన్నరుచులు గల ఫలవృక్షములవలె నుండవలయును.

**పనసో మధురం దత్తే ఫలమామ్లఞ్చ తిన్త్రిణీ ।**
**హరీతకీ కషాయఞ్చ తత్తత్కాలే స్వభావతః ॥ 83**

ఫలములను ఫలింపజేయు ఋతుకాలము సమీపించినపుడు స్వభావసిద్ధముగా పనసవృక్షము మధురఫలమును, చింతచెట్టు పులుపుఫలమును, కరకచెట్టు వగరుఫలమును, వేప ముష్టి మొదలయినవి చేదుఫలములను నెట్లిచ్చుచున్నవో యట్లే బ్రాహ్మణ యోనులయందు జన్మించిన వారందరు సత్త్వాది గుణప్రధానులై శమాదిగుణములు గల్గియుండవలయును గదా!

**శుక్ల పుష్పాది వృక్షేభ్యస్తత్తద్వర్ణాని చానఘ!।**
**ప్రజాయన్తే ప్రసూనాని న యాన్తి పరివర్తనమ్ ॥ 84**

మరియు ఓ పాపరహితుడా! శ్వేత రక్త పీతాది వర్ణముల పుష్పములు గల వృక్షములనుండి తత్తద్వర్ణములు గల పుష్పములే బుట్టుచున్నవిగాని పరివర్తన మెప్పుడును జెందలేదు.

**నైవం వర్ణేషు పశ్యామస్సత్త్వాద్యపరివ ర్తనమ్ ।**
**జన్మసంబన్ధమాత్రేణ బ్రాహ్మణక్షత్రియాదిషు ॥ 85**

కాని ఈ విధముగా జన్మసంబంధమాత్రముచే బ్రాహ్మణాది వర్ణములలో సత్త్వాది గుణముల కపరివర్తనము కనబడలేదు. అనగా పరివర్తన

మున్నదని భావము

**సత్త్వాదిగుణసద్భావశ్చతుర్వర్ణేషు దృశ్యతే ।**
**అతో జాతిర్గుణైర్జ్ఞేయా జన్మనా నేతి ఘుష్యతామ్ ॥ 86**

మరేమన సత్త్వాదిగుణములు నాలుగుజాతులయందును గనుపించు చున్నవి గనుక గుణములవలనే బ్రాహ్మణత్వాది జాతి, తెలుసుకొనదగినదే గాని జన్మచే తెలియదగినది గాదని నలుదిశలందును ఘోషించవలయును

**న స్త్యత్ర విషయే వేదశాస్త్రయు క్త్యనుభూతయః ।**
**లక్షశః కిన్తు విజ్ఞానామలమేతైరుదాహృతైః ॥ 87**

ఇక నీవిషయములో వేదశాస్త్రయుక్త్యనుభవరూప ప్రమాణములు లక్షలకొలది యున్నవి విజ్ఞులగువారి కింతకంటె నధికముగా జెప్పనవసరము లేదు

**చాతుర్వర్ణ్యవ్యవస్థాయాస్స్వరూపం సమ్యగీరితమ్ ।**
**యః పఠేచ్ఛృణుయాన్నిత్యం జాతిద్వేషాద్విముచ్యతే॥ 88**

చాతుర్వర్ణ వ్యవస్థయొక్క స్వరూపము చక్కగ నిరూపించబడినది దీని నెవడు ప్రతిదినము చదువునో లేక వినునో వాడు జాతిద్వేషమునుండి విముక్తుడై సర్వత్ర గౌరవింపబడును

**జాతినిర్ణయయోగోఽయం మానినే మన్దబుద్ధయే।**
**గర్వితాయ నరే వాచ్యః న కదాచిత్ప్రమాదతః ॥ 89**

ఈ జాతినిర్ణయయోగమును అహంకారియు, మందబుద్ధియు, గర్వితుడును అగువానికి పొరబాటున గూడ ఎన్నడును చెప్పరాదు

**ఉక్తశ్చేదవివేకాయ విప్లవస్స్యాత్తు ధార్మికః ।**
**తేన దూయేత చిత్తం హి సజ్జనానాం చ శాన్తిగమ్ ॥ 90**

అట్టి యవివేకపురుషులకు ఒక వేళ పొరబాటున చెప్పితివేని యీ ధర్మ

రహస్యమును కనుగొనజాలక గొప్పధర్మనాశమును గలుగజేసెదరు దానిచే మహాత్ములయొక్క శాన్తిమయమైన హృదయము క్లేశము నొందగలదు

**అనుక్తే వైపరీత్యం స్యాద్ధర్మో లోపముపైతి చ ।**
**తతో ధర్మ్యమిదం గుహ్యం వాచ్యం సదధికారిణే ॥** 91

ఓ యతివరేణ్యా! ఈ సందిగ్ధవిషయమును ఎవరికిని చెప్పకున్నచో లోకులకు విపరీతార్థము గలుగును, మరియు ధర్మమే లుప్తము గాగలదు కాన ధర్మగర్భితమగు నీరహస్యము నిరభిమానియై తత్త్వజిజ్ఞాసువగు నుత్తమాధికారికి మాత్రమే చెప్పదగినది

ఇతి శ్రీమలయాళ యతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
జాతినిర్ణయయోగో నామ షష్ఠోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
జాతినిర్ణయయోగమను షష్ఠాధ్యాయము సమాప్తము



# సప్తమోఽధ్యాయః

# మన్త్రవివరణయోగః

నారాయణానన్దగిరిరువాచ

**ప్రణవార్థవిశేషజ్ఞ! ప్రణవధ్యానతత్పర ।**
**ప్రణవాత్మన్! గురో! దేవ! ప్రణవార్థప్రబోధక! ॥ 1**
**మన్త్రధ్యానం ముముక్షూణామనుష్ఠేయం న వా హృది ।**
**మన్త్రం మోక్షప్రదం బ్రూహి మన్త్రతత్త్వార్థ దేశిక! ॥ 2**

నారాయణానన్దగిరి చెప్పెను

ప్రణవార్థమును చక్కగ గుర్తెరింగినట్టియు, నిరంతరము ప్రణవ ధ్యానమునందే లీనులైనట్టియు, ప్రణవస్వరూపులును, ముముక్షువులకు ప్రణవార్థమును బోధించునట్టియు, మన్త్రరహస్యమును బాగుగదెలిసి ఉప దేశించు నో గురుదేవా! బ్రహ్మనిష్ఠాసక్తులగు ముముక్షువులు ఏదేని మన్త్ర జపము ననుష్ఠింపవలయునా? అట్లు అనుష్ఠింపవలసియున్నచో ముక్తినొసగు ఆ మహామంత్ర మెయ్యదియో దయతో తెలుపుదురుగాక!

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**శుశ్రూషో! మన్త్రతత్త్వస్య మన్త్రమూర్తిర్భవాన్ కిల।**
**యతిధర్మానురక్తోఽసి కేయం మన్త్రార్థచిన్తనా॥ 3**

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

మన్త్రరహస్యమును వినగోరుచున్న నీవు సాక్షాన్మన్త్రస్వరూపుడవు గదా! యతిధర్మపరాయణుడవగు నీకేల యీ మన్త్రవిషయక జిజ్ఞాస గలిగినది?

**తథాఽపి [illegible]మాకర్ణ్య వేదసారం వదామ్యహమ్ ।**
**శృణు లోకహితాయైవ మంత్రచిన్తా చ సత్ఫలా ॥ 4**

అయినను నీ యీ ప్రశ్న నాలకించి వేదసారమగు మన్త్రరహస్యమును చెప్పెద వినుము సత్ఫలము నొసగు నీ మన్త్రార్థవిచారము లోకకల్యాణ కారకముగూడ గాగలదు

**మకారో మననం చైవ త్రకారస్త్రాణముచ్యతే ।**
**మననాచ్చ భవాత్త్రాణము క్తం మన్త్రార్థవేదిభిః ॥ 5**

మకారము మననమనియు, త్రకారము రక్షణమనియు నెరుంగుము మన్త్రార్థమననముచే భవమునుండి రక్షించునది అనగా భయంకరమైన జననమరణాది దుఃఖభూయిష్ఠమగు సంసారసాగరమునుండి తరింపజేయు నదియే మన్త్రమని మన్త్రార్థము నెఱింగిన మునులు చెప్పుచున్నారు

**సప్తకోటి మహామన్త్రమూర్ధన్యః ప్రణవః స్మృతః ।**
**ప్రణవేన వినా మన్త్రః ప్రాణహీనా యథా తనుః ॥ 6**

సప్తకోటి మహామన్త్రములలో అన్నిటికంటెను ప్రణవము శ్రేష్ఠమైనది మన్త్రముల కన్నిటికి ప్రణవము శిరస్సైనది (ప్రాణమువంటిది) ప్రణవరహిత మగు మన్త్రము ప్రాణములేని శరీరమువంటిదని తెలియుము

**ప్రణవశ్శిర ఇత్యాహుర్మన్త్రాణాం ఛన్దసామపి ।**
**తతో మన్త్రాశ్చ వేదాశ్చ వ్యర్థాః ప్రణవవర్జితాః ॥ 7**

సమస్తమన్త్రములకు, వేదములకు సైతము ప్రణవము శిరస్సు వంటిది (ప్రాణమువంటిది) కాన ప్రణవ రహితములగు మన్త్రములుగాని, వేదములు గాని నిష్ఫలములని గుర్తించుము

**తతః ప్రణవసంధానైర్మన్త్రాణాం విధిపూర్వకమ్ ।**
**జపధ్యానాది కర్తవ్యమితి శాస్త్రేషు దృశ్యతే ॥ 8**

కాన ఏ మన్త్రమునుగాని ప్రణవానుసంధాన పూర్వకముగ విధ్యుక్త ప్రకారము జపించవలయునని శాస్త్రములయందు కనిపించుచున్నది

**రామకృష్ణాది మన్త్రాణాం జపః ప్రణవపూర్వకః ।**

**ఆత్మసంస్కారమాశ్రిత్య వరో దేహభృతాం వర॥** 9

ఓ సాధకోత్తమా! వారి వారి సంస్కారము ననుసరించి శ్రీరామ, శ్రీ కృష్ణాది మన్త్రములను ప్రణవపూర్వకముగ జపించి వారి వారి యిష్టదైవములను ధ్యానించుట శ్రేష్ఠము

**అన్యేషామపి మన్త్రాణాం జపః ప్రణవపూర్వకః।**
**దత్తాత్రేయాది దేవానాముత్తమం ధ్యానమీరితమ్ ॥** 10

మఱియు దత్తాత్రేయ గణేశాది ఇతరమన్త్రములను గూడ ప్రణవానుసంధానపూర్వకముగ జపించుటయు, తత్తదిష్టదైవముల నేకాగ్ర చిత్తముతో ధ్యానించుటయు తదుపాసకులకు శ్రేయోదాయకము

**ఓం విష్ణవే నమ ఇతి సర్వదేవాలయేష్వపి।**
**అర్చనం దృశ్యతే లోకే సర్వత్ర విధిపూర్వకమ్ ॥** 11

లోకములో సర్వత్ర అన్ని దేవాలయములలోను ''ఓం విష్ణవే నమః ఓం శివాయనమః, ఓం రామాయ నమః, ఓం గౌర్యై నమః, ఓం సరస్వత్యై నమః ఓం శారదాయై నమః'' ఇత్యాది ప్రణవపూర్వక నామములతో పూజ జరుగు చుండుట కాననగును గదా!

**సముద్రవారిజా నద్యః ప్రవహన్త్యోఽఽంబుధిం పునః।**
**యాన్తి ప్రణవజం విశ్వం ప్రణవే హి విలీయతే॥** 12

సముద్రజలమే మేఘముగా మారి వర్షింపగా నేర్పడిన నదులు పృథివి యందు నెంతోదూరము ప్రవహించి కడకు సముద్రమునే చేరుచున్నవి గదా! అట్లే ప్రణవమునుండి యేర్పడిన యీ సమస్త చరాచర జగత్తు, తిరిగి ప్రణవమునందే లీనమగుచున్నది

**మన్త్రా బహ్వక్షరాశ్చేత్ఫలదా ఇతి భావనా।**
**మన్దానాం దృశ్యతే కింతు న్యూనాక్షరసమో న హి॥** 13

అజ్ఞులగు మన్దాధికారులు అధికబీజాక్షరములతో గూడిన మన్త్రములే

యెక్కువ ఫలము నిచ్చునవని తలంతురు కాని అల్పాక్షరయుతమగు మన్త్ర ముతో సాటియైనది వేరేదియు లేదు

**న్యూనాక్షరయుతం మన్త్రం ధ్యానయోగ్యం విదుర్బుధాః ।**
**ధారణోచితమిత్యేతన్న విదుర్బాహ్యదృష్టయః ॥ 14**

మన్త్రగతములగు బీజాక్షరముల సంఖ్య తగ్గిన మంత్రము ధ్యాన ధారణలకు మిక్కిలి ఉపయుక్తమయినదిగా మన్త్రవేత్తలగు ఋషులు తలంతురు కాని బాహ్యదృష్టిగల మన్దమతులు ఈ సత్యమును గుర్తింపరు

**పఞ్చాక్షరాది మన్త్రాణాముపాస్తి రుచితా నృణామ్ ।**
**ప్రణవేన చ సంధానమభ్యాసే చ విశిష్యతే ॥ 15**

విశేషించి సాధకులు పంచాక్షర అష్టాక్షరాది మన్త్రములను ప్రణవ పూర్వకముగా అనుసంధానించుట అభ్యాసకాలమున విశిష్టమై యున్నది

**అన్తే వాచ్యార్థముత్సృజ్య లక్ష్యే చ సుదృఢో భ వేత్ ।**
**శ్రుతిరప్యాహ నిశ్శబ్దో బ్రహ్మేత్యాది వచస్తథా ॥ 16**

చిరకాలము మన్త్రజప మొనర్చిన పిదప చివరకు వాచ్యార్థమునుగూడ పరిత్యజించి, ధ్యేయురూపమగు లక్ష్యార్థమునందే దృఢముగ నిలచి ధ్యేయాకారముగనే మారవలయును కనుకనే శ్రుతిగూడ ''నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే'' అనగా శబ్దశూన్యస్థితియే బ్రహ్మమను వాక్యమును అట్లే చెప్పినది

**నై వ బ్రహ్మ సమాప్నోతి ప్రకృతేర్విలయం వినా ।**
**నాస్తి శాన్తిర్హి ప్రకృతేరీశ్వరానుగ్రహం వినా ॥ 17**

**సోఽపీష్టభావనాగమ్యో భావనా మన్త్రపూర్వికా ।**
**అతః ప్రకృతినాశార్థం కురు మన్త్రార్థచిన్తనమ్ ॥ 18**

ప్రకృతి సమూలముగ నశించనిదే బ్రహ్మప్రాప్తి గలుగదు ఈశ్వరాను గ్రహము లేనిదే ప్రకృతి లయమొందదు ఈశ్వరానుగ్రహమో తమ యిష్టదైవ మును భావించిననే గలుగును ఆభావనయున్ను మన్త్రజపపూర్వకముగనే

సిద్ధించును అందుచే ప్రకృతి నాశము కొఱకు మంత్రార్థ చింతనము చేయుము

**మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్ ।**
**ఇతి శ్రుతి స్తతో యత్నం కుర్యాత్ప్రకృతినాశనే ॥ 19**

మాయయే ప్రకృతియనియు, ఆ మాయను వశీకృత మొనర్చు కొనుటచే మాయి యీశ్వరుడనియు శ్రుతి చెప్పుచున్నది కాన ప్రకృతిని నశింపజేయుటకై ప్రయత్నింపుము

**ఈశానుగ్రహదూరస్య మాయాకబళితస్య చ।**
**విఘ్నా బహువిధాః పుంసః పురోగమనబాధకాః॥ 20**

దైవకృపకు దూరుడై మాయాక్రాన్తుడగు సాధకునికి ఈశ్వరాను గ్రహము గలుగని కారణముచే పురోగమన బాధకములగు అనేక విఘ్నములు గలుగును

**ధ్యేయే వస్తుని దార్ఢ్యాయ పాపోపశమనాయ చ ।**
**ఇష్టమన్త్రం జపేద్గాఢమాత్మశుద్ధ్యర్థమేవ చ ॥ 21**

ధ్యేయవస్తువునందలి దృఢత్వముకొఱకును, పాపశాన్తికొఱకును, ఆత్మశుద్ధికొఱకును ఇష్టమన్త్రమును దృఢముగ జపించవలెను

**ధ్యేయాకారస్థితౌ ధ్యాతా స్వయం మన్త్రార్థరూపతామ్ ।**
**సర్పః కంచుకవన్మన్త్రం ముక్త్వా యాతి న సంశయః ॥ 22**

పాము కుబుసమును విడచినటుల ధ్యాత మంత్రజపముచే ధ్యేయా కారస్థితిని పొందగా, వాచకమగు మన్త్రమును వదలి స్వయముగ మన్త్రార్థస్వరూపమును పొందుచున్నాడు ఇందు సందేహము లేదు

**అండగో విహగః పక్వో భగ్నాండో నిజ రూపతామ్ ।**
**యాత్యేవమేవ పక్వోఽపి ధ్యాతా ధ్యేయైకరూపతామ్ ॥ 23**

గ్రుడ్డులోనున్న పక్షి పరిపక్వము నొందినదై ఆవరణము భగ్నము కాగా తననిజస్వరూపమును బొందునట్లు, సాధకుడును మన్త్రజపముచే విశుద్ధాన్తఃకరణుడై మన్త్రార్థ మననము పరిపక్వమయి మూలాజ్ఞానము నశించి ధ్యేయైకస్వరూపుడగుచున్నాడు

**ప్రత్యక్షః ప్రణవో నిత్యం నాస్తికానామ పీహ యత్ ।**
**స్థిత్వా చ నిర్జనే దేశే కర్ణరన్ధ్రే పిధాయ చ ॥ 24**

**అంగుల్యగ్రేణ సర్వోఽపి నిశ్చిన్తో బ్రహ్మభావనః ।**
**ప్రణవబ్రహ్మనాదన్తు సుస్పష్టం శృణుయాద్ధ్రుఢమ్ ॥ 25**

ఓంకారము నాస్తికులకు సైతము నిత్యప్రత్యక్షమైనది ఎట్లన నిర్జన ప్రదేశమున కూర్చొని నిశ్చల మనస్కుడై బ్రహ్మభావన చేయుచు చూపుడు వ్రేళ్లతో రెండు చెవులను మూసినచో ప్రతిఒక్కరును తనలో వెలుగుచుండు ప్రణవబ్రహ్మముయొక్క మనోహర నినాదమును స్పష్టముగ వినవచ్చును ఇయ్యది అందరికిని సులభమే గదా!

**ప్రణవస్య సముద్ఘోషాత్సర్వేషాం హృదయేష్వపి ।**
**ప్రణవబ్రహ్మరూపా హి సర్వే జీవాస్సునిశ్చితాః ॥ 26**

**విశ్వస్యతే కథం నేదం విశ్వం చ ప్రణవాత్మకమ్ ।**
**ప్రత్యక్షం నిరపేక్షం స్యాత్ బ్రహ్మైవేదమితి శ్రుతిః ॥ 27**

సమస్త ప్రాణుల హృదయములందు ప్రణవధ్వని అనవరతము ఘోషించుచున్నందున జీవులందరును ప్రణవ బ్రహ్మస్వరూపులే యనుటలో సందియ మేమున్నది సర్వథా నిశ్చితమగు నీ సత్యమును ఏల నమ్మరు? ప్రపంచ మంతయు ప్రణవబ్రహ్మస్వరూపమే ప్రత్యక్ష ప్రమాణము నిరపేక్షమైనది అనగా దీని కన్యప్రమాణముతో అవసరము లేదు స్వతః ప్రమాణమని భావము ''బ్రహ్మైవేదం సర్వం, ఓంకారమే వేదం సర్వం'' ఇత్యాది శ్రుతులును చరాచర ప్రపంచమంతయు ప్రణవ బ్రహ్మస్వరూపమే అని వచించుచున్నవి

**పృథివ్యాదీని భూతాని సూచయన్తి పునః పునః ।**
**ప్రణవబ్రహ్మనాదం హి స్వస్వకార్యరతాని చ ॥ 28**

తమతమ కార్యములందు వ్యగ్రములైన పంచమహాభూతములుగూడ అనుక్షణ మీ ప్రణవబ్రహ్మ నాదమునే తెలుపుచున్నవి

**మేఘాగ్ని వాతనినదాః ఘంటాకర్దభువాం రవః ।**
**అబ్ధినిర్ఝరిణీఘోషో వేదఘోషస్తథైవ చ ॥ 29**

**అనుకుర్వన్తి తన్నాదమధ్యక్షం కిం న పశ్యసి ।**
**ప్రణవం బ్రహ్మరూపం హి సముపాస్స్వ సునిశ్చితమ్॥ 30**

మేఘము, అగ్ని, వాయువు, గంట, కర్దమము, పృథివి –వీటియొక్క ధ్వనియు, సెలయేళ్లయొక్క ధ్వని, సముద్రఘోష, వేదఘోష- యివన్నియు ప్రత్యక్షముగ ఆ ఓంకారధ్వనినే అనుకరించుచుండుట యేల గమనించుట లేదు? ప్రతిధ్వనియందును నిశ్చలచిత్తముతో గమనించి చూచిన ప్రణవనాదము గోచరించును కాన సమస్తసృష్టికి కారణభూతమై బ్రహ్మస్వరూపమగు ప్రణవమును నిశ్చల మనస్కుడవై ధ్యానింపుము

**శిబికావాహకా మూఢా స్స్కన్ధభారాపనాయ వై ।**
**ఓమిత్యుచ్చార యన్తశ్చగచ్ఛన్తో న విదుర్దురమ్ ॥ 31**

**వినైవార్థవిచారేణ కిముతార్థవిచి న్తనే ।**
**తజ్జపే భవభారశ్చ ద్రుతమేవాపగచ్ఛతి ॥ 32**

పల్లకీని మోయు మూఢులైన బోయలు స్వభారజనిత శ్రమను మరచుటకై అర్థవిచారములేకనే ఓం ఓం ఓం అని ప్రణవనాద మొనర్చుచు అణుమాత్రమేని భారమువలని శ్రమ తెలియకయే యెంతదూరమైనను నడచి గమ్యమును జేరుచున్నారు ఇక అర్థానుసంధాన పూర్వకముగ భావన చేసిన యెట్టి ఫలము గలుగునో చెప్పవలయునా! అట్లు అర్థసహితముగ భావనచేసి ప్రణవమును జపించినచో భవభారమంతయు శీఘ్రమే తొలగిపోవును

**తథైవ రజకో నిత్యం వస్త్రప్రక్షాళనే ముహుః ।**
**ఓం ఓం ఓమితి నాదేన నైవ విన్దతి తచ్ఛ్రమమ్ ॥**

మఱియు చాకలి ప్రతిరోజు ఎండలో గుడ్డల నుతుకునపుడు శ్రమ తెలియకుండుటకై ఓం ఓం ఓం ఓం అని ప్రణవనాద మొనర్చుచు కొంచె మైనను కష్టమును పొందనే పొందడు ఈ విషయము మనము చూచుచునే యున్నాము గదా!

**ఏవమర్థవిచారేణ ప్రణవధ్యానతత్పరః ।**
**భవబన్ధాచ్చ నిర్ముక్తో కుర్వన్నపి న లిప్యతే ॥ 34**

కాన అర్థభావనా పూర్వకముగా ప్రణవమును నిత్యము నిశ్చల చిత్తముతో ధ్యానించువాడు భవసాగరమునుండి తప్పక విముక్తు డగును మఱియు అట్టి ఉత్తమ సాధకుడు కర్మలను చేయుచుండినను బద్ధుడు గాడు

**ప్రత్యక్షాదిప్రమాణాని పూర్వోక్తాన్యత్ర నిశ్చితమ్ ।**
**ఆపామరసువేద్యాని ప్రణవోచ్చారణం పునః ॥ 35**

**నిషిధ్యతే కథం త్వద్య నిశ్చినుధ్వం హి పండితాః ।**
**కింశ్రేణిగా నిషేద్ధారః పండితాస్సమదర్శినః ॥ 36**

ఈ పైన పేర్కొన్న అనేక ప్రత్యక్ష ప్రమాణములు పామరులకు పండి తులకు సైతము స్ఫుటముగ నర్థమగునవిగదా! అట్టితరి ఒకరు ప్రణవమును ఉచ్చరించవచ్చును మఱియొకరు ఉచ్చరించరాదని యేల నిషేధించెదరు? ఇటుల నిషేధించువారలు ఏతరగతికి చెందినవారు? పండితులే నిర్ణయిం తురుగాక పండితులు సమదర్శులు గదా!

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 37**

**ఇత్యర్జునకృతే తత్త్వం బోధితం నానుపశ్యసి ।**
**యచ్ఛబ్దస్య ప్రయోగేన సర్వేఽత్ర స్మరణార్హకాః ॥ 38**

మరణ మాసన్న మయిన సమయమున మనుష్యుడు పరమాత్మ నెటుల ధ్యానింపవలయునని అర్జునుడు శ్రీకృష్ణభగవానుని అడుగగా శ్రీకృష్ణభగవాను డిచ్చిన సమాధానమిది - మరణ మాసన్నమయిన సమయమున అద్వయ ప్రణవబ్రహ్మ స్వరూపుడనగు నన్ను అనగా మదభిన్నమగు ఓంకారమును స్మరించుచు నెవడు శరీరత్యాగ మొనర్చునో అట్టి ఉత్తమభక్తుడు పరమగతిని లేక మోక్షమును పొందును శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి బోధించిన యీ తత్త్వోదేశమును ఏల గ్రహింపరు? ఇచట యఃప్రయాతి అను యచ్ఛబ్దప్రయోగముచే ప్రణవోచ్చా రణము చేయువాడెవడైనను అను అర్థము లభించుటచే సర్వులు ప్రణవోచ్చా రణమునం దర్హులని బోధపడుచున్నది

**భేదస్య హి వివక్షా చేత్కథయేత్తచ్చ శబ్దతః ।**
**విధానమాత్ర నిర్దేశాద్యోగ్యతాఽత్ర ప్రదర్శితా ॥ 39**

స్త్రీ పురుషాదిభేదముగాని, వర్ణాశ్రమాది వ్యవస్థగాని యిచట వివక్షిత మగుచో శ్రీకృష్ణభగవానులట్టి భేదమును భేదసూచక శబ్దముద్వారా స్పష్ట ముగ దెలిపియుండెడివారు ఇచట అట్టి శబ్దమేదియు లేనందునను, మఱి ''సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ'' అనగా సమస్త ఇంద్రియ ముల సంయమమొనర్చి మనస్సును హృదయమున నిరోధించి- అని విధిమాత్రమే చెప్పియుండుటచే, వాడువీడను భేదము లేక కేవలము యోగ్యత (పూర్వోక్తవిధాన యోగ్యత) మాత్రమే నిరూపింపబడినదని యెరుంగుము

**సర్వవేదేషు యద్వేద్యం తపాంసి యదవాప్తయే ।**
**బ్రహ్మచర్యం చ తద్వస్తు ప్రణవేనాభిధీయతే ॥ 40**

**ఏవముక్తం హి గీతాయాం మాహాత్మ్యం ప్రణవస్య చ ।**
**కారకే గారుడే చైవ ప్రోక్తం ప్రణవసత్ఫలమ్ ॥ 41**

అన్ని వేదములందును దెలియదగిన వస్తువేదియో, దేనిని పొందుటకై

తపశ్చర్యాదులు, బ్రహ్మచర్యము మొదలగు అనుష్ఠానములు విధింపబడినచో, అట్టి సద్వస్తువు ప్రణవముచే చెప్పబడుచున్నది ఈవిధముగ గీతయందును. కఠోపనిషత్తునందును, గరుడపురాణమునందును ప్రణవ మాహాత్మ్యము ప్రణవఫలము బహువిధములుగావర్ణింపబడినది

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥ 42**

**ఏతదాలమ్బనం శ్రేష్ఠ మేతదాలమ్బనం పరమ్ ।**
**ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥ 43**

**ఏవం హి శ్రుతయో బహ్వ్యః స్తువన్తి ప్రణవం ముహుః ।**
**ఆలమ్బనం సహాయోఽత్ర పంగుర్గమనవంచితః ॥ 44**

**యథా పరం సమాలంబ్య గచ్ఛల్లక్ష్యమవాప్నుయాత్ ।**
**తథైవ నిర్గుణ ధ్యానే శక్తిహీనశ్చ సాధకః ।**
**అముం ప్రణవమాలంబ్య పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 45**

ఈ ఓంకారమే అక్షరమగు పరబ్రహ్మ ఈ ఓంకారమే అక్షరమగు పరమపదము అక్షరమగు ఈ ఓంకారమును అనగా పరబ్రహ్మమును తెలుసుకొన్నచో ఎవని కేది అభీష్టమో వాడు దానిని పొందగలడు. అనగా ఆత్మజ్ఞాని ఆప్తకాము డగునని భావము మఱియు నీ ఓంకారమే సాధకులకు ఉత్తమోత్తమమగు ఆధారము,సహాయకమును, ఈ ఉత్తమాలమ్బనమగు ఓంకారమును లేక ప్రణవబ్రహ్మను దెలిసికొని బ్రహ్మలోకములో గూడ పూజ్యాడగుచున్నాడు (బ్రహ్మప్రాప్తి కర్హుడగుచున్నాడు) ఇట్లు అనేక శ్రుతిస్మృతులు ప్రణవమును వివిధ రీతుల స్తుతించుచున్నవి ఇచట ఆలంబనమనగా సహాయమని గ్రహింపవలయును నడువ శక్తి లేనివాడు ఇతరుని చేయిపుచ్చుకొని వాని సహాయముతో మెల్లగ నడచుచు నిశ్చితస్థాన మెటుల జేరుచున్నాడో, అట్లే నిర్గుణమగు పరబ్రహ్మమును భావింప శక్తిలేనివాడు ఈ ఓంకారము నవలంబించి క్రమశః పరబ్రహ్మమును పొందునని భావము

**కాశీపతిః కారుణికః కరాభ్యా మాదాయ మూర్ధానమతీవ తాసామ్ ।**
**ఆగమ్య వేగాద్యుగపచ్చ తాసా మోంకార మోంకారయతి స్మ కర్ణే ॥ 46**

**ఇతి మాఘే పురాణే చ ప్రోక్తం కాశ్యాం మృతా భువి ।**
**సాక్షాచ్ఛివోపదిష్టేవ ప్రణవేన తర న్తి హి ॥ 47**

కరుణామయుడగు కాశీపతి పరమేశ్వరుడు శ్రీ కాశీక్షేత్రమందు మరణాసన్న లగు వనితామణుల వద్దకు పరుగెడివచ్చి వారి శిరస్సును రెండు చేతులతో పట్టుకొని వారి దక్షిణకర్ణమున ఓం ఓం అని ప్రణవమన్త్రము నుపదేశించేనని మాఘపురాణమున గలదు కాశీవాసులు పరమశివునిచే ఉపదేశింపబడిన యీ ప్రణవమన్త్ర ప్రభావముచే ముక్తులగుచున్నారు గదా! ప్రణవమే పరమ శివుం డుపదేశించు తారకమన్త్రము

**శివవిష్ణ్వాదయో లోకాన్సముద్ధర్తుం సమీహయా ।**
**ప్రణవం సంస్తువన్త్యేవం కుతస్సంశేరతే జనాః ॥ 48**

శివ విష్ణ్వాది దేవతలుగూడ మానవకోటి నుద్ధరింపదలచి భేదభావము లేక ప్రణవము నుపదేశించుచుండ జనులు సంశయింతు రేల?

**న ప్రమాద్యేన్నిజాచారే ప్రణవధ్యానతత్పరః ।**
**యథై వౌషధ సంసేవీ పథ్యే వైద్యప్రచోదితే ॥ 49**

అయితే యీ ప్రణవోపానకు లుత్కృష్టమగు నీ యుపాసన కనువగు ప్రమాదములేని ఉత్తమాచరణము గలిగియుండవలయును ఔషధమును సేవించు రోగి వైద్యుడు చెప్పిన పథ్యమును నియమము తప్పక ఆచరించునటుల ప్రణవోపాసకుడును సదాచరణపరుడై శాస్త్రోక్త ప్రకార మనుష్ఠానము గలిగియుండవలయునని భావము

**ఆత్మానం ప్రకృతౌ లీనముద్ధృత్య పరమాత్మతామ్ ।**
**గమయత్యేష ఓంకారస్తస్మాత్ప్రణవనామభాక్ ॥ 50**

ప్రకృతిబంధమున చిక్కుకొని సంసారసాగరమున మునిగియున్న

జీవుని ఉద్ధరించి పరమాత్మప్రాప్తిని కలుగజేయుటచే దీనికి ప్రణవమని పేరు

**యస్య ధ్యానాత్పరామూర్ధ్వామాప్నువ న్తి గతిం జనాః ।**
**ఊర్ధ్వాభిగమనాదాహురోంకారం తత్త్వచిన్తకాః ॥** 51

ఏప్రణవధ్యానముచే సాధకజనులు ప్రకృతి రహితులై శ్రేష్ఠమగు ఊర్ధ్వగతిని అనగా మోక్షమును బొందుచున్నారో, అట్టి ప్రణవమును ఊర్ధ్వగతిని పొందించుటచే తత్త్వవేత్తలు ఓంకారమందురు

**ఓంకారప్రభవా వేదా ఓంకారప్రభవాస్స్వరాః ।**
**ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ॥** 52

వేదములు, స్వరములు (అక్షరములు), చరాచరాత్మకమగు యావత్ప్రపంచము (మూడులోకములు), అంతయు నీ ఓంకారము నుండియే యావిర్భవించినవని యెరుంగుము

**ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥** 53

ప్రణవము ధనుస్సు, ప్రత్యగాత్మ శరము, అనగా బాణము, పరబ్రహ్మయే లక్ష్యము కాన సాధకుడు ధనుర్విద్యాభ్యాసివలె అప్రమత్తుడై లక్ష్యవేధనము చేయువలయును ఏకాగ్రచిత్తముతో లక్ష్యభూతమగు పరమాత్మను ధ్యానింపవలయును అప్పుడు ధ్యాత ధ్యేయాకారముగా మారును

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥** 54

ఆత్మను అధరారణిగను, ప్రణవమును ఉత్తరారణిగను చేసి ధ్యానమను మంథానముచే నిరంతరము మథించినచో తనలో నిగూఢమై యున్న స్వయంజ్యోతి స్స్వరూపాత్మ స్వయముగనే సాక్షాత్కరించునని భావము

**యావజ్జీవం జపేన్మన్త్రం ప్రణవో బ్రహ్మణో వపుః ।**

**సర్వేషాం చై వ మన్త్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే ॥** 55

ప్రణవము బ్రహ్మకు శరీరమువంటిది కాన ఓంకారమును జీవితాంతమువరకు జపించవలయును ప్రణవము అన్ని మన్త్రములకు ప్రాణమువంటిదని వేదములు చెప్పుచున్నవి

**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ।**
**ప్లుతస్తు సర్వసిద్ధ్యై స్యాత్ప్రణవస్త్రివిధః స్మృతః ॥** 56

హ్రస్వస్వరముతో గూడిన ఓంకారము సమస్తపాపములను దహించును దీర్ఘయుక్తమగుచో మోక్షమును గలుగజేయును మఱి ప్లుతస్వరయుక్తమగుచో సర్వము సిద్ధించును ప్లుతమనగ మూడుమాత్రల కాలము అనగ నెక్కువ దీర్ఘముగ ఓంకారము నుచ్చరింపవలయునని భావము ఈవిధముగ ఓంకారము మూడు విధములుగ విభజింపబడినది

**ప్రణవో హి వరం బ్రహ్మ ప్రణవః పరమం పదమ్ ।**
**ప్రణవం సర్వవేదాద్యం సర్వవేదమయం విదుః ॥** 57

ప్రణవమే పరబ్రహ్మము ప్రణవమే పరమపదము, అనగా మోక్షము, సమస్త వేదములకును ఆదిభూతమైనది ఓంకారమును సర్వవేదస్వరూపముగాను విజ్ఞులెరుంగుచున్నారు

**కైవల్యే ముండకే చైవమన్యవేదా న్తసూక్తిషు ।**
**ప్రణవస్సంస్తుత స్తస్మాద్ధ్యాయేచ్చ ప్రణవం ముహుః ॥** 58

కైవల్యోపనిషత్తునందును, ముండకోపనిషత్తునందును, మరి యితర శ్రుతులందును ప్రణవము బహువిధములుగ స్తుతింపబడినది కాన ముక్తిదాయకమగు నీ మహామన్త్రమును అనుదినము ధ్యానింపవలయును

**ప్రణవార్థః పరబ్రహ్మ ప్రత్యక్షం ధ్యాయినాం సదా ।**
**అనభ్యాసే పరోక్షం స్యాత్ సంస్మరేత్ప్రణవం తతః ॥** 59

ప్రణవార్థస్వరూపమగు పరబ్రహ్మమును నిరంతరము ధ్యానించువారికి

బ్రహ్మము హస్తామలకమువలె ప్రత్యక్షముగ నుండును నిరంతరాభ్యాసము లేనిచో అట్టివారి కియ్యది పరోక్షముగనే భాసించును కాన బ్రహ్మస్వరూపమగు ప్రణవమును నిత్యము ధ్యానించు చుండవలెను

**తిలే తైలం దధిన్యాజ్యమపో భువి యథాఽనలమ్ ।**
**కాష్ఠే ప్రయత్నాద్ధృష్ట్యాద్దేహే దేహినమాత్మవిత్ ॥ 60**

నువ్వులలో నూనెయు, పెరుగునందు నేయియు, భూమియందు నీరున్ను, కొయ్యలో నిప్పున్ను నిగూఢమై యున్నను, మానవుడు వాటిని ప్రయత్నముచే మథించి బయటికి తీసి ఎటుల తన నిత్య వ్యవహారోపయుక్తములైన వాటినిగ జేసుకొనుచున్నాడో, అటులే ముముక్షువును ధ్యానాద్యనుష్ఠానములచే నీ పాంచభౌతిక శరీరమునుండి ఆత్మను వేరుపరచవలయును అపుడే ఆత్మజ్ఞాని కాగలడు

**పుష్పాద్గంధం రసం చేక్షోశ్శిలాయాస్స్వర్ణమేవ చ ।**
**పృథగాదీయతే యత్నాత్తథా ధ్యానాదిసాధనైః ॥ 61**

**వివిచ్య దేహినం దేహాత్పశ్యేజ్జీవం శివాత్మనా ।**
**నిర్వాణం పరమం హ్యేతత్కైవల్యం చేదమేవ హి ॥ 62**

మఱియు పుష్పమునుండి గంధమును, చెరుకునుండి రసమును, శిలనుండి స్వర్ణమును ప్రయత్నముచే వేరుచేయునటుల, ధ్యానాదిసాధనలతో నీ భౌతికదేహముకంటె జీవాత్మ వేరని గ్రహించి, నిదిధ్యాసనాదులద్వారా జీవాత్మను పరమాత్మస్వరూపునిగనే దర్శింపవలయును ఇట్టి అభేదజ్ఞానమే, జీవబ్రహ్మాభేదబుద్ధియే పరమనిర్వాణము కైవల్యమన్నగూడ నిదియే

**ప్రణవం మన్త్రరాజం హి జపన్మన్త్రార్థభాగ్భవేత్।**
**మన్త్రార్థబోధకాభావాల్లోకోఽధః పతితశ్చిరమ్॥ 63**

మన్త్రరాజమగు ప్రణవమును జపించి మన్త్రార్థ స్వరూపుడవు గమ్ము ఈ మన్త్రార్థమును తెలిసికొని లోకమున బోధించువార లరుదైనందుననే

లోకము చిరకాలము నుండి అధఃపతితమై యున్నది

**మన్త్రాణాం జపయోగేన మన్త్రార్థస్య ప్రబోధనాత్ ।**
**లోకమోహవినాశేన భవ లోకస్య తారకః ॥ 64**

కాన పవిత్ర మన్త్రజపయోగముద్వారా మన్త్రార్థమును బోధించి లోకముయొక్క అజ్ఞానాన్ధకారమును బాపి లోకోద్ధారకుడవు గమ్ము

**కుర్యాచ్చ కర్మ నిష్కామం జపేచ్చ ప్రణవం ముహుః ।**
**పఠేచ్చోపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥ 65**

**వేదాన్తార్థవిచారోఽన్యశ్శ్రేష్ఠస్తేషు విశేషతః ।**
**ఆజీవితం తతః కాలం నయేద్వేదాన్తచిన్తయా ॥ 66**

చిత్తశుద్ధికొరకై నిష్కామపూర్వకముగా వేదోక్త కర్మల నాచరింపవలయును నిష్కామకర్మ ప్రణవజపములచే చిత్తశుద్ధి గలిగినపిమ్మట ఆత్మజ్ఞానప్రాప్తికై యుపనిషత్తులను పఠించుచూ వేదాన్తార్థముల విచారణ కావింపవలయును ఇందులో కడపటిదయిన యీ వేదాన్తార్థవిచారము పూర్వోక్తవిధానములలో విశేషించి శ్రేష్ఠమైనది కాన జీవితపర్యన్తము ముక్తిహేతువగు వేదాన్తవిచారము, ప్రణవజపము చేయుచు కాలము గడుపవలయును

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
మన్త్రవివరణయోగో నామ సప్తమోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీ మలయాళయతీన్ద్ర గీతయందు
మన్త్రవివరణయోగమను సప్తమాధ్యాయము సమాప్తము



# అష్టమోఽధ్యాయః

# తపఃప్రభావయోగః

శివచరణ ఉవాచ

**తపో హి నామ కిం తత్స్యాత్కే భేదాస్తస్య కీర్తితాః ।**
**కింతత్సర్వైరనుష్ఠేయం బ్రూహి మే తాపసోత్తమ! ॥** 1

శివచరణము చెప్పెను

తాపసోత్తమా! తపస్సనగానేమి, తపస్సెన్ని విధములు? దానినందఱు నాచరింపదగునా? దయతో వచింపుడు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**మునిచర్యా తపో నామ తత్తపోనామమాత్రతః ।**
**ఆధునాతనకాలీనా భీతిం విన్దన్తి మానవాః ॥** 2

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

వత్సా! తపస్సనగా మునిచర్య యగును తపస్సు (తాపసులు) అని విను నప్పుడే సామాన్యముగా వర్తమాన మానవులు భయపడుదురు

**పురాణనిచయే తావత్తాపసా నామ కేవలమ్ ।**
**పర్ణభక్షాః పయోభక్షా వాయుభక్షా హి వర్ణితాః ॥** 3

ఏలననగా పురాణములలో తాపసులు ఆకులను తినువారనియు, జలము ద్రావువారనియు, వాయుభక్షకులనియు వర్ణింపబడియున్నారుగదా

**శాస్త్రేష్వేవం వయం శృణ్మో మునయో మౌనధారిణః ।**
**వేదార్థాన్సకలాన్ జ్ఞాత్వా శిష్యేభ్యో బోధయ న్తి చ ॥** 4

శాస్త్రములలో మనమీలాగున ఋషులను గూర్చి వినుచున్నారము మహర్షులు మౌనవ్రతమును శీలించువారై, సకలవేదార్థముల నెఱింగి శిష్యులకొఱకు బోధించుచున్నారు

**కందమూలాదిఖాదన్తో బ్రహ్మప్రాప్త్యై జితేన్ద్రియాః ।**
**తపో యదనుతిష్ఠన్తి తద్ధి దుర్లభముచ్యతే ॥** 5

కందమూలాదులను భక్షించుచు జితేన్ద్రియులైన ఋషులు బ్రహ్మ ప్రాప్తికొఱకు చేయు తపస్సు మిగుల దుర్లభము ఇది యందఱికిని సాధ్యము గాదు

**మితాహారాది సంసేవ్య సాత్త్వికాస్తత్త్వశాలినః ।**
**బ్రహ్మాప్త్యై యత్తు కుర్వ న్తి సాత్త్వికం తత్తపస్స్మృతమ్ ॥** 6

మితాహార, మితనిద్రాదులను సేవించుచు తత్త్వవిచారముతోగూడి బ్రహ్మప్రాప్తికై యాచరింపబడు తపస్సు సాత్త్విక తపస్సని చెప్పబడుచున్నది

**ఆత్మబోధం వినా యత్తు దమ్భమాత్సర్య సంయుతమ్ ।**
**శరీరేన్ద్రియసన్తాపి రాజసం తత్ప్రకీర్త్యతే ॥** 7

ఆత్మబోధములేక దమ్భమాత్సర్యాదులతో గూడుకొని శరీరేన్ద్రియములను తపింపజేయు (శోషింపజేయు) తపసు రాజసమని వచింపబడుచున్నది

**యేన బ్రహ్మాదిదేవాంశ్చ వశీకృత్య వరానపి ।**
**ప్రాప్య సంతాపయంతీదం జగత్తత్తామసం భవేత్ ॥** 8

ఏ తపోబలముచే బ్రహ్మాదిదేవతలను వశముజేసికొని వరములను గూడ బడసి, లోకములను సంతపింపజేయుచున్నారో ఆ తపస్సు తామసమని చెప్పబడుచున్నది

**దైవప్రాప్త్యాదిసంసిద్ధ్యై శరీరేన్ద్రియశోషణమ్ ।**
**వినైవాచరితం యత్తు తద్ధి సజ్జనవందితమ్॥** 9

దైవప్రాప్తికొఱకుగాని, బ్రహ్మసాక్షాత్కారము కొఱకు గాని, భగవదనుగ్రహముకొఱకు గాని, జ్ఞానసిద్ధికైగాని శరీరేన్ద్రియాత్మలను క్లేశపరచక చేయు తపస్సు శాస్త్రసమ్మతము, సజ్జనవందితము

**కల్పసేవనయోగాదిసిద్ధ్యా క్లేశాన్వినైవ యత్ ।**
**నిరాహారాః ప్రకుర్వన్తి తత్తపస్సిద్ధవందితమ్ ॥** 10

కల్పసేవనముచేగాని, యోగసిద్ధచేగాని శరీరేంద్రియ ఆత్మలకు క్లేశ ములేక, నిరాహారులై నిరన్తరముచేయు (4వ) తపస్సు బహుదుర్లభము, సిద్ధులకు మాన్యము

**శాస్త్రసిద్ధాని చత్వారి తపాంసి మునయో విదుః ।**
**తేషాం మధ్యే రాజసం చ తామసం పరివర్జయేత్ ॥** 11

ఈలాగున చతుర్విధతపస్సులు శాస్త్రమునందు కనబడుచున్నవి మునీశ్వరులను వీటి నెరుంగుచున్నారు ఆ తపస్సులలో రాజస తామస తపస్సులను విడువవలయును

**సంతాపనం తప ఇతి సర్వకిల్బిషనాశనమ్ ।**
**సర్వకర్మక్షయో యేన త త్తపః పరికీర్త్యతే ॥** 12

తపస్సనగా తపింపజేయుట యగును కావున సమస్త పాపములను దహించి సర్వకర్మలను నశింపజేయుటయే తపమనబడును

**అజ్ఞాననాశి పూతం చ జ్ఞానాఖ్యం తప ఉచ్యతే ।**
**ఏతదేవ సదా సేవ్యం సర్వైరపి ముముక్షుభిః ॥** 13

అజ్ఞానధ్వంసకమై మహాపవిత్రమైనది జ్ఞానతపస్సని చెప్పబడుచున్నది ఇది సర్వముముక్షువులచేతను సర్వదా ఆచరింపదగియున్నది

**శ్రీకృష్ణసమ్మతం తత్స్యాద్వీతరాగాదిబోధతః ।**
**జ్ఞానేన తపసా పూర్ణాః పూతా విన్దన్తి శాశ్వతమ్ ॥** 14

ఆ జ్ఞానతపస్సు శ్రీకృష్ణభగవంతునికి సమ్మతమైనది కావుననే

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పుతా మద్భావమాగతాః ॥

అని భగవానుడు పలికెను ఈ గీతాశ్లోకార్థమును దెలిసికొని జ్ఞాన తపస్సుచే పూర్ణులైనవారు శాశ్వతపదవిని పొందుచున్నారు

**ఋష్యాశ్రమేషు బహుమౌనిసమాశ్రితేషు**
**సర్వేప్సితార్థఫలదా కిల కామధేనుః ।**
**జాగర్తి చేతి బహుధా ప్రతిపాదయన్తి**
**పశ్యేమ కిం తు న హి కాంచన కామధేనుమ్ ॥ 15**

తపోవంతులుగల ఋష్యాశ్రమములలో నానావిధ సిద్ధులను, సమస్త మనోరథముల నిచ్చు కామధేనువుంటున్నదని శాస్త్రములలో ప్రతిపాదించు చున్నారు అయినను మనవట్టి గోవును చూచుటలేదు ఏలననగా కామధేనువనగా ఒక గోవని అర్థము కాదు

**ఏవం వదన్తి బహుకామ్యదకల్పశాఖీ**
**దత్తే జనాభిలషితాని ఫలాని చేతి ।**
**చింతామణిశ్చ శతధా ఫలతీతి శృణ్మ**
**స్స్యాచ్చేద్విచారితమిదం తపసః ప్రభావః ॥ 16**

ముందు చెప్పినరీతిగా బహుకామ్యముల నొసగు కల్పవృక్షము జనులు కోరిన ఫలముల నిచ్చుచున్నదనియు చెప్పుచున్నారు చింతామణియున్ను అనేకవిధముల ఫలముల నిచ్చుచున్నదని వినుచున్నారము ఇదంతయు విచారించగా కల్పవృక్ష మనునది యొక చెట్టుగాదు చింతామణి యనునది మణిగాదు మరేమనిన అదంతయు తపస్సుయొక్క ప్రభావమే

**నిర్వికల్పాం స్థితిం యోగీ యదా భజతి మానసే ।**
**సిద్ధిస్తస్య తదా కల్పవృక్షరూపేతి కథ్యతే ॥ 17**

**యదా స జితకామత్వం ప్రాప్నోతి విజితేంద్రియః ।**
**తదా హస్తంగతా కామధేనుసిద్ధిర్భవిష్యతి ॥ 18**

యోగీశ్వరుడెప్పుడు నిర్వికల్పస్థితిని పొందునో, అప్పుడు సకల కామ

ములను సకలసిద్ధుల నొసగునట్టి కల్పవృక్షరూపసిద్ధి గలుగుచున్నది ఎప్పుడు జితకాముడగునో, అప్పుడు కామధేనుసిద్ధి స్వాధీన మగుచున్నది

**నిశ్చింతతా చ సకలాసు దశాసు తస్య**
**చింతామణిర్భవతి యోగనిరూఢబుద్ధేః ।**
**శాస్త్రాణి పూర్వముని పుంగవజీవితాని**
**ప్రఖ్యాపయన్తి నను తత్త్వమిదం సుబుద్ధే॥** 19

ఓ సుబుద్ధీ ! చింతామణి యనగా బహుదుఃఖముల దూరీకరించునట్టి సకలావస్థలయందును యోగనిరూఢుడైనవాని చింతారహితస్థితియే పూర్వశాస్త్రములును, మునిపుంగవుల జీవితములును ఈ తత్త్వమునే ప్రకటించుచున్నవి కదా!

**అసాధ్యభూతం తపసా త్రిలోక్యాం నైవాస్తి కించిత్సమయత్రికేఽపి ।**
**బ్రహ్మత్వసిద్ధిస్తపసైవ లభ్యా తతశ్శుకం ప్రాహ తదేవ తాతః ॥** 20

తపస్సుచే సాధింపరానిది మూడులోకములలోను, మూడు కాలము లయందును కొంచెము గూడలేదు బ్రహ్మప్రాప్తియుగూడ తపస్సుచేతనే లభ్యమగుచున్నది కావుననే తండ్రి (శ్రీవేదవ్యాసులు) శుకునిగూర్చి (కుమారుని గూర్చి) ఈ విషయమునే బోధించెను

**భూయశ్చ సంశృణుత తాపసవృత్తిభేదే**
**గీతోదితం చ తపసస్త్రివిధంప్రకారమ్ ।**
**వాక్కాయమానసభిదా కలితం చ పూతం**
**శ్రేయఃప్రదం భువి చతుర్విధయోగసేవ్యమ్॥** 21

ఇక నీ తపస్సుయొక్క విషయమై మఱియొక ప్రకారమును వినుము, ఆ తపసు వాక్కాయమానస భేదములచే మూడువిధములుగా గీతయందు చెప్పబడినది ఆ త్రివిధతపస్సులు పవిత్రములు, శ్రేయః ప్రదములు 1 కర్మ, 2 భక్తి, 3 యోగ, 4 జ్ఞానములను నాలుగు యోగములను శీలించు వారందరి కాచరణీయములై యున్నవి

**బ్రహ్మచర్యమహింసా చ గురుదేవాదిపూజనమ్ ।**
**శౌచమార్జవమిత్యాది శారీరం తప ఉచ్యతే ॥** 22

1 బ్రహ్మచర్యము, 2 అహింస 3 గురువులను, 4 ప్రాజ్ఞులను పూజించుట, 5 బాహ్యాభ్యన్తరశౌచము, 6 ఋజుత్వము మొదలగునవి శరీర తపస్సు అగుచున్నవి

**సత్యం ప్రియం చ కథనం దివ్యమన్త్రజపస్తథా ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥** 23

సత్యముగను, ప్రియముగను సంభాషించుట, దివ్యమన్త్రజపము, గీతోపనిషదాదుల అధ్యయనము – ఇవి వాక్తపస్సని చెప్పబడుచున్నవి

**భావశుద్ధిః ప్రసన్నత్వం మౌనమాత్మ వినిగ్రహః ।**
**సౌమ్యత్వం తత్త్వచిన్తా చ మానసం తప ఉచ్యతే ॥** 24

భావశుద్ధి మనోనిర్మలత్వము, మౌనము, ఆత్మనిగ్రహము, సౌమ్య త్వము, తత్త్వచిన్త – ఇవి మానసిక తపస్సని పేర్కొనబడుచున్నవి

**ఏతేషాం తపసాం వత్స! ఫలం శృణు విభేదతః ।**
**కాయస్య శుద్ధిర్దార్ఢ్యం చ శీతోష్ణాది సహిష్ణుతా ॥**
**సుచిరం ధ్యాననిష్ఠా చ శరీరతపసః ఫలమ్ ॥** 25

వత్సా! ఈ త్రివిధతపస్సులయొక్క ఫలమును వేరువేరుగా వినుము శారీరక తపస్సులచే కాయశుద్ధి, శరీరదార్ఢ్యము, శీతోష్ణాదిసహనము, చాలకాలము ధ్యాననిష్ఠ చేయుట మొదలయినవి సిద్ధించును

**సిద్ధ్యంతి వాక్తపోయోగాత్ వాక్శుద్ధిస్సత్యసన్ధతా ।**
**సర్వానుగ్రహసామర్థ్యం స్వాధ్యాయపటిమా తథా ॥** 26

వాక్తపస్సుచే వాక్శుద్ధి, సత్యసన్ధత్వము, సర్వులను ననుగ్రహించు సామర్థ్యము, స్వాధ్యాయ పటిమ మొదలగునవి సిద్ధించును

**ఫలాని చిత్తతపసో వేదమన్త్రావలోకనమ్ ।**

**మనశ్శుద్ధిశ్చ సంకల్పసిద్ధిస్స్వాత్మని దర్శనమ్ ॥** 27

మానసిక తపస్సుచే మనశ్శుద్ధి, సంకల్పసిద్ధి, వేదమన్త్రములను స్వయముగా గనుగొను శక్తి, స్వాత్మదర్శనము మొదలగునవి సిద్ధించుచున్నవి

**బ్రహ్మాదయోఽపి తపసా నిజశక్తిం ప్రపేదిరే ।**
**తస్మాత్తపో వినా కార్యం మహత్కిఞ్చిన్న సాధ్యతే ॥** 28

బ్రహ్మదేవుడు సృష్టిశక్తిని, విష్ణువు పాలనాశక్తిని, ఈశ్వరుడు లయశక్తిని తపస్సుచేతనే పొందిరి కావున తపఃప్రభావము లేక యేమహాకార్యమున్ను సాధింపబడదు

**బ్రహ్మతత్త్వం చ తపసా సర్వసిద్ధీరవాప సః ।**
**సాంఖ్యశాస్త్రం చకారాథ కపిలాఖ్యో మహామునిః ॥** 29

తపోమహిమచేతనే ఆకపిలమహాముని బ్రహ్మత్వమును సర్వసిద్ధులను గూడ పొందెను మఱియు సాంఖ్యతత్త్వశాస్త్రమునుగూడ రచించెను

**పతంజలిర్వరరుచిః పాణినిశ్చ యథాక్రమమ్ ।**
**భాష్యం చ వార్తికం సూత్రం తపసైవ వితేనిరే ॥** 30

మహాముని పతంజలి భాష్యమును, ఋషివరుండగు వరరుచి వార్తికములను, పాణినిముని వ్యాకరణ సూత్రములను తపోబలముచేతనే రచించిరి

**జైమినిర్ధర్మతత్త్వజ్ఞో ధర్మశాస్త్రం ప్రణీతవాన్ ।**
**బ్రహ్మర్షిర్నారదో భూత్వా త్రిలోక్యాం సంచచార సః ॥** 31

**వాల్మీకిశ్చ మహాపాపీ రామమన్త్రప్రభావతః ।**
**రామాయణస్య కర్తాఽఽసీత్ సర్వం హి తపసః ఫలమ్॥** 32

ధర్మతత్త్వము నెఱింగిన జైమినిమహామునియు ధర్మశాస్త్రమును తపఃప్రభావముచేతనే చేసెను నారదమునియు తపశ్శక్తిచేతనే బ్రహ్మర్షియై త్రిలోకములందును సంచరించెను మఱియు మహాపాపియగు వాల్మీకియు

రామమన్త్రప్రభావమువలన శ్రీరామాయణకర్త యయ్యెను కావున సమస్తము తపస్సుయొక్క ఫలమగుచున్నది

**భగీరథో గౌతమశ్చ గంగాం గోదావరీం తథా ।**
**ఆనీయ చ తపశ్శక్త్యా లోకశా న్తిం వితేనతుః ॥ 33**

తమ తపఃప్రభావముచేతనే భగీరధుడు గంగానదిని, గౌతమ మహాముని గోదావరీనదిని ప్రవహింపజేసి సర్వలోకశాన్తిని గలుగజేసిరి

**దయాశాలీ బుద్ధదేవశ్శంకరాచార్య ఏవ చ ।**
**చైతన్యశ్చ దయానందస్తపసా లేభిరే పరమ్ ॥ 34**

దయాశాలియగు శ్రీబుద్ధదేవుడు, శ్రీశంకరాచార్యులు, శ్రీకృష్ణ చైతన్య ప్రభువు, శ్రీదయానందసరస్వతియు తపస్సుచేతనే పరమాత్మప్రాప్తిని బడసిరి, లోకోద్ధారకులైరి

**శ్రీరామానుజమధ్వౌ చ గురునానక్నబిస్తథా ।**
**ఏసుక్రీస్తుః ప్రవక్తార స్తపసాఽత్ర ప్రకీర్తితాః ॥ 35**

శ్రీరామానుజులును, శ్రీమధ్వాచార్యులును, గురునానక్కున్ను, నబియు, ఏసుక్రీస్తువున్ను తపస్సుచేతనే లోకమునకు ప్రవక్తలయిరి

**గాంధీమహాత్మా ధీశాలీ శా న్తమూర్తిః ప్రసన్నవాక్ ।**
**భారతీయప్రజానాన్తు బన్ధం చిచ్ఛేద సత్యతః ॥ 36**

శాన్తమూర్తియు, ధీశాలియు, ప్రసన్నవాక్కున్ను గల శ్రీగాంధీ మహాత్ముడు భారతీయప్రజలయొక్క పాశ్చాత్యశాసనబన్ధమును తన సత్య వ్రత రూపతపస్సువలననే భేదించెను

**బ్రహ్మచర్యవ్రతధరా గార్గీ విశ్వవరా తథా ।**
**యోగినీ సులభా చైవ తత్త్వమాపుస్తపోబలాత్ ॥ 37**

బ్రహ్మచర్యవ్రతమును ధరించిన గార్గియు, విశ్వవరయు, సులభా యోగినియు తపస్సుచేతనే బ్రహ్మతత్త్వమును బడసిరి

**జ్ఞానాఢ్యాశ్చ స్త్రియో భూత్వా సర్వాసాం బ్రహ్మవేదనే ।**
**అభవన్ మార్గదర్శిన్య స్తపసా ముచ్యతేఽఖిలః ॥ 38**

ఆలాగున స్త్రీలును జ్ఞానవతులై బ్రహ్మతత్త్వమును దెలియుటలో స్త్రీలందఱికిని మార్గదర్శకులైరి కనుక తపస్సుచే నందఱును ముక్తులగుచున్నారు

**విదేహరాజో జనకో నిత్యం చ స్వాత్మనిష్ఠయా ।**
**సంసారసాగరం తీర్త్వా వై దేహీం ముక్తిమభ్యగాత్ ॥ 39**

విదేహరాజగు జనకచక్రవర్తియు నిత్యము స్వాత్మనిష్ఠచేతనే సంసార సాగరమును దాటి విదేహకైవల్యమును పొందెను

**లోకేఽపి దుష్కరం యత్స్యాద్యచ్చ దుర్గం ప్రకీర్తితమ్ ।**
**తత్సర్వం తపసా సాధ్యం తపో హి మహతాం ధనమ్ ॥ 40**

లోకమున నేది దుష్కరమో ఏది దుర్గమో ఆదియంతయు తపస్సుచే సాధింపబడుచున్నది అట్టి తపస్సే మహాపురుషులకు గొప్పధనము

**అద్భుత ధీవరవంశజనిం పరాశరమునీశ్వర సూనురనిందితః ।**
**స చ వసిష్ఠమునీశ్వర ఊర్వశీసుత ఇతీరిత అర్షకులే మహాన్ ॥ 41**

పరాశరమునికుమారుడగు వ్యాసమహామునియు జాలరికులమున పుట్టెను ఋషికుల ప్రసిద్ధుడగు వసిష్ఠమహాముని ఊర్వశీసుతుడుగా కీర్తింపబడెను

**జనిమథత్త పురా కిల శౌనకో జగతి కుక్కురవంశపదే మునిః ।**
**భువి బభూవ మునీశ్వరపూజితః కలశజోఽపిఘటే తపసాంనిధిః ॥ 42**

శౌనకమహామునియు శునకవంశమున జనించెను మునీంద్రులచే పూజితుడును తపోనిధియునైన అగస్త్యమునియు ఘటములో జనించెను

**కుశికసూనురితి ప్రథితో మునిర్నృపకులేఽజని విశ్వహితంకరః ।**
**జనిమగాదథ వైశ్యకులే జగ న్నుతయశాశ్చ ఖగోళమహామునిః ॥ 43**

కుశికుని పుత్రవరుడును, విశ్వమునకు హితకరుడును నగు విశ్వామిత్రుడు క్షత్రియవంశములో జనించెను జగత్కీర్తితుడగు ఖగోళ మహామునియును వైశ్యవంశమున జన్మించెను

**గురువరః కిల సూతమహామునిర్విపుల వృత్తపురాణసుబోధకః ।**
**సకలసన్మునిబృందసమర్చితో జననమాప చతుర్థకులే పురా ॥ 44**

విపుల చరిత్రగల పురాణములను బాగుగా బోధించువాడును, సకల మునులకు గురువైనవాడును అగు గురుపదమున నున్న సూతమహాముని చతుర్థ (శూద్ర) వంశమున జన్మించెను

**మహత్త్వం చ మునీంద్రాణాం తపోమూలకముచ్యతే ।**
**తతస్సర్వేఽపి మునయః తపశ్చక్రురఖండితమ్ ॥ 45**

మునీంద్రుల మహత్తునకు తపస్సే ప్రధానకారమని చెప్పబడినది అందువలననే మునులు అఖండ తపస్సును ఆచరించిరి

**దేహధర్మాన్ కులోపేతాన్ విసృజ్య విదురాదయః ।**
**తపోనిష్ఠాః ప్రయత్నేన ముక్తిం ప్రాపుర్వివేకినః ॥ 46**

కులసంబద్ధమైన దేహధర్మాదులను వదలి వివేకవంతులైన విదుర సంజయాదులు స్వప్రయత్నముతో తపోనిష్ఠులై ముక్తినొందిరి

**తపఃప్రయత్నసంభూతః గుణ ఏవ మహోన్నతేః ।**
**కారణం న కులం నైవ లింగమిత్యవదచ్ఛ్రుతిః ॥ 47**

మహోన్నతికి తపఃప్రయత్నమువలన గలిగిన సుగుణమే కారణము, కాని కులము, లింగము కారణము కావని వేదము పలుకుచున్నది

**నానాజాతి సముద్భూతా అపి లోకే తపోబలాత్ ।**
**బ్రాహ్మణ్యం మునయః ప్రాపుః నను జాతిరకారణమ్॥ 48**

నానావిధజాతులలో పుట్టినవారైనను నిజతపోబలమువలన మునులు

బ్రహ్మజ్ఞానమును పొందిరి కావున ఆత్మోన్నతికి జాతి కారణము గాదు

**మనుజో యత్ర కుత్రాపి వంశే ప్రాప్నోతు సంభవమ్ ।**
**ఆత్మశుద్ధిం వినా ముక్తిః న కదాఽపి భవేత్క్వచిత్ ॥** 49

మానవజన్మ మెత్తినవా రెవరైనను నేవంశములో పుట్టినవారైనను సర్వదా ఆత్మశుద్ధిలేక యెుకప్పుడును ముక్తిని పొందరు

**పుటపాకేన సంస్కారం వినా చ విషధాతవః ।**
**అశుద్ధా దోషసంశ్లిష్టాః జాయంతే మృత్యుహేతవః ॥** 50

విషధాతువులు పుటపాకముచే సంస్కరింపబడనపుడు అశుద్ధములై దోషయుక్తములయి మరణకారకము లగుచున్నవి

**ఏవం విషయదోషేణ దూషితానీంద్రియాణ్యపి ।**
**ఘోరసంసార దుఃఖాని జనయంతి నృణామిహ ॥** 51

అట్లే విషయదోషముచే దూషితములైన ఇంద్రియములు మానవులకు ఘోరసంసార దుఃఖములను కలిగించుచున్నవి

**పుటపాకవిశుద్ధాశ్చేత్తా ఏవ విషధాతవః ।**
**దోషం త్యక్త్వా భవంత్యేవ జనజీవనహేతవః ॥** 52

పుటపాకముచే విశుద్ధములైనచో ఆ విషధాతువులే దోషరహితములై జనులకు జీవనప్రదము లగుచున్నవి

**తథైవ తీవ్రతపసా శోధితానీంద్రియాణ్యపి ।**
**భవదుఃఖమపాకృత్య ప్రయచ్ఛంతి పరం పదమ్ ॥** 53

అట్లే తీవ్రతపముచే శుద్ధములయిన యింద్రియములు సంసార శోకమును దూరీకరించి పరంపదమును ఇచ్చుచున్నవి

**దహ్యంతే తీవ్రతపసా సకలేంద్రియ వృత్తయః ।**
**తతో బద్ధవిముక్తి స్స్యాద్బ్రహ్మానందప్రదా మునేః ॥** 54

సర్వేంద్రియవృత్తులు తీవ్రతపస్సుచే దహింపబడుచున్నవి అందుచే యోగికి సంసారబంధము వదలిపోయి బ్రహ్మానందము సిద్ధించుచున్నది

**తామ్రాది మిశ్రితం స్వర్ణమల్పమూల్యం ప్రజాయతే ।**
**శుద్ధాత్మా భవసంసర్గాజ్జీవోఽహంభావయుగ్భవేత్ ॥ 55**

రాగి మొదలైన లోహముతోగూడిన బంగారము వెల తగ్గిన దగుచున్నది ఆలాగున శుద్ధస్వరూపుడయిన ఆత్మ సంసారసంసర్గముచే నహంభావముతో గూడిన మలిన జీవుడగుచున్నాడు

**క్షారాది శోధితం స్వర్ణం ప్రయాతి నిజమూల్యతామ్ ।**
**స్వం రూపం యాతి జీవోఽపి తపోవ్రతసుసంస్కృతః ॥ 56**

క్షారాదులచే స్వర్ణము శుద్ధపరచబడినయెడల మునుపటి మూల్యము నొందునటుల, జీవుడును తపోవ్రతాదులచే సంస్కృతుడై నిజరూపమగు పరమాత్మస్వరూపమును పొందుచున్నాడు

**బహుళ మోహతమోమలదూషితో భజతి జీవపదం తపసా పునః ।**
**విమలబుద్ధతనుశ్శివరూపగస్త్రిగుణజాలమతీత్య విరాజతే॥ 57**

ఆత్మ మిక్కిలి భ్రాన్తిరూపాజ్ఞాన మలదూషితమై జీవుడగుచున్నది మరల తపోఽగ్నిచే మాలిన్యము నశించినప్పుడు అఖిలవ్యాపక విమలజ్ఞాన శివరూపమై త్రిగుణముల నతిక్రమించి విరాజిల్లుచున్నది

**దహనదాహవిహీనఘటో యథా సలిలసంగయుతో ద్రవతి ధ్రువమ్ ।**
**అథ మనశ్చ తపోరహితం తథా విషయదోషయుతం వికలం భవేత్ ॥**

కాలని కుండ జలస్పర్శచే కరిగి మట్టియగునటుల తపస్సుచే పరిపక్వము కానివారి మనస్సు విషయదోషముల సంబంధము గలదై వికలమగుచున్నది అనగా విషయములోనికి ప్రవేశించుచున్నది

**అనలదాహదృఢః కలశో యథా ద్రవతి నోఽపి చ వారిధిమజ్జితః ।**
**గురుతపోభరసంస్కృత మానసః భయదమృత్యుముఖేప్యమృతో భవేత్ ॥**

బాగుగా కాలినకుండ సముద్రములో ముంచబడినను కరుగదు ఆలాగున గొప్పతపోగ్నిచే సంస్కరింపబడిన చిత్తముగలవాడు భయము నొసగు మృత్యుముఖము నందున్నను అమృతత్వమును పొందుచున్నాడు

**అసంపూర్ణతయా దగ్ధో ఘటో భవతి మృత్పునః ।**
**కులాలేన జలోపేతః పునశ్చక్రే నివేశ్యతే ॥ 60**

**సమగ్ర తపసా హీనః తద్వదేవ చ సాధకః ।**
**సంసారచక్రనిక్షిప్తః మృత్యునా భ్రామ్యతే కిల ॥ 61**

కాలని కుండలు జలముచే మట్టియగు నప్పుడు వానిని కుమ్మరివాడు చక్రముపై బెట్టి త్రిప్పును అట్లే తపస్సుచే పరిపక్వముగాని జీవుని మృత్యువు సంసార చక్రమున కెక్కించి త్రిప్పుచున్నది

**మలినలోహశిలాదికమేవ చ దహనతాడనసంస్కృతిపాటవాత్ ।**
**భజతి రామశివాదికరూపతామథ చ తద్భువి గచ్ఛతి పూజ్యతామ్॥ 62**

మలినలోహములను కరగించుట, రాళ్లను బాగుగా కొట్టుట అను సంస్కారవిశేషముచే ఆ లోహములు, రాళ్ల రామశివాది రూపము నంది నవియై లోకమున పూజింపబడుచున్నవి గదా!

**నను భవ న్తి తథైవ ముముక్షవ స్సతతకిల్బిషయుక్తతమోహతాః ।**
**బహుళదీర్ఘతపః పరిపాటవా ద్భవనివృత్తి విముక్తి పదోన్నతాః ॥ 62**

ఆలాగున కల్మషయుక్తమైన తమస్సుచే పీడింపబడిన ముముక్షువులు దీర్ఘతపఃపరిపాకబలముచే భవము తొలగగా ముక్తిపదస్థు లగుచున్నారు

**దృఢలోహశలాకాయా వేష్టనం కుటిలస్య చ ।**
**వేణో స్సమీకృతిస్తద్వత్ దహనేనైవ సాధ్యతే ॥ 63**

**తథా చపలచిత్తస్య వశీకరణ కర్మణి ।**
**ఇంద్రియాణాం నిరోధే చ తపోఽగ్నిరుపయుజ్యతే ॥ 64**

దృఢమైన లోహశలాకములను (ఇనుపకము!లను) గుండ్రముగా చేయుటకును, వక్రములయిన వేణ్వాదులను చక్కగా జేయుటకును అగ్నిచేతనే సాధ్యమగుచున్నది అట్లు చపలచిత్తమును వశీకరించు కొనుటకును, ఇంద్రియమును నిరోధించుకొనుటకు తపస్సనెడి అగ్నియే ఉపకారక మగుచున్నది

**అపక్వస్తండులో యద్వన్నార్హో భవతి భుక్తయే ।**
**తథైవ తపసా హీనో నార్హో భవతి ముక్తయే ॥ 65**

బియ్యము ఉడకనిచో భుజించుటకు పనికిరాదు అట్లు తపస్సుచే పరిపక్వము నొందనివాడు ముక్తికి అర్హుడు గాడు

**యది తరణసమీహా జన్మసాఫల్యహేతోః**
**భజత మనసి యూయం జ్యోతిరానందరూపమ్।**
**సతతవిమలయోగాద్జ్ఞానరూపాద్విశుద్ధం**
**మునిజనసముపాస్యం బ్రహ్మతత్త్వం లభన్తామ్ ॥ 66**

జన్మము సాఫల్యము జేసికొనుటకై తరింపవలయునను కోరిక యుండినచో మీరలు ఆనందరూపజ్యోతి పరమాత్మను మనస్సులో భజించుడు మరియు జ్ఞానరూప నిర్మల యోగమువలన మునివరులు ఉపాసించు విశుద్ధ ఆ బ్రహ్మతత్త్వమును పొందుడు

**నిరవధికవిశేషవిత్తిభాజః కఠినతపోఽనలదగ్ధకర్మబీజాః ।**
**భవవిరహితవృత్తయః కృతార్థాశ్శివపదనిర్మలభవ్యతత్త్వయుక్తాః॥ 67**

తీవ్రతపోవహ్నిచే దహింపబడిన కర్మబీజములు గలవారు గనుకనే నిరవధిక విశేషజ్ఞానసమ్పత్తి గలవారును శివపదమగు నిర్మలభవ్యతత్త్వముచే గూడినవారును భవబంధరహితులై జీవన్ముక్తులు కృతార్థులగుచున్నారు

**శివపదం నిఖిలతత్త్వవిశుద్ధం జననమృత్యుభయశోకవిదూరమ్ ।**
**అమృతరూపమఖిలాగమవేద్యం నిజతపోఽతిశయదీప్తిసులభ్యమ్॥ 68**

నిఖిలతత్త్వరూపమై విశుద్ధ మయినదియు, జననమరణభయ శోక నాశక మయినదియునగు అమృతరూపమును, సకలవేదములచేత తెలియ బడదగిన శివపదము తపఃప్రభావదీప్తిచే మాత్రమే సులభ సాధ్యము

**నిఖిలనిగమసార స్తత్త్వయోగో విశుద్ధః**
**తప ఇతి మునిమార్గస్సర్వథా ప్రత్యపాది ।**
**శివపదనిరతానాం తాపసానాం ప్రభావో**
**సముచితపటుయుక్త్యా సాంప్రతం దర్శితోఽభూత్ ॥** 69

నిఖలవేదసారమై విశుద్ధ తత్త్వయోగమైన తపస్సను మును లనుసరించు మార్గము నానావిధములుగా ప్రతిపాదింపబడెను శివపదమగు పరమాత్మయందు రమించు తాపసుల ప్రభావముగూడ ఇప్పుడు తగినయుక్తులతో నిరూపించబడెను

**తపఃప్రభావయోగాఖ్యస్తపస్సారః ప్రదర్శితః ।**
**అనేన లభ్యతే జ్ఞానం తతో యాన్త్యమృతం పదమ్ ॥** 70

తపఃప్రభావయోగమను తపస్సారము చూపెట్టబడెను ఇందుచే నాత్మజ్ఞానము లభించుచున్నది దానిచే నమృతపదవిని పొందుచున్నారు

**తపఃప్రభావ ఆఖ్యాతో వేదవేదా న్తవిశ్రుతః ।**
**విధూయ యేన పాపౌఘం భవన్తి బ్రహ్మరూపిణః ॥** 71

వేదవేదాన్తములందు కొనియాడబడిన తపస్సుయొక్క ప్రభావ మీ యధ్యాయమున నిరూపింపబడినది ఈ తపఃప్రభావముచేతనే జీవులు తమపాపములనెల్ల నశింపజేసి బ్రహ్మరూపు లగుచున్నారు

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
తపఃప్రభావయోగో నామ అష్టమోఽధ్యాయః॥
ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్ర గీతయందు
తపఃప్రభావయోగమను అష్టమాధ్యాయము సమాప్తము



# నవమోఽధ్యాయః

# కర్మయోగః

శివచరణ ఉవాచ

**శ్రుతిసారజ్ఞ! సానన్ద! బ్రూహి మే కరుణానిధే।**
**రహస్యం కర్మయోగస్య శ్రోతుమిచ్ఛామి తత్త్వతః॥ 1**

శివచరణము చెప్పెను

వేదాంతసారతత్త్వజ్ఞా! ఆనందరూపా! కరుణానిధీ! కర్మయోగ రహస్యమును యధార్ధముగా వినదలంచితిని అద్దానిని దయతో వచింపుడు

**వాక్యమేతత్సమాకర్ణ్య మహర్షిర్మౌనమాదధే।**
**తతః ప్రణవముచ్చార్య బ్రహ్మభావనపూర్వకమ్॥ 2**

**మన్దస్మితయుజా వాచా మేఘగంభీరఘోషయా।**
**సంశాన్తవృత్తికలయా తదారేభే ప్రభాషితుమ్ ॥ 3**

ఈవాక్యమును విని మహర్షి కొంతసేపు మౌనముగా నుండెను తరువాత బ్రహ్మభావనతోటి ప్రణవము నుచ్చరించి, చిరునగవుతో గూడుకొని, మేఘధ్వనివలె గంభీరమైన స్వరము గలదియు, వినినంతనే సకలవృత్తులను నశింపజేసి శాన్తినొసగు నదియునగు వాక్కుతో నావిషయమును బోధింప మొదలిడెను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**శ్రూయతాం కర్మణస్తత్త్వం రహస్యం హ్యేతదుత్తమమ్।**
**సాదరం యత్త్వయా పృష్టం విదుషామప్యగోచరమ్ ॥ 4**

శ్రీమలయాళ యతీన్ద్రుడు చెప్పెను

కర్మయోగతత్త్వమును వినుము ఇది మిగుల రహస్యమైనది ఆదర ముతో నీవడిగిన యీ కర్మయోగము విద్వజ్జనులకును నగోచరమైనది

**తథాఽపి వచ్మి కర్మాణి సూక్ష్మాణి గహనాని చ ।**
**కర్మభక్తిజ్ఞానయోగా ఇతి యోగాశ్చతుర్విధాః ॥ 5**

అయినను వచించెదను కర్మలతిసూక్ష్మములు, అతిగహనములు (సాధారణముగా దెలియ శక్యములు గానివి) మఱియు యోగములు 1 కర్మ, 2 భక్తి, 3 యోగ, 4 జ్ఞానములని నాలుగువిధములుగా నున్నవి

**తేషాం కర్మజ్ఞానయోగౌ దుస్సాధావితి గీయతే ।**
**ధీశుద్ధత్వాత్త త్త్వవిదాం తావర్హావితి కథ్యతే ॥ 6**

ఆ నాలుగింటిలో కర్మజ్ఞానయోగములు రెండును దుస్సాధములని చెప్పబడుచున్నవి తత్త్వవేత్తల కాత్మశుద్ధి యుండుటవలన అట్టివారికే యా కర్మజ్ఞానములు రెండును నర్హములని వచింపబడుచున్నది

**ఫలాసక్త్యా ప్రయతతాం కర్మయోగో న సిధ్యతి ।**
**తథా దేహేన్ద్రియమనోయుజాం జ్ఞానం న సిధ్యతి ॥ 7**

ఫలాపేక్షగలిగి ప్రయత్నశీలురగువారికి కర్మయోగము సిద్ధించదు అటులనే దేహేన్ద్రియ మనస్సులయెడ నభిమానము గలవారికి జ్ఞానయోగము సిద్ధించదు

**అధ్యాత్మజ్ఞానసమ్పన్నాస్సర్వం బ్రహ్మేతి వేదినః ।**
**దేహాత్మభావనాదూరాస్సర్వే జ్ఞానాధికారిణః ॥ 8**

అధ్యాత్మజ్ఞాన సమ్పన్నులును, సర్వము బ్రహ్మమయము అని తెలిసిన వారును, దేహాత్మభావన లేనివారును నగు మహాత్ములెల్లరు జ్ఞానయోగాధికారులు

**యథా క్షీరాన్నమఖిలం విషలేశేన దూష్యతే ।**
**తథా దేహాత్మభావేన జ్ఞానం స్వార్థేన కర్మ చ ॥ 9**

విషము కొంచెమైనను సమస్త క్షీరాన్నమును చెరచులాగున, దేహాత్మభావన కొంచెమున్ననూ జ్ఞానమును, స్వార్థబుద్ధి యీషత్తున్నను నిష్కామ

కర్మను జెరచుచున్నవి

**నిశ్శేషం హృదయే స్వార్థం పరిత్యజ్య యతన్తి యే ।**
**తే సర్వే కర్మయోగార్హా జ్ఞానాన్ముక్తిం చ బిభ్రతి ॥** 10

హృదయములోని స్వార్థబుద్ధిని నిశ్శేషముగా పరిత్యజించి ప్రయత్నించు వారందఱును కర్మయోగార్హులే యగుచున్నారు అట్టి నిష్కామ కర్మయోగానుష్ఠానపరులు జ్ఞానవంతులై మోక్షపదవి నధిష్ఠించుచున్నారు

**సర్వేషాం సులభోపాయో భక్తియోగః ప్రకీర్తితః ।**
**తథైవ ధ్యానయోగశ్చ తాభ్యాం జ్ఞానం ప్రజాయతే॥** 11

నిర్మలాత్ము లందఱికిని భక్తియోగ, ధ్యానయోగములు రెండును సులభోపాయములై యున్నవి ఆరెంటిచేతను జ్ఞానము కలుగుచున్నది

**తచ్చ యోగద్వయం తావత్పూతానాం యమినాం తథా ।**
**సర్వదా సులభం సాధ్యం తస్మాద్జ్ఞానం తతః పరమ్ ॥** 12

ఆ భక్తి ధ్యానానుష్ఠానములు రెండును పవిత్రాత్ములకును, సంయములకును సులభసాధ్యములు, వానిచే జ్ఞానము కలిగి పరమపదవిని పొందుచున్నారు

**కర్మాణి ప్రవిభక్తాని నిషిద్ధాదివిభేదతః ।**
**చతుర్విధాని జాయన్త ఇతి తత్త్వవిదో విదుః ॥** 13

ఆకర్మలు మరల నిషిద్ధ, కామ్య, పుణ్య, మిశ్ర భేదములచే నాలుగువిధము లగుచున్నవని తత్త్వవేత్తలు వచించుచున్నారు

**నిషిద్ధం కర్మ తత్ప్రోక్తం యత్తు హింసానృతాదికమ్ ।**
**తత్కామ్యం కామనాయుక్తం యజ్ఞయాగాదికం చ యత్ ॥** 14

**పుణ్యం కర్మ తదాహుర్యత్సర్వప్రాణిహితాత్మకమ్ ।**
**యత్పాపకామ్యమిశ్రం తన్మిశ్రం ప్రాహుర్మనీషిణః ॥** 15

1 నిషిద్ధకర్మ యనగా హింసా అసత్యాదులతో గూడినది 2 కామ్య మనగా కామనాబుద్ధితో గూడుకొన్న యజ్ఞయాగాదులు 3 పుణ్యమనగా సర్వప్రాణి హితరూపము, 4 మిశ్రమమనగా పాపకామ్యకర్మముల చేరిక యగును ఈలాగున కర్మలు నాలుగు విధములుగా నున్నవి

**నిషిద్ధే నరకం యాన్తి కామ్యే స్వర్గం ప్రయాన్తి చ ।**
**కృతే పుణ్యే తూర్ధ్వలోకం మిశ్రకర్మణి మానుషమ్ ॥ 16**

నిషిద్ధ కర్మాచరణచే నరకమును, కామ్యకర్మానుష్ఠానముచే స్వర్గ మును, పుణ్యకర్మాచరణముచే నున్నతలోకమును, మిశ్రకర్మచే మనుష్యజన్మ మున్ను పొందుచున్నారు

**కర్మయోగం విచరతో దైవార్పితమనీషయా ।**
**దైవానుగ్రహయోగేన చిత్తశుద్ధిః ప్రజాయతే ॥ 17**

కర్మయోగమును దైవార్పితబుద్ధితో నాచరించువానికి దైవానుగ్రహ బలముచే నన్తఃకరణశుద్ధి గలుగుచున్నది ఇది నిష్కామకర్మ యగును

**స్వాన్తఃకరణశుద్ధేస్తు నిత్యానిత్యవివేకితా ।**
**తతో జ్ఞానం తతో ముక్తిః క్రమేణైవ హి జాయతే ॥ 18**

ఆచిత్తశుద్ధిచే నిత్యానిత్యవివేక ముదయించును అందుచే నాత్మజ్ఞాన ముదయమై క్రమముగా ముక్తుడగుచున్నాడు

**పూర్వేభ్యోఽపి విశిష్టం యత్పుణ్యం సూక్ష్మాత్మకం విదుః ।**
**పరిపూర్ణజ్ఞానినస్తు తద్విదన్తి న చేతరే ॥ 19**

పూర్వోక్తములగు చతుర్విధ కర్మలకంటె సూక్ష్మమయిన విశిష్టమైన ఏ పుణ్యకర్మ గలదో అద్దానివి పరిపూర్ణజ్ఞానులే తెలియుచున్నారు తదితరులు తెలియజాలరు

**దైవాత్ప్రాప్తం చ విధ్యుక్తం లోకక్షేమవిధాయకమ్ ।**
**స్వధర్మ ఇతి నిర్వ్యూఢం యత్తత్సూక్ష్మాత్మకం విదుః ॥ 20**

దైవముచే ప్రాప్తమైనదియు, లోకక్షేమకర మైనదియు, విధిచోదితమైన దియు స్వధర్మమని యాచరింపబడినదియు నగు కర్మ యేదియో అదియే సూక్ష్మాత్మక కర్మ యగుచున్నది

**తస్మాత్సూక్ష్మాత్మకాద్భిన్నం యత్కర్మ పరికీర్త్యతే ।**
**తస్మిన్ జీవేశభేదశ్చ బంధో మోక్షశ్చ సంస్థితాః ॥ 21**

పైజెప్పబడిన సూక్ష్మకర్మాచరణకంటె ఇతరకర్మానుష్ఠానమందు జీవేశ్వరుల భేదమున్ను, బన్ధమోక్షములు ఉన్నవి

**కర్మాణి యాని ప్రోక్తాని తత్సర్వం ద్వైతమేవ హి ।**
**తద్ధి సూక్ష్మాత్మకం కర్మ హ్యద్వైతం బన్ధవర్జితమ్ ॥ 22**

కర్మ లేవేవి గలవో అవి యున్నియు ద్వైతమే యగుచున్నవి అయిననూ ఆ సూక్ష్మాత్మక కర్మ అద్వైతము, బన్ధరహితము

**నిష్కామనాఖ్యే సతి మూలబన్ధే కర్మాదియోగాన్తరభూమికాభిః ।**
**ఏకోత్తరత్వేన విరాజితాభి ర్వినిర్మితస్తిష్ఠతి మోక్షసౌధః ॥ 23**

నిష్కామనాబుద్ధి యనెడు పునాదియుండిననే కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను నాలుగన్తస్తులతో క్రమముగా నొకదానిపై నొకటిగా నిర్మింపబడిన మోక్షమను సౌధము స్థిరముగా నుండును

**అసంగబుద్ధ్యాహ్వయమూలబంధే సుదుర్బలే నిర్మితమోక్షసౌధః ।**
**భూతాది నానాప్రతిబంధవాతైః పతేత్స యోగాదిచతుర్విభాగః ॥ 24**

అసంగ అనగా నిరపేక్షబుద్ధి దృఢత్వమను పునాది దుర్బలమైనచో కర్మయోగాదులను నాలుగంతస్తులలో నిర్మింపబడిన మోక్షమను సౌధము 1 భూత, 2 భావి, 3 వర్తమాన ప్రతిబంధములు, ఇకను నానా ప్రతిబంధములు అను పెనుగాలిచే తప్పక కూలిపోవును

శివచరణ ఉవాచ –

**కిం కర్మాదియోగాది చతుష్టయం స్యాత్ సంసాదనీయం భువి సాధకేన ।**

**త్యక్తుఞ్చ యం కంచన శక్యతే వా తత్తారతమ్యం కృపయా వదన్తు ॥ 25**

శివచరణము చెప్పెను

కర్మాది నాలుగుయోగములనున్ను అభ్యసింపవలయునా? వీనిలో నేదైన నొకదానిని వదలవచ్చునా? వానిలో తారతమ్యమున్నను పరమదయతో నానతిండు

శ్రీమలయాళ యతీన్ద్ర ఉవాచ

**ప్రతిష్ఠితస్తిష్ఠతి ముక్తిమణ్డపః కర్మాదిక స్తంభ చతుష్టయే సతి ।**
**యః కోఽపి తేషాం శిథిలీభవేచ్చేత్స్థాతుం న శక్యం కిము మూలనాశనే॥**

శ్రీమలయాళ యతీన్ద్రుడు చెప్పెను

ముక్తియను మంటపము కర్మాదియోగములను నాలుగు స్తంభములతో ప్రతిష్ఠింపబడి దృఢముగా ఉంటున్నది వానిలో నేదైన నొకటి శిథిలమైనచో ఆ మోక్షమంటపము నిలువజాలదు (ఇట్లుండగా రెండుగాని మూడుగాని యోగములు లేనిచో, రెండు స్తంభములుగాని మూడు స్తంభములుగాని లేని మండపమువలె మోక్షమంటపము వెంటనే కూలిపోవుచున్నది) పునాదియే నాశమయినపుడు దాని విషయము చెప్పవలయునా?

**తదంశమాలోచ్య జగాద కృష్ణో నిష్కామయోగస్సుదృఢో భవేదితి ।**
**సాలోక్యముక్త్యాదిచతుష్టయం చ లభ్యం క్రమాద్యోగ చతుష్టయేన ॥ 27**

ఈవిషయమునే యాలోచించి శ్రీకృష్ణభగవంతుడు నిష్కామయోగము దృఢమగునటుల వచించెను మఱియు 1 సాలోక్య, 2 సామీప్య, 3 సారూప్య, 4 సాయుజ్యములను చతుర్విధముక్తులు, క్రమముగా 1 కర్మ, 2 భక్తి, 3.యోగ, 4 జ్ఞానములచే పొందదగినవని శాస్త్రములు వచించుచున్నవి

**పదైశ్చతుర్భిః కిల ముక్తిధేనుః ప్రయాతి కర్మాద్యభిధాప్రసిద్ధైః ।**
**ఏకేన హీనా తు కథం ప్రయాతు తస్మాచ్చతుర్యోగవిధిం విదధ్యాత్॥ 28**

మోక్షమను కామధేనువు భక్తిమొదలగు నాలుగుయోగములను పాదములచే విహరించును, వానిలో నేదైన నొక యోగపాదము లేకపోయిన ఆముక్తిధేనువు నడువదు కావున నాలుగుయోగము లవశ్యము విధించవలయును

**తేషాన్తు యత్కించన తారతమ్యం తదత్ర సిద్ధం ఖలు యోగశాస్త్రే ।**
**పురాగతే జన్మని సిద్ధయోగాం స్త్యక్త్వాఽవశిష్టాన్మనుజోఽనుతిష్ఠేత్ ॥ 29**

మఱియు నీ నాలుగుయోగముల విషయమున నున్న తారతమ్యమును యోగశాస్త్రమున ప్రసిద్ధము అదేమనగా పూర్వజన్మమం దాచరింపబడిన యోగములను వదలి తదితర యోగముల ననుష్ఠించవలయును

శివచరణ ఉవాచ

**గత జన్మని కో యోగః సంసిద్ధ ఇతి సద్గురో! ।**
**కథన్ను తద్విజానీయాత్తత్సర్వం కథయస్తు మే॥ 30**

శివచరణము చెప్పెను

గురుదేవా! పూర్వజన్మమున ఏయే యోగములు సిద్ధించినవను విషయమెటుల తెలియవలయునో, ఆ సమస్తమును నాకు తెలియజేతురుగాక

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**నన్వస్తి భో! లక్షణమేతదత్ర సంస్కారయోగాత్సకలం హి విద్యాత్ ।**
**సంసిద్ధయోగే ఖలు నైవ బుద్ధి స్తస్య ప్రజాయేత పునర్ముముక్షోః ॥ 31**

శ్రీమలయాళ యతీన్ద్రుడు చెప్పెను

లక్షణము గలదు సంస్కారము ననుసరించి యనుష్ఠింపబడిన యోగములను దెలియశక్య మగును ఇదివరకనుష్ఠించిన యోగములందు ఆముముక్షువునకు తిరుగా వానికి బుద్ధి జనించదు, తదితర యోగములందు బుద్ధి జనించునని భావము

**శిష్యేణ పూర్వం యదభూదనుష్ఠితం యచ్చాపి త స్యాస్తి ముముక్షులక్షణమ్।**
**తదీయ సంస్కారగతిం పరీక్ష్య జ్ఞేయం భవేత్సద్గురుణా తదేతత్ ॥ 32**

శిష్యుడు పూర్వ మేయోగము ననుష్ఠించెనో అతనికి గల ముముక్షు లక్షణ మెట్టిదో అనుదానిని శిష్యుని సంస్కార పరిస్థితిని పరీక్షించి సద్గురువు తెలుసుకొనవలెను

**నిష్కామయోగాన్మలదోషనాశ ఉపాసనాయోగబలాన్నివృత్తిః ।**
**విక్షేపవృత్తేర్విజితేంద్రియాఢ్యా జ్జ్ఞానాత్పరాత్మా నిరుపాధికస్స్యాత్॥ 33**

నిష్కామయోగమువలన మలదోషమున్ను, ఉపాసనాయోగ బలమువలన విక్షేపదోషమున్ను నివర్తించుచున్నవి సర్వేంద్రియ నిగ్రహపూర్వకమగు పూర్ణజ్ఞానముచే నన్తరాత్మ నిరావరణమై వెలుగును

**అభ్యాసయోగాత్పరమాత్మన స్తే విభాతి చాత్మా నిరుపాధిభానువత్ ।**
**అఖండవిజ్ఞానఘనత్వ మేవ తే నిర న్తరానందయథార్థలక్షణమ్ ॥ 34**

నిరంతరాభ్యాస యోగమహిమచే పరమాత్మ స్వరూపుడవగు నీయొక్కయాత్మ (స్వరూపము) యుపాధిరహితమై నిరావరణ భాస్కరుని వలె దేదీప్యమాన మగుచున్నది అఖండవిజ్ఞాన ఘనత్వమే నీయొక్క నిరంతరానందమైన యధార్థలక్షణ మగుచున్నది

**విశ్వైకవిద్యాలయజీవకోటౌ ముముక్షవోయే వివిధా భవంతి ।**
**తేభ్యో గురుర్జ్ఞాన విధాయకాని దద్యాత్తదర్హాణి చ సాధనాని ॥ 35**

ఈ విశాలప్రపంచ మను విశ్వవిద్యాలయ మందలి జీవకోటిలో ముముక్షువులు నానావిధములుగా నున్నారు గురువు వారికి వారి యోగ్యతకు దగిన జ్ఞానము నిచ్చు సాధనలను ఇవ్వవలెను (అనగా చాలవరకు యోగసాధనలను శీలించినవారు ఉత్తములు, ఇక కొంచెము తక్కువగా మూడుగాని రెండుగాని యోగముల ననుష్ఠించిన వారు మధ్య ములు, ఇకను నిండా తక్కువగా నొకేయోగము నాచరించినవారు కనిష్ఠులు )

**త ఏవ పూజ్యా గురవః ప్రశాన్తా శ్శిష్యాన్సముద్ధర్తు మిహావతీర్ణాః ।**
**అనేకజన్మార్జితయోగసిద్ధాన్నయన్తి ముక్తిం వివిధాన్ముముక్షూన్॥ 36**

పైజెప్పబడినరీతిగా నాచరించు గురుదేవులే పూజనీయులు ప్రశాన్త హృదయులు శిష్యులను తరింపజేయుటకై అవతరించిన వారు అట్టి విచక్షణ గల గురువులు నానాజన్మలనుంచి యోగసిద్ధులను బడసిన నానావిధ ముముక్షువులను ముక్తిని బొందించుచున్నారు అనగా ముక్తులనుగా జేయుచున్నారు

శివచరణ ఉవాచ

**అద్యైవ జన్మని విముక్తి పదాభిలాషీ**
**యోగానుగశ్చ మనుజశ్చతురోఽపి యోగాన్।**
**సమ్పాద్య ముక్తిమథ గచ్ఛతి వా నవేతి**
**శంకామిమా మపనయాత్మవిదగ్రగణ్య ॥ 37**

శివచరణము చెప్పెను

ఈ జన్మములోనే నాలుగు యోగములను ప్రారంభించిన ముముక్షువు నాలుగుయోగములను పూర్తిజేసి ముక్తుడగునా, లేదా నానాజన్మలు గావలయునా? ఆత్మవేత్తలలో అగ్రగణ్యుడవయిన ఓగురుదేవా! ఈ సంశయమును నివారింపుడు తమకన్నను విజ్ఞానవంతులు సంశయ చ్ఛేదనలో నాకు లేరు

శ్రీమలయాళయతీంద్ర ఉవాచ

**అనేక సంవత్సరసాధ్యవిద్యాం న హ్యేకవర్షే వరితుం సమర్థః ।**
**యః కోఽపి ధీమాన్బహుజన్మగమ్యాం తథాఽఽత్మ విద్యాం న హి లబ్ధుమీష్టే॥**

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

ఎంత ప్రజ్ఞావంతుడైనను అనేకసంవత్సరములలో సాధించదగిన విద్యను ఒక సంవత్సరముననే సాధించ సమర్థుడు గాజాలడు అటులనే ఎంత

ధీమంతుడైననూ పూర్తిగా వాసనలు నశింపనందుచే నానాజన్మములనుంచి సాధించదగిన దురవగాహబ్రహ్మవిద్యను ఒకేజన్మమందు పూర్తిగా సంపాదింపశక్తుడు గాడు

**అనేకజన్మేతి గిరా జగాద సా బ్రహ్మవిద్యా బహుదుర్లభేతి ।**
**కృష్ణస్స సాక్షాద్భగవాంస్తదిత్థం విజ్ఞాయ తత్త్వం యతయో విముక్తాః । 39**

అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిం- అను శ్లోకముచే శ్రీకృష్ణభగవంతుడును, నిరవధిక నిర్విశేష బ్రహ్మానంద పరిపూర్ణ బ్రహ్మవిద్యను అనేకజన్మలలో సాధించవలయును అది కడుంగడు దుర్లభము అని వచించెను కావున నీ విజ్ఞానతత్త్వము నెఱింగి ప్రయత్నశీలురగు వారెల్లరు ముక్తులయిరి

**భక్త్యాదియోగాన్సుదృఢానకృత్వా జ్ఞానాప్తయే కేవలయత్నశీలాః ।**
**అప్రాప్య సిద్ధిరమృతాచ్చ్యవన్తే విజ్ఞానయోగో హి సుదుర్లభస్స్యాత్ ॥ 40**

భక్తి కర్మ మొదలగు యోగములను లెస్సగా ననుష్ఠింపకనే జ్ఞానము కొఱకుమాత్రము ప్రయత్నించువారలు యోగసిద్ధిని పొందక అమృత తత్త్వమునుండి జారిపోవుచున్నారు జ్ఞానయోగము మిగుల దుర్లభమయినది గదా! కనుక నది దుస్సాధము

**హృది నిధాయ చ తత్త్వమిదం వరం పరమసారతమాసు సుగీతిషు।**
**స భగవాన్ వసుదేవసుతః పురాప్రథమయోగమముం బహుధాఽబ్రవీత్॥41**

ఈ పరమతత్త్వమును హృదయమందు నిడుకొనియే శ్రీకృష్ణభగవానులును గీతయందు ప్రథమమగు కర్మయోగమును గురించి మునుపు అనేకవిధములుగా వచించియున్నారు

**పఠనే పఠితస్యాపి న దోషో గుణ ఏవ హి ।**
**తద్వృత్సాధిత యోగస్య సాధనం దార్ఢ్యకారణమ్ ॥ 42**

చదివిన పాఠములనే చదువుటవలన దోషమేమియు లేదు మఱియు

**త ఏవ పూజ్యా గురవః ప్రశాన్తా శ్శిష్యాన్సముద్ధర్తు మిహావతీర్ణాః ।**
**అనేకజన్మార్జితయోగసిద్ధాన్నయన్తి ముక్తిం వివిధాన్మముక్షూన్॥ 36**

పైజెప్పబడినరీతిగా నాచరించు గురుదేవులే పూజనీయులు ప్రశాన్త హృదయులు శిష్యులను తరింపజేయుటకై అవతరించిన వారు అట్టి విచక్షణ గల గురువులు నానాజన్మలనుంచి యోగసిద్ధులను బడసిన నానావిధ ముముక్షువులను ముక్తిని బొందించుచున్నారు అనగా ముక్తులనుగా జేయుచున్నారు

శివచరణ ఉవాచ

**అద్యైవ జన్మని విముక్తి పదాభిలాషీ**
**యోగానుగశ్చ మనుజశ్చతురోఽపి యోగాన్।**
**సమ్పాద్య ముక్తిమథ గచ్ఛతి వా నవేతి**
**శంకామిమా మపనయాత్మవిదగ్రగణ్య ॥ 37**

శివచరణము చెప్పెను

ఈ జన్మములోనే నాలుగు యోగములను ప్రారంభించిన ముముక్షువు నాలుగుయోగములను పూర్తిజేసి ముక్తుడగునా, లేదా నానాజన్మలు గావలయునా? ఆత్మవేత్తలలో అగ్రగణ్యుడవయిన ఓగురుదేవా! ఈ సంశయమును నివారింపుడు తమకన్నను విజ్ఞానవంతులు సంశయ చ్ఛేదనలో నాకు లేరు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**అనేక సంవత్సరసాధ్యవిద్యాం న హ్యేకవర్షే పఠితుం సమర్థః ।**
**యః కోఽపి ధీమాన్బహుజన్మగమ్యాం తథాఽఽత్మ విద్యాం న హి లబ్ధుమీష్టే॥**

శ్రీ మలయాళయతీన్ద్రుడు చెప్పెను

ఎంత ప్రజ్ఞావంతుడైనను అనేకసంవత్సరములలో సాధించదగిన విద్యను ఒక సంవత్సరముననే సాధించ సమర్థుడు గాజాలడు అటులనే ఎంత

**న విశ్వసంతి వేదాంతాన్ సాధూ న్యోగిజనానపి ॥** 47

ఈ ఆచరణములేని వేదాంతవాక్యములు వినబడుచున్నందుచే గృహస్థులీ ప్రబలదోషమును తలంచుచున్నవారై వేదాంతములను, యోగులను, సమస్త సాధుజనులను నమ్మకున్నారు

**ముముక్షుజన సాహాయ్యమకృత్వా గృహమేధినః ।**
**వినా తత్సహకారేణ సాధకాశ్చ చ్యుతిం గతాః ॥** 48

తీవ్రముముక్షువులై యున్నవారి విషయమున సహాయమును జేయనివారై గృహస్థులు వారి సహకారము లేక ముముక్షువులును స్వధర్మచ్యుతులై ఉన్నతిని పొందజాలకపోయిరి

**నాయం దోషో గృహస్థానాం కింతు ముక్తాభిమానినామ్ ।**
**సాధకాః యది శుద్ధాస్స్యుర్ధన్యా ఏవోభయేఽపి తే ॥** 49

ఇది గృహస్థుల దోషము గాదు మఱేమనగా ముక్తులు గాకున్నను మేము ముక్తులమని తలంచి ప్రవాదము చేయువారిది యగును కావున సాధకులు శుద్ధాత్ములైన వారైనచో అన్యోన్య సహకారముచే గృహస్థశ్రేష్ఠులును, యతిశ్రేష్ఠులును ధన్యులగుదురు

**అథ పరస్పరసౌఖ్యసమీహయా సహకృతిం యది సాధు భజన్తి తే ।**
**తదను ధర్మగతి శ్శుభదా భవేత్ సకలవిశ్వమిదం సుఖమాప్నుయాత్ ॥** 50

పూర్వము తెలిపినరీతిగా పరస్పర సౌఖ్యకాంక్షతో గృహస్థులును, యతులును ప్రవర్తించినచో ధర్మగతి శుభదాయక మగును (యతీశ్వరుల ఆచరణ మహిమయు, గృహస్థుల పవిత్రతయు వెల్లడగును) ఇటుల నీలోకమంతయు పరమసుఖమును పొందగలదు

**గృహస్థా యతయశ్చైవం మిథస్సహకృతిం గతాః ।**
**ధర్మమార్గే స్థితాస్సన్తః జన్మసార్థక్యమాప్నుయుః ॥** 51

యతులును గృహస్థులను పరస్పరము సహకరించుకొన్నచో

ధర్మమార్గానుగాములై, జన్మమును సఫలము గావించుకొనగలరు

**జ్ఞానాత్కైవల్యమిత్యాహుః కింతు యోగత్రయం వినా ।**
**న జ్ఞానం ముక్తజీవస్య తత్సిద్ధం పూర్వజన్మని ॥** 52

కొందరు జ్ఞాన మొకదానిచేతనే మోక్షమని వచించుదురు అయినను తక్కిన మూడు యోగములు లేక జ్ఞానము గలుగదు కావున పూర్వజన్మ మందు కర్మ భక్తి యోగములను మూడింటిని జ్ఞాని తప్పక యాచరించి యుండును

**అఖిలేషు చ శాస్త్రేషు సత్యమేతత్ప్రతిష్ఠితమ్ ।**
**వినా కర్మాదికం జ్ఞానే నాధికారస్తు సిధ్యతి ॥** 53

అనేక శాస్త్రములం దీవిషయమును ప్రతిపాదించియున్నారు మూడు యోగములు లేక నాల్గవదియగు జ్ఞానయోగమం దధికార మెన్నటికిని సిద్ధింపదు

**జ్ఞానాధికారీ కిం సృష్టో విధినా తత్త్రికం వినా ।**
**అథవాఽనుష్ఠితం తేన తత్సర్వం పూర్వజన్మని ॥** 54

త్రివిధయోగములు (కర్మభక్తి యోగములు) లేకయే యొకరిని జ్ఞానాధికారినిగా ఒకానొకచోట విధి నిర్మించెనా? లేక పూర్వజన్మ మందాతడు తక్కిన మూడు యోగముల ననుష్ఠించెనా? చెప్పుము

**ఇత్యేవమాది బహుళం పరిపృచ్ఛతోఽత్ర**
**స్యాదుత్తరం కిమపి తథ్యవివర్జితం తత్ ।**
**తద్వాదసంశ్రణతో న హి విత్తిలాభః**
**తత్త్వావబోధవిముఖాః ప్రలపన్తి తద్వత్ ॥** 55

జ్ఞానముచేతనే మోక్షము, త్రివిధయోగము లవసరము లేదని వచించు వారినిగూర్చి పైజెప్పిన రీతిగా ప్రశ్నించిన, వారలేదో ఒకదానిని జవాబిత్తురు కాని వారివాదములవలన జ్ఞానలాభము గలుగదు మరేమనగా జ్ఞానము

యొక్క తత్త్వమును తెలియనివా రాలాగున ప్రలాపము చేయుదురు

**జ్ఞానార్థమేవపురుషం భగవాన్విదధ్యా**
**త్తద్యుక్తమేవ హి తథాఽపి మహాప్రమాదః ।**
**స్యాదీశ్వరే పరమకారుణికే స దోషో**
**తస్మాదియం క్రమగతిశ్శ్రుతిషూపదిష్టా ॥** 56

ఒకవేళ ఈశ్వరుడు జ్ఞానార్హత గలవాని నొకనిని సృష్టించినచో అది యుక్తమే అయినను అది ప్రమాదమే ఆ దోషము పరమకారుణికుడగు ఈశ్వరునిపై బడును తన్నివారణార్థము వేదములందు కర్మాదియోగ పద్ధతి నిరూపింపబడుచున్నది

**యః కోఽపి వృక్షశిఖరేషు ఫలాని పశ్యన్**
**జాతాని తాని చ వినా కిల పుష్పయోగమ్ ।**
**ఇత్యాహ చేత్సహి భవేన్మతిహీన ఏవ**
**జ్ఞానైకవాదనిరతస్సదృశో హి తేన॥** 57

**యో బుద్ధిమాన్ స తు వదేత్ సుమయోగజత్వం**
**సమ్యక్పరీక్ష్య ప్రకృతిం భువి తత్ఫలానామ్ ।**
**జ్ఞానం క్రమేణ ఫలతీతి వదేద్వివేకీ**
**తద్వృత్తదేతదఖిలశ్శిరసా భజేత ॥** 58

ఒక వృక్షముయొక్క యగ్రభాగమునందు బాగుగా పండిన ఫలములను గాంచి ఆపండ్లన్నియు సుమసంబధము లేకనే పుట్టినవని చెప్పినచో వాడు మతిహీనుడే కేవల జ్ఞానవాది వానితో సమానుడు బుద్ధిమంతుడు ప్రకృతిని పరీక్షించి పండు వృక్షసుమసంబంధముతో పుట్టెనని చెప్పును వివేకియైన వాడు కర్మాది క్రమముతోనే జ్ఞానము కలుగునని చెప్పును ఈ పరమసిద్ధాన్తమును ప్రతివారును శిరసావహించవలెను

**న కర్మణా మనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**ఇత్యేవమాది బహుధా భగవాన్ప్రాహ ఫల్గుణమ్ ॥** 59

కావుననే ''న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే''= కర్మానుష్ఠానములేక నైష్కర్మ్యస్థితిని పొందజాలడు అను మొదలగు వాక్యములను శ్రీకృష్ణభగవంతు డర్జునుని గూర్చి యనేక పర్యాయము లుపదేశించెను

**ఆద్యస్తు కర్మయోగో హి కిమేతైర్బహుభాషణైః ।**
**మందా అపి యథా విద్యుస్తథోవాచ జనార్దనః ॥ 60**

అన్ని యోగములలోను మొదటిది కర్మయోగము ఇక బహుభాషణ లేల? భగవంతుడు మందమతులకు గూడ దెలియునటుల పలికెను

**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ।**
**ఇతి తత్త్వం సదా విద్వన్వివేకీ ప్రవిముచ్యతే ॥ 61**

మఱియు, కర్మను చేయని వానికి జీవనయాత్రగూడ నడువదు అని శ్రీకృష్ణభగవాను డుపదేశించెను ఈతత్త్వమును దెలిసి వివేకి సర్వకర్మానుష్ఠానముల నొనరించి ముక్తుడగుచున్నాడు

**న సజ్జతే యథావర్ణో వస్త్రే మాలిన్యదూషితే ।**
**తథాఽత్మశుద్ధిహీనానామాత్మబోధో న జాయతే॥ 62**

వస్త్రము మలినముగా నుండిన రంగేలాగున పట్టదో ఆలాగున మలినాత్ములకు ఆత్మబోధ గ్రాహ్యము గాదు

**క్షాళితే హి పటే శుద్ధే యథా వర్ణః ప్రసజ్జతే।**
**శుద్ధాత్మని తథా యోగైరాత్మబోధః ప్రసజ్జతే॥ 63**

బాగుగా నుతికిన శుద్ధమగు వస్త్రమునందు రంగు బాగుగా పట్టులాగున కర్మభక్తి యోగములచే పరిశుద్ధాత్ము లయినవారికి ఆత్మబోధ సులభముగా గలుగుచున్నది

**ప్రబోధమన్దారతరోరంకురా హి సమన్తతః ।**
**యోగాద్యావరణాభావే ఖాద్యన్తే వృత్తిజంతుభిః ॥ 64**

ప్రబోధ మనెడు కల్పవృక్షముయొక్క యంతటనున్న జ్ఞానాంకురము లకు త్రివిధయోగములనెడు కంచె లేనిచో విషయవృత్తులను పశువులు మేయుచున్నవి

**దర్పణేన వినా దీపో యథా వాతైర్వినశ్యతి ।**
**యోగాది రహితం జ్ఞానం తథా నశ్యతి వృత్తిభిః ॥ 65**

చిమ్ని లేనిచో దీపము గాలిచే నారిపోవు విధమున త్రివిధయోగములు లేకపోయిన జ్ఞానదీపము విషయవృత్తులను పెనుగాలిచే వెలుగక పోవుచున్నది

**మలినే దర్పణే చిత్తే ఛాయేవాత్మా న భాసతే ।**
**తస్మిన్ విశుద్ధే సుస్పష్టం స్వాత్మబిమ్బం ప్రకాశతే ॥ 66**

మలినమగు అద్దములో ప్రతిబింబమువలె మలినచిత్తమందు ఆత్మ ప్రకాశించదు శుద్ధమగు దర్పణమనెడి విశుద్ధాన్తరంగమందు తనయొక్క బింబమనెడు ఆత్మ స్పష్టముగా ప్రకాశించును

**సమాధియోగ సిద్ధ్యర్థం తథా స్వాత్మవిశుద్ధయే ।**
**దృఢమభ్యస్యతాం యోగత్రితయం జ్ఞానమిచ్ఛతా ॥ 67**

కావున నిర్వికల్పసమాధి సిద్ధికొఱకును, స్వాత్మవిశుద్ధికొఱకును కర్మభక్తియోగములను మూటిని జ్ఞానముగోరు మహానుభావుడు దృఢముగా నభ్యసించవలయును

**యోగేన కేచిత్పరమామనన్తి జ్ఞానేన భక్త్యాఽపి చ కర్మణా వా ।**
**ఏకస్య యోగస్య చ ముఖ్యతాయాం యోగాంతరాణాం చ గుణత్వసిద్ధిః ॥ 68**

కొందఱు యోగముచేతనే పరతత్త్వము లభించుననియు, మఱి కొందఱు భక్తిచేతనే పరమాత్మప్రాప్తియనియు, ఇక కొందఱు నిష్కామ కర్మచేతనే యీశ్వరప్రాప్తియనియు, మఱియు కొందఱు జ్ఞానముచేతనే ముక్తి లాభమనియు నొక్కివక్కాణించుచున్నారు అయినను ఒక యోగము ముఖ్యమని చెప్పుటచే దానిలో మిగిలిన యోగములు గూడ ఉండియే

యున్నవి అయితే నవి గౌణములుగా నున్నవి ఈలాగున మహాత్ముల బోధలను తెలియవలెను

**తథైవ శాస్త్రాణి చ తత్త్వమాహు స్తదేవ విజ్ఞానిషు సమ్యగీక్ష్యతే ।**
**ఉక్తప్రకారేణ చతుర్షు యోగేష్వేకేన నిత్యం పరమావ్యతే ధ్రువమ్॥ 69**

పైలాగుననే శాస్త్రములు సత్యమును తెలుపుచున్నవి ఆలాగుననే యాత్మజ్ఞానులయందును కనబడుచున్నది కావున పూర్వము చెప్పిన పద్ధతి ననుసరించి ఇతర యోగముల సహకారముతోనే యొక్క యోగము చేతనైనను పరతత్త్వము లబ్ధమగుచున్నది

**ఏవం భావయతస్తత్త్వం ముముక్షోస్సుఖకారిణీ ।**
**జాయతే ముక్తిపదవీ శాంతిపూర్ణా మహాత్మనః ॥ 70**

ఓ నిర్మలాత్మా! ఈలాగున తత్త్వమును చింతించుచున్న ముముక్షువునకు (ఎవడైనను శుద్ధాత్ముడైన చాలును అట్టి మహానుభావునకే) నిఖిలశాన్తియు కేవలసుఖస్వరూప ముక్తిపదవియు లభించుచున్నదని నిర్ణయము తప్పక గలుగుచున్నది

**కర్మయోగప్రసంగేన పరే యోగాశ్చ దర్శితాః।**
**తేషాం మధ్యే కర్మయోగః ప్రధాన ఇతి భాషితః॥ 71**

కర్మయోగ ప్రసంగవశాత్తుగా భక్తి ధ్యాన జ్ఞానయోగములు గూడ నిరూపింపబడినవి వానిలో కర్మయోగమే ముఖ్యమనిగూడా వివరించడమైనది

**కర్మయోగస్య మాహాత్మ్యం యస్తు తత్త్వం చ విన్దతి ।**
**స ఏవ నిధనం గత్వా బ్రహ్మలోకే మహీయతే ॥ 72**

కర్మయోగతత్త్వమును, మాహాత్మ్యమునున్ను ఎవడు తెలియుచున్నాడో ఆ మహాత్ముడు అవసానకాలమున శరీర పరిత్యాగానంతరము బ్రహ్మలోకపూజ్యు డగుచున్నాడు

**నిష్కామకర్మయోగేన చిత్తశుద్ధిస్తు నిశ్చితా ।**
**చిత్తేఽథ శుద్ధే నైష్కర్మ్యస్థితిర్భవవిభేదినీ ॥** 73

**సత్యం తత్త్వమిదం లోకే నిష్కామాచరణేన చ ।**
**స్వానుష్ఠానేన సంబోధ్య నిష్కర్మా బ్రహ్మభాగ్భవ ॥** 74

నిష్కామకర్మాచరణముచే చిత్తశుద్ధి గలుగును, చిత్తశుద్ధి గలిగిననే అనాదిబన్ధ విచ్ఛేదకమగు నైష్కర్మ్యస్థితి(మోక్షము) లభించును కావున నిష్ఠాగరిష్ఠుడవగు ఓ నియమశాలీ! సత్యమగు నీరహస్యమును నిష్కామాచరణపూర్వకమగు నీ యనుష్ఠానముచే లోకమునకు బోధించి నీవు స్వయముగా నిష్కర్ముడవై(సర్వకర్మవిముక్తుడవై) శాశ్వత బ్రహ్మపదవిని బొందుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయం ఉపనిషత్సారభూతాయాం

కర్మయోగో నామ నవమోఽధ్యాయః॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీ మలయాళయతీన్ద్రగీతయందు

కర్మయోగమను నవమాధ్యాయము సమాప్తము



# దశమోఽధ్యాయః

# అష్టాఙ్గయోగః

శివచరణ ఉవాచ

**యోగేషు భేదాః కతి వా భవన్తి తే సర్వయోగాః కిము సాధనీయాః ।**
**యోగేన తేష్వన్యతమేన ముక్తిః కిం సాధ్యతే వా కృపయా వదన్తు ॥ 1**

శివచరణము చెప్పెను

యోగము లెన్నివిధములు? ఆ యోగము లన్నిటిని సాధించవలయునా? లేక వానిలో నేదైన నొకయోగమాత్రముచే ముక్తి లభించునా? ఈ విషయముల నన్నిటిని తమరు పరమదయతో నానతిండు

**తం ప్రశ్నమాకర్ణ్య గురూత్తమ స్తదా ముహూర్తకాలం పరమేశ్వరం విభుమ్।**
**తథా గురూన్సిద్ధమహర్షిపుంగవాన్ధ్యాయన్సుధీర్ధీరగిరా బభాషే ॥ 2**

అప్పుడు గురుదేవు డాప్రశ్నను విని కించిత్కాలము సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని, ఆలాగున గురువులను, సిద్ధులను, మహర్షిశ్రేష్ఠులను ధ్యానించుచు జ్ఞానమూర్తియై గంభీరవాక్కుతో నీలాగున జెప్పదొడంగెను

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**యోగనిష్ఠాగరిష్ఠానాం పదవీం లబ్ధుమిచ్ఛునా ।**
**యస్త్వయా విహితః ప్రశ్నస్తస్యోత్తరమిహోచ్యతే ॥ 3**

శ్రీమలయాళయతీన్ద్రుడు చెప్పెను

యోగనిష్ఠాగరిష్ఠులగు యోగీశ్వరుల పదవిని పొంద నిచ్ఛగించునట్టి నీచే ఏ ప్రశ్న వేయబడెనో దానికి సమాధానము వచింపబడుచున్నది వినుము

**యోగాత్పరతరం నాన్యత్కించిదస్తీహ సాధనమ్ ।**
**యోగే సిద్ధేఽఖిలం సిద్ధం జితే రాజ్ఞి జితాః ప్రజాః ॥ 4**

ముక్తికై యోగమునకన్న శ్రేష్ఠమయిన మఱియొక సాధన మీలోకమున

లేదు రాజు వశ్య మగుచో సమస్త ప్రజలును స్వాధీను లగునటుల యోగ మొకటి సిద్ధించిన సమస్తము సిద్ధించుచున్నది

**యోగాన్నాస్తి పరం పుణ్యం యోగాన్నాస్తి పరం తపః ।**
**యోగాన్నాస్తిపరం తత్త్వం తస్మాద్యోగం సమాచర ॥ 5**

యోగముకన్న పరమపుణ్యము లేదు యోగముకన్న మహోత్కృష్ట తపస్సున్ను లేదు యోగమునకన్న పరతత్త్వము లేదు కావున యోగమును బాగుగా నాచరింపుము

**యోగస్య మహిమా కోఽపి భాతి వాచామగోచరః ।**
**పురుషస్య మహాభాగ్యం జానీయాద్యోగమూలకమ్ ॥ 6**

యోగమహిమ సర్వవిలక్షణమైనది అనిర్వాచ్యము ఎందువలన ననగా పురుషునిచే అనుభవింపబడుచున్న మహాభాగ్యమంతయు యోగ శక్తినిగా, అదృష్టమునుగా తెలియుము

**అనయా నను లోకోక్త్యా జ్ఞాయతే యోగవైభవమ్ ।**
**న కేవలం పండితానాం పామరాణాఞ్చ గోచరమ్ ॥ 7**

ఈలోకోక్తిచేతనే యోగమహిమ తెలియుచున్నది ఇది పండితులకే గాక పామరజనులకును గోచరమే

**మునీనాం మునిశార్దూలస్సర్వేషాం ప్రియకృత్తమః ।**
**పతంజలిర్మునిర్నామ యోగాంగాష్టకమబ్రవీత్ ॥ 8**

యోగులందఱికిని ప్రియమును జేయువాడును, మునీశ్వరులలో మునిశ్రేష్ఠుడయిన పతంజలి మహాముని యోగమున కెనిమిదంగములను చెప్పెను

**తద్యథా శ్రూయతాం వత్స యమో నియమ ఏవ చ ।**
**ఆసనం చాథ యోగస్య ప్రాణాయామస్తథా పరః ॥ 9**
**ప్రత్యాహారో ధారణా చ ధ్యానశ్చైవ యథాక్రమమ్।**

**సమాధిరపి జానీయాదష్టాంగానీతి తత్త్వతః ॥ 10**

వత్సా! ఆ యష్టాంగయోగములను వినుము 1 యమము, 2 నియమము, 3 ఆసనము, 4 ప్రాణాయామము, 5 ప్రత్యాహారము, 6 ధారణ, 7 ధ్యానము, 8 సమాధి అనునవి అష్టాంగయోగములుగా తెలియవలెను

**కర్మాది యోగ శీలానాం చతుర్ణామపి యోగినామ్ ।**
**సతతం సేవితావ్యే స్తః యమశ్చ నియమస్తథా ॥ 11**

కర్మ భక్తి యోగ జ్ఞానములను నాలుగింటికి సమ్బంధించిన యోగులందఱును యమ నియమములను రెంటిని సర్వదా సేవించవలయును

**యమేన నియమేనైవ బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ।**
**సర్వం విశ్వం పాలయ న్తి తస్మాత్తత్సమ్మతావుభౌ ॥ 12**

బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగూడ యమ నియమప్రభావముచేతనే సమస్త విశ్వమును పాలించుచున్నారు కనుక వారికిని నా యమనియమములు రెండును సమ్మతములై యున్నవి

**ఆవశ్యకౌ చ సర్వేషాం ద్వౌ పాదౌ చరితుం యథా ।**
**తథా యమశ్చ నియమో ముక్తిం గంతుం సమీరితౌ ॥ 13**

మనుష్యులందఱికిని సంచరింపనెట్టుల రెండుపాదము లావశ్యకములై యున్నవో, ఆలాగున ముక్తిని పొందుటకు నందఱికిని యమ నియమములు రెండు సాధనములుగా జెప్పబడినవి

**అన్యే కేచిన్మహాత్మానో యోగాస్సన్తి చతుర్విధాః ।**
**మన్త్రయోగో రాజయోగో లయయోగస్తథా హఠః ॥ 14**

**ఇత్యేవం కథయన్త్యేవ తేషామపి మహాత్మనామ్ ।**
**యమాశ్చ నియమాః ఖ్యాతాః కేవలాత్మవిశుద్ధయే ॥ 15**

కొందఱు మహాత్ములు 1 మన్త్రయోగము, 2 రాజయోగము,

3 లయయోగము, 4 హఠయోగము అని యోగములను నాలుగువిధము లుగా వచించుచున్నారు ఆ చతుర్విధయోగములను శీలించు మహాత్ముల కును స్వాత్మ సిద్ధికొఱకు యమ నియమము లావశ్యకములుగా చెప్పబడినవి

**యమానాం నియమానాం చ పృథగ్భేదా దశేరితాః ।**
**వేదాంతశాస్త్రసిద్ధాన్తే తేషాం దార్ఢ్యేన ముచ్యతే ॥ 16**

యమనియమములకు ప్రత్యేకముగా పది భేదములు చెప్పబడినవి అవి యుపనిషత్తులందును ప్రతిపాదింపబడినవి అవి దృఢము లయినచో మోక్షము తప్పక సిద్ధించును

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయాఽఽర్జవమ్ ।**
**క్షమా ధృతిర్మితాహారశ్శౌచం చేతి యమా దశ ॥ 17**

1 అహింస, 2.సత్యము, 3 అస్తేయము, 4 బ్రహ్మచర్యము, 5 దయ, 6 ఆర్జవము, 7 క్షమ, 8 ధృతి, 9 మితాహారము, 10 శౌచము –ఈ పది యమము లనబడును

**తపస్సన్తోషమాస్తిక్యం దానమీశ్వరపూజనమ్ ।**
**వేదాన్తవాక్యశ్రవణం హ్రీర్మతిశ్చ జపో వ్రతమ్ ॥ 18**

1 తపస్సు, 2 సన్తోషము, 3 ఆస్తిక్యబుద్ధి, 4 దానము, 5 ఈశ్వర పూజనము 6 వేదాంతవాక్యశ్రవణము, 7 హ్రీ(లజ్జ), 8 మతి, 9 జపము, 10 వ్రతము– ఈ పదియు నియమము లనబడును

**ముక్తిసౌధస్య దార్ఢ్యాయ మూలబంధో యమస్తథా ।**
**నియమశ్చ దృఢః ప్రోక్తస్సర్వేషాం యోగినాం కృతే ॥ 19**

ముక్తియను సౌధము దృఢముగా నుండుటకు యోగు లందఱికిని యమనియమములు దృఢమైన పునాదిగా పేర్కొనబడినవి

**దుర్బలో మూలబంధశ్చేత్సౌధస్తేన వినిర్మితః ।**
**మహావృష్టి ప్రఘాతేన వాయునా పతతి ధ్రువమ్॥ 20**

స్థిరముగా లేని పునాదితో కట్టిన ప్రాసాదము గొప్ప వర్షాఘాతము చేతను, పెనుగాలిచేతను తప్పక పడిపోవును

**తథా యమైశ్చ నియమైర్దుర్బలైస్సహితో యది ।**
**ముక్తిసౌధః పతత్యేవ ప్రబలైః ప్రాకృతైర్గుణైః ॥ 21**

ఆలాగున యమనియమములు దుర్బలము లయినచో, ముక్తిప్రాసాదము ప్రబలప్రాకృత గుణములను వానగాలులచే కూలిపోవును

**ఆసనాని బహూనీతి యోగజ్ఞాః కథయ న్తి చ ।**
**తేషాం మధ్యే బద్ధపద్మం పద్మం సిద్ధాసనం తథా ॥ 22**

**సర్వాంగం చ ప్రధానాని సంత్యన్యాన్యాసనాని చ ।**
**ఆవశ్యకాని సర్వేషాం యోగినామాత్మవేదినామ్ ॥ 23**

ఆసనము లనేకములని యోగశాస్త్రజ్ఞలు చెప్పుచున్నారు వానిలో బద్ధపద్మ పద్మ సిద్ధాసన సర్వాంగాసనములు ముఖ్యములు ఇకను మఱికొన్ని ముఖ్యాసనములు గలవు ఆ ఆసనములు గూడ యోగులకును, ఆత్మజ్ఞానులకు నావశ్యకములై యున్నవి

**విజ్ఞానార్థం మనశ్శుద్ధ్యై కుణ్డలీబోధనాయ చ ।**
**శీతోష్ణాదిని సోఢుం చ సంసేవ్యాన్యాసనాని వై ॥ 24**

విజ్ఞానముకొఱకును, చిత్తశుద్ధికొఱకును, నిశ్చలత్వముకొఱకును, కుండలీప్రబోధముకొఱకును, శీతోష్ణాదులను వహించుటకును ఆసనములను సేవించవలయునని యోగశాస్త్రముయొక్క నిశ్చయము

**దృఢత్వం చ శరీరస్య ధ్యానే చిత్తానుకూలతా ।**
**ఆసనానాం ఫలాని స్యుర్దీర్ఘధ్యానాదికాని చ ॥ 25**

మఱియు ఆసనములవలన శరీరదృఢత్వము, చిత్తము ధ్యానానుకూలమగుట, చాలసేపు ధ్యానములో నిలుచుశక్తి మొదలగు ప్రయోజనములు సిద్ధించును

**ప్రాణాయామశ్చ బహుధా కథ్యతే యోగవిత్తమైః ।**
**తే సర్వేఽద్య యుగేఽసాధ్యాస్తస్మాద్ధ్యాగ్యం సమాశ్రయేత్ ॥ 26**

ప్రాణాయామముగూడ ననేకవిధములుగా నున్నదని యోగవేత్తలు వచించుచున్నారు ఆ ప్రాణాయామ భేదము లన్నియు నీ కలియుగమున యసాధ్యము లయినందున ధ్యానయోగ్య మయినదానిని గ్రహించ వలయును

**సర్వేషామేవ భేదానాం లఘుస్సర్వోత్తమో మతః ।**
**కాయశుద్ధి స్తతస్సిద్ధా మనో నైర్మల్యమేవ చ ॥ 27**

ఆ ప్రాణాయామభేదములలో లఘుప్రాణాయామము సర్వోత్తమ మయినది ఆ సులభప్రాణాయామముచేతనే కాయశుద్ధి, మనోనిర్మలత్వము మొదలయిన ప్రయోజనములు గలుగును

**కర్మకాష్ఠేషు దగ్ధేషు ప్రాణాయామాగ్నినా ముహుః ।**
**దగ్ధలోహాదివచ్చిత్తం దగ్ధదోషైః ప్రసీదతి ॥ 28**

ప్రాణాయామాగ్నిచే కర్మకాష్ఠము లన్నియు దహింపబడగా అగ్నిలో బడిన లోహము శుద్ధమగునటుల చిత్తముగూడ సకలదోషములు దహింప బడి శుద్ధమగును

**లోహానాం ద్రావణే వాయురివాగ్నేః ప్రాణసంయమః ।**
**వృత్తీనాం విలయే తత్త్వవిచారశ్చ సహాయకృత్ ॥ 29**

లోహములను కరిగించుటయందు అగ్నికి వాయు వెటుల సహాయకారి యగుచున్నదో ఆలాగున చిత్తవృత్తులను దహించుటయందు తత్త్వవిచార మునకు ప్రాణసంయమము సహాయము చేయును

**నౌకాయానవిధౌ వాయురనుకూలో భవేద్యది ।**
**యథా వా నావికశ్శీఘ్రం తరత్యంభోనిధిం తథా ॥ 30**

**ఆత్మ తత్త్వవిచారేఽపి ప్రాణాయామానుకూల్యతః॥**

**తత్త్వజ్ఞస్తరతి క్షిప్రం ఘోరసంసార సాగరమ్ ॥** 31

సముద్రమును దాటుటయందు గాలి యనుకూలముగా వీచుచుండిన నావికుడు శీఘ్రముగా సముద్రమును దాటును అట్లే తత్త్వవిచార విధిలో ప్రాణసంయమము సహాయముగా నుండిన తత్త్వవేత్త యీ సంసార సముద్రమును తొందరలో దాటుచున్నాడు

**ప్రాణినో నైవ జీవంతి ప్రాణవాయుం వినా యథా ।**
**తథైవ యోగినస్సర్వే ప్రాణాయామం వినా న హి।** 32

ప్రాణవాయువు లేనిచో ప్రాణులు జీవింపజాలరు ఆలాగుననే యోగీశ్వరులందఱు ప్రాణసంయమము లేక యుండరు వారికది ప్రాణము వంటిదే యగును

**ప్రాణాయామస్స విదితస్సగర్భాగర్భభేదతః ।**
**సగర్భో మన్త్రసహితో మన్త్రహీన స్తథాఽపరః ॥** 33

ప్రాణాయామము సగర్భము, అగర్భము అని రెండు విధములుగా నున్నది 1 సగర్భమనగా ప్రణవాది మన్త్రములతో గూడినది 2 అగర్భమనగా మన్త్ర రహితమయినది

**పునశ్చ ద్వివిధః ప్రోక్తో భావనాభావనాత్మకః ।**
**భావనారహితో దేహరక్షణైకఫలస్స్మృతః ॥** 34

మఱియు నా ప్రాణాయామము భావనాసహితము, భావనారహిత మని రెండు విధము లయినది భావనారహిత ప్రాణాయామము శరీరసంరక్షణమును మాత్రము గలుగజేయును

**భావనాసహితః పుణ్యః పాపారణ్యమహానలః ।**
**స్వాత్మశుద్ధికరః పూతో భవరోగమహౌషధమ్ ॥** 35

దైవభావనతో గూడిన ప్రాణసంయమము పుణ్యమైనది, పాపారణ్యమును దహించును, ఆత్మశుద్ధిని గలుగజేయును, మహాపవిత్ర మయినది

సంసారవ్యాధికి దివ్యౌషధము నగును

**పూరకం తు ద్విమాత్రం స్యా త్కుమ్భకం చాష్టమాత్రకమ్।**
**రేచకం స్యాచ్చతుర్మాత్రం త్రిమాసాభ్యాస సంయుతమ్ ॥** 36

**తదూర్ధ్వం ద్విగుణం కుర్యాత్ షణ్మాసం విజితేన్ద్రియః ।**
**సదాఽభ్యసనసంశీల ఆత్మసిద్ధిముపైతి చ ॥** 37

ఇక ప్రాణాయామ లక్షణమును వినుము రెండు మాత్రలకాలము పూరకము, నాలుగుమాత్రల కాలము రేచకము, ఎనిమిది మాత్రలకాలము కుమ్భకము - ఈలాగున ప్రాణాయామమును మూడు మాసములు బహుజాగ్రత్తగా నభ్యసించవలయును తదుపరి ప్రాణాయామమును రెట్టింపుజేసి మూడుమాసము లభ్యసించవలయును ఈలాగున మొత్తము ఆఱుమాసములు ప్రాణసంయమ మొనరించినవాడు సకలేన్ద్రియవృత్తులు శమించి ఆత్మసిద్ధిని పొందుచున్నాడు

**మన్త్రభావవిహీనోఽయం సామాన్యైశ్చ ముముక్షుభిః ।**
**త్రివిధః క్రియతే నూనం స్థూలదేహస్య శుద్ధిదః ॥** 38

సాధారణముగానుండు కొందఱి ముముక్షువులచేత మన్త్రరహితముగను భావనారహితముగను నీ త్రివిధ రేచక పూరక కుమ్భక ప్రాణాయామ మాచరింపబడుచున్నది ఈత్రివిధప్రాణాయామము స్థూలదేహ శుద్ధిని మాత్రము గలిగించును, నిశ్చయము

**శుద్ధాహారో బ్రహ్మచర్యం వివిక్తం మితభాషణమ్ ।**
**ప్రాణసంయమినాం తేషాం నియమా ఇతి కీర్తితాః ॥** 39

మఱియు శుద్ధాహారము, బ్రహ్మచర్యము, ఏకాంతము, మితభాషణము-ఇవి ప్రాణాయామ తత్పరులగు యోగీశ్వరుల కనుష్ఠించదగిన ముఖ్యనియమములుగా వచింపబడెను

**ప్రాణాయామః ప్రయాసశ్చే త్స తూర్ధ్వం త్యాజ్య ఏవ హి ।**

**నో చేద్వ్యాధిశ్చ చాఞ్చల్యం యోగాద్భ్రంశశ్చ జాయతే ॥ 40**

ప్రాణాయామము ప్రయాస మయినచో వెంటనే దానిని పరిత్యజించ వలయును అటు గాకుండిన నీ ప్రాణసంయమము వ్యాధిని, బుద్ధిచపల తను, యోగభ్రష్టత్వమునున్ను గలుగజేయును

**సర్వసిద్ధికరస్త్వర్థం సర్వదాఽభ్యసనోచితః ।**
**అపాయరహితశ్శుద్ధో బ్రహ్మభావనగుమ్భితః ॥ 41**

**యోగినామపి సర్వేషాం సాధ్యః కేవలకుమ్భకః ।**
**విశేషతస్సదా రాజయోగినామ్ ప్రియకారకః ॥ 42**

సర్వసిద్ధులను గలిగించునదియు, సర్వదా యభ్యసింపదగినదియు, అపాయరహిత మయినదియు, బ్రహ్మభావనతో గూడినదై పరిశుద్ధ మైనదియు నగు కేవలకుమ్భక ప్రాణాయామము యోగీశ్వరు లందఱికిని సులభసాధ్య మయినది రాజయోగులకు ఎల్లవేళల విశేషముగా ప్రియమును గలిగించునది యగును

**కేవలః కుమ్భకో నామ రేచపూరకవర్జితః ।**
**మన్త్రార్థభావనా యుక్త స్సతు కైవల్యదాయకః ॥ 43**

రేచకపూరకములు లేక మన్త్రార్థదైవభావనలతో గూడుకొని యభ్యసిం పబడునది కేవల కుమ్భక ప్రాణాయామ మగును ఇది కైవల్యదాయక మగును

**ఇన్ద్రియాణాం హి చరతాం విషయేషు స్వభావతః ।**
**ప్రత్యాహారస్స కథితః స్థాపనం ప్రత్యగాత్మని ॥ 44**

స్వభావముగా బహిర్ముఖములై ఇన్ద్రియము లాయా విషయముల యందు సంచరించుచుండగా నా యిన్ద్రియములను అన్తర్ముఖము జేసికొని చిత్తమును పరమాత్మయందు నిలుపుట ప్రత్యాహార మగును

**సాకారశ్చ నిరాకారః స్వాత్మభావనయా యుతః ।**

**ఇత్యయం యోగశాస్త్రజ్ఞైస్త్రి విధస్సంప్రకీర్తితః ॥** 45

ఆప్రత్యాహారము 1 సాకారము, 2 నిరాకారము, 3 స్వాత్మభావనతో గూడినదని దీనిని మూడు విధములుగా చెప్పినది (1 సాకారమనగా సగుణత రూపధ్యాన మగును 2 నిరాకారమనగా కరుణామయ సత్యశాన్త్యాది విశిష్ట పరమాత్మభావన యగును, 3 ఆత్మభావన యనగా ''సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'' అను పరబ్రహ్మయే ఆత్మయని భావించుట యగును )

**తేషాం మధ్యే వరం శ్రేష్ఠో వేదసమ్మత ఏవ చ ।**
**అద్వైతాత్మ స్వరూపశ్చ స్వాత్మభావనయా యుతః ॥** 46

ఆ త్రివిధ ప్రత్యాహారములలో ఆత్మభావనతో గూడిన ప్రత్యాహారము మిగుల శ్రేష్ఠమైనది అదియే వేదసమ్మతము, అద్వైతాత్మ స్వరూపమనియు దెలియవలెను

**మహాశైలం యథా భూమి ర్నిశ్చలా ధరతి స్థిరమ్ ।**
**బ్రహ్మభావం తథా దైవభావం ధత్తే సుధీః పుమాన్ ॥**
**తదేవ ధారణాం ప్రాహుర్ధారణా తత్త్వకోవిదాః ॥** 47

భూమి నిశ్చలమై స్థిరముగా పర్వతమును ధరించు విధమున నిశ్చలచిత్తముతో బ్రహ్మభావమునుగాని, ఇష్టదైవభావమును గాని యే ధీమంతుడు ధరించుచున్నాడో ఆ ధరించుటనే ధారణాతత్త్వజ్ఞులు ధారణ యని వచించుచున్నారు

**సాకారం వా నిరాకారం ధ్యాతుర్ధ్యేయం నిర న్తరమ్ ।**
**తదేకభావనాయుక్తం ధ్యానం యోగవిదో విదుః ॥** 48

ధ్యాతయొక్క ధ్యేయము సాకారమైనను నిరాకారమైనను నితర భావనలు లేక తదేకభావనతో గూడిన దయినచో దానిని యోగతత్త్వజ్ఞులు ధ్యానమని తెలియుచున్నారు

**ధ్యాతృధ్యానే పరిత్యజ్య కేవలం ధ్యేయమాత్రతా ।**
**స్వస్వరూపావస్థితిర్యావత్సమాధిస్సోఽభిధీయతే ॥** 49

ధ్యాతృధ్యానభేదమును గూడ వదలి కేవలము ధ్యేయమాత్రమై అనగా స్వస్వరూపావస్థితిలో నుండుట సమాధి యని చెప్పబడుచున్నది

**సైవ స్థితిః పరం తత్త్వం కైవల్య మమృతం పదమ్ ।**
**బ్రహ్మభిన్నం చ తజ్జ్ఞేయం శాశ్వతం సుఖముత్తమమ్ ॥** 50

ఆ స్వస్వరూపస్థితి యను సమాధియే పరతత్త్వము, కైవల్యము, అమృతపదము, బ్రహ్మరూపము, మహోత్తమ మయిన శాశ్వత సుఖము

**తద్బ్రహ్మగమ్యం ముక్తిశ్చ పురుషార్థస్తదేవ హి ।**
**వేదాన్తానాం సర్వవిదాం తద్ధి నిశ్చప్రచం వచః ॥** 51

ఆ ధ్యేయబ్రహ్మమే గమ్యము, ముక్తి, పురుషార్థముగూడ నదియే మఱియు వేదాన్తము లనబడు నుపనిషత్తులయొక్కయు, సర్వము దెలిసిన తత్త్వవేత్తలయొక్కయు నిశ్చయార్థకమైన వాక్యార్థము గూడ నా పరబ్రహ్మమే

**బహుజన్మకృతం పుణ్యం దైవానుగ్రహమేవ చ ।**
**వినా తన్నైవ సిద్ధం స్యాత్తచ్చ తత్త్వవిదో విదుః ॥** 52

నానాజన్మలనుంచి నాచరించబడు సుకృతము దైవానుగ్రహమున్ను (గురుకరుణయు) లేక ఆబ్రహ్మత్వస్థితి యెన్నటికిని గలుగదు ఈవిషయమును తత్త్వవేత్తలు ఎరుంగుదురు

**తదేవ సర్వశాస్త్రాణి బ్రువన్తి చ పునః పునః ।**
**ఐకకణ్ఠ్యేన మునయ స్తథా భక్తిమతాం వరాః ॥** 53

ఈ విషయమునే సకలశాస్త్రములును బోధించుచున్నవి మునీశ్వరులును భక్తశ్రేష్ఠులును నేకకంఠముతో వచించుచున్నారు

**సంసారసాగరం తీర్త్వా మహాత్మా యస్తు ఖేలతి ।**

**అపారే చిత్సుఖే నిత్యం కృతకృత్యస్స ఏవ హి ॥** 54

సంసారసముద్రమును దాటి అపారచిద్రూప సుఖమయ స్వాత్మ స్వరూపమం దేమహాత్ముడు సర్వదా క్రీడించుచున్నాడో ఆ యఖండ విజ్ఞానియే కృతకృత్యు డయిన తత్త్వవేత్త యగుచున్నాడు

**తస్యైవ సార్థకం జన్మ తేనైవ సుకృతం కృతమ్ ।**
**అమోఘం తస్య మాహాత్మ్యం వక్తుం కోఽపి న శక్నుయాత్ ॥** 55

ఆమహానుభావుని జన్మయే సార్థకమైనది అతడు చేసినదే నిజమైన సుకృతము అమోఘమైన అతని మాహాత్మ్యమును వర్ణింప ఎవడును సమర్థుడు కాడు

**ధన్యా మాతా పితా ధన్యో ధన్యం గోత్రం తథైవ చ ।**
**ధన్యా చ వసుధా తస్య తిష్ఠతశ్చరతోఽపి వా ॥** 56

ఆ జీవన్ముక్త విద్వాంసుడు సంచరించుచుండినను, ఒకేచోట నుండినను సరియే ఆ మహాత్ముని తల్లి ధన్యురాలు, తండ్రి ధన్యుడు, వానివంశము ధన్యము, భూదేవియు ధన్యురాలు

**జీవన్ముక్తస్య తస్యైవ దర్శనస్పర్శనాదినా ।**
**మహాపాపాః పూతభావా ముక్తిమ్యర్థ న్త్యసంశయమ్ ॥** 57

అట్టి జీవన్ముక్త విద్వాంసుని స్పృశించుట, భాషించుట, దర్శించుట మొదలగువానిచే మహాపాపులును పవిత్రులై నిస్సంశయముగా ముక్తికర్తు లగుచున్నారు

**యోగశబ్దస్య నానార్థాన్ప్రవన్తి బ్రహ్మవేదినః ।**
**జీవేశయోరైక్యతత్వం తథా చేశ్వరదర్శనమ్ ॥** 58

**పరమాత్మని యచ్చిత్తం లీయతే తదపి స్మృతమ్ ।**
**తథా సర్వేన్ద్రియాణాం చ వృత్తినిగ్రహ ఇత్యపి ॥** 59

యోగశబ్దమున కనేకార్థములను బ్రహ్మజ్ఞులు వచించుచున్నారు యుజ సమాధౌ యను ధాతువునుండియు, యుజుర్యోగే అను ధాతువు నుండియు గలిగిన శబ్దము ''యోగః'' అని చెప్పబడుచున్నది యోగమనగా సమ్బంధము దానినిగురించి ''సంయోగం యోగమిత్యాహు ర్జీవాత్మ పరమాత్మనోః'' అను ప్రమాణముచే జీవేశ్వరులయైక్యము, అనగా ఈశ్వర దర్శనరూప సమ్బంధము యోగమగును

సమాధియనగా వృత్తులను నిగ్రహించి మనస్సును పరమాత్మయందు లెస్సగా నుంచుట యని అర్థము దానిననుసరించి పరమాత్మయందు చిత్తము లయించుటయు, ''యోగ శ్చిత్తవృత్తి నిరోధః'' అను పాతంజల యోగసూత్రానుసారము సకలేన్ద్రి యవృత్తులను నిగ్రహించుటయు యోగమనబడును

**విచారయామస్తత్త్వం యోగశబ్దస్య ముఖ్యతః ।**
**సిద్ధోఽయమర్థో యోగో హి వియోగేన వివర్జితః ॥** 60

యధార్థమును విచారింతము ముఖ్యముగా యోగశబ్దార్థము వియోగములేని యవస్థయే అని సిద్ధించినది

**సలిలే సైన్ధవం యద్వత్సామ్యం భవతి యోగతః ।**
**తథా జీవాత్మనోరైక్యం సమాధిరభిధీయతే ॥** 61

ఉప్పు నీటిలో కలిసిపోవునటుల యోగమువలన జీవాత్మ పరమాత్మలో కలియుట సమాధియని చెప్పబడుచున్నది

**నివాతదీపవచ్చిత్తం సమాధి రభిధీయతే ।**
**ఏత దేవాహ భగవాన్యతచిత్తస్య యోగినః ॥** 62

**యథాదీపో నివాతస్థో నేఙ్గతే సోపమేతి చ ।**
**ప్రవృత్తిరోధో జ్ఞానస్య సందీప్తిర్యోగ ఉచ్యతే।**
**శ్రుతిరప్యాహ యోగస్య ప్రభ వావ్యయ రూపతామ్ ॥** 63

గాలి లేనిచోట నున్న దీపమువలె చిత్తము నిశ్చలముగా నుండుట సమాధి యనబడుచున్నది ఆవిషయమునే ''యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా'' అను వాక్యముచే శ్రీకృష్ణభగవాను డుపదేశించెను ''యోగో హి ప్రభవాప్యయౌ'' అను కఠోపనిషద్వాక్యముచే సకలవృత్తులు నశించి జ్ఞానోదయ మగుట యోగమని చెప్పబడినది

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥** 64

**ఇత్యేతద్భగవద్వాక్యం సదా జ్ఞప్తౌ వినిక్షిపేత్ ।**
**అన్యథా స భవేద్యోగో వియోగ ఇతి భాషితః ॥** 65

ఆత్మనిగ్రహము లేనివానికి యోగము కష్టసాధ్యము నిగ్రహము గలవానికి దానిని పొందదగునను భావము గల అసంయతాత్మనా అను శ్రీకృష్ణభగవంతుని వాక్యమును సర్వదా జ్ఞప్తిలో నుంచుకొనవలయును అటుగాకుండిన యోగమనగా వియోగమే యగును

**సోఽహం శివోఽహం ప్రణవాక్షరం తథా**
**పంచాక్షరత్ర్యక్షరషోడశాక్షరాన్ ।**
**మన్త్రాంస్తు తద్దైవత భావనాధియా**
**జప్యాత్స మన్త్రాభిధయోగ ఇష్యతే ॥** 66

మన్త్రయోగమనగా–పంచాక్షర, త్ర్యక్షర, అష్టాక్షర, ద్వాదశాక్షర, షోడశాక్షరములు మొదలుగా గల మహామన్త్రములను, అటులనే సోఽహం, శివోఽహం, ప్రణవము మొదలగు అజపామన్త్రములను మన్త్రార్థ దైవభావములతో జపించుట యగును

**ప్రాణస్య చాపానగతేర్యదైకతా ధౌత్యాదిభేదైర్హఠయోగ ఉచ్యతే ।**
**స్యాన్తాత్మనోరైక్యగతిర్లయో భవే జ్జ్ఞానం తదా స్యాత్సకలార్థదీపకమ్॥**

ధౌతి, నేతి మొదలగు యోగక్రియలచే ప్రాణాపానముల యైక్యమే హఠ

యోగమని చెప్పబడుచున్నది ఆత్మమనస్సులయొక్క (జీవేశ్వరులయొక్క) ఐక్యమే లయ యోగమగును అప్పుడు సకలార్థములను ప్రకాశింపజేయు జ్ఞానము గలుగుచున్నది

**జ్యోతిస్స్వయం భాతి యదా ప్రదీప్తిభి**
**స్స్వాత్మా స్వయం భాసకరాజయోగభాక్ ।**
**యోగస్స్వయం సర్వవిలక్షణో భవే**
**త్తస్మిన్న్యఖండైకరసోఽనుభూయతే ॥** 68

అఖండదీప్తులలో స్వాత్మవస్తువు స్వయంజ్యోతియై తేజరిల్లుటవే స్వప్రకాశక రాజయోగము గలదగును ఈ రాజయోగము సర్వవిలక్షణ మైనది అందున అఖండైక రసమాస్వాదింపబడుచున్నది

**యోగశాస్త్ర విచారాచ్చ యదస్తి పరతస్తు తత్ ।**
**వదంతి శాస్త్ర సారజ్ఞా జ్ఞానశాస్త్రస్య నిశ్చయమ్ ॥** 69

**బుద్ధ్యంత సర్వవిషయాన్ యోగశాస్త్రం బ్రవీతి తాన్ ।**
**ఇంద్రియాతీతవిషయో జ్ఞానశాస్త్రేణ బోధ్యతే ॥** 70

యోగశాస్త్ర విచారణకంటె పరమైనదేదియో దానినే జ్ఞానశాస్త్రములయొక్క నిశ్చయముగా గ్రహించుమా! ఆయోగశాస్త్రము బుద్ధి వరకు గల విషయములను మాత్రము తెలియజేయును వేదాంతతత్త్వమగు జ్ఞానశాస్త్రము అతీన్ద్రియవిషయమును బోధించుచున్నది

**వేదా న్తశాస్త్రేణ తు యత్తు బోధితం ప్రశ్నత్రయం తచ్చ వివిచ్య కథ్యతే ।**
**పరాత్మని స్వాత్మని చావ్యయే సతి కస్మాత్కథం కస్య వియోగసమ్భవః ॥**

వేదాంతశాస్త్రము యోగవిషయమై మూడు ప్రశ్నలను తెలుపుచున్నది అవి వివరముగా తెలుపబడుచున్నవి ఆత్మ పరమాత్మస్వరూపమై అవ్యయమై యుండగా దేనికి, దేనినుండి, యెందువలన వియోగము సమ్భవించినది?

**సంయోగభాజస్తు వియోగభాజినః కో నామ యోగో భవతీతి తత్తదా ।**
**సంయోగహీనస్య హి యోగ ఇష్యతే చ్యుతిః కదా బ్రహ్మమయస్య చాత్మనః ॥**

సంయోగము గలవి వియోగమే అన్తముగా గల వగుచున్నవి కావున యోగమనగానేమి? మఱియు వియోగము గలదానికే సంయోగ మనునది సమ్భవించును అట్లుండగా, పరబ్రహ్మమయమగు నాత్మ యెప్పుడు వియోగము జెందెను?

**అద్వైతశాస్త్రాన్వయభాజి తత్త్రయంన హ్యన్యవేదాంతమతానుబద్ధమ్ ।**
**ద్వైతాదిశాస్త్రాణి వదంతి భేదం జీవస్య దేవస్య చ విశ్వతథ్యతామ్॥ 73**

ఆ త్రివిధప్రశ్నలు అద్వైతశాస్త్రముచేతనే విచారింపదగినవి అవి, ద్వైత విశిష్టాద్వైతాది శాస్త్రములకు సమ్బన్ధించినవి గావు ద్వైతాదిశాస్త్రములు జీవేశ్వరుల భేదమును, ప్రపంచసత్యత్వమును చెప్పుచున్నవి

**అద్వైత వేదాంత నిరూఢ బుద్ధయో విజ్ఞానిన స్తథ్యమిదం ప్రచక్షతే ।**
**జీవాత్మనోర్భ్రాన్త్యైవ విభేదభావో భేదోక్తయో మందధియై ప్రవృత్తాః ॥ 74**

అందువలన విజ్ఞానులగు నద్వైతసిద్ధాన్తులు జీవేశ్వరులకు భేదము లేదను సత్యమును చెప్పుచున్నారు జీవేశ్వరులయొక్క భేదము భ్రాన్తి రూపము గనుక మందమతులకు చెప్పబడినది (కావున సంయోగ వియోగ ములుగాని, పరమాత్మనుండి జీవుడు వేరుపడుటగాని ఏకాలమున ఎందు నిమిత్త మేర్పడినది? అను ప్రశ్నలు పరమార్థతత్త్వమందు లేవు సామాన్యబుద్ధిగలవారు తత్త్వమును గ్రహించి తరించుటకై యేర్పడినవేగాని వేరు గాదు )

**వేదాన్తశాస్త్రోక్తవచాంసి మానం బ్రహ్మాహమిత్యాదిధియా యుతాని ।**
**అప్రాప్య యోగేన మనో విశుద్ధిం స్థిరత్వమప్యేతి న చాత్మవేదనమ్ ॥ 75**

వేదాంత శాస్త్రవాక్యము లన్నియు నేను బ్రహ్మమను నభేదజ్ఞానముచే గూడినవి కదా! అయినను యోగముచేత చిత్తశుద్ధి నిశ్చలత్వములు లేక

పరమాత్మజ్ఞానమును పొందడు

**కృతే తత్త్వవిచారేఽపి యోగసిద్ధిం వినా న హి ।**
**తత్త్వజ్ఞానం తు తద్భాతి ప్రవాతే దీపికా యథా॥** 76

తత్త్వవిచారణ యుండినను, యోగసిద్ధి లేనియెడల గాలిలో నుంచబడిన దీపమువలె జ్ఞానతత్త్వము ప్రకాశించదు

**యోగే సిద్ధేఽపి చ జ్ఞానం వినా నాస్తి ప్రయోజనమ్ ।**
**నిర్మితేఽప్యాలయే దేవప్రతిష్ఠాంతు వినా యథా ॥**

77

దేవాలయము సుందరముగా నిర్మింపబడిన దయినను దేవప్రతిష్ఠ లేనిచో నిష్ప్రయోజన మగునటుల యోగసిద్ధి పూర్తిగా గలవారైనను జ్ఞానము సిద్ధించకపోయిన ప్రయోజనము లేదు

**తస్మాద్ జ్ఞానస్య యోగేన సంబంధస్సుదృఢో మతః ।**
**తాభ్యాముభాభ్యాం పూర్ణస్తు ముక్తిం గచ్ఛతి సాధకః ॥** 78

అందువలన యోగజ్ఞానములు రెండును పరస్పరము సంబంధ పడియున్నందుచే జ్ఞానముచేతను, యోగనిష్ఠచేతను పరిపూర్ణుడయిన సాధకుడు ముక్తిని పొందుచున్నాడు

**సూత్రసంయోజనే సూచ్యాం నైశ్చల్యం హస్తయోరథ ।**
**సూత్రస్యైకముఖత్వం చ భవేదావశ్యకం తథా ॥**
**పరమాత్మని చిత్తస్య యోజనం సమపేక్షతే ।**
**నైశ్చల్య మింద్రియాణాం చ చిత్తైకాగ్రత్వమేవ చ ॥** 79

మిగుల సూక్ష్మమగు సూదియొక్క రంధ్రములో దారమెక్కింపవలయు ననినచో, హస్తములయొక్క నిశ్చలత్వము, దారము కొనయొక్క యేకత్వమున్ను అవసర మగునటుల పరమాత్మయందు చిత్తము నుంచుటలో సర్వేంద్రియముల నిశ్చలత్వము, చిత్తముయొక్క యేకత్వమున్ను అపే

క్షితములు

**తథాఽపి రంధ్రం యది దృష్టిగోచరం భవేన్న సూచ్యా విఫలో హి యత్నః॥**
**యోగే తథా తాత్త్వికదృష్ట్యభావే మోహాంధతా సిధ్యతి న త్వభీష్టమ్ ॥80**

ఒక వేళ సూత్రకరముల ఏకత్వనిశ్చలత్వము లుండినను, సూది రధ్రము కనబడకపోయిన నిక చేయదగిన కార్యమేమున్నది? అందువలన తత్త్వవిచారణాదృష్టి (జ్ఞానదృష్టి) లేకపోయినచో, మోహాంధకారమే మిగులుచున్నది అభీష్టము నెరవేరదు

**ఇత్థం విచార్య బహుధా సకలాని యాని**
**వేదాన్తయోగవరతత్త్వవిధాయకాని ।**
**శాస్త్రాణి తాని పరినిష్ఠితమేవమాహు**
**ర్జ్ఞానం తు యోగసహితం సకలార్థసూతే ॥ 81**

ఈలాగున బాగుగా విచారించి జ్ఞానయోగముల నిజతత్త్వమును బోధించు శాస్త్రము లన్నియును యోగముతో గూడిన జ్ఞానము సకలప్ర యోజములను గలుగజేయుచున్నదని తెలుపుచున్నవి

**శ్రీసద్గురోః పరమకారణికస్య భవ్యా**
**ద్దైవానుభావసుఖసాన్ద్రదయాప్రసారాత్ ।**
**లభ్యం భవేత్పరమతత్త్వమిదం ముముక్షో**
**ర్జ్ఞానం తదేవ పరమాత్మపదం తదేవ ॥ 82**

శ్రీ సద్గురుదేవుని పరమకారుణిక స్వరూపదృష్టిచేతను, దైవము యొక్క మిగుల గొప్పదగు దయచేతను, ముముక్షువున కాపరమతత్త్వము లభ్యమగును అదియే జ్ఞానము, అదియే పరమాత్మస్థానము

**ఇతి శాస్త్రాణి సంశోధ్య యోగజ్ఞా స్తత్త్వమూచిరే ।**
**అష్టాంగాని చ యోగస్య ముఖ్యా జ్ఞానస్య హేతవః ॥ 83**

సర్వశాస్త్రములను పరిశోధించి యోగతత్త్వజ్ఞులగు మహర్షులు

అష్టాంగయోగములు జ్ఞానమునకు కారణములై యుంటున్నవన్న తత్త్వము వచించిరి

**ముముక్షుభిరసౌ యోగో ముక్తి సౌధాధిరోహణే ।**
**అనుసర్తవ్య ఏవాస్తి సోపానక్రమమార్గవత్ ॥** 84

**ప్రదర్శ్య శోభనం మార్గం ముక్తిసౌధాధిరోహిణే ।**
**మహర్షిసత్కృపాలాభాద్భజస్వ పరమం పదమ్ ॥** 85

ముముక్షుజనులకు అష్టాంగయోగము ముక్తిసౌధము నధిరోహించుటకు సోపానక్రమ మార్గమువలె అనుసరింపదగి యున్నది శ్రద్ధాభక్తులతో ఈ అష్టాంగయోగమను మెట్లను క్రమక్రమముగ నెక్కవలయును మఱియు ప్రేమైకనిలయా! మోక్షప్రాసాదము నధిరోహించువారలకు నీ సోపాన మార్గమును జూపి మహర్షుల దివ్యకృపకు పాత్రుడవై నీవును ఆ పరమపదమగు మోక్షసౌధము నధిష్ఠించుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సార భూతాయాం

అష్టాంగయోగో నామ దశమోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు

అష్టాంగయోగమను దశమాధ్యాయము సమాప్తము



# ఏకాదశోఽధ్యాయః

# భక్తిప్రభావయోగః

కృష్ణచరణ ఉవాచ

**భగవన్! భక్తిరూపం చ భక్తానాం లక్షణం తథా।**
**శ్రోతుమిచ్ఛామి తత్త్వజ్ఞ! తన్మే బ్రూహి యథావిధి ॥** 1

కృష్ణచరణము చెప్పెను

దైవస్వరూపులును తత్త్వజ్ఞులునగు నో సద్గురుమూర్తీ! భక్తియొక్క స్వరూపమును, భక్తులయొక్క లక్షణమును విన గుతూహలపడుచున్నాను కాన దయతో శాస్త్రోక్త ప్రకారము భక్తియొక్కయు, భక్తులయొక్కయు లక్షణ మును వివరించి చెప్పుదురుగాక!

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**భక్తిర్బహువిధా ప్రోక్తా పురా భక్తైరనుత్తమ ।**
**శివకేశవభేదేన ద్విధా సా పరిచక్ష్యతే ॥** 2

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

భక్తోత్తమా! ప్రాచీనులు భక్తి అనేక విధములని చెప్పిరి అయినను ముఖ్యముగ భక్తి రెండు విధముల బేర్కొనబడుచున్నది ఒకటి శివభక్తి, రెండవది విష్ణుభక్తి ఈద్వివిధ భక్తియే ప్రసిద్ధమైనది

**భజతేః క్తిని సేవాయాం భక్తిర్నిష్పద్యతే క్రమాత్ ।**
**తతో భగవతస్సేవా భక్తిరిత్యభిధీయతే ॥** 3

భజ–సేవాయాం అను ధాతువునకు క్తిన్ ప్రత్యయము చేరగా భక్తి అను పదమేర్పడినది దీనికి సేవ అని అర్థము అనగా భగవంతుని సేవయే భక్తియని తేలినది భగవంతుని నిత్య నూతన వస్త్రాలంకరణాదులతో అలంకరించి, నానావిధ నైవేద్యములను చెల్లించుచుండుటయే భగవత్సేవ కాదనియు, మఱి నిర్మల హృదయముతో ఆ సచ్చిదానన్ద దివ్య విగ్రహమును

మనస్సున ధ్యానించుటయే ఉత్తమభక్తి యనియు గ్రహింప వలయును

**మాతాపితృగతా భక్తిః ప్రోక్తా దైవాత్మికా పునః।**
**పతిభక్తిశ్చ సర్వాసు దైవభక్తిర్గరీయసీ ॥ 4**

మాతృభక్తి, పితృభక్తి, పతిభక్తి, దైవభక్తి యని భక్తి యనేక ప్రకారములుగా నున్నది కాని వీటియన్నిటిలోను దైవభక్తియే ఉత్తమమైనదని గ్రహింపుము

**ఈశ్వరస్య చ భక్తస్య చా భేదస్థితిరుత్తమా।**
**భక్తిస్సా హి పరా ప్రోక్తా నిశ్శ్రేయసకరీ గుణిన్ ॥ 5**

ఓ గుణవంతుడా! భగవంతునికిని భక్తునికిని అభేదస్థితి గలుగుట, పూర్వోక్త సర్వవిధ భక్తిమార్గములలోను ఉత్తమోత్తమ భక్తి యగును ఓ సుగుణశాలీ! ఈ యభేదస్థితియే పరమ నిర్వాణమునకు మూలకారణమని గ్రహింపుము

**స్వాత్మని స్వేష్టదైవస్య స్వాత్మన శ్చేష్టదైవతే।**
**అభేదదృష్టి రేషా హి పరాభక్తిరితి స్మృతా ॥ 6**

తనయందు ఇష్టదైవమును, ఇష్టదైవమునందు తనను అభేదముగా జూచుట పరమభక్తి యగును

**జీవేశ్వరసమైక్యం చ వేదాన్తార్థగతం పునః।**
**తత్త్వజ్ఞా భక్తిమేవాహుస్సద్యోముక్తిర్యతో ధ్రువమ్॥ 7**

మఱియు నీ పరమభక్తియే వేదాన్తదర్శన ప్రతిపాద్యమగు జీవేశ్వర తాదాత్మ్యము గూడనని తత్త్వజ్ఞులగు మహర్షులు వచించిరి ఈ పరాభక్తివలన సద్యోముక్తి లభించును నిశ్చయము

**పరమేశస్య విశ్వే చ విశ్వస్య పరేశ్వరే ।**
**అభేదదర్శనం భక్తిమాహుస్తత్త్వవిదః పరామ్॥ 8**

ఇట్లే చరాచర విశ్వమునందు పరమేశ్వరుని, పరమేశ్వరునియందు విశ్వమును అభేదదృష్టితో జూచుటయే పరమభక్తియని తత్త్వజ్ఞులు వచించిరి

**కర్మజ్ఞానరతానాం హి యమాద్యాసక్తచేతసామ్ ।**
**భక్తిర్ముఖ్యతమా నూనమోషధీనాం యథా జలమ్ ॥ 9**

వ్రీహ్యాది (వడ్లు మొదలయిన) ఓషధులకు జలమెటుల జీవనాధారమో, అటులనే యమనియమా ద్యష్టాంగ యోగము నాచరించుచున్నవారై కర్మజ్ఞానాదులయం దనురక్తులైన సాధకులకు భక్తియే ముఖ్యము అనగా ముఖ్యముగా నాచరణీయము

**భక్తిహీనాని కర్మాణి శ్రద్ధయాఽఽచరితాన్యపి ।**
**వృథా తాన్యవగచ్ఛ త్వం వృష్టిహీనా మివ కృషిమ్ ॥ 10**

శ్రద్ధతో నాచరించినను భక్తిలేని కర్మలు వర్షములేని కృషివలె వ్యర్థమని గ్రహింపుము

**మనోవాక్కాయకరణైస్త త్తదిన్ద్రియచేష్టితమ్ ।**
**హిత్వా స్వాత్మైకమననం భక్తిరిత్యభిధీయతే ॥ 11**

మనోవాక్కాయములతో ఆయా యింద్రియజన్య బాహ్యక్రియలను మాని వాటిని (మనోవాక్కాయములను) అంతర్ముఖమొనర్చి కేవలము ఆత్మైకచిన్తన మొనర్చుటయే పరమభక్తియని చెప్పబడుచున్నది

**భగవద్విస్మృతేర్హానిర్విస్మృతావతి వేదనమ్ ।**
**భక్తేస్సల్లక్షణం తాత! పరాయాశ్శృణు మే వచః ॥ 12**

నాయనా! ఎల్ల వేళలయందును భగవంతుని మరువకుండుటయు, ఒకవేళ నెపుడేని మరుపుగలిగినచో మహావేదన నొందుటయు ఉత్తమ భక్తియొక్క లక్షణమని యెరుంగుము

**యథా భూమిగతా మీనా ఉత్పతన్తస్తపన్తి చ ।**
**దైవదూరీకృతం చేత స్తథా చేత్తాపమశ్నుతే ॥**

**తదా భవతి తన్ముఖ్యం పరభక్తేః పదం కిల ॥** 13

నీటిలోనుండు చేపలను ఒడ్డున పడవేసినచో నవి నీటికొఱకై అల్లల్లా డుచు నెంత పరితపించుచున్నవో అటులే ఒక క్షణమేని దైవమునుండి వియుక్త మైనచో నపారవేదన ననుభవించు భక్తుని హృదయమే పరమభక్తికి నిలయమని గ్రహింపుము

**పతివ్రతా సతీ భర్త్రా వియుక్తా బహుధా యథా ।**
**వ్యథతే చ నిజాదృష్టం దూషయన్తీ ముహుర్ముహుః ॥** 14

**ఏవం సన్తప్యతే యస్య చిత్తం దైవ పరాఙ్ముఖమ్ ।**
**అనన్యభావయు క్తం తత్పరభక్తేః పదం స్మృతమ్ ॥** 15

పతివ్రతా శిరోమణియగు నారీమణి స్వపతివియోగము నొందినచో నిరంతరము తన దురదృష్టమును నిందించుకొనుచు నెటుల దుఃఖిం ప చున్నదో, అటులనే అనన్యభావ యుక్తమగు నే సాధకుని హృదయము దైవ పరాఙ్ముఖమైనపుడు (క్షణకాలమైనను) అపారవేదన ననుభవించునో అట్టి పవిత్ర హృదయమే పరమభక్తి కాస్పదమగును

**స్వచిత్తే పరమం దైవం సర్వదా యోఽనుపశ్యతి ।**
**భగవానపి తం పశ్యేదితి గీతావచశ్శృణు ॥** 16

ఎవడు తనహృదయమున ఎల్లపుడు భగవంతుని జూచుచుండునో, అట్టి పరమభక్తుని భగవంతుడును అనవరతము చూచుచుండును ఇటుల గీతయందు (6అ–30) శ్రీకృష్ణభగవానుడు చెప్పినది వినుము

**జీవేశ్వరైక్య సంధానం పరాభ క్తిరితీరితా ।**
**అవిచ్ఛిన్నా యథా తైలధారా సిద్ధమహర్షిభిః ॥** 17

అవిచ్ఛిన్నమగు తైలధారవలె విచ్ఛేదములేని జీవేశ్వరుల ఐక్యాను సంధానమే పరమభక్తియని మహర్షుల యభిమతము

**విస్మృత్య దృశ్యమాత్మానం భగవత్స్మృతిరేవ చ ।**

**ఐకాన్తికీ పరా భక్తిరితి తత్త్వవిదాం వచః ॥** 18

సమస్తదృశ్యమును, కడకు తననుగూడ మరచి కేవలము భగవత్స్ఫూర్తిమాత్రమే గలిగియుండుట పరమభక్తియని తత్త్వవేత్తలు వచించిరి

**యథా నదీ హ్యవిచ్ఛిన్నా సముద్రమభిగచ్ఛతి ।**
**తథా దైవోన్ముఖీ వృత్తిః పరాభక్తిరితి స్మృతా ॥** 19

నది యెటుల తెంపులేక సముద్రము వైపునకే ప్రవహించుచుండునో, అట్లే దైవోన్ముఖమై చరించు మానసికవృత్తిని పరాభక్తి యందురు

**అంకోలవృక్షం బీజం చ లతాఽప్యేవం తరుం యథా ।**
**సూచికాఽప్యేత్యయస్కాన్తమేవం భక్తిరనన్యగా ॥** 20

ఊడుగ చెట్టుయొక్క విత్తనము (చెట్టునుండి క్రిందపడుటతోడనే పునః ఆ) వృక్షమునే చేరునట్టును, లత యెల్లపుడు వృక్షమును చుట్టుకొని యుండునట్లును, మఱియు సూది ఆకర్షింపబడి అయస్కాన్తమునే చేరునట్లును, ఎవని చిత్తవృత్తి దైవోన్ముఖమైనదై నిరంతరము భగవంతుని యందే సంలగ్నమై యుండునో అట్టి అవిచ్ఛిన్న మనోవృత్తియే అనన్యభక్తి యనబడును

**దిగ్దర్శికా యథా సూచీ చాలితాఽపి పునఃపునః ।**
**నిర్దిశేదుత్తరామాశామహోరాత్రం తథైవ చ ॥** 21

**చిత్తవృత్తిరనాకృష్టా లౌకికై రాత్మఘాతిభిః ।**
**వ్యవహారైః పరే దేవే హ్యనురక్తా పరా మతా ॥** 22

దిగ్దర్శకయంత్రమునందలి ముల్లు ఎటు త్రిప్పినను రాత్రి పగలనక ఉత్తరాభిముఖ మయ్యే యుండునటుల చిత్తవృత్తి ఆత్మభిన్నములగు (బాహ్య) లౌకిక వ్యవహారములచే ఆకర్షింపబడక నిరంతరము దైవోన్ముఖమై యుండుటయే పరమభక్తి యనబడును

**నిజరూపం పరిత్యజ్య లవణం సలిలాత్మతామ్ ।**

**జలే యథా తథా భక్తస్త్యక్త్వా దేహాత్మతాం హృది ॥** 23

**యాతి చేదాత్మతాదాత్మ్యం తదా తద్భక్తి రుచ్యతే ।**
**తదేక భక్తిరిత్యార్యైః విఖ్యాతైః పరమర్షిభిః ॥** 24

నీటియం దుంచబడిన ఉప్పు తనస్వరూపమును త్యజించి జలరూపమై మారునటుల భక్తుడు దేహమే తానను మిధ్యాత్వబుద్ధని త్యజించి బ్రహ్మాత్మైక్య బుద్ధిని అనగా ఆత్మయే బ్రహ్మము అను అభేదబుద్ధిని గలిగియుండుటయే తదేకభక్తి యని మహర్షులు చెప్పిరి (కాని యిట్టి దృఢతరమగు ఐకాన్తికభక్తి ఒకనాటితో కుదురునది గాదు చిరకాల నిరంతరాభ్యాసముచేతనే యిట్టి తదేకభక్తి సిద్ధించునని తెలియుము )

**సైషా భక్తిర్నవవిధా ప్రోక్తా భాగవతే పురా ।**
**ఏకాదశవిధా చైవ భక్తిసూత్రేషు పావన! ॥** 25

ఓపవిత్రాత్మా! ఈ భక్తి, భాగవతమున తొమ్మిది విధములనియు, నారదభక్తిసూత్రములందు పదునొకండు విధములనియు వర్ణించబడినది.

**ఏవం హి భక్తిసంపన్నశ్చండాలో౽పి దురాత్మకః ।**
**సాధురేవ స మన్తవ్యో భక్త్యభావే చ పాతకీ ॥** 26

**కిం చ జాతివిభేదేన మోహావిష్టో నరాధమః ।**
**ఈశానుగ్రహదూరస్స్యాదితి భాగవతం వచః ॥** 27

ఏజాతికి జెందినవాడైనను కడకు దుర్మార్గుడగు చండాలుడైనను పూర్వోక్తభక్తి సమ్పన్ను డగునేని అతనిని సాధువుగనే భావింపవలయును భక్తిభావము లేనిచో పాపియగును ఇంతియే గాదు జాతిభేదమును పాటించి మోహాక్రాంతుడగు నీ అధమమానవుడు దైవకృపకు కూడ దూరుడగునని భాగవతమున భాగవంతుడు నుడివెను

**ఏవం హి భక్తిరాఖ్యాతా పరాభక్తిస్తథైవ చ ।**
**తతః పరమభక్తానాం లక్షణం శృణు తన్మయః ॥** 28

ఇంతవరకు భక్తియొక్కయు, పరాభక్తి యొక్కయు లక్షణము విశదముగ వివిధ రీతుల వర్ణింపబడినది ఇక మీదట పరమభక్తులయొక్క లక్షణమును చెప్పెద సావధాన మనస్కుడవై వినుము

**భగవద్భావభరితః కరుణాఖ్యశ్చ సంయమీ ।**
**చరాచరసుఖాకాంక్షీ పరభక్తః ప్రకీర్తితః ॥ 29**

దైవభావసంభరితుడై దయామయుడై సర్వేంద్రియ నిగ్రహము గలవాడై చరాచరహితమును గోరువాడు పరమభక్తు డనంబడును

**పరోపకారకరణే పరాభూతోఽపి తత్పరః ।**
**అహన్తయా చ సంత్యక్తః పరభక్తః ప్రకీర్తితః ॥ 30**

తాను అవమానమును బొందినను, ఇతరుల కుపకారము చేయుట యందు ఆసక్తి గలిగి, అహంభావ శూన్యుడైనవాడు పరమభక్తు డనంబడును

**దైవభావే విలీనోఽపి లోకానుగ్రహకాంక్షయా ।**
**భక్తిధ్యాన ప్రవక్తా చ పరభక్తః ప్రకీర్తితః ॥ 31**

తాను నిరంతరము దైవభావమునందు విలీనుడై యున్నను, పామర జనుల నుద్ధరింపవలయునను కోరికతో లోకమున అనవరతము భక్తిధ్యానములను ప్రబోధించుచుండువాడు పరమభక్తు డనబడును

**బ్రహ్మాది స్తమ్బపర్యన్తసకల ప్రాణికోటయః ।**
**సృష్టా మే ప్రభుణైవేతి సుస్నిగ్ధః పరభక్తిమాన్ ॥ 32**

పిపీలికాది బ్రహ్మపర్యన్తము సమస్త ప్రాణికోట్లను నాప్రభువగు పరమేశ్వరుడే సృష్టించెనని దలంచి వాటియందు స్నేహము గలిగి యున్నవాడు పరమభక్తు డనబడును

**విసృజ్య సకలాన్ఛున్యాన్ముక్తో భాగవతైస్సహ ।**
**సదా హరికథాలగ్నః పరభక్తః ప్రకీర్తితః ॥ 33**

తన దేహసంబంధులగు బంధువులను, మిత్రులను బరిత్యజించి, భగవద్భక్తులే తన బంధువులనియు, మిత్రులనియు భావించి నిరంతరము వారితోనే కాలక్షేపము చేయుచు అనుదినము హరికథా శ్రవణమునందు లగ్న చిత్తుడైనవాడు పరమభక్తు డనబడును

**స్థలమన్నం చ వస్త్రాణి సమర్ప్య చ తదర్థినే ।**
**ప్రీణన్నుపకృతౌ గాఢం పరభక్తః ప్రకీర్తితః ॥ 34**

తాను నివసించెడు స్థలమును, తాను తినెడు అన్నమును, తాను ధరించెడి వస్త్రములను, అన్న వస్త్రాదులు లేక బాధపడు భక్తుల కొసగి తన కటి భాగ్యము గలిగినది గదా యని ఉపకారముచే సంతసించుచు తన్మయుడగువాడు పరమభక్తు డనబడును

**యదా హ్యుపకృతిర్నాస్తి మనోవాక్కాయకర్మభిః ।**
**తదేవ దుర్దినమితి మన్వానః పరభక్తిమాన్ ॥ 35**

ఏదినమైతే మనోవాక్కాయ కర్మలచే నితరప్రాణుల కేలాటి ఉపకారమును చేయజాలక పోవునో ఆదినము దుర్దినమని భావించి పరితపించువాడు పరమభక్తు డనబడును

**కీర్తనస్మరణాసక్త స్తపోజపపరాయణః ।**
**గీతాద్యుద్గ్రంథపఠన తత్పరః పరభక్తిమాన్ ॥ 36**

భగవత్సంకీర్తనమునందును, తత్స్మరణమునందును, తపోజపాద్యనుష్ఠానమునందును, గీత, భాగవతము ఇత్యాది సద్గ్రంథముల పఠనమునందును నిరంతరము తత్పరుడై యుండువాడు పరమభక్తు డనబడును

**శివరామాది తత్త్వస్య చింతకాన్ స్వేష్టభావుకాన్ ।**
**యస్సదా మనుతే సోఽయం పరభక్తః ప్రకీర్తితః ॥ 37**

శివునైనను రామునైనను భజించువారి నందరిని తన యిష్టదైవమును ధ్యానించువారినిగనే భావించి ద్వేషరహితుడగువాడు పరమభక్తు డనబడును

**కృష్ణభక్తాస్తథా రామశివభక్తాస్తథైవ చ ।**
**సర్వే చ స్వేష్టసంసక్తాశ్చిత్తవృత్తిర్విభేదికా ॥** 38

కృష్ణభక్తులుగాని, రామభక్తులుగాని, శివభక్తులుగాని అందరును తమ తమ యిష్టదైవమునందు సమానముగ తన్మయులై ఆనందామృతము ననుభవింతురు. కేవలము మానసికభావమే విభేదమును గలుగజేయునది కాని వస్తుతః పరస్పర మేమియు భేదము లేదని భావము

**భక్తో భగవతస్సాక్షాద్దర్శనే తన్మయో భవేత్ ।**
**భక్తాగమే ఽపి యస్తుష్టః స ఏవ పరభక్తిమాన్ ॥** 39

భగవత్సాక్షాత్కారము గలుగుచో భక్తుడెంతగనో, తన్మయీభావము నొందును అట్లే భక్తుడు తనచెంతకు రాగా సంతసించువాడే పరమభక్తు డనబడును

**భక్తాయ దత్తం యత్కించిద్దైవప్రీత్యై ముదాఽర్పితమ్ ।**
**మత్వా తుష్టః స్థిరో మౌనీ పరభక్తః ప్రకీర్తితః ॥** 40

తనకున్న యే కొలదైనను భక్తుల కర్పించి సంతోషముతో భగవంతుని కర్పించినటుల దలంచి దృఢచిత్తుడై మౌనమును దాల్చి సంతసించువాడు పరమభక్తు డనబడును.

**విహాయ నద్యో నిజనామరూపే విభిన్నమార్గైర్జలధిం ప్రయాన్తి ।**
**భక్తాస్తథా భిన్నపథప్రయాణైర్బ్రహ్మాద్వయం ప్రాప్య సుఖం విభాంతి॥** 41

విభిన్న నామరూపములను విడిచి నానావిధ మార్గములలో బ్రవహించుచున్న నదీనదములు చివరకు సముద్రమును జేరి ఏకాకారమును బొందుచున్నటుల, భక్తులును విభిన్న మార్గము నాశ్రయించి అద్వయమగు పరబ్రహ్మమునే పొంది తద్రూపులై సుఖించుచున్నారు

**అద్వైతం శివమానన్దః సత్యం చామృతమేవ చ ।**
**సాక్షాత్కారశ్చ దేవస్య భక్తైః ప్రాప్యా గతిర్మతా ॥** 42

భక్తులు పొందు గతియే అద్వయము, శివము, ఆనన్దము, సత్యము, అమృతము మఱియు భగవత్సాక్షాత్కారమని చెప్పబడుచున్నది

**భక్తిం వినా న ముక్తి స్స్యాన్ముక్తేర్భక్తిశ్చ కారణమ్ ।**
**వర్ధనీయా తతో భక్తిరీశప్రాప్తిఫలాప్తయే ॥ 43**

భక్తి లేనిచో ముక్తి గలుగదు భక్తియే ముక్తికి కారణము కాన ఈశ్వర ప్రాప్తికై భక్తిని వృద్ధిపరచుకొనుము

**పరభక్తేన సంప్రాప్యామీశప్రాప్తిం చ భక్తితః ।**
**లబ్ధ్వా బోధయ భక్తేశ్చ తత్త్వం లోకే దృఢవ్రత! ॥ 44**

ఓ వ్రతనిష్ఠగల భక్తోత్తమా! ఉత్తమ భక్తునిచే బొందదగిన ఈశ్వర ప్రాప్తిని అనన్యభక్తితో పొంది లోకమునకు సైత మీ భక్తితత్త్వమును బోధింపుము

ఇతి శ్రీ మలయాళయతీన్ద్రగీతాయం ఉపనిషత్సారభూతాయాం
భక్తి ప్రభావయోగో నామ ఏకాదశోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్ర గీతయందు ,
భక్తి ప్రభావయోగమను ఏకాదశాధ్యాయము సమాప్తము



# ద్వాదశోఽధ్యాయః

# విద్యాఽవిద్యాలక్షణయోగః

నిర్విషయానందబ్రహ్మచారీ ఉవాచ:

**స్వామిం స్తత్త్వార్థసమ్పన్న జ్ఞానవిద్యాత్మకో భవాన్ ।**
**కిం నామ లక్షణం విద్యాఽవిద్యయోర్బ్రూహి మే విభో! ॥** 1

నిర్విషయానంద బ్రహ్మచారి చెప్పెను:

స్వామీ! సకల తత్త్వార్థముల నెఱింగిన మహాత్మా! తమరు జ్ఞానవిద్యా స్వరూపులు కావున విద్య, అవిద్య అనగానేమి? వాని లక్షణములను నాకొఱకు సెలవిండు.

శ్రీమలయాళయతీంద్ర ఉవాచ:

**విద్యాఽవిద్యేతి భేదౌ ద్వౌ విఖ్యాతౌ శ్రుతిసమ్మతౌ ।**
**విద్యా నామ సమాఖ్యాతా నిత్యా జ్ఞానస్వరూపిణీ ।**
**విద్యాభిన్నా హ్యవిద్యా సా నానారూపా ప్రకీర్తితా ॥** 2

శ్రీమలయాళ యతీంద్రుడు చెప్పెను:

లోకమున విద్య, అవిద్యయని రెండు భేదములు ప్రసిద్ధములై యున్నవి. అవి వేదసమ్మతములు. విద్యయనగా జ్ఞానము, అది నిత్యము. దానికి భిన్నమయినది యవిద్యయని తెలియవలెను. అది నానారూపములుగా చెప్పబడినది.

**వేదవిద్యా ధనుర్విద్యా యోగవిద్యా తథైవ చ ।**
**అవిద్యేత్యేవ కథ్యంతే గానవిద్యాదికాశ్చ యాః ॥** 3

వేదవిద్య, ధనుర్విద్య, యోగవిద్య, గానవిద్య మొదలగు విద్యలు అవిద్య యని చెప్పబడును.

**విద్యానామపి సర్వాసాం ముఖ్యతః ప్రతిపాదితే ।**
**పరాపరేతి ద్వే విద్యే విదుర్విద్యావిశారదాః ॥** 4

ఆవిద్యలన్నిటిలోను పరవిద్య, అపరవిద్యయను రెండు ముఖ్యముగా విద్యావిశారదులు ఎరుంగుదురు

**పరా ఽపరేతి విద్యే ద్వే మహర్షిశ్రుతిసమ్మతే ।**
**నేత్రే ద్వే స్వానుభూతిస్తు తృతీయం నయనం స్మృతమ్ ॥ 5**

పరాపరవిద్యలు రెండును మునీశ్వరులకును, వేదములకును సమ్మతములు ఆ రెండింటిని రెండు నేత్రములుగాను, స్వానుభవమును తృతీయ నేత్రముగాను గ్రహింపవలెను

**పరయా విద్యయా ఽఽప్నోతి మోక్షం శాశ్వత సౌఖ్యదమ్ ।**
**తదన్యయా లౌకికం తు సుఖం ప్రాప్నోతి మానవః ॥ 6**

పరవిద్యవలన శాశ్వత సుఖము నిచ్చు మోక్షమును (నిత్యానంద మును) పొందుచున్నాడు అపరవిద్యచే లౌకిక సుఖమును మాత్ర మనుభవించుచున్నాడు

**నాత్మ స్వాతన్త్ర్య సిద్ధి స్స్యాత్స్వాతన్త్ర్యం లౌకికం వినా ।**
**తస్మాద్వేదేషు కథ్యేతే ద్వే విద్యే తు పరాపరే ॥ 7**

లోకమున స్వాతన్త్ర్యము లేకపోయిన ఆత్మస్వాతన్త్ర్యము గలుగదు కావుననే వేదమందు పరాపరవిద్యలు రెండును చెప్పబడినవి

**పరా ఽపరే చ విద్యే ద్వే సమ్పాద్యే వేదసమ్మతే ।**
**ద్వాభ్యామలంకృతో విద్వాన్సర్వత్ర సుఖమశ్నుతే ॥ 8**

వేదసమ్మతములయిన పరాపరవిద్యలు రెండును సంపాదనీయములు సమ్మతములు ఆ పరాపరవిద్యల రెంటిచేతను భూషితుడయిన విజ్ఞాని ఇహ పరలోకములయందును అనన్తసుఖ మనుభవించుచున్నాడు

**ఇంద్రియాణాం చ సర్వేషాం తథా విజయమన్తరా ।**
**న లభ్యతే స్వాత్మరాజ్యమితి వేదవిదో విదుః ॥ 9**

ఆలాగుననే బాహ్యాభ్య న్తరములగు సకలేన్ద్రియములను జయింపకుం డిన ఆత్మరాజ్య మెన్నటికిని లభించదని వేదవిదులు వచించిరి

**దేహారోగ్యం వినా లోకే స్వాత్మసౌఖ్యం కథం భవేత్ ।**
**సత్యపి స్వాత్మనస్సౌఖ్యే వినా౽౽రోగ్యం ఫలం న హి ॥ 10**

దేహారోగ్యము లేకపోయిన ఆత్మసౌఖ్యము గలుగదు ఆత్మసౌఖ్యము గలిగినను దేహారోగ్యము లేనియెడల ప్రయోజనము లేదు కావున దేహారోగ్యము గలవాడే పరమసుఖమును పొందుచున్నాడు అనగా నీ రెండును అవసరములు

**బహ్వాభిర్లోకవిద్యాభిః కిం ఫలం జ్ఞానమన్తరా ।**
**నాత్మజ్ఞానార్జనే స్వేచ్ఛా వినా లౌకికవిద్యయా ॥ 11**

జ్ఞానము లేకుండిన లోకవిద్యలవలన ప్రయోజనమేమి? అయినను లోకవిద్య లేకుండిన ఆత్మజ్ఞానమును సంపాదింప స్వతన్త్రత గలుగదు

**విద్యాహీనాశ్చ పురుషాః పశుతుల్యాః ప్రకీర్తితాః ।**
**తస్మాద్విద్యాధికైస్తే చ పాల్యన్తే సర్వదా నరైః ॥ 12**

విద్యలేనివారు పశువులతో సమానులుగా చెప్పబడిరి. కావుననే విద్యావంతులచేతనే వారెల్లపుడు పాలింపబడుచున్నారు

**తదేతన్మానసే ధృత్వా ప్రవర్తధ్వం ప్రజాస్సదా ।**
**ద్వాభ్యాం పరాపరాభ్యాం చ ధీరా భవత సామ్ప్రతమ్ ॥ 13**

ప్రజలారా! ఈ విషయమును మనస్సులో దృఢము చేసికొని ప్రవర్తిం చండి ఈపరాపర విద్యలచే నిప్పుడు ధీరులు గండు

**ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మపరం చ యత్ ।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 14**

**గ్రన్థమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**

**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థమశేషతః ॥ 15**

పరాపరవిద్యల రెంటిని తెలియవలెను అపరవిద్యయందు నిష్ణాతుడయినవాడు పరవిద్యచే పరబ్రహ్మమును పొందుచున్నాడు జ్ఞానవిజ్ఞానములను సంపాదింపదలంచిన మేధావి గ్రన్థములను లెస్సగా నభ్యసించి, ధాన్యమును గోరువాడు గడ్డిని వదలునటుల, సకల గ్రంధములను వదలవలెను

**అపరాయాం తు విద్యాయాం కృతభూరిపరిశ్రమాః ।**
**సత్క్రియంతే సదా విజ్ఞైర్మహారాజాదిభిర్జనైః ॥ 16**

లోకమున విజ్ఞానవంతులు, మహారాజులుగూడ అపరవిద్య యందు (శాస్త్రాదులందు) నిష్ణాతు లయినవారిని సత్కరించుచున్నారు

**ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।**
**శిక్షా వ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా ॥ 17**

**కల్పశ్చేత్యపరా విద్యా ప్రసిద్ధా లోకసమ్మతా ।**
**అథ విద్యా పరా సా స్యాద్యయా బ్రహ్మాధిగమ్యతే ॥ 18**

1 ఋగ్వేదము, 2 యజుర్వేదము, 3 సామవేదము, 4 అధర్వణవేదము, 5 శిక్ష, 6 వ్యాకరణము, 7 ఛన్దస్సు, 8 నిరుక్తము, 9 జ్యోతిషము, 10 కల్పము– అనునవి అపరావిద్యగా లోకసమ్మతము దేనిచే బ్రహ్మము పొందబడుచున్నదో అదియే పరావిద్య యగును

**త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**ఇమాం గీతోక్తి మాశ్రిత్య గుణాతీతో భవేన్నరః ॥ 19**

''వేదములు మూడుగుణములతో గూడినవి కావున నో యర్జునా! త్రిగుణముల నతిక్రమింపుము'' అను గీతావాక్యము నాశ్రయించి మనుజాడు గుణాతీతుడు కావలయును

**సర్వాసామపి విద్యానాం విజ్ఞానం నశ్వరం భవేత్।**

**బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం నృణామ్ ॥** 20

సకలవిద్యల పరిజ్ఞానము తప్పక నశించును బ్రహ్మవిద్యాజ్ఞానము నాశరహితమై బ్రహ్మప్రాప్తిని గలిగించుచున్నది

**షడఙ్గసహితా వేదాస్సాన్తం కంఠే ధృతా అపి ।**
**మృతౌ త్యజన్తి తం నీడం జాతపక్షాః ఖగా ఇవ ॥** 21

పక్షులు రెక్కలువచ్చిన తరువాత గూటిని వదలువిధమున షడఙ్గ సహిత వేదములు సాన్తముగా కంఠస్థము చేయబడినవైనను మరణసమయ మున ఆ పాఠకుని వదలుచున్నవి

**షడఙ్గాన్యపి యోఽధీతే సర్వవిద్యావిశారదః ।**
**గద్యపద్యాదికం సర్వం సుందరం కురుతే సుఖమ్ ॥** 22

**తస్యాపి విదుషశ్చిత్తం గురుపాదామ్బుజన్మని ।**
**లగ్నం చేన్నభవేత్తర్హి వృథా తజ్జీవితం భవేత్ ॥** 23

శిక్షావ్యాకరణాది షడంగములను సాన్తముగా జదివి సర్వవిద్యా విశారదు డయినను, బహుమనోహరముగా, లలితముగా, గద్యపద్యాత్మక కావ్యములను రచించువాడైనను అట్టి పండితుని చిత్తమెంతవరకు సకల సంసారదుఃఖ విధ్వంసక శ్రీగురుదేవుని పాదారవిన్దములందు లగ్నము గాకున్నదో, అంతవరకు వాని జీవిత మంతయు వ్యర్థమే,

**వాగ్వైఖరీ శబ్దఝురీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్ ।**
**పాణ్డిత్యం సర్వవిద్యాసు భుక్తయే న తు ముక్తయే ॥** 24

వాక్చాతుర్యము, అనర్గళ శబ్దప్రవాహము, శాస్త్రవ్యాఖ్యాన పాటవము, సకలవిద్యలలోను పాణ్డిత్యమనునివి భుక్తికొఱకేగాని ముక్తికొఱకు గావని తెలియవలయును

**గోవిన్దమేవ సతతం భజ రే మూఢమానస! ।**
**కాలే ప్రాప్తే తు కృఞ్ధాతుర్న హి రక్షతి రక్షతి ॥** 25

ఓ మూఢచిత్తా! సర్వదా గోవిందునే భజింపుము కాల మాసన్న మగునప్పుడు డుకృఞ్ కరణే అనుధాతువు నిన్ను రక్షించదు, రక్షించదు అనగా వ్యాకరణశాస్త్రము రక్షింపజాలదని అర్థము ఈలాగున సకల శాస్త్రములను దెలియవలెను

**అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా ।**
**తస్మాజ్జ్ఞానార్జనం కృత్వా కృతకృత్యో భవానఘ ॥ 26**

ఓ పాపరహితుడా! పరతత్త్వము తెలియకపోయిన శాస్త్రాధ్యయన మంతయు నిష్ఫలమే యగుచున్నది కాబట్టి యాత్మజ్ఞానమును సంపాదించి కృతకృత్యుడవు గమ్ము

**అజాగళస్థస్తనతుల్యతాం గతం ముధైవ శాస్త్రాదికబాహ్యపాటవమ్ ।**
**వరిష్ఠయా తత్పరవిద్యయా వినా తతశ్చ భవ్యం భజ తత్త్వమవ్యయమ్ ॥**

పరవిద్యా సంబంధము లేని లౌకికశాస్త్ర సామర్థ్య మంతయు మేకమెడచంటివంటిదై వ్యర్థమే యగుచున్నది కాన అవ్యయమైన దివ్యతత్త్వమును భజింపుము

**దేహసౌష్ఠవయుక్తోఽపి నేత్రహీనో యథా భవేత్ ।**
**తథా పాండిత్య యుక్తోఽపి పరావిద్యాం వినా నరః ॥ 28**

శరీరావయవ సౌష్ఠవ మున్నను, నేత్రహీను డెట్టివాడో అఖండ పాణ్డిత్యముతో కూడియుండి బ్రహ్మవిద్య లేని వాడును అట్లు వ్యర్థుడే

**అనేక శాస్త్ర ప్రవణాశ్చ వాగ్మినో వయం కృతార్థా ఇతి మన్యమానాః ।**
**నిబద్ధరాగాన్వితయా న లేభిరే నిజాత్మసచ్చిత్సుఖతత్త్వమవ్యయమ్॥29**

నానావిధ వేదాది శాస్త్రములు జదివి ప్రవచన తత్పరులైన పండితులు అవిద్యతో గూడుకొని తాము కృతార్థులమని తలంచుచున్నవారై సంసార సుఖాసక్తిచే నిబద్ధు లయినందున స్వస్వరూప సచ్చిత్సుఖావ్యయ తత్త్వమును పొందకున్నారు

**త ఏవ బాలా బహుకర్మిణో జనాస్త్వనేకభోగానుభవానుబద్ధాః ।**
**స్వర్గే వసంతో సుకృతే క్షయం గతే పునశ్చ భూమిం ప్రవిశ న్తి రాగిణః ॥30**

స్వర్గమునకు వెళ్లి అక్కడ భోగానుభవాసక్తులై యుండిన కర్మరులు పుణ్యము క్షీణించగనే మరల భూలోకమునే పొందుచున్నారు

**మాయావకుణ్ఠనమిదం పరిధూయ ముక్తా**
**జీవన్త ఏవ నను తే తు మహానుభావాః ।**
**స్వాత్మానమాత్మని సదాఽవ్యవలోకయన్తో**
**విజ్ఞానబోధభరితాస్సతతం రమన్తే ॥ 31**

పరవిద్యచే మాయయను ముసుగును తీసివైచి యతార్ధతత్త్వము నెఱింగి జీవించియుండగనే ముక్తులయిన మహానుభావులు సర్వదా తమయాత్మలో పరమాత్మను గాంచుచు విజ్ఞానబోధ సమ్పన్నులై సతతము పరబ్రహ్మమందు రమించుచున్నారు.

**వేదాన్తమార్గమఖిలం శ్రుతిసూ క్తిబోధ్యం**
**సంస్థాపయేచ్చ సతతం సుదృఢో యథా స్యాత్ ।**
**సంస్థాపితే పరమ వైదికధర్మమార్గే**
**సర్వం ప్రభూతమమలం బహుసుస్థితం స్యాత్ ॥ 32**

ఈ బ్రహ్మవిద్యా మార్గమంతయు నుపనిషత్తులందు బోధింపబడి యున్నది కావున నిదెటుల దృఢముగా నుండునో యటులా దీనిని స్థాపించవలయును ఆ ప్రకారము విస్తృత వైదిక ధర్మమార్గము స్థాపింప బడగా సమస్తలోకము నిర్మలమై సుఖవంతమై యుండును

**శక్తోఽపి యస్తు సకలాత్మకత త్త్వమార్గ**
**సంస్థాపనే న చ కరోతి విమోహితస్సన్ ।**
**ధర్మస్య తస్య విమలస్య భవేత్స హన్తా**
**పాపీతి తత్త్వనిధయో బహుధా వద న్తి ॥ 33**

ఆ బ్రహ్మవిద్యామార్గమును స్థాపింప శక్తుడయ్యు ఆ పరతత్త్వ మార్గమును స్థాపింపకపోయినవాడు బ్రహ్మవిద్యా మార్గహన్తకు డగుటచే పాపి యగునని వేదాంత తత్త్వజ్ఞులు బహువిధములుగా వచించుచున్నారు

**తత్త్వావనే ప్రయతమానజనోఽక్షమోఽపి**
**శ్రద్ధాయుతో యది భవేత్స హి ధన్యజన్మా ।**
**విజ్ఞానసత్యపదవీమధిరుహ్య తత్త్వ**
**విత్సమ్ప్రదాయకలనేన స ముక్తి మేతి ॥ 34**

మఱియు నా బ్రహ్మవిద్యా మార్గమును స్థాపించుటయందు సమర్థుడు కాకపోయినను శ్రద్ధాళువై ప్రయత్నించు వాడైనచో, ధన్యజన్ము డగుచున్నాడు అట్టివాడు క్రమముగా విజ్ఞాన సత్యమార్గము నధిరోహించి తత్త్వవేత్తల సంప్రదాయమును పాటించుటచే ముక్తిని పొందును

**విద్యాజాత్యాది గర్వేణ జ్ఞానమార్గానుయాయినమ్ ।**
**యో దూషయతి సద్వృత్తం మిథ్యావాదీ స పాపకృత్ ॥ 35**

విద్యా జాత్యాద్యభిమానాతిశయముచే గర్వించినవాడై, బ్రహ్మవిద్యా మార్గమందు నడచుచు సత్ప్రవర్తన గలిగిన వానిని మిథ్యావాదియై దూషించు వాడు పాపము నొడిగట్టుకొనును

**ఋణత్రయమపాకృత్య సన్న్యసేదిహ సాధకః ।**
**ఇత్థం సంరక్ష్య శాస్త్రోక్తసంప్రదాయం కృతీ భవేత్ ॥ 36**

ఋణత్రయమును (పితృ, దేవ, ఋషి ఋణములను) తీర్చిన పిమ్మటనే సన్న్యసించవలెను. ఈ విధముగా శాస్త్రోక్త సంప్రదాయమును రక్షించి విముక్తిని పొందుచున్నాడు

**భవ సంతరణే హేతుం బ్రహ్మవిద్యాం ఋణద్ధి యః ।**
**సరిత్సన్తరణోపాయం సేతుమేవ భినత్తి సః ॥ 37**

సంసారతారణకారణమైన బ్రహ్మవిద్యావ్యాప్తిని నిరోధించువాడు నదిని

దాటుటకు సాధనమైన సేతువును భంగము చేయువాడే!

**వివాహో ధర్మబద్ధస్తు ఋణత్రయ విమోచకః ।**
**మునీనా మాశ్రమో ఽప్యేవం మలాదిత్రయనాశకః ॥**
**వేదాన్తసంప్రదాయం చ తథాశిష్యపరంపరామ్ ।**
**సంరక్షితుం వ్యవస్థేయమాశ్రమాణాం కృతా పురా ॥** 39

పిత్రాది ఋణత్రయ విమోచనకై ధర్మబద్ధ వివాహ మేర్పడినది అట్లే త్రివిధ మలవిక్షేపావరణముల నివారణకై బ్రహ్మవిద్యా కేంద్రము లయిన మున్యాశ్రమము లేర్పడినవి వేదాంత సంప్రదాయమును, శిష్యపరంపరను సంరక్షించుటకై పూర్వము ఆశ్రమ వ్యవస్థ ఏర్పడినది

**నశ్వరస్య శరీరస్య దాతారౌ పితరౌ స్మృతౌ ।**
**నిత్యవిజ్ఞానదాతా తు గురుస్తాభ్యాం విశిష్యతే ॥** 40

నశ్వరమగు దేహమును ప్రసాదించిన మాతాపితరులకన్నను నిత్యమైన ఆత్మవిజ్ఞానము నిచ్చు శ్రీగురుదేవుడే శ్రేష్ఠుడు

**అస్మాకం పూర్వజాస్సర్వే తపోనిష్ఠా మునీశ్వరాః ।**
**ఇతి నిశ్చిత్య సంత్యాజ్యః ప్రమాదో బ్రహ్మవర్త్మని ॥** 41

మనపూర్వులెల్లరు తపోనిష్ఠులైన మహర్షులని నిశ్చయించి వారు నడచిన బ్రహ్మవిద్యలో గల ప్రమాదమును విడువుము. బ్రహ్మమార్గమందు ఏమరుపాటును వదలవలెను

**ముముక్షుర్బ్రహ్మవిద్యాయాం ప్రమాదం సంత్యజేత్సదా ।**
**ప్రమాదే తమసో వృద్ధిః భానావస్తంగతే యథా ॥** 42

బ్రహ్మవిద్యా విషయములో ముముక్షువు ప్రమాదము నొందరాదు సూర్యు డస్తమించినపుడు చీకటి వ్యాపించునట్లు ప్రమాద మేర్పడినపుడు అజ్ఞానము వృద్ధియగును

**ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం బహుదోషాకరస్తతః ।**

**తమాహ మృత్యునా తుల్యం భగవాన్ బ్రహ్మణస్సుతః ॥ 43**

బ్రహ్మనిష్ఠావిషయములో ప్రమాదము బహుదోషములకు నిలయము కాన బహుదోషరాశియగు బ్రహ్మవిద్యాప్రమాదము మానవులకు సాక్షాత్తు మృత్యువని బ్రహ్మకుమారుడగు సనత్కుమారుడు వచించెను

**ప్రమాదం మా కుర్యాస్సతతవిమలానందరతయ**
**స్స మాయా సర్వస్వం విషయభవపాథోధినిలయః।**
**ప్రమాదాన్నిర్ముక్తో భజతి కిల దివ్యం ప్రవిమలం**
**సదానందం శాన్తం పరమపరిపూర్ణం నిజసుఖమ్ ॥ 44**

సర్వదా నిత్యానందమును కోరువారలు ప్రమాదమును జెంద కూడదు అది మాయా సర్వస్వము అది విషయ సంసారసముద్ర నిలయము ప్రమాదము నుండి విడుదల నొందినవాడు దివ్యము, నిర్మలము, శాంతము, పరిపూర్ణము, సదానందమునైన ఆత్మసుఖమును పొందుచున్నాడు

**ఆత్మానన్ద విహీనానాం మాలిన్యావృతచేతసామ్ ।**
**క్రీడనం జడభావైర్యత్ ప్రమాదస్స నిగద్యతే ॥ 45**

మలినమైన మనస్సు గలవారు జడభావములతో అనాత్మ భావములతో క్రీడించుటయే ప్రమాదమని చెప్పబడును

**సదా తస్మాత్స్వస్మిన్ ప్రబలమలవృత్తేర్విలయనం**
**విధాయాత్మధ్యానం నియతమనుతిష్ఠన్ దృఢమతిః ।**
**ప్రమాదం సంత్యజ్య ప్రకటిత ధృతిర్వేదవినుతే**
**ప్రకృష్టే స్వారాజ్యే విహరతి యతిర్నిస్తులగతిః ॥ 46**

యతీశ్వరుడు తనయందెప్పుడును ప్రబలమైన మలినవృత్తులను నశింపజేసి నియమితముగా ఆత్మధ్యానము చేయుచు దృఢబుద్ధి గలవాడై ధీరుడై సాటిలేని స్వభావము గలవాడై ప్రమాదమును వదలి వేదవినుతమైన

శ్రేష్ఠమైన ఆత్మరాజ్యమున విహరించుచున్నాడు

**కృష్ణోఽప్యధ్యాత్మ విద్యాయాః ప్రావోచతుస్స్వస్వరూపతామ్ ।**
**అమృత ప్రాప్తిమేవాహ శ్రుతిస్తస్యాః ప్రయోజనమ్ ॥ 47**

''అధ్యాత్మ విద్యావిద్యానాం'' అని శ్రీకృష్ణుడు ఆధ్యాత్మవిద్యను భగవత్స్వరూపమని తెలిపెను ''విద్యయాఽమృతమశ్నుతే'' అను శ్రుతివాక్యము గూడ బ్రహ్మవిద్యకు నమృతత్వమే ప్రయోజనమని తెలిపెను

**అవిద్యయైవ యస్తావద్భవాబ్ధిం తర్తుమిచ్ఛతి ।**
**శుక్తౌ రజతవిభ్రాంతిం కుర్వతా సామ్యమేతి సః ॥ 48**

సంసారసముద్రము నీ యవిద్యచేతనే తరింపవచ్చునని చెప్పువాడు శుక్తియందు రజతభ్రాంతిని పొందిన వానితో సమానుడు

**ముముక్షుభిశ్చామృతతత్త్వమిచ్ఛుభిః పరాత్మవిద్యా పరమార్థదాయినీ ।**
**పరాత్మజీవాత్మసమైక్యబోధినీ సదాఽఽర్జనీయా సకలైః ప్రయత్నైః ॥ 49**

అమృతత్వమును గోరు ముముక్షువులు పరమార్థము నిచ్చునదియు, జీవాత్మ పరమాత్మల నభేదము బోధించునదియు నగు బ్రహ్మవిద్యను సకల ప్రయత్నములచే సదా ఆర్జించవలయును

**పరాత్మవిద్యాం బహుమన్యమానాస్తం తత్త్వమస్యాది మహాప్రబోధమ్ ।**
**సోఽహం స్వరూపం హృది భావయన్తో ముముక్షవస్సాధుపథే చరన్తు॥ 50**

పరవిద్య యనబడు నాత్మవిద్యను గౌరవించుచు శ్రుతిప్రసిద్ధమైన తత్త్వమసి వాక్యప్రబోధమును, సోఽహంస్వరూపమును (పరమాత్మయే నేనను తత్త్వమును) మదిలో భావించుచున్నవారై ముముక్షుజనులు సాధు మార్గమందు సంచరించుదురు గాక!

**విద్యాఽవిద్యాస్వరూపం తు యోగేఽస్మిన్సువిచారితమ్ ।**
**భజన్తు నితరాం సత్తస్తేన ముక్తిస్సునిశ్చితా ॥ 51**

ఈయధ్యాయమందు విద్యాऽవిద్యా స్వరూపము బాగుగా విచారింప బడెను దీనిని సత్పురుషులు సేవింతురుగాక! అందుచే వారికి ముక్తి నిశ్చయము

**ప్రోక్తం హి లక్షణం సుష్ఠు విద్యాऽవిద్యావిభేదకమ్ ।**
**ఉభే విద్యే సమభ్యస్య ఛిన్ద్యవిద్యాం చ విద్యయా ॥ 52**

ఈ అధ్యాయమున విద్యాऽవిద్యల భేదమును తెలుపు ఉభయ లక్షణములు స్పష్టముగా వివరింపబడినవి కాన పరాపరవిద్యల రెండింటిని అభ్యసించి పరవిద్యచే నవిద్యను నశింపజేయుము

**విదితోభయవిద్యానాం విరళత్వాచ్చ సాంప్రతమ్।**
**బ్రహ్మవిద్యాతమశ్ఛన్నా సత్వరం తాం ప్రకాశయేత్ ॥ 53**

అపరవిద్యతో బాటు పరవిద్యనుగూడ తెలిసిన వారు ప్రస్తుతము లోకమున అరుదైనందుచేతనే తేజోరూపమగు ఆ బ్రహ్మవిద్య అజ్ఞానావృతమై ప్రకాశింపకున్నది కాన వెంటనే అజ్ఞానాంధకారమును పారద్రోలి బ్రహ్మ విద్యను ప్రకాశింపజేయును

**విద్యయా చ యయాऽ విద్యా ప్రభయా చ యథా తమః ।**
**నశ్యతి బ్రహ్మవిద్యా సా తేజోరూపా చ నేతరా ॥ 54**

ప్రకాశముచే నంధకారము నశించునట్లు ఏ విద్యచే నవిద్య నశించునో అదియే తేజోరూపమయిన బ్రహ్మవిద్య యనంబడును ఇతరము గాదు అనగా అవిద్యను నశింపజేయు సామర్థ్యము లేనిది విద్య కానేరదు.

**విద్యయా చ యయా తాపత్రయం శామ్యతి మూలతః ।**
**తృషేవ తోయపానేన సైవ విద్యా హి నేతరా॥ 55**

జలపానముచే దాహము తీరునటుల, ఏవిద్యచే తాపత్రయము సమూలముగా నడుగంటునో అదియే విద్య యనంబడును తాపత్రయ శాంతిని గలుగజేయజాలనిది విద్య గాదు అవిద్యయే యగును

**యయా చ విద్యయా దీర్ఘభవవ్యాధిస్తు శామ్యతి ।**
**సైవ విద్యా న తద్భిన్నా భిన్నాఽవిద్యా చ దుఃఖదా ॥** 56

ఏవిద్యచే ననాదియగు నీ భవరోగము నశించునో అదియే విద్య యనంబడును మఱియొకటి గాదు. భవరోగమును నశింపజేయజాలని విద్య అవిద్య యగునేగాని విద్య గాదు. అవిద్య దుఃఖప్రద మగును

**అక్షరబ్రహ్మవిద్యాయాః ప్రారమ్భే సతి వస్తుతః ।**
**ప్రారబ్ధస్త్వక్షరాభ్యాస ఇతి విద్యాత్సునిశ్చితమ్ ॥** 57

అక్షరమగు బ్రహ్మవిద్య ప్రారమ్భ మయినపుదే యధార్థముగా అక్షరాభ్యాసము ప్రారమ్భించినటుల నిశ్చయముగ తెలియుము కాని ఓనమాలు తోటే అక్షరాభ్యాస మయినటుల నెంచకుము

**యావత్తు బ్రహ్మవిద్యాయాం కురుతే న పరిశ్రమమ్ ।**
**తావత్సర్వేషు శాస్త్రేషు పాండిత్యం వ్యర్థమేవ హి ॥** 58

బ్రహ్మవిద్యాభ్యాసము కానంతవరకు తానెన్ని శాస్త్రములందలి నేర్పరి అయినను వ్యర్థమని తలంచుము (ఇట్టి విద్యాఽవిద్యల స్వరూపమును తెలిసినవాడే మేధావి యగును అట్టి వివేకము లేనివాడు బుద్ధిహీనుడే యగును )

**దోషాన్వైషయికాన్విద్యా విషదోషమివామృతమ్ ।**
**హరతి స్వప్రభావేన సేవితా మోక్షకాంక్షిభిః ॥** 59

ముముక్షువులు దీనిని సేవించిరేని అమృతము విషమును హరించు నటుల తన యనుపమ ప్రభావముచే బ్రహ్మవిద్య విషయదోషముల నెల్ల నిర్మూలన మొనర్చును

**వాసనాదోషసంహర్త్ర్యా విద్యయాఽమృతమశ్నుతే ।**
**మృత్యుబంధురితి ఖ్యాతా తద్విరుద్ధా విషోపమా ॥** 60

విషయవాసనా దోషములను హరింప సమర్థమగు బ్రహ్మవిద్యచేతనే

అప్పు తత్వస్థితి లభించును దానికి విరుద్ధమైన అనగా విషయవాసనా హరణ సామర్థ్యము లేని విద్య విషతుల్యమై మృత్యుబంధువని చెప్పబడినది

**తత్త్వదృష్ట్యా చ సంప్రోక్తం సత్యమేతత్తథాఽపి హి ।**
**ఉపాస్యైవాపరా విద్యా పరవిద్యోపయోగినీ ॥ 61**

తత్త్వదృష్టితో నాలోచించి ఇప్పుడు చెప్పినది సత్యమే అయినను పరమగు బ్రహ్మవిద్యకు సహకరించునట్టి అపరవిద్య (శాస్త్రాధ్యయనము) అభ్యసింపదగినది సోమరులై శాస్త్రాభ్యాసము మానరాదని భావము

**సముపాస్య చ తత్త్వజ్ఞః పారగస్తాం పరిత్యజేత్ ।**
**పలాలమివ ధాన్యార్థీ నావం వా వార్ధిపారగః ॥ 62**

అపరవిద్య నభ్యసించి తత్త్వజ్ఞుడై సంసారసాగరమును తరించినవాడై, ధాన్యమును గోరినవాడు గడ్డిగాదమునువలెను, సముద్రతీరమును జేరిన వాడు ఓడనువలెను, ఆ అపరవిద్యను పరిత్యజించవలయును

**నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః ।**
**సర్వాక్షరస్యాపి తు యస్య చిత్తే బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః ॥ 63**

అక్షరాభ్యాసము(లిపి) లేనివాడైనను ఎవని కుక్షియందు అక్షరస్వరూపమగు బ్రహ్మము నెలకొని యున్నదో (ప్రకాశించుచున్నదో) అతడే అక్షరాభ్యాసము గలవాడగును అట్టి అక్షర పరబ్రహ్మ హృదయమందు లేనివాడు ఎన్ని అక్షరముల (శాస్త్రముల) ను నేర్చినవాడైనను నిరక్షరకుక్షియే యగును

ఇతి శ్రీ మలయాళయతీన్ద్ర గీతాయాం ఉపనిషత్సార భూతాయాం
విద్యాఽవిద్యాలక్షణయోగో నామ ద్వాదశోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
విద్యాఽవిద్యాలక్షణయోగమను ద్వాదశాధ్యాయము సమాప్తము



# త్రయోదశోఽధ్యాయః
# కర్మసన్న్యాసయోగః

దక్షిణామూర్తిరువాచ

**జ్ఞానవైరాగ్యరూపోఽసి భగవన్ బ్రహ్మసత్తమ।**
**కర్మసంన్యాసయోగస్య తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ॥** 1

దక్షిణామూర్తి చెప్పెను

జ్ఞానవైరాగ్యమూర్తియగు ఓ బ్రహ్మస త్తమా! కర్మసంన్యాసయోగము యొక్క యధార్ధ తత్త్వమును దెలుసుకొన గోరుచున్నాను కనుక దానిని నాకు విశదీకరించి తెలుపుడు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**భవాన్ సకలశాస్త్రార్థసారజిజ్ఞాసుర స్తృతః ।**
**కర్మసంన్యాసయోగస్య తత్త్వం వక్ష్యామ్యశేషతః ॥** 2

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

ఓ వివేకశీలసమ్పన్నా! నీవు సమస్త శాస్త్రసారాంశమును తెలుసుకొన నిచ్ఛగలవాడవుగా నున్నందున నీ కీ కర్మసంన్యాసయోగముయొక్క యధార్థ తత్త్వమును సంపూర్ణముగ చెప్పెద, వినుము

**యోగోఽయమతిగంభీరో దుర్గ్రహో జ్ఞానినామపి ।**
**తదజ్ఞానే ప్రమాదస్స్యాత్ జ్ఞాతవ్యశ్చాస్తికైరతః ॥** 3

ఈ కర్మసంన్యాసయోగము బహుగంభీరమైన దగుటచే జ్ఞానులకున్ను గ్రహింప కష్టముగా నున్నది దీనియొక్క యధార్థతత్త్వము తెలియనిచో ప్రమాదము సంభవించును కనుక ఆస్తికులైన వారందరును దీనిని తెలుసుకొనవలయును.

**జిజ్ఞాసోరాత్మశుద్ధ్యర్థం కర్మావశ్యకముచ్యతే ।**
**యోగారూఢస్య శాన్తిశ్చ మానసీ హేతురుచ్యతే ॥** 4

బ్రహ్మజ్ఞానులు తమ చిత్తశుద్ధికొఱకు పుణ్యకర్మలను నిష్కామముగా నవశ్యము చేయవలయును యోగారూఢులగు సిద్ధులకు కర్మానుష్ఠానము లేకపోయినను మానసిక శాంతి యవశ్యముగ నుండవలయును

**అప్రాప్య మనసశ్శాన్తిం నిగ్రహఞ్చాత్మనస్సుఖమ్ ।**
**యస్త్యజేన్నియతం కర్మ యోగీ యోగాత్పతేద్ధ్రువమ్ ॥ 5**

ఏయోగి మనశ్శాంతిని, ఇంద్రియనిగ్రహమును, ఆత్మసుఖమునున్ను పొందక నియతకర్మలగు ధ్యానాద్యనుష్ఠానములను విడుచునో వాడు తప్పక యోగమునుండి పతితుడగును

**శాన్తప్రకృతినా జీవన్ముక్తేన జ్ఞానరూపిణా ।**
**లోకసంగ్రహముద్దిశ్య క్రియతే కర్మ సర్వదా ॥ 6**

ప్రకృతిని జయించినవాడును, జ్ఞానస్వరూపుడునగు జీవన్ముక్తుడు లోకసంగ్రహ నిమిత్తమై సదా కర్మను చేయుచుండును

**న తస్య ప్రత్యవాయస్స్యాత్కర్మాకరణమాత్రతః ।**
**పాద్మం దలం జలేనేవ నైనసా స్పృశ్యతే హి సః ॥ 7**

అట్టి జీవన్ముక్తునకు జలము తామరాకు అంటనట్లు కర్మలను విడుచుటచే వచ్చెడు దోషమున్ను అంటదు

**యోగాతీతప్రధానేన తన్ద్రాభావవతా సదా ।**
**ప్రాప్తవ్యలేశాభావేఽపి జగతే క్రియతే హితమ్ ॥ 8**

యోగముచే జడప్రకృతిని దాటినవాడను, ఆలస్యాది గుణములు లేని వాడునగు వానిని తాను పొందవలసినది కొంచెమున్ను లేకపోయినను నతడెప్పుడు లోకహితకార్యమునే చేయు చుండును

**న కర్మణి కృతే బద్ధః న చాశాస్త్రీయతాఽకృతే।**
**శుద్ధప్రకృతినా కర్మ కృతం పరహితాయ హి॥ 9**

కృతకృత్యుడగు యోగికి పుణ్యకర్మలను జేసినచో బన్ధముగాని, వాటిని చేయనిచో శాస్త్రోల్లంఘనముగాని సంభవించదు ఏలనన అతడు కర్మలను పరహితము కొఱకుగదా చేయును!

**జీవన్ముక్తమహాత్మానం ప్రతి కర్మ న కేనచిత్ ।**
**వేదేన బ్రహ్మణా వాఽపి కదాచన విధీయతే ॥ 10**

జీవన్ముక్తుడగు మహాత్మునకు వేదముగాని బ్రహ్మదేవుడుగాని కర్మలను చేయవలయునని విధించియుండలేదు

**యద్యస్మై స్యాద్విధిస్తర్హి స విధ్యన్తర్గతో భవేత్ ।**
**ఏవం చేద్విధ్యతీతస్స వేదాతీతోఽపి వా కథమ్ ॥ 11**

జీవన్ముక్తుని విషయములోగూడ విధినిషేధశాస్త్రములు ప్రవర్తించినచో నాతడును విధికి లోబడినవాడే యగును అట్లైనచో జీవన్ముక్తుడు విధినిషేధముల నతిక్రమించిన వాడనియు, వేదాతీతుడనియు పండితులెట్లు చెప్పగలరు? ''నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః'' అనిగదా తత్త్వవేత్తలు చెప్పుచున్నారు

**మార్గేఽస్మిన్నలసానాం స్యుః ప్రమాదా దుఃఖభీతితః ।**
**సోఽహంభావచ్ఛలేనైవ త్యక్తసన్ధ్యాదికర్మణామ్ ॥ 12**

అయితే సోఽహంభావ వ్యాజముతో శారీరక దుఃఖమునకు భయపడి ధ్యానాద్యనుష్ఠానములను, పుణ్యకర్మలనున్ను పరిత్యజించిన సోమరులకీమార్గమునం దనేక ప్రమాదములు సంభవించును

**సుషుప్తి నిర్వికల్పౌ తు విషామృతభిదా యుజౌ ।**
**సుప్తిస్తమో నిర్వికల్పస్స్వస్వరూపావభాసనమ్ ॥ 13**

సుషుప్తికిని నిర్వికల్పసమాధికిని విషామృతములకు వలె భేదమున్నది సుషుప్త్యవస్థ కేవలము అజ్ఞానమయ మైనది నిర్వికల్పస్థితియో అజ్ఞాన రహితమై స్వస్వరూపము మాత్రము (ఆత్మస్వరూపము) భాసించుట యగును

**సోఽహంపరాణాం మన్దానాం కర్మత్యాగే సమానతా ।**
**భేద స్తథాఽపి సుస్పష్టః ప్రకాశతమసోరివ ॥ 14**

సోమరులకును, సోఽహంపరులకున్ను కర్మలను పరిత్యజించుటలో సామ్యమున్నను తమఃప్రకాశములకువలె వీరుభయులకు గలభేదము సుస్పష్టముగా దెలియదగును

**తీర్ణస్య చ భవామ్భోధిం తర్తుమిచ్ఛోస్తథైవ చ ।**
**బాహ్యాకారసమానత్వేఽప్యాత్మన్యస్తి మహాభిదా॥ 15**

సంసారసాగరమును దాటిన జ్ఞానికిని, దాటదలచిన యజ్ఞానికిని బాహ్యాకారము సమానముగా నున్నప్పటికి నాత్మలందు చాల భేదము గలదు

**శరీరబుద్ధిరేకస్స్యాదాత్మబుద్ధిస్తథా పరః ।**
**వృత్తిభేదస్తయోస్సత్యం తత్త్వదర్శిభిరీక్ష్యతే ॥ 16**

మరియు వీరిలో నొకడు దేహాత్మదృష్టి గలవాడు, మరియొక డాత్మదృష్టి గలవాడు తత్త్వవేత్త లీయుభయులు ప్రవృత్తులనుబట్టి వారికి గల భేదమును దెలుసుకొనగలరు

**తామసో దేహాత్మబుద్ధిస్సన్నలసో దుఃఖమాప్నుయాత్ ।**
**ఆత్మబుద్ధిస్తథా శాన్తిం మోక్షం చానందరూపకమ్ ॥ 17**

దేహాత్మబుద్ధిగలవాడు తమోగుణము గలవాడై సోమరియై దుఃఖమును బొందును ఆత్మబుద్ధి గలవాడు దివ్యశాంతిని ఆనంద స్వరూపమగు మోక్షమునున్ను బొందును

**అతి వేగేన చక్రస్య భ్రమతో నిశ్చలస్య చ ।**
**భేదాభేదౌ యథా దృష్టౌ తథా పూర్వోక్తయోరపి॥ 18**

అతివేగముగా తిరుగుచున్న చక్రము, నిశ్చలముగ నున్న చక్రమున్ను సమానముగ కనిపించినప్పటికి వస్తుతః వాటికి భేదమేలాగున నున్నదో అట్లే ప్రకృతిలో పూర్తిగా మునిగినవానికి, ప్రకృతిని దాటినవానికిన్ని భేదము

సునిశ్చితము

**వైధం కర్మ శరీరేణ త్యక్త్వైకో హృది సంస్మరన్ ।**
**అశాంతిమాప్నుయాదన్యో దేహేనైతత్సమాచరన్ ॥ 19**

**సంకల్పరహితో నిత్యం బ్రహ్మానన్దమవాప్నుయాత్ ।**
**కర్మసంన్యాసగూఢార్థో మహానిహ నిరూపితః ॥ 20**

ఒకడు విధ్యుక్త కర్మల నన్నిటిని సోమరితనముచే పరిత్యజించి, మనస్సుచే సమస్త క్రియాకలాపములను స్మరించుచూ, అశాంతిని బొందు చున్నాడు రెండవవాడు స్థూలదేహముచే సమస్తకర్మలను జేయుచు నిత్యము సంకల్పరహితుడై బ్రహ్మానందమును బొందును ఈ విధముగా ఆత్మసంన్యాసముయొక్క నిగూఢార్థము నిరూపించడమైనది

**అగ్ని దగ్ధమదగ్ధఞ్చ బీజం సన్దృశ్యతే సమమ్ ।**
**అంకురోత్పత్త్యనుత్పత్తి కార్యభేదో మహాం స్తథా ॥ 21**

**నిస్సఙ్కల్పేన నిర్వాణం సంసారః కామవృత్తినా ।**
**ప్రాప్యతేఽతః ఫలే భేదో జ్ఞానినోఽజ్ఞానినోఽపి చ ॥ 22**

మఱియు మంగలమున వేపిన బీజములు వేపని బీజములు నొకేవిధముగ గనిపించుచున్నను వాటినుండి అంకురోత్పత్తి, తదనుత్పత్తి కార్యభేద మెట్లు కనుపించుచున్నదో, అట్లే జ్ఞానియు నజ్ఞానియు నొకేవిధముగా గనుపించినను మోక్షప్రాప్తి, సంసారప్రాప్తిరూప ఫలములంబట్టి వారిరువురికిని భే దము సుస్పష్టము

**వికారం ప్రాప్నుయాదేకః ప్రసఙ్గాద్విషయేక్షణే ।**
**వికార హేతుమధ్యస్థోఽప్యన్యస్తం నాధిగచ్ఛతి ॥ 23**

మరియు నొకడు ప్రసంగవశముగ భోగ్యవిషయములను దర్శించి నప్పుడు వికారము బొందుచుండును. మరియొకడు మనోవికార హేతువు లగు విషయముల మధ్యనున్నప్పటికిని వికారమును బొందకుండును

**సాధువేషధరా మర్త్యా జటాస్సన్ధార్య సిద్ధవత్ ।**
**బహవో విహరన్త్యత్ర మిథ్యాచారా జనాః కిల ॥ 24**

సాధువేషములను ధరించి సిద్ధపురుషులవలె జటలనున్ను ధరించి మిథ్యాచారులై ఈ లోకములో ననేకులు విహరించుచున్నారు

**కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః ।**
**వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥ 25**

కాకిపిల్లయు కోకిలపిల్లయు నల్లనిరంగు గలిగియుండుటలో భేదము లేకపోయినను వసంతకాల మాసన్న మైనప్పుడు వీటియొక్క స్వరభేదము వలన కాకికి పికమునకు గల భేదము స్పష్టమగును

**ఏవం నామభిరాకారై రేకరూపాస్తు మానవాః ।**
**బద్ధా ముక్తాస్తథాపి స్యుర్భిన్నా స్తే స్వప్రవృత్తిషు ॥ 26**

అదే విధముగ ముక్తులైనను మానవులందరు నామరూపాకారములతో సమానముగా నున్నను వారిప్రవర్తనములయందు భేదము కలిగియుందురు

**హంసశ్శుక్లో బకశ్శుక్లః కో భేదో బకహంసయోః ।**
**క్షీరనీరవిభాగే తు హంసో హంసో బకో బకః ॥ 27**

మరియు హంసయు తెల్లకొంగయు తెల్లగా నుండుటవలన వాటికి గల భేదము కనుపించకపోవచ్చును కాని నీరక్షీరములను విభాగముచేయు సందర్భములో వాటికిగల భేదము స్పష్టముగ తెలియనగును

**హంసాదపి పరం తత్త్వం ప్రాప్తం బ్రహ్మావబోధనమ్ ।**
**తస్మాత్పరమహంసాస్తే ఖ్యాతా జగతి సాధవః ॥ 28**

ఇదే విధముగానే హంసకు(జీవునకు) పరమగు పరతత్త్వమును బొందినందుచే సాధువులైనవారు పరమహంసలని విఖ్యాతిని బడసిరి

**యథా కాష్ఠమయో హస్తీ నామమాత్రస్య ధారకః ।**

**తపోఽధ్యయనహీనౌ తు యతివిప్రౌ తథా మతౌ ॥** 29

కఱ్ఱచే జేయబడిన ఏనుగేలాగున నామమాత్రమున కేనుగుగా నున్నదో అట్లే తపోఽధ్యయనము లేని యతులున్ను విప్రులున్ను నామమాత్రముచే యతులుగాను విప్రులుగాను నున్నారు

**అశేషరోగనిర్మూలనం యావత్పథ్యమౌషధమ్ ।**
**న త్యజేత్ప్రత్యహం ప్రాజ్ఞ స్తద్వదజ్ఞాననాశనమ్ ॥** 30

**యావతా సంభవేత్తావన్మనీషీ బ్రహ్మచిన్తనమ్ ।**
**శమాదిగుణవత్తాం చ ప్రత్యహం హృది న త్యజేత్ ॥** 31

వివేకియగు రోగి రోగము పూర్తిగా నశించు నంతవరకును ప్రతిదినము ఔషధపథ్యముల నెట్లు పరిత్యజించడో, అట్లే ప్రజ్ఞావంతుడైన సాధకుడున్ను అజ్ఞానము పూర్తిగా నశించు నంతవరకు నిత్యము బ్రహ్మచింతనమును, శమాది గుణములనున్ను పరిత్యజించగూడదు

**తమోరూపం శరీరన్తు రజః కర్మేన్ద్రియాణి చ ।**
**జ్ఞానేన్ద్రియాణి సత్త్వం స్యాత్ నిర్గుణం బ్రహ్మ యత్పరమ్ ॥** 32

శరీరము తమోరూపమైనది, కర్మేన్ద్రియములు రజోరూపము లైనవి, జ్ఞానేంద్రియములు సత్త్వరూపము లైనవి వీటికన్నిటికిని పరమైనది పరబ్రహ్మము దానియందు నిలకడ గలవాడే బ్రహ్మజ్ఞాని యగును

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తో భోగకామీ చ బద్ధో గీతోదితః పురా ॥** 33

కర్మఫలమందాశను విడచి కర్మల నాచరించువాడు శాశ్వతశాన్తిని పొందుననియు, ఫలాభిలాషచే కర్మలను జేయువాడు బద్ధుడగు ననియును గీతాశయమై యున్నది

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి మే మతమ్ ।**
**గీతాన్తేఽపి పురా ప్రోక్తం సూక్ష్మ మేతద్విచింతయేత్ ॥** 34

కనుక యజ్ఞము, దానము, తపస్సు, ధ్యానము మొదలగు కర్మలను బరిత్యజించరాదని మామతము, ఈ విషయమును గీతాంతమున శ్రీకృష్ణభగవానులు చెప్పియున్నారు కనుక సాధకులైనవా రీవిషయమును దీర్ఘముగా నాలోచించుకొనవలయును

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥** 35

యజ్ఞదానతపస్సులు చిత్తశుద్ధిద్వారా మోక్షమునకు సాధనము లగుటవలన బుద్ధిమంతు లైనవారు వాటిని పరిత్యజించగూడదు తప్పక నాచరింపవలయును

**నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీ ర్తితః ॥** 36

నియతకర్మల నెప్పుడును త్యజించరాదు అజ్ఞానమువలన పరిత్యజించినచో నది తామసత్యాగ మనబడును

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥** 37

కర్మానుష్ఠానమువలన శరీరమునకు కష్టము గలుగుననెడి భయముతో కర్మలను పరిత్యజించినచో నది రాజసత్యాగ మనబడును

**కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।**
**సఙ్గం త్యక్త్వా ఫలఞ్చైవ స త్యాగస్సాత్త్వికో మతః ॥**
**ఇతి త్యాగస్య తత్త్వం హి గీతాయాం ప్రతిపాదితమ్ ॥** 38

ఫలాసక్తిని విడిచి విధ్యుక్త నియత కర్మల ననుష్ఠించుట పరమ కర్తవ్యమని తలంచి శ్రద్ధతో నాచరించుటయే సాత్త్వికత్యాగమని గీతామతము ఇట్లు త్యాగ తత్త్వము గీతలో నిరూపింపబడినది

**రజస్సత్త్వతమోమాయా పాశత్రయవినాశనాత్।**

**మహాత్మభిశ్శరీరేణ కర్మత్యాగేఽపి మోక్షదమ్ ॥** 39

**ఆత్మజ్ఞానప్రదం సర్వం గీతోక్తం బోధనాత్మకమ్ ।**
**క్రియతే కర్మ నిష్కామభావనా సూక్ష్మదృష్టిభిః ॥** 40

సత్త్వరజస్తమస్సులనెడి మాయాపాశములు మూడును నశించినందుచే మహాత్ములైనవారు దేహేంద్రియములచే స్థూలకర్మలను జేయకపోయి నప్పటికిని ఆత్మజ్ఞానమును కలిగించెడు జ్ఞానబోధలకు సంబంధించిన కార్యములను మాత్రము నిష్కామభావనతో సూక్ష్మదృష్టి గలవారై సదా చేయుచుందురు

**స్వాధీనప్రకృతిః కృష్ణః సృష్టిస్థితిలయాదికమ్ ।**
**కుర్వన్నపి న బధ్యేత తథా పూర్వోక్త సాధవః ॥** 41

ప్రకృతిని స్వాధీనమందుంచుకొన్న శ్రీకృష్ణుడెట్లు సృష్టి స్థితి సంహార రూప మహత్తర కార్యములను జేయుచున్నను తత్కార్యములచే బంధింప బడలేదో యట్లే పైజెప్పిన మహాత్ములున్ను మలినప్రకృతి నశించుటచే జ్ఞాన బోధలకు సంబంధించిన కార్యములను జేసినను బద్ధులు కారు

**పాశబద్ధో ఘటో నిత్యమూర్ధ్వం గచ్ఛత్యధో యథా ।**
**పాపబద్ధస్తథా జీవస్సంసారే భ్రమణం వ్రజేత్ ॥** 42

పాశముచే బంధించబడిన ఘటీయన్త్ర జలపాత్రము క్రిందికిని పైకిని వచ్చి పోవునట్లే పుణ్యపాపములనెడి పాశముచే బద్ధుడైన జీవుడున్ను ఊర్ధ్వా ధోలోకముల కరుగుచూ జననమరణరూపమగు సంసారచక్రమున దిరుగు చున్నాడు

**విచ్ఛిన్నపాశం పాత్రన్తు నిమగ్నం వారి తిష్ఠతి ।**
**ఏవం జీవోఽపి నిర్గ్రన్థిర్బ్రహ్మధ్యానే నిమజ్జతి ॥** 43

త్రాడు తెగిపోయినచో నా పాత్రమెట్లు నీటిలో మునిగియుండునో అట్లే అజ్ఞానపాశ వినిర్ముక్తుడగు జీవుడున్ను అగాధమగు బ్రహ్మధ్యానమందే

నిమగ్నుడై యుండును

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥** 44

పరమోత్కృష్టమైన బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలిగినచో హృదయ గ్రంథులన్నియు స్వయముగనే వీడిపోవును సంశయము లన్నియు నశించును కర్మలన్నియు భస్మము లగును

**సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।**
**హృదయే నాస్తి సర్వాస్థా ముక్త ఏవోత్తమాశయః ॥** 45

ఇట్టి బ్రహ్మవేత్త సమాధి శీలించినను శీలంచకపోయినను, కర్మలను జేసినను చేయకపోయినను తనహృదయమందేలాటి యాశ లేనందున తాను ముక్తుడే

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥** 46

సోమరితనమువలన నియతకర్మలనుండి నివర్తించుట మూఢునికి ప్రవృత్తియే యగును నిస్సంగుడైన జ్ఞానికి నిష్కామకర్మయందలి ప్రవృత్తి యున్ను నివృత్తిఫలమునే కలుగజేయును

**కర్మసన్న్యాసయోగోఽయం దుర్గ్రహో జ్ఞానినామపి ।**
**అజ్ఞానాదస్య తత్త్వస్య వ్యర్థం భవతి జీవితమ్ ॥** 47

ఈ కర్మసన్న్యాసయోగముయొక్క రహస్యము గొప్పజ్ఞానులకుగూడ దురగాహమైనది ఈ తత్త్వమును (రహస్యమును) తెలిసికొనకపోయినచో వారి జన్మ వ్యర్థమగునని యెఱుంగుము కాన సూక్ష్మావలోకనముతో శ్రద్ధా భక్తులతో గురుశాస్త్రములను సేవించి ఈ రహస్యము నెఱుంగుము

**అత్రోక్తం తత్త్వసారం హి విజ్ఞాయానన్యచేతసా ।**
**పరానుపదిశ జ్ఞానం బుభుక్షూనపి తారయ ॥** 48

ఓ దృఢవ్రతోత్తమా! ఈ అధ్యాయమున జెప్పిన కర్మసన్న్యాస రహస్యమును అనన్యచేతస్కుడవై సూక్ష్మదర్శివై గ్రహించి యీ తత్త్వమును భోగపరవశులయిన వారికిని ఉపదేశించి తరింపజేయుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సారభూతాయాం
కర్మసంన్యాసయోగో నామ త్రయోదశోఽధ్యాయః॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
కర్మసన్న్యాసయోగమను త్రయోదశాధ్యాయము సమాప్తము



# చతుర్దశోఽధ్యాయః

# దైవాసురస్వరూపయోగః

శ్రీరామచరణ ఉవాచ

**భవాన్ సర్వేశ్వరేణాత్ర లోకానుగ్రహకామినా ।**
**ప్రేషితో ధర్మరక్షార్థం మే వారయతు సంశయమ్ ॥** 1

**సురాసురగణాస్సన్తి పృథగ్లోకాన్తరేఽథవా ।**
**ఇహైవ నరరూపేణ చేతి మే సంశయో మహాన్ ॥** 2

శ్రీరామచరణము చెప్పెను

లోకానుగ్రహమును గోరు పరమేశ్వరునిచే ధర్మరక్షణార్థమై పంపబడిన ఓ సద్గురూత్తమా! దేవాసురులు ప్రత్యేకముగా లోకాంతరమందు నివసించుచున్నారా? లేక యీలోకమందే మానవరూపభేదములతో నున్నారా అనెడి నాసంశయమును నివారింపగోరెద

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ.

**సాధు పృష్టం త్వయా ధీమన్ సన్దిగ్ధం సప్రయోజనమ్ ।**
**వివేకిభిశ్చ బోద్ధవ్యం తస్యోత్తరమిదం శృణు॥** 3

శ్రీమలయాళ యతీంద్రుడు చెప్పెను

ఓ బుద్ధిమంతుడా! వివేకులచే దెలియ దగినదిగ సందిగ్ధముగ, ప్రయోజనముతో గూడుకొన్నదిగ నున్న ఈ విషయమునుగూర్చి నీవడిగిన ప్రశ్న చాల బాగున్నది

**సహస్రమానవేష్వేకస్సత్యం వేత్తు మిహేచ్ఛతి ।**
**గతానుగతికాస్త్వన్యే న లోకః పారమార్థికః ॥** 4

వేలకొలది మానవులలో నొకానొకడుమాత్రమే యధార్థమును దెలుసుకొనుటకై ప్రయత్నించును తక్కిన వారందరు మంచిచెడ్డలను విచా

రింపక గతానుగతికులై నడుచుకొందురు

**దేవాసురాణాం జననం పురాణతః**
**ప్రతీయతే యద్యపి భిన్న హేతుకమ్ ।**
**తథాఽపి మర్త్యేషు సురత్వదైత్యతే**
**శాస్త్రేష్వహింసాదిగుణైః ప్రసిధ్యతః ॥ 5**

దేవాసురుల జన్మలకు కారణములు వేర్వేరుగ పురాణములవలన దెలియుచున్నవి కాని శాస్త్రములలో మానవులయందుండు సురత్వాసురత్వములు అహింసాది గుణములచేత క్రౌర్యాది గుణములచేతను సిద్ధించుచున్నవి

**దేవత్వసంపాదన హేతవః పురా కృష్ణేన గీతాసు నిరూపితా ఇమే ।**
**సత్త్వస్య సంశుద్ధిరభీతిమార్దవే దానం దయా జ్ఞానసుయోగసంస్థితిః॥ 6**

**అపైశునం సత్యమహింసనం తపః స్వాధ్యాయయజ్ఞార్జవశాన్త్యమానితాః ।**
**భూతేష్వలోలత్వమచాపలం క్షమా తేజో ధృతిశ్శౌచదమాదయో గుణాః ॥**

దేవత్వమునకు హేతువులైన గుణములను శ్రీకృష్ణభగవానుడు గీతయందుపదేశించెను ఆ గుణము లెవ్వియన సత్త్వసంశుద్ధి, అభయము, మృదుత్వము, దానము, దయ, జ్ఞానయోగమందు దృఢనిశ్చయము, అపైశునము, సత్యము, అహింస, తపస్సు, స్వాధ్యాయము, యజ్ఞము, శాంతి, గర్వము లేకుండుట, అలోలత్వము, అచాపలము, క్షమము, తేజము, ధైర్యము, శౌచము, దమము, కోపము లేకుండుట మొదలగునవి

**దైత్యత్వసంపాదనహేతు భూతాస్తేనైవతత్ర ప్రతిపాదితాః పురా ।**
**అజ్ఞాన దంభౌ పరుషం వచశ్చ క్రోధోఽభిమానశ్చ మదశ్చ హింసా॥8**

అజ్ఞానము, దమ్భము, కఠినముగ పలుకుట, క్రోధము, అభిమానము, మదము, హింస మొదలగు గుణములను అసురత్వహేతువులని గీతయం దర్జునునకు శ్రీకృష్ణభగవాను డుపదేశించెను

**దేవాసురగుణా స్త్వన్తే దేవదానవరూపతామ్ ।**
**ప్రాప్నువన్తి పూర్వసంస్కారబలాదితి వివేకినః ॥** 9

దేహావసాన సమయములో దేవగుణము గలవారు దేవత్వమును, అసురగుణములు గలవారు రాక్షసత్వమునున్ను బొందుదురని జ్ఞానులు చెప్పుచున్నారు

**ఉభయేషాం స్థితిర్జ్ఞేయా తత్త్వవిద్భిరియత్తయా ।**
**దైవకార్యాణి నిన్దన్తో నాశయన్తశ్చ యే సదా ॥** 10

**నింద్యాని పాపకార్యాణి కుర్వన్తస్సన్తి దుర్జనాః ।**
**తత్కార్యైరేవ తాన్సర్వానసురాన్ జ్ఞాతు మర్హసి ॥** 11

ఈక్రింద చెప్పబోవు కార్యములచే నీయుభయుల స్థితి యింత మాత్రమని తత్త్వవేత్తలు తెలుసుకొందరు దైవకార్యములను నిందించు వారును, వాటిని నాశముచేయువారును, నింద్యములైన పాపకార్యములను చేయువారునగు దుర్జనులైన వారి నెల్లరిని వారి కార్యములనుబట్టి అసురులనుగ దెలుసుకొనుము

**నిత్యాత్మసుఖయత్నా యే పుణ్యాచారా మహాజనాః ।**
**దేవానేవ విజానీహి తాన్ సత్యచరితాన్ భువి ॥** 12

నిత్యాత్మసుఖమునకు యత్నించువారును, పుణ్యకర్మపరులును అగు మహాజనులను సత్యవ్రతనిష్ఠులైన దేవతలనుగా దెలిసికొనుము

**ఉత్పత్తిస్థితిసంహారాః సంభవన్తి స్వభావతః ।**
**తస్మాద్దేవోఽపి నాస్తీతి బ్రువాణా రాక్షసాంశజాః ॥** 13

సృష్టిస్థితిలయములు స్వభావముగానే జరుగుచున్నవి కనుక భగ వంతుడు లేడని చెప్పువారిని అసురాంశజులనుగా దెలుసుకొన వలయును

**జగజ్జన్మాదిహేతుత్వం దేవస్యైవ విజానతః ।**
**దేవాస్తిత్వం బ్రువాణాంస్తాన్దేవానాహుర్మనీషిణః ॥** 14

జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతుడు భగవంతుడు దప్ప మరెవ్వడును గాజాలడని తెలిసికొని ఈశ్వరు డున్నాడని చెప్పువారిని విద్వాంసు లైనవారు దేవాంశజులనుగా దలంతురు

**స్వభావస్య జడత్వేన జడం స్రష్టుమశక్తతా ।**
**చేతనాదేవలోకేఽస్మిన్ జడసృష్టిర్విలోక్యతే ॥ 15**

స్వభావము జడముగ నున్నది గనుక దానికి మరొక జడవస్తువును సృష్టింప శక్తి లేదు మరియు లోకమంతట చేతనము వలననే జడసృష్టి జరుగుచున్నట్లుగ చూచుచున్నాము అందుచే చైతన్యమునకే యట్టి జగత్తును సృష్టించ శక్తి గలదని తెలియవలెను

**చేతనేష్వప్యసర్వజ్ఞో స్రష్టుం శక్నోతి నో జగత్ ।**
**నాసర్వజ్ఞసమూహోఽపి తస్మాదస్తి మహేశ్వరః ॥ 16**

చైతన్యము గలవారిలో గూడ సర్వజ్ఞుడు కానివాడు జగత్తును సృష్టించలేడు అట్టి వారెందరైననుగాని యీ సృష్టికి కర్తలు గాజాలరు కనుక దేవదేవుడగు పరమేశ్వరుడే కర్తగా నున్నాడు

**యన్త్రృభావే క్షితౌ యన్త్రం నిష్పత్తుం నైవ శక్యతే ।**
**యన్త్రం దృష్ట్వా న దృష్టోఽపి యన్త్రీ తస్మాత్ర్పకల్ప్యతే ॥ 17**

లోకములో యంత్రమును జేయువాడు లేనిచో యన్త్రము తయారు గాదు కనుక యంత్రము చేయువాడు కనుపించకపోయినను యంత్రమును జూచి తప్పక యంత్రకర్త యుండితీరవలయునని తలంచి లోకు లనుమాన ప్రమాణముచే యంత్రినెట్లు తెలుసుకొనుచున్నారో అట్లే,

**విచిత్రకార్యకర్తారో నభవేయుర్నరా న చ ।**
**కర్త్రభావే రవిశ్చంద్రః భవేతాం నియతాధ్వగౌ॥ 18**

సర్వనియామకుండగు పరమేశ్వరుడు లేనిచో విచిత్రకార్యకర్తలగు మనుష్యులు పుట్టియుండరు నియమపూర్వకముగా తమతమ కార్యములను

సకాలమునకు నిర్వహించుచుండు సూర్యచంద్రులున్ను తమ కార్యములను జేయకుండెడివారు

**కర్త్రభావే యతః కార్యం న లోకే సంభవిష్యతి ।**
**అదృష్టోఽపి తతః కర్తా కల్ప్యశ్శాస్త్రాదిమానతః ॥ 19**

మరియు లోకములో కర్త లేనిచో నేకార్య మెప్పుడున్ను సంభవింపదు కనుక కార్యకర్త కనబడకపోయినప్పటికిని కార్యమునుబట్టి తత్కార్యకర్త యూహింపబడునటుల నాయీశ్వరుడును శాస్త్రానుమానాది ప్రమాణములచే దెలియబడుచున్నాడు

**గృహమధ్యస్థితో దీపో గృహవస్తుప్రదీపకః ।**
**అనిషేధ్యస్తథాఽఽత్మాఽసౌ శరీరేన్ద్రియభాసకః॥ 20**

గృహమధ్యలో ప్రకాశించుచున్న దీపము గృహమందున్న సమస్త వస్తువులను ప్రకాశింపజేయుచున్న విషయమును నెవరును ఎట్లు కాదనజాలరో అట్లే స్వయంప్రకాశమై దేహమందున్న యాత్మ సమస్తేంద్రియములను మనోబుద్ధులను ప్రకాశింపజేయుచున్నదను విషయమునుగూడ నెవరును కాదనజాలరు

**యథా వస్తుచయో దీపం నావభాసయతే కిల ।**
**తథా జడానీన్ద్రియాణి భాసయన్తే న తత్పరమ్ ॥ 21**

**దీపాభావే జడానాన్తు ప్రకాశో యది సంభవేత్ ।**
**జడేంద్రియ ప్రకాశోఽపి చైతన్య విరహే భవేత్ ।**
**న తథా దృశ్యతే లోకే హ్యాత్మా సర్వత్ర భాసతే ॥ 22**

ఏలాగున దీపమును వస్తువులు ప్రకాశింపజేయజాలవో ఆలాగున జడములగు ఇన్ద్రియములును పరమాత్మను ప్రకాశింపజేయజాలవు మఱియు దీపము లేకపోయినను జడవస్తువులకు ప్రకాశము సంభవించునట్లైన ఆత్మ లేకున్నను జడములగు నిన్ద్రియములకు ప్రకాశము సంభవింపవలసివచ్చును ఈలాగున లోకమున కనబడుట లేదు కనుక

సర్వప్రకాశకమగు నాత్మ సిద్ధించుచున్నది

**ప్రత్యక్షేణానుమానేవ ప్రకృతేః ప్రేరకః పుమాన్ ।**
**భగవాన్ సృష్టికర్తా తు స్యాదవశ్యమితీర్యతామ్ ॥** 23

జడమగు ప్రకృతిని ప్రేరేపించువాడు సృష్టికర్తయైన పరమేశ్వరుడే యని ప్రత్యక్షానుమానాది ప్రమాణములచే నిశ్చయముగ జెప్పవలయును

**ప్రమాణై రంతరాత్మానమవిజ్ఞాయైవ కేవలమ్ ।**
**యది స్యాద్దర్శయాత్మాన మితి వాదస్తు మూఢతా ॥** 24

శాస్త్రప్రమాణముచే నంతరాత్మను దెలుసుకొనకయే శరీరేంద్రియాతిరిక్తాత్మ యున్నచో మాకు జూపించుమని వాదించుట మౌఢ్యమే

**ప్రమాణై స్సూక్ష్మబుద్ధ్యా చ భృశమన్విష్య వస్తుషు ।**
**బుద్ధిమంతః ప్రకుర్వన్తి హ్యస్తి నాస్తీతినిర్ణయమ్ ॥** 25

సకల ప్రమాణములచే సూక్ష్మముగా వస్తుత త్త్వమును విచారించి తదుపరి ఏ వస్తువువైన ఉన్నదనిగాని లేదనిగాని నిర్ణయమును బుద్ధిమంతులు మాత్రమే చేయగలరు

**ఆత్మశుద్ధిర్విర క్తిశ్చ సర్వేన్ద్రియవినిగ్రహః ।**
**అ న్తర్దృష్టిశ్చ హేతుస్స్యాద్భగవద్దర్శనాయ హి ॥** 26

భగవద్దర్శనమున కాత్మశుద్ధి, విషయవిరక్తి, అంతరింద్రియ బాహ్యేన్ద్రియ నిగ్రహము, అంతర్దృష్టి, ఇవి కారణమని తెలుసుకొనవలయును

**దేహబుద్ధిర్బహిర్దృష్టిరింద్రియాధీనమానసః ।**
**పురుషో విషయాసక్తో నాత్మానం శక్త ఈక్షితుమ్ ॥** 27

దేహాత్మబుద్ధి గలవాడు, బాహ్యదృష్టి గలవాడు, ఇంద్రియములకు స్వాధీనమైన మనస్సు గలవాడు ఆత్మను సందర్శించుటకు సమర్థుడు గాడు

**సూర్యో న దృశ్యతేఽన్ధేన యద్యప్యక్షిమతా న కిమ్ ।**

**అసురై ర్నేక్ష్యతే విష్ణుః కిం న దైవ గుణాన్వితైః ॥** 28

అంధునకు సూర్యుడు కనుపించకపోయినను నేత్రములు గలవారికి కనుపించునట్లుగ ఆసురగుణములు గలవారికి భగవద్దర్శనము లభించక పోయినను దైవగుణములు గలవారికి నాతని దర్శనము కలుగదా ఏమి?

**నేత్రరోగవతా లోకో న దృష్టోఽప్యౌషధాదినా ।**
**భోగనాశే తు తేనైవ దృశ్యతే సకల స్తథా ॥** 29

**కామాదివ్యాధియుక్తేన పుంసాఽఽత్మా నైవ దృశ్యతే ।**
**జ్ఞానౌషధేన తన్నాశే తేనైవాత్మా విలోక్యతే ॥** 30

నేత్రరోగము గలవాడు రోగసమయమున లోకమును జూడలేకపోయినను ఔషధముచే నేత్రరోగము నశించిన తరువాత వాడెట్లు లోకమును జక్కగ జూడగలుగునో, అట్లే కామక్రోధాది దుర్గుణవ్యాధి గలవాడాత్మను జూడలేకపోయినను జ్ఞానౌషధముచే ఆ యజ్ఞానవ్యాధి నశించిన తరువాత వాడే స్వాంతరాత్మను బాగుగ జూడగలడు

**బుద్ధో జినో జైమినిశ్చ ఋషయః కపిలాదయః ।**
**అనీశ్వరధియోఽప్యేతే బన్ధమోక్షానుయాయినః ॥** 31

ఋషీశ్వరులైన కపిల జైమిని జిన బౌద్ధాదులు అనీశ్వరవాదులైనప్పటికిని బంధమోక్షముల ననుసరించిరి

**నాఙ్గీకృత్యాపి దైవం తే తత్సాక్షాత్కార హేతుకమ్ ।**
**సత్యం జ్ఞానం తపో ధ్యానమనుష్ఠాయ విరేజిరే ॥** 32

దైవము నంగీకరింపక పోయినను వారు దైవసాక్షాత్కారమునకు హేతువులైన సత్య జ్ఞాన తపో ధ్యానాదులను ననుష్ఠించి ప్రసిద్ధి నందిరి

**తస్మాదానన్దరూపాశ్చ తృప్తాస్సిద్ధా మహర్షయః।**
**స్వాత్మారామాస్సదా ముక్తాస్తే జగద్గురవోఽభవన్॥** 33

అందుచేవారు అఖండానంద స్వరూపులుగను, తృప్తులుగను

సిద్ధులుగను, స్వాత్మారాములుగ నుండి జగద్గురువులైరి

**ఆస్తికా నాస్తికా వా స్యుస్తే సిద్ధమునయో భువి ।**
**అతస్తద్విషయేఽస్మాకం వివాదో నాస్తి కశ్చన ॥ 34**

వారాస్తికులైనను నాస్తికులైనను సిద్ధ మునులైనందుచే వారివిషయములో మాకేవిధమగు వివాదమును లేదు సత్య శాన్తి కరుణా తపస్సు లున్నవారెవరైనను చాలును

**అహమాస్తిక ఇత్యుక్త్వా నరో నైవాస్తికో భవేత్ ।**
**ప్రవృత్త్యా హ్యా స్తికస్సర్వో మన్తవ్య ఇతి మే మతమ్ ॥ 35**

నేను ఆస్తికుడనని చెప్పుచు నాస్తికప్రవర్తన గలవాడెవడును ఆస్తికుడు కాడు ప్రవృత్తిచే ఆస్తికుడైన ప్రతివాడును నిజమగు ఆస్తికుడని మామతము

**ఆస్తికో నాస్తికో వాఽపి జ్ఞాన్యజ్ఞానీ భవేన్నరః ।**
**బద్ధో ముక్తశ్చ భుఙ్క్తే హ్యవశ్యం కర్మణః ఫలమ్ ॥ 36**

ఆస్తికుడు, నాస్తికుడు, జ్ఞాని, యజ్ఞాని, బద్ధుడు, తుదకు ముక్తుడు గూడ తాను జేసిన కర్మఫలము నవశ్య మనుభవించును

**తాదృశః కర్మసిద్ధాన్తోఽనివార్యో లోకసమ్మతః ।**
**తత్ర తత్త్వవిదాం బుద్ధిస్సుదృఢా న తథేశ్వరే ॥ 37**

అట్టి కర్మసిద్ధాంత మనివార్యము గనుక సర్వలోక సమ్మతము నున్నది దీనినే తత్త్వవేత్తలు విశేషముగా చెప్పుదురుగాని పరమేశ్వరుని విషయమై అంతగా జెప్పరు

**అమృతం విషబీజాద్యః ఫలం సాధయితుం క్షమః ।**
**స నీచం కర్మ కృత్వాఽపి శ్రేష్ఠం ఫలమవాప్నుయాత్ ॥ 38**

విషబీజమును పెట్టి మధురమైన ఫలమును పండించుటకు సమర్థుడైన వాడు మాత్రమే నికృష్టకర్మను జేసి యుత్కృష్టఫలమును బొందును

**స్వీయచ్ఛాయాం పరిత్యజ్య గన్తుం శక్తో భవేద్యది ।**
**సిద్ధం తం న స్పృశేత్కర్మఫలమన్యాన్న సన్త్యజేత్ ॥ 39**

తన ఛాయను పరిత్యజించి నడచు సామర్థ్యము గల సిద్ధుడెవడైన నున్నచో నట్టివానినిమాత్రము కర్మఫల మంటదు గాని తక్కినవారి నందరిని గర్మఫల మంటియే యుండును

**ఏతత్సత్యోపదేష్టౄణాం జ్ఞానినాం విరళత్వతః ।**
**శుష్కవేదాన్తవాదానాం ప్రాచుర్యం దృశ్యతేఽధునా ॥ 40**

లోకములో నిట్టి పరమసత్యమును బోధించు జ్ఞానులు తక్కువైనందున నేడు శుష్కవేదాంత వాదములు ప్రబలముగ వ్యాపించియున్నవి

**మిథ్యాసాక్ష్యప్రవక్తారో జిహ్వోపస్థా వశే స్థితాః ।**
**జారాశ్చోరాః కుకర్మాణస్సర్వే తే రాక్షసాంశజాః ॥ 41**

అబద్ధ సాక్ష్యమును జెప్పువారు, జిహ్వోపస్థలను నిగ్రహింప జాలనివారు, వ్యభిచారులు, దొంగతనము చేయువారు, మరియు శాస్త్రనిషిద్ధకర్మలను జేయువారును అసురాంశ సంభూతులుగ నున్నారు

**సాధువద్వేషభాషాభ్యాం యుక్తా యే త్యక్త సాధనాః ।**
**సాధ్యప్రాప్తివిహీనాశ్చ విద్ధి తానాసురాంశజాన్ ॥ 42**

వేషభాషలలో సాధువులవలె నటించుచూ సాధనానుష్ఠానములు లేనందున సాధ్యమును బొందని వారిని అసురాంశ సంభూతులనుగా నెరుంగుము

**జపేన తపసా ఽస్మాకం స్వాధ్యాయజ్ఞానకర్మభిః ।**
**ప్రాప్తబ్రహ్మస్వరూపాణాం కిం స్యాదితి వదంతి యే ॥ 43**

**చపలాస్స్వయమల్పజ్ఞా దురాచారపరాయణాః ।**
**గురువేషధరాస్తేఽపి వఞ్చకా రాక్షసా మతాః ॥ 44**

బ్రహ్మస్వరూపులగు మాకు జపమేల? తపమేల? వేదాధ్యయనమేల?

పుణ్యకర్మానుష్ఠానములేల? తుదకు శాస్త్రజ్ఞాన మెందులకని పలుకు వారును, మరియు తాము స్వయంచపలులై అల్పజ్ఞులై దురాచారపరులై గురువుల వేషములను ధరించి స్వేచ్ఛగా విహరించెడి లోకవంచకులును రాక్షసులుగా పరిగణింపబడుదురు

**జ్ఞాననిష్ఠముముక్షుభ్యస్సర్వే తే విఘ్నకారిణః ।**
**చర న్తి నరరూపేణ క్షితౌ ప్రచ్ఛన్నరాక్షసాః ॥ 45**

జ్ఞాననిష్ఠులకు, ముముక్షువులకును విఘ్నములను గలిగించుచు వ్యర్థముగ దిరుగుచున్న మానవులు మనుష్యవేషమును ధరించిన రాక్షసులుగ నున్నారు

**సత్యాహింసావ్రతో బ్రహ్మచారీ ధ్యానాదితత్పరః ।**
**స్వాధ్యాయే నిరతో య స్స్యాత్స దేవో న మానుషః ॥ 46**

సత్యాహింసాదివ్రతుడై బ్రహ్మచర్యపాలకుడై ధ్యానాధ్యయనములను జేయువాడు మనుష్యునివలె కనుపించినను దేవుడేయని గ్రహించవలయును

**యే స్వార్థరహితాస్సన్తో భక్తజ్ఞానితపస్వినామ్ ।**
**ఉపకారాయ జీవన్తి దేవదేవా భవన్తి తే ॥ 47**

ఎవరైతే స్వార్థరహితులై పరమభక్తులకు, జ్ఞానులకు, తాపసులకు, దీనులకున్ను ఉపకారము చేయుటకొఱకు మాత్రము జీవించుచున్నారో వారందరు దేవదేవు లగుచున్నారు

**దైవజ్ఞానం దైవధర్మం వేదం చేశ్వరనిర్మితమ్ ।**
**లోకే స్థాపయితుం నిత్యం యతమానస్సదాశివః ॥ 48**

దైవజ్ఞానమును, దైవధర్మమును, దేవునిచే నిర్మితమగు వేదమును లోకమునందు స్థాపించుటకై నిరంతరము ప్రయత్నించువాడు సాక్షాత్తుగా శివుడేయని తలంచవలయును

**దేహాదిసాక్షిణం శుద్ధమీశ్వరం స్వాత్మరూపిణమ్ ।**

**భావయన్ బోధయేద్యోఽన్యాన్ దేవదేవో భవేద్ధి సః ॥** 49

దేహేంద్రియములకు సాక్షియై శుద్ధమై యుండు పరమాత్మను స్వాత్మ రూపముగా నెఱింగినవాడై అట్టి యభేదజ్ఞానమును నితరులకును బోధించువాడు కేవలము దేవదేవుడే యగును గదా!

**దేవాసురగుణాస్త్వేతే సఙ్గ్రహేణోదితా మయా ।**
**అతో దైవగుణోపేతా భవేయుర్మోక్షకాంక్షిణః ॥** 50

ఇంతవరకు దైవాసురగుణములు సంగ్రహముగ జెప్పబడినవి మోక్షమును గోరువారందరు నిత్యము దైవగుణములను గలిగియుండవలయును

**ఏవం దైవగుణోపేతా లభన్తే శాన్తిమక్షయామ్ ।**
**భవబన్ధవిముక్తిం చ శాశ్వతానన్దమద్వయమ్ ॥** 51

అట్టి దైవగుణములు గలవారు శాశ్వతశాంతిని, సర్వవిధబంధముల నుండి ముక్తిని, అద్వితీయమగు నిత్యానందమునున్ను బొందుచున్నారు

**దుర్జ్ఞేయం తదిదం తత్త్వం దైవాసురనిరూపకమ్ ।**
**అధ్యాయప్రోక్తసారం హి జ్ఞాత్వా తీర్ణస్తథా భవాన్ ॥** 52

**తారయేత్కృతకృత్యో హి పరాంస్తత్త్వార్థ కాంక్షిణః ।**
**శాస్త్రజ్ఞం విప్రవర్యం చ యతీశం చ తపోనిధిమ్ ॥** 53

**విశ్వసేన్నేశ్వరం వాఽపి దైవసమ్పద్వివర్జితమ్ ।**
**ఆత్మనశ్చాపకర్తారం భావయేద్విఘ్నకారకమ్ ॥** 54

యోగనిష్ఠాపరాయణా! దైవాసుర లక్షణములను కనుగొనుట మిక్కిలి కష్టము కాన నీ యధ్యాయమున జెప్పిన సారమును గ్రహించి దైవాసురుల భేదమును దెలిసికొని దైవగుణములతో గూడి స్వయముగా తరించి తత్త్వ జిజ్ఞాసువులైన యితరులనుగూడ తరింపజేయుము దైవగుణములు లేని వాడు శాస్త్రవేత్త యయినను, ద్విజుడయినను, తపోనిధి యగు యతీశ్వరుడయినను, వేయేల చివర నీశ్వరుడేయైనను సరియే అట్టివానిని నమ్మకుము

విశేషించి అట్టి దైవగుణరహితుని ఆత్మజ్ఞానమున కపకార మొనర్చెడు విఘ్న దేవతనుగా నమ్ముము

**పుణ్యకర్మఫలాసక్త్యా పురా బద్ధా హి దేవతాః ।**
**పాపేన కర్మణా బద్ధాః కర్మజాస్తిర్యగాదయః॥ 55**

**కర్మబన్ధసముచ్ఛేదముక్తిప్రాప్త్యైక కర్మణే ।**
**మానుష్యం జన్మ సంలబ్ధమితి తత్త్వం న విస్మర॥ 56**

పుణ్యకర్మ ఫలాసక్తిచే దేవతలు బద్ధులయిరి పాపకర్మచే జన్మించిన తిర్యగాది ప్రాణులు కర్మచే బద్ధము లయినవి కర్మబంధములను ఛేదించి శాశ్వతమగు ముక్తిని పొందుటకయ్యే యీ మనుష్యజన్మ లభించినదను ఈ రహస్యమును మరువకుము

**ధర్మకార్యే సదా శ్రద్ధా మతిస్సజ్జనసేవనమ్।**
**శాన్తిదాన్తీ చ కరుణా హ్యేతే దైవగుణాస్స్మృతాః॥ 57**

ధర్మకార్యములందు సదా శ్రద్ధ, బుద్ధి, సజ్జనసేవ, శమము, దమము, కరుణ- ఇవి దైవగుణములని చెప్పబడినవి

**ధర్మకార్యక్షయే ప్రీతిస్సదా పుణ్యాత్మవర్జనమ్ ।**
**కామక్రోధాదయో జ్ఞేయా గుణా ఆసురసమ్మతాః ॥ 58**

ధర్మకార్యములను సదా నశింపజేయుటయందు ప్రీతియు, పుణ్యాత్ములను దూరీకరించుటయు, కామక్రోధాది గుణములున్ను అసుర సమ్మతములని తెలియవలయును

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయం ఉపనిషత్సారభూతాయం
దైవాసురస్వరూపయోగో నామ చతుర్దశోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
దైవాసురస్వరూపయోగమను చతుర్దశాధ్యాయము సమాప్తము



# పఞ్చదశోఽధ్యాయః

# యుగనిర్ణయయోగః

నారాయణానన్దగిరిరువాచ

**సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ! సర్వవేదాంతపారగ! ।**
**యుగనిర్ణయమిచ్ఛామి శ్రోతుం త్వన్ముఖపంకజాత్॥** 1

శ్రీ నారాయణానందగిరి చెప్పెను

సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞా! సర్వవేదాంతపారగా! గురుదేవా! యుగ నిర్ణయమును గూర్చి తమ ముఖారవిన్దముద్వారా వినగోరుచున్నాను, దయతో నానతిండు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**సమ్యగ్జ్ఞాతుమిదం తత్త్వమశక్యం ప్రాకృతాత్మనామ్ ।**
**వివేకిభిశ్చ జ్ఞాతవ్యం ధర్మశాస్త్రాత్సనాతనాత్ ॥** 2

శ్రీ మలయాళయతీంద్రుడు చెప్పెను

ఈ యుగవిషయమును బాగుగా తెలిసికొనుటకు సామాన్యు లశక్తులుగా నుందురు కాన వివేకులు దీనిని ధర్మశాస్త్రములద్వారా తెలిసికొనవలయును

**యుగాన్యుద్దిశ్య శాస్త్రేషు ద్విధా ప్రోక్తం మహర్షిభిః ।**
**సత్త్వాదిగుణభేదేన సత్యాదియుగభేదతః ॥** 3

సత్త్వ రజ స్తమో గుణముల భేదమునుబట్టియు, కృత త్రేతా ద్వాపర కలియుగ ధర్మభేదములను బట్టియు రెండువిధములుగా యుగములను గూర్చి మహర్షులు చెప్పియున్నారు

**యుక్తాయుక్తమనుష్యాణాం భూషణం దూషణం క్రమాత్ ।**
**వక్ష్యమాణం భవేన్నామ సత్యత్వాద్వక్ష్యతే మయా ॥** 4

ఈ చెప్పబోవు యుగనిర్ణయము వివేకులకు భూషణముగాను, అవివేకులకు దూషణముగాను ఉన్నప్పటికిని అది సత్యమైనందున దానినిప్పుడు చెప్పబోవుచున్నాను

**వివేకినాం చ మూర్ఖాణాం భూషణం దూషణం క్రమాత్ ।**
**వక్ష్యమాణం భవేన్నామ సత్యత్వాద్వక్ష్యతే మయా ॥** 5

ఈ చెప్పబోవు యుగనిర్ణయములను వివేకులకు భూషణముగాను, అవివేకులకు దూషణముగాను నున్నప్పటికిని ఇది సత్యమైనందున దానినిప్పుడు చెప్పబోవుచున్నాను

**వచో యుక్తముపాదేయం పణ్డితేనాపి బాలకాత్ ।**
**అయుక్తం బ్రహ్మణాఽప్యుక్తం త్యాజ్యం వాసిష్ఠవాక్యతః ॥** 6

మంచిమాటను బాలకునివలనగూడ పండితుడు గ్రహించవలసినది, బ్రహ్మదేవుని వాక్యమునైనను యుక్తముగా లేనిచో నద్దానిని విడిచి పెట్టవలయునని వాసిష్ఠ సిద్ధాన్తము

**పురాణమిత్యేవ న సాధు సర్వం నవం చ శాస్త్రం న భవత్యవద్యమ్ ।**
**విచార్య గృహ్ణాతి సుధీర్విమూఢః పరానుకారీతి చ కాళిదాసః ॥** 7

పూర్వీకులు రచించినంతమాత్రమున సర్వశాస్త్రములు యథార్థములైనవి గావు మరియు నవీనులు రచించి నంతమాత్రమున సర్వశాస్త్రములు అయథార్థములునను కావు కనుక బుద్ధిమంతుడాలోచించి యథార్థమును గ్రహించి అయథార్థమును విడచిపెట్టును చక్కగా నాలోచించు శక్తి లేనందున మూఢుడు ఇతరుల ననుసరించుచున్నాడని కాళిదాస వచనము

**వేదోక్తమీశ్వరోక్తం వా నాన్ధవద్విశ్వసేద్బుధః ।**
**సత్యాసత్యవిచారేణ విశ్వసేదితి బుద్ధవాక్ ॥** 8

వేదోక్తమనిగాని ఈశ్వరోక్తమనిగాని, అన్ధప్రాయముగా పండితులు

నమ్మరాదు మరేమన సత్యాసత్య విచారముల ద్వారా బాగుగ తెలుసుకొని నమ్మవలెనని బుద్ధభగవానులు చెప్పిరి

**గ్రాహ్యం సర్వం విమృశ్యైవ మనసా యచ్చ భాషితమ్ ।**
**శ్రీకృష్ణభగవానిత్థముక్తవానర్జునం ప్రతి ॥ 9**

ఏదేది వచింపబడెనో అద్దానిని బుద్ధిచే బాగుగా విచారించి గ్రహిం చవలయును ఈలాగున శ్రీకృష్ణభగవాను డర్జునుని గురించి వచించెను,

(ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషణ యధేచ్ఛసి తధా కురు – గీత)

**ఇతఃపరం విచారశ్చ యుగస్యైవ ప్రవర్తతామ్ ।**
**కలిప్రవేశాదారభ్య చాహుః కలియుగం బుధాః ॥ 10**

ఇక యుగమునుగూర్చి యధార్థమును విచారింతము కలిపు రుషుడెప్పుడు లోకములో ప్రవేశించెనో అప్పటినుండి కలియుగమని పం డితులు చెప్పుచున్నారు

**సామాన్యేన పురాణాని విచార్యైవం ప్రచక్షతే।**
**సహస్రపఞ్చకాబ్దాశ్చ జాతా భువి కలేరితి ॥ 11**

మరియు వారు పురాణములను సామాన్యముగా విచారించి కలియుగమున కైదువేలసంవత్సరము లైనట్లు చెప్పుచున్నారు

**కాలో వా కారణం రాజ్ఞో రాజా వా కాలకారణమ్ ।**
**ఇత్యేవ ధర్మరాజేన పృష్టస్తస్య పితామహః ॥**
**కాలస్య కారణం రాజేత్యవదన్నిశ్చితం వచః ॥ 12**

రాజునకు కాలము కారణమా? కాలమునకు రాజు కారణమా? యని ధర్మరాజడుగగా భీష్మాచార్యులు కాలమునకు రాజే కారణమని చెప్పిరి

**యుగానుసారేణ మనఃప్రవృత్తి ర్మనోఽనుసారేణ యుగప్రవృత్తిః? ।**
**ప్రశ్నే సతీత్థం సుధియో వదన్తి మనోఽనుసారేణ యుగప్రవృత్తిమ్॥**

యుగము ననుసరించి మనస్సు ప్రవర్తించుచున్నదా? మనస్సు ననుసరించి యుగము ప్రవర్తించుచున్నదా? అను ప్రశ్నకు సమాధానమును బుద్ధిమంతులు మనస్సు ననుసరించియే యుగము ప్రవర్తించుచున్నదని చెప్పుచున్నారు

**ధీవరేణ్య ఇదం సత్యం గృహీత్వా సన్తరిష్యతి।**
**అన్యథా కిల్బిషం ప్రాప్య బధ్యతేఽత్ర న సంశయః॥** 14

బుద్ధిమంతు డీసత్యము నెరింగినచో తరింపగలడు లేనిచో పాపము చెంది బద్ధుడగును ఇందు సందియము లేదు

**చతుష్పాద్ధర్మయుక్త ఇచ్ఛ కాలం కృతయుగం పురా ।**
**త్రిపాద్యుక్త ద్విపాద్యుక్తౌ త్రేతాద్వాపరసంజ్ఞకే ॥** 15

**ఏకపాద్ధర్మయుక్తస్తు కాలం కలియుగం తథా ।**
**ఏవం సామాన్యతో విజ్ఞా యుగాని సమవాదిషుః ॥** 16

నాలుగుపాదములుగల ధర్మముతో గూడినది కృతయుగ మనియు, మూడు పాదములుగల ధర్మముతో గూడినది త్రేతాయుగ మనియు, రెండు పాదములుగల ధర్మముతో గూడినది ద్వాపర మనియు, ఒక పాదముగల ధర్మముతో గూడినది కలియుగ మనియు విజ్ఞులు సామాన్యముగా చెప్పుచున్నారు

**ధర్మపాదైః దయా సత్య తపో దానైర్యుతో జనః ।**
**యస్మి న్కస్మిన్యుగే వాఽస్తు వాస స్తస్య కృతే భవేత్ ॥** 17

ధర్మమునకు పాదములుగా జెప్పబడుచున్న దయా సత్య తపో దానములను నాలుగుగుణము లెవరియందుండునో అట్టి మహాపురుషు లేయుగములో నుండినను కృతయుగమునం దున్నవారగుచున్నారు

**సత్యే క్షీణే తపో దానదయాభిస్సహితో నరః ।**
**త్రేతాయుగే నివాసీ స్యాత్రృన్నాకాంఘ్రిధర్మగః॥** 18

సత్యము నశించి దయా దాన తపస్సులను మూడింటితో గూడి యున్నవారు ఏ యుగమందున్న వారైనప్పటికిని (ఒక పాదము నశించిన ధర్మము గలవారై) త్రేతాయుగమందున్నవారే యగుదురు

**దయా సత్య ప్రణాశేఽపి తపోదానావశేషతా।**
**పురుషస్య తు యస్యాస్తి స తిష్ఠేద్ద్వాపరే యుగే॥ 19**

దయా సత్యములు నశించి తపోదానములను రెండింటితో గూడి యుండువాడు ఏయుగములో నున్నవారైనను ద్వాపరయుగములో నున్నవాడగును

**దయా సత్యతపోరూప గుణత్రయ వివర్జితః।**
**దానమాత్రావశేషశ్చ యస్స తిష్ఠేత్కలౌ యుగే॥ 20**

దయా సత్య తపస్సులు నశించి ఒక్కదానము మాత్రము గలిగియున్న వాడు ఏ యుగములో నున్నవాడైనను కలియుగములో నున్నవాడగును

**యుగలక్షణ మేతత్స్యాత్ కృతే సత్త్వగుణా జనాః।**
**త్రేతాయాం ద్వాపరే చ స్యుః రజస్సత్త్వగుణాస్తథా॥ 21**

**రజస్తమోగుణాశ్చైవం కలౌ కేవలతామసాః।**
**ఏకైకస్మిన్యుగే చైవం సన్తి సర్వయుగా నరాః॥ 22**

నిత్యము సత్త్వగుణము గలవారు కలియుగాదులం దున్నప్పటికిని కృత యుగమందున్నవారే యగుదురు; సత్త్వరజోగుణములు గలవారు త్రేతా యుగములో నున్నవా రగుదురు, రజస్తమోగుణములు గలవారు ద్వాపరయు గమం దున్నవారగుదురు, తమోగుణప్రధానులు కలియుగమందున్న వారగుదురు అని విజ్ఞులు జెప్పుచున్నారు కనుక ఒక్కొక్కయుగమందును అన్ని యుగములకు జెందిన జనులు నున్నట్లు గ్రహించవలెను

**కృతే త్రేతాయుగాదీని త్రేతాయాం ద్వాపరే తథా।**
**కలావపి కృతాదీని భవన్తి గుణభేదతః।**

**సర్వేష్వపి యుగేష్వేవం సంతి సర్వయుగాని చ॥** 23

సత్త్వరజస్తమోగుణముల ననుసరించియే కృతయుగమున త్రేతా ద్వాపర కలియుగములును, త్రేతాయుగమున కృతద్వాపర కలియుగములును, అట్లే ద్వాపరమున కృత త్రేతా కలియుగములను, కలియుగమున కృత త్రేతా ద్వాపరయుగములును నుండును ఇట్లే అన్నియుగములయందు నన్నియుగము లుంటున్నవని తెలియవలెను

**ప్రత్యేకం యుగసద్భావస్సత్యశ్చేన్మానవాః కృతే ।**
**చతుష్పాద్ధర్మయుక్తాస్స్యుస్త్రేతాయాంత్ర్యంఘ్రిధర్మగాః ॥** 24

**ద్వాపరే చ జనాస్సర్వే ద్విపాద్ధర్మయుజస్తథా ।**
**కలావప్యేకపాద్ధర్మాః కిన్త్వేవం నైవ దృశ్యతే ॥** 25

పైని చెప్పినట్లుగాక కృతాది నాలుగు యుగములు వేరువేరుగ సాంకర్య రహితముగా నున్నవని చెప్పినచో కృతయుగ మందుండు వారందరును సత్యాది నాలుగుపాదముల ధర్మము గలవారుగ నుండవలయును త్రేతా యుగమువారు దయా తపో దానములను మూడుపాదముల ధర్మము గలవారుగ నుండవలయును ద్వాపరయుగమువారు తపోదానములను మాత్రము గలిగియుండవలయును అట్లే కలియుగ మందుండు వారును ఏకపాద్ధర్మము గలవారుగ నుండవలెను కాని లోకములో నట్లు కనిపించుట లేదు

**సత్యాసత్యే ప్రవర్తేతే జ్ఞానాజ్ఞానే కృతాదిషు ।**
**హింసాఽహింసే పృథివ్యాం హి కారిన్యకరుణే సదా ॥** 26

కృతాది సర్వయుగములయందును సత్యాసత్యములు, జ్ఞానాజ్ఞానములు, హింసాహింసలు, దయాకారిన్యములును నెల్లప్పుడు జరుగుచునే యున్నవి

**భీష్మవాక్యానుసారేణ యుగస్య పరివర్తకమ్ ।**
**ప్రోచ్యతే మన ఏవేతి నూనం పౌరాణికై రపి ॥** 27

భీష్ముని వాక్యానుసారముగా మనస్సునుబట్టియే యుగపరివర్తనము జరుగుచున్నదని పౌరాణికులును చెప్పుచున్నారు.

**హిరణ్యకశిపుస్తస్య పుత్రః ప్రహ్లాదనామకః।**
**బభూతవతురుభౌ లోకే కృతే దుర్జనసజ్జనౌ॥ 28**

**త్రేతాయుగే రామచన్ద్రో జాతోఽభూద్ధర్మతత్పరః।**
**దశకణ్ఠో రావణోఽపి ప్రాణిహింసాధురంధరః॥ 29**

**శ్రీకృష్ణ ధర్మరాజాద్యాః ధార్తరాష్ట్రాస్తథైవ చ।**
**ద్వాపరే భువి సంభూతాః ధర్మాధర్మానుయాయినః॥ 30**

దుష్టుడైన హిరణ్యకశిపుడు, సజ్జనుడైన ప్రహ్లాదుడును కృతయుగములో నుద్భవించిరి త్రేతాయుగమునందు ధర్మతత్పరుడైన శ్రీరామచంద్రుడు, ప్రాణిహింసాతత్పరుడగు రావణుడును జన్మించిరి ద్వాపరయుగమునందు ధర్మానుసారులగు శ్రీకృష్ణధర్మరాజాదులు, అధర్మానుసారులగు దుర్యోధనుడు, తదనుజాదులును జన్మించిరి

**ఆచార్య శంకరాద్యాశ్చ గాన్ధీతుల్యమహాజనాః।**
**ఉదభూవన్ కలౌ దేవదేశ భక్తియుతా యుగే॥ 31**

**ఔరఙ్గజేబునామాఽపి దురాత్మా యవనాధిపః।**
**కలౌ యుగే సముద్భూతో దేవమన్దిరభఞ్జకః॥ 32**

**తత్తద్యుగే జనైరేతై ర్ధర్మాధర్మౌ ప్రవర్ధితా।**
**ప్రత్యేకం యుగసద్భావ ఏతేషాం సమ్భవః కథమ్॥ 33**

దైవ దేశ భక్తులగు ఆచార్య శ్రీశంకరాదులు, గాంధీవంటి మహాజనులున్ను కలియుగమున జన్మించిరి మరియు దేవాలయ విధ్వంసకుండగు ఔరంగజేబు ఈ కలియుగమున జన్మించెను ఈలాంటి సుజన దుర్జనులు ఆయా యుగములలో జన్మించి ధర్మాధర్మములను వర్ధిల్లజేసిరి కృతాదియుగములు వేరువేరు లక్షణములను గల్గియున్నచో సుజనులకును

దుర్జనులకును అందు జననమెట్లు సంభవించును

**భావితం తీవ్రవేగేన యద్వస్త్వాత్మని యేన హి।**
**తదేవ స భవేచ్ఛీఘ్రం లోకే భ్రమరకీటవత్॥ 34**

విజాతీయమగు కీటకము (పురుగు) భ్రమరము (తుమ్మెద) యొక్క భావనచే నెట్లు భ్రమర మేగుచున్నదో అట్లే మనుష్యుడును గొప్ప పట్టుదలతో నేవస్తువును హృదయమందు భావించుచుండునో అదే వస్తువుగ త్వరగాను తానున్ను మారును

**ఏతన్న్యాయానుసారేణ జ్ఞానిన స్తత్త్వబోధకాః।**
**యతేరన్ మానవాన్ కర్తుం సన్మార్గే వ ర్తినస్సదా॥ 35**

ఈ న్యాయము ననుసరించి తత్త్వబోధకులైన జ్ఞానులందరును సర్వమానవులను సన్మార్గవంతులనుగా జేయునట్లు ప్రయత్నింపవలయును

**ప్రపఞ్చే మానవాస్సర్వే భావయుక్తా భవ న్తి హి।**
**త త్తన్మతానుయాయిత్వా త్తేషాం తద్వ్యపదేశతా॥ 36**

ప్రపంచమందలి మానవులందరు ఆయా భావయుక్తు లగుచున్నారు తత్తన్మతానుయాయు లగుటవలన ఆయా మతస్థులుగా పిలువబడు చున్నారు

**బుద్ధానుయాయినో బౌద్ధాః క్రైస్తవాః క్రీస్తువర్త్మగాః।**
**సిక్కునామ్నా ప్రసిద్ధాస్తు నానకస్సిద్ధా న్తవాదినః॥ 37**

**అద్వైతవాదిన స్సర్వే శఙ్కరాచార్యమార్గగాః।**
**ద్వైతసిద్ధాన్తినస్సన్తి మధ్వాచార్యానుయాయినః॥ 38**

బుద్ధానుయాయులు బౌద్ధులుగాను, క్రీస్తుమార్గానుయాయులు క్రైస్తవులుగాను, గురునానక్ సిద్ధాంతము ననుసరించినవారు సిక్కులుగాను, శంకరాచార్యమతానుయాయు లద్వైతులుగాను, మధ్వాచార్య మతానుయాయులు ద్వైతులుగాను పిలువబడుచున్నారు

**తేషాం తత్తన్మతం పూర్వం నాసీన్నామ్నాఽపి తాదృశమ్।**
**భావశక్తిరతో జాతా మతశ క్తిస్వరూపిణీ॥** 39

వారల కాయా మతములు, ఆయా పేరులును పూర్వమున లేవు ఈ కారణమువలన భావశక్తియే మతశక్తిగా పరిణమించెను

**దైవసృష్టిరశక్యాఽస్తి పరివర్తయితుం జనైః।**
**యతో దైవసమశ్చక్తో న కశ్చిద్వర్తతే భువి॥** 40

దైవసమానుడైనవాడు మరియొకడు లోకములో లేనందున దైవసృష్టిని మార్పుజెందించుట కెవరికిని సాధ్యము గాదు

**నరప్రకల్పితం శక్యం పరివర్తయితుం జనైః।**
**యతో నరేణ సదృశో నరోఽన్యస్తు భవేత్కిల ॥** 41

మానవునితో సమానుడైనవాడు మరియొక డున్నందున మానవులచే కల్పితము లన్నియు తదితర మనుష్యులద్వారా మార్పును జెందగలవు

**వర్ణవ్యవస్థాఽఽధునికీ మతం చ జనకల్పితే।**
**అతశ్శక్యేఽన్యథా కర్తుం బోధకైశ్శాన్తమానసైః ॥** 42

ఆధునిక వర్ణవ్యవస్థయున్ను, మతములున్ను మనుష్య కల్పితము లైనందున శాంతహృదయులగు బోధకులు వాటిని మార్చగలరు

**గోత్వాశ్వత్వాదిజాతిశ్చ దైవసృష్టిర్న మానుషీ।**
**అశక్యాఽతోఽన్యథా కర్తుమనేకై రపి పణ్డితైః ॥** 43

గోత్వాశ్వత్వాదిజాతులు దైవముచే సృష్టించబడినవి గనుక యవి యెట్టి పండితోత్తములచేనైనను మార్పుజేయబడవు

**ఏవం మనుష్యజాతిశ్చ దైవికీ నాన్యథా భవేత్।**
**ఉచ్చా నీచా చ యా జాతిః మానవీ పరివ ర్త్యతే॥** 44

అట్లే మనుష్యజాతియు దైవనిర్మిత మైనందున మార్పుచెందబోదు

ఉచ్చ నీచజాతులు మనుష్యకల్పితము లగుటచే నవి మార్పుజెందును.

**శ్రేష్ఠజాతిర్నికృష్టత్వం నికృష్టా శ్రేష్ఠతామిహ।**
**ప్రాప్నుయాద్గతిరిత్థం స్యాన్నరకల్పితవస్తునః॥ 45**

శ్రేష్ఠమైనజాతి నికృష్టత్వమును, నికృష్టజాతి శ్రేష్ఠత్వమునున్ను ప్రవర్తనానుసారముగా పొందగలదు మానవ కల్పిత వస్తువులెల్ల నిట్టి పరివర్తనము చెందుచుండును

**యస్మిన్ దేశే గుణీ మర్త్య ఔన్నత్యం నైవ నీయతే।**
**క్షయం గచ్ఛేత్స దేశోఽపి పరతన్త్రో భవిష్యతి॥ 46**

ఏ దేశమునందు గుణవంతులగు పురుషుల కున్నత స్థానమివ్వబడదో ఆదేశము క్రమముగా క్షయించును, పరాధీనతనుగూడ పొందగలదు

**పరీక్షిన్నృపతేః కాలే ప్రవిష్టః కలిపూరుషః।**
**పృష్టో రాజా దదౌ తస్మై చతుస్థానాని కేవలమ్॥ 47**

పరీక్షిన్మహారాజుయొక్క పరిపాలనా సమయములో కలిపురుషుడు లోకములో ప్రవేశించి నాకు నివాసస్థాన మిమ్మని రాజుగారి నడుగగా పరీక్షిన్మహారాజు క్రింద సూచించిన నాలుగుస్థానములను మాత్రము కలికొసంగెను

**ద్యూతహింసాసురాపానదుష్ట స్త్రీసహవాసితాః।**
**స్థానానీమాని చత్వారి పరీక్షిత్కలయే దదౌ॥ 48**

**తస్మాద్యుష్మాసు యః కోఽపి ద్యూతహింసాదిమాన్యది।**
**కల్యాశ్రయస్స ఏవ స్యాదితి భాగవతం వచః॥ 49**

1 జూదము, 2 ప్రాణిహింస, 3 మద్యపానము, 4 దుష్ట స్త్రీసహవాసమున్ను ఏయే స్థానముల యందుండునో ఆయా స్థానములను మాత్రము రాజు కలి కొసంగెను కనుక మీలో నెవరైనను పైనజెప్పిన ద్యూతాది గుణములు గలవారున్నచో తప్పక కల్యాశ్రయు లగుదురు ఇది

భాగవత వచనము

**సత్యం ధర్మం దయా జ్ఞానం వైరాగ్యం భక్తిరేవ చ ।**
**యస్మిన్ సన్తి న తత్పార్శ్వం యాహీత్యాజ్ఞాపితః కలిః ॥** 50

సత్యము, ధర్మము, భూతదయ, జ్ఞానము, వైరాగ్యము, భక్తి మొదలగునవి యెవరియందుంటున్నవో వారిదగ్గరకు వెళ్లవద్దని కలిపురుషుని పరీక్షితు డాజ్ఞాపించెను

**జీవకారుణ్య భక్త్యాది గుణాఢ్యానాం మహాత్మనామ్ ।**
**పతివ్రతాయా స్స్వామీవ్యమేక పత్నీవ్రతస్య చ ॥** 51
**కదాపి నైవ గంతవ్యమిత్యేవం హి కలిః పురా ।**
**పరీక్షితా నిషిద్ధోఽ భూద్విద్మో భాగవతాదిదమ్ ॥** 52
**న భేతవ్యమతో విజ్ఞైర్యుష్మాభిశ్శాస్త్రచి న్తకైః ॥**

మరియు పతివ్రతా స్త్రీ దగ్గరకు, ఏకపత్నీవ్రతుని సమీపమునకు, జీవకారుణ్యము, దైవభక్తి మొదలగు గుణములు గలవారి దగ్గరకును వెళ్లవద్దని పరీ క్షితునిద్వారా కలి ఆజ్ఞాపింపబడినట్లు శ్రీమద్భాగవతమువలన దెలియుచున్నది కనుక శాస్త్రచింతకులై, విజ్ఞులై, సదాచారపరులై యున్న మీరు భయపడ నవసరము లేదు

**యథాఽన్ధకారస్య గతిర్నిరుధ్యతే ప్రాసాదమధ్యే జ్వలతి ప్రదీపకే।**
**విజ్ఞానదీపే జ్వలితే తథా హృది హ్యజ్ఞానతామిస్రగతిర్నిరుధ్యతే॥** 53

గృహములోపల దీపము వెలుగుచున్నచో నంధకారమెట్లు గృహములో ప్రవేశించజాలదో అట్లే హృదయమందు జ్ఞానదీపము ప్రకాశించుచున్నచో నజ్ఞానాంధకారమున్ను ప్రవేశించజాలదు

**భగవత్స్మరణం యేషామాసీత్పుంసాం న మానసే ।**
**కృతే తే తస్థివాంసోఽపి భవేయుః కలికాలికాః ॥** 54

**భగవత్స్మరణం యేషాం పుంసాం చేతస్యవర్తత ।**

**కలౌ యుగే వసన్తోఽపి కృతే స్యుర్మానవా స్థితాః ॥** 55

ఎవరి హృదయములో భగవత్స్మరణము లేదో వారు కృతయుగములో నున్నవారైనప్పటికని కలియుగములో నున్నవారే యగుచున్నారు ఎవరి హృదయములో భగవత్స్మరణము గలదో వారు కలియుగములో నుంటున్న వారైనప్పటికిని కృతయుగమున నున్నవారే యగుదురు

**మధురామ్లకషాయాది ఫలదాస్తరవో భువి ।**
**ఏకరూపేణ వర్తన్తే కృతాదిషు యుగేషు తే ॥** 56

తీపు, పులుపు, చేదు మొదలగు రుచులుగల ఫలముల నిచ్చెడు వృక్షములు కృతాది నాలుగు యుగములలోను నొకేవిధముగ తీపు, పులుపు, చేదు మొదలగు రుచులుగల ఫలములనే యిచ్చుచున్నవి

**కృతాదియుగభేదేన తత్ఫలేషు రుచేర్భిదా।**
**న జాత్యైవం గజాశ్వాది జన్తుష్వపి న భిన్నతా॥** 57

కృతాదియుగములు గతించి ద్వాపరాదియుగములు ప్రారంభమైనప్పు డావృక్షఫలములలో రుచిభేద మేమియు గలుగలేదు అట్లే ఏనుగు, గుఱ్ఱము మొదలగు జంతువులయందును వాటి నైసర్గిక గుణముల కేమియును భేదము గలుగలేదు

**కాకహంసపికాదీనాం యుగభేదాద్విరూపతా ।**
**న దృశ్యతే నరేష్వేవ కథం భేదః ప్రజాయతే ॥** 58

కాకి, హంస, కోకిల మొదలగు పక్షిజాతులలో నున్న వాటి స్వాభావికమైన స్వరముల కేమియు భేదము కనిపించుట లేదు ఇట్లుండగ మనుష్యలలో మాత్రమెందుకు భేదముండవలెను?

**మత్స్యకచ్ఛపమణ్డూకజలజన్తుష్వభిన్నతా।**
**యుగభేదేఽపి కో హేతుర్నరాణాం పరివర్తనే॥** 59

మత్స్యములు, తాబేళ్లు, కప్పలు మొదలగు జలజన్తువులయందును

యుగము మారినప్పటికిని మార్పు కనిపించుట లేదు అట్లుండ మనుష్యుల యందు యుగము మారినంతమాత్రమున మార్పు ఎందులకు కలుగ వలయును?

**తత్రాపి కారణం వృక్షపక్షిపశ్వాదిజాతిజాః ।**
**అనాది నియమం సర్వే పాలయన్త్యవికారిణః ॥ 60**

పశుపక్షివృక్షాదు లన్నియు అనాదినుండి వచ్చు నియమమును పాలించుచున్నవి అందుచే వాటికి మార్పు చెందదగిన కారణము లేకపోయెను

**జనాస్స్వనియమాం స్త్యక్త్వా స్వచ్ఛన్దం వ్యచరన్ భువి ।**
**అతః కలిప్రవేశోఽత్ర జాతో నైవాన్యథా భవేత్ ॥ 61**

జనులు తమతమ నియమములను బరిత్యజించి స్వేచ్ఛగ తిరుగుచుండిరి అందుచే కలి ప్రవేశించగలిగెను లేనిచో కలిప్రవేశమే జరుగదు

**చతురాశ్రమధర్మాణాం త్యాగాద్ధేతోశ్చ మానవాః ।**
**చతుష్పాజ్జన్తుతుల్యా హి జాతాస్తే కలిచోదితాః ॥ 62**

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసము లనెడి నాలుగాశ్రమ ధర్మములను విడచిపెట్టుటచే జనులు కలిప్రేరితులై పశుతుల్యులైరి

**ఆత్మనో విస్మృతిర్జ్ఞేయా కలిర్ద్వాపరమాత్మనః ।**
**స్మృతిర్ధర్మోదయస్త్రేతా తద్బోధాచరణం కృతమ్ ॥ 63**

ఆత్మను మరచియుండుట కలియుగమనియు, ఆత్మస్మృతి గలిగియుండుట ద్వాపరమనియు, ధర్మము నాచరించుట త్రేతాయుగమనియు, ధర్మమును తానాచరించుచు, జనులకు ప్రబోధము చేయుట కృతయుగమనియు తెలియదగినది

**ఏతచ్చతురవస్థానాం భేదకారణతోఽనఘ! ।**
**ఏకస్మిన్నేవ మనుజే దృష్టం యుగచతుష్టయమ్ ॥ 64**

ఓ పాపరహితుడా! పైనిజెప్పిన నాలుగవస్థల భేదము ననుసరించి ఒక మానవునియందే నాలుగు యుగము లుంటున్నవి

**ఏతద్విచారవిజ్ఞానాన్మానవో దేవతాత్మతామ్ ।**
**ప్రాప్నుయాత్స్వప్రభావేణ చైకస్మిన్నేవ జన్మని ॥ 65**

దీనిని జక్కగా విచారించి విజ్ఞానమును బొందినచో మనుష్యుడొకే జన్మములో దైవత్వమును (మోక్షమును) పొందగలడు

**యుగానాం గూఢత త్త్వం హి జ్ఞాత్వా కృతయుగే స్థితః।**
**శాస్త్రోక్తం యుగధర్మం త్వం చరన్జీవ చిరం స్థిరః ॥ 66**

నిగూఢమగు యుగరహస్యమును చక్కగా దెలిసికొని కృతయుగము నందున్న వాడవువలె శాస్త్రరహస్యమగు యుగధర్మముల ననుష్ఠించుచు దృఢవ్రతుడవై చిరకాలము జీవింపుము

**యుగధర్మసమాచారో నిశ్శ్రేయసకరస్స్మృతః ।**
**ప్రమాదీ న భవేదత్ర ప్రమాదో విపదాం పదమ్॥ 67**

తత్తద్యుగరహస్య ధర్మముల నాచరించుట శ్రేయస్కరము శాస్త్రమందు జెప్పబడిన గూఢతత్త్వమగు యుగధర్మాచరణమందు ప్రమాదము నొందకుము ఈ గోప్యము నెఱుంగక పోయిన ఆపదలు సంభవించును కావున ఆపదలకు చోటివ్వక శుభంకరుడవై యుండుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సార భూతాయాం
యుగనిర్ణయయోగోనామ పఞ్చదశోఽధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్ర గీతయందు
యుగనిర్ణయయోగమను పంచదశాధ్యాయము సమాప్తము



# షోడశోऽధ్యాయః
# వైరాగ్యయోగః

నిర్విషయానందబ్రహ్మచారీ ఉవాచ

**వైరాగ్యం కతిధా తస్య స్వరూపం కిం ప్రకీర్తితమ్ ।**
**శ్రోతుమిచ్ఛామి మాహాత్మ్యం బ్రూహి మేऽసజ్జసద్గురో॥** 1

శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారి చెప్పెను

నిర్విషయాసంగ బ్రహ్మమునందే నిరంతరము ఆనందము ననుభవించుచుండు నోసద్గురుమూర్తీ! వైరాగ్యమెన్ని విధములు? దాని స్వరూపమేమి? మఱియు దాని మాహాత్మ్యమెట్టిది? ఈ విషయములను వినదలంచుచున్నాడను కాన దయతో నానతిండు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**వైరాగ్యం ద్వివిధం ప్రోక్తం మలినం శుద్ధమేవ చ ।**
**తదేవాహుః పునః కేచిత్స్వభావాభావభేదకమ్ ॥** 2

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

వత్సా! వైరాగ్యము ప్రథమమున మలిన మనియు, శుద్ధమనియు రెండు విధములు మరియు కొందరు స్వభావవైరాగ్య మనియు, అభావ వైరాగ్యమనియు వీనిని వచింతురు

**శుద్ధం సుక్షేత్ర తుల్యం స్యాన్మలినం తూషరోపమమ్ ।**
**అల్పార్థం మలినం జ్ఞేయం శుద్ధం బహుఫలాన్వితమ్ ॥** 3

శుద్ధవైరాగ్యము సారవంతమగు భూమివంటిదనియు, మలిన వైరాగ్యము ఊషరక్షేత్రము వంటిదనియు గ్రహింపుము మలినవైరాగ్యము ఊషరక్షేత్రము వలెనే అల్పఫలమునుమాత్రమే గలుగజేయును శుద్ధ వైరాగ్యమో మంచి సారవంతమగు భూమివలె సమృద్ధమగు ఫలము నిచ్చును

**నిత్యానిత్యవివేకానామీశానుగ్రహ సంయుజామ్ ।**
**శుద్ధాత్మనాం తు కేషాఞ్చిదీషణాదిష్విహాసతామ్ ॥ 4**

**స్వాభావికస్తు వైరాగ్యం పూర్వసంస్కారహేతుకమ్ ।**
**బహుజన్మకృతైఃపుణ్యైర్జాయతే జన్మతః కిల ॥ 5**

నిత్యానిత్య వివేకము గలిగినట్టియు, ఈశ్వరానుగ్రహముతో గూడి నట్టియు, పరిశుద్ధాత్ము లైనట్టియు ఈషణత్రయమందు వైరాగ్యము గలిగినట్టివారునగు ఏ కొద్దిమంది మహాత్ములకు మాత్రమే పూర్వ సంస్కారము కారణముగాగల స్వాభావిక వైరాగ్యము అనేక జన్మములలో జేయబడిన పుణ్యముచేత జన్మతః సిద్ధించుచున్నది జన్మించుటతోడనే ఉదయించును

**వైరాగ్యం సుస్థిరం హ్యేతత్పుజ్జనప్రీతివర్ధనమ్ ।**
**మోక్షదం శాశ్వతానన్దదాయకం తద్విదో ఽవదన్ ॥ 6**

స్వాభావికమైన ఈ వైరాగ్యము జన్మతః గలిగినది గాబట్టి స్థిరమైనది కాబట్టియే దీనిని పూర్వులు మహాత్ములకు ప్రీతిని పెంపొందించున దనియు, మోక్షహేతువనియు, నిరతిశయమగు శాశ్వతానందమును గలుగజేయున దనియు నుడివిరి

**అస్వభావం హి వైరాగ్యం ప్రోక్తం బహువిధం శృణు ।**
**శ్మశానజం ప్రసూతేశ్చ జాతం పౌరాణికం తథా ॥ 7**

**వియోగజం చ విజ్ఞేయం సర్వం స్థైర్యవివర్జితమ్ ।**
**తత్క్షణే సంస్థితం హ్యేతత్క్షీయతే బుద్బుదోపమమ్ ॥ 8**

అస్వభావ వైరాగ్యము–శ్మశానవైరాగ్యనియు, ప్రసూతివైరాగ్య మనియు, పురాణవైరాగ్యమనియు, వియోగజవైరాగ్యమనియు అనేక విధములుగ నున్నది ఈ వైరాగ్యము లన్నియు ఆయాకారణములచే గలిగినవి కాబట్టి క్షణికములుమాత్రమే, స్థిరముగ నుండునవి గావు ఆయా

సమయములందు అనగా శ్మశానమును జూచినపుడు, ప్రసవవేదన ననుభవించునపుడు, పురాణ శ్రవణము జేయునపుడు ప్రియవియోగము గలిగినపుడు మాత్రమే ఉద్బుద్ధమై నీటిబుడగవలె మరుక్షణముననే మాయమగును స్థిరమై కాలాంతరమున నుండదని భావము

**పునశ్చ ద్వివిధం ప్రోక్తం వైరాగ్యం తత్త్వతశ్శృణు ।**
**వస్తుభావవిభేదేన యేన పూర్ణత్వమశ్నుతే ॥ 9**

మఱియు నీవైరాగ్యము వస్తువైరాగ్యమనియు, భావవైరాగ్యమనియు పునః రెండువిధములుగ విభజింపబడినది సావధానుడవై వినుము ఈ ద్వివిధవైరాగ్యము చేతనే సాధకుడు పూర్ణత్వస్థితిని పొందును

**ప్రథమం వస్తువైరాగ్యం ద్వితీయం భావగం స్మృతమ్ ।**
**ఏతద్ద్వయసమాయుక్తో ముక్తో విన్దేత సత్ఫలమ్ ॥ 10**

అందు మొదటిది వస్తువైరాగ్యమనియు, రెండవది భావవైరాగ్యమనియు గ్రహింపుము ఈరెంటిని గలిగిన యోగి లేక ముముక్షువు ముక్తుడై నిరతిశయ సుఖరూప సత్ఫలము నొందును

**నామ్ని రూపే చ వైముఖ్యం వస్తువైరాగ్యమీరితమ్ ।**
**పృథగస్ఫురణం ప్రాహుర్బ్రహ్మణో భావమేతయోః ॥ 11**

నామరూపములయందు అనగా నామరూపాత్మక జగత్తునందు విరక్తి గలిగియుండుట వస్తువైరాగ్యమనియు, ఆ నామరూపములు సర్వాత్మకమగు పరబ్రహ్మమునకంటె వేరుగ భాసింపకుండుట భావవైరాగ్యమనియు మహర్షులు వచించిరి

**విషయాన్బన్ధకాన్మత్వా త్యక్త్వా నిర్విషయాత్మనః ।**
**దృశ్యాభావేన సంధ్యానం భావవైరాగ్యమీరితమ్ ॥ 12**

విషయములు బన్ధనహేతువులని తలంచి త్యజించి దృశ్యము అణుమాత్రమేని స్ఫురింపక నిర్విషయమగు పరమాత్మను సర్వదా ధ్యానించుటయే

భావవైరాగ్యము

**వస్తువైరాగ్యమాదౌ హి సాధకస్య వరం భవేత్ ।**
**వస్తునః స్పర్శమాత్రేణ మర్త్యో భవతి దూషితః ॥ 13**

**అంగారస్పర్శమాత్రేణ కాలిమాఽఽవృణుతే యథా।**
**అతస్సన్త్యజ్య విషయాన్ధీర స్తత్ర న ముహ్యతు ॥ 14**

సాధకునికి అభ్యాసకాలమున వస్తువైరాగ్య మత్యవసరము ఏలన వస్తువుయొక్క స్పర్శమాత్రముచే అనగా సంసర్గముచేతనే మనుష్యుడు బొగ్గను తాకినచో మసిచే కలుషితు డగునటుల, దూషితుడగును కాన ధీరపురుషుడు విషయసంసర్గమును వీడి నిస్సంగుడై మెలగవలయును ప్రమాదముచే సైతము మోహితుడు కారాదని భావము

**అంగారో వహ్నిదగ్ధస్సన్భస్మతాం చ వ్రజేద్యథా ।**
**తథా జ్ఞానాగ్నినా దగ్ధం దృశ్యం నిశ్శేషతాం వ్రజేత్ ।**
**జ్ఞానినో దగ్ధదృశ్యస్య భావమాహుస్సునిశ్చలమ్ ॥ 15**

నిప్పుచే కాలిన బొగ్గు భస్మమగు నటుల జ్ఞానాగ్నిచే దగ్ధమైన దృశ్యము నిశ్శేషమగును బొగ్గులో తెల్లని బూడిదయే మిగులునట్లు యోగిలో శుద్ధమైన చిత్తమే సిద్ధించును అట్టి దృశ్య రహితాత్మజ్ఞానియొక్క వైరాగ్యమే నిశ్చలమగు భావవైరాగ్యమని చెప్పుదురు

**బ్రహ్మణో హి పృథగ్దృశ్యం న భాతి జ్ఞానినో మునేః ।**
**జ్ఞానాగ్ని దగ్ధదృశ్యం తం న దూషయతి వాసనా ॥ 16**

నిత్యమననశీలుడగు ఆత్మజ్ఞానికి బ్రహ్మకంటె వ్యతిరిక్తముగ అణు మాత్రమేని దృశ్యము కానరాదు అట్టి ఆత్మైకత్వజ్ఞానముచే దృశ్యరహితు డగు ఆత్మవేత్త (యెచట ఉన్నను) విషయమాలిన్యముచే దూషితుడు గాడు

**నటన్నిదగ్ధదృశ్యత్వం దోషం కాపురుషో వ్రజేత్ ।**
**అంగారపతితస్యేవ కాలుష్యం తస్య నిశ్చయమ్ ॥ 17**

దృశ్యరహితుడగు ఆత్మవేత్తవలె నటించు కుత్సిత పురుషుడు బొగ్గులరాశిలో పడిన పురుషునివలె తప్పక కాలుష్యమును బొందును, నిశ్చయము

**దగ్ధదృశ్యో మహాత్మాఽసౌ శుద్ధభస్మేవ భాస్వరః ।**
**నిష్కళంకస్సదా భాతి న ధత్తే విషయే పదమ్ ॥ 18**

జ్ఞానాగ్నిచే దృశ్యమును నశింపజేసిన యీ మహాత్ముడు తెల్లని స్వచ్ఛమగు భస్మమువలె తేజశ్శాలియై నిష్కళంకుడై ప్రకాశించుచుండును అట్టి జ్ఞాని తిరిగి విషయపంకమున కాలిడడు

**స్ఫుటీకృతం తు పాషాణం నీరోగాన్కురుతే జనాన్ ।**
**అస్ఫుటం హి తదేవాత్ర స్పష్టమారణకారణమ్ ॥ 19**

పాషాణమును పుటమువేసినచో శిలాభస్మమై రోగార్తుల రోగమును బోగొట్ట సమర్థమగును అదియే పుటము వేయనిచో మంచివారినిగూడ మృత్యుముఖమున బడవేయును

**యోగినో దగ్ధదృశ్యస్య దృశ్యమగ్నస్య భోగినః ।**
**ఏవం భేదం సమాలక్ష్య యతతాం దృశ్యనాశనే ॥ 20**

అట్లే దృశ్యము నశించినట్టి యోగికిని, దృశ్యమునందే నిమగ్నుడైన భోగికిని భేదముండునని గ్రహించి దృశ్యరాహిత్యమునకై యత్నింపుము (దృశ్యరహితుడు భవరోగ పీడితులగు మానవుల దుఃఖమును బాపి శాంతిని జేకూర్చుననియు, దృశ్యమందు విలీనుడు తాను చెడుటయే గాక యితరులను గూడ నధోగతి పాలుజేయు ననియు గ్రహింపనగును.)

**విషామృతసమౌ హ్యేతౌ విరక్తో విషయీ తథా ।**
**విషేణ మృతిరన్యేన చామృతత్వం భవేద్ధ్రువమ్ ॥ 21**

విషయియు, విరాగియు విషామృతములతో సమానులని గ్రహింపుము విషగ్రహణముచే మరణమెట్లు తథ్యమో అట్లే విరక్తిచే అమృతత్వ

ప్రాప్తియు నిశ్చయముగ గలుగును

**మోక్షో విషయవైరస్యం బన్ధో వైషయికో రసః ।**
**ఇత్యుక్తమష్టావక్రేణ యథేచ్ఛసి తథా కురు ॥** 22

విషయవైరాగ్యము మోక్షమనియు, విషయాసక్తి బద్ధమనియు పూర్వము అష్టావక్రమహాముని జనకునకు బోధించెను కాన ఈ రెండింటిలో నీ యిష్టమైన దానిని దీర్ఘముగా నాలోచించి యాచరింపుము

**గురూపదేశసంలబ్ధమననశ్రవణాదిభిః ।**
**బహ్మాదిస్తంబ పర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని ॥** 23

**దేహదారాదిభోగేషు వైరాగ్యం విషయేష్వను ।**
**యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥** 24

గురూపదేశముచే ప్రాప్తములగు శ్రవణ మననాదులచే బ్రహ్మాదిస్తంబ (తృణ)పర్యన్తము, అనిత్యములగు భోగ్యపదార్థములయందు, అసృఙ్మేదో దూషితమగు దేహమునందు, కామినీ సంసర్గాది సుఖమునందును, కాకిరెట్టయందువలె (ఏవగింపు–జుగుప్స) విరక్తి గలుగుటయే ఉత్తమమైన నిశ్చలమైన వైరాగ్య మనబడును ఇదియే నిర్మల వైరాగ్యస్వరూపము

**వైరాగ్యేణాసినా ఛిన్ద్యాదన్తర్దుఃఖవనద్రుమమ్ ।**
**న శక్నోతి సముచ్ఛేత్తుం మన్దవైరాగ్యదూషితః ॥** 25

సాధకుడు వైరాగ్యమను తీక్ష్ణతరాయుధముచే హృదయారణ్యమున నాటుకొనిపోయిన దుఃఖతరువును ఛేదింపవలయును కాని మంద వైరాగ్యము గలిగియున్నచో (తగరపు కత్తిచే చేవగల వృక్షములను ఛేదింప జాలనట్లు)ఈ దుఃఖరూప మహాతరువులను ఛేదింపజాలడు

**బహిర్ముఖేంద్రియాకృష్టః వంచితస్స్వాత్మదర్శనే ।**
**ఆవృత్తచక్షురభ్యేతి స్వాత్మానం చ కరోక్తితః ॥** 26

ఈ యింద్రియములు స్వభావతః బహిర్ముఖములుగ సృష్టింపబడినవి

కనుకనే ప్రతియొక్కడును బహిర్వృత్తుడై విషయములందు ప్రవర్తించి అంతర్ని గూఢమగు తనయాత్మను దర్శింపజాలకపోవుచున్నాడు కాని యెవడో ఒక ధీరపురుషుడు పూర్వజన్మసుకృత విశేషముచే బాహ్యాగాములగు నింద్రియముల నరికట్టి అంతర్ముఖ మొనర్చి నిర్జితేంద్రియుడై ప్రత్యగాత్మయగు పరబ్రహ్మము నవలోకించుచున్నాడని కఠోపనిషత్తునందు జెప్పబడినది పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయంభూః తస్మాత్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్। కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్॥ దీని తాత్పర్యము పైన దెలిపినదే

**తనుర్నౌకా దృఢా ప్రోక్తా భవసాగరతారికా ।**
**ఛిద్రాణి చేంద్రియాణ్యాహుర్నిశ్ఛిద్రో భవ సంయమీ ॥ 27**

ఈశరీరము సంసారసాగరమును తరించుటకు నేర్పడిన దృఢమైన నావయని నమ్ముము (శరీర మాద్యంఖలు ధర్మసాధనం) కాని యీ నావకు ఇంద్రియములు రంధ్రములవంటివి రంధ్రములు పడినచో నావ సముద్రములో మునిగిపోవునటుల నీయింద్రియములను సైతము బహిర్ముఖ మొనర్చి స్వేచ్ఛగ వదలినచో మానవుడును భవసాగరమున మునిగిపోవును కాన ఇంద్రియరూప రంధ్రములను మూసివైచి (అంతర్ముఖ మొనర్చి) సంయమశీలుడవై నిశ్ఛిద్రుడవు గమ్ము

**నిశ్ఛిద్రనౌకయేవాయం నిగ్రహేణ భవాంబుధిః ।**
**కుశలైః సాధకైర్నిత్యం వైరాగ్యేణ చ తీర్యతే॥ 28**

రన్ధ్రరహితమగు ఓడచే సముద్రమును దాటగలిగినటుల కుశలురగు సాధకులు ఇంద్రియ సంయమముచేతను దృఢమగు వైరాగ్యముచేతను ఈ భవసాగరమును సుఖముగా దాటుదురు

**ఛిద్రపాత్రేఽర్పితం తోయం క్షీరం వ్యర్థం యథా స్రుతమ్ ।**
**నిష్ఫలం శ్రవణం ధ్యానం నిగ్రహేణ వినా కృతమ్ ॥ 29**

రంధ్రముగల పాత్రలో పోసిన నీరుగాని పాలుగాని కారిపోయి వ్యర్థమగునటుల ఇంద్రియ నిగ్రహము లేనివారు చేసెడి శ్రవణాదులుగాని,

ధ్యానముగాని, జపతపములుగాని అన్నియు నిష్ఫలములని గ్రహింపుము

**అభావే భక్తి తైలస్య ముక్తిజ్యోతిర్న దీవ్యతే ।**
**అజ్ఞాన తమసోనాశస్తస్మాన్నైవ భవిష్యతి ॥ 30**

**వైరోగ్యపాత్రే నిశ్ఛిద్రే నిశ్చలే సాధకస్సదా ।**
**భక్తి తైలం చ సంయోజ్య ముక్తి దీపం ప్రదీయేత్ ॥ 31**

భక్తి తైలము లేనిచో ముక్తి దీపము ప్రకాశించదు అజ్ఞానమను చీకటి తొలగదు అందువలన రంధ్రములేని నిశ్చలమైన వైరాగ్యమను పాత్రలో భక్తి తైలమును పోసి ముక్తి జ్యోతిని వెలిగించుము

**నష్టతైలం యథా జ్యోతిశ్ఛిద్రపాత్రం వినశ్యతి ।**
**ఏవం నష్టే తు వైరాగ్యే ప్రజ్ఞాజ్యోతిర్న దీవ్యతే ॥ 32**

వెలుగుచున్న జ్యోతి ప్రమిద చిల్లులుపడిపోయినచో నూనె కారిపోయి తనంతట తానే ఆరిపోవునటుల, వైరాగ్యమను ప్రమిద ధ్వంసమయినచో అనగా వైరాగ్యము నష్టమగుచో ప్రజ్ఞాజ్యోతియు స్వయముగనే అంతరించును

**కాయవృక్షే యథాకాలం వైరాగ్యకుసుమోద్గమే ।**
**అస్మిన్నేవ భవే ముక్తిఫలావాప్తిస్తు నిశ్చితా ॥ 33**

దేహమనెడి వృక్షమునందు యథాకాలమున వైరాగ్యమనెడి పుష్ప ముద్భవించినచో నీ జన్మలోనే తప్పక ముక్తిఫలము లభించునని గ్రహింపుము

**వైరాగ్యోదయమాత్రేణ జ్ఞానభానుర్విరాజతే ।**
**తేనాజ్ఞానతమో నశ్యేత్సమగ్రం నాత్ర సంశయః ॥ 34**

వైరాగ్యమను అరుణోదయ మగుటతోడనే జ్ఞానసూర్యుడు ప్రకాశించును జ్ఞానోదయమైన వెంటనే అజ్ఞానమున్ను సమగ్రముగ నశించును

**ఆశావిషలతాచ్ఛేదే వైరాగ్యం తీవ్రమాయుధమ్ ।**

**తేనైవ ఛిత్వా భ్రాన్తిఞ్చ ప్రాప్నుయాత్పరమం సుఖమ్॥** 35

ఆశారూపమగు విషలతను ఛేదించుటకు వైరాగ్యము పదునుగలిగిన కత్తియని నమ్ముము కాన ఈ తీవ్రతర వైరాగ్యఖడ్గముచే దేహభ్రాంతి రూపమగు అనాది వృక్షమును నరికి నిరతిశయ సుఖమును బొందుము

**ముక్తిమిచ్ఛసి చే త్తాత! విషయాన్విషవ త్త్యజ ।**
**క్షమాం శీలం దయాం ధ్యానం నిత్యం పీయూషవద్భజ ॥** 36

నాయనా! ముక్తిని గోరినట్లైన విషయములను విషమువలె పరిత్యజించి క్షమ, సుశీలము(సదాచారము), భూతదయ, భగవద్ధ్యానము మొదలగు దైవగుణములను అమృతమునువలె నిత్యము పానము చేయుము అనగా అట్టి దైవగుణములను గలిగియుండుమని భావము

**సర్వేషు భోగ్యజాతేషు దోషతామీక్షతే యదా ।**
**సన్న్యసేత్సాధకశ్శీఘ్రమన్యథా పతితో భవేత్ ॥** 37

సమస్త భోగ్యపదార్థములందు నేవగింపు గలిగి దోషబుద్ధి యెపుడు గలుగునో సాధకుడు ఆ వెంటనే సన్న్యసింపవలయును వైరాగ్యము లేకనే సన్న్యసించిన తప్పక పతితుడగును

**చతుష్ఖండయుతం సౌధం దృఢాధారేణ శోభతే ।**
**వైరాగ్యేణ చతుర్యోగం ముక్తిసౌధం తథా ధృతమ్ ॥** 38

నాలుగంతస్తులుగల ప్రాసాదము గట్టిపునాదిచే దృఢమై స్థిరముగా నిలిచి చిరకాలము శోభించునటుల నాలుగు యోగములతో గూడిన దివ్యభవనముగూడ తీవ్రవైరాగ్యమను దృఢమగు పునాదిచే మాత్రమే ధరింపబడి విరాజిల్లుచున్నది

**సాలోక్యాది ప్రభేదేన చతుష్ఖండయుతం పునః ।**
**మోక్షసౌధం దృఢేనైవ వైరాగ్యేణ సుశోభతే ।** 39

ఇట్లే సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య భేదములను ఈ

నాలుగంతస్తులు గల మోక్షసౌధముగూడ దృఢవైరాగ్యముచేతనే శోభించుచున్నది

**తత్ర వైరాగ్యసమ్పన్నే ముముక్షుత్వేన శోభితే ।**
**సాధకే చ శమాదీని సాధనాని ఫలన్తి హి ॥ 40**

తీవ్రమగు వైరాగ్యము ముముక్షుత్వము వీటితోగూడిన సాధకుని యందు మాత్రమే శమదమాది సాధనములు ఫలవంతము లగును

**ముముక్షుత్వవిరక్తత్వమన్దతా యత్ర విద్యతే ।**
**మరౌ సలిలవత్తత్ర సమాధేర్భ్రమమాత్రతా ॥ 41**

ఎవనియందు ముముక్షుత్వ, వైరాగ్యముల మందత్వ మున్నదో అట్టి సాధకుని ధ్యానము, సమాధియు మరుభూమిలో గానుపించు జలమువలె భ్రమ మాత్రమే అని గ్రహింపుము

**వైరాగ్యభావశూన్యాని సాధనాని మునేర్ధ్రువమ్ ।**
**వ్యర్థాన్యాచఖ్యిరే విజ్ఞాః క్షారభూమికృషిర్యథా ॥ 42**

వైరాగ్యశూన్యములగు సాధకుని సాధనలన్నియు చవిటిభూమియందలి కృషివలె వ్యర్థమని తత్త్వవేత్తలు వచించిరి

**మోక్షస్య సాధనానాం చ వైరాగ్యం మూలసాధనమ్ ।**
**ఇత్యూచుర్మునయో వత్స! తీర్ణసంసారసాగరాః ॥ 43**

నాయనా! సంసారసాగరమును తరించిన మహర్షులు మోక్షసాధనమగు వైరాగ్యము సాధన లన్నిటికిని మూలసాధనమని లేక ఆధారమని పలికిరి

**సమ్పన్నః పక్తిసామగ్ర్యాతండులోఽనలవర్జితః ।**
**అపక్వో భోజనానర్హస్తథా శీల వివర్జితః ॥ 44**

**సాధనాన్తర సమ్పన్నస్సాధకో విరతిం వినా ।**

**న ముచ్యతేఽ స్మాత్సంసారా త్తస్మాద్వైరాగ్యభాగ్భవ॥** 45

వంటసామగ్రులన్నియు సమకూడినను అగ్ని మాత్రము లేనిచో బియ్యము ఉడకక భోజనార్థము గాజాలనట్లు సాధకుడును సాధనాన్తర సమ్పన్నుడైనను సదాచారము వైరాగ్యముమాత్రము లేనిచో సంసారమునుండి ముక్తుడు గాజాలడు కాన తీవ్రవైరాగ్యమును సంపాదింపుము

**మరుతోయం యథా స్నానపానార్థం నోపయుజ్యతే ।**
**వైరాగ్యమన్తరా ముక్త్యై ధ్యానజ్ఞానాదికం తథా ॥** 46

మరుస్థలమున తోచు జలము స్నానపానాదులకు ఉపయోగపడనటుల వైరాగ్యశూన్యములగు ధ్యానాది సాధనములును మోక్షప్రాప్తి కుపయోగించవు

**బాలో యువా తథా వృద్ధశ్శుద్ధవైరాగ్యవాన్యది ।**
**స ముక్తస్స సుఖీ లోకే నాస్త్యవస్థాదిభిన్నతా ॥** 47

బాలుడుగాని, యువకుడుగాని, వృద్ధుడుగాని, స్త్రీగాని, పురుషుడుగాని యెవరైనను విశుద్ధమగు తీవ్రవైరాగ్యమును మాత్రము గలిగియున్నచో వారు ముక్తులు సుఖవంతులని తెలియుము ఈవైరాగ్యమునకు స్త్రీపురుషాది భేదము లేదు

**భవాబ్ధితరణేఽశక్తా వైరాగ్యతరణిం వినా ।**
**బ్రాహ్మణాద్యాస్స్త్రియో వాపి వైరాగ్య సహితా యది ।**
**తరంత్యేవ భవాంభోధిం వ్యక్తి భేదోఽత్ర నాస్తి వై ॥** 48

బ్రాహ్మణాదులుగాని, స్త్రీలుగాని, తదితరులు ఎవ్వరైనను సరే వైరాగ్యమను ఓడలేనిచో సంసారసాగరమును తరింపజాలరు అట్లే వైరాగ్యమను నావగల ప్రతివ్యక్తియు జాతిభేదముగాని, స్త్రీ పురుషభేదము గాని లేక భవసాగరమును సుఖముగ దాటగలరనియు గ్రహింపుము

**వైరాగ్యే సుస్థిరే మోక్షః కరామలకవద్భవేత్ ।**

**మోక్షద్వారస్య వైరాగ్యం సముద్ఘాటనకీలకమ్॥** 49

వైరాగ్యము స్థిరమైనచో మోక్షము అరచేతిలోని ఉసిరికపండువలె సులభముగ సిద్ధించును మఱియు నీవైరాగ్యము మోక్షద్వారమును తెరచుటకు తాళపుచెవి వంటిది తాళపుచెవి లేనిచో తలుపులను తెరవజాలనటుల నీ వైరాగ్యము లేనిచో ముక్తిద్వారమును తెరవజాలమని గ్రహింపవలయును

**అమాత్యే తు వశీభూతే స్వాధీనస్స్యాన్మహీపతిః ।**
**వైరాగ్యే చ తథా మోక్షస్స్వాధీనస్సంశయో న హి ॥** 50

మంత్రి స్వాధీనుడగుచో రాజున్ను స్వాధీనుడే అయినటుల వైరాగ్యము గలిగియున్నచో మోక్షము మన అధీనమేయని నమ్మవలయును ఇందు సందియము లేదు

**అమాత్యవచ్చ వైరాగ్యం మోక్షశ్చావనిభృత్సమః ।**
**విరాగే సర్వభోగానామవాప్తిర్భణ్యతే బుధైః ॥** 51

వైరాగ్యము మంత్రియనియు, మోక్షము రాజు అనియు గ్రహింపవలయును తీవ్రమగు విరక్తి గలిగియున్నచో ప్రపంచమునందలి సమస్తభోగ్యపదార్థములు ఆ విరక్తుని పాదసన్నిధిని వచ్చిపడునని తత్త్వవేత్తలు తెలుపుచున్నారు

**యచ్చ కామసుఖంలోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**విరక్తహృదయస్యైతే సుఖస్యార్హన్తి నాణుతామ్ ॥** 52

లోకములో నే విషయసుఖము గలదో అదిగాని, లేక స్వర్గప్రాప్త్యాది దివ్యసుఖముగాని యేవియు విరక్తునికి గలుగు ఆత్మసుఖముతో అణుమాత్రమేని సాటి గాజాలవు

**శమేన శివమాప్నోతి శమేనైతి త్రివిష్టపమ్ ।**
**శమస్సేవ్యశ్చ భూతానాం శమే సర్వం ప్రతిష్ఠితమ్ ॥** 53

శమముచేతనే శివమై అవ్యయమగు మోక్షమును బొందుచున్నాడు శమముచేతనే స్వర్గప్రాప్తియు గలుగుచున్నది కాన సమస్త ప్రాణులు శమమునే సేవింపవలయును శమమునందే యనంత సంపదలు సర్వ సుఖములు ప్రతిష్ఠితములై యున్నవి

**వైరాగ్యే తు సమాధిస్స్యాత్సమాధౌ బోధభాసనమ్ ।**
**బుద్ధస్య బద్ధముక్తిస్స్యాన్ముక్తౌ నిత్యసుఖం ధ్రువమ్ ॥** 54

తీవ్రవైరాగ్య మున్నచో సమాధి కుదురును సమాధి సిద్ధించినచో ఆత్మప్రబోధ మగును ఆత్మప్రబోధము, లేక ఆత్మజ్ఞానము గలిగినచో వాడు బద్ధముక్తుడే యగును ముక్తి గలుగుచో నాత్యన్తిక దుఃఖనివృత్తి, నిత్యనిరతిశయానందప్రాప్తి తప్పక గలుగును

**బహుజన్మకృతం పుణ్యం వైరాగ్యోదయకారణమ్ ।**
**వైరాగ్యమన్తరా జ్ఞానం కస్యచిన్నైవజాయతే ॥** 55

అనేక జన్మలయందు జేసినపుణ్యమే యిట్టి వైరాగ్య మావిర్భవించుటకు కారణము వైరాగ్యము లేనిచో నెవరికిని జ్ఞానము గలుగదు (జ్ఞానము గలుగనిచో మోక్షము సిద్ధింపదని గ్రహింపవలయును )

**ఈశ్వరానుగ్రహాత్పుంసాం కారుణ్యాచ్చ గురోర్మునేః ।**
**స్వపూర్వసుకృతాచ్చైవ వైరాగ్యం సుదృఢం భవేత్ ॥** 56

పరమేశ్వరానుగ్రహము వలనను, మననశీలుడగు గురుదేవుని సత్కృపవలనను, తన పూర్వపుణ్య విశేషమువలనను మాత్రమే తీవ్రమగు వైరాగ్యము గలుగును

**అతశ్చిత్తం సమాధాయ నిధాయాభీష్టదైవతే ।**
**ఉత్సృజ్య విషయాన్బన్ధాన్విరక్తో భవ నిర్మలః ॥** 57

కాన బంధహేతువులగు విషయములను బరిత్యజించి మనస్సును నిగ్రహించి స్థిరముగ ఇష్టదైవమునందు నిలిపి నిర్మలుడవై దృఢవైరాగ్య

శీలుడవు గమ్ము

**దృశ్యన్తే సాధకాః ప్రాయస్సక్తా వైరాగ్యవర్జితాః ।**
**లక్ష్యన్తే కుత్ర చిద్ధ్విత్రా విరక్తా బ్రహ్మభాగినః ॥** 58

**తత్రప్రబోధాః ఫలన్తీహ నైవ వైరాగ్యమన్తరా ।**
**బీజానీవోషరోప్తాని తస్మాద్వైరాగ్యభాగ్భవ ॥** 59

నేడు లోకమున తరచుగా సాధకులలో చాలామంది విషయాసక్తులై వైరాగ్యమునకు కడుదూరు లయిరి అయినను అచ్చటచ్చట వ్రేళ్లపై లెక్కింపదగిన కొద్దిమంది మహనీయులు బ్రహ్మప్రాప్తి నొందిన వైరాగ్యమూర్తులు గానవచ్చుచున్నారు కాని సాధకులు వైరాగ్యహీను లైనందున ఆ మహాత్ముల బోధలు, ఉపదేశములు వైరాగ్యము లేనిచో చవిటినేలలో విత్తిన గింజలవలె నష్టములై ఫలము నీయజాలకున్నవి కాన నీవు దృఢవైరాగ్యము గలవాడవు గమ్ము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయం ఉపనిషత్సార భూతాయాం
వైరాగ్యయోగో నామ షోడశోఽధ్యాయః॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
వైరాగ్యయోగమనుషోడశాధ్యాయము సమాప్తము



# సప్తదశోఽధ్యాయః

# మోక్షసన్న్యాసయోగః

శ్రీరామచరణ ఉవాచ

**గీతార్థజ్ఞానసమ్పన్న! గీతాజ్ఞానప్రబోధక!।**
**గీతాధర్మజ్ఞ! మే బ్రూహి గీతాతత్త్వం సునిశ్చితమ్ ॥ 1**

శ్రీరామచరణము చెప్పెను

గీతాజ్ఞానసమ్పన్నుడవై గీతాజ్ఞానమును లోకమున ప్రబోధించు చున్నట్టియు, గీతాధర్మమును చక్కగ దెలిసినట్టి ఓ సద్గురుమూర్తీ! గీతయొక్క నిశ్చితమగు బరమార్థరహస్యమును గూర్చి నాకు తెలుపుడు

**కర్మయోగస్సదా సేవ్య ఇత్యూచుస్తత్పరాయణాః ।**
**తత్సన్న్యాసం వినా సిద్ధ్యేన్నైష్కర్మ్యం నేతి చాపరే ॥ 2**

**ఏతయోః కతరత్సత్యం జ్ఞాతుమిచ్ఛామి తత్త్వతః ।**
**త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 3**

నిష్కామకర్మపరాయణులు జీవితాంతమువరకు కర్మల నాచరించు చుండవలయు ననియే గీతోద్దేశ్యమని చెప్పుచున్నారు (''కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతంసమాః'' అని వారు శ్రుతివాక్యమును ప్రమాణముగ జూపెదరు) మఱి ఇతరులగు ఆత్మజ్ఞానులు కర్మల పరిత్యజించనిదే నైష్కర్మ్యస్థితి (మోక్షము) లభింపదని కర్మసంన్యాసమును బోధించు చున్నారు కాన ఈ యిరువురి సిద్ధాన్తములలో నెయ్యది సత్యమో, గ్రాహ్యమో, ఆచరణీయమో దెలియకున్నది కాన పరమార్థతత్త్వమును తెలిసికొన కుతూహలుడను దుస్సమాధేయమగు నీ సందేహమును బాపుటకు తత్త్వజ్ఞులగు తమకన్నను సమర్థులు మరి లేరు కాన దయతో తత్త్వము నెరింగింపుడు

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**ఏతత్సంశయసంక్రాన్తమతయో బహవః పురా ।**
**అసన్సన్న్యాసినస్తాత! యోగిన స్తత్త్వచిన్తకాః ॥ 4**

శ్రీ మలయాళ యతీంద్రుడు చెప్పెను

నాయనా! పూర్వముగూడ అనేకమంది సన్న్యాసులు, యోగులు, తత్త్వచిన్తకులగు సాధుపుంగవులు ఇదే సందేహమును గలిగియుండిరి

**దుర్విజ్ఞేయమిదం తత్త్వం మహతాం జ్ఞానినామపి ।**
**శృణు వత్స! మహర్షీణామాశయం సంశయాపహమ్ ॥ 5**

నాయనా! గొప్పజ్ఞానులకు (శాస్త్రజ్ఞానముగల విద్వాంసులకు) కూడ నీ రహస్య మతిదుర్విజ్ఞేయమైనది అయినను ఈ నీ సందేహమును బోగొట్టునట్టి ప్రాచీనమహర్షుల అభిప్రాయమును జెప్పెద, వినుము

**యావత్కలుషితం చేతస్తావన్నిష్కామమాచరేత్ ।**
**శుద్ధాన్తఃకరణై రేవ నైష్కర్మ్యస్థితిరాప్యతే ॥ 6**

అంతఃకరణము శుద్ధము కానంతవఱకు నిష్కామ కర్మల నాచరించు చుండవలయును నిష్కామ కర్మాచరణముచే అంతఃకరణశుద్ధి గలిగిన వారికే నైష్కర్మ్యస్థితి పొందశక్య మగును

**గీతోక్తమోక్షసన్న్యాస పర్యాలోచనయా ధ్రువమ్ ।**
**సత్యం తత్త్వమిదం భాతి భారతాయ ప్రబోధితమ్ ॥ 7**

శ్రీభగవద్గీతయందలి మోక్షసన్న్యాసయోగమును బాగుగ విచారించినచో శ్రీకృష్ణుడు సత్యమగు ఈ రహస్యమునే అర్జునునకు బోధించినటుల వ్యక్తమగుచున్నది

**మోక్షస్సన్న్యాసయోగశ్చ ద్వావేతౌ కృష్ణబోధితౌ ।**
**ఏకస్సహాయకోఽన్యస్మై తతస్సన్న్యాసమాచరేత్ ॥ 8**

అందు శ్రీకృష్ణభగవానుడు మోక్షమును, సన్న్యాసమును రెంటిని బోధించెను వాటిలో ఒకటి (సన్న్యాసము) మఱియొకదానికి (మోక్షమునకు) సహాయకమగును కాన ముముక్షువు సన్న్యసమును స్వీకరింపవలయును

**సంన్యాసో యది మోక్షస్య న భవేదుపకారకః ।**
**గీతాం చ వాసుదేవస్య ముఖాదాకర్ణ్య పాండవః ॥ 9**

**గృహకర్మైక నిష్ఠస్సన్ యావజ్జీవం వసేత్ఖిల ।**
**న తథాఽఽచరితం తేన వాసుదేవానుగామినా ॥ 10**

సన్న్యాసము మోక్షమునకు సహాయకము గానిచో సాక్షాత్ శ్రీకృష్ణుని ముఖారవిందమునుండి గీతార్థమును శ్రవణముజేసిన అర్జునుడు జీవింతాంతమువరకు గృహమునందుండి కర్మలనే చేయుచునే యుండవలయును గదా! కాని కృష్ణానుసారియైన అర్జునుడట్లు చేయలేదు

**మహాప్రస్థానకే తత్త్వం భారతేఽపి సునిశ్చితమ్ ।**
**పరీక్షితం సమారోప్య రాజ్యే ధర్మనృపస్తథా ॥ 11**

**సన్న్యస్య భోగభాగ్యాని విరజ్య చ మహామనాః ।**
**భ్రాతృభిస్సహ దారైశ్చ హిమాద్రిం పర్యగాత్సుధీః ॥ 12**

భారతమున మహాప్రస్థాన పర్వమునందుగూడ నీతత్త్వమే (మోక్షమునకు సన్న్యాస మవసర మనునదియే) విశదముగ తెలుపబడినది ఎట్లన, బుద్ధిమంతుడు మనీషియునగు ధర్మరాజు పరీక్షిన్మహారాజును రాజ్యాభిషిక్తునిజేసి సమస్తభోగములను, ధనధాన్యములను విడిచి, విరక్తుడై, భీమార్జునాది సోదరులతో ధర్మపత్నియగు ద్రౌపదితో గూడ బయలుదేరి హిమాలయమునకు తపస్సునకై పోయినటుల భారతమున గానవచ్చుచున్నది

**మోక్షార్థినాం హి సన్న్యాసో ముఖ్యం సాధనమీరితః ।**
**యుధిష్ఠిరమహాయానమస్మిం స్తత్త్వే నిదర్శనమ్ ॥ 13**

మోక్షాకాంక్ష గలవారికి సన్న్యాసము ప్రధాన సాధనము, ఆవశ్యాచ
ణీయ మనియు తత్త్వవేత్తలు నుడివిరి యుధిష్ఠిరాదుల మహాప్రస్థానవ
దీనికి తార్కాణము

**సనిర్వాసననిర్వాణపదప్రాప్తౌ చ కేవలమ్ ।**
**సర్వసంగపరిత్యాగో హేతుర్బుద్ధో నిదర్శనమ్ ॥** 1

వాసనారహితమగు నిర్వాణపదమును పొందుటకు సర్వసంగ
రిత్యాగమే ముఖ్యకారణము శ్రీభగవాన్ బుద్ధుడే దీనికి దృష్టాన్తము
సకలైశ్వర్యములతో గూడిన రాజ్యాధిపత్యమునుగూడ పరిత్యజించి సంన్యా
యయ్యే బుద్ధుడు నిర్వాణమును బొందెను

**తథాఽపి కర్మ నిష్కామమాచరేదాత్మశుద్ధయే ।**
**అశుద్ధస్త్యక్తకర్మాఽసావన్యథా పతితో భవేత్ ॥** 1

సన్న్యాసమే మోక్షకారణ మైనను అంతఃకరణశుద్ధి గలుగు పర్యన్తమ
నిష్కామబుద్ధితో కర్మల నాచరించుచునే యుండవలయును లేనిచో చిత్తశు
గలుగక పూర్వమే కర్మలను సన్న్యసించిన ''ఇతోభ్రష్టస్తతో భ్రష్టః'' అన
రీతిగా పతితుడగును

**శ్రీకృష్ణపరమాత్మాఽసౌ క్షాత్రధర్మయుతోఽపి సన్ ।**
**కర్మైవ కుర్యాదాజీవ మిత్యేవం బోధయేత్కథమ్ ॥** 1

మఱియు క్షత్రియ ధర్మములతో గూడి యుండియు శ్రీకృ
పరమాత్మ జీవితమంతయు కర్మలనే చేయుచుండుమని యెటు
బోధించును?

**అభ్యసేచ్ఛైశవే విద్యాం యౌవనే గృహమాప్నుయాత్।**
**జరాయాం మునివృత్తిస్స్యాద్యోగేనాన్తే తనుం త్యజేత్॥** 1

**ఇతి ధర్మే స్థితే కృష్ణో ధర్మస్థాపనతత్పరః ।**
**ఉల్లంఘ్య ధర్మశాస్త్రం తదధర్మం కథమాదిశేత్॥** 1

శైశవమున విద్యనభ్యసింపవలయును యౌవనమున గృహస్థాశ్రమ మును స్వీకరింపవలయును వార్ధక్యమున వానప్రస్థాశ్రమమును స్వీకరింపవల యును చివరకు యోగవృత్తి నవలంబించి శరీరమును విడువవలయునని ధర్మశాస్త్ర మీ విధముగ బోధించుచుండ ధర్మసంస్థాపనకై అవతరించిన శ్రీకృష్ణభగవానుడు పూర్వోక్త ధర్మశాస్త్రము నతిక్రమించి యావజ్జీవితము కర్మలనే ఆచరించుచుండుమని అధర్మము నెటుల ఆదేశించును?

**ధర్మజ్ఞైర్ధార్మికైర్ధీరైర్యుధిష్ఠిర ముఖైర్నృపైః।**
**అనుష్ఠితోఽయం సద్ధర్మస్సర్వైరాసేవ్య ఏవ చ॥** 19

ధర్మవేత్తలును, ధర్మాచరణ తత్పరులును, ధీరులునగు ధర్మరాజా దులు ఈ సద్ధర్మమును, సన్మార్గమునే అనుసరించిరి మానవులందరును అనుసరింపదగిన ధర్మము నిదే ఇదియే సరియైన మార్గము, అనుష్ఠేయమగు ధర్మము

**అప్రస్థితా భవేయుశ్చేద్యుధిష్ఠిరనృపాదయః।**
**ఉల్లంఘితమతా ధర్మవిముఖా స్స్యుస్తథైవ చ ॥** 20

ధర్మరాజాదులు రాజ్యమును ఐహికభోగములను బరిత్యజించి మహా ప్రస్థాన మొనరింపక యావత్కాలము కర్మల నాచరించుచు విషయభోగముల ననుభవించుచునే యుండిరేని శ్రీకృష్ణభగవానుని మతమును, ఉల్లంఘించిన వారై ధర్మవిముఖులై యుందురు

**మన్వాదిమునయోఽప్యేవమాచఖ్యుస్తత్త్వదర్శినః।**
**మహాజనగతం మార్గమనుజగ్ముర్హి పాండవాః ॥** 21

తత్త్వదర్శులగు మన్వాదులును పూర్వోక్తధర్మనియమమును అదేవిధ ముగ జెప్పుచున్నారు మహాజనో యేన గతః స పంథాః (అనగా మహాపు రుషులు నడచినదే, అనగా అనుష్ఠించినదే సన్మార్గము) అన్నరీతి పాండవులు మహాపురుషుల మార్గమునే అనుసరించి మార్గదర్శకులైరి

**ఆత్మన్యాధాయ చిత్తం హి నివాతస్థితదీపవత్ ।**
**శాన్త నిశ్చల భావే చ సంస్థితిర్మోక్ష ఉచ్యతే ॥** 22

గాలిలేని చోటున నిశ్చలముగ వెలుగు దీపమువలె చిత్తమును ఆత్మ యందు నిగ్రహించి ప్రశాన్త నిశ్చల భావమున (నిర్వికల్ప సమాధియందు) నిలుకడ గలిగియుండుటయే మోక్షము

**బ్రహ్మైక్యభావనాస్థైర్యే కారణం వాసనాక్షయః ।**
**అతశ్చ సన్త్యజేత్కర్మ నాన్యథా మోక్షమాప్నుయాత్॥** 23

అట్టి బ్రహ్మాత్మైక్య భావమునందు స్థిరతగలిగి యుండవలయునన్న వాసనాక్షయము, లేక మనోనాశ మత్యసవరము కాన వాసనాక్షయ మనో నాశములు కావలయునన్న కర్మలను త్యజించవలయును లేనిచో నిర్వా సనాస్థితియు, మనోనాశమున్ను గలుగవు అందుచే మోక్షము సిద్ధించదు

**రజసా విలయం కుర్యాస్తమస్సత్త్వేన తద్రజః ।**
**తతస్సత్త్వం విశుద్ధేన ముక్తిసౌధాధిరోహిణః ॥** 24

పూర్వోక్త ముక్తిసౌధము నధిరోహింప దలంచువారలు రజోగుణముచే తమోగుణమును, సత్త్వగుణముచే రజోగుణమును, విశుద్ధగుణముచే సత్త్వగుణమును విలయ మొందింపవలయును (ముక్తిసౌధము నధిరోహించుట కిది సోపానక్రమ మార్గమని గ్రహింపవలయును )

**ఋషభశ్చ మనుః పూర్వే యయాతిర్భరతాదయః ।**
**రాజర్షయశ్చ రాజ్యం హి సన్త్యజ్య ప్రావ్రజన్వనమ్ ॥** 25

ఋషభుడు, మనువు, యయాతి, భరతుడు మొదలుగాగల రాజర్షు లందరు రాజ్యమేలి తమ జీవితములో తృతీయభాగమున రాజ్యమును బరిత్యజించి తపమాచరింప వనమునకుం బోయిరి

**అనుష్ఠేయస్తు నిర్వాణమిచ్ఛతా తాత! పావనః।**
**పరమ్పరాగతః పన్థా ఋషిధర్మస్సనాతనః॥** 26

నాయనా! నిరతిశయ సుఖాస్పదమగు నిర్వాణమును పొందగోరు ప్రతిమానవుడును, పరమ్పరాగతమగు నీ పవిత్ర సనాతన ఋషిధర్మమును (సన్న్యాసమువరకు) తప్పక ఆచరింపవలయును

**వ్యాసః కణాదకపిలశుకభృగ్వాదయః పురా ।**
**తత్త్వం బ్రహ్మర్షయో ధర్మ్యం స్వీచక్రు స్తత్త్వదర్శినః ॥ 27**

మఱియు పూర్వము వ్యాసుడు, కణాదుడు, కపిలుడు, శుకుడు భృగువు మొదలుగా గల తత్త్వవేత్తలగు బ్రహ్మర్షులును ఈ ధర్మతత్త్వమునే అనుసరించిరి

**ఏవం చ సులభా గార్గీ మైత్రేయీ చ తపస్వినీ ।**
**ప్రావ్రజన్ స్త్రీసమూహస్య ధర్మబోధనకాంక్షయా ॥ 28**

మఱియు నిట్లే సులభ, గార్గి, మైత్రేయి, మొదలగువారు నారీలోకము నకు సన్న్యాసధర్మమును బోధింపదలంచి సన్న్యసించి యోగినులైరి.

**త్రయోఽప్యాచార్యవర్యాశ్చ జినబుద్ధాదయ స్తథా ।**
**ప్రవ్రజ్య లేభిరే మోక్షం కిమన్యత్సాక్ష్యమీక్షతే ॥ 29**

మఱియు శ్రీమధ్వ, శ్రీశంకర, శ్రీరామానుజాది మతాచార్యులును, జినబుద్ధాది మతప్రవక్తలును సంన్యసించే మోక్షమును బొందిరి ఈ విషయమున ఇంతకన్నను మఱిసాక్ష్యము, ప్రమాణమేమి కావలయును?

**ఏవం బుద్ధానుయాయిన్యో గౌతమీ చ మహోత్పలా ।**
**సంఘమిత్రాదయో నార్యః ప్రావ్రజన్మోక్షకాంక్షయా ॥ 30**

అట్లే బౌద్ధమతావలంబినులగు మహాగౌతమి, ఉత్పల, సంఘమిత్ర మొదలగు నారీమణులును మోక్షాకాంక్షచే సంన్యసించి పరమనిర్వాణమును బొందిరి

**న హి కాయకృతం కర్మ కర్మ ప్రాహుర్మనీషిణః ।**
**మనసా వచసా వాఽపి కృతం కర్మేతి తద్విదః ॥ 31**

కేవలము శరీరముతో నాచరించెడి కార్యము మాత్రమే కర్మ గాదు మఱేమన మనస్సుతో గాని, వాక్కుతో గాని ఆచరించెడు సమస్తక్రియలును కర్మయే యగునని కర్మరహస్యమును గుర్తెరింగిన మహానుభావులు వచించిరి

**వాక్కృతం కీర్తనం చిత్తకృతం దైవస్య చి న్తనమ్ ।**
**మనఃకృతం చ మననం కర్మేత్యేవావదన్బుధాః ॥ 32**

వాక్కుతో జేయు భగవత్సంకీర్తనాదులును, చిత్తముతో జేయు ఇష్టదేవతాచిన్తనమున్ను, మనస్సుతో జేయు ఆత్మమననమున్ను కర్మయే యని బ్రహ్మవేత్తలు చెప్పుదురు

**బుద్ధ్యాదిదేహపర్యన్తం సకలైః కరణైరపి ।**
**క్రియమాణాని కర్మాణి కర్మాణ్యేవ న సంశయః ॥ 33**

వేయేల, బుద్ధ్యాది దేహపర్యంతముగల సమస్త ఇంద్రియములతో ఆచరించెడు క్రియలన్నియు కర్మలే ఇందు సందియము లేదు

**సాక్షిణ్యతీన్ద్రియే తిష్ఠన్స్వప్రకాశే చిదాత్మని ।**
**నిర్వికారస్స్వయం జ్యోతిర్నిష్కర్మా ప్రోచ్యతే బుధైః ॥ 34**

బుద్ధ్యాదీంద్రియములకు సాక్షియై యింద్రియముల కతీతమై స్వ యంప్రకాశస్వరూపమై యింద్రియాదుల ప్రకాశింపజేయుచున్న చిదా త్మయందు నిలకడగలిగి నిర్వికారుడై స్వయం జ్యోతిస్స్వరూపుడై వెలు గొందు ఆత్మజ్ఞానియే నిజమైన నిష్కర్ముడు, అనగా కర్మసన్న్యాసి యని తత్త్వవేత్తలు చెప్పుదురు

**ఏవం మోక్షపదప్రాప్తౌ హేతుశ్చిత్తాదిశుద్ధతా ।**
**భగవత్కృపయా లభ్యా సా చ నిష్కామ కర్మణా ॥ 35**

అట్టి మోక్షపనదవాచ్యమగు నైష్కర్మ్యస్థితిని బొందుటకు అంతఃక రణశుద్ధి కారణము ఆ అంతఃకరణశుద్ధియో పరమేశ్వరుని యనుగ్రహము వలనను, నిష్కామకర్మాచరణము వలనను గలుగును

**బుద్ధ్యాదేస్తు పరో హ్యాత్మా ధియమాధాయ తత్ర వై ।**
**కామాదీన్ప్రజహి హ్యేవం శ్రీకృష్ణవచనామృతమ్ ॥ 36**

ఆత్మ, బుద్ధ్యాదీంద్రియముల కన్నిటికంటెను బరమైనది కాన బుద్ధిని ఆపరమాత్మయందు స్థిరముగ నిలిపి శత్రురూపములగు కామాదులను జయింపుము ఇట్లని శ్రీకృష్ణుడు గీతయందు బోధించెను గీత –

ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః॥
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్॥ ( అ 3, శ్లో 42,43)

**ఏషా బ్రాహ్మీస్థితిర్వత్స! యావన్న హి దృఢా భవేత్।**
**వ్యర్థం జన్మ యథా దైవప్రతిష్ఠాశూన్యమన్దిరమ్ ॥ 37**

నాయనా! అట్టి బ్రహ్మాత్మైక్యస్థితి దృఢముగా నెవనికి గలుగలేదో అట్టివాని జీవితము దైవప్రతిష్ఠలేని దేవాలయమువలె వ్యర్థమని గ్రహింపుము

**తదా జీవననౌరస్య గచ్ఛన్తీ భవసాగరే ।**
**కర్ణధారేణ శూన్యేవ లక్ష్యం యాతి న చ ధ్రువమ్ ॥ 38**

మఱియు అపుడు అట్టి బ్రాహ్మీస్థితిని బొందని వ్యర్థజీవియొక్క జీవితనౌక చుక్కానివాడు లేని నావవలె సంసారసాగరమున పరిభ్రమించుచు గమ్యస్థానమును బొందజాలదు, నిశ్చయము

**ఏవం బ్రాహ్మీస్థితౌ బీజం నిజోప్తం ఫలవద్భవేత్ ।**
**అన్యథా నిష్ఫలం జీర్ణం భువి లుప్యేద్వృథా నరః ॥ 39**

**ఫలితే బీజసన్తానే పక్వాని మధురాణి చ ।**
**భుక్త్వా ఫలాని సంతృప్తశ్చిరం యాతి పరం సుఖమ్ ॥ 40**

**ఏవం బ్రహ్మణి సంలీనో నిరాకారశ్చ పూరుషః ।**
**కృతకృత్యో విముక్తస్సన్ నిర్విశేషసుఖం వ్రజేత్ ॥ 41**

అట్టి నైష్కర్మ్యరూపమగు బ్రాహ్మీస్థితి గలిగినపుడే సాధకుడు తాను నాటిన బీజము ఫలోన్ముఖ మైనదనియు, లేనిచో భూమియందే విలీనమై నిష్ఫలమైన దనియు గ్రహించుకొనవలయును మఱియు లోకమున మనుష్యుడు తాను పెట్టిన విత్తనము అంకురించి పెద్దదై ఫలించగా మధురములగు ఆ ఫలములను భుజించి సంతృప్తుడై అమందానందము నొందునట్లు ఆత్మజ్ఞానియు పూర్వోక్త బ్రాహ్మీస్థితిని బొంది కృతకృత్యుడై నిర్వికారుడై అక్షయమగు మోక్షప్రాప్తి నొందినవాడై నిర్విశేష సుఖమును బొందుచున్నాడు

**మనసా సర్వకర్మాణి సన్న్యస్యాస్తే సుఖం వశీ ।**
**ఇతి ప్రోక్తం చ గీతాయాం జ్ఞానాన్తత్వాద్ధి కర్మణామ్ ॥ 42**

జ్ఞానోదయమగువరకే కర్మల నాచరింపవలయును కాబట్టి జితేంద్రియుడగు ఆత్మజ్ఞాని మనస్సుచే సర్వకర్మల బరిత్యజించి చిరకాలము సుఖము ననుభవించుచున్నాడని గీతయందు చెప్పబడినది కర్మలు జ్ఞానములో పర్యవసించును గదా! గీత – సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ( అ 4, శ్లో,33), సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ( అ 5, శ్లో 13 )

**నిశ్చిత్య కర్మసన్న్యాసతత్త్వ మర్జునమబ్రవీత్ ।**
**గీతాన్తే కీలకం కృష్ణస్సర్వధర్మానితి శృణు॥ 43**

ఈ కర్మసన్న్యాస రహస్యమును నిశ్చయించి శ్రీకృష్ణుడు గీతాన్తమున చరమశ్లోకమున– హే పార్థ! నీవు సర్వకర్మలను, లేక ధర్మములను పరిత్యజించి నన్నే శరణుబొందుము నేనే నిన్ను సమస్త పాపముల నుండి విముక్తుని జేసి ముక్తిపదమున జేర్చెదనని కీలక వాక్యమును అత్యన్త ప్రేమతో అర్జునునికి బోధించెను ఈ కీలకమును శ్రద్ధతో నాలకింపుము

**యః ప్రవ్రజేన్మన శ్శుద్ధిం వినా నిష్కామకర్మజామ్ ।**
**తస్యేహజీవనం వ్యర్థమకాలికశిశోర్యథా ॥ 44**

నిష్కామకర్మాచరణముచే చిత్తశుద్ధి గలుగక పూర్వమే (సంపూర్ణ

తీవ్రతరవైరాగ్యము గలుగనిదే) సన్న్యసించినచో అట్టి యవివేకియొక్క జీవితము నెలలు నిండక పూర్వమే జన్మించిన శిశువు జీవితము వలె వ్యర్థమనుగదా! అట్లే చిత్తశుద్ధిలేని సన్న్యాసమున్ను క్షణికమగుటచే తప్పక పతితు డగునని భావము

**తస్మాత్కృత్వా చ కర్మాణి సంశోధ్య చ మనశ్శుచి ।**
**నిష్కామః ప్రవ్రజేద్ధీమానన్యథా పతితో భవేత్ ॥ 45**

కాన వేదోక్త కర్మలను నిష్కామబుద్ధితో ఆచరించి చిత్తశుద్ధి కలిగిన తరువాత కామనారహితుడై సన్న్యసింపవలయును అట్లుగాక ముందుగనే సంన్యసించినచో దప్పక పతితుడగును

**మోక్షసన్న్యాసయోగోఽయం పావనానాం చ పావనః ।**
**నిగూఢం తత్త్వమేతద్ధి వాచ్యం శ్రద్ధాళవే పునః ॥ 46**

**అనుష్ఠానవిహీనాయ ప్రోక్తం చ ఫలదం న హి ।**
**అధికారిసముద్బోధాన్నుద మాయామలం చిరమ్ ॥ 47**

ఈ మోక్షసన్న్యాసయోగము మిక్కిలి పవిత్రమైనది, పావనమైనది మిక్కిలి నిగూఢమగు నీ రహస్యమును శ్రద్ధాభక్తులు గలిగి అనుష్ఠానపరులగు వారికి మాత్రమే ఉపదేశించవలయును ఆచరణ శూన్యుల కుపదేశించిన వ్యర్థమై ఫలవంతము గానేరదు కాన యోగ్యుడగు అధికారికి మాత్రము బోధించి అనాదియగు మాయామాలిన్యమును పోగొట్టుము

**లోకమాయాపహారేణ లోకబన్ధ విమోక్షణాత్ ।**
**ఋషీణాఞ్చ కృపాపాత్రం భూత్వా ధన్యశ్చిరం భవ॥ 48**

అనాదియగు జనుల అవిద్యను నశింపజేసి ఆ యవిద్యాకృతములగు బంధనములను త్రుంచి పరమపావనులగు మహర్షుల అమోఘకృపకు చిరకాలము పాత్రుడవై ధన్యజీవివి గమ్ము.

**కామినీకాఞ్చనే ద్వేఽపి ప్రాకృతైః కాంక్షితే భువి ।**

**అప్రాకృతో విరక్తస్త్వం దూరం వస తయోస్సదా ॥** 49

లోకములో కామినీకాంచనములను రెండింటిని ప్రాకృతజనులు కోరుచుందురు నీవు స్వభావతః అప్రాకృతుడవు అనగా ప్రకృతిరహితుడవు కాన విరక్తుడవై యెల్లప్పుడు నీ కామినీ కాంచనములును రెండింటికిని దూరముగా నుండుము

**త్యక్తస్త్రీస్వర్ణసంగస్య విరక్తస్య చ ధీమతః ।**
**నాధఃపాతో౽స్తి కుత్రాపి సదా౽౽త్మానం తు చిన్తయ ॥** 50

కామినీ కాంచనములం దాసక్తిని వీడి విరక్తుడైన ధీశాలికి ఎచ్చోటను అధఃపతన మనునది లేనే లేదు కాన విరక్తుడవై నిరన్తరము ఆత్మ స్వరూపమును ధ్యానించుచు ఆత్మస్వరూపుడవై యుండుము

ఇతి శ్రీమలయాళయతీన్ద్రగీతాయాం ఉపనిషత్సార భూతాయాం
మోక్షసన్న్యాసయోగో నామ సప్తదశో౽ధ్యాయః ॥

ఇట్లు ఉపనిషత్సారభూతమగు శ్రీమలయాళయతీన్ద్రగీతయందు
మోక్షసన్న్యాసయోగమను సప్తదశాధ్యాయము సమాప్తము



# అష్టాదశోఽధ్యాయః

# నిర్వాణయోగః

శ్రీమలయాళయతీన్ద్ర ఉవాచ

**ఋషిభిర్యోగిభిస్సిద్ధైశ్ఛన్దోభిర్వివిధైర్భృశమ్।**
**బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితమ్।** 1

**పూర్వోక్తసర్వయోగానాం సారభూతం నిరామయమ్।**
**కథయామి చ భూతార్థం నిర్వాణం మోక్షముత్తమమ్॥** 2

శ్రీమలయాళయతీంద్రుడు చెప్పెను

మహర్షులచేతను, యోగీశ్వరులచేతను, సిద్ధులచేతను, వివిధవేదములచేతను, కారణములను నిరూపించు బ్రహ్మసూత్రములచేతను నిర్ణయింపబడినదియు, ముందు పేర్కొనబడిన పదునేడు యోగముల సారమయి నదియు, పరబ్రహ్మస్వరూప మయినదియు, యధార్థ మయినదియునగు మహోత్తమ మోక్షమనబడు నిర్వాణమునుగూర్చి వచించుచున్నాను

**సన్న్యాసం తు నిరూప్యాథ నిర్వాణస్య నిరూపణాత్ ।**
**సన్న్యాసస్య ఫలీభూతం నిర్వాణమితి వేద్యతామ్ ॥** 3

సన్న్యాసయోగమును నిరూపించిన తరువాత నిర్వాణయోగమును నిరూపించుటవలన నిర్వాణమును సన్న్యాసముయొక్క ఫలమునుగా తెలియవలెను

**సమస్తవేదసంసిద్ధం సారతత్త్వమిదం పరమ్ ।**
**అత్యన్తపావనం నిత్యం నిర్వాణం పరమం సుఖమ్ ॥** 4

ఆ నిర్వాణము సమస్తవేదములందు ప్రతిపాదింపబడినదై సారతత్త్వమై శ్రేష్ఠమై మిగుల పవిత్రమై నిత్యమై పరమసుఖమై యున్నది

**సర్వవేదాన్తసంవేద్యం యోగాన్తిమపదం స్మృతమ్ ।**

**సంశా న్తవృత్తి విశదం హ్యఖణ్డం కేవలం శివమ్ ॥** 5

సకలోపనిషత్తులచే దెలియదగినదియు, యోగముల కన్తిమస్థాన మైనదియు, సకలవృత్తులు నశించినదియు, నిర్మల మైనదియునై యా నిర్వాణము అఖండకేవల శివస్వరూపమై యొప్పుచున్నది

**నిర్వాణం జ్యోతిషాం జ్యోతిస్తమసః పరముచ్యతే ।**
**ప్రజ్ఞాన మానందఘనం పరిపూర్ణం విదుర్బుధాః ॥** 6

నిర్వాణమును జ్యోతిస్సులకు జ్యోతిస్సుగను, తమస్సునకు పరమైన దిగ చెప్పుచున్నారు మఱియు నది ప్రజ్ఞానము, ఆనందఘనము, పరిపూర్ణము అని జ్ఞానులు తెలుపుచున్నారు

**యత్ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం పదమ్ ।**
**మాయాశూన్యం చ నిఖిలం సర్వవిజ్ఞానభాసురమ్ ॥** 7

దేనిని పొంది తిరుగారారో అదియే నిర్వాణము, పరమాత్మస్థానము, మోక్షము, మాయారహితము, నిఖిలము, సర్వవిజ్ఞానముతో భాసించునది యు నగుచున్నది

**తస్మిన్నఖణ్డనిర్వాణే వాహిన్యస్సాగరే యథా ।**
**తథా ధ్రువం విలీయన్తే సమస్తాని మతాన్యపి ॥** 8

సముద్రమందు సకల నదీనదములు లయించు విధమున ఆ యఖండ నిర్వాణమందు సమస్త మతములు లీనము లగుచున్నవి, నిశ్చయము

**కిన్నామ మతమిత్యుక్తే మతం బుద్ధిరితీర్యతే ।**
**తదతీతం హి నిర్వాణం సర్వబన్ధవివర్జితమ్ ॥** 9

మతమనగా ఏమియన బుద్ధియే మతమనబడును అట్టి బుద్ధినిగూడ నతిక్రమించినది నిర్వాణము గదా అది సర్వబన్ధములు లేనిది

**నీరూపం నిర్గుణం శా న్తం నిరాకారం నిరఞ్జనమ్ ।**

**నిర్వాణం చామృతం తత్త్వం బుద్ధం ముక్తం తథా స్మృతమ్ ॥** 10

మఱియు నానిర్వాణము రూపరహితము, నిర్గుణము, శాన్తము, నిరాకారము, మాయారహితము, అమృతతత్త్వము, బుద్ధము, ముక్తమనియు చెప్పబడినది

**బుద్ధదేవో దయాసిన్ధుర్భగవాన్ప్రాహ భూరిశః ।**
**నిర్వాణముక్తిం పరమాం తతోఽన్యన్నావశిష్యతే ॥** 11

దయాసాగరుడయిన భగవన్తుడగు శ్రీబుద్ధదేవు డనేకసార్లు పరమోత్కృష్టమగు నిర్వాణమను ముక్తిని ప్రతిపాదించెను అదియే కడకు పరిశేషించుచున్నది దాని కన్న మఱియొకటి మిగిలియుండుట లేదు

**గీతోపనిషదాదీని శాస్త్రాణి వివిధాని చ ।**
**యోగవాసిష్ఠమప్యాహుర్నిర్వాణం ముక్తిమేవ హి॥** 12

నిర్వాణమనగా ముక్తియని గీత, ఉపనిషత్తు మొదలయినవి, వివిధ వేదాంతశాస్త్రములు, యోగవాసిష్ఠమున్ను నొక్కి వాక్కాణించుచున్నవి

**గురవశ్శంకరాచార్య శ్రీమద్రామానుజాదయః ।**
**ప్రయుఞ్జతే స్మ నిర్వాణశబ్దం గ్రన్థేషు భూరిశః ॥** 13

శ్రీశంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు మొదలయిన మహాత్ములును తమ తమభాష్యాది గ్రన్థములందు ముక్తియను నర్థముననే నిర్వాణపదము నెక్కువగా ప్రయోగించిరి

**ఆవృతీనాం చ సర్వేషాం సంక్షయే యత్తు శిష్యతే ।**
**త దేవ సత్యం నిర్వాణమాత్మబోధం విదుర్బుధాః ॥** 14

ఆవరణము లన్నియు నశించగానే యేది మిగులుచున్నదో ఆ సత్యమునే, ఆయాత్మప్రబోధమునే, ఆబ్రహ్మాకారస్థితినే నిర్వాణమని యాత్మజ్ఞులు వచించుచున్నారు

**బ్రహ్మ విష్ణు శివత్వాని స్వర్గ కైవల్య ముక్తయః ।**
**అర్హన్నితి చ పర్యాయశబ్దాః నిర్వాణ వాచకాః ॥** 15

బ్రహ్మత్వము, శివత్వము, విష్ణుత్వము, స్వర్గము, కైవల్యము, ముక్తి, అర్హన్ మొదలగున వన్నియు నిర్వాణమును తెలుపు పర్యాయ పదములని నిర్ణయము

**మహాత్మానస్సదా దైవగురుభక్తి పరాయణాః ।**
**కృతార్థాస్సాంప్రతం యూయం నిర్వాణపదభాజినః॥** 16

మహాత్ములారా! గురుదైవభక్తి పరాయణులారా! మీరెల్లరు కృతార్థులయిరి నిర్వాణపదవిని పొందినవారయితిరి

**బ్రహ్మైవ బ్రహ్మవిన్నానం పరమాప్నోతి బ్రహ్మవిత్ ।**
**ఇత్యాది శ్రుతివాక్యానాం త త్త్వం విద్వత సాంప్రతమ్ ॥** 17

''బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'', ''బ్రహ్మవిదాప్నోతి పరమ్'' మొదలగు శ్రుతివాక్యముల తత్త్వము నిప్పుడు తెలిసికొనుడు

**ఆత్మన్యేవ చ భూతాని యస్తు సర్వాణి పశ్యతి ।**
**ఆత్మానం సర్వభూతేషు న తతో విజుగుప్సతే ॥** 18

ఏవిజ్ఞాని సకలభూతములను తనయందును, తనను సర్వభూతముల యందును గాంచుచున్నాడో అట్టి యాత్మజ్ఞాని దేనినుండియు జుగుప్స నొందడు

**ఆత్మేతి సర్వభూతాని యో విజానాతి తత్త్వవిత్ ।**
**ఏకత్వం పశ్యత స్తస్య శోకమోహౌ న సిధ్యతః ॥** 19

ఏతత్త్వవేత్త సకల భూతముల నాత్మగా దెలిసికొనుచున్నాడో అట్టి యభేదజ్ఞానము గల (అన్నిటియందు నొకే యాత్మను గాంచునట్టి) మహాను భావునకు శోకమోహములు సంభవించవు

**యథా వసన్తకాలే తు స్వచ్ఛాకాశే నిరావృతిః ।**
**భానుమాన్భాతి సర్వత్ర సహస్రకిరణైర్భృశమ్ ॥ 20**

**తథైవ బ్రహ్మమాత్రస్సంశ్చిదాకాశే తు దీప్తిమాన్।**
**ఆత్మా చకాస్తి సర్వత్ర తద్ధి నిర్వాణముచ్యతే॥ 21**

వసంతకాలమున నిర్మలాకాశమునం దేలాగున సూర్యభగవానుడు మేఘావరణము లేనివాడై సహస్రకిరణములతో మిక్కిలి ప్రకాశించుచున్నాడో ఆలాగున విశుద్ధచిదాకాశమందాత్మ పరబ్రహ్మమాత్రమై (సకలావరణ నిర్ముక్తమై) దేదీప్యమానమై యన్నిచోట్ల భాసిల్లుచున్నది అదియే నిర్వాణమని చెప్పబడుచున్నది

**శరత్కాలీనశుద్ధాభగగనే పూర్ణచన్ద్రమాః ।**
**యథా భాతి విశుద్ధాత్మా బుద్ధేస్సాక్షీ నిరాశ్రయః ॥ 22**

**ఆనందమయపూర్ణాత్మా తేజోరాశిస్స్వయం శివః ।**
**తథా భాతి సదా నూనం నిర్వాణం తదుదీర్యతే ॥ 23**

శరత్కాలమనందలి స్వచ్ఛాకాశమందు పరిపూర్ణచంద్రుడు పరిశుద్ధుడై సర్వవ్యాపకుడై తేజరిల్లు లాగున ఎవడు బుద్ధికిని సాక్షియై అసహాయుడై బ్రహ్మమాత్రుడై ఆనందమయుడై పరిపూర్ణుడై స్వయంతే తేజోరాశియై శివస్వరూపుడై విరాజిల్లుచున్నాడో అట్టి వానిస్థితియే నిర్వాణమనబడు చున్నది

**యస్తు సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**ఏకత్వమాస్థితః పశ్యేత్స యోగీ ముచ్యతే ధ్రువమ్ ॥ 24**

ఏ బ్రహ్మవేత్త సకలభూతములందున్న పరమాత్మను తానని యభేదముతో గాంచుచున్నాడో ఆ యోగీశ్వరుడు తప్పక జనన మరణ రూప సంసారబన్ధమునుండి విడివడి ముక్తు డగుచున్నాడు

**నిరాలమ్బం పరబ్రహ్మ సమాశ్రిత్య సదా ధియా ।**

**సాలమ్బ్యం సగుణం తత్త్వం విజహాతి చ యః పుమాన్ ॥** 25

**స ఏవ బ్రహ్మనిర్వాణం లభతే నాత్ర సంశయః ।**
**స ఏవ కథ్యతే యోగీ నిర్వాణీతి బుధోత్తమైః ॥** 26

జ్ఞానదృష్టితో సర్వదా నిరాలమ్బమగు పరబ్రహ్మ నాశ్రయించిన తరువాతనే సాలమ్బ మనబడు సగుణతత్త్వము నేపురుషుడు వదలుచున్నాడో ఆబ్రహ్మజ్ఞానియే బ్రహ్మనిర్వాణపదము నధిష్ఠించుచున్నాడు ఇందు నందియము లేదు ఈ యోగీశ్వరుడే నిర్వాణయోగి యనియు విజ్ఞులు వచించుచున్నారు

**అధ్యాత్మ రతిరాసీనో నిరపేక్షో నిరామిషః ।**
**ఆత్మనై వ సహాయేన యస్తిష్ఠేద్బ్రహ్మమాత్రతః ॥** 27

**స్వాత్మనైవ చ సన్తుష్టస్స్వాత్మన్యేవ చ ఖేలతి ।**
**సర్వం బ్రహ్మమయం యస్య స నిర్వాణీతి కథ్యతే ॥** 28

ఎవడు సర్వదా ఆత్మయందాసక్తి గలవాడై, దేనిని గోరనివాడై అయాచితప్రాప్తములగు కానుకలయందును నిచ్ఛలేనివాడై ఆత్మసహాయము గైకొని బ్రహ్మమాత్రుడై యున్నాడో, ఆత్మలాభముచేతనే సన్తుష్టిని జెందుచు ఆత్మయందే రమించుచు సర్వం బ్రహ్మమయమను స్థితిలో నుంటున్నాడో అట్టి నిర్వికల్ప నిరంజన నిర్వికార పరబ్రహ్మ స్వరూపుడే నిర్వాణయోగి యని చెప్పబడుచున్నాడు

**యేన కేన చిదాచ్ఛన్నో యేనకేన చిదాశ్రితః।**
**యత్ర క్వచన శాయీ స్యాన్నిర్వాణీతి స కథ్యతే ॥** 29

తన శరీరము నేదో యొకదానితో కప్పుకొన్న వాడును, దేనినో యొకదానిని ఆశ్రయించినవాడును, ఎచ్చోటనో పరుండువాడును నగు వీతరాగుడే నిర్వాణయోగి యని వచింపబడుచున్నాడు

**కంథాకౌపీనవాసాస్తు తేనాపి పరివర్జితః।**

**సర్వవ్యాపారనిర్ముక్తస్సర్వదా ధ్యానతత్పరః ॥** 30

**ప్రపంచోపశమశ్శాన్తస్తేజస్వీ జ్ఞానమూర్తిమాన్ ।**
**ఏకాకీ రమతే నిత్యం స నిర్వాణీతి గీయతే॥** 31

కంధా (బొంత) కౌపీనముల ధరించినవాడును, లేక దిగమ్బరుడును, సకలేన్ద్రియ వృత్తులచే విడువబడిన వాడును, సర్వదా స్వాత్మధ్యాన తత్పరుడును, సకల దృశ్యము నశించినవాడును, శాన్తుడును, తేజస్వియు, జ్ఞానస్వరూపుడనునై అసహాయుడై పరబ్రహ్మమందు రమించు బ్రహ్మవేత్తయే నిర్వాణయోగి యని వచింపబడుచున్నాడు

**దేవాస్తువన్తి సర్వేఽపి తఞ్చ నిర్వాణయోగినమ్ ।**
**వీక్ష్య భూతగణాశ్చాన్యే లభన్తే శాన్తిముత్తమామ్ ॥** 32

సకలదేవతలు నట్టి నిర్వాణయోగిని స్తోత్రము చేయుచున్నారు సకల భూతములు నామహాత్ముని జూచి పరమశాన్తిని పొందుచున్నవి

**తస్య పాదారవిన్దస్య స్పర్శనాత్పావనం ధ్రువమ్ ।**
**జగత్సర్వం హి జాయేత తథా తీర్థమయం జగత్ ॥** 33

ఆ నిర్వాణయోగియొుక్క పాదస్పర్శచేతనే సకల జగత్తున్ను పరమపావనమగుచున్నది అట్లే లోకమంతయు తీర్థమయమగుచున్నది

**అభిమానం నిరాకృత్య దూరాదాత్మానమాత్మని ।**
**పశ్యన్తశ్చ రమన్తే యే పరబ్రహ్మణి సర్వదా ॥** 34

**నిర్వాణమౌనినస్తే తు భాగ్యవన్తస్త ఏవహి ।**
**ఆనందపూర్ణాస్సతతం జీవన్ముక్తాః ప్రకీర్తితాః ॥** 35

దేహాభిమానమును దూరముగా నిరాకరించి ఆత్మలో నాత్మను గాంచుచు పరబ్రహ్మమం దెవరు రమించుచున్నారో అట్టి మహాత్ములే నిర్వాణమౌనులు; మహాభాగ్యవంతులు, సర్వదా ఆనందపరిపూర్ణులు, జీవన్ముక్తు లనియు పేర్కొనబడుచున్నారు

